

## "భక్తినివేదన" పత్రికయొక్క శ్రీవిరోధి నామ సంవత్సర జమ ఖర్చుల వివరములు

### — 1949 మార్చి లగాయతు 1950 మార్చి వరకు —

| | |
|---|---|
| దాతలవలన పత్రికా ప్రారంభనిధికి గాను ఈయబడిన విరాళముల జమ ... | 2414-0-0 |
| పత్రిక చందాదారులవల్ల చందాసొమ్ము జమ | 3325-0-0 |
| పత్రికకు వచ్చిన కట్నములు | 14-0-0 |
| శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘం మదరాసు శాఖ వారి వద్ద బదులు పుచ్చుకొన్నది | 75-0-0 |
| శ్రీ ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులుగారివద్ద బదులు పుచ్చుకున్నది | 300-2-9 |
| | 6128-2-9 |

### ఖర్చులు

| | | | | |
|---|---|---|---|---|
| కాగితమునకై | | ... | | 1968- 5-0 |
| అచ్చునకు | ... | ... | ... | 1996- 1-6 |
| బైండింగునకు | ... | ... | ... | 318- 0-0 |
| బ్లాకులకు | ... | ... | ... | 370- 9-0 |
| జీతములకు | ... | ... | ... | 595-11-9 |
| ప్రయాణములకు | | ... | ... | 367- 9-3 |
| పోస్టేజికి | ... | ... | ... | 415- 7-9 |
| స్టేషనరీకి | ... | ... | ... | 12- 0-0 |
| అనామతు ఖర్చులకు | | ... | ... | 84- 6-6 |
| | | | | 6128- 2-9 |

(అనగా. ఈసంవత్సరమున ప్రారంభనిధికై దాతలవలన ఈయబడిన విరాళములు రు.2414-0-0 గాక అదనముగా రూ.375-2-9 బదులుచేయవలసివచ్చినది.

ఈపరిస్థితులవలన మేము సంకల్పించుకున్నంత ఉత్సాహముతో పత్రికను నడపలేకపోతిమి. ఈ ఆర్థికపరిస్థితులు సరిగా సర్దుబాటైనగాని ఇకముందుకూడా పత్రికను ఉత్సాహముతో నడుపుట కష్టము అను సంగతిని వేరే తెలుపవలసిన పనిలేదు కదా. గాన ఉదారులయిన మతాభిమానులందరు స్వపరహస్తములద్వారా ఈపత్రికకై విరివిగా విరాళములను చందాలను దయచేసి పత్రికను పోషించ గోరుచున్నాము.

సంపాదకులు

శ్రీరామ



శ్రీమతే రామానుజాయనమః

# ప్రచార విభాగము

తే॥ 26—3—50 ది హైదరాబాదు నందలి నాంపల్లిలోని శ్రీరామ ప్రతాపభవనమున సీతారాంబాగు సంస్కృత కళాశాలాధ్యక్షులగు శ్రీ. ఉ. వే. శ్రీమా॥. కో. కం. అప్పన్. శఠకోపరామానుజాచార్యస్వామివారి అధ్యక్షతక్రింద జరిగిన శ్రీవిశిష్టాద్వైత ప్రచారకసంఘ ఏకాదశవార్షిక విరాట్ సమావేశ తీర్మానములు.

1. విరోధినామ సంవత్సర సంపూర్ణ కార్యక్రమమును గూర్చిన కార్య దర్శి నివేదికను ఆమోదించుట.

# కార్యక్రమవివరము

అ. చైత్రమాసములో మద్రాసులో శ్రీరామ క్రతువు జరుపబడెను. ఆశ్వ యుజ మాసములో విజయవాడలో శ్రీరామానుజ క్రతువుజరుపబడెను.

ఆ. ఇవిగాక నర్సాపురం, చీరాల, ఒంగోలు, అంగలకుదురు, బందరు, శ్రీ రామ తీర్థం, రాజమండ్రి, పాలకొల్లు, ఏలూరు, కోరుకొండ గ్రామము లలో మాస సభలు జరుపబడెను.

ఇ. విజయవాడ రామానుజ క్రతుసందర్భముననే ఉభయ వేదాన్త ప్రవర్త కుల బ్రహ్మరథోత్సవము, కవితాసమ్మేళనము, షోడశకర్మాధికార సమా వేశములున్ను జరుపబడెను.

ఈ. సంఘాదేశానుసారముగ ద్రావిడ వేదమున పరీక్షలు జరుపబడి శ్రీపెరుందేవినాచ్చారకు బహుమతులొసంగబడెను.

ఉ. ఉభయ వేదాంత పాఠశాల యిద్దరు విద్యార్థులతో అర్థమూరుతో నిర్వహించబడుచున్నది.

ఊ. సంఘాదేశానుసారము శక్యమైనంతవరకు చందాలను విరాళములను వసూలుచేసి పత్రిక నడుపబడుచున్నది.

ఋ. పత్రికా ప్రచురణాది సౌకర్యములకు ఒక ముద్రణాలయమును నెలకొల్పుటకు పూర్తి ప్రయత్నము చేయబడినది.

ౠ. చిన్న చిన్న గ్రంథములు వ్రాయింపబడి ప్రచురింపబడినవి.

ఌ. రామానుజ చరిత్రకు సంబంధించినట్టియు వారి గ్రంథ విషయములను సంబద్ధించినట్టియు వ్యాసములు పండితులచే వ్రాయింపబడి సంగ్రహించబడినవి.

ౡ. బందరు, విజయవాడ, విశాఖపట్టణం శ్రీరామ క్షేత్రములలో రామానుజ సేవా మహాసంఘములు స్థాపింపబడి సభలు గావింపబడినవి.

ఎ. ఒంగోలులో యీసంవత్సరమంతయు ఉపన్యాసకేసరి సంస్కృత [illegible] శ్రీ. ఉ. వే. శ్రీమాన్ కో. కం. రంగాచార్యులవారిచే కాలక్షేపగోష్ఠి ఏర్పాటుగావింపబడి నిర్విఘ్నముగా సాగించబడుచున్నది.

ఏ. విజయవాడలో శ్రీపాలేపల్లివారి రామానుజ కూటమున బాలికా పాఠశాల నెలకొల్పబడినది.

ఐ. సంఘపండితులచే పెక్కుమందికి పంచసంస్కారములు ప్రసాదింపబడినవి.

ఒ. తిరుమలలో సంఘముతరపున సత్ప్రచారమునకై సంఘపండితులచే ఉపన్యాసములు గావింపబడెను.

2. సంఘముయొక్క ప్రచారకార్యక్రమమున్ను అంతర్గత విధాన కార్యక్రమమున్ను విరివిగాను చక్కగాను జరిగించుచుండుటకు గాను ప్రారంభాది ఏర్పాట్లకుగాను కనీసము 5000/ రూపాయిలు నిధిని ఏర్పాటుచేయుటకు నిర్ణయించుకొని అందులకుగాను యీసంఘసభ్యులను విశేషించి పండితపరిషత్సభ్యులను విరివిగా విరాళములను స్వహస్తాల ద్వారా సమకూర్పవలసినదని సంఘము కోరుచున్నది.

పైనవివరించిన ప్రచారకర్తృ విధానకార్యక్రమములను నడిపించుటకు తాత్కాలికపు ఖర్చులనిమిత్తమై ఈనిధినుండి యథాయోగ్యముగా వినియోగపరచి 200/ రెండునూర్ల రూపాయిలు ఖర్చుచేయుటకును ఈ

సంఘ సంచాలకసమితి ప్రథమద్వితీయ సభ్యులగు తె. కం. గోపాలాచార్యులు ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులు గార్లకు సంపూర్ణ అధికారమీయడమైనది. అంతకుమించి ఖర్చుచేయవలశివచ్చినచో కార్యకారిణీ సభ్యుల అమోదమును పొందవలెను.

3. ఈసంఘప్రచార కార్యక్రమము నామోదించుచు తమయొక్క సంపూర్ణ ఆమోదఆశీర్వాదములను అనుగ్రహించిన—

1 శ్రీశ్రీశ్రీ వానమామలై జీయర్ స్వామివారు
2 శ్రీశ్రీశ్రీ మైసూరు పరకాల మఠంజీయర్ స్వామివారు
3 శ్రీశ్రీశ్రీ తిరునారాయణపురం జీయర్ స్వామివారు
4 శ్రీశ్రీశ్రీ కంచి అళకియమణవాళ జీయర్ స్వామివారు
5 శ్రీశ్రీశ్రీ తిరుపతి పెదజీయర్ స్వామివారు
6 శ్రీశ్రీశ్రీ తిరుపతి చిన్నజీయర్ స్వామివారు
7 శ్రీశ్రీశ్రీ అహోబిల మఠంజీయర్ స్వామివారు
8 శ్రీశ్రీశ్రీ తిరుక్కురుంగుడి జీయర్ స్వామివారు

వీరి ఆశీర్వాద పత్రికలు అచిరకాలమున యీపత్రికయందు ప్రచురింపబడును.

వీరికి యీసంఘము తనయొక్క సంపూర్ణహార్దిక కృతజ్ఞతాపూర్వకనతి సందోహము లర్పించుచున్నది. మరియు ఈమఠాధిపతులందరును దేశసంచారము చేయుచు వీలైనన్ని ప్రాంతములలో ఉభయవేదాంత పాఠశాలలను నెలకొల్పుచు తమ స్వాధీనములోనున్న అన్ని ప్రదేశములయందు మఠములు సంస్థలద్వారా విరివిగా ఈమతప్రచారమును జరిపించు చుండుటకును ప్రార్థించడమైనది.

మరియు యిదేలక్ష్యముతో పనిచేయుచున్న ఈసంఘమునకు తమ ఆర్థిక ధార్మిక సహాయమును సంపూర్ణముగా చేయవలశినదని ఈసంఘముకోరుచున్నది.

4. భారతదేశ సంస్కృతి అభ్యున్నతికి అత్యంతప్రధానమైన సంస్కృతభాషకు రాజకీయముగకూడా యోగ్యమైన గౌరవస్థానమును యిచ్చుచు ఇదిఅభివృద్ధి పొందుటకు కావలశిన నూతన పాఠశాలస్థాపన స్థాపింపబడిన వాటిని పోషణ పుస్తకప్రచురణ, గ్రంథాలయములు, పత్రికపరిచురణము మొదలగు సహాయముచేయుటకు సర్కారు వారిని కోరడమైనది.

5. పూర్వ గోదావరిజిల్లా రాజమండ్రి తాలూకా కోరుకొండ శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసభవారు యీ వైశాఖమాసము నుండి తమగ్రామములో వేదాంతపాఠశాలను ప్రారంభించి సహాయమును చేయుమని కోరినకోరికను అంగీకరించడమైనది. ఈపాఠశాల నిర్వహణకుగాను సంఘనిధినుండి తగిన ఆర్థికసహాయమును చేయుటకు కార్యదర్శుల కధికారము నిచ్చుచు తీర్మానించడమైనది. ఈపాఠశాల పాఠప్రవచనాది కార్యకలాపములనునిర్వహించుటకు తె. కం. గోపాలాచార్యులుగారిని నియమించడమైనది.

6. ఇంతవరకు ఈ సంఘకార్యక్రమమును చక్కగ నడిపించిన కార్యకారిణి సమితి సభ్యులకు కృతజ్ఞతను తెలియజేయుచు ఈ వికృతినామ సంవత్సరమునకు ఈ క్రిందివారిని నూతన కార్య నిర్వాహకవర్గముగా ఎన్నుకొనడమైనది.

అధ్యక్షులు:- శ్రీ ఉ. వే. శ్రీమాన్. శ్రీ పరాశర సుదర్శనభట్టరు అయ్యవార్లంగారు.

ఉపాధ్యక్షులు:- శ్రీ. ఉ. వే. శ్రీమాన్ అద్దంకి తిరుమల సమయోద్దండ కోలాహల లక్ష్మీనృసింహకుమార తిరువేంగడతాత దేశికాచార్యులు అయ్యవార్లంగారు.

కార్యదర్శి :- తె. కం. గోపాలాచార్యులుగారు

కార్యదర్శి, కోశాధికారి } ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులుగారు

సభ్యులు:- శ్రీమాన్ కో. యి. వెంకటాచార్యులుగారు
,, శాంతలూరి వెంకటాచార్యులుగారు
,, గుదిమెళ్ళ రామానుజాచార్యులుగారు
,, మొలుగు రామానుజాచార్యులుగారు
,, నండూరి అప్పలాచార్యులుగారు

శ్రీమాన్ కో. కం. రంగాచార్యులుగారు
,, శ్రీ తి. పు. ధర్మాచార్యులుగారు
,, కందాళ పెద్ద అప్పలాచార్యులుగారు
,, దాస శేషుగారు
,, వేదాల వెంకటాచార్యులుగారు
,, శ్రీ సీతారామ యతీన్ద్రులుగారు
,, నడాధూరు గోపాలకృష్ణమాచార్యులుగారు
,, గొబ్బూరి నరశింహ్మాచార్యులుగారు
,, ముదుంబై వరాహనరశింహ్మాచార్యులుగారు
,, తె. కం. కుమారరామానుజాచార్యులుగారు
,, లంక వెంకటనరసయ్యసూరిగారు

ఇందులో అయిదుగురికి తక్కువగాకుండా ప్రతి కార్యకారిణీ సమితి సమావేశమునకు హాజరుకావలెను.

7. తెంగల, వడకల, ద్రావిడ, ఆంధ్ర, దాక్షిణాత్య ఉత్తరదేశీయేత్యాదివైషమ్యములు వీడి సంకుచిత విచారములు లేక సద్భావనా పూర్వకముగా భగవత్ప్రసాద తీర్థపరిగ్రహాది విషయములలోను, సర్వవిషయములలోను సమత్వముండవలెను. శ్రీవిశిష్టాద్వైత సిద్ధాంతప్రచారమును సర్వతోముఖముగా వ్యాపింప జేయుటకు అందరును ఏకీభవించి పనిచేయవలెను.

8. విరోధినామ సంవత్సరం తాలూకు జమాఖర్చులను సరిచూచి ప్రచురించుటకు శ్రీ పరాశరసుదర్శనభట్టర్ అయ్యవార్లంగారిని కోరడమైనది.

9. ఏడవ తీర్మానమును ఈ క్రింది సవరణలతో అంగీకరించడమైనది.

విశిష్టాద్వైత సిద్ధాంతమునకు సంబద్ధించిన అన్ని విషయములలోను వడగల, తెంగల, ఉత్తరాది, దక్షిణాది భేధములను పాటించక ఐకమత్యముతో కలసి ప్రచారము చేయవలసినదిగా అందరిని ఈ సంఘము ప్రార్థించడమైనది.

ప్రస్తావకులు,
స్వామి వాసుదేవాచార్య,
సీతారాంబాగ్.
హైదరాబాద్ (నైజాం.)

ఈ వికృతినామ సంవత్సర కార్యకారిణీ సమితివారి రెండవ తీర్మానాను
సారముగా ఆర్గనైజింగు నిధికి అభిమాను లొసంగిన

—/ విరాళములు /—

| | | |
|---|---|---|
| 1. | తె. కం. గోపాలాచార్యులుగారు | 30-0-0 |
| 2. | ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులుగారు | 30-0-0 |
| 3. | శ్రీ పరాశర సుదర్శనభట్టర్ అయ్యవార్లంగారు | 30-0 0 |
| 4. | శాంతలూరి వెంకటాచార్యులుగారు | 30-0-0 |
| 5. | కొ. యి. వెంకటాచార్యులుగారు | 30-0-0 |
| 6. | న. గోపాల కృష్ణమాచార్యులుగారు | 30-0-0 |
| 7. | గుదిమెళ్ల నరశింహ్మాచార్యులుగారు | 30 0-0 |
| 8. | శ్రీ. తి. పు. వెంకటాచార్యులుగారు | 30.0 0 |
| 9. | శ్రీ. తి. పు. ధర్మాచార్యులుగారు | 30-0 0 |
| 10. | ఆసూరి శెల్వప్పిళ్లైఅయ్యంగారు | 30-0-0 |
| 11. | అ. తి. పు వెంకటనృశింహ్మాచార్యులుగారు | 30 0 0 |
| 12. | కో. కం. రంగాచార్యులుగారు | 20-0 0 |
| 13. | వేదాల రంగాచార్యులుగారు | 20 0 0 |
| 14. | ఏడదపురి హొళ్ళ వెంకటకోనప్పాచార్యులుగారు | 15-0-0 |
| 15. | కొ. యి. శ్రీనివాస రామానుజాచార్యులుగారు | 10 0-0 |
| 16. | అకలంకం నరశింహ్మాచార్యులుగారు | 10 0-0 |
| 17. | శ్రీ చక్రవర్తుల నరశింహ్మాచార్యులుగారు | 10-0-0 |
| 18. | గొ. రంగాచార్యులుగారు | 10-0-0 |
| 19. | బూరుగగడ్డ కందాడైఅళహాశింగరాచార్యులుగారు | 5 -0-0 |
| 20. | ఉత్పల రఘునాథాచార్యులుగారు. | 5 -0-0 |



శ్రీ హయగ్రీవాయనమః

# గీతా విశేషార్థములు

తె. కం. గోపాలాచార్యులుగారు.

ఐదారుగురు పండితులు కూర్చుండి యిష్టాగోష్ఠి జరుపుచుందురు. శిష్యుడు గీతాగ్రంథమును చేబూని తనవైపు గురువుగారు చూడవలెనని పెడముఖముగా 'ధర్మక్షేత్రే...'యని కూని రాగమును తీయుచుండును.

గురువు :- ఏమిరా! ఇక్కడ తారులాడుచున్నావు, వాళ్ళంతా చదువుకొంటూంటే వెళ్ళి చదువుకో.

శిష్యుడు:- ఒక్క సందేహం వచ్చిందండి వాళ్లెవళ్ళకి తెలిసిందికాదది.

గురువు :- కావ్యాలన్నీ వెలగబెట్టారు, ఇప్పుడు కౌముదికూడా మిడుకుతున్నారు. సాహిత్యార్థం గల మొదటి అధ్యాయంలోనే సంశయాలా? పది శ్లోకాలయ్యాయో లేదో?

శిష్యుడు:- ఆ పదో శ్లోకంలోనేనండి.

గురువు :- ఆ 'పర్యాప్త' శ్లోకమా ఏమిటి. ఊ. చదువు. గొప్పశ్లోకం దొరికింది!

శిష్యుడు:- అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితం।
పర్యాప్తం త్విదమేతేషాం బలం భీమాభిరక్షితం॥

గురువు:- సరే! బాగా విను.

భీష్మాభిరక్షితం = భీష్మునిచే సంరక్షింపబడిన, అస్మాకం బలం=మన సేన, అపర్యాప్తం = అపరిమితము.

శిష్యుడు:- 'తత్' అండి

గురువు:- దానికి విశేషణం చేయరా ఏముంది.

శిష్యుడు:- గురువుగారూ! ఉండండి. దుర్యోధనుడు తన సేనలో నుండియే మాట్లాడుచున్నాడు గదా! ఎదురుగా దగ్గరనేయున్న తన సేనను 'తత్ బలం' అనవచ్చునా అండీ.

గురువు :- (ఆలోచించి) ఊ హూఁ - ఏదీ పుస్తకం. (కొంతసేపు చూచి) ఓరే! 'పర్యాప్తం' అనే శబ్దము కర్తరిక్త ప్రత్యయాన్వితము. తెలిసిందా. అంటే సమాపకం అనగా నాశన సమర్థమైనది అన్నమాట. 'అపర్యాప్తం' అంటే, నాశనము చేయజాలనిది. అని అర్థం చెప్పుకో. ఈమాటు చూడు 'భీష్మాభిరక్షితం అస్మాకం బలం' అనగా భీష్మునిచే రక్షింపబడిన మన సైన్యమును, తత్ = ఆ పాండవసైన్యము, అపర్యాప్తం = నాశనము చేయజాలనిది, భీమాభిరక్షితం ఏతేషాం బలం = భీమునిచే రక్షింపబడిన పాండవ

సైన్యమును, ఇదం = యీ మన సైన్యము, పర్యాప్తం = నాశనము చేయచాలినది అని చెపితే చక్కగా సరిపోతుంది. పో.

శిష్యుడు:- గురువుగారూ ! పాండవసైన్యాన్ని ఒకసారి పరోక్షంలోనున్నట్లు 'తత్' అని, ఒకసారి అపరోక్షంలో నున్నట్లు 'ఏతేషాం బలం' అని చెప్పవచ్చునా అండి. అదీకాక- పాండవ సైన్యాన్ని తత్ అనడానికి అది దుర్యోధనుడికి పరోక్షం కాదే. ఏమంటే- 'దృష్ట్వాతు పాండవానీకం,' 'పశ్యైతాం పాండు పుత్రాణాం,' 'ఏతేషాం బలం' అని యీ విధంగా ప్రత్యక్షంగా నున్నట్లు చెప్పాడుగదా ! పోనీయండి అది ఎల్లాఉన్నా స్వర సంగావచ్చే అర్థాన్ని విడిచిపెట్టి యిలా అర్థం చెప్పవచ్చునా అండీ.

గురువు :- ఏమిటిరా ! చెప్పినట్లు చదవక వేపుకుతింటున్నావు. పో. చెప్పినట్లు వ్రాయి.

ఒక పెద్దలు :—

ఆదేమిటండి. శాస్త్రులుగారూ - అక్షరాలన్నీ అల్లా గదిమేస్తారేం పాపం ! ఆ భీముణ్ణి యిక్కడికి యీ భీష్మణ్ణి అక్కడికీ తోసేసి పాఠభేదం కల్పించండి. అన్నీ కుదురుతాయి. భీమాభి రక్షితం తద్బలం అస్మాకం బలంప్రతి అపర్యాప్తం. అంటే భీమునిచే రక్షింపబడే ఆ పాండవబలము మన బలమునుగూర్చి చాలదు. భీష్మాభిరక్షితం ఇదం బలం ఏతపాం బలంప్రతి పర్యాప్తం. అని రైటుగా అతికినట్లు సరిపోతూంది.

మరియొక పెద్దలు :—

అబ్బే ! అందరూ లోకంలో చదివే పాఠాన్ని మార్చడం అంత సరసంగాలేదు. ఇంకా- ఆ పాఠాన్ని అల్లాగే ఉంచి పాఠక్రమంకన్న అర్థక్రమం ప్రబలంగనుక ఇక్కడి భీష్మ పదాన్ని అక్కడికి అక్కడి భీమపదాన్ని యిక్కడికీ అన్వయించడంగాని, ఇక్కడి 'అపర్యాప్తం తత్' అక్కడికి, అక్కడి 'పర్యాప్తం త్విదం' ఇక్కడికీ అన్వయించడం గాని చేయండి బాగుంటుంది. చక్కని అర్థం కుదరాలంటే దూరాన్వయం అంగీకరించాలి మరి.

ఇంకొక పండితులు :—

సరే । బాగుంది ! 'నీ ఎడంచెయ్యి తీయవయ్యా నా పుర్రచెయ్యి పెడతాను' అన్నట్లుంది నీ యోజన. ఇంకా కావాలంటే ఒక్కొక్క పాదాన్ని రెండు వాక్యాలక్రింద విడగొట్టండి. ఎల్లాగంటారా - 'అపర్యాప్తం తత్' (అనగా ఆ పాండవుల సైన్యము అసమర్థమైనది) ఎందుకనగా - అస్మాకం బలం భీష్మాభిరక్షితం = మన బలమును ప్రబలమైన భీష్మాచార్యులు కాపాడుచున్నాడుగనుక.

పర్యాప్తం త్విదం = మన బలము సమర్థమైనది. ఎందుకనగా — ఏతేషాం బలం భీమాభిరక్షితం = ఈ పాండవుల బలము ఆయనకంటె దుర్బలుడగుట భీమునిచే కాపాడబడుచున్నది గనుక అంటే టక్కున సరిపోతుంది.

వేరొక పండితులు :—

ఇదేం అన్వయమండీ ఏ ప్రతిజ్ఞకి ఆ హేతువు క్రమంగా కుదరాలా? అక్కరలేదా ! అపర్యాప్తం తత్ - కుతః - భీమాభిరక్షితత్వాత్ -

పర్యాప్తం త్విదం - కుతః -భీష్మాభిరక్షితత్వాత్ - అని పాండవబలము భీమునిచే కాపాడబడుచున్నది గనుక అసమర్థమైనదనీ, మన బలము భీష్మునిచే కాపాడబడు చున్నదిగనుక సమర్థమైనదని చెపితే స్వరసంగా ఉంటుంది గాని (ఒక్కడి హేతు వక్కడా అక్కడి హేతు విక్కడానా ? ఏ బలాన్ని ఎవడు రక్షిస్తూఉంటే వాడు ప్రబలుడో దుర్బలుడో దాని సామర్థ్య అసామర్థ్యానికి కారణమౌతాడుగాని వేరొక డెల్లా అవుతాడు. పోనీ యీ హేతువు నక్కడా ఆ హేతువు నిక్కడా అన్వయిస్తామంటే వెనుక మీరాక్షేపించిన దూరాన్వయ దోషం రానే వచ్చింది. అందుకు నామాటవిని మన రామానుజాచార్యుల్నికూడా అడగండి. ఆయనేంచెపతాడో ఏమయ్యా! కుదరక కొట్టుకు చస్తూవుంటే బెల్లంకొట్టినరాయిలాగ మాట్లాడవేం

రామానుజాచార్యులు:—

(చిరునవ్వుతో) (కానీయండి మీరు మహాపండితులు మీముందు నేనా చెప్పడం ఆంజనేయులు ముందా కుప్పిగంతులు అయినా పెద్దలడిగారు తోచింది చెప్పడం ధర్మం అయితే వినండి) అయ్యో! రామా! రాజబాట విడచి దొంగల గుడిసెలో దూరతా రేం పాపమయ్యా!

దుర్యోధనుడు స్వయముగా భీమునిచే రక్షింపబడే పాండవసైన్యాన్ని భీష్మునిచే రక్షింపబడే తన సైన్యాని చూచి తమర్ని గెలువడాన్కి పాండవబలం సరిపోతుందని వాళ్లని గెలవడానిక్ తన బలం సరిపోదని తనగురువుగారికి మనవి చేసుకొని దుఃఖిస్తు న్నాడు. అందుకు అర్థం యిల్లా చెప్పాలి. తత్ = ఆకారణంవల్ల భీష్మాభిరక్షితం అస్మాకం బలం అపర్యాప్తం : చాలకున్నది. భీమాభిరక్షితం ఇదం ఏతేషాంబలం పర్యాప్తం =చాలియున్నది. అనిచెపితే సరిపోతుంది.

అందరూ కలిసి:—

భేష్! ఆచార్యులు గారూ! అబద్ధాలికి అయ్యవార్లంగారే సరి. మొత్తంమీద అయ్యవార్లతనం కాపాడుతున్నావయ్యా! లెక్కపెట్టుకో ఎన్ని అబద్ధాలు సవరించాలో

1. తత్—బలం అని యీ రెండుపదాలకు విశేషణవిశేష్య భావం స్వరసంగా కనిపిస్తూ ఉంటే దాన్ని చెడగొట్టడం.

2 ఆ కారణం వల్ల అనడానికి ఇంతకు పూర్వం తనబలసామర్థ్యానికి పరబల అసామర్థ్యానికి కారణాలేమైనా చెపితేగదా.

3. భీష్మద్రోణాదులు అండగా వుండగా తనబలం దుర్బలంఅని ఎల్లా అనుకుంటాడు.

4. ఎప్పుడు పట్టినా తనబల సామర్థ్యాన్నే దుర్యోధనుడు చెప్పడం రివాజు. అతడు పిరికి పందకాడు ఏడవడానికి. ధృతరాష్ట్రునితో 'నభేతవ్యం మహారాజ నశోచ్యా భవతా వయం సమర్థా స్మ పరాన్ జేతుం బలిన స్సమరే విభో'॥ అని చెప్పలేదూ?

5. రెండవరోజు యుద్ధారంభంలో ఇల్లాగే రాజులతో చెప్పాడు.

> అపర్యాప్తం తదస్మాకం బలం పార్థాభిరక్షితం।
> పర్యాప్తం త్విదమేతేషాం బలం పార్థివసత్తమాః॥

అక్కడ అర్థం ఎల్లా చెప్పారు. 'పార్థాభిరక్షితం తద్బలం అస్మాకం అపర్యాప్తం' అనే చెప్పాలిగాని 'అస్మాకం బలం' అనిచెపితే కుదురుతుందామరి. అల్లాగేయిక్కడకూడాను తెలిసిందా అయ్యవార్లంగారూ!

రామానుజాచార్యులు:-

తెలియకేం మీ తెలివితక్కువ స్పష్టంగా తెలిసింది. ఈఆక్షేపణ లేమైనా సారంగా ఉన్నాయా? మీపాండిత్యం ఎంత సారమైందో ఇవీ అల్లాగేవున్నాయి. ముందు నేనొక ప్రశ్నఅడుగుతాను దానికి సమాధానం మీరందరు ఆలోచించి చెప్పండి:-

తనసేన 'భీష్మాభిరక్షితం అని దానికి ప్రతికోటిగా పాండవసేన భీమాభిరక్షితం అన్నాడు గదా భీష్మునికి జోడీగా భీముణ్ణి ఎందుకు వేశాడో కాస్త చెప్పండి శాస్త్రులవారూ!

భీష్ముల్లాగ భీముడు సేనాపతా? కాదు-ధృష్టద్యుమ్నుడే సేనాపతి. భీష్మునితో సమాన పౌరుషం కలవాడనా? కాదు-ఆమాట భీష్ముడే చెప్పాడు.

'శక్తోహం ధనుషైకేన నిహన్తుం సర్వపాండవాన్' అని.

శత్రుబలానికి అధిపతి అనా — కాదు — ఆఅధిపతి ధర్మరాజే. భీష్ముళ్లాగ ఆబలంలో ప్రధానుడనా—కాను. అల్లాంటివాడు అర్జునుడే మరెందుకు చెప్పినట్లో సెలవియ్యాండి ?

అందరును:-అదీ మీరే సెలవీయండి.

రామా:- అది ఎందుకంటే—తమలో ఒకణ్ణైనా మిగల్చకుండా సంపనాశనం చేస్తానని ప్రతిజ్ఞ చేసినవాడు భీముడు. అందుకు తగ్గ సాహసం సహాయం బలం అన్నీ ఉన్నాయికూడాను. పాండవుల్ని తల పువ్వు వాడకుండా కాపాడాలనే అభిమానం కలవాడు భీష్ముడు. అందుకు ఆయనకు పోటీగా యీాయన్ని తగిలించాడు. కాబట్టి శత్రుభయం పూర్తిగా కనిపిస్తుంది. దుర్యోధనుడికి స్వబల పరబల సామర్థ్యాసామర్థ్యాలకి కారణం వెనుక చెప్ప లేదన్నారే. కళ్ళు తెరచి గ్రంథం చూడండి. తనబలంకంటె పాండవబలం నాలుగు అక్షౌహిణీలు తక్కువగదా వాళ్లసేనను చూచి 'మహతీం చమూం' అని ఎందుకు గుండె బాదుకున్నాడు? ఇది పరబలాన్ని వర్ణించడం కాదూ 'తవశిష్యేణ ధీమతా' అని ప్రతినాయకుడైన ధృష్టద్యుమ్నుణ్ణి వర్ణించడంకాదూ. 'అత్రశూరా మహేష్వాసాః భీమార్జున సమాయుధి,' 'సర్వఏవమహారథాః' అని వాళ్లంతా భీమార్జునులలాగే ఉన్నారనడం, అందరూ మహారథులే అనడం సుమారు యిరవైమందిని పేర్లు పెట్టి వర్ణించడం ఇదంతా పరబల సామర్థ్యానికి కారణంకాదూ! తనసేననేనావర్ణించాడా సేనాపతి నేనావర్ణించాడా. ఏమీలేదు. పైగా తనసేనలో ప్రధానులుఏడుగురిపేర్లు మాత్రమే చెప్పాడు. వాళ్లనైనా సవ్యంగాచెప్పొచ్చా. అమంగళంగా 'మదర్థే త్యక్తజీవితాః'అన్నాడు. ఏమిటండీ! శుభం పలకరా మంకెన్నా అంటే పెళ్లికూతురు ముండన్నాట్ట. వీటికన్ని టికేంగాని అయ్యా! 'తస్య సంజనయన్ హర్షం' అంటాడే సంతోషం పుట్టించవలసి వచ్చిందంటే అంతవరకు ఏంచేస్తున్నాడన్నమాటండి. అందుకే శ్రీ భాష్యకారులు అంతర్విషణ్ణః అభవత్' అన్నారు. పైగా చూడండి - 'సఘోషోధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్' ఆశంఖధ్వని దుర్యోధనాధులగుండెల్నే బద్దలు కొట్టిందట. దాని శిఖాగొయ్యా! ఏం. ఏమ టారు. తత్ అంటే అందువల్ల అనడం బాగుం దంటారా ?

తత్ అని పాండవబలానికి విశేషణం చేయడానికి అదేమైనా వీడికి పరోక్షంలో ఉందా. 'దృష్ట్వాతు, పశ్యైతాం ఏతేషాం' అని ఎదురుగా చూపిస్తూఉంటేను.

భీష్మ ద్రోణాదులు కాపాడుతూంటేమాత్రం వాళ్లెల్లా చచ్చిపోతారో ఆఉపాయం తను ఎరుగును కనుక పాండవులకి తెలుస్తే బ్రతకనిస్తారా అని భయం ఉండకూడదూ. 'నభేతవ్యం మహారాజ' అని చెప్పాడుకాడా అంటే అప్పుడల్లా చెప్పొచ్చు. ఇప్పుడు

ఇప్పుడు దృఢంగా బంధించిన వ్యూహాన్ని, అనేక మహా భటుల్తో నిండిన శత్రు పక్షాన్ని చూచేటప్పటికి భయం దఃఖం పొర్లి పొంగనూవచ్చా. ఎరగడా ఏమిటి వాళ్ళ బలాన్ని తన దుర్బలాన్నీ, గోగ్రహణం చూచాడుకాడా స్వగ్రిహణం (గంధర్వులచే) చూచాడుకాడా! అవే మరుపువచ్చే ఘట్టాలా ? 'అకారా దీనినామాని అర్జున త్రస్తచేతసః' అన్నది యీ మొగాడేగా! మొదటిరోజున చెప్పినట్లే రెండవ రోజున చెప్పాలని రాజశాసనం ఏమిటి ? రెండవరోజున తన పక్షంలోనున్న రాజులికి తన ధైర్యం చూపించి ఓదార్చడానికి అల్లా చెప్పవచ్చు. దానికేం. ఇదంతా అలోచించే 'దృష్ట్వాతు' అన్నదగ్గిర 'తు' వేశాడు. వ్యాసుడు వెర్రివాడుకాడు. ఏం! ఏమంటారు ? సరిపోయిందా ?

అందరూకలసి :—

శభాష్ - ఈనేర్పు మీకే యిచ్చాడయ్యా భగవంతుడు. ఎన్ని చదువుకుంటే ఏం ప్రయోజనం - ఆచార్యులుగారూ పెద్దలికి పదివేల వందనాలు. మాబాగా సమర్థించావయ్యా. పోయివస్తాం.





## నారీవిభాగము

# భక్తిబంధము

చిరంజీవి :- గోదాదేవి.

ఒకమాటు కృష్ణుడు చాలా అల్లరిచేస్తే వాళ్లమ్మకి చాలా కోపం వచ్చి ఒక తాడు తెచ్చి.

1. దామ్నా - త్వైవ - ఉదరే - బద్ధ్వా - ప్రత్య - - బధ్నా - దులూఖలే -
యది - శక్నోషి - గచ్ఛత్వం ! - అతిచంచలచేష్టిత ! —

ఒక కొస కడుపుకట్టి, రెండోకొస రోటికట్టి - 'ఊఁ - అంతేకావాలి. అల్లరి పిల్లాడా ! ఇమాటు వెళ్ళు చూస్తాను' అంది.

ఏంచేశాడు ? సరే, అనుకున్నాడు. వాళ్లమ్మని అల్లా వెళ్ళనిచ్చాడు. ఊఁ, బరబరా, బరబరా............

లీలాశుకుడు ఇది విన్నాడు. ఇల్లా కట్టుకుంటారా ? - ఎక్కడైనా ? అని నవ్వేట్ట. ఆయన ఇంకో తమాషాగా కట్టాళ్లేండి ఎల్లాగంటే —

పాపం ఆయనికి కళ్ళు లేవు. గుడ్డాడు. రోజూ బువ్వెవరు పెడతారు పాపం. కృష్ణా ! కృష్ణా ! అంటూ కూర్చునేవాట్ట ఒకమూల చచ్చినట్టు - కృష్ణుడే గడ్డపెరుగూ బువ్వా కలిపి, తెచ్చి తినిపిస్తూ ఉండేవాట్ట. ఎవరబ్బాయి ! నువ్వు ? అంటే బెల్లంకొట్టినరాయి. మాట లేదు

మాతీలేదు. ఈయన కృష్ణుడే అని కనిపెట్టి బువ్వపెట్టేప్పుడు చెయ్యి గట్టిగా పట్టుకున్నాట్ట. దొంగకేవు దొంగా అని. కృష్ణుడు చెయ్యి లాక్కొని పారిపోయాట్ట - ఆయనన్నాట్ట.

2 హస్త - మాక్షిప్య - యాతోఽసి - బలాత్ - కృష్ణ - కి మద్భుతం -
హృదయాత్ - యది - నిర్యాసి - పౌరుషం - గణయామి - తే ॥

అమ్మదొంగా ! బలవంతంగా చెయ్యి లాక్కొనిపోయావా ? అదేం గొప్ప ! వెళ్ళు. వెళ్ళు. ఎల్లా వెడతావో ! మీ అమ్మలా కట్టేరు అనుకున్నావు కాంసు పాపం. నా మనస్సులోంచి వెళ్ళు ఎల్లా వెడతావో. నీ మొగాడితనం చూస్తాను. ఈయన భక్తి ఉంటారే ఆ తాటితో మనస్సులో గట్టిగా కట్టేశాడు. అందుకూ అల్లా అన్నాడు. ఎంత గింజుకున్నా - ఊహూం ! ఎక్కడికి వెడతాడు ? అదేదో కుక్కలాగ అక్కడే పడున్నాడు.

అల్లా మనం కట్టొచ్చు. అల్లా కడితే మన దగ్గరా
అల్లా పడుంటాడు. ఏంచేస్తాడు ?

# శ్రీకృష్ణుడు దేవుడేనా !

చిరంజీవి :- పరవస్తు అలివేలు మంగతాయారు,

కోరుకొండ.

కొందరు ఇతర మతస్థులు మా కృష్ణుడు దేవుడా ! అని అడుగుతూఉంటారు. దానికి కొంతమంది కళ్ళెర్రజేసి పళ్లు కటకట కొరికి లోకువైతే మీదబడి కొడతారు లేకుంటే తిడతారు. మరికొందరు సబువుగా సమాధానం చెపతారు అసలు యీ విషం, మనవాళ్ళ తలకెక్కకుండా మనం నిజం తెలుసుకోవాలి అందరికీ తెలిసేటట్లు చాటించాలి. అదేమిటో కొంచెం విచారిద్దాం.

మనం వాడుకలో దేవుడు దేవుడు అంటాం గాని వేదాంతాల్లో 'బ్రహ్మ' అంటారు. బ్రహ్మంటే నాలుగు ముఖాల దేవుడనుకుంటారేమో అని కొన్నిచోట్ల 'పరబ్రహ్మ' అంటారు. నిజంచేత 'బ్రహ్మ' అని దీర్ఘం లేకుంటే పరమాత్మ అని 'బ్రహ్మా' అని దీర్ఘం ఉంటే నాలుగు ముఖాల బ్రహ్మదేవుడని ఉందనుకోండి. కాని ఆ రహస్యం ఎవళ్ళకి తెలుస్తుంది. సరే! యీ బ్రహ్మ ఎలాంటివాడో ముందు

తెలుసుకుంటే మన కృష్ణుడికి ఆ లక్షణాలున్నాయా లేవా అని తరువాత ఆలోచించవచ్చు. మనకీ సంగతి ఎవరు చెపతారూ? అసలు దేవుడున్నాడని మనకెవరు చెపతారో వారే ఆయన ఎల్లా ఉంటాడో ఏంచేస్తాడో అవన్నీ చెపతారు. అది చెప్పేవారు ఎవరు? ఇంకెవరు మన వేదమాతే. అయితే చూద్దాం ఆయన్ని గూర్చి ఆవిడ ఏం చెప్తుందో. ఇది గొప్ప వేదాంత రహస్యం. మరి, కాస్త శ్రద్ధగా వినండి చెపతాను.

అనగనగా వరుణుడని ఒక గొప్ప ఋషి ఉండేవాడు. ఆయనికి భృగువని ఒక కొడుకు. ఆ కొడుకు మంచి బుద్ధిమంతుడున్నూ చిన్నప్పటి నుంచి పెద్ద పిన్న దేవుడు దెయ్యం అంటే అతి శ్రద్ధగా ఉండేవాడు. ఎనిమిదేళ్లు రాగానే తండ్రి వడుగుచేసి వేదం చదివించాడు. ఒకనాడు ఆ భృగువుకి బ్రహ్మంటే ఎల్లాంటివాడో తెలుసుకుందామని పుట్టింది. తండ్రి గొప్ప పండితుడు. ఇంకేం. గబగబ వెళ్లాడు. నాన్నా? నాకు బ్రహ్మ ఎల్లాంటివాడో ఆలక్షణాలు చెప్పు అని వినయంగా అడిగాడు. అడిగితేగాని చెప్పకూడదుగా. ఆయనకూడా ఇల్లాంటి ప్రశ్న నా కొడుకు ఎప్పుడైనా వేస్తాడా అని చూస్తున్నాడు. సరే ఇవాళ అడిగాడు. మహా సంతోషం కలిగింది నాయనా! అది సులభంగా తెలిసేదికాదు బాగా ఆలోచించి విమర్శించి తెలుసుకోవాలి నేను కొన్ని లక్షణాలు చెపతాను. వాటినిబట్టి అల్లాంటివాడెవడో నీవు బాగా ఆలోచించి నీకు తెలిసింది నాతో చెప్పమన్నాడు. సరే! కానీ, అన్నాడు కొడుకు. ఇదిగో ఈ కనపడేవి యావత్తు ప్రాణులు ఎవడివల్ల పుడుతున్నాయో, ఎవడివల్ల పోషించబడి రక్షింపబడుతున్నాయో, ఎవడివల్ల సంహరించబడుతున్నాయో వాడే బ్రహ్మ; వాడే దేవుడు. బాగా ఆలోచించు అన్నాడు. సరే ఆయనేదో ఆలోచించాడు తండ్రి ఏదో ఔనన్నాడు కాదన్నాడు. తండ్రీ కొడుకులు క్రిందామీదా పడ్డారు. అదంతా మనకెందుకుగాని ప్రస్తుతం యీ లక్షణం ఒక్కటి చాలు. దీన్నిబట్టి కృష్ణుడీలక్షణాలున్న దేవుడౌనా కాదా చూద్దాం.

మనల్ని అందర్నీ పుట్టించేవాడెవడు? నాలుగు ముఖాల బ్రహ్మ. ఆయనకే సందేహం కలిగిందట ఒకనాడు నాకంటె ప్రాణుల్ని పుట్టించేవాడింకెవడని. కృష్ణుడది కనిపెట్టేడు. నీకింత గర్వంగా ఉందా అని. సరే, ఇతనికి నా తడాకా చూపిద్దాం. అనుకున్నాడు. కృష్ణుడు, అతని యీడు పిల్లలు, దూడల్ని కాసేవారు. పెద్దవాళ్ళు ఆవుల్ని కాసేవారు. ఒకనాడు కృష్ణుడు వందలకొద్ది పిల్లల్ని వేలకొద్ది దూడల్ని వెంటబెట్టుకొని అడవిలోకి వెళ్ళి ఒకవేపు వాటిని మేతకి విడిచిపెట్టి ఒకవేపు ఆటకి దొరికించుకున్నాడు. ఈసందర్భంలో బ్రహ్మకి గర్వం తలకెక్కి ఉందికాదు. దానికితగ్గట్టే మనకుట్టప్ప, ఆయనికి యీ దూడల్నీ యీపిల్లల్నీ అందర్నీ ఎత్తుకుపోయి దాచేద్దాం కృష్ణుడేంచేస్తాడో చూద్దాం అని బుద్ధిపుట్టించాడు. ఇంకేముంది దేవతలకి తలచగానే తాతపెళ్లేగా. ముందు దూడల్ని మాయంచేశాడు. ఆడుతూపాడుతూ అన్నాలుతింటూ యీ పిల్లలు దూడలకేసి చూస్తే ఏవీ? లబో దిబో అని పరుగు లంకించుకున్నారు. ఆగండిఅన్నాడు కుట్టప్ప మీరిలాగే అన్నాలు తింటూఉండండి. నేనొక్క క్షణంలో మళ్ళించుకొస్తానని కొమ్మూదుకుంటూ బయలుదేరేడు. తిరిగివిసిగి వేసారాడుగాని దూడా లేదు

గుడికీ లేదు. ఇదేమిట్రా ఇది అని పిల్లలదగ్గరికి వచ్చే టప్పటికి పిల్లేరీ ? అంతా గాయబ్. ఏమిట్రా యీ మాయ అని ఒక్కసారి కళ్లుమూసుకొని చూసేసరికి మన నాలుగు ముఖాలవాడు దూడల్నీ పిల్లల్నీ పెట్టుకొని బ్రహ్మలోకంలో కులుకుతూ కనిపించాడు. ఓరి పిచ్చిముండా వాడా ! నన్ను మాయచేస్తున్నావా అని ఒక చిటికలో.

గోపాల సుతుల లేరని
గోపికలకు జెప్పనేల గోపాలకులన్ ।
గోపికల నలర బాలుర
క్రేపుల రూపములనే జరించెదననుచున్.

'బహుస్యాం ప్రజాయేయ' అని ఒక మంత్రం చదివి రా అనేసరికి -

మరలుపు మని యెడు కర్తయు,
మరలించుకుమారకులును మరలెడు క్రేపుల్ ।
పరికింప దానయై హరి -
మరలంజనె లీలతోడ మందకు సధిపా ।

ఇక్కడో చిత్రం జరిగింది. మన నాలుగు ముఖాలవాడు యివన్నీ దాని కృష్ణుడేంచేస్తున్నాడో చూద్దామని మళ్ళీ యిక్కడకు వచ్చే టప్పటికి కృష్ణుడు బ్రహ్మవేషంతో గబగబ బ్రహ్మ ఇంట్లోకి వెడుతూ ఆ గేట్లో వాళ్ళ తోటి ఓరేయ్ ! కృష్ణుడు దొంగ సుమండీ. నా లాగే వేషం వేసుకుని వచ్చి మాయచేస్తాడు. కొంచెపట్టి గెంటి లోపలికి రానివ్వకండి. జాగ్రత్త. అని చెప్పి లోపలికి వెళ్లి ఆయన సింహాసనం మీద

కరముల్ పాదములన్ శిరంబులవ లక్షంబుల్ ముఖంబుల్ భుజాం।
తరముల్ ముక్కులు గన్నులున్ శ్రవణముల్ దంతావళుల్ దండకాం।
బర స్రగ్వేణు విషాణభూషణవయో భాషాగుణాఖ్యావత।
త్వరతల్ పిడ్వకుండ దాల్చె విభుడా వత్సార్భకాకారముల్॥

అన్నట్లు అవ్వే చేతులు అవ్వే కాళ్లు. తలలు చెప్పేదేమిటి వయస్సు, స్వరం, గుణాలు, రుచులు ముచ్చటచుక్కలు ఒక్కటీ తప్పకుండా అన్నిరూపాలుతో నొక్కడే ధరించేవాడు. ఇంకా బ్రహ్మదేవుడు ఒకమాటు చేసినలాంటిది. మరొకటి చేయలేడు. ఒకడికి పొట్టిముక్కు - ఒకడికి పొడుగుముక్కు. ఒకడికి చింపికళ్ళు - ఒకడికి వారకళ్ళు - ఒకడికి గుండ్రముఖం ఒకడికి కోలముఖం ఇంతేగా యితని సృష్టి. ఇది అల్లాగా, పాటో సరే - సరే ఇంటికి బయలుదేరేడు.

వైతాయించాడు. భూలోకంలో యీ మాయంతా చూసి ముక్కుమీద వేలెట్టుకొని నేను గట్టిగా దాచానుగదా. మళ్ళీ ఇక్కడికి ఎల్లా వచ్చాయిరా బాబూ. అవి అక్కడ ఉన్నాయా లేవా చూద్దాం అని గబగబ వచ్చి తన యింట్లోకి రాబోయేసరికి ఇంకేముంది ఆగేట్లో వాళ్ళు గెట్ ! ఆగమన్నారు. నిర్ఘాంతపోయి అరే ! నేనురా అన్నాడు. సరే కట్టిపెట్టు అన్నారు వాళ్ళు. ఏవేవో ఆనవాళ్లు చెప్పబోయాడు. ఈ టక్కులు యీటమార్లు చెప్పే వెళ్లేడు. ఇప్పుడు మా ప్రభువు అన్నారు. కొంప ముంచార్రా

అంటూ ముందుకు అడుగు వేశాడు. అర్ధచంద్ర ప్రయోగాలు ప్రారంభ మయాయి ఆయ్యో! కర్మమా! ఎరక్కపోయి తెచ్చుకున్నానురా దేముడా అని గోలపెట్టాడు. మన కృష్ణయ్య నవ్వుతూ ఆరూపంతోనే వచ్చాడు. చూడండి బాబూ అన్నారు గేటుకీపర్లు తెల్లబోతున్నారు బ్రహ్మయ్య ఆగండి ఆగండి అనివాళ్లని మంద లిస్తున్నాడు కిష్టయ్య ఇంకేముంది బారుమని కాళ్లమీద పడేసరికి కృష్ణుడు నిజరూపంతో నిలచాడు ఎవడురా సృష్టికర్త అన్నాడు నువ్వే నువ్వే నువ్వే అన్నాడు ముమ్మాటికీ క్షమించాను పోయి నీపని చూచుకో అన్నాడు ఇప్పటికి ఒక్క ఏడాది అయింది ఎక్కడ వ్యవహారం అక్కడే మామూలుగా జరుగుతునే ఉంది చూశారా ఒకబ్రహ్మలక్షణం పట్టిందా మన కృష్ణుడికి పూర్తిగా.

ఇంక రక్షించేలక్షణం సరిచూద్దాం రక్షించడం అంటే ఏమిటి? కష్టాలుపోగొట్టి యిష్టాలు యివ్వడం ఇందుకు సమర్థులెవ్వరు ? దేవతలు ఈమాట భగవంతుడే అందరికి ఉప దేశించాడు గీతలో

దేవాన్ భావయతా నేన తేదేవా
భావయంతువః
పరస్పరం భావయంతః శ్రేయః
పరమవాప్స్యథ॥

అని అంటే దేవతల్ని మీరు ఆదరిస్తే వారు మిమ్మల్ని ఆదరిస్తారు ఇల్లా ఒకర్ని ఒకరు ఆదరించుకొంటే గొప్ప శ్రేయస్సు కలుగుతుంది మనం దేవతల్ని ఆదరించడం అంటే యజ్ఞయాగా దులు చేసి వారికి అహుతు లర్పించడం. ఇంక వారు మనల్ని ఎల్లాఆదరిస్తారో చూడండి ప్రాణు లన్నీ ఎల్లా బ్రతుకుతాయి అన్నంవల్ల ఆ అన్నం ఎల్లావస్తుంది వర్షంవల్ల ఆవర్షమో వరుణదేవుడివల్ల ఆవరుణ దేవుడు ఆవర్షం ఎవరిమ్మంటే ఇస్తాడు అదుగో అక్కడే వచ్చిందిచిక్కు అసలు అంద రికీ ఉద్యోగాలిచ్చి వాళ్లుచేసే పనులు పురమా యించేవాడు శ్రీమన్నారాయణుడే. ఒక్కడికి ఒక్కొక్క డిపార్టుమెంటు. అందరికి ప్రభువు ఇంద్రుడు అందుకే ఆయనికి దేవేంద్రుడు అనిపేరు ఆయనికి ఆఉద్యోగం యిచ్చింది మన నారాయ ణుడే. యౌవ్వనం ధనసంపత్తిః, ప్రభుత్వం అవి వేకితా।ఏకైకమప్యనర్థాయకిముయత్రచతుష్టయం అంటే యవ్వనం, డబ్బు, అధికారం, అవివేకం ఇందులో ఒక్కొక్కటే కొంప తీస్తుంది. అన్నీ ఉంటే చెప్పాలో.



శ్రీ హయగ్రీవాయ నమః



# చతుర్భుజుడు :

చి॥ సౌ॥ మార్గపురి వెంకటరమణ,

కోరుకొండ

మనకి చేతులు రెండే. మనుష్యుల్లో అంతకంటే ఎక్కువ చేతులున్నవాళ్లు ఉన్నట్లు మనం కనలేదు వినలేదు. ఇంకా రాక్షసుల్లో యిరువై చేతుల వాళ్లు వెయ్యి చేతులవాళ్లు ఉండే వారట. దేవతల్లో మాత్రం ఆరు చేతుల వాళ్లు ఎనిమిది చేతులవాళ్లు పది చేతులవాళ్లు ఇల్లా సరి సంఖ్యతో చేతులుండడం ఉంది. కాని నాలుగు చేతుల వాడు శ్రీమన్నారాయణుడొక్కడు తప్ప ఇంక మనుష్యుల్లోగాని రాక్షసుల్లో గాని దేవతల్లో గాని ఎవరూ లేరు అయితే ఒకటి, 'నిరంజనః పరమం సామ్యముపైతి' 'మమ సాధర్మ్య మాగతాః' అని శ్రుతిలోను గీతలోను చెప్పినట్లు పరమపదంలో ఉండే నిత్యసూరులు, ముక్తులు మాత్రం ఆయనలాగే నాలుగు చేతుల్తో ఉంటారట అది ఆయనయిష్టం వాళ్లనల్లా ఆయన అనుగ్రహించాడు. భూమిలో మాత్రం అల్లాంటి వాడు లేనూ లేడు, తెచ్చిపెట్టుకుంటాడా చంపాడన్నమాటే పౌండ్రక వాసుదేవు డేమయినాడు మరి అదేమంటే ? నాలుగు చేతులుండడం ఆయన కొక్కడికే తగింది. అది ఒక వేదాంత రహస్యం. పైకి చెప్పేయమంటారా! అయితే శ్రద్ధగా వినండి పురుషార్థాలంటే మీకు తెలుసా పురుషులు కోరే ఫలాలన్నమాట. అవి ఎన్నో చెప్పగలరా? నాలుగు ఏమిటి? ధర్మం అర్థం కామం మోక్షం. ప్రపంచంలో ఒక్కడికి ఏదో ఒక్కటే యిచ్చేశక్తి వుంటుంది. సూర్యుడు ఆరోగ్యం ఇస్తాడు, డబ్బు అగ్నిహోత్రుడిస్తాడు, శంకరుడు జ్ఞానం యిస్తాడు. ఇల్లాగే యీ పురుషార్థాలు కూడా ఒక్క దేవుడెవ్వడూ ఇవ్వలేడు అల్లా ఇవ్వగలవాడు మన శ్రీమన్నారాయణుడొక్కడే. చూడండి మీలో ఎవ్వరైన ఏ సినిమా దగ్గరగాని ఏ రైలు స్టేషనులోగాని ఎప్పుడైనా టిక్కెట్లు కొన్నారా? కొంటే ఆటిక్కెట్లు అమ్మేగదికి ఎన్నికిటికీలుంటాయో చూశారా ? ఒక కిటికీలో ఫస్టుక్లాసు టిక్కెట్లు ఒకకిటికీలో సెకండు క్లాసు ఇల్లాగ లోపల ఒక్కడే వుండి మనకు కావలసిన రకరకాల టిక్కెట్లు యిస్తాడు ఒకరకం టిక్కెట్టుకి ఒకకిటికీ ఉంటుంది. అల్లాగే భగవంతుడు మన సౌభాగ్యతనుబట్టి ధర్మం అర్థం కామం మోక్షం అనే నాలుగురకాల ఫలాలు తనొక్కడే యిస్తానని తెలియడానికి నాలుగు కిటికీల్లాగ నాలుగు చేతులు పెట్టుకూచున్నాడు అందుకే పెద్దలు 'చతుర్ణాం పురుషార్థానాం దాతా దేవశ్చతుర్భుజః' అన్నారు. అంతే నాలుగు రకాల పురుషార్థాలు యిచ్చేవాడు ఆనాలుగు భుజాల దేవుడే అన్నమాట' అందుకే గీతలో కూడా

చతుర్విధా భజంతేమాం జనాస్సుకృతి
నోర్జున!
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ'

అన్నాడు అంటే అర్జునా! పోయినసొమ్ము యిప్పించమని ఏడ్చేవాడు, కొత్త ఆస్తి వచ్చిపడాలని దేవుల్లాడేవాడు కైవల్యం కావాలని మొత్తుకొనేవాడు కేవలం మోక్షాన్నే కోరే నాభక్తుడు

వీళ్లు నలుగురు పుణ్యాత్ములూ నన్నే వాటి కోసం సేవిస్తారు సుమా అన్నాడు.

ఇల్లా నాలుగు పురుషార్థాలూ యిచ్చేవాడు ఇంకొకడుంటేగా నాలుగు భుజాలుండడానికి అందుచేత ఆయనొక్కడే సకల ఫలములు యిచ్చే దేవుడు.

అయితే ఆలయాల్లోనూ, బొమ్మల్లోనూ, నాలుగు చేతులు నారాయణుడికి చూస్తున్నాం గాని ఏ అవతారంలోనైనా ఎవరైనా చూశారా అంటే చూడకేం చూచినవారు చూచారు. అల్లా చూడ్డానికి చాలా జ్ఞానం భక్తి ఉండాలి.

రామావతారంలో మండోదరిమాత్రం 'తమసః పరమోధాతా శంఖచక్రగదాధరః' అని రావణాసురుడు చచ్చిపోయినప్పుడు ఏడుస్తూ నాథా! ఆరాముడు సామాన్యుడుకాడు సాక్షాత్తూ నాలుగు చేతుల నారాయణుడని చెప్పానుకానా? అయ్యో! నీవు విన్నావా? అని ఏడిచినట్లుంది. కాని అది ముఖ్యంగా కృష్ణావతారం సొత్తు. ఆ అవతారంలో కంసుడు చచ్చేవరకు అతి గుట్టు నూటా నాటా కనిపించేదట. తరువాతమాత్రం భక్తులందరికి నాలుగు చేతుల్తో సేవే. శ్రీకృష్ణుడు పుట్టగానే నాలుగు చేతుల్తోనే పుట్టేట్ట. 'తమద్భుతం బాలకమంబుజేక్షణం చతుర్భుజం శంఖగదాద్యుదాయుధం' అని వసుదేవుడు నాలుగు చేతుల్తోనే చూచినట్లు, దేవకీదేవికూడా అల్లాచూచి కంసుడికి భయపడి బాబోయ్! 'ఉపసంహర విశ్వాత్మన్ అదోరూపం చతుర్భుజం' అని ఆరూపం మార్చేవరకు మొత్తుకున్నట్లుంది. కంసుడుండగా మాత్రం దాటూమాటూను. చూడండి ఒక చమత్కారం. ఒక గోపిక్కి ఆ దర్శనభాగ్యం ఎల్లా కల్పించాడో.

పీతే పీఠ నిషణ్ణ బాలక గళే తిష్ఠన్ స
గోపాలకో ।
యంత్రాం తస్థిత దుగ్ధభాండమ పకృ
ష్యాచ్ఛాద్య ఘంటారవం ।
వక్త్రోపాంత కృతాంజలిః కృత శిరః
కంపంపిబన్ యః పయః।
పాయాదాగత గోపికానయనయోర్గం దూష
ఫూత్కారకృత్॥

అంటే శ్రీకృష్ణుడు పిల్లల్తో ఒకయింట్లో దూరేడు. అయితే ఏంలాభం పెరుగుపాలు అందకుండా పైనెక్కడో ఉట్లలోఉన్నాయి చూచాడు. అమ్మ నీశిఖాకొయ్య! అన్నాడు సరేమీపనిచేస్తానుండండి అక్కడ పీటలన్నీ ఒకదానిమీద ఒకటిపెట్టి దానిమీద ఒకదిట్టమైన పిల్లాణ్ణి ఎక్కించి వాడి భుజంమీద తనెక్కేడు. ఉట్టిచల్లగా చచ్చినట్లందింది. పాలకుండ చూచాడు కాని దానికి ఆనవాలు కట్టినగంట గణగణమంది. ఆసి, నీముండామొయ్య అని ఒకచేత్తో ఆగంటవాగకుండా పట్టాడు. మరిరెండుచేతులుచ్చేర్చి నోటి దగ్గరపెట్టి బుర్రఊపుతు కొట్టేస్తున్నాడు. యింతలోకి ఆచప్పుడువిని ఒకగోపిక పుట్టిములిగినట్లే వగర్చుకుంటూవచ్చి ఆ! ఆ! అంటోంది. మనవాడేంచేశాడు నోటినిండా పాలుపట్టి తుబుక్కుని దానికళ్లల్లోఉమ్మేసి అది కళ్లునలుపుకొంటూఉంటే అదేపరుగు చూశారా ఇప్పుడు ఎన్నిచేతులుకనిపించాయో. ఒకదానితోకుండవంచడం ఒకదాంతో గంట వాక్కుండా పట్టుకోడం దోసిలితో పాలు తాగడం నాలుగుచేతులకీ పని తగిలింది ఇంక

కంసుడు చచ్చాక ఆరూపం ఆయనికి సహజమే అయింది. ఆఖరికి శత్రువైన శిసుపాలిడికికూడా ఆనాలుగు చేతుల రూపం కనిపించిందట. "ఉదార పీవర చతుర్బాహుం। శంకచక్రగదా ధరం," అని ఉంది. విష్ణుపురాణంలో.

అర్జునిడికి చూడండి చూపింగమని గోలెడితే విశ్వరూపం చూపి చూపా! తీరా చూపించాక అమ్మో నాయనోయ్ ఈ రూపం మారుస్తావా చావమంటావా? - ఆ కిరీటం పెట్టుకొని గద, శంఖం, చక్రం, ధరించిన "తేనైవరూపేణ చతుర్భుజేన" అన్నట్లు నీ మామూలు నాలుగు చేతుల రూపం చూపించునాయనా? అని దేవుల్లాడితే అల్లాగ చూపించునట్లు గీతలో పదకొండవ అధ్యాయంలో ఉంది. కాబట్టి కృష్ణావతారం సాక్షాత్తు శ్రీమన్నారాయణుని సకల పురుషార్థాలూ ఇచ్చే ఉత్తమావతారం అని నమ్మండి.

మన ఇంద్రుడికి ఇవి అన్నీ ఉన్నాయి. దేవతలకి త్రిదశులు అని పేరు గదా. అంటే ఎన్నాళ్లయినా 30 ఏళ్లే. ఇంక నిత్యయౌవనం అన్నమాటేగా, ఇంద్రుడంటేనే పరమైశ్వర్యం కలవాడని అర్థం. దేవేంద్రుడంటే దేవతలందరికి ప్రభువుగదా. అవివేకానికి మొదటివాడే. ఇంక వాడి అనర్థానికి లోటేమిటి చెప్పండి. ఇది ఎల్లా పరిణమించిందో చూడండి. ప్రాణులన్నీ అన్నంవల్ల గదా బతుకుతాయి. ఆ అన్నం వర్షంవల్ల. ఆవర్షం వరుణుడివల్ల. ఆవరుణుడు నా చేతిలోవాడే. అని వాడి గర్వానికి మేరలేకపోయింది. పాపం గొల్లలు ఏడాదికి ఒకసారి ఇంద్రయాగం అంటూ చేసి దేవేంద్రుణ్ణి బ్రాహ్మణార్థంస్వామిలాగ మెక్కపెడతారు. ఆతరుణందగ్గరకి వచ్చింది. ఆయన ఊణాభ్యాసం పారాయణ ప్రారంభించారు. గోకులంలో పెద్ద హడావిడిగా ఉంది. అన్నరాసులేకావు - కూరలకుండలేకాను - బూరెల పోగులేకాదు ఓ కిటకిటలాడిపోతూంది - గోకులం అంతా. ఇదంతా చూచాడు కృష్ణయ్య ఏందుకీ హడావిడి అన్నాడు ఇదంతా ఎవరికి పెడతారన్నాడు. దేవేంద్రుడుకే అనేసరికి ఆయనకి కోపం వచ్చింది. వల్లకాదు, కొండకి పెట్టాడి అన్నాడు కొండ తింటుదిరా? నాయనా? అన్నాడు నందుడు ఓ. తప్పకుండా తింటుంది. దానివల్లే మనం బ్రతుకుతున్నాం అన్నాడు. దేవేంద్రుడు వర్షం యిస్తాడురాబాబూ! ఆయనికి కోపంవస్తే వర్షం కురవదు. వర్షం లేకపోతే పంటలు పండవు. పంటలు పండకపోతే మనం గోవులు మాడిపోతాం అన్నాడు. 'అహం వర్షం నిగృహ్ణామి ఉత్సృజామిచ' అనగా నేనే వర్షం యిచ్చిన మాసినా అంటే వాళ్లకేం తెలుస్తుంది. అన్నీ మనకి ఈ గోవర్ధనపర్వతమే యిస్తుంది దానికి పెట్టండి నేను దానిచే తినిపిస్తా నన్నాడు. సరే అని దానికే పోశారా కుంభం అంతా. అందులో దూరి అంతా ఆరగించాడు. గోవర్ధనం అంటే ఆయనే. దేవేంద్రుడికి కడుపు మండింది. చూచాడు. పట్టరాని కోపం వచ్చింది. ఎవడురా యీపని చేశాడు అని చూశాడు. ఒక కుర్రగుంటడా మమ్మల్ని కాపాడేవాడు చూడండి నా ప్రతాపం అని మేఘాల్ని పిలిచి రాళ్లు కురిపేయండి గొల్లాళ్ళమీద అన్నాడు. ఆరంభమైంది రాళ్లవాన. ఇంకేముంది పిరికి గొల్లలు లబో దిబో. కృష్ణయ్యా కొంపముంచావయ్యోయ్ అన్నారు. ఏమీ భయంలేదన్నాడు. రాళ్లని రాళ్ళలోటే అడ్డుతానన్నాడు. ఆకొండ లేవనెత్తేడు. రండి దీనికిందకి అన్నాడు.

బాలుం డీతడు కొండదొడ్డది మహాభారంబు
సైరింపగా!
జాలండోయని దీనిక్రింద నిలవన్ శంకింపగా
బోలదీ!
శైలాంభోనిధి జంతు సంయుత ధరా
చక్రంబు పైబడ్డ నా!
కే లల్లాడదు బంధులార! నిలడీక్రిందన్
ప్రమోదంబునన్.

నన్నీ దానిక్రింద దూరారు. ఏడురోజులు పడిచారు. దేవేంద్రుడు. ఈకొండ ఇల్లాగే ఉంది. ఆవర్షం అల్లాగేఉంది. హాయిగా వీళ్ళ పని వీళ్ళకి సాగిపోతూంది. దేవేంద్రుడికి కళ్ళు తెరిచాయి. గర్వం ఉడిగింది.

నీమాహాత్మ్యమెరుంగ మేఘముల చేసి
ఘోషమున్ భీతిలో
నాసారంబున ముంచితిన్ ముఖము నాకై
వల్లవుల్ సేయరం
మోసత్యేన భవన్మహత్వమున నా
యుద్యోగ మిట్లయ్యె నీ
దాసున్నన్ను గృతాపరాధు గరుణన్
దప్పింపవే మాధవా!

అని కాళ్ళమీద పడ్డాడు. ఎవడురా - రక్షకుడు అన్నాడు కృష్ణుడు. మహాప్రభో నీవే నీవే నీవే. అని చెంపలు వాయించుకున్నాడు.

ఊం. జాగ్రత్త —

నా యాజ్ఞ చేయుమంటుము.

నీయధికారంబునందు నిలువు సురేంద్రా!

శ్రీయుతుడవై మని పను.

శ్రేయంబులు గల్గు పొమ్ము సితకరిగమనా!
అన్నాడు.

చూచారా రెండో లక్షణం రక్షణ కర్తృత్వం యీతనికెల్లా ఒప్పిందో.

ఇక మూడవది - సర్వసంహారం,

ఇది నేను చెప్పేదేమిటి, భారతయుద్ధం అంతా నడిపి 18 అక్షౌహిణీలు అటూ ఇటూ సంహరింపచేసిన చతురుడెవ్వడో మీకు తెలియదా విశ్వరూపం చూపించి —

మయైవేతే నిహతాః పూర్వమేవ నిమిత్తం
మాత్రం భవసవ్యసాచిన్।

అర్జునా! వీళ్ళందర్నీ నేనిదివరకే చంపాను. ఊరకే పీనుగులే అల్లా కనబడుతున్నారు. నువ్వు ఊరకే చెయ్యి చేసుకొని మాటదక్కించుకో అని ప్రత్యక్షంగా చూపించాడు. ఆ లక్షణంకూడా పూర్తి అయిందా. ఇంక దేవు డెవడంటారు మన కృష్ణుడేనా? సందేహమా?



## కావలెను

తూర్పు గోదావరి జిల్లా కోరుకొండ గ్రామములో ఈవికృతి సంవత్సర వైశాఖ శు॥ ౧౧ శుక్రవారము (ది॥ 23—4—1950) తేదీనుండి ఉభయ వేదాంత పాఠశాల శ్రీవిశిష్టాద్వైత ప్రచారకసంఘ యాజమాన్యమున ప్రారంభించబడి నడుపబడును.

ఇందు శ్రీభాష్య-భగవద్విషయములు పూర్తిగా వానికి కావలసిన ప్రకరణ గ్రంథములతో సహా శ్రీ ఉ: వే. శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులుగారిచే పాఠముచెప్పబడును.

ఇందు చదువుకొనుటకై యోగ్యులగు విద్యార్థులు కావలెను. యోగ్యులైన విద్యార్థులకు ఒక్కొక్కరికి నెల 1 కి 25—0—0 చొ॥న ఉచిత విద్యార్థివేతనము కూడ ఈయబడును. చేరదలచినవారు వెంటనే తెలుపవలసినది.

కార్యదర్శి<br>
శ్రీ. వి. ప్ర. సం.<br>
కోరుకొండ (వయా; రాజమండ్రి).

---

## కావలెను

తూర్పు గోదావరి జిల్లా రహితాపురం అను గ్రామమున ఒక చిన్న దివ్యస్థలమైన కోవెలలో అధ్యాపక- తళిహా కైంకర్యముల చేయుటకు యోగ్యులగు ఒకస్వామికావలెను.

ఉండదలచిన వారు తాము కోరు జీతము వగైరా వివరములతో రిప్లయికార్డు వ్రాయ గోరెదము.

శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ కార్యాలయం<br>
అర్తమూరు (వయా) ద్వారపూడి<br>
తూ. గోదావరి జిల్లా.

---

## కృతజ్ఞతలు

పాలకొల్లు వాస్తవ్యులగు బంగారు మాణిక్యం గారు కుమారుని వివాహము సందర్భములో శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు సమర్పించినది రు 5—0—0

---

గునుపూడి కాపురస్తులు గ్రంధి గంగన్న గారి కుమార్తె వివాహసందర్భమున ఈసంఘమునకు సమర్పించినది రు 2—0—0

---

పాలకొల్లు కాపురస్తులు శ్రీకాకుళపు శేషారావు గారి కుమారుని వివాహము సందర్భమున ఈ సంఘమునకు సమర్పించినది 2—0—0

---

ముక్తిపల్లి శ్రీ.ఉ.వే. శ్రీమాన్ గుదిమెళ్ల రంగాచార్యులుగారు సీనియర్ ప్రొప్రయిటరు భక్తి నివేదన పత్రికకు పోషకులు గా రు 25—0—0 లు సమర్పించి శ్రియఃపతి కటాక్షమునకు పాత్రులైరి.

---

శ్రీ గుదిమెళ్ళ తిరుమల వీరరాఘవాచార్యులు గారి ఇంట్లో బారసాల సందర్భములో సంఘమునకు 2—0—0

---

శ్రీ పోలీసు రామయ్యగారు ఇంట్లో వివాహ సందర్భము సంఘమునకు సమర్పించినది 1—0—0

---

వాడపల్లి కాపురస్తులు శ్రీనల్లపోతు సీతారామానుజదాసుగారు సంఘమునకు సమర్పించినది 1—0—0 వీరందరికి ఆయురారోగ్య భాగ్యభోగములు ఇచ్చి శ్రియఃపతి రక్షించుగాక.

రిజిష్టరు నెం, 5049




భక్తనివేదన

# వేదాంత పత్రిక.

ప్రతి మాసమునందును శ్రీవిశిష్టాద్వైత ప్రచార సంఘ పండిత పరిషత్సమావేశము వివిధ ప్రాంతముల యందును జరుగుచుండును. అందు పండితుల చేతను విద్యార్థులచేతను సంస్కృత ఆంధ్రభాషలలో వేదాంత సాంప్రదాయ విషయములు ఉపన్యసింపబడుచుండును.

మరియు వివిధ సమస్యలను గురించి పండితులచే చర్చింపబడి నిర్ణయములు చేయబడుచుండును.

ఈ ఉపన్యాస సంగ్రహములును, వారి వ్యాసములోని ముఖ్య నిర్ణయములును జిజ్ఞాసువుల ప్రశ్నలు తదుత్తరములును, సంఘ ప్రచారక కార్యక్రమములును ఇందు ప్రచురించబడుచుండును.

## చందాలు

| | | |
|---|---|---|
| సాధారణ చందా | సంవత్సరం 1 కి | రూ 5—0—0 |
| సహాయ చందా | ,, ,, | 10—0—0 |

## విరాళములు

| | | |
|---|---|---|
| పోషకులు | సంవత్సరం 1 కి | రూ 25—0—0 |
| రాజపోషకులు | ,, ,, | 58—0—0 |
| మహారాజపోషకులు | ,, ,, | 116—0—0 |

కార్యదర్శి
అ. చి. శ్రీమన్నారాయణాచార్య
అత్తమూరు.
(వయా) ద్వారపూడి.
తూర్పు గోదావరి జిల్లా.

సీ॥ నారాయణుని జేర్చు నామంబు నిత్యయో
గంబును దగు గుణగణపు గల్మి
దివ్యమంగళతను దీపనంబు నుపాయ
కర్తవ్యభాగ్య సంవర్తనములు
శ్రీశ్రీనివాసుల 'చేతి' కైంకర్యంబు
స్వామి సర్వంబుల స్వామియగుట
కైంకర్యమిమ్మని కైమోడ్చి వేడుట
ప్రబల విరోధుల పరిహారణంబు.

తే॥ గీ॥ లనెడు నీపదియర్థాల నవధరించి
మననములు జేయువారల మనుచుటను
మంత్రరత్నంబటంచన్న మహిమలనిది
రెండుఖండాల పదములారింట వెలుగు.

సీ॥ జగదీశ్వరియు సర్వ జగదీశు ప్రేయసి
నిత్యానపాయియై నెగడు సిరిని
చక్కనగా ముందు సాగిలి సేవించి
యాశ్రయణోచితాఖిలగుణములు
అతివేలముగ గల్గు నారమానాథుని
శ్రీపాదముల జేరి సేవ జేతు
ఆశ్రితేష్టప్రాప్తికాధారముగ సిరి
గూర్చిన యాత్మేశు కొరకు నేను.

తే॥ గీ॥ సర్వకాలంబులందుల సకల దాస్య
ములను మమతాహముల రెంట ముక్తుడనై
చేయగోరుదు నెదనట్టి చెరుపు లేక
శ్రీపతుల సేవ లేగదా జీవురూపు.

కం॥ నను జేర నేను జెప్పిన వెనుకటి
ధర్మములనెల్ల వీడ్కొని నన్నే
పరమార్థి శరణుజొరుమే
దురితంబులదోలిగొందు దుఃఖింపకుమా!

సీ॥ నీకధీనుడనని నిశ్చయమొందుచు
కర్మాదులను జేయ కడకుద్రోయ
సర్వధర్మంబుల సంత్యాగము వరించి
వడి ప్రపన్నుడనయి వరలుటకును
జాలక దుఃఖముల్బాల గనొందుచు
చేష్టలుదక్కుచు చెడుచునుంటి
ఈదృశజ్ఞానంబు నెదగొన్న నాదగు
నపరాధమెల్లను నణచగలవు,

తే॥ గీ॥ నీవటంచును మనమున నిశ్చయించి
గట్టిగా నీదు పదముల పట్టికొంటి
పార్థసారథివై నీవు బల్కినట్టి
చివరి వాక్యంబు స్మరియించి శ్రీరమేశ?



శ్రీమతేరామానుజాయనమః

## భక్తినివేదన పత్రికా ప్రభావము

కం. భక్తినివేదన - పత్రిక ముక్తినిదప్పకను గూర్చు ముదమున నిహాముక్
శక్తిగలవారు మీరను - రక్తిని చందాలబంపి రయముగ గొనుడీ.

చం. ప్రతినెలయందు భాగవతవర్యులు శ్రీపురుషాదులెల్లరున్
మతమును వ్యాప్తిచేయుటకు మానుగజేరుచు నేటికౌర! సం
తతముప్రజావళిన్ సభలదన్పుచు భక్తిప్రపత్తి గూర్చి స
మ్మతిపరదర్శనార్థములతోను ప్రచారముచేయసాగిరే.

ఉ. ఈవిధిభాగ్యముంగలుగు టీశుని సత్కరుణా విశేషమే
పావనమయ్యె లోకమును భాగవతోత్తమ పాదపూతమై
శ్రీవిభువైభవంబులను జేరుచునెల్లరు వింటధన్యులై
ధీవిభవంబు నొందెదరు దేశమునం గలినాశమయ్యెడిన్.

చం. పరమ వికుంఠమైతనరె బాయుచులీల విభూతియంతయున్
సరసయతీంద్రదర్శనము సార్థకమయ్యెను నేడెచూడ స
ద్వరవరయోగి పుంగవుల వాంఛలవన్నియు నేడెదీరె స
ద్వరకురుకాపురీశుల ప్రబంధములుర్ ఫలియించె నేడహో॥

మ. కనులారంగనిసేవ చేయుడికక మీకష్టంబులుండీరెడిన్
జనులారావిని సంతసంబుగొనుడీ సందేహముల్ బాసెడిన్
ఘనులౌపూర్వుల సచ్చరిత్రలను వేగాఢంబుగావించుమీ
జననంబుల్ సఫలంబుజేసికొనుడీ సందేహముంబొందకన్.

చం. నెలనెలజూచుభాగ్యమును నెమ్మిలభింపగలేదు సంతతా
విల హృదయుండనౌట జనివింటిని యొక్కటిరెండుసార్లు పె
ద్దల మధురోక్తులన్నియును తథ్యమునామన మావహించి ని
ష్కలుషుబునీతుజేసెనిదె సాగిలిమ్రొక్కెద ధన్యతంగనన్

శా. పున్నెంబియ్యది లోకమంతకును సంపూర్ణానుకంపన్ భవా
పన్నంబైన జగంబుబ్రోచుటకు గోపాలార్యవర్యులే సుసం
పన్నుల్ సర్వభరంబులూనుచు మహాప్రాజ్ఞుల్ బహుశ్రద్ధ శ్రీ
మన్నారాయణవర్యులు న్నెరపరే మాయందరింపన్ సభల్.

కం. కలివృద్ధిబొందె పత్రి - వెలయుచు నీవేగుదెంచి విశ్వమునెల్లన్
కలుషమడంచుచు జనులకు - కలుముల నొసగూర్పుమమ్మకరుణామయివై.

శ్రీ న. చ. నరసింహదాసుడు, (పెన్నాడ అగ్రహారము.)

## శ్రీరామాయణ విశేషార్థములు



'అప్రయుక్తము' మొదలగు దోషములు లేక 'శ్లేష' మొదలగు గుణములతో నొప్పుచు 'ఉపమానము' మొదలగు అలంకార సహితములై యుండు శబ్దార్థములు 'కావ్యము' అన బడును. ఇట్టి కావ్యమునకు శబ్దార్థములు శరీరము వంటివి వ్యంగ్యార్థము ప్రాణము వంటిది. కావున వ్యంగ్యార్థము లేని కావ్యము ప్రాణము లేని శరీరము వంటిదే యగును. వ్యంగ్యార్థ మనగా వ్యంజనా వృత్తిచే బోధింపబడు నర్థవిశేషము. వ్యంజనా వృత్తియనగా

(అన్వితేషు పదార్థేషు వాక్యార్థోపస్థాపనాంతరం అర్థాంతర విషయః శబ్దవ్యాపారః) అనగా వాక్యము నందలి పదములచే చెప్పబడు ముఖ్యార్థములు అర్థప్రకరణాదులచే ప్రస్తుతియున కథనార్థమగు సత్సంబంధించి యుండ కావ్య శరీరమైన వాక్యార్థ శోభకై వాచ్యార్థముగాని లక్ష్యార్థము గాని కాక వేరొక విలక్షణమగు నర్థమును సూచించు శబ్ద వ్యాపారము. ఇట్టి వ్యంగ్యార్థము ప్రధానముగా గల కావ్యము ఉత్తమ కావ్య మనబడును, దీనికే ధ్వని యని నామాంతరము. వ్యంగ్యార్థ మప్రధాన మైనచో మధ్యమ కావ్యము. అది యస్పష్టమగుచో నధమము, లేక చిత్రమనియు చెప్పబడును.

ఇట్టి ఉత్తమ కావ్యములలో నగ్రగణ్యము శ్రీమద్రామాయణము. అగ్రగణ్య మనా నేల? ఇదియే యాది కావ్యము. ఇంతకు ముందు వేదము నందే ఛందస్సు గోచరించెడిది. కావున శ్రీ రామాయణమునందు వాచ్యార్థ లక్ష్యార్థములను గాక వ్యంగ్యార్థములనే ప్రధానముగ పరిగ్రహించవలెను.

మరియు నది వేదాన్తార్థ విశదీకరణార్థమై బ్రహ్మ ప్రేరణచే వాల్మీకి ముఖము నుండి వెలువడిన దివ్య ప్రబంధము 'వేదోపబృంహణార్థాయ తావగ్రాహయత ప్రభుః' 'కావ్యం రామాయణం కృత్స్నం సీతాయా శ్చరితం మహత్' (వాల్మీకిమహర్షి సర్వోత్కృష్టమైన సీతా చరిత్రయే ప్రధానముగా గల శ్రీరామాయణమును వేదాంతార్థమును విశదీకరించుటకు ఆ కుశలవుల కుపదేశించెను) అని తానే రామాయణమున చెప్పియుండెను.

ప్రాయేణ పూర్వభాగార్థో ధర్మశాస్త్రేణ కథ్యతే.
ఇతిహాస పురాణాభ్యాం వేదాన్తార్థః ప్రకాశ్యతే.

వేదము పూర్వభాగము కర్మకాండ గావున కర్మలకు సంబంధించిన విద్యగల ధర్మశాస్త్ర మా యర్థమును విశదీకరించును. ఉత్తరభాగము బ్రహ్మభాగమనబడు వేదాంతార్థము గాన నది ఇతిహాసము లనబడు రామాయణ భారతములచే తను శ్రీమద్భాగవతము శ్రీవిష్ణుపురాణము మొదలగు పురాణముల చేతను దాని యర్థ

ము విశదీకరింపబడవలెను. దీనిని బట్టి శ్రీమద్రామాయణ కథా సందర్భము గూడ ననేక వేదాంతార్థములనువ్యంజనావృత్తితో వ్యక్తపరచుచున్న దని మనము దృఢముగ విశ్వసించవలెను, అందు మొదటిది యగు

తప స్స్వాధ్యాయ నిరతం తపస్వీ వాగ్విదాం వరం
నారదం పరిప్రచ్ఛ వాల్మీకి ర్ముని పుంగవమ్.

అనెడు శ్లోకమెట్లు చక్కగ నొక యుపనిషదర్థమును విశదీకరించుచున్నదో విచారింతము.
ఈ శ్లోకముచే వివరింపబడు శ్రుతివాక్యము ఆథర్వణికము. అది—

పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేద మాయాత్, నా స్త్యకృతః కృతేన తద్విజ్ఞానార్థం స గురుమేవా భి గచ్ఛేత్, సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం తస్మై స విద్వానుపసన్నాయ। సమ్యక్ ప్రశాంతచిత్తాయ శమాన్వితాయ యేనా క్షరం పురుషం వేద సత్యం ప్రోవాచ తాం తత్త్వతో బ్రహ్మవిద్యామ్॥ అనునది.

అనగా— "ముముక్షువగు సాంగ సశిరస్క వేదాధ్యాయన సంపన్నుడు" శాస్త్రోక్తములగు కామ్య కర్మలు నశ్వర ఫలములకే సాధన మని మీమాంసా న్యాయములచే నిశ్చయించి యిట్టి కర్మల నాచరించుటచే నిత్యమగు పరమపురుషుడు లభించడని వాటియందు విరక్తుడై యిక నట్టి పరమ పురుషార్థమునకు సాధన మేదియో తెలియగోరి గురువున కనుష్ఠా నోపయుక్తములగు సమిధాదుల చేబూని సంపూర్ణ వేదాంత జ్ఞానసంపన్నుడై బ్రహ్మసాక్షాత్కార సంపన్నుడగు నాచార్యుల నాశ్రయించి ప్రణిపాత శుశ్రూషాదులచే నాతనిని ప్రసన్నునిగా జేసుకొని వేదాంతార్థములజిజ్ఞాసతో ప్రశ్నించవలెను. ఇట్లా శ్రయించిన శమదమాది సంపన్నుడగు నాశిష్యున కాయాచార్యుడు పరమాత్మ సాక్షాత్కారమున కుపయుక్తమగు బ్రహ్మవిద్య నుపదేశించవలెను.

ఈశ్రుత్యర్థము నీ శ్లోక మిట్లు పబృంహణము గావించుచున్నది.

ఈ శ్లోకమందలి "తపస్వీ" యను శబ్దముపై శ్రుతివాక్యములోని "పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేద మాయాత్ నాస్త్యకృతః కృతేన" యను వాక్యఖండమును వివరించుచున్నది.

'కృష్యాది వ్యాపారముచే లభించిన సస్యాది ఫల మనిత్యమైనట్లు కామ్యకర్మలచే పొందబడు స్వర్గాది ఫలములును అనిత్యములని విమర్శించి తెలుసుకొని నిత్యమగు పరమపద మీయనిత్య కర్మాచరణము వలన లభించదని వాటియందు విరక్తిని చెందవలెన' ని గదా పైవాక్యమున కర్థము.

ఇచ్చటను "తపస్వీ" యనగా ప్రశస్తమగు తపస్సు కలవాడని యర్థము. తపస్సనగా— "తపోహి స్వాధ్యాయః" అను శ్రుతివాక్యము వలన వేదమనియు, "తపసా ముత్తమం తపః ప్రథమం ఛందసామంగ మాహు ర్వ్యాకరణం బుధః" అను ప్రమాణము వలన వ్యాకరణాది వేదాంగము లనియు నర్థముగాన తపస్వీ యనగా సాంగముగను సశిరస్కముగను వేదాధ్యాయనము గావించిన వాడు గావున కర్మలు అల్పాస్థిర

ఫలములను మాత్రి మొసంగునవి యను జ్ఞానము కలవాడనియు, 'తపస్వీ తాపసే శోచ్యే' అనెడు వైజయంతీ నిఘంటు ప్రమాణమును బట్టి మోక్షాభిలాష కలవాడనియు నర్థము గాన నది పై శ్రుతి వాక్యముతో సమానార్థమనుట నిస్సంశయము.

శ్రుతివాక్యమందలి 'సమ్యక్ప్రశాంత చిత్తాయ శమాన్వితాయ' అను శబ్దములకు అంతరింద్రియ బహిరింద్రియముల జయించిన వాడని యర్థము.

ఈ శ్లోకమందలి 'వాల్మీకి' శబ్దముచే పుట్టనుండి పుట్టిన వాడని యర్థ మగుటచే పుట్టలు పోయు నంతటి తపస్సు చేయుట కెంతయో శమ దమాదులుండవలెను గాన నర్థాపత్తిచే నవి సిద్ధించు చున్నవి. కావున యీ పద మాశ్రుతి వాక్య ఖండమునకు సమానార్థకము.

శ్రుతివాక్యమునందలి 'శ్రోత్రియ' శబ్దమునకు 'శ్రోత్రియ శ్ఛందోఽధీతే' యను ప్రమాణమును బట్టి వేదమును చదువుకొనిన వాడని యర్థము గాన నీ శ్లోకమందలి 'స్వాధ్యాయ నిరతం' అనెడు పద మాయర్థమును బోధించు చున్నది.

శ్రుతివాక్యమునందలి 'విద్వాన్' అనెడు పదమునకు అనుష్ఠాన పర్యవసాయి యగు సంపూర్ణ వేదాంతార్థముల నెఱింగిన వాడని యర్థము గాన నీ శ్లోకమునందలి "వాగ్విదాం వరమ్మ" ను పద మాయర్థము నుపబృంహితము గావించుచున్నది.

శ్రుతియందలి "బ్రహ్మనిష్ఠ" మ్మనెడు పదమునకు బ్రహ్మ సాక్షాత్కార సంపన్నుడని యర్థము గాన నీ శ్లోకమునందలి 'మునిపుంగవ మ్మను పద మాయర్థమునే విశదీకరించుచున్నది.

శ్రుతియందలి "గురు" శబ్దమునకు "గు శబ్ద స్త్వంధకార స్స్యాత్ రు శబ్ద స్త న్నిరోధకః। అంధకార నిరోధిత్వాత్ గురు రిత్య భిధీయతే" 'గు' శబ్దమునకు అజ్ఞానాంధకారమున్ను 'రు' శబ్దమునకు దానిని పోగొట్టువాడ నియు నర్థము గాన అజ్ఞానాంధకారమును పోగొట్టువాడు గురు వని యర్థము. ఈ శ్లోకమునందలి నారద శబ్దము తత్సమానార్థకము. ఎట్లన—

'నారం' అజ్ఞానమును, ద్యతి-ఖండించు చున్నాడు గనుక నారదుడనగా అజ్ఞానమును పోగొట్టువా డని యర్థమగుచున్నది.

శ్రుతియందలి 'తద్విజ్ఞానార్థం స గురు మేవాభిగచ్ఛేత్' అను వాక్యఖండమును ఈ శ్లోకమందలి 'పరిపప్రచ్ఛ' యను పదము ఉపబృంహణము గావించుచున్నవి. దాని నెరుంగుటకు గురువునొద్దకేగుట యడిగి తెలుసుకొనుటకే గదా! ఇందు అడుగుటయే ప్రధానము— తద్విద్ధి...... పరిప్రశ్నేన' యని శ్రీకృష్ణు డుపదేశించెను గదా!

ఇట్లు శ్లోకముచే పై శ్రుతివాక్య మంతయు లెస్సగ నుపబృంహితము గావింప బడుటచే స్థాలీపులాక న్యాయముగ రామాయణ మంతయు నిదే విధముగ శ్రుత్యుపబృంహణమని సూచింప బడినది.

## వా ల్మీ కి ఎ వ రు ?

వాల్మీకి మహర్షిని గూర్చిన పుక్కిడి పురాణములెన్నియో గలవు. వాటికంత విశ్వసనీయమగు ప్రమాణములు గాన్పింపవు. అంతియగాక వాటికి విరుద్ధమగు ప్రమాణములు గూడ పెక్కులుగలవు. అందు కొన్నిటిని విమర్శింతము.

శ్రీవిష్ణుపురాణమున "ఋక్షో భూ త్ఛార్గవ స్తస్మాత్ వాల్మీకి ర్యో భిధీయతే" అనగా భృగుమహర్షికి ఋక్షుడని యొక కుమారుడు కలడు. ఆతడే వాల్మీకి యని గలదు.

ఉత్తరరామాయణమున "భార్గవేనే తి సంస్కృతౌ భార్గవేన తపస్వినా" అనియుకలదు. దీనిచే వాల్మీకి భృగు పుత్రుడని తెలియుచున్నది.

'చక్రే ప్రచేతసః పుత్రః తం బ్రహ్మా ప్య న్వమన్యత' (ప్రచేతసుని కుమారుడు తపస్సు చేసెను దానిని బ్రహ్మ యామోదించెను) అనియు 'వేదః ప్రాచేతనా దాసీత్ సాక్షా ద్రామాయణాత్మనా' (ప్రచేతసుని కుమారుని నుండి సాక్షా ద్వేదము రామాయణముగ ననతరించెను) అనియు ప్రసిద్ధముగ గాన్పించుచుండుటచే నీతడు వరుణుని పుత్రుడని స్పష్టమగుచున్నది.

'వల్మీకస్య అపత్యం పుమాన్ – వాల్మీకిః' అను వ్యుత్పత్తిని బట్టి యీతడు పుట్టనుండి పుట్టిన బిడ్డడని తెలుపబడుచున్నది.

ఇట్లు భృగుపుత్రుడగుట ప్రచేతసపుత్రుడగుట వల్మీకపుత్రుడగుటయు నత్యంత విరుద్ధమగుటచే అసలు న కీతడెవడని సందేహము కలుగుచున్నది. పై మూడు వ్యవహారములకును విరోధము లేకుండ పెద్దలిట్లు సమర్థించుచున్నారు ఇతడు వాస్తవముగ భృగుపుత్రుడనుటకు సందేహము లేదు. ఈతడు నిశ్చల తరమగు తపస్సు నం దుండగ నీతని శరీర మంతయు పుట్టచే నావరింపబడెను. పిమ్మట పెక్కుకాలమునకు వరుణుడు (ప్రచేతసుడు) నిరంతర వర్ష ధారను కురిపించుటచే నాపుట్ట యంతయు కరిగి యీతడందుండి ప్రాదుర్భవించెను. కావున నీతడు ప్రాచేతసుడనియు వాల్మీకి యనియు చెప్పబడుచున్నాడు.

లేక భృగువంశమున ప్రచేతసు డని పేరు గల నొక మహాత్ము డుండి యుండవచ్చును.

ఆయనకు ఋక్షుడను నామాంతరము గల వాల్మీకి పుత్రుడై యుండెను. అయినను రఘు వంశమునందు జన్మించిన రామునకు రాఘవ, రఘునందన శబ్దముల వలెనే వాల్మీకికిని భార్గవ భృగునందన శబ్దములు ఉపపన్నములు కాగలవు. ఈతనికి పుట్టకు పుత్రు డను అర్థ మిచ్చెడు ప్రత్యయముతోకూడిన వాల్మీకి శబ్దము గౌణము కాని ముఖ్యము కానేరదు. కావున ఈతని కీమూడు నామధేయములును సమంజసములే.

దీనినిబట్టి యీతనిగూర్చి అత్యంత హేయముగ జెప్పెడు కథలు అప్రమాణికములని తెలియుచున్నది.

## రెండు నియమములు

"శ్రీమన్నారాయణ"



లోకములో నియమబద్ధ జీవితమునకు చాల మంది భయపడుచుందురు. కాని అది పిరికితనమునకు సూచన. ఏలన జగత్తంతయు నియమబద్ధమైయుండుటవల్ల మాత్రమే మనకగుపడుచున్నది. ఒక్క త్రుటికాలము సూర్యభగవానుడు ఉదయించుటలో ఆలసించెనా-ఒక్క అంగుళము జరిగి ప్రవర్తించెనా జగత్తున కెట్టి మహోపద్రవము తటస్థించునో ఊహించజాలము కదా! ఒక్క సూర్యుడన్న మాటయేల? ప్రకృతిలోని ఏశక్తియైనను సరియే, తనకు భగవన్నియమితమైన నియమమును ఏమాత్రము అతిక్రమించినను జగత్తున కనర్థము తప్పదు. తనకూ తప్పదు.

ప్రకృతి కున్నట్టులనే జీవుని జీవితమునకు కూడ అపార కరుణామయుడైన సర్వేశ్వరుడు నియమముల నేర్పాటుచేసెను. జ్ఞానస్వరూపుడై జ్ఞానగుణ ప్రధానుడైన ఈజీవుడు తనకు భగవంతుడిచ్చిన కించిత్స్వాతంత్ర్యమును దుర్వినియోగ పరచుకొని తన నియమబద్ధ జీవితమునుండి తొలగి వర్తించుచున్నాడు. దానివల్ల అమితబాధల ననుభవించుచున్నాడు.

నియమబద్ధముగ నడచుకొనుట కేవలము శరీరమున కొక్కదానికి మాత్రమె సంబంధించినది కాదు, అది ఆత్మకు కూడ అనువర్తించునదియే. శరీరములేని ఆత్మ అనుపయోగము. ఆత్మలేని శరీరమూ నింద్యమే.

లోకములోని ప్రతివస్తువు నొకదాని సహాయముపై మరొకటి యాధారపడి యున్నవి.

కావున బుద్ధిమంతుడైన ప్రతి మానవుడు తన జీవితమును సార్థక పరచుకొనవలెనన్నచో నియమబద్ధమొనర్చుకొని తీరవలెను. తాను ఏది ధర్మమని నిశ్చయించుకొనునో ఆనిర్ణయమున కున్ను దాని యనుష్ఠానమునకున్ను వ్యవధియుండరాదు.

ఏది అధర్మముగ నిశ్చయింపబడునో అట్టిదాని విసర్జనలో క్షణకాలవిలంబము కూడ సహించరానిదే.

వైద్యుడొకడు నూతనముగ ఒక గ్రామమున బల్లకట్టెను. కాని సలహాకైనను ఒక్కడున్ను కూడ ఆయనవద్దకు వెళ్ళకుండెను. ఒకనాడాయన గ్రామపెద్దనుపిలిచి యింత పెద్ద గ్రామములోను వైద్యసలహాకోసము వారొక్కరు లేకుండుట కేమికారణమని యడిగెను.

అందులకా గ్రామస్తుడు తమ గ్రామస్తులకు "రెండు నియమను" నియమమొకటున్నదనియు దానివలన ఎవరికి ఎపుడు శరీరానారోగ్యము గలుగదనియు గాన తమకు వైద్యుని అవసరము లేదనియు తెలిపెను.

ఆ రెండు నియమ మేమనగా:-

రోజుకు రెండు
వారముకు రెండు
పక్షముకు రెండు.
మాసముకు రెండు.
ఋతువుకు రెండు.
అయనముకు రెండు
వర్షముకు రెండు.

రోజుకు రెండనగా:- రోజుకు రెండు పర్యాయములు మాత్రమే సాపడుట.

వారముకు రెండనగా:- వారమునకు రెండు మారులు మాత్రమే స్త్రీసంగమముండుట.

పక్షముకు రెండనగా:- స్త్రీలు శుక్రవారమునను పురుషులు శనివారమునను ఒక్కొక్క పర్యాయము చొప్పున పక్షమునకు రెండు పర్యాయములు అభ్యంగన మాచరించుట.

మాసమునకు రెండు:- మాసములోని రెండు ఏకాదశులయందును రెండు పర్యాయములు ఉపవసించుట.

ఋతువుకు రెండు:- మాసమున కొక్కొక్క పర్యాయము చొప్పున ఋతువునకు రెండు పర్యాయములు క్షౌరకర్మ చేయించుకొనుట.

అయనముకు రెండు:- మూడేసినెలల కొక్కొక్క పర్యాయము చొప్పున, అయనమునకు రెండుపర్యాయములు విరోచనౌషదసేవ చేయుట.

వర్షముకు రెండు:- ఆరేసినెలల కొక్కొక్క పర్యాయము చొప్పున సంత్సరములో రెండు పర్యాయములు తీర్థయాత్రము చేయుట.

ఇది శరీరమునకు సంబంధించినది మాత్రమే.

ఇటువలెనే మనము "ఆధ్యాత్మిక రెండు నియమము" ను కూడ పాటించినచో యమునకై భయపడనక్కరలేదు. పరమ పదమంగలి భాగవత కింకరులలో మనకు స్థానము కూడ సుస్థిరమై యుండగలదు.

దినమున రెండు :- 1. గతిచింతనం.
2. హరినామ స్మరణము.

సాయమున రెండు :- 1. విష్ణు సహస్రనామ జపము.
2. లక్ష్మీ అష్టోత్తర జపము.

దివసమున రెండు :- 1. భగవదర్చనము (తదర్చనము.)
2. భాగవతారాధనము (తదీయారాధనము.)

వారమున రెండు :- 1. దివ్యదేశ దర్శనము.
2. దివ్యతీర్థ స్నానము.

పక్షమున రెండు :- 1. ఏకాదశ్యుపవాసము.
2. ద్వాదశి పారాయణము.

మాసమున రెండు :- 1. స్వాచార్య తిరునక్షత్రం.
2. తిరువాయ్‌మొழి అనుసంధానము.

ఋతువున రెండు :- 1. మంత్రార్థకాలక్షేపము.
2. శ్రీవచనభూషణాలంకరణము.

అయనమున రెండు :- 1. తీర్థయాత్ర గమనము.
2. శ్రీశస్థలాన్వయము.

వత్సరమున రెండు :- 1. ధనుర్మాస వ్రతము.
2. శ్రీరామాయణ పఠనము.

వస్తవ్యం రెండు:- 1. ఆచార్య సన్నిధి
2. భగవత్సన్నిధి

వక్తవ్యం రెండు:- 1. ఆచార్య వైభవం
2. స్వనికర్షము

జప్తవ్యం రెండు:- 1. గురుపరంపర
2. ద్వయమంత్రము

| | |
|---|---|
| కర్తవ్యం రెండు:_ | 1. ఆచార్యకైంకర్యము |
| | 2. భగవత్కైంకర్యము |
| కైంకర్యం రెండు:_ | 1. ఇష్టప్రాప్తి |
| | 2. అనిష్టనివృత్తి |
| వినాశ్యం రెండు:_ | 1. అహంకారము |
| | 2. మమకారము |
| పరిగ్రాహ్యం రెండు:_ | 1. పూర్వాచార్యవచనము |
| | 2. పూర్వాచార్యానుష్ఠానము |
| పరిత్యాజం రెండు:_ | 1. అవైష్ణవ సహవాసము |
| | 2. అభిజన విద్యా ధనాభిమానము |
| భోక్తవ్యం రెండు:_ | 1. భగవన్నివేదితము |
| | 2. భాగవతశేషము |
| అనుభావ్యం రెండు | 1. స్వాపారబ్ధకర్మఫలము |
| | 2. స్వాచార్యకృపాఫలము |





శ్రీమతే రామానుజాయ నమః

# ★ శ్రీ రామానుజార్య దివ్యాజ్ఞా ★

(ఎనుబది రెండు వార్తలు)

1 ప్రపన్నుడనగా ఆత్మ – ఆత్మీయముల భగవంతుని కర్పించినవాడు. అట్టివానికి ఆత్మయాత్ర గురించి విచారించవలసిన పనిలేదు. విచారించెనా ఆత్మసమర్పణ మనునది వ్యర్థమగును.

2 దేహయాత్ర కర్మాధీనము. గనుక దానిని గూర్చి ప్రపన్నుడు విచారించవలసిన పనిలేదు. విచారించెనా నాస్తికుడగును. దేహ–ఆత్మ యాత్రలలో దేనితో సంబంధము కలిగియున్ననూ స్వరూపహాని కలుగును. గనుక పరమప్రాప్యమైన భగవద్భాగవతాచార్య కైంకర్యమందే కాలముగడుపవలెను.

3 ప్రపన్నుడు తన కాలమును గడుపుటకు అయిదు విధములున్నవి.

1 శ్రీభాష్యకాలక్షేపము చేయుచుండవలెను. లేదా

2 ఆళ్వారాదుల దివ్యశ్రీసూక్తులైన నాలాయిర ప్రబంధముల కాలక్షేపము చేయవలెను. లేదా

3 దివ్యదేశములయందు కైంకర్యముచేయుచుండవలెను. లేదా

4 సదాచార్యయమంత్ర మంత్రార్థానుసంధానము చేసుకొనుచుండవలెను.

లేదా

5 జ్ఞానానుష్ఠానములుగల ప్రపన్నుని అభిమానమునకు పాత్రుడై యుండవలెను.

ఈ అయిదింటిని చక్కగా కలిగి యుండుట భాగ్యమైనది.

4 ప్రపన్నునకు అనుకూలులు ప్రతికూలులు అనుభయులు అని మూడు విధములైన జనులు కలరు.

1 అనుకూలులు అనగా శ్రీవైష్ణవులు వీరిని జూచినచో మిక్కిలి ప్రీతితో ప్రవర్తించవలెను.

2 ప్రతికూలులు భగవద్విరోధులు. వీరిని జూచినచో సర్పాదుల జూచినటు వలె భయముతో దూరముగ తొలగి ప్రవర్తించవలెను.

3 అనుభయులు = సంసారులు. వీరిని జూచినచో ఉపేక్షాభావముతో ప్రవర్తించవలెను.

ప్రతికూలురు అనుకూలించినపుడు వారిని రక్షించవలెను.

5 ధనము-కీర్తి మున్నగువానిపై ఆశచే ప్రతికూలుల నాదరించినచో రాజమహిషి భిక్షమెత్తుట రాజునకవమానమైనటుల సర్వేశ్వరుని మనస్సునకు బాధకలుగును.

6 అర్థ-కామాదులచే అనుకూలురైన ప్రపన్నుల నాదరించినచో రాజకుమారుని అవమానించినచో రాజున కాగ్రహము కలిగినటుల సర్వేశ్వరుని కాగ్రహము కలుగును.

7 అనుభయుల నాదరించినచో రాజునకు రత్నమునకు భేదము తెలియనివాని జ్ఞానము వ్యర్థము.

8 భగవద్-భాగవత-ఆచార్య కైంకర్యముల యందు సమాన ప్రతిపత్తి యుండవలెను.

9 ఇంద్రియములకధీనులై యుండరాదు.

10 సామాన్య శాస్త్రముల యందు నిష్ఠులై యుండరాదు.

11 విశేషశాస్త్రమందే సదా నిష్ఠులై యుండవలెను.

12 జ్ఞానానుష్ఠానపరులై యుండవలెను.

13 శబ్దాది విషయములయందు ప్రావణ్యముండరాదు.

14 చందన-కుసుమ-తాంబూలాదుల ఆశపడరాదు.

15 శబ్దాదివిషయ భోగముల నైదింటి యందును సమబుద్ధి యుండవలెను.

16 భగవంతుని గుణకీర్తనమువలెనే భాగవతుల గుణకీర్తనమునుకూడ నాదరించవలెను.

17 భగవద్దివ్య-మంగళ-విగ్రహమందు వలెనే భాగవత-విగ్రహమందును ఆదరణ ముండవలెను.

18 దివ్యదేశములయందుండుము ప్రియ ఇతర క్షేత్రముల యందుండరాదు.

19 భాగవత శ్రీపాదస్పర్శకు విధిప్రేరితుడై భగవత్-భాగవత-ఆచార్య కైంకర్యములను భయము-భక్తి- విశ్వాసము- ప్రేమ-సంతోషములతో చేయవలెను.

20 ప్రపన్నుల జ్ఞానానుష్ఠానుల ఉపాయమని తలంచక ఉపేయములని తలంచవలెను.

21 ప్రపన్నులను ఏకవచనముగా బిలువరాదు.

22 ప్రపన్నులను సేవించునపుడే ముందుగ అంజలి చేయవలయును.

23 భగవత్-భాగవత-ఆచార్యసన్నిధిని కాళ్ళు జాచరాదు.

24 నిద్రించునపుడైనను భగవత్- భాగవత-ఆచార్య గృహముల దిక్కునకు కాళ్ళు జాచరాదు.

25 ప్రతిదినము గురుపరంపరాను సంధానము చేయుచు మేల్కొనవలెను.

26 భగవత్సన్నిధియందును ప్రపన్నుల గోష్ఠి యందును తిరుమంత్రమునను సంధించుచు దండము సమర్పించవలెను.

27 ప్రపన్నులు భగవద్భాగవతాచార్య-గుణ-కీర్తనము చేయుచుండగా వారిని సంతోషపెట్టవలెనేగాని మధ్యలో లేచిపోకూడదు.

28 ప్రపన్నులు వేంచేసినచో వారి కెదురుగ వెళ్ళి పిలుచుకొనిరావలెను.

29 ప్రపన్నులు తిరిగి వెళ్ళిపోవునపుడు వారిని కొంతదూరము వెంటవెళ్ళి సాగనంపవలెను.

30 ప్రపన్నుడు తనయాత్మయాత్రకై తాను పాటుపడ నవసరము లేదు. గాన దేహయాత్రకై పామరుల వెంటనంటి వారిని స్తుతించుచు కీర్తించుచు నుండుట స్వరూపహాని.

31. భగవంతుని దివ్యగోపురములను, సన్నిధి విమానములను జూచిన వెంటనే దండము సమర్పించవలయును

32 ఇతర దేవతలజూచి ఆశ్చర్యపడరాదు.

33 భగవత్-భాగవత ఆచార్య మందిరములను ప్రదక్షిణముగ పోరాదు.

34 భక్తులు కానివారలు సాత్వికపురాణములు చెప్పినను వినరాదు.

35 ఇతర దేవతల వార్తలవిని సంతోషించరాదు. నిందించరాదు.

36 భక్తులు భగవత్-భాగవతాచార్య గుణముల కీర్తించుచుండ వారిని సంతోషింప చేయవలెను. గాని తప్పులు పట్టరాదు.

37 భక్తుల విగ్రహచ్ఛాయను తొక్కరాదు.

38 తననీడ వారిమీద పోరునటుల నడువరాదు.

39 సంసారుల స్పృశించి భక్తులస్పృశించరాదు.

40 ప్రపన్నులు పరస్పరము 'దాసుడు' అనియే వ్యవహరించవలెను. దాసుడ ననిన వారిని పూజించవలెను. అనాదరించుట అపచారహేతువు.

41 భక్తుల జన్మ-వృత్తులను బట్టిగాక జ్ఞానానుష్ఠానముల బట్టి ఆదరించవలెను.

42 భక్తుల దోషముల మనస్సుచేనైన తలంచరాదు. వాక్కుచేనుచ్చరించరాదు. గుణములను మాత్రమే స్మరించవలెను. పలుకవలెను

43 పామరులు చూచుచుండగా భాగవత-స్వాచార్య శ్రీపాదతీర్థము పుచ్చుకొనరాదు.

44 తత్త్వత్రయ-రహస్యత్రయ జ్ఞానము లేనివారి శ్రీపాదతీర్థము పుచ్చుకొనరాదు.

45 జ్ఞానానుష్ఠానములు, సదాచార్య సంబంధము గలవారి శ్రీపాదతీర్థమును నిత్యము స్వీకరించుచుండవలెను.

47 తానును భక్తులతో సమానుడనని గాని అధికుడని గాని తలంచరాదు. [illegible] తలంచవలెను.

46 పామరుల [illegible] భక్తులతో [illegible] శ్రీపాదతీర్థము స్వీకరించవలెను.

48 జ్ఞానానుష్ఠాన [illegible] దేహములను భావించి [illegible] ప్రవృత్తి [illegible].

49 భాగవత శ్రీపాదతీర్థమును [illegible] తానే స్వయముగ పుచ్చుకొనవలయును.

50 [illegible] సేవింపరాదు.

51 జ్ఞాన-భక్తి-వైరాగ్యాదులుగల [illegible] కు ద్వేష్యులుగ తలంపవలెను.

52 ఆళ్వారుల ప్రతిష్ఠలేనట్టియు, ఆళ్వారుల ప్రబంధాధ్యయనములేనట్టియు దేవాలయములలో తీర్థప్రసాదముల స్వీకరించరాదు.

53 ఆళ్వారుల ప్రతిష్ఠయు వారి ఆరాధనయు వారి ప్రబంధాధ్యయనముగల విష్ణ్వాలయములు దివ్యదేశములు. అచ్చట దృష్టిదోషము-స్పర్శదోషము లేదు. ఎవరు జూచుచున్నను భగవన్నివేదిత తీర్థప్రసాదములు స్వీకరించవలెను.

54 ఉపవాసమున్నను భగవత్సన్నిధియందు తీర్థప్రసాదముల స్వీకరించవలెను.

55 భాగవత ప్రసాదశేషము పావనమైనది. దానియందు ఉచ్ఛిష్టబుద్ధియుండరాదు.

56 శ్రీరంగనాథుని నంబెరుమాళ్ళనవలెను.

57 వెంకటాచలమును తిరుపతి యనక తిరుమల యనవలెను.

58 కంచిని పెరుమాళ్ళ కోవిల యనవలెను.

59 గరుత్మంతుని గరుడాళ్వారనిగాని పెరియ తిరువడి యనిగాని అనవలెను.

60 హనుమంతుని శిరియతిరువడి యనవలెను.

61 గుహుని శ్రీగుహప్పెరుమాళ్ యనవలెను.

62 భక్తుల సన్నిధిని తన మంచిగుణముల చెప్పికొనరాదు.

63 భక్తుల నవమానించరాదు.

64 సదా భగవత్-భాగవత-ఆచార్య గుణానుభవములనే స్మరించవలెను. లోకవ్యవహారముల స్మరించరాదు.

65 ప్రతిదినము ఒకఘడియయైనను ఆచార్య వైభవమును కొనియాడవలెను.

66 ఆళ్వారుల పాశురములను, ఆచార్యుల వచనానుష్ఠానములను సదా అనుసంధించుకొనుచుండవలెను.

67 దేహాభిమానులతో సహవాసము కూడదు.

67 శ్రీవైష్ణవచిహ్నముల ధరించుకొని, విషయ ప్రావణ్యము కలిగియుండు వారితో సహవాసము చేయరాదు.

68 కర్మనాస్తికులతో సహవాసము చేయరాదు.

70 పరులను నిందించు స్వభావముగల వారితో సంభాషించరాదు.

71 ఇతర దేవతలగురించి ప్రసంగించరాదు.

72 ఇతర దేవతాధిక్యమును వినినను-పలికినను, అటుపిమ్మట శ్రీవైష్ణవులతో సంభాషించవలెను.

73 భక్తుల నవమానపరచువారిని చూడరాదు.

74. ద్వయమంత్రాధికారులు కాని వారితో ఎన్నడు సహవాసము చేయరాదు.

75 భగవంతుడే మనకుపాయము. కాన ఇతరోపాయముల నవలంభించువారి నుపేక్షించవలెను.

76 ప్రపన్నుల గోష్ఠితో పొద్దుపుచ్చవలెను.

77 తత్త్వత్రియ రహస్యత్రియ నిష్ఠలేనివారితో సహవాసము చేయరాదు.

78 భక్తుల సంభాషణతో కాలక్షేపము చేయవలెను.

79 భక్తులు తనను అవమానపరచినను వారి విషయమై అపకారబుద్ధియుండరాదు.

80 ఏపద్దైన ప్రపన్నులువిరక్తిచే వెంటనే పరమ పదమునకుపోవ తొందరపడినచో, "దాసుని ఏలుకొనువారింకెవరున్నారు" అని, వారిని మంచిమాటలచే ఊరడించవలెను.

81 ఆశ్రిత విరోధి నిరసనార్థమై సర్వేశ్వరుడు రామ-కృష్ణాద్యవతారముల నెత్తెను. వారి యందు మనుష్యప్రతిపత్తికూడదు. అర్చా రూపములందు లోహ-కాష్ఠాధిప్రతిపత్తియు కూడదు. అటులచేసిన మాతృయోని పరీక్షా సమమై మహాపాతకమునకు కారణమగును.

82 అర్చారూపులైనట్టియు, సాక్షాత్తుగ వేంచేశి యున్నట్టియు భగవత్-భాగవత-ఆచార్యుల యందు శేషత్వ-పారతంత్ర్య స్వరూపనిష్ఠులై సర్వదా సర్వవిధ కైంకర్యములను చేయుచుండవలయును.

ఈఎనుబదిరెండువార్తలను ప్రపన్నులు ప్రతి దినము అనుసంధించుకొనుచుండవలెను. అట్టి వారికి ఇహ-పర-భోగ-ఆనందములు సంపూర్ణముగ కలుగును.

శ్రీ శ్రీ శ్రీ



| | |
|---|---|
| "శ్రీ వైష్ణవ పత్రిక" | "రామానుజ పత్రిక" |
| భక్తిప్రబోధకమగు వేదాంత మాసపత్రిక. | వేదాంత మాసపత్రిక. |
| సాలుచందా రూ 4-0-0 విడిపత్రిక 0-6-0 | సాలుచందా రూ 5-0-0 విడిపత్రిక 0-6-0 |
| చిరునామా:- శ్రీవైష్ణవపత్రిక కార్యాలయము | చిరునామా:- రామానుజపత్రిక కార్యాలయము |
| వెంటపాడు (వయా) తాడేపల్లిగూడెము | సన్నిధివీధి, కాంజీవరము. |
| పశ్చిమగోదావరి | |



# ప్రమేయశేఖరము

ముముక్షువుని : మోక్షమార్గము - ఫలానుభవము

1 నిర్హేతుకభగవత్కటాక్షము.
2 అజ్ఞాతసుకృతము.
3 అద్వేషము.
4 భగవద్భాగవతవిషయకాభిముఖ్యము.
5 త్యాజ్యోపాదేయవిభాగజ్ఞానకౌతూహలము.
6 సాత్త్వికసంభాషణము.
7 సదాచార్యసమాశ్రయణము.
8 త్యాజ్యోపాదేయనిశ్చయము.
9 ప్రాప్యాంతరవైరాగ్యము.
10 పరమప్రాప్యాభినివేశము.
11 సిద్ధోపాయస్వీకారము.
12 భగవత్ప్రాప్తిత్వర
13 సర్వేశ్వరస్మృతివిషయమగుట
14 భూతసూక్ష్మశరీరపరిగ్రహము
15 పరమాత్మ సంసర్గము
16 హార్దానుగ్రహనిరూపితమార్గవిశేషప్రకాశము
17 హృదయగుహానిర్గమనము
18 మూర్ధన్యనాడీనిష్క్రమణము.
19 అర్చిరాదిమార్గగమనము.
20 ఆదివాహికసత్కారము.
21 ఆవరణాతిక్రమణము.
22 ప్రకృత్యతిలంఘనము.
23 విరజాస్నానము.
24 సూక్ష్మశరీరవిశ్లేషము.
25 అపహతపాప్మత్వాదిగుణగణపాదుర్భావము.
26 అమానవకరస్పర్శము.
27 భగవత్సంకల్పితదివ్యదేహప్రాప్తి.
28 అకాలకాల్యదివ్యదేశప్రాప్తి.
29 ఆరంహ్రదతటస్నానము.
30 దివ్యాలంకారము.
31 దివ్యవిమానారోహణము.
32. దివ్యకాంతారప్రవేశము.
33 దివ్యాప్సరసత్కారము,
34 దివ్యగంధప్రవేశము.
35 బ్రహ్మగంధప్రవేశము.
36 అప్రాకృతగోపురప్రాప్తి.
37 దివ్యనగరప్రాప్తి.
38 సూరిపరిషత్ప్రత్యుద్గమనము.
39 రాజమార్గగమనము.
40 బ్రహ్మతేజఃప్రవేశము.
41 దివ్యగోపురప్రాప్తి.
42 బ్రహ్మవేశ్మప్రవేశము.
43 దివ్యమంటపప్రాప్తి.
44 దివ్యపారిషత్ప్రాప్తి.
45 సపత్నీక సర్వేశ్వరదర్శనము
46 స్తుతి-ప్రణామాంజలిప్రముఖసంభ్రమానువర్తనము.
47 పరమాత్మ సమీపప్రాప్తి.
48 పాదపీఠ పర్యంకారోహణము.
49 భగవదుత్సంగసంగమము.
50 ఆలోకనాలాపాద్యనుభవము.
51 ఆలింగనాద్యనుభవము,
52 స్వరూప-రూప-గుణ విగ్రహాద్యనుభవము
53 అనుభవజనిత ప్రీతిప్రకర్షము.
54 నానావిధవిగ్రహ పరిగ్రహము.
55 సర్వదేశ-సర్వకాల-సర్వావస్థోచిత సర్వప్రకారకైంకర్యము.



సత్యం వద ॥ ధర్మం చర ॥



శ్రీమతే రామానుజాయ నమః

## శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ ఆషాఢమాస పండిత పరిషత్

# ఆహ్వాన పత్రిక

శ్రీ కోదండరామస్వామివారి ఆలయమున ఒంగోలు (గుంటూరు జిల్లా)

స్వస్తి శ్రీ వికృతి నామ సంవత్సర అధిక ఆషాఢ బ ౧౦ ఆదివారము (ది. 9—7—1950 తేదీ) మొదలు వరుసగా 3 రోజులు గుంటూరు జిల్లాలోని ఒంగోలు పట్టణమందలి శ్రీ కోదండరామస్వామివారి దేవాలయమున శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ అధికాషాఢమాస పండిత పరిషత్ సభలు శ్రీ ఉ. వే. శ్రీమాన్ గోడవర్తి శఠకోపాచార్యస్వామివారి (పసలపూడి) అధ్యక్షత క్రింద జరుపబడి పెక్కురు పండితోత్తములచే వివిధ వేదాంతవిషయములు ఉపన్యసించబడును.

ప్రతిదినము ఉదయమున గం 7_30 లగాయతు 10_30 వరకున్ను సాయంకాలమున గం 4_0 లగాయతు 7_0 వరకు పండితులచే వేదాంతోపన్యాసములున్ను,

ప్రతిదినము మధ్యాహ్నమున గం 2_0 లగాయతు గం 4_0 వరకు స్త్రీలకు ప్రత్యేకము విదుషీమణులచే వేదాంతోపన్యాసములున్ను జరుపబడును.

ప్రతిదినము ఉదయమున పండితుల విడిదిలో గం 5_30 మొదలు గం 6_30 వరకు తిరువారాధనము, తీర్థప్రసాదగోష్ఠియు; పిమ్మట గం 6_30 మొదలు గం 7_30 వరకు భాగవత బృంద తిరువీధ్యుత్సవమున్ను జరుగును.

గాన తామెల్లరు ఈకార్యక్రమమున పాల్గొని ఆనందింపగోరుచున్నాము.

కేంద్రసంఘ కార్యదర్శి
తె. కం. గోపాలాచార్యులు

స. కార్యదర్శి.
ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులు

ఇట్లు,
ఆహ్వాన సంఘము

అధ్యక్షులు: చుండూరి సుబ్రహ్మణ్యం
కొండేటి వెంకటసుబ్బయ్య

ఉపాధ్యక్షులు: దేసు సుబ్రహ్మణ్యం
తాతా లక్ష్మయ్య

సంయుక్తకార్యదర్శులు: నూనె వెంకటేశ్వర్లు
పెద్దూరి వరదరాజం
పబ్బిశెట్టి వెంకటసుబ్బారావు
కొల్లిశెట్టి లక్ష్మీనరసింహం

సహాయకార్యదర్శులు: కాండూరి జగన్నాథాచార్యులు
తాతా బాలయ్య

కోశాధికారి మున్నాల వెంకటసుబ్బారావు

కార్యనిర్వాహక సభ్యులు: బియ్యపు హనుమంతరావు, గుర్రం సుబ్బారాయుడు, తాతా రాధాకృష్ణయ్య, చక్కా యతిరాజం, బియ్యపు సుబ్బారాయుడు.

## కార్యక్రమము 9-7-1950 ఆదివారము.

ఉదయము గం 5-30 తిరువారాధనము- తీర్థప్రసాద గోష్ఠి

6-30 తిరువీథ్యుత్సవము

7-30 శాంతిపాఠము. ప్రార్థన. ఆహ్వానసంఘోపన్యాసము. కార్యదర్శినివేదిక అధ్యక్షఅభిభాషణము.

శ్రీ ఉ. వే. శ్రీమాన్ శ్రీమదదంకి తిరుమల సమయోద్దండ కోలాహల లక్ష్మీనరసింహకుమార తిరువేంగడ తాతదేశికాచార్యులయ్యావాళ్లంగారు — రామానుజుల ఔదార్యము

శ్రీ ఉ. వే. శ్రీమాన్ మాహాభాష్యం తిరుమల నల్లాని చక్రవర్తుల వరదాచార్యులుగారు — శ్రీరామాయణము

శ్రీ ఉ. వే. శ్రీమాన్ తిరుమల పురిఘళ్ల వెంకటాచార్యులుగారు — కర్మయోగము

శ్రీ ఉ. వే. శ్రీమాన్ శేషభట్టరు వీరరాఘవాచార్యులుగారు — శింగరాయకొండ

మధ్యాహ్నము గం 2-0 స్త్రీలకై ప్రత్యేక సభ- శ్రీమతి నంబూరి ఆనందమ్మగారు

సాయంత్రం గం 4-0 శ్రీ ఉ. వే. శ్రీమాన్ నల్లాని చక్రవర్తుల తిరువెంకట జగన్నాథాచార్యులుగారు — జటాయువుమహారాజు

శ్రీ ఉ. వే. శ్రీమాన్ పరాశర సుదర్శన భట్టరు అయ్యావార్లంగారు

శ్రీ ఉ. వే. శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులుగారు — విశిష్టాద్వైతము

శ్రీ ఉ. వే. శ్రీమాన్ అ. చి. శ్రీమన్నారాయణాచార్యులుగారు — "నేహనానాస్తికించన"

శ్రీ ఉ. వే. శ్రీమాన్ కొమాండూరి యిళైవిల్లి శ్రీనివాస రామానుజాచార్యులుగారు

## 11-7-1950 సోమవారము

ఉదయము గం 7-30 శ్రీ ఉ. వే. శ్రీమాన్ నడాదూరి గోపాలకృష్ణమాచార్యులుగారు — భక్తి

శ్రీ ఉ. వే. శ్రీమాన్ కవిత్రయమిత్ర-విమర్శక శిరోమణి-విద్యారత్న గొట్టుముక్కల రమాకాంతాచార్యులుగారు బి. ఏ. — పంచసంస్కారములు

శ్రీ ఉ. వే. శ్రీమాన్ ఉత్పల తిరువెంగళాచార్యులుగారు

శ్రీ ఉ. వే. శ్రీమాన్ శృంగారం అప్పలాచార్యులుగారు — ద్రావిడవేదము

శ్రీ ఉ. వే. శ్రీమాన్ దాసశేషుగారు — శ్రీవైష్ణవ కర్తవ్యము

మధ్యాహ్నము గం 2-0 స్త్రీలకై ప్రత్యేక సభ - శ్రీమతి మరింగంటి రంగనాయకమ్మగారు

సాయంత్రం గం 4-0 శ్రీ ఉ. వే. శ్రీమాన్ పరమహంస పరివ్రాజకాచార్యేత్యాది సంపత్కుమార యతిరాజ జీయర్ స్వామివారు — అర్థపంచకము

శ్రీ ఉ. వే. శ్రీమాన్ అధ్యక్షులవారు- — తత్త్వత్రయము

శ్రీ ఉ. వే. శ్రీమాన్ కవిరత్న గుదిమెళ్ళ రామానుజాచార్యులుగారు — ధనుర్దాసు

శ్రీ ఉ. వే. శ్రీమాన్ శృంగారం అప్పలాచార్యులుగారు — గాయత్రీవైభవము

## 11-7-1950 మంగళవారము

ఉదయము గం 7-30 శ్రీ ఉ. వే. శ్రీమాన్ శ్రీమదదంకి తిరుమల సమయోద్దండ కోలాహల కుమార సింగరాచార్యులుగారు

శ్రీ ఉ. వే. శ్రీమాన్ కో. కం. వెం. ల. నరశింహాచార్యులుగారు — శ్రీవైష్ణవలక్షణము

శ్రీ ఉ. వే. శ్రీమాన్ న్యాయవేదాంత వాచస్పతి తె. కం. రామానుజాచార్యులుగారు — ఆశీస్సులు

శ్రీ ఉ. వే. శ్రీమాన్ కాండూరి కృష్ణమాచార్యులుగారు — ద్రావిడవేదప్రాశస్త్యము

మధ్యాహ్నము గం 2-0 స్త్రీలకై ప్రత్యేక సభ-శ్రీమతి అ. వెం. ల. నరసమ్మగారు

సాయంత్రం గం 4-0 శ్రీ ఉ. వే. శ్రీమాన్ మొలుగు రామానుజాచార్యులుగారు — సంధ్యావందనము

శ్రీ ఉ. వే. శ్రీమాన్ శాంతలూరి వెంకటాచార్యులుగారు — నవవిధసంబంధము

శ్రీ ఉ. వే. శ్రీమాన్ ఉపన్యాసకేసరి సుబోధకసుధీమణి కో.కం. రంగాచార్యులుగారు — విదురనీతి

శ్రీ ఉ. వే. శ్రీమాన్ అధ్యక్షుల అంత్యోపన్యాసము



శ్రీమతే రామానుజాయ నమః

## అత్యంత ముఖ్య ప్రకటన

"జ్ఞానేనహీనః పశుభిస్సమానః" మానవ జన్మమెత్తిన ప్రతివారికిన్ని జ్ఞానసముపార్జన అత్యంతము ఆవశ్యకమై యున్నది,

'జ్ఞానాత్ మోక్షః' మోక్షాకాంక్షికిజ్ఞానమే ప్రధాన హేతువైయున్నది. విద్యావ్యాసంగము లేనిదే జ్ఞానప్రసంగము నోనకూడదు.

అందు శ్రీవిశిష్టాద్వైతులు జగద్గురువులై భాసిల్లుటకు ప్రధానకారణము వారి విద్యావ్యాసంగమే; ప్రతిభయే.

తమజ్ఞానానుష్టాన ప్రతిభా విశేషముచే జగత్తునందంతటను జేగీయమాన యశఃకీర్తిమంతులైన భగవద్రామానుజులువారి యవతారస్థలమగు శ్రీపేరుంబూదూరునందు శ్రీశ్రీశ్రీ ఎంబారు తిరువెంకటరామానుజజీయరు స్వామి వారిచే "శ్రీఉభయవేదాంతవర్ధిని" పాఠశాల స్థాపించబడి సుమారు 60 సంవత్సరములనుండి మహామహులైన పండిత ప్రకాండులచేతను; దానకర్ణులైన శ్రేష్టివరులచేతను చక్కగా నడిపించబడుచున్నసంగతి లోకవిదితమేగదా. ఈ మధ్యనే ఈకళాశాల "వజ్రమంగళ జూబిలీఉత్సవమతివైభవముగా జరుపుకున్నది.

దేశములో నిపుడున్న, యిదివరలోయున్న పండితులందరు ఏదోవిధముగా ఈపాఠశాల సంబంధము గలవారే యనవచ్చును. ఇందు యిపుడు సాహిత్యము - అలంకారశాస్త్రము - న్యాయము - వ్యాకరణము - శ్రీవిశిష్టాద్వైత వేదాంతములు మదరాసు విశ్వవిద్యాలయ శిరోమణి, బిరుదుపరీక్షలకు శిక్షణ నొసంగబడుచున్నది.

విద్యార్థులకు ఉచితముగ బసలు-భోజనాదు సాయములు చేయబడును. యోగ్యతాను సారముగ ఉచితముగ పుస్తకములు, బహుమతులు వగైరాలుకూడ నొసంగబడును.

ఈనెలలో ఈకళాశాల తిరిగి తెరవబడు చున్నది. గాన యిందుచేరదలచినవారు వెంటనే తమ దరఖాస్తులను తమ యోగ్యతలతో సహా వ్రాసి వెంటనే ఈక్రింది చిరునామాకు పంప వలసినది.

ఎంట్రన్సు పరీక్షలో ఉత్తీర్ణులైనవారు మాత్రమే యిందు చేరవచ్చును.

శ్రీ. రావుబహదూరు. వి. రంగనాథము శ్రేష్టిగారు

కార్యదర్శి—వ్యవహర్త.

శ్రీ ఉభయవేదాంత వర్ధని కళాశాల.

27. సౌత్‌మాడ స్ట్రీటు. తిరువళిక్కేణి, మదరాసు.

తూర్పుగోదావరిజిల్లా కాకినాడపురవాస్తవ్యులైన శ్రీమాన్ వంగిపురం వెంకటరంగాచార్యులుగారు ది 19-5-1950 తేదీని జరిగిన తమ జ్యేష్ఠకుమారుని ఉపనయన మహోత్సవమున శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు రూ 5-0-0 ను సమర్పించిరి.

వీరికి శ్రియఃపతి సమస్త శ్రేయస్సుల సమకూర్చుగాక.

తూర్పుగోదావరిజిల్లా అనపర్తి గ్రామకాపురస్థులైన శ్రీమాన్ నల్లానిచక్రవర్తుల ఆప్పలాచార్యులుగారు తమ జ్యేష్ఠ కుమారుని శోభన కార్యమహోత్సవ సందర్భమునను; తమ రెండవ కుమారుని ఉపనయనమహోత్సవ సందర్భమున శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు రూ 5-0-0ను సమర్పించిరి. వీరికి శ్రియఃపతి సమస్త శ్రేయస్సుల సమకూర్చుగాక.

తూర్పుగోదావరిజిల్లా అర్తమూరు గ్రామస్థులగు ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులుగారు 5-6-1950 తేదీని తమకుమార్తెయొక్క శుభకార్య మహోత్సవమున శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు రూ 5-0-0ను సమర్పించిరి. వీరికి శ్రియఃపతి సమస్త శ్రేయస్సులను సమకూర్చుగాక.

శ్రీమాన్. జి. వి. ఏల్. నరశింహాచార్యులుగారు. బి. ఏ. (స్పెషలు ఫస్టు క్లాసు మేజస్ట్రీటు తాడేపల్లిగూడెం) కుమారుడు వెంకటేశ్వరునకున్ను మొక్కులుతిప్ప వాస్తవ్యులు శ్రీమాన్ ఎస్. ఎస్. వి. రంగాచార్యులు బి. ఏ. గారి కుమార్తె చి. సౌ. కుముదవల్లి తాయారునకున్ను జరిగిన వివాహ సందర్భమున వధూవరుల యిద్దరి తరఫున చేరి నాలుగు రూపాయలు చొప్పున శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు సమర్పించిరి.

వీరికి శ్రియఃపతి సమస్త శ్రేయస్సులను సమకూర్చుగాక.

గుంటూరుజిల్లా కొర్నిపాడు గ్రామస్థులగు శ్రీమాన్ చిగురుపాటి వెంకటశివరామయ్యగారి కుమార్తె చి. సౌ. కాంతిమతిదేవి అన్నప్రాశన మహోత్సవమున శ్రీవిశిష్టాద్వైతప్రచారక సంఘమున రూ 2-0-0 సమర్పించిరి. వీరి సర్వేశ్వరుడు సకల సన్మంగళముల సమకూర్చుగాక.

కాకినాడ వాస్తవ్యులగు శ్రీమాన్ గుడిమెట్ల వెంకటరాజుగారు తమకుమార్తెయొక్క వివాహ మహోత్సవమున శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు రూ 10-0-0 లును సమర్పించిరి. వీరికి, నూతనవధూవరులకున్ను శ్రియఃపతి సమస్త శ్రేయస్సులను సమకూర్చుగాక.

(21 వ పేజీ తరువాయి)

తూర్పుగోదావరిజిల్లా చేబ్రోలు గ్రామస్థులగు శ్రీమాన్ ములుకూరి వెంకయ్యగారు తమ కుమారుని వివాహ మహోత్సవమున శ్రీవిశిష్టాద్వైతప్రచారకసంఘమునకు రూ5-0-0ను సమర్పించిరి. వీరికి శ్రియఃపతి సమస్త శ్రేయస్సులను సమకూర్చుగాక.

అర్తమూరు గ్రామమునందలి శ్రీ యతిరాజ ఉభయవేదాంత పాఠశాలలో శ్రీ వచన భూషణ కాలక్షేపచాత్తుమొలు ఉత్సవమున శ్రీవిశిష్టాద్వైతప్రచారక సంఘమునకు శ్రీశ్రీశ్రీ పరహంస పరివ్రాజకాచార్యేత్యాది శ్రీసంపత్కుమార యతిరాజ జీయరుస్వామివారు రూ 3-0-0లు బహుమతిగ సమర్పించిరి. శ్రీచిన్నం ఆదమ్మగారు రూ 1-0-0 సమర్పించిరి. వీరికి మా హృదయపూర్వక కృతజ్ఞతా వందనములు.



(23 వ పేజీ తరువాయి)

| | |
|---|---|
| వీరా ఆదిలక్ష్మమ్మగారు | 2-0-0 |
| అక్కం సత్యంగారు | 2-0-0 |
| శిరం అప్పారావుగారు | 2-0-0 |
| ఒకభక్తురాలు | 2-0-0 |
| కొండూరి రామారావు | 2-0-0 |
| తవ్వా గోపాలకృష్ణమూర్తిగారు | 2-0-0 |
| మాజేటి సుబ్రహ్మణ్యంగారు | 1-0-0 |
| కూరపాటి సీతారామదాసుగారు | 1-0-0 |
| బొమ్మగంటి కృష్ణవేణమ్మగారు | 1-0-0 |
| ఒకభక్తురాలు | 1-0-0 |
| వెరశి | 1206-0-3 |

1. మానంవెంకట్రామయ్యచౌదరిగారు బ 2½ బియ్యం
2. పుమ్మా సత్యన్నారాయణగారు పే 24 పెసరపప్పు
   పే 24 కందిపప్పు
3. మానుపల్లి రంగనాయకులుగారు మ 2 బెల్లం
4. తణుకువాస్తవ్యులు ఒక మూటె ఉప్పు
5. మాజేటి సుబ్బయ్యగారి భార్య వెంకటరత్నమ్మగారు మ 1 బెల్లం
6. కూరగాయల వర్తక సంఘంవారు 4 రోజులకు సరిపడు కూరగాయలు

—♦ జమా-ఖర్చుల వివరం ♦—

జమ

1206-0-3 చందాల వసూలు.

10-6-0 మిగిలిన సరుకులు అమ్మకం.

1216-6-3 వెరశి.

ఖర్చులు

| | |
|---|---|
| పండిత సన్మానములకు, మఠస్వాములకు అర్పణచేసింది రూ | 726-0-0 |
| నాల్గురోజులకు తదియారాధన రూ | 499-11-0 |
| ఖర్చు మొత్తం | 1225-11-0 |
| జమ | 1216-6-3 |
| వేసిన్న ఖర్చు | 9-4-9 |

9-4-9 జమ సలాది కృష్ణానందరావుగారు ఇచ్చినది.

పశ్చిమగోదావరిజిల్లా ఏలూరుపట్టణమున శ్రీవిరోధినామసంవత్సరమున జరిగిన శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ మాఘమాస పండిత పరిషత్సభల జమా-ఖర్చుల వివరము.



పండిత సభలకు చందాలు ఇచ్చినవారి పేర్లు

| | |
|---|---|
| శ్రీమోతే నరశింహారావు జమీందారుగారు | 100-0-0 |
| సలాది విజయలక్ష్మి, మట్టపల్లి అనసూయమ్మగార్లు | 58-0-0 |
| సలాది రాయారమ్మగారు | 58-0 0 |
| కంభంపాటి అన్నపూర్ణమ్మగారు | 58-0-0 |
| కందుల అన్నపూర్ణమ్మగారు | 58-0-0 |
| చీమకుర్తి వెంకటమ్మగారు | 58-0-0 |
| సున్నా సత్యదత్తాత్రేయమూర్తిగారు | 58-0-0 |
| మద్దుల కనకదుర్గాంబగారు | 58-0-0 |
| వేత్సా చిట్టియ్యగారు | 58-0-0 |
| మోతే కృష్ణారావు జమీందారుగారు | 50-0-0 |
| మోతే అంజరత్నరాజకుమార్ జమీందారుగారు | 50-0-0 |
| ప్ర॥ భం॥ కృ॥ వీరరాఘవాచార్యులు, ,, ,, శ్రీరంగాచార్యులుగార్లు | 50-0-0 |
| ఈదర వెంకటాద్రిపుగారు | 50-0-0 |
| మోతే నారాయణరావు జమీందారుగారు | 35-0-0 |
| గ్రంధి ఆంజనేయులు, కనిగొళ్ళ ప్రకాశరావుగార్లు | 25-0-0 |
| కొండూరి శేషమ్మగారు | 25-0-0 |
| కొత్తమాసు శీతారామయ్య అండ్ సన్సు | 25-0-0 |
| కనిగొళ్ళ శివలక్ష్మినారాయణ, మద్దుల నారాయణగార్లు | 20-0-0 |
| లక్కింశెట్టి వెంకటసుబ్బారావుగారు | 20-0-0 |
| మోతే వెంకటసుబ్బమ్మగారు | 15-0-0 |
| బూర్లగడ్డ వెంకట కృష్ణయ్య సన్ రంగరాజుగారు | 11-0-0 |
| పంకిపాటి రంగారావు, నారాయణరావుగార్లు | 10-0-0 |
| నందూరి ఆనందమ్మగారు | 10-0-0 |
| యెల్లపల్లి శేషయ్యగారు | 10-0-0 |
| చలువాది నాగభూషణంగారు | 10-0-0 |
| శ్రీమాన్ కందాడై వెంకటకృష్ణమాచార్యులుగారు | 10-0-0 |
| మా॥ భూ॥ శ్రీనివాస శఠగోపాలాచార్యులుగారు | 10-0-0 |
| పచ్చిపులుసు వెంకయ్యగారు | 10-0-0 |
| పేసిపాటి రామానుజాచార్యులుగారు | 10-0-0 |
| ఒకభక్తురాలు | 10-0-0 |
| కనిగొళ్ళ జనార్దనగుప్తగారు | 10-0-0 |
| పోలిశెట్టి గోపాలస్వామి | 10-0-0 |
| రేపాక శేషావతారం, రంగయ్యగార్లు పాలకొల్లు | 8-0-0 |
| కొండూరి లక్షమ్మ, కోచిలాంచిగార్లు | 6-0-0 |
| కొమండూరి సంపత్‌కుమార గోవిందాచార్యులుగారు | 5-0-0 |
| అప్పనయినాచార్యులుగారు | 5-0-0 |
| కొల్లిపర వెంకటేశ్వరరావుగారు | 5-0-0 |
| బూర్లగడ్డ సత్యన్నారాయణగారు | 5-0-0 |
| వార్ని సభాపతిగారు | 5-0-0 |
| పాలేటి నరశింహారావుగారు | 5-0-0 |
| చుండూరి రాధాకృష్ణమూర్తిగారు | 5-0-0 |
| పోలిశెట్టి నారాయణరావుగారు | 5-0-0 |
| ఎక్కిరాల నరసమ్మగారు | 5-0-0 |
| కొల్లిపర పుండరీకాక్షుడుగారు | 5-0-0 |
| ఒకభక్తురాలు | 5-0-0 |
| ఈదర వెంకయ్యగారు | 5-0-0 |
| నల్లాని చక్రవర్తుల కృష్ణ అయ్యంగారు | 5-0-0 |
| డింగిరి నరశింహాచార్యులుగారు | 5-0-0 |
| కందుల సుందర శివరావుగారు | 5-0-0 |
| పచ్చిగొళ్ళ సుబ్బారావుగారి భార్య వర్ధనమ్మగారు బెజవాడ | 5-0-0 |
| డిటో వారి కుమార్తె పుల్లమ్మగారు | 5-0-0 |
| బొమ్మగంటి రామానుజాచార్యులుగారు | 5-0-0 |
| పెద్దింటి శీతారామానుజాచార్యులుగారు | 5-0-0 |
| మోటమఱ్ఱి మల్లికార్జునరావుగారు | 5-0-0 |
| కొత్తమాసు శ్రీమన్నారాయణమూర్తిగారు | 5-0-0 |
| సాతులూరి వెంకటకృష్ణమాచార్యులుగారు | 4-0-0 |
| సుగ్గిశెట్టి వెంకటరత్నంగారు | 4-0-0 |
| బూరిశెట్టి శౌందర్యమ్మగారు | 4-0-0 |
| తాటికొండ రత్నంగారు | 4-0-0 |
| బొత్తుగంటి సుభద్రమ్మగారు | 3-0-0 |
| కూరపాటి శంకరయ్యగారు | 2-0-0 |

(తరువాయి 22 వ పేజీలో)

## సన్మానములు.

అత్తమూరు గ్రామమునందు శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము తరిఫున పంచసంస్కారముల నొందిరి. ఏతన్మహోత్సవమున ఈ సంఘమునకు రూ 8-0-0 లను సన్మానముల సమర్పించిరి.

వీరి భగవద్భాగవతాచార్య కైంకర్య నిరతి ఇతోధికముగ వృద్ధినొందుగాక.

### మైలవరము

కృష్ణాజిల్లా మైలవరము గ్రామములోని శ్రీమాన్ గోపవరం శేషాచార్యులుగారు శ్రీభక్తినివేదన పత్రికకున్ను; శ్రీవిశిష్టాద్వైతప్రచారక సంఘమునకున్ను రూ 25-0-0 విరాళమును సమర్పించిరి వీరికి శ్రీయఃపతి సమస్త శ్రేయస్సులను సమకూర్చుగాక.

  

### చీరాల

గుంటూరుజిల్లా చీరాల గ్రామములో ది 13-6-1950 తేదీ నుండి జరిగిన శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ జ్యేష్ఠమాస పండితపరిషత్ సందర్భమున అచ్చటి ఆహ్వానసంఘమువారు శ్రీవిశిష్టాద్వైత ప్రచారమునకై రూ 58-0-0ను సమర్పించిరి వీరి శ్రీవైష్ణవశ్రీ ఇతోధికముగ నభివృద్ధి జెందుగాక.

  

### మైలవరం

కృష్ణాజిల్లా మైలవరము గ్రామములోని శ్రీ శ్రీ శ్రీ సూరపునేని నరసమంగయ్యమ్మ బహద్దరు జమీందారిణిగారు శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు సుమారు రూ 400-0-0 లు ఖరీదుగల నాంప్రదాయ గ్రంథరాజములను; తాత్కాలిక విరాళముగ రూ 40-0-0ను సమర్పించిరి.

వీరి భగవద్భాగవతాచార్య కైంకర్య నిరతి ఇతోధికముగ వృద్ధినొంది శ్రియఃపతి కటాక్ష పాత్రులగుదురుగాక.



రిజిష్టరు నెం. 5049.

Book-Post

భక్తి "నివేదన" వేదాంత మాసపత్రిక అర్తమూరు, (వయా) ద్వారపూడి తూర్పుగోదావరి జిల్లా.

# భక్తి నివేదన

(వేదాంత మాసపత్రిక)

ఇందు వేదాంత విషయ రాజములున్ను;
భక్తిప్రచార విషయమైన వార్తలున్ను;
వేదాంత సాంప్రదాయ విషయకమైన ప్రశ్నో
త్తరములున్ను ప్రచురింపబడును.

## చందాలు:

| | | |
|---|---|---|
| సాధారణ చందా | సం. 1 కి | రు. 5-0-0 |
| సహాయ చందా | ,, | రు. 10-0-0 |

## విశేషములు:

| | | |
|---|---|---|
| పోషకులు | సం. 1 కి | రు. 25-0-0 |
| రాజపోషకులు | ,, | రు. 58-0-0 |
| మహారాజ పోషకులు | ,, | రు. 116-0-0 |

## కార్యాలయము:

"భక్తి నివేదన" కార్యాలయము,
అర్తమూరు (వయా) ద్వారపూడి.
తూర్పు గోదావరి జిల్లా.

Edited printed & published by A. ch. Srimannarayana charya, at Sriman press, Artamuru, E. G. Dt.

శ్రీమతే రామానుజాయ నమః



# శిన్నియమ్మాళ్ళు అధ్యవసాయము.

(శ్రీమన్నారాయణ.)

శిన్నియమ్మాళ్ అను నామె మహాప్రపన్నురాలు. ఈమె ఒకనాడు వానమమ్మలై జీయరును సేవించుటకై వెళ్లెను. అప్పుడు జీయరు తామర కొలనులో స్నానమాచరించ బోవు చుండిరి. శిన్నియమ్మాళ్ జీయరుకు దండము సమర్పించి నిలిచెను. అప్పుడు వారిద్దరికి జరిగిన సంభాషణ చాల హృద్యంగమైనది. ప్రపన్నులందరు ముఖ్యముగ తెలుసుకొనవలశినదియున్న అయి యున్నది.

జీయరు:— అమ్మాయి! మీదేశమేది? నిత్యనివాస ప్రాంతమేది?

శిన్నియమ్మాళ్:— స్వామి! మాది తిరువడుది దేశము. (నమ్మాళ్వార్లు అవతరించిన దేశము.)

జీయరు:— ఊరుపేరేమి?

శిన్నియమ్మాళ్:— "తిరుక్కురుగూరు" మావూరు.

జీయరు:— ఇల్లు ఎచ్చట?

శిన్నియమ్మాళ్:— "పండుడైయార్ పెరుమాళ్ళు వేంచేశియున్నదే మాయిల్లు

జీయరు:— మీకులమేమి?

శిన్నియమ్మాళ్:— మాకులము "అచ్యుతకులము"

జీయరు:— మీవేదమేది?

శిన్నియమ్మాళ్:— మాది ద్రావిడ వేదము.

జీయరు:— మీగోత్రమేమి?

శిన్నియమ్మాళ్:— మాది పరాంకుశగోత్రము.

జీయరు:— మీసూత్రమేమి?

శిన్నియమ్మాళ్:— మాది రామానుజసూత్రము.

జీయరు:— మీకారికయేది?

శిన్నియమ్మాళ్:— మాది పరకాల కారిక.

జీయర్:— మీ కుడిఏమి?

శిన్నియమ్మాళ్:— మాది అంజుకుడి. (భగవంతుని యందలి అత్యంత ప్రేమచే ఆయన సౌందర్యాదులకు భయపడి మంగళా శాసనము చేయుకుడి.)

జీయరు:— మీబంధువులెవరు?

శిన్నియమ్మాళ్:— ఆత్మబంధువులే మాబంధువులు. (ప్రపన్నులకు ప్రపన్నులే ఆత్మబంధువులు.)

జీయరు:— మీస్నేహితులెవరు?

శిన్నియమ్మాళ్:— పరిపూర్ణమైన అర్థపంచకజ్ఞానముగల భక్తులు మాస్నేహితులు.

జీయరు:— మీకిష్టులైనవారెవరు?

శిన్నియమ్మాళ్:— మీఅంతరంగికదాసులు మాకిష్టులు.

జీయరు:— మీతండ్రిగారెవరు?

శిన్నియమ్మాళ్:— మాతండ్రి దేవనాయకుడు. (వానమామలై వేంచేసియున్న పెరుమాళ్ళు.)

జీయరు:— మీతల్లిగారెవరు?

శిన్నియమ్మాళ్:— మాతల్లి శ్రీవరమంగైయమ్మ (వానమామలైలో వేంచేశియున్న పిరాట్టియార్)

జీయరు:— మీరు వెళ్ళు స్థలమేది?

శిన్నియమ్మాళ్:— వానమామలై మాగమ్యస్థానము.

జీయరు:— మీభర్తగారెవరు?

శిన్నియమ్మాళ్:— వరమంగై మామునివన్ మాభర్తగారు.

జీయరు:— మీమామగారెవరు?

శిన్నియమ్మాళ్:— కాంతోపయంతులుమా మా మగారు.

జీయరు:— మీ ఉద్యోగమేమి?

శిన్నియమ్మాళ్:— భాగవత కైంకర్యమే మాకుపని?

జీయరు:— దానివలన ప్రయోజనమేమి?

శిన్నియమ్మాళ్:— కైంకర్యమే ప్రయోజనము.

జీయరు:— మీయధికారమేమి?

శిన్నియమాళ్ళు:— సర్వాధికారమే. (ప్రపత్తిచేయుటే) మాయధికారము.

జీయరు:— మీనిష్ఠయేది?

శిన్నియమ్మాళ్ళు:— మానిష్ఠ పంచమోపాయనిష్ఠ (ఆచార్యనిష్ఠ)

జీయరు:— మీఉపాయమేది?

శిన్నియమ్మాళ్ళు:— మాది చరమోపాయము (ఆచార్యాభిమానము)

జీయరు:— మీకేది యభిమానము?

శిన్నియమ్మాళ్ళు:— మాయభిమానము భాగవతాభిమానము.

జీయరు:— మీప్రార్థనయేమి?

శిన్నియమ్మాళ్ళు:— కైంకర్య ప్రార్థనే మాప్రార్థన.

అప్పుడు ఆశిన్నియమ్మాళుయొక్క అధ్యవసాయమునకు శ్రీవైష్ణవశ్రీకి వానమామలైజీయరు చాల సంతోషించి ఆమెకు మోక్షమిచ్చునటుల శ్రియఃపతిని ప్రార్థించిరి. ఈసంభాషణలోని భావములను మనము జ్ఞాపకముంచుకొని అనుష్ఠానమునందుంచు కొనవలశినవై యున్నవి.



అస్మద్గురుభ్యోనమః



శ్రీమతేరామానుజాయనమః

## —: భక్తి - ప్రపత్తులు :—

శ్రీమన్నారాయణ.

మోక్షమును పొందగోరు వారికి భక్తియోగమే అవలంబనీయమని కొందరున్ను, ప్రపత్తి యోగమే శరణ్యమని కొందరున్ను తెలుపుచున్నారు.

శిష్టాచారము ననుసరించి ఏది మనకు అవలంబనీయమో నిశ్చయించు కుందమన్న అందు కూడ ఇట్టి వివాదమే ద్యోతకమవుచున్నది. జగదాచార్యులై మోక్షమార్గనిర్ధారణసిద్ధాంత సంస్థాపకాచార్యవర్యులైన భగవద్రామానుజులవారు బ్రహ్మసూత్రములకున్ను; వానికి మూలములగు ఉపనిషత్తులు-భగవద్గీతలకున్నుకూడ భక్తియోగ పరముగనే వ్యాఖ్యానమును సాయించిరి. మరియు శ్రియఃపతి విషయమున శరణాగతిని విన్నవించిరి.

శ్రీరామానుజపదానుయాయిలున్ను లోకాచార్యులున్ను అయిన పిళ్లై లోకాచార్యులు వారు, భగవద్రామానుజులు భక్తిపరముగ వ్యాఖ్యానించిన గీతాచరమశ్లోకమునకే ప్రపత్తిపరముగ వ్యాఖ్యానించిరి.

మరియు తిరువాయిమొడి యొక్క రెండవ దశక వ్యాఖ్యానములో భగవద్రామానుల వారు ప్రపత్తిపరముగ మొదట వ్యాఖ్యానించిన వానికే తరువాత (శ్రీభాష్యాదుల సాయించిన పిమ్మట) భక్తిపరముగ వ్యాఖ్యానము సాయించినటుల నంబిళ్ళగారు తెలుపుచున్నారు.

అయితే యిందులకు కారణమేమి?

భక్తి-ప్రపత్తులనునవి కేవలము పరస్పర విరుద్ధములగు యోగములుకావు. ఒకే యోగమునకు రెండు దశావిశేషములు. ఒకటి ప్రారంభదశ; రెండవది పరిపక్వదశ. ఇంతే.

ఒకే వ్యక్తికి బాల్య-వృద్ధాప్య అవస్థలయందు; వ్యక్తి ఒక్కడే అయినను నామధేయ-స్వరూప-స్వభావ-అధికార-అంగ- ఆపేక్షిక-ఫల- విశేషాదులయందు వైలక్షణ్యముండునటులనే భక్తి-ప్రపత్తులకు కూడ అవస్థావిశేషముల ననుసరించి పరస్పర వైలక్షణ్యములున్నవి. అంతేగాని పరస్పర విరుద్ధము లెంతమాత్రమున్ను కావు. ప్రత్యుతపరస్పర సహకారులే.

వీటిని విధించుటలో అధికారులయొక్క_ తారతమ్యముల ననుసరించియు, శక్తి_అశక్తుల ననుసరించియు, విజ్ఞులగు శిష్టులు వివిధమార్గములను అనుసరించి యున్నారు.

అందుచే భగవద్రామానుజులవారికి భక్తియందే తాత్పర్యముగాని ప్రపత్తియందు కాదనిగాని; శ్రీనంబిళ్ళై_పిళ్ళైలోకాచార్యులు ప్రభృతులకు ప్రపత్తియందే ఆదరణగాని భక్తియందు లేదనికాని చెప్పతగదు.

ప్రస్థానత్రయమునకు భక్తిపరముగ వ్యాఖ్యానమును వ్రాసిన భగవద్రామానుజుల వారు గద్యత్రయము చేతను శరణాగతిని ఏల యాచరించిరి?

ద్రావిడవేదాంతము నంతకు ప్రపత్తిపరముగ వ్యాఖ్యానమును సాధించిన శ్రీనంబిళ్ళై_పిళ్ళైలోకాచార్యులు_పెరియవాచ్చాంబిళ్ళై మున్నగు సత్సాంప్రదాయ ప్రవర్తకులు తమ వ్యాఖ్యానములకు భగవద్రామానుజుల ప్రస్థానత్రయ వ్యాఖ్యానములనే పరమ ప్రమాణముగ తీసుకొనిరి.

ప్రపత్తిశాస్త్ర పారావార పారంగతులైన శ్రీమణవాళ మహామునులకు యతీంద్ర ప్రవణులనేగదా బిరుదు నామము.

మననిత్య చాత్తుమొలులోకూడ "రామానుజార్యదివ్యాజ్ఞావర్థతాం" అని ప్రారంభించి "మణవాళమామునియే ఇన్నుమొరు నూత్తాండిరుం" అని అనుసంధించుట ఆనూచానాచారమై యున్నది కదా.

వారు లోకోద్ధారకులున్ను_ఉపదేశకర్తలున్ను గాన ప్రపంచ_జ్ఞాన_నాడీ_నిదానమును నిదానించి తాపత్రయాతురులు సంసార_వ్యాధికి తగిన ఉపదేశరూపౌషధముల ప్రసాదించిరి.

భక్తి_ప్రపత్తులకు గల వైలక్షణ్యములు సంగ్రహముగా ఈక్రింద తెలుపబడుచున్నవి.

బుద్ధిమంతులగువారు తమకుచితమైన వాటిని స్వీకరించి సేవించి తరించి లోకము నుద్ధరింతురు గాక.

| | |
|---|---|
| సాంగముగ వేద_వేదాంతముల | ఆకించన్యత్వ |
| పరిపూర్ణముగ అధ్యయనముచేసిన | అనన్యగతిత్వ |
| వారై, పూర్వోత్తరమీమాంసముల | రూపధర్మవిశిష్టులై |
| పరిచయముచే చిదచిద్విలక్షణుడై | భగవరితుని |
| అనవధికాతిశయానందరూపుడై | నాశ్రయించిన |
| నిఖిలహేయప్రత్యనీకుడై_సమస్త | వారు ప్రపన్నులు. |

కల్యాణగుణాత్మకుడైన బ్రహ్మను
తెలుసుకొని, ఆయనను పొం
దుటకు సాంగమైన భక్తినే
సాధనముగా స్వీకరించి తద్వారా
మోక్షమును పొందదలచిన
వారు భక్తులు.
వ్యాసాంబరీష-శుక-శౌనక-దాల్భ్య-
నారద-శాండిల్యాది ప్రభృతులు.

శ్రీగోదా-పరాంకుశ-
పరకాల-నాథ-
యామున-యతివర,
యతీంద్రప్రవణ
ప్రముఖులు.

| భక్తి | ప్రపత్తి |
|---|---|

★ నామధేయములు :

| | |
|---|---|
| 1. భక్తి; ధ్యానము; ఉపాసనము; వేదనము; ప్రీతిరూపాపన్న-దర్శనసమానాకార జ్ఞాన విశేషము. | ప్రపత్తి; న్యాసము; భరన్యాసము; న్యాసవిద్య; శరణాగతి; సాధ్యభక్తి; ఫలభక్తి; నవవిధ సంబంధ స్మరణపూర్వక-స్వసర్వస్వభార సమర్పణరూప జ్ఞాన విశేషము. |

★ స్వరూపము :

| | |
|---|---|
| 2. ప్రారంభ-స్థితి-విశేషము. | అంతిమ-స్థితి-విశేషము. |
| 3. ప్రవృత్తిపరమైనది. | నివృత్తిపరమైనది. |
| 4. సాధన స్వరూపము. | సాధ్య స్వరూపము. |
| 5. ఉపాయకోటి ప్రవిష్టమైనది. | ఉపేయకోటి ప్రవిష్టమైనది. |
| 6. కర్మవిశేష స్వరూపము. | జ్ఞానవిశేష స్వరూపము. |
| 7. ఉపాయోపాయములలో వైరూప్యము గలది. (భక్త్యాత్మక-గుణభూతమైన జ్ఞానశేషము ఉపాయమున్ను; గుణియైన భగవంతుడు ఉపేయముగాను గలది.) | ఉపాయోపాయములలో సారూప్యము గలది. (భగవంతుడే ఉపాయము; భగవంతుడే ఉపేయముగాను గలది.) |
| 8. చేతన సహజస్వరూపమైన ప్రేమయొక్క ప్రారంభదశ. | చేతన సహజస్వరూపమైన ప్రేమయొక్క పర్యవసాన దశ. |

| | | |
|---|---|---|
| 9. | భగవద్భక్తులయెడ వాత్సల్యము కలిగియుండుట, భగవత్పూజయందంగీకారము కలిగియుండుట భగవంతునిస్వయముగ పూజించుచుండుట డంబములేకుండుట, భగవచ్చరిత్ర శ్రవణమున ఆశక్తి కలిగియుండుట, సర్వదా భగవంతుని స్మరించుచుండుట, భగవంతుని విడిచి క్షణకాలము బ్రతుక లేకుండుట, అనుఎనిమిది విధానములతోకూడుకున్నది స్వభావము. | భగవద్విషయమున అనుకూలసంకల్పముండుట' భగవద్విషయమునకు ప్రతికూలమైన వానిని విసర్జించుట, భగవంతుడే రక్షించునను మహావిశ్వాసము కలిగియుండుట, భగవంతునే రక్షకునిగా వరించుట, భగవంతునికే ఆత్మసమర్పణముచేయుట, కార్పణ్యము. (నిర్వేదము) కలిగియుండుట, అను (అయిదు) ఆరు విధానములతో కూడుకున్నది. |
| 10. | యమ–నియమ–ఆసన–ప్రాణాయామ. ప్రత్యాహార–ధాన్య–దారణ–సమాదిరూప అష్టాంగయోగయుక్తమై తైలధారవదవిచ్ఛిన్నస్మృతి సంతానరూపమైనది. | మహావిశ్వాసరూప జ్ఞానాత్మకమైనది. |
| 11. | అసకృత్కర్తవ్యమైనది. | సకృత్కర్తవ్యమైనది. |
| 12. | యత్కించిత్ అహంకార గర్భితమైనది. | కేవలయాచ్ఞాగర్భితమైనది. |
| 13. | కర్తృత్వ–భోక్తృత్వ–జ్ఞాతృత్వముల స్వాశ్రితునకు కలిగించునది. | కర్తృత్వ–భోక్తృత్వ–జ్ఞాతృత్వముల స్వాశ్రితునికి లేకుండగ జేసి భగవంతునియందు కలిగించునది. |
| 14. | స్వార్థైకవేషముగలది. | పరార్థైకవేషముగలది. |
| 15. | జీవస్వరూప.స్వభావ–అననుగుణమైనది. | జీవస్వరూప–స్వభావ–అనుగుణమైనది. |
| 16. | త్రికరణములకు క్లేశ సాధ్యమైనది. | సుకరము–సుసుఖము–సులభము–ఆయినది. |
| 17. | దుశ్శకమైనది. | సుశకమైనతి. |
| 18. | స్వ–పర–జ్ఞాన గర్భితమైనది. | పరార్థైక వేషమైన దగుటచే పరజ్ఞానమే గాని'స్వ'జ్ఞానము లేనిది. |
| 19. | ద్వైతభావ విశిష్టమైనది. | అద్వైతభావాత్మకమైనది. |
| 20. | స్వస్వరూపాతిరిక్తమైనది. | స్వస్వరూపప్రయుక్తమైనది. |
| 21. | స్వతంత్రజ్ఞానగర్భితమైనది. | అత్యంతపారతంత్ర్యజ్ఞానగర్భితమైనది. |

★ అధికారి.

| | |
|---|---|
| 22. త్రైవర్ణికుడై, అందును, పురుషుడై, అందును ఉపనీతుడై, అందును సాంగ వేదాధ్యయన సంపన్నుడై, అందును పరమహంసాది సన్యాసియై, అందును అనవరతభగవన్నిష్ఠుడైన వానికి గాని అవలభించుటకుగాని ఫలించుట గాని లేనిది. | ఆకించన్యత్వ - అనన్యగతిత్వములుగల స్వేదజ-అండజ ఉద్భిజ-జరాయుజమను నాలుగురకముల ప్రాణిమాత్రులు, స్త్రీపురుష బేధము లేకుండగ బ్రాహ్మణాది నాలుగువర్ణస్థులు; బ్రహ్మచర్యాది నాలుగు ఆశ్రమస్థులు; బాల్యాది నాలుగు అవస్థలవారు; ధర్మాది నాలుగు పురుషార్థములు కోరువారికి అభీష్టముల ఫలింపజేయునది. |
| 23. మిశ్ర సత్త్వాధికారకమైనది. | శుద్ధ సత్త్వాధికారమైనది. |
| 24. శక్తికలవానిచే మాత్రమే అవలంభించ తగినది. | అశక్తునిచే కూడ అవలంభించ తగినది. |

★ అంగములు :

| | |
|---|---|
| 25. వివేకము-విమోకము- అభ్యాసము-క్రియ-కల్యాణము - అనవసాదము - అనుద్ధర్షము గలది. | ఆకించన్యత్వము - అనన్యగతిత్వము అను ధర్మ ద్వయము గలది. |

★ అపేక్షితములు :

| | |
|---|---|
| 26. కర్మము-జ్ఞానము అను అంగసాపేక్ష గలది. | అంగసాపేక్ష రహితమై స్వతంత్ర ఫలప్రదమైనది |
| 27. అంతిమస్మృత్యపేక్షగలది. | అంతిస్మృత్యపేక్ష లేనిది. |
| 28. అర్చిరాది మార్గగమన నియమాపేక్షగలది. | భగవదిచ్ఛానుసార మార్గమే గాని అర్చిరాది మార్గమేయను నియమము లేనిది. |
| 29. సాంగవేదాధ్యయన సాపేక్షితమైనది. | స్వస్వరూప - పరస్వరూప - ఉపాయస్వరూప - ఉపేయస్వరూప - విరోధి స్వరూప రూపఅర్థ పంచక జ్ఞానమున్నచో సరిపోవునది. |
| 30. దేశ నియమము; కాలనియమము; ప్రకార నియమము; ఫలనియమము గలది. | విషయనియమము ఒక్కటియేతప్ప దేశ-కాల-ప్రకార-ఫలనియమాదులేవియు లేనిది. |
| 31. చిరకాల సాధ్యమైనది. | ఇచ్ఛాకాలమాత్ర సాధ్యమైనది. |
| 32. చేతన ప్రయత్న సాపేక్షితమైనది. | చైతన్య ప్రయత్నమాత్ర సాపేక్షితమైనది. |

★ ఫలవిశేషములు.

| | |
|---|---|
| 33. ఉత్తర-పూర్వాఘముల మాత్రము నశింపచేయజాలినది. ప్రారబ్ధమును నశింపచేయలేనిది. | ఉత్తర పూర్వాఘములను ప్రారబ్ధమును కూడ పూర్తిగ నశింపచేయచాలినది. |
| 34. ప్రారబ్ధప్రాప్త శరీరముల అవసానమందే గాని మోక్షప్రాప్తిలేనిది. | ఆర్తుడైనచో ఈశరీరావసానమందే మోక్షమును పొందించ జాలినది. |
| 35. ఫలవేళయందు ఆనందకరమైనది. | ప్రారంభము నుండియు కూడ సర్వదా ఆనందకరమైనది. |

★ విశేషములు.

| | |
|---|---|
| 36. మోక్షప్రాప్తివరకు ఆవృత్తిచేయుచునే యుండవలసినది, | ఒకపర్యాయము మాత్రమే చేయవలసినది. |
| 37. వేదపురుషునిద్వారా విస్తారముగ విధించబడినది. శాస్త్రపఠనాదుల వలన తెలియబడినది. | వేదవేద్యునిచే సాక్షాత్తుగ విధి-అనుష్ఠానములు గలది. గురుముఖతః రహస్యాది శాస్త్రముల యందు సత్యాంప్రదాయ పూర్వకముగ మాత్రము తెలియబడునది, |
| 38. పరభక్తి- పరజ్ఞానము- పరమాభక్తి యను విభాగత్రయము గలది. | దృప్తప్రపత్తి-ఆర్తప్రపత్తియను విభాగద్వయము గలది. |
| 39. ప్రపత్తికి అంగము. | భక్తికి అంగి. |
| 40. వివేకాది సాధన సప్తక జన్యమైనది. | భగవత్కృపా జన్యమైనది. |



# శ్రీ విశిష్టాద్వైతము

శ్రీమన్నారాయణ



శిష్యుడు:- ఆచార్యా! విశిష్టాద్వైతము అనగా నేమి? దాని మూలసిద్ధాంతమేమి?

గురువు:- ప్రపంచమున ముఖ్యముగ మూడు తత్త్వములున్నవి. (1) ఈశ్వరుడు, (2) జీవుడు, (3) ప్రకృతి, అనునవి. ఇవి మూడున్ను పరస్పరము భిన్నములైనవి. అనాదియైనవి. యదార్థములైనవి. ఒకదానికొకటి విలక్షణమైనవి.

ఇందు ఈశ్వరుడు సర్వస్వతంత్రుడు. అద్వితీయుడు. తనతో సమానుడుగాని, అధికుడుగాని లేనివాడు. మిగత రెండు తత్త్వములకు శేషియైనవాడు, నియామకుడు, ఆధారభూతుడు, సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు, సృష్టి-స్థితి-లయ-అంతప్రవేశ, నియమన, మోక్షకారకుడు, జ్ఞానస్వరూపుడు. సమస్త కల్యాణగుణాత్మకుడు, విలక్షణ విగ్రహవిశిష్టుడు, స్వరూపతః విభువు, ఆనందాత్మకుడు, సర్వవ్యాపి. ఈయన తన లీలార్థమై తన సంకల్పముచే తనయొక్క ఒక అంశమైన ప్రకృతిని పంచీకరణ ప్రక్రియద్వారా 24 తత్త్వములుగ జేశి దానియందు, తనయొక్క మరొక అంశమైన జీవులలో తాను ప్రవేశించి ఆజీవులను ఆప్రకృతిలో ప్రవేశపెట్టి వానికి నామరూపముల కల్పించెను. దీనినే సృష్టియందురు.

వీనియొక్క ఉనికికై తాను ఆజీవులయందుండి వానిచే పనిచేయించుచుండును. దీనినే స్థితియందురు. కొంతకాలమైనపిమ్మట వీని విశ్రాంతికై వీనికిగల స్థూలరూపములను-నామములను తీసివేసి సూక్ష్మరూపముగ జేసి తనయందు లీనముజేసి యుంచును. దీనినే లయమందురు. జీవులు ఈశ్వరునియొక్క జ్ఞానాంశములు. గాన ఇవి తమ జ్ఞానము ననుసరించి కర్మను సంపాదించుకొనును. దానిననుసరించి ఈశ్వరుడు వీని సృష్టి-స్థితి-లయముల జరుపుచుండును.

ఈజీవులు తమయొక్క-ఈసృష్టి-స్థితి-లయములకు విసిగి వేసరి వీనినుండి విముక్తి పొందగోరి తమకు శేషియైన సర్వేశ్వరుని ఆశ్రయించును. అట్టివానిని సర్వేశ్వరుడు ఈ తన లీలనుండి వాటిని విడిపించి నిత్య-నిరవచ్ఛిన్న-నిరతిశయానందాత్మకమైన తన సన్నిధియును మోక్ష మిచ్చును. దీనినే మోక్షమందురు. ఇది ఈ ప్రకృతి మండలముదాటిన పిమ్మట యుండు అప్రాకృతమైన దేశవిశేషానుభవము. ఇది ఈ ప్రాకృత ప్రారబ్ధదేహము విడిచిన తరువాతగాని లభించదు. దీనికి ఆసర్వేశ్వరుని భక్తి లేక ప్రపత్తి మాత్రమే ఉపాయము.

జీవుడు భగవంతునియొక్క జ్ఞానరూపమైన అంశ గాన ఇతనూ జ్ఞానస్వరూపుడే. కర్మఫలము ననుభవించువాడుగాన ఇతను జ్ఞాత-భోక్త-కర్త యగుచున్నాడు. ఇతను ఈశ్వరునికి పరతంత్రుడు.

ఆయనికి శేషభూతుడు. ఆయనకు విధేయుడు, నియామ్యుడు, ధార్యుడున్ను అయియున్నాడు. ప్రకృతికి నియామకుడు. అణుస్వరూపుడు. ప్రతి శరీరం భిన్నుడు. అనగా జీవులనేకులు. అందరు జ్ఞానస్వరూపులే. గాని అవిద్యా-కర్మ-రుచి-వాసనాదులచే అజ్ఞానమునకు సంకోచ, వికాసాదుల గలవాడు.

ప్రకృతియు భగవంతుని అంశయె. ఇది సతతపరిణామాత్మకమైనది. జీవేశ్వరులకు శేషమైనది. విధేయమైనది. నియామ్యమైనది. ధార్యమైనది. పూర్తిగ పరతంత్రమైనది-జ్ఞానరహితమైనది. జీవసంబంధము లేకుండగ ప్రకృతి ఏ పనియు చేయజాలదు. ఈశ్వరసంబంధము లేకుండగ జీవుడేపనియు చేయజాలడు. గాన మనము జూచు ప్రతి పదార్థము ఈశ్వరునిచే అధిష్ఠితమైన జీవునితో కూడుకొని యున్నదన్నమాట.

అనగా ప్రకృతియందు జీవుడు, జీవునియందు ఈశ్వరుడు శరీరాత్మభావమున అపృథక్స్థితి రూప సంబంధముతో కలసి యున్నాడు. ప్రపంచమున బ్రహ్మాత్మకముగాని పదార్థ మొక్కటియు లేదు.

జీవుడు అపురుషార్థమైన ప్రకృతి సంబంధమును సదాచార్య సమాశ్రయణముచే పోగొట్టుకొని లక్ష్మీపురుషకారము ద్వారా భగవంతుని ప్రపత్తి జేసి స్వస్వరూపావిర్భావముగలవాడై నిత్యమైన భగవత్కైంకర్యరూప యానందము ననుభవించు విధానము తెలుపునదియే విశిష్టాద్వైతమనబడును

శిష్యుడు:- ఈసిద్ధాంతము ఎప్పటినుండి వచ్చినది.

గురువు:- ఇది అనాదిసిద్ధమైనది. సృష్ట్యాది నుండియు యున్నది.

శిష్యుడు:- దీనిలో భేదములున్నవా?

గురువు:- వైష్ణవ విశిష్టాద్వైతమనియు; శైవ విశిష్టాద్వైత మనియు రెండు తెరంగులున్నవి. విష్ణువే పరాత్పరుడు. ఆయనే సృష్టి, స్థితి, లయ, అంతఃప్రవేశ నియమన మోక్షకారకుడు అనునది వైష్ణవ విశిష్టాద్వైతము. దీనినే శ్రీవిశిష్టాద్వైతమనియందురు.

శివుడే అట్టివాడనునది శైవ విశిష్టాద్వైతము.

శిష్యుడు:- ఇందులో ఏది వేద వేదాంత సమ్మతమైనది.

గురువు:- శ్రీవిశిష్టాద్వైతమే సర్వ వేద వేదాంత సమ్మతమైనదియు, శిష్టజనసేవ్యమైనదియు సర్వ జనాదరణీయమైనది. సర్వోత్తారక మైనది.

శిష్యుడు:- ఈసిద్ధాంతావలంబకులు జగత్తులో ఎంతమందియుందురు.

గురువు:- జగత్తులో గల మానవులందరు ఈసిద్ధాంతావలంబకులే.

శిష్యుడు:- అదెట్లు?

గురువు:- జగత్తులోనుండువారందరు కర్మ యోగులో- జ్ఞాన యోగులో- భక్తియోగులో ఈమూడింటిలో ఏదో వక యోగావలంబకులై మాత్రమే అయి యున్నారు.

యోగమనగా ఉపాయము.

లౌకికవిషయములో ఈయోగముల నుపయోగింతురా, లౌకిక ఫలితములు కలుగును. అలౌకిక విషయములో వీని నుపయోగింతురా, అలౌకిక ఫలము కలుగును.

లౌకికఫలమును కోరువారందరు ఫలమును కోరునట్టి తానువేరు, యిచ్చునట్టి వాడువేరు దీనికవలంభించబడు సాధనము వేరు అను మూడు తత్త్వములను, అవి యధార్థములనియు, పరస్పర భిన్నములైన వనియు అంగీకరించే తీరవలెను గాన వారు లౌకిక విశిష్టాద్వైతులు.

యిపుడు మనము ప్రసంగించునది అలౌకికమైన ఆధ్యాత్మిక విషయమును గురించి గాన దాని విషయమై ఆలోచింతుము.

కర్మయోగులు— కర్త–కర్మ–ఫలదాత అనియు

జ్ఞానయోగులు— జ్ఞాత–జ్ఞానము–జ్ఞేయుడు అనియు,

భక్తియోగులు— భక్తుడు–భక్తి–భజనీయుడు అనియు,

ఈవిధముగ తత్త్వములు మూడనియు అవి పరస్పర భిన్నములనియు, యదార్థములనియు, పరస్పర విలక్షణమైనవనియు, అంగీకరింతురు.

శిష్యుడు:— కొంతమంది తత్త్వమొక్కటి మాత్రమే యనియు, మిగతవన్నియు యదార్థములు కావనియు అందురే?

గురువు:—అవును. అటుల అనువారున్నారు. అనుటయేగాని తాము నమ్ముటగాని అటుల తమ యనుష్ఠానమును కలిగియుండుటగాని లేదు. గను కనే వారు సత్యమును మూడు రకములుగ విభజించిరి. 1. ప్రాతిభాసికసత్యము. 2. వ్యావహారిక సత్యము. 3. పారమార్థిక సత్యము అని. అందు ప్రాతిభాసిక–వ్యావహారికసత్యదశలలో శ్రీవిశిష్టాద్వైత సిద్ధాంతమును పూర్తిగా అంగీకరించిరి. పారమార్థిక సత్యదశ వేరేయున్నదనియు అపుడు మాత్రము ఒక తత్త్వమే సత్యమనియు, మిగతవి సత్యము కావన్నియు అనిరి. కాని ఆదశనుగురించి తెలుపు వేదాంతవాక్యములకు అర్థము తెలుపునపుడు మాత్రము శ్రీవిశిష్టాద్వైత పరముగానే స్వాభావికార్థమును తెలుపుచు, "అయినను ఇది మాసొంత యభిప్రాయము" అని తమ ప్రత్యేకాభిప్రాయము నుద్ఘాటించిరి. వీరి ఈ భావ ప్రపంచమున తప్ప, మిగత యదార్థప్రపంచమంతయు విశిష్టాద్వైతపరమైనదే. వీరు క్రియలో విశిష్టాద్వైతులే.

శిష్యుడు:— ఈ మధ్యకాలములో దీనిని ప్రవర్తింపజేసిన గురుపరంపర యేది?

గురువు:— శ్రీకృష్ణుడు.
భగవద్బోధాయనులు
ద్రమిడాచార్యులు.
బ్రహ్మనంది. (టంకాచార్యులు)
గుహదేవాచార్యులు.
ఆచార్యభారుచి.
ఆచార్యకపర్ది.
శ్రీమన్నాథమునులు.
శ్రీయామునాచార్యులు.
భగవద్రామానుజాచార్యులు.

# దినహితచర్య



(తండ్రి కుమారులకు వ్రాసిన లేఖలలోని సారాంశము బాలురకు ఉపయోగపడునని కొంతమంది మిత్రుల ప్రోత్సాహముచే ప్రచురించుచున్నాము.)

చిరంజీవి!

ఆశీస్సులు. బాగుపడదలచిన బాలుర దినచర్యనుగురించి తెలుపగోరిన యభిలాష ఎంతయు శ్లాఘనీయము. చివరకు ఫలితమేమైన కానిమ్ము దానితో మనకు పనిలేదు. ఏలనన ఫలితమనునది భగవంతుని కృత్యము. భగవంతుడు మనకిచ్చియున్న బుద్ధి—యింద్రియములు—శరీరము— వీనినుపయోగించి ప్రయత్నించుచుండుట మాత్రము మన కృత్యము. బాగుపడవలెనని కోరికయుండి తదనుకూలప్రయత్నముల నేమఱక చేయువాడు తప్పక బాగుపడును. ఇందుల కేమాత్రము సందేహములేదు. దానికి తగినమార్గమును—సాధనమును—అవలంబనమును—ఆధారమును మాత్రము అనుసరించవలయును. అట్టి అభ్యాసపరునకు సర్వేశ్వరుడు తోడ్పడును. ఒడ్డు—లావు—పొడుగు కలిగియున్నది గదాయని బెండుకర్రను అవలంబనముగా బట్టుకొన్నవాడు సముద్రమునుండి ఒడ్డుకు చేరలేక మునిగిపోవక మానడుగదా!

కనుక మంచియోగ్యులైన తగిన పెద్దల నాశ్రయించి వారి యుపదేశానుసారము నడుచుకొనవలయును. ప్రతివిషయములోను మొదటి నుండియు మన మనుభవము సంపాదించ దలంచకూడదు. పెద్దల యనుభవము పిత్రార్జిత యాస్తి వలె సుఖమును, శాంతిని, సమకూర్చును. కాల వ్యయమును, కాయశ్రమను తగ్గించును.

అట్టి పెద్దల సదుపదేశములను సత్పురుషుల సహవాసముచే వృద్ధినొందించుకొనవలయును.

వత్సా! లోకానుభవములో నేను చాలా చిన్నవాడను. అయినను నాకంటెను చిన్నవాడవై నాయనుభవములను మంచి యుద్దేశముతో తెలుసుకొనగోరినవాడవై యడిగితివి గాన నాకు తెలిసినంతవరకు అతిసంక్షేపముగా తెలుపుచున్నాను. ఇంతకంటెను ప్రతివిషయములోను నీవు పాఠశాలలో ఉపాధ్యాయులవలన వినియే యుందువు. అయినను నీ శ్రేయస్సునే కోరిన వాడనగుటచే నీకై తెలుపుచున్న విషయములయందు తగినంత శ్రద్ధను జూపించగలవనియే యాశించుచున్నాను.

ప్రతిమనిషియు ముందు మంచిలక్ష్యమును నిర్ణయించుకొన వలయును. లక్ష్యనిర్ణయములో అధైర్యము, పిసినిగొట్టుతనము, అశ్రద్ధ, అలసత్వము, అభిమానము, భయము కూడదు. మంచి ఉదారమైన లక్ష్యములేని మానవుడెప్పు

డును అభివృద్ధిలోనికి రాజాలడు. జన్మాంతరమందైననుసరే ఆలక్ష్యమును సాధించి తీరవలెనను పట్టుదలయున్నచో ఎట్టి లక్ష్యమునైనను సరే మానవుడు సాధించజాలనిదంటూ లేదు. సర్వశక్తిసంపన్నుడైన సర్వేశ్వరుడే సత్సంకల్పునికి సంకల్పసిద్ధికై సర్వసహాయుడై నిలిచియుండుననగా తదితరములుగురించిన సందేహము మనకేల ?

సామాన్యమానవులు ఉదార-ఉదాత్తలక్ష్యములను గొంతెమ్మకోరలని పరిహసింతురుగాక. గాని దానికై గావించిన అవిరత సత్ప్రయత్నములు ఈజన్మకుగాకపోయినను, పరలోక జన్మకైనను ఫలించితీరును. ఇది ముమ్మాటికి సత్యము. గాలివిమానవిర్మాతనుగాని, రేడియోనిర్మాతను గాని, స్వరాజ్యనిర్మాతనుగాని ప్రజలు ప్రారంభదశలో పరిహసించుట మానిరా ? గాని చివరకు వారి పట్టుదలచే వారు ఫలప్రదులగుట ప్రజలు వారిని ప్రస్తుతించుటను మానిరా ?

—♦ నిదురమేల్కొనుట ♦—

"శరీరమాంద్యం ఖలు ధర్మసాధనం"

గనుక మొదట శారీరకసంబంధమైన విషయముల స్పష్టముగ తెలిపెదను.

ప్రతిదినము నీవు తెల్లవారుజామున నాలుగున్నర గంటలకే మేల్కొనుట చాలా మంచిది. లేదా అయిదున్నర గంటలు దాటకుండనైనను మేల్కొంచవలయును. ఇట్లు లేచుట ప్రారంభదశలో కొద్దిగా బాధకరముగా తోచినను కొన్ని దినములు వరుసగా అభ్యసించితివా అటుపిమ్మట నీవు బలవంతముగ కొంతసేపటివరకు పరుండవలెనని తలచినను పరుండజాలవు.

సూర్యోదయ కాలమున నిదురపోవువారు తమ ప్రాణశక్తిని కోల్పోవుదురు. అట్టివారి ఆయుస్సు క్షీణించునని శాస్త్రజ్ఞులందురు. జీవులకు నూతన ప్రాణశక్తుల నొసగువారిలో సూర్యుడు ప్రధానుడు. అందుచే సూర్యోదయాత్పూర్వమే నిదురలేచుటచే నీయందు ప్రాణశక్తి యభివృద్ధియై ఆదినమంతయు నీమనస్సు నిర్మలమగును, అతిఉత్సాహవంతముగను యుండును.

నిదురనుండి మేలుకొనగనే వెంటనే పక్కనుండి లేవవలెనే గాని బద్ధకముగా ప్రక్క మీదనే పరుండియుండరాదు. లేచిన వెంటనే చల్లనినీళ్లతో కండ్లను ముఖపద్మాయములు తుడుచుకొనుట కండ్లకును, మెదడుకును చాలమంచిది.

నిదురలేవగనే పక్కమీదనే కూర్చుండి రెండుచేతులుజోడించి నీయిష్టదైవమును తలచుకొని "స్వామి! నీదయవలన నే యపాయమును లేకుండగ నీయందు మనసుంచి నిద్రపోయితిని. రాత్రి నిద్రయందును కూడ నీవు నన్ను కాపాడినట్లనే పగటిపూటను కూడ నన్ను కాపాడుము! నారక్షణభారము నీది. నిన్ను నమ్మిన నీకు ప్రీతిగా నీయాజ్ఞరూపమైన నాదికర్తవ్యములను నెరవేర్చెదను. నామనస్సు మంచికార్యములందే యుండునట్లు నియమింపుము. ఎప్పటికిని నన్ను వంకర త్రోవల బోనీయకుము నీకు సర్వదా పరతంత్రుడ

నగు నన్ను రక్షించు భారమునీది. లోకమందలి యున్న జీవులు సుఖవంతములై ఆనందించు గాక! తద్వారా నేను సుఖవంతుణ్ణి,ఆనందాత్ముడను ; అగునటుల యనుగ్రహించుమా! నీవు నాకిచ్చిన ఈశరీరేంద్రియబుద్ధులు, ధనధాన్యములు నాసోదరమానవులకున్ను, ప్రాణికోటికిన్ని ఉపయోగపడునటుల ననుగ్రహించుమా అనిప్రార్థించుము.

ఇదిగాక యింకను నీకు యిష్టమయినటువంటి సంస్కృతశ్లోకములను తెలుగుపద్యములను చదువుటద్వారా కూడా భగవత్ప్రార్థనను జేయుము. విష్ణుమూర్తి ప్రార్థనను ఏభాషలో చేసినను చేయవచ్చునుగాని తదర్థమును మాత్రము పూర్తిగా చక్కాగా తెలుసుకొని యుండవలయును. ('స్మరణీయ స్తోత్రపాఠములు' అను పేర వేరుగా చిన్నపుస్తకము ప్రచురించ బడినది.) ఇట్లు ప్రార్థించి నీయిష్టదైవమునకు నమస్కరించిన తరువాత 10లేక12గుక్కలు చల్లని నీళ్ళనుగాని వేడినీళ్ళనుగాని త్రాగుట మంచిది. ఇందువలన నీకువిరోచనము చక్కగ నగును.అజీర్ణ ముండదు ఇంకను అనేక మంచి గుణములు దీనియందు గలవు. ఈ ప్రకారము తప్పక మంచినీళ్ళు త్రాగువారు నూరు సంవత్సరములు ఆరోగ్యముగ బ్రదుకుదురని వైద్యులు తెలుపుచున్నారు. నూరు సంవత్సరములు బ్రదికినను మానినను దేహారోగ్యము మాత్రము చక్కాగా నుండు ననుటలో సందేహము లేదు. రాత్రిపరుండునపుడే ఒకమంచి రాగిచెంబులో మంచినీళ్ళను పోసి పైన మంచిమూత వేసి మంచము క్రింద యుంచుకొనవలయును. ఈ మంచినీళ్ళు దీపము వెలుతురున జూచి త్రాగుట మంచిది.

"త్రాగుటకు ముందు, వ్రాశిన వెనుక చూడుము" అను పెద్దలవాక్యము సదా జ్ఞాపకముంచుకొనుము.

తరువాత ఆదినమున నీవు చేయవలసియున్న ముఖ్యమైనపనులగురించి జ్ఞాపకము చేసుకొనుము ఆపనులను ఏవిధముగ నిర్వహించవలయునో కూడ నిర్ణయించుకొనుము. ఇటుల చేయుటచే కొన్నివిధులను మరచిపోవుటగాని, అప్పటికప్పుడు తొందరపడి ఆందోళన పడవలసివచ్చుటగాని యుండదు.

### మల-మూత్ర-విసర్జన

దీనితరువాత వెంటనే బహిర్భూమికి పోవలయును. సూర్యోదయమునకు ముందుగనే మలమూత్రవిసర్జనము చేయుట చాలామంచి అలవాటు. ఇందువలన ఆరోగ్యము చాలా బాగుండును. కొంత మందికి ఉదయముననే మలవిసర్జనముచేయు అభ్యాసముండదు. అనుమానమున్నను లేకపోయినను తద్విసర్జనకై ప్రతిదినము నిర్ణీతవేళకు ప్రయత్నించు చుండవలెను. అభ్యాసము వలన కొన్నిదినములు గడచిన పిమ్మటనైనను ఫలితముకలుగగలదు. యిట్టి అభ్యాసము వలన చాలా మందికి చాలమంచి చేకూరగలదు. ఉదయముననే మలమూత్ర విసర్జనము చేయక పోవుటచే కడుపులోనున్న మలములోని కొన్ని

పదార్థములు తిరిగి రక్తములో కలిసి అనేక జబ్బులకు కారణమగును.

మలమూత్రవిసర్జనానుమానము కలిగినవెంటనే ఆ యనుమానమును తప్పక నివృత్తి చేసుకొన వలయును. ఎంతటి తొందర పనులున్నను సరియే మలమూత్రములు వచ్చునపుడు బిగబట్ట రాదు. అట్లు బిగబట్టినను, అవిరానపుడు బల వంతముగ వాటినిబహిర్గతము జేయ ప్రయత్నించి నను చాల ప్రమాదము సంభవించును. రోగ ములు పుట్టును.

మలమూత్రముల విడుచునపుడు నోరు ముక్కు మూసుకొనవలయును. అట్లు చేయనిచో వాని నుండి వెలువడు చెడ్డయావిరులు కడుపులోనికి బోయి యనేక రోగములను కలిగించును. మల మూత్రవిసర్జనమును గొంతుక కూర్చొనియే జేయవలయును గాని నిలుచుండి చేయరాదు. మరియు ఆసమయమున నడుమునకు పట్టకా లేవియు బిగించి యుండరాదు. బట్టనుగూడ చాలవదులు గకట్టుకొని యుండవలెను. లేనిచో మలమూత్రములు పూర్తిగా బయటికి పోక కడుపులో కొంత మిగిలిపోయి అనేక రోగము లకు కారణము అగును.

ఏవరేగాని యెపుడేగాని మూత్రవిసర్జనకై పోయినపుడు తప్పక నీళ్ళను కూడ తీసుకొని పోయి మూత్రముతగిలిన దేహముభాగను చల్లని నీటితో బాగుగా కడుగుకొనవలయును.

మలవిసర్జనా నంతరమున ఆస్థానమునున్నూ చక్కగా నీటితో కడుగవలయునే గాని కాగిత ముచేగాని గుడ్డలచేగాని తుడుచుట వగైరాలను జేయగూడదు.

మలవిసర్జనానంతరము ప్రక్షాళనము చేసు కొనిన చేతిని మట్టిపెట్టి బాగుగా తోమి కడుగు కొనవలయును. మలమూత్రములయందు మన శరీరమునకు హానిని కలిగించు జీవకణములు ఎన్నోయున్నవి. ఇవి భూతద్దముచేగాని కని పించవు. ఈజీవకణములు తిరిగి యేవిధముగా నైనను మనదేహములో ప్రవేశించినయెడల, అనేకరోగములకు కారణమగును. ఇట్టి జీవకణము లను జంపుశక్తి మంచిమట్టికే గలదు. అనేక పర్యాయములు బాగుగా మట్టితో తోమి కడిగిన గాని ఈజీవకణములు నశించవు. జీవ కణములు ఏమైన మిగిలియున్నవో యని అనుమానముచేతనే ఏదేశమునందైనను నోటియందుంచుకొన రాదనియును, తినెడి పదార్థములేవియు తాకరాదనియు చెప్పుదురు.

మలవిసర్జనానంతరము ఆమలమును మట్టితో కప్పివేయుట చాలా మంచిది. అందువలన ఆమలముయొక్క దుర్వాసన వాయువులవలనను, అందలి అణువులు ఈగలు దోమలు మొదలగు జంతువులవలనను నలుదిక్కులకు వ్యాపించ జాలవు. పిమ్మట హస్తపాదములను పూర్తిగా బాగుగా కడుగుకొని మూడుపర్యాయములు మంచినీటితో ఆచమనము చేయువలయును.

---

(తరువాయి మరుసటి సంచికలో.)

ఇంద్రకృత

# శ్రీ లక్ష్మీ స్తవము

(శ్రీవిష్ణుపురాణాంతర్గతము)



## ప్రార్థన:

ఇంద్ర ఉవాచ.

౧. నమామి సర్వలోకానాం ।
జననీ మబ్జసంభవాం ।
శ్రియ మున్నిద్రపద్మాక్షీం ।
విష్ణు - వక్షస్థల - స్థితాం ॥

౨. పద్మాలయాం పద్మకరాం ।
పద్మపత్ర - నిభేక్షణాం ॥
వందే పద్మముఖీం దేవీం ।
పద్మనాభ-ప్రియా మహం॥

౩. త్వం సిద్ధి స్త్వం స్వధా స్వాహా ।
సుధా త్వం లోకపావనీ ।
సంధ్యా రాత్రిః ప్రభా భూతిః ।
మేధా శ్రద్ధా సరస్వతీ॥

౪. యజ్ఞవిద్యా మహావిద్యా ।
గుహ్యవిద్యా చ శోభనే ।
ఆత్మవిద్యా చ దేవి త్వం ।
విముక్తి - ఫల - దాయినీ॥

౫. అన్వీక్షికీ - త్రయీ - వార్తా ।
దండ-నీతి స్త్వమేవ చ ॥
సౌమ్యాఽసౌమ్యై ర్జగద్రూపైః।
త్వయైత ద్దేవి-పూరితం॥

## తాత్పర్యము

ఇంద్రుడు పలికెను.

౧. నమస్తలోకములకు తల్లియై, పద్మమందు ద్భవించినదై, వికసించిన పద్మమువంటి నేత్రములుగలదై, విష్ణువు యొక్క వక్షస్థలమందున్న లక్ష్మిని సేవించుచున్నాను.

౨. పద్మమును నివాసముగాకలిగి, పద్మమువంటి హస్తములు కలదై, తామరరేకులవంటి నేత్రముల గలదై, పద్మమువంటి ముఖము గలదై పద్మనాభునికి ప్రియురాలైన లక్ష్మీదేవిని నేను సేవించుచున్నాను.

౩. అణిమాదిసిద్ధులునీవే, హవ్యకవ్యములు నీవే, హవిరాదికములు నీవే, అమృతము నీవే, లోకమును పవిత్రము చేయుదానవు నీవే, సంధ్యాకాలము, రాత్రి, ఉదయము, ఐశ్వర్యము, బుద్ధి, శ్రద్ధా, విద్య అన్నియు నీవల్లనే కలుగుచున్నవి.

౪. ఓ మంగళప్రదదేవీ! కర్మకాండకు ఉపాసనకాండకు, ఇంద్రజాల విద్యకు, మోక్షఫలప్రదమైన బ్రహ్మవిద్యకు నీవే నిర్వాహకురాలవు.

౫. ఓ దేవీ। తర్క-విద్య, వేదత్రయము, శిల్ప-వాణిజ్య-ఆయుర్వేదాదికము, రాజనీతి అన్నింటికి నిర్వాహకురాలవు నీవే. జగత్తునగోచరించు శాంత-ఘోర-రూపమున వ్యాపించి యున్నావు.

౬. కా త్వన్యా త్వామృతే దేవి ।
సర్వ-యజ్ఞ-మయం-వపుః।
అధ్యాస్తే దేవదేవస్య ।
యోగిచింత్యం గదాభృతః॥

౬. ఓ దేవీ! సమస్తయజ్ఞమయమైన యోగిధ్యానగమ్యమైన గదాధరుడైన దేవదేవుని వక్షస్థలమును నీవు తప్ప మరెవరు అధిష్ఠించగలరు?

౭. త్వయా దేవి పరిత్యక్తం ।
సకలం భువనత్రియం ।
వినష్టప్రాయ మభవత్ ।
త్వయేదానీం సమేధితం॥.

౭. ఓ దేవీ! నీవు విడుచుటచే మూడులోకములు నశించి నష్టైనవి-తిరిగి నీచే యిప్పుడు అవి వృద్ధిపొందింపబడినవి.

౮. దారాః పుత్రా స్తథా గార ।
సుహృ ద్ధాన్య ధనాదికం ।
భవ త్యేత న్మహాభాగే ।
నిత్యం త్వద్వీక్షణా న్నృణాం॥.

౮. భార్య, బిడ్డలు, ఇండ్లు, మిత్రులు, ధనము, ధాన్యము మున్నగునవన్నియు నీకటాక్షముచేతనే ఎల్లప్పుడు మనుష్యులకు లభించుచున్నవి.

౯. శరీరారోగ్య మైశ్వర్యం ।
అరి-పక్ష-క్షయ స్సుఖం ।
దేవి, త్వద్దృష్టి-దృష్టానాం ।
పురుషాణాం న దుర్లభం॥.

౯. ఓ దేవీ! నీ కటాక్షమునకు పాత్రులైనవారలకు శరీరారోగ్యము, ఐశ్వర్యము, శత్రునాశనము, సుఖము మున్నగునవి దుర్లభములు కావు.

౧౦. త్వం మాతా సర్వలోకానాం ।
దేవ దేవో హరిః పితా ।
త్వయైత ద్విష్ణునా చాంబ ।
జగద్వ్యాప్త చరాచరం॥.

౧౦. ఓ తల్లీ! నీవన్నిలోకములకు తల్లివి, దేవదేవుడగు శ్రీహరి తండ్రి. మీరిద్దరిచేతను చరాచరాత్మకమగు జగత్తంతయు వ్యాప్తమై యున్నది.

౧౧. మా నః కోశం తథా గోష్ఠం ।
మా గృహం మా పరిచ్ఛదం ।
మా శరీరం కళత్రం చ ।
త్యజేథా స్సర్వ-పావని॥.

౧౧. సర్వమును పవిత్రము చేయుదానా! నీవు మా ధనాగారమును, మా పశుశాలను, మా యింటిని, మా సామగ్రిని, మా శరీరమును, భార్యను విడువకుమా.

౧౨. మా పుత్రాన్ మా సుహృద్వర్గాన్ ।
మా పశూన్ మా విభూషణం ।

౧౨. సర్వేశ్వరుడగు శ్రీమహావిష్ణు వక్షస్థలమునందుండుదానా!

త్యజేథా మమ దేవస్య ।
విష్ణో ర్వక్ష - స్థలాలయే॥.

మా పుత్రులను, మా మిత్రులను. మా పశువులను, మా ఆభరణములను, విడవకుండుమా.

౧౩. సత్త్వేన శౌచ-సత్యాభ్యాం ।
తథా శీలాదిభి ర్గుణైః।
త్యజ్యంతే తే నరా స్సద్యః।
సంత్యక్తా యే త్వయాఽమలే॥.

౧౩. ఓ పవిత్రురాలా ! నీవు యే నరులను విడుచుచున్నావో వారి మానసికబలము, పవిత్రత, సత్యము, శీలము, అన్నియు ఒక్కమారుగ వారిని విడిచివేయుచున్నవి.

౧౪. త్వయా వలోకితా స్సద్యః।
శీలాద్యై స్సకలై ర్గుణైః ।
ధనై శ్వర్యై శ్చ యుజ్యంతే ।
పురుషాః నిర్గుణా అపి॥.

౧౪. నీ కృపాదృష్టి సోకినచో గుణహీనులైనను వెంటనే శీలాది-సంపూర్ణ-గుణరాశితోను, సంపూర్ణైశ్వర్యాదుల తోను, తులతూగుచుందురు.

౧౫. స శ్లాఘ్య స్సగుణీ ధన్యః।
స కులీన స్స బుద్ధిమాన్ ।
స శూర స్స చ విక్రాంతో ।
యం త్వం దేవి,నిరీక్షసే॥.

౧౫. ఓ దేవి ! నీ కృపాదృష్టిసోకినవాడే కొనియాడతగిన వాడు, వాడే సుగుణరాశి, వాడే ధన్యుడు, వాడే ఉత్తమ కులజుడు, వాడే బుద్ధికుశలుడు, వాడే శూరుడు, వాడే పరాక్రమశాలి.

౧౬. సద్యో వైగుణ్య మాయాంతి ।
శీలాద్యా స్సకలా గుణాః ।
పరాఙ్ముఖీ జగద్ధాత్రి ।
యస్య త్వం విష్ణువల్లభే॥.

౧౬. ఓ విష్ణుప్రియా ! జగన్మాతా ! నీవెవనినుండి విముఖత చెందెదవో వాడెంతటి సద్గుణవంతుడైనను, ఆగుణము లన్నియు వెంటనే అవగుణములగును.

౧౭. న తే వర్ణయితుం శక్తా ।
గుణాన్ జిహ్వాఽపి వేధసః।
ప్రసీద దేవి,పద్మాక్షి ।
మాఽస్మాం స్త్యాక్షీః కదాచన॥.

౧౭. ఓదేవి ! పద్మనయనా ! నీ గుణముల వర్ణించ బ్రహ్మ జిహ్వకున్ను శక్యముగాదు, నన్ను అనుగ్రహించుమా మమ్ముల నెప్పుడును విడువకుమా.

శ్రీపరాశరః

౧౮. ఏవం శ్రీ స్సంస్తుతా సమ్యక్ ।
కస్యాఽదృశ్యా శతక్రతుం ।
శృణ్వాతాం సర్వదేవానాం ।
సర్వభూతస్థితా ద్విజ॥.

♦ శ్రీపరాశరుడు ♦

౧౮. ఓ మైత్రేయా,ఈ విధముగా చక్కగా స్తుతించబడి ఎవరికి కనుపించకుండగా, సర్వభూతముల యంత రాత్మయందుండు లక్ష్మీదేవి దేవతలందరు వినుచుండగా ఇటుల పలికెను.

### శ్రీ ఉవాచ

౧౯. పరితుష్టాఽస్మి దేవేశ ।
స్తోత్రేణానేనతే హరే ।
వరం వృణీష్వ య స్త్విష్టో ।
వరదాఽహం తవాఽగతా॥

### లక్ష్మి పలికెను

౧౯. ఓ దేవేంద్రుడా ! నీవు గావించిన స్తోత్రముచే నేను మిక్కిలి ఆనందించితిని. నేను నీకు వరము లిచ్చుటకై వచ్చితిని. నీకిష్టమైన వరమును కోరుము.

### • ఇంద్ర ఉవాచ •

౨౦. వరదా యది మే దేవి ।
వరార్హో యది చాప్యహం ।
త్రైలోక్యం న త్వయా త్యాజ్యం ।
ఏష మే ఽస్తు వరః పరః॥

### ఇంద్రుడు పలికెను

౨౦. ఓ దేవీ ! నీవు నాకు వరము లిచ్చుచో, నేను వరముల పొంద నర్హుడనైనచో, నీవిక యెపుడును ఈ మూడు లోకములను విడువకుండవలెను. ఇదియే నా మొదటి ముఖ్యవరము.

౨౧. స్తోత్రేణ య స్తదైతేన ।
త్వాం తోష్యత్యబ్ధి-సంభవే ॥
స త్వయా న పరిత్యాజ్యో ।
ద్వితీయోఽస్తు వరో మమ॥

౨౧. ఓ సముద్రరాజతనయా ! నిన్ను స్తోత్రముచే నియతముగా స్తుతించువానిని నీవెన్నడును విడువకుండవలయును. ఇదియే నా రెండవ వరము

### • శ్రీః ఉవాచ •

౨౨. త్రైలోక్యం త్రిదశశ్రేష్ఠ ।
న సంత్యక్ష్యామి వాసవ ।
దత్తో వరో మయాఽయం తే ।
స్తోత్రారాధన-తుష్టయా॥

### లక్ష్మి పలికెను

౨౨. ఓ దేవేంద్రా ! నీ స్తోత్రముచే ప్రసన్నురాలనైతిని. ఈ మూడు లోకములను ఎన్నడును విడువనని వర మొసంగుచున్నాను.

౨౩. య శ్చ సాయం తథా ప్రాతః ।
స్తోత్రేణానేన మానవః ।
మాం తోష్యతి న తస్యాహం ।
భవిష్యామి పరాఙ్ముఖీ॥

౨౩. సాయం-ప్రాతఃకాలములయందు ఏ మానవుడు ఈ స్తోత్రముచే నన్ను ఆనందింపచేయునో వాని నెన్నడు విడువను.

### శ్రీపరాశరః

౨౪. ఏవం దదౌ వరౌ దేవీ ।
దేవరాజాయ వై పురా ।
మైత్రేయ, శ్రీమహాభాగా ।
స్తోత్రారాధన - తోషితా॥

### శ్రీ పరాశరుడు

౨౪. ఓ మైత్రేయా ! ఈవిధముగా దేవేంద్రునిచే స్తుతించబడి ప్రసన్నురాలై లక్ష్మీదేవి పూర్వమున దేవేంద్రునకు రెండు వరముల నొసంగెను.






| బోద్ధావతార కథ. | భగవద్విషయ విశేషములు | రచయిత్రి : శ్రీమతి మ. రంగనాయకమ్మగారు |
|---|---|---|



కొందరు రాక్షసులు రుద్రుని గురించి తపస్సుచేయగా నాతడు ప్రత్యక్షమై వారి ప్రార్థన ననుసరించి అజయ్యములగు మూడు పట్టణములను ప్రసాదించి యవి మూడును కొక్కచో కూడినయెడల నా రాక్షసులకు మహోపత్తు సంభవించునని చెప్పి యంతర్ధాన మయ్యెను. పిమ్మట ఇనుము, వెండి, బంగారము లతో వేరువేరుగ చేయబడిన ఆ పట్టణములలో నా రాక్షసులు నివసించుచు దేవతలను, వారిని పూర్చి యాగాదుల నాచరించు బ్రాహ్మణులను బాధింప దొడంగిరి. అందు మూలమున దేవతలకు బలముడిగి రాక్షసులను జయింప జాలకుండిరి. అంతట వారు బ్రహ్మాదులను పురస్కరించుకొని యీశ్వరుని చెంతకేగి యా రాక్షసులా పట్టణములతో వచ్చి యాగముల గావించు పట్టణముల నాశనము గావించుటచే నేగిరి. తాము హవిర్భాగము లేక యలమటించుచున్నాము. గాన వారిని సంహరింపమని ప్రార్థించిరి. అందులకా రుద్రుడు వారికి నేనే ఆబలము నొసంగుటచే నాచేతులతో నిర్మూలింపజాలనని నుడివెను. ఇట్లు నిరాశులగు నా బ్రహ్మాది దేవతలు పాలసముద్రమునకేగి పురుషసూక్తమున శ్రియఃపతిని స్తుతింపగ నాతడు గరుడవాహనారూఢుడై సేవసాయించి వారిరాకకు నిదానం బెఱింగి 'మీరేల వారిని సంహరింపజాలరని' అడిగెను. దానికా బ్రహ్మాదులు 'స్వామీ! వారు కొన్ని ధర్మముల నాచరించుచున్నారు. కొన్ని యజ్ఞముల ఆచరించుచున్నారు. కాన మేము వారిని జయింపజాల' మన స్వామి 'అట్లగుచో నేనే వారిని జయింతును. మీరు మీ

స్థానములకు పోండని యాదేశించెను. పిమ్మట నాతఁడొక వృద్ధబ్రాహ్మణాకారమును ధరించి తాటియాకుల పుస్తకమును చంకనిడి చేతులలో దర్భల నుంచుకొని వారి పట్టణముల కేగి తాను ధర్మనిష్ఠుఁడనుకొనునటుల కొంత ప్రసంగించి వారికి తమయందు విశ్వాసమును పుట్టించెను. అంత నా రాక్షసు లొక యాగమును ప్రారంభించిరి. ఈ వృద్ధు డదిగాంచి కొన్ని కుయుక్తులతో వారి వైదికశ్రద్ధను పోగొట్టి ఆయాగమును మాన్పించెను. వారాతని మాటలను విశ్వసించి ఆయాగమును మానుటయే గాక ధర్మశ్రద్ధావికలులై రుద్రుని దూషింపదొడంగిరి. అంత నా బౌద్ధవృద్ధుడు రుద్రునికడ కేగి యసురు లాతని దూషించుచున్నారని చెప్పెను. అంత నా యీశ్వరుడు కోపించి వారలను సంహరింప నుద్యుక్తుడాయెను. అట్టితరి భూమి రథముగను మహామేరు వాతని ధనస్సుగను సర్వేశ్వరుడాతని బాణముగను త్రిపురసంహారమునకు సహాయము నొసంగిరి. రుద్రుడా సంరంభముతో వారితో యుద్ధము చేసి ఆ బాణముతో వారిని సంహరించెను. పిమ్మట యజ్ఞయాగాదులు నిరాటంకముగ సాగుచుండుటచే దేవతలును హవిర్భాగము నందుకొని సుఖించిరి.

ఇట్టి కథాసంవిధానమంతయు నమ్మాళ్వారులు తిరువాయిమొழியందలి ఏడవపదిగమున 10వ తిరువాయిమొழிలో నాల్గవ పాశురమున "కెళ్ళ వేడత్తై కొణ్డు పోయ్ పురంపుక్క వారుం కలందు ఉళ్ళాం పేదం శెయ్‌దిట్టు ఉయిరుణ్డ ఉపాయఙ్గళ్," అనెడు శ్రీసూక్తిలో సూచించిరి.

## ★ ఆళ్వారుల జ్ఞాన ముద్రాధారణము

ప్రతి దివ్యదేశమునందును వేంచేసియుండు ఆళ్వారుల విగ్రహము లన్నియు అంజలి ముద్రతో గాన్పించుచుండును. గాని నమ్మాళ్వారుల విగ్రహ మొక్కటి మాత్రమే జ్ఞానముద్రతో నుండును. ఇట్లుండుటకు కారణ మీ వ్యాసమున భగవద్విషయము నందలి పంచమశతకములోని మూడవ దశకముయొక్క యవతారికను పురస్కరించుకొని వివరింపబడుచున్నది.

నమ్మాళ్వారులు సంసారమందలి జిహాసచేతను పరమపదమునందలి ప్రావణ్యముచేతను, తహతహలాడుచు భగవంతుని గాంచుటకు స్వయముగ మొరపెట్టుట కామినివలె దూతికలను పంపుట. రాజమహిషివలె మట్టలెక్కెదు నని బెదరించుట మొదలగు వ్యాపారముల గావించియు నవి నిరర్థకము లగుటచే నిక ప్రాణముల నిలబెట్టుకొనుటకు నుపాయ మేమని యాలోచించిరి. అంత రాసక్రీడారసానుభవ మున్నతస్థితి నుండు నపుడు శ్రీకృష్ణు డాకస్మికముగ అంతర్థానమయ్యెను. అంత నా గోపిక లెంత వెతకి వెతకి కృష్ణుని గానక తమ ప్రాణముల నెటులయిన నిలబెట్టుకొనుటకై వారా కృష్ణచేష్టల ననుకరించినట్లు శ్రీవిష్ణుపురాణమున వ్రాయబడెను. నాయికలు తాముగానే యా భగవంతుని చేష్టల ననుకరించి తమ ప్రాణమును నిలబెట్టుకొన దలంచిరి. అందులకై వారు తమకత్యంత సన్నికృష్టావతారమూర్తియగు శ్రీకృష్ణపరమాత్మ గావించిన లోకోపకారములలో వీరి మనస్సు

సాక్షరించిన అర్జును నుద్దేశించిన గీతోపనిష దుపదేశము ననుకరించుటకై (పక్షిశే జ్ఞాన ముద్రామ్) అనునట్లు శ్రీకృష్ణుడు ధరించిన జ్ఞాన ముద్రను తాముకూడ ధరించి గీతాచార్యుని వలె విరాజిల్లిరి. వీరి తల్లిగారది గాంచి ఇది యేదైయినను మణిమంత్రౌషధాదులవలన గలిగిన వికారజాతమోయని శంకించి అందువలన గలుగు వికారము నొందును గానక భగవంతు ననుకరించి మాట్లాడుట ను బట్టియు ఆతనివలె జ్ఞానముద్రను ధరించుటను బట్టియు భగవంతు డీమెయం దావేశించె నని భ్రమించి తన పుత్రిక స్థితినిగూర్చి తన నడుగవచ్చిన వారి కుపదేశించి నట్లు యీ దశకమునందు వర్ణింపబడెను. తన కుంను బిడ్డయందలి వాత్సల్యాతిరేకముచే నామె భగవద్విశ్లేషముచే గల్గిన విరహవ్యధను భరింప లేక ఇట్లనకరించి ధరించుచున్న దని ఎరుంగ [illegible] యెను.

## ఉపాసకునియభేధాను సంధానము

రామానుజ సిద్ధాంతమున మధ్వసిద్ధాంతము నందువలె జీవాత్మపరమాత్మలకు వాస్తవ భేదమే పరమార్థము. ఈ విషయమును తాము [illegible] గీతా, బ్రహ్మసూత్రములయందు శ్రీ భాష్యకారులు పెక్కు ప్రమాణములతో సమర్థించియుండిరి. తత్వ ముటులున్నను శ్రీవిష్ణు పురాణమున,

శ్లో॥ ముత్తస్సర్వ మహం సర్వం మయి సర్వం సనాతనే
అహ మేవా వ్యయో నిత్యః పరమాత్మా త్మసంశ్రయః
బ్రహ్మసంజ్ఞో ఒహమేవాగ్రే తథా న్తే చ పరః పుమాన్

అని ప్రహ్లాదాళ్వారునియొక్కయు

తిరువాయ్మొళి దివ్యప్రబంధము నందలి యైదవ శతకములోని యేూరవ దశకమునందలి కడల్ జ్ఞానంశైదేనం యా నేయెన్నుమ్ ఇత్యాది యాళ్వారులయొక్కయు అనుసంధానములు జీవపరమాత్మల కభేదమును విషయీకరించుచున్నవికదా? ఇది యెట్లు సమంజసమగుచున్న దని ఒక యాశంక జనించుచున్నది. దానికి భగవద్విషయమున నీక్రింది విధముగ సమాధాన మొసంగబడినది.

తన దేహమునే యాత్మగా భ్రమించు దృఢతర దేహాభిమానికి వేరొండు గోచరించనట్లు తాను భగవంతునకు శరీరభూతుడ ననియు తనకు భగవంతు డాత్మభూతు డనియు దృఢమగు ననుసంధాన మలవడినచో ప్రహ్లాద నమ్మాళ్వారులవలె భగవంతుడుమాటలాడుట కేమి యాశ్చర్యము! తాను భగవంతునకు వేరైనవాడు గాడుకదా? కావుననే

తద్భావభావ మాపన్నః తదాఽసౌ పరమాత్మనా ।
భవత్యభేదీ భేదశ్చ తస్యాజ్ఞానకృతో భవేత్॥

అను శ్లోకమునందలి తద్భావభావమాపన్నః అను సమస్తపదమునకు "తస్య భావ ఇవ భావః యస్య సః తద్భావః తద్భావస్య భావః తద్భావభావః (తద్భావత్వమ్) తం ఆపన్నః" అను విగ్రహవాక్యమును బట్టి పరమాత్మతో పరమ సామ్యాపత్తిని పొందినవాడని అర్థము లభించుచున్నది. 'తదా' అనుశబ్దమునకు ముక్తిదశయం

(తరువాయి 25 వ పేజీలో)

## ప్రకటన.

మంచి పనివారలచే, శాస్త్రీయముగా, మంచి లోహములతో తయారు చేయబడిన భగవద్విగ్రహములు దొరకును.

ఇపుడు రెండు వీరలక్ష్మి విగ్రహములు సిద్ధముగా యున్నవి. ఒకొక్కటి ఎత్తు సుమారు 16 అంగుళములు తూకము సుమారు 2 మణుగులు ఖరీదు 1కి రూ 125/- పోస్టు - ప్యాకింగు ఖర్చులు వేరు.

వం. రంగాచారి.
ఆర్తమూరు. (వయా) ద్వారపూడి.
తూర్పు గోదావరి జిల్లా.



## శ్రీమాన్ ముద్రణాలయము, మెయిన్ రోడ్, కాకినాడ.

మీకు తెలుగు, ఇంగ్లీషు, హిందీలలో ఏవిషయమునైనను ముచ్చటగ ముద్దులొలుకు నటుల సకాలములో చక్కగా అచ్చువేసి అందివ్వగలము. రేట్లు చాల సరసము.

ఆఫ్సెటోను, లైను బ్లాకులు కూడ జింకులోగాని, రాగిలోగాని చక్కగా తయారుజేసి ఈయబడును.

జింకులో చ. అం. 1కి 0-6-6
రాగిలో చ. అం. 1కి 0-12-6
చార్జి చేయబడును.

సగము సొమ్ము అడ్వాన్సుతో ఆర్డరు పంపవలసినది.

బ్లాకు కనీస ఛార్జి రూ 2-0-0






(శ్రీమతి సా. తూ. వెం. చూడామణి.)



(కళ్యాణి పత్రికానువాదము.)

భారతవర్షమున అనేకరాజ్యములు ప్రతిష్ఠింప బడెను. ప్రతాపశాలులగు పెక్కురు రాజులు ధర్మబద్ధులై వాటిని పాలించిరి. నహుషుడు, యయాతి, శిబి, హరిశ్చంద్రుడు మొదలగు ప్రతాపవంతులగు చక్రవర్తులును దశరథునివంటి భగవదనుగ్రహపాత్రులగు చక్రవర్తులును తమ శరీరములను పరిత్యజించియైనను సత్యమును డిరి. వీరినందరను మనము శ్రద్ధాభక్తులతో స్మరించుచునే యుందుముగాని వీరి రాజ్యములను మాత్రము నహుషరాజ్యము శిబిరాజ్యము హరిశ్చంద్రరాజ్యము దశరథరాజ్యము అని స్మరించుటలేదు. గాని "రామరాజ్య"మని మాత్రము చెప్పుచు సర్వదా స్మరించు చున్నాము. రామునకును ఆయనరాజ్యమునకును ప్రేమతో శ్రద్ధాంజలి నర్పించుచున్నాము. దీనికి ముఖ్యకారణ మేమని మనము విమర్శించ వలసియున్నది.

పరమాత్మయగు నారాయణుని రామావతారమును "మర్యాదపురుషోత్తముడని" చెప్పుటకు కారణమును పెక్కు రెరుంగరు. శ్రీరామచంద్రుడు సర్వోత్తమమగు మర్యాదలను ప్రతిష్ఠించెను. ఆతడు చక్రవర్తియగుమున్న తన పవిత్రచరిత్రమకాలమున సర్వోత్తమమగు మర్యాదలను పాటించి లోకమునకు చూపించెను. ఒక

(తరువాయి ప్రక్క పేజీలో)

---

(23 వ పేజీ తరువాయి)

దనిఅర్థము. అభేదీభవతి'యనగా పరమాత్మతో జ్ఞానరూపముతో నుండుటలో భేదము లేనివా డగుచున్నాడని యర్థము. ఇక "భేదః అజ్ఞాన కృతో భవేత్" అనగా దేవమనుష్యాది రూపమగు గోచరించుచున్న భేదము జీవుని కర్మరూపమగు నజ్ఞానముచే సంపాదింపబడినది. గాని వాస్తవము కాదని యర్థము. _లేక

అసా_యీ చేతనుడు, తద్భావభావమాపన్నః యీశ్వర విషయకమగు నిరంతరధ్యానముతో కూడుకొనియుండుటను లభించినవాడై తదా_ అట్టి భావనాదశయందు అభేదీభవతి_తనను పరమాత్మకంటె వేరని భావింపడు భేదః తస్య అజ్ఞానకృతః_చేతనునకు (తాను పరమాత్మకంటే వేరనుభేదభావము ఆతనికట్టి భావనారూపమగు జ్ఞానము లేకుండుటవల్లనే కలుగుచున్నది. అని అభియుక్తుల శ్రీసూక్తి కావున ఇందుమూలమున ప్రహ్లాదపరాంకుశప్రభృతుల యభేదానుసంధానం సాంప్రదాయవిరుద్ధంకాదు.

పురుషుడు సమాజము తనపరివారము మొదలగు వారితో నెట్లు ప్రవర్తింపవలయునో తన జీవ యాత్ర నెట్లు గడుపవలయునో పరమాత్మ ప్రాప్తికై ఎట్టిగుణముల, గ్రహించవలయునో త్యాగమును, తపమును, ఎంతవర కవలంబింప వలయునో యనెడు విషయములను తన లీలల మూలమున ప్రత్యక్షీకరించెను. తాను రాజ్యాధి కారమును స్వీకరించినపిదప సర్వోత్తమమగు శాసనపద్ధతిని అర్థనీతిని, ధర్మనీతిని, సమాజనీతిని, స్థాపించెను. వీటి సమూహమునే రామరాజ్య మందురు.

ఇక మనము రామరాజ్యమన నేమియో దాని నెట్లు స్థాపించవలెనో విమర్శింపవలసి యున్నది. రామరాజ్యమున అన్నివర్గములకును, చెందిన సమస్తస్త్రీపురుషులును తమ వర్ణాశ్రమ ధర్మముల పాలించువారుగను సచ్చరిత్రపరులు గను స్వకర్తవ్యనిష్ఠులుగను యుండిరి. కర్తవ్య నిర్ణయమును ఎవరికి తోచునట్లు వారు కల్పించు టకు వీలుగాకుండెను. తమ జీవనశకటమును వేదమార్గముతోను శాస్త్రవచనముల తోను ముందుకు సాగించుచుండిరి. ఇందుకు ఫలితముగ వారు రోగమునుగాని శోకమునుగాని భయమును గాని ఎన్నడును పొందక యుండిరి. ప్రతి వ్యక్తియు స్వధర్మపరాయణులుగను కామక్రోధ లోభమోహమదవిదూరులుగను నుండిరి. ఒక రితో నొకరు కలహింపకుండిరి. అందుమూలమున స్వాభావికమగు ప్రేమ వృద్ధిపొందుచుండెను. ప్రతివ్యక్తియు గుణగ్రాహియు గుణసంపన్ను డును. పుణ్యాత్ముడును జ్ఞానియును చతురుడునై యుండెను. ఆతని చాతుర్యము భగవద్భజనయం దును ఆధ్యాత్మికవిజ్ఞానమందును ప్రవర్తించు చుండెను గాని పరదార పరద్రవ్యాపహరణముల యందు గాకుండెను. ఆకాలమున మానవుల ఇట్టి కర్తవ్యపాలనప్రభావము పశుపక్ష్యాదులయందు కూడ ప్రవహించుట యొక మహాదాశ్చర్యము. గోస్వామివ్రాసినట్లుగజ **పంచాశ్యములు** కలసి వర్తించుచుండెడివి.

దైహిక దైవిక భౌతికములనబడు తాపములు రామరాజ్యమున మచ్చునకైనను కానంబడ కుండెను. ధర్మనియమములను తదంతర్గతమగు ఆరోగ్యనియమములను పాలించువారికి భయశోక రోగాది దైహికతాప మెట్లు సంభవించును? ఇక దైవికతాపములన్ననో స్వకర్తవ్యవిముఖులను అధార్మికవ్యక్తులను దండించుటకై దండరూప ముగా వాటిని భగవంతుడు కల్పించుచుండును. వాటికి రామరాజ్యమున అవలంబనమే లేకుం డెను. ఇట్లు ప్రకృతిప్రభావితమగుతరి భౌతిక తాపములకు తావెచ్చట?

రామరాజ్యమున ఆంతరిక బాహ్య ఆర్థిక వైషమ్యములు బొత్తుగ లేకుండెను. ఆకాలపు మనుష్యులు సద్భావ సద్విచార పరమార్థములనే తమకు పరమలక్ష్యములుగా పరిగణించినవారగు టచే వారి యంతఃకరణలు ప్రసన్నములై వారు భగవద్భక్తిసుధా ధారలయందు మునుగుచు తేలుచు పరమపదాధికారులై యుండ వారి

యందు ఆత్మికవైషమ్య మెట్లునిలుచును? వారంతటను తమ స్వామినే సాక్షాత్కారించుచుండిరి. ఇట్లు ఆత్మికవైషమ్య మడుగంటగనే బాహ్యవైషమ్య మెటుపోయెనో కానరాకుండెను. ఎవనికిగాని ఏపుడుగాని ఏవిషయమునుగూర్చిగాని గర్వించుటకును పెద్దపిన్న తనమును పాటించుటకుగాని అవకాశమే లేకుండెను.

పర్వతములద్వారా వలయునన్ని మణిమాణిక్యము లొసంగబడుటచేతనో సముద్రుడు రత్నములను తీరమునకు విసరుచుండుటచేతనో విలాసవ్యాపారములు ఉచ్ఛృంఖలములుగ విజృంభింపకుండుటవలననో ప్రతివ్యక్తియు తన కర్తవ్యములను పాలించునిష్ఠలోనిమగ్నుడై యుండుటచేతనో ముద్రయనునది బొత్తుగ లేకుండుటవల్లనో రామరాజ్యమున ఆర్థికవైషమ్యము అడుగంటెను. అనగా రామరాజ్యమున విపుల వ్యాపారములు లేవని భ్రమింపరాదు. వైశ్యులు తమకర్తవ్యదృష్టితో గొప్ప గొప్ప వ్యాపారములను చేయుచునే యుండిరి. గాని రామరాజ్యమున వస్తువులన్నియు మూల్యములేకనే అమ్మబడుచుండెను. ఎవనికి ఏవస్తువుకావలసియున్నను వాడావస్తువును వలయునంత బజారునుండి పొందగలుగుచుండెను. కావుననే అపుడు విశేషముగ వస్తుసంగ్రహణావశ్యకత లేకుండెను.

రామరాజ్యమున పాపమేలేకుండుటచే అపరాధులే లేకుండిరి. గోస్వామిచెప్పినట్లు రాజ్యమును చక్రవర్తియగు శ్రీరామచంద్రుడెపుడైనను ప్రజల కాధ్యాత్మికజ్ఞానమునుగూర్చి చెప్పదలచినచో వారి యెదుట చేతులు జోడించి 'నేను తమ యాజ్ఞఅయినచో కొంచెము విన్నవించబోవుచున్నాను. మీకుమంచిదని తోచినచో వినుడు. అట్లు తోచకున్నను ప్రమాదవశమున నే నేదైన నీతిబాహ్యమగు మాటను చెప్పినను వెంటనే నన్నడ్డివేయుడు' అని విన్నవించుచుండును. ఇందువలన రామరాజ్యమున ప్రజాప్రభువుల కెట్టి సంబంధ ముండెడిదో సుస్పష్టముగ తెలియుచున్నది. ఈ రాజ్యమున ప్రతివ్యక్తియు ఉభయలోకములను సఫలపరచెను ఇట్టి మర్యాదామండితమగు రాజ్యము ఎన్నడును స్థాపించబడజాలదు, ఇట్టి మహత్తరమగుటచేతనే ఇన్ని యుగములు గడిచినను నేటికి భారతీయులు పవిత్ర రామరాజ్యమును స్మరించుచునే యున్నారు.



# భగవద్గీత - ద్వితీయాధ్యాయము

### ★ పూర్వాధ్యాయముతో గల సంబంధము

క్రిందటి అధ్యాయమున అర్జునుడు ఆప్త, బంధు, మిత్రాదుల గాంచి కృపావిష్టాంతరంగుడై విలపించుచు క్షత్రియకులోచితమైన ధర్మయుద్ధమునుండి విరమించెను. శ్రీకృష్ణపరమాత్మ యన్ననో, అర్జునుని మిషగాగొని వైదిక, పరమవైదిక ధర్మసంస్థాపన పురస్సరముగా భూ భారమును పరిహరించుటకై యవతరించెను గాన యెట్లైనను ఆతని యజ్ఞానమును పరిహరించి యుద్ధోన్ముఖుని గావించి తన యవతార ప్రయోజనమును సఫల పరచుటకై ఆతని విషాద బీజమును సయుక్తికముగను, సప్రమాణమునుగను యీ అధ్యాయమున పరిహరించుచున్నాడు.

### ★ అధ్యాయ నామ నిర్వచనము

ఒక అధ్యాయమున అనేక విషయములు ప్రతిపాదించబడినను అందేది ముఖ్యతమముగ భగవానుడు సంకల్పించి యుపదేశించెనో ఆపేరాయధ్యాయమునకుంచబడినది. అట్టి అధ్యాయమునకు సాంఖ్యయోగమని పేరు. "ఏషా తేఽభిహితా సాంఖ్యేబుద్ధి" అనెడు శ్లోకవ్యాఖ్యానమును శ్రీభాష్యకారులు "సంఖ్యా-బుద్ధిః, తయా అవధారణీయం (ఆత్మతత్త్వం) సాంఖ్యం" అని సాయించిరి. ఇందు మూలమున సాంఖ్యమనగా ఆత్మతత్త్వమని యర్థము తేలుచున్నది. "పురుషం నిర్గుణం సాంఖ్యం" అనెడు శ్రౌపనిషద ప్రసిద్ధినిబట్టి పరమాత్మయందు వలెనే జీవాత్మయందును సాంఖ్యశబ్దము ప్రయోగించబడుట ప్రసిద్ధము. ఆత్మానాత్మ వివేకము లేకుండుటచే అర్జునునకు శోకముదయించెనుగాన ఆతని కాత్మజ్ఞానము కలుగ చేయవలసియున్నది. మరియు ప్రథమషట్కమునందు కర్మజ్ఞానయోగములు లెస్సగా ప్రతిపాదించ బడుచున్నది. అందు మొదటిదియగు కర్మయోగమునకు ఆత్మతత్త్వమవశ్య జ్ఞాతవ్యమగుటచేతనుగూడ యీ అధ్యాయమున అదియే ప్రధానముగా ప్రతిపాదించబడుటచే దీనికా పేరుంచబడినది.

### ★ ఇందుచెప్పబడిన విషయములు

ఇందు మొదటిశ్లోకమున గీతోపదేశనిమిత్తము సూచింపబడెను. రెండు మూడు శ్లోకములయందు అర్జునునిదుఃఖము పండితులకు తగనిదియు పరలోకవిరోధియు అపకీర్తిపాలుగావించునదియు కావున పరిత్యాజ్యమని శ్రీకృష్ణుడర్జునునకుపదేశించెను. నాలుగైదుఆరుఏనిమిదిశ్లోకములయందు పరమపురుషునుపదేశించిన యుద్ధోన్యాసము క్రమముగ మోక్షసాధనమగుటచే హితతమమని ఎరుంగక అర్జునుడు దానిని ప్రతిషేధించుచున్నాడు. ఏడవ శ్లోకమున పరమరహస్యమగు వేదాన్తార్థమును

'అడుగక నుడువరాదను' న్యాయముచే ఆ రీతితో శరణాగతిని గావించి ప్రశ్నించిన శిష్యగుణ సంపత్తి సూచించబడెను. తొమ్మిదవశ్లోకమును అర్జునుని యుద్ధవిరమణనిశ్చయము తెలుపబడెను పదియవశ్లోకమున భావిగీతోపదేశము సూచింపబడెను. పదకొండవశ్లోకమున వివేకవంతులు ఆత్మలనుగురించిగాని దేహములనుగురించిగాని దుఃఖించుట యనుచితమని సంగ్రహముగా శ్రీకృష్ణు డర్జునున కుపదేశించెను. పన్నెండవ శ్లోకము మొదలు పదునెనిమిదవ అధ్యాయము నందలి అరవైయారవ శ్లోకమువరకు శ్రీకృష్ణు డర్జునున కుపదేశించిన గీతాప్రబంధమగుటచే యీశ్లోకము గీతాశాస్త్రమునకు ప్రథమశ్లోకము ఈ శ్లోకము మొదలు "దేహీ నిత్య మవధ్యోయం" అను శ్లోకమువరకు యీ అధ్యాయమున ప్రధానప్రతిపాద్యమగు ఆత్మతత్వ ముపదేశింపబడుటచే యీ శ్లోక మాయుపదేశమునకు మొదటిశ్లోకము. ఇందాత్మనిత్యత్వమున్నూ ఆత్మలకు పరస్పరమున్నూ పరమాత్మతోనుగల వాస్తవ భేదమున్నూ ఉపదేశింపబడెను. పదమూడవశ్లోకమున ఆత్మ నిత్యమగుచో దానికి జననమరణాది ప్రతీతి వ్యవహారములు ఎట్లు కుదురుచున్న వను శంకకు సదృష్టాంతముగా సమాధాన మొసంగబడెను. పదునాల్గు పదిహేను శ్లోకములయందు ఆత్మనిత్యత్వప్రకరణ పర్యవసానమున చెప్పవలసిన "శీతోష్ణాది సుఖదుఃఖముల నొసంగు యింద్రియములకు విషయములతోగల సంపర్కమును సహించువాడు మోక్షమున కర్హుడగును." అను విషయము తాత్పర్యాతిశయవశమున ముందుగనే చెప్పబడినది. పదహారవశ్లోకము మొదలు ముప్పదియవ శ్లోకమువరకు పూర్వము చెప్పబడిన ఆత్మలకు నిత్యత్వమున్నూ శరీరములకు అనిత్యత్వమున్నూ ఉపపాదించబడుచున్నది. 17 వ శ్లోకమున ఆత్మ నిత్యత్వము సహేతుకముగను సంపాదింపబడెను. 18వశ్లోకమున దేహములకు వినాశిత్వమే స్వభావమని చెప్పబడెను. 19 వ శ్లోకమున శస్త్రాదులకును ఆత్మలకును చంపుట చంపబడుట యనునవి యసంభావితములుగాన నట్లు తలచుట మూర్ఖతయే యని చెప్పబడెను. 20 వ శ్లోకమున ఆత్మనశించనిదిగాన దానికేవిధములగు వికారములు లేవని నిర్ణయింపబడెను. 21 వ శ్లో॥ ఇట్లెరింగినవాడు ఆత్మనాశనమున కెన్నడును కర్తయును ప్రేరకుడును కాడని చెప్పబడెను. 22 వ శ్లోకమున ఆత్మ నశింపకున్నను రమణీయ భోగసాధనములగు శరీరములు నశించినను కళ్యాణతరమగు "యుద్ధమృతులను" దేహప్రాప్తి నిశ్చితముగాన అందులకై దుఃఖింపతగదని సోదాహరణముగ నిరూపింపబడెను. 23, 24 శ్లోకములయందు వెనుకచెప్పబడినఆత్మనిత్యత్వమే ధృడీకరింపబడెను. 25 వ శ్లో॥న ఆత్మ నిత్యత్వ సమర్ధనము నుపసంహరించుచు దానిని గూర్చి విచారించరాదని ఉపదేశింపబడెను. ఇంతవరకు శరీరముకంటె వేరగు నాత్మ నంగీకరించు ఆస్తికులకు ఆత్మలనుగూర్చి దుఃఖింపరాదనిచెప్పి 26, 27 శ్లో॥ ల యందు దేహమే యాత్మయనెడు నాస్తిక దృష్టిలోనైనను దానినిగూర్చి విచారించరాదని సమర్ధించబడెను. 28 వ శ్లో॥న నిత్య

మగు వస్తువునకు అవస్థలుమారుటచే కలుగునట్టి శోకావేశము మనుష్యాది భూతముల విషయమై కలుగరాదని చెప్పబడెను. 29 వ శ్లోకమున శరీరముకంటె వేరగు నిత్యాత్మ వివేకముగల ఆస్తికుడు లోకమున దుర్లభుడని చెప్పబడెను. 30వశ్లోకమున ఆత్మనిత్యమన్నా దేవాదివైష మ్యము శరీరగతమున్నా అగుటచే ప్రపంచమున నేపాణిని గూర్చియు శోకించరాదని యుప దేశించి అస్థానకారుణ్యము నివారింపబడెను. 31వశ్లోకముమొదలు 34వశ్లోకమువరకు అర్జును నకుకల్గిన ధర్మమగు యుద్ధమునందలి అధర్మ బుద్ధి పోగొట్టబడుచున్నది. 35,36వశ్లోకముల యందు ఆసమయమందు కలిగిన కరుణ అస మంజసమని పరిహరించబడుచున్నది. 37వ శ్లోక మున యుద్ధలాభాలాభములు రెండును అర్జును నకు శ్రేయోదాయకములని ప్రోత్సహించబడు చున్నది. 38వ శ్లోకమున ముముక్షువు యుద్ధము నెట్లు గావించవలెనో చెప్పబడెను. 39వశ్లోక మున కర్మయోగోపదేశము ప్రారంభమయ్యెను. 40వశ్లోకమున కర్మయోగమహాత్మ్యము చెప్ప బడెను. 41వశ్లోకముమొదలు 44వశ్లోకమువరకు కామ్యకర్మ విషయికబుద్ధికంటెమోక్షసాధనమగు కర్మవిషయకమయిన బుద్ధి శ్రేష్ఠమని చెప్పి కర్మతుల నిందించెను. 45,46 శ్లోకములయందు ముముక్షువైనవాడు వేదము నెట్లు ప్రమాణముగా పరిగ్రహించవలెనో తెలుపబడెను 47.48శ్లోక ములయందు సాత్వికుడగు ముముక్షువు కర్మల నాచరించవలసిన విధాన ముపదేశించబడెను. 49శ్లో. మొదలు 52వశ్లోకమువరకు కర్మయోగ

ములో అంతర్భూతమైన జ్ఞానాంశముయొక్క ప్రాధా న్యము ప్రతిపాదింపబడెను. 53వశ్లోకమున కర్మ యోగమునకు ఫలమగు స్థితప్రజ్ఞతయు తన్మూ లకమగు ఆత్మావలోకనమును చెప్పబడెను. 54వశ్లోకమున అర్జునుడు స్థితప్రజ్ఞుని గూర్చి ప్రశ్నించెను. 55 మొదలు 58వరకు నాలుగు శ్లోకములచేతను స్థితప్రజ్ఞునియొక్క నాలుగవస్థ లున్నా వ్యుత్క్రమముగా చెప్పబడెను. 59వ శ్లోకముమొదలు 68 వ శ్లోకమువరకు యింద్రి యములను జయించుట దుష్కరమనియు వాటిని సుకరముగా జయించు ఉపాయమును చెప్ప బడెను. 69 శ్లోకముమొదలు అధ్యాయాంతము వరకు జితేంద్రియునక్కు కలుగు ఫలము ప్రతిపా దించబడెను.

## స్థితప్రజ్ఞావస్థ

స్థితప్రజ్ఞావస్థయనగా నిష్కామకర్మయోగా నుష్ఠానమువలన పుట్టునట్టియు యోగమనబడు ఆత్మావలోకనమునకు సాధనమగునట్టియు ఒక అవస్థ ఇయ్యది "యతమాన, వ్యతిరేక, ఏకేం ద్రియ, వశీకరణ" యనబడు నాలుగంతరము లుగ నుండును. ఈ నాల్గవస్థలును పరినిష్పన్న మైన కర్మయోగికి ప్రకృతిసంబన్ధరహితమగు శుద్ధాత్మస్వరూపము సాక్షాత్కరించును. దీని మూలమున పరమాత్మప్రాప్తికి అవ్యవహిత మగు సాధనమైన భక్తియోగము సిద్ధించును. ఎట్లనగా సర్వాభరణభూషితుడును, సర్వాంగ సుందరుడునునగు నొక రాజపుత్రుడు అత్యంత బాల్యముననే దొంగలవశమై మహారణ్యమునకు

గొనిపోబడెను. అచ్చట నా దొంగ లాతని యాభరణముల నపహరించి కాలుసేతుల బంధించి విడిచిపోయిరి. దైవవశమున వెదుళ్ళకై యచ్చటికేతెంచిన మేదరి యొకఁడాపిల్లవానిని గాంచి, కృపావిష్టచేతస్కుఁడై యాపిల్లవానిని తనయింటికి గొనిపోయి ప్రేమతో సాకదొడంగెను. అంత నాబాలుఁడు ఆమేదరినే తన తండ్రిని గను, అతని భార్యనే తన తల్లినిగను భావించుచు ఔరసపుత్రునివలెనే పెరుగుచు వారి దైనికకృత్యములలో తోడ్పడుచుండెను. ఇచట యీబిడ్డని తండ్రియగు మహారాజు తన యల్లారు ముద్దుబిడ్డఁడు గానక దుఃఖితుడై యంతటను వెతికించుచుండెను. ఈబిడ్డఁడు జన్మించినప్పుడు జాతకర్మాదుల జేయించి సాముద్రికలక్షణముల గుర్తించి జాతకమును వ్రాసిన పురోహితుఁడు దైవవశమున నీబిడ్డఁడు పెరుగుచున్న గ్రామము నకు వచ్చుట తటస్థించెను. వీధులలో తట్టల నమ్ముకొనుచున్న మేదరిననుగమించు యీబాలకుని గాంచి లక్షణములను బట్టి తన రాజపుత్రుఁడే యని నిశ్చయించి యామేదరివలన యాబిడ్డని నిజవృత్తాంతమెరింగి బిడ్డా! నీతండ్రి యొక సార్వభౌముఁడు. నీవనుకొనిన వీరు నిజముగ నీ తల్లిదండ్రులు కారు. దురదృష్టవశమున నీవు వీరి పాలబడితి వని యాతని వాస్తవస్వరూపము తెలిబుచ్చెను. అంత నాబాలుఁడు తన నిజస్వరూపమునెరింగి ఆశ్చర్యచకితుఁడై తన తండ్రిని జేరు మార్గ ముపదేశింపుమని యాతని పాదములపై బడి ప్రార్థించి యాతఁడుపదేశించిన మార్గమును తప్పక యవలంబించి తన తండ్రి సాన్నిధ్యమును జేరి సకలవిధసన్మానములతో స్వీకరింపబడి తన తల్లిదండ్రుల నానందాబ్ధి నోలలాడించి తానును నిరతిశయానందము ననుభవించినట్లే యీ చేతనుఁడును తన ప్రాక్తన కర్మలచే నపహరింపబడి అపహతపాప్మత్వాది గుణాభరణములఁగోల్పోయి ప్రాకృతికగుణములచే బంధింపబడి సంసారమహారణ్యమున విడువబడెను. పిమ్మట నేదోయొక కులీనునింట సాకబడి వారినే తన తల్లితండ్రులని భావించుచు వారి కులవృత్తుల కలవడి పెరుగుచుండగా భగవత్ప్రేరణచే తన లక్షణముల జక్కఁగ నెరింగిన దివ్యదేశికులవలన తన వాస్తవ స్వరూప మెరింగింపబడును. అంత నీ జీవుఁడు తన నిజస్థితిని పొందుటకు తహతహలాడుచు యా దేశికుల మూలమున తన నిరుపాధిక తలిదండ్రులగు శ్రీ నారాయణుల సారూప్య సాలోక్య సామీప్య సాయుజ్యముల నందుటకు వలయు మార్గముల నెరింగి అచిరకాలమున స్వస్వరూపమును లభించి శ్రీ వైకుంఠమున శాశ్వత మహానందము నందుచుండును. కావున నీజన్మమున మోక్షేచ్ఛవొడమిన ప్రతివ్యక్తియును తన కర్తవ్యమగు నిష్కామకర్మయోగము నవలంభించి దాని మూలమున నీ స్థితప్రజ్ఞావస్థను దానివలన స్వాత్మసాక్షాత్కారమును తన్మూలమున భక్తియోగమును దానికి వెనువెంటనే మోక్షమును పొందవలసియున్నది.

ఈయధ్యాయమున 54వశ్లోకమున అర్జునుఁడు స్థితప్రజ్ఞావస్థను గూర్చి శ్రీకృష్ణుని "స్థితప్రజ్ఞుని స్వరూప మెట్టిది, అతఁడు దేనిని గూర్చి మాట్లాడును.? అత డెట్లనుసంధించును? అత

డెట్లు ప్రవర్తించును ? అని నాలుగు ప్రశ్నలడిగెను. 'స్థితప్రజ్ఞస్య' అను ప్రశ్నవాక్యమునందలి "కిం భాషా" యని వాచనిక వ్యాపారమును "కిం వ్రజేత" యని కాయిక వ్యాపారమును 'కిం మాసీత' యని మానసవ్యాపారమును ప్రశ్నించెను అని దేశికులు.

శ్రీకృష్ణుడు వాటికి ప్రత్యుత్తరమొసంగుచు స్థితప్రజ్ఞునియొక్క పైనిచెప్పబడిన నాల్గవస్థలను వ్యుత్క్రమముగా నుపదేశించెను. కర్మయోగి మొదట తన బాహ్యేంద్రియములను విషయములనుండి మరల్చి మనస్సును ఆత్మప్రవణమగునట్లుగా ప్రయత్నించవలెను. దీనికి యతమానస్థితి యని పేరు. ఇదియే స్థితప్రజ్ఞుని ప్రథమావస్థ. ఇయ్యది-

"యదా సంహరతే చాయం కూర్మోఙ్గనీవ సర్వశః ।
ఇంద్రియాణీంద్రియార్థేభ్యః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥"

అను ౫౮ వ శ్లోకమున చెప్పబడెను.

బాహ్యేంద్రియములు బలవంతముగ విషయములనుండి మరల్చబడినను మిగిలియున్న రాగద్వేషాదిదోషములచే కలుషితమగు మనస్సు తిరిగి వాటిని విషయములయందు ప్రవర్తింపజేయుచు తాను ఆత్మధ్యానమునందే నిలవజాలకయుండును. కావున పక్వముగాక మిగిలియున్న రాగద్వేషమలను విషయములయందలి ఔదాసీన్యముచేతను వాటిని అభినందింపకుండుటచేతను క్రమముగా పక్వము గావింపవలెను. దీనికి "వ్యతిరేకస్థితి"యనిపేరు. ఇయ్యది "యస్సర్వత్రాఽనభిస్నేహః తత్తత్ప్రాప్య శుభాఽశుభం నాఽభినందతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా"

ఇట్లు రాగద్వేషములు పక్వమైనను అనాది నుండియు విషయముల ననుభవించుచుండుటచే నిరూఢమైయున్న వాసనమాత్రము ఆత్మానుభవప్రవణమగు మనస్సును కలతపెట్టుచుండును. భర్తను ద్వేషించు స్త్రీకి సర్వాలంకరణభూషితుడగు నా యువకుడగు భర్తను చూపించి చూపించి క్రమముగ నాతనియందా సక్తురాలను గావించినట్లు మనస్సునకును నిరతిశయానందరూపమగు ఆత్మస్వరూపమును చూపి చూపి దానియం దభిరుచిని పుట్టించి క్రమముగ కొంతకాలమునకు బాహ్యవిషయ వాసనాజాలమును పెల్లగించి పారవేయవలెను. ఇది "ఏకేంద్రియస్థితి" యనబడును. ఇది-

"దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః
వీతరాగభయక్రోధః స్థితధీః ముని రుచ్యతే"॥

అనెడు శ్లోకమున చెప్పబడెను.

ఇట్లు సమస్తవాసనలును వినిర్మూలింపబడుటచే ఔత్సుక్యముగూడ సంభవించుట కవకాశము లేదుగాన పరమవైరాగ్యదశ చేకూరును ఇదియే "వశీకారస్థితి" యనబడును. ఇయ్యది జ్ఞాననిష్ఠకు చరమావధి. ఇది-

"ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ! మనోగతాన్
ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞ స్తదోచ్యతే"॥

అనెడు శ్లోకమున చెప్పబడెను.

ఇదియే యోగమనబడు ఆత్మావలోకనమును సాధించును. ఆ యవలోకనమే క్రమక్రమముగ

శ్రీమతే రామానుజాయనమః

శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ జ్యేష్ఠమాస సభ

చీ రా ల

వికృతినామ సంవత్సర జ్యేష్ఠ బహుళ త్రయోదశి మంగళవారము నుండి అమావాస్య గురువారం వరకు (13–6–1950 నుండి 15–6–1950 వరకు)

శ్రీ ఉ. వే. శ్రీమాన్ కోమాండూరి ఇళ్లైవిల్లి శ్రీనివాస రామానుజాచార్య స్వామివా అధ్యక్షతక్రింద వైశ్యపితామహ కొత్తమాసు రంగనాయకులుగుప్తగారి తోటలో జరిగినది.

—• విచ్చేసిన పండితులు •—

1. శ్రీ ఉ. వే. శ్రీమాన్ కో. ఇ. శ్రీనివాసరామానుజాచార్యులుగారు.
2. ,, శ్రీ శ్రీ శ్రీ యతిరాజ సంపత్కుమారజీయర్ స్వామివారు.
3. ,, తె. కం. గోపాలాచార్యులుగారు.
4. ,, ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులుగారు.
5. ,, నడాదూరు గోపాలకృష్ణమాచార్యులుగారు.
6. ,, శ్రీ తి. పు. వెంకటాచార్యులుగారు.
7. ,, దాస శేషుగారు

స్త్రీలు

1. శ్రీమతి ముడుంబై రామానుజమ్మగారు.
2, శ్రీమతి మరింగంటి రంగనాయకమ్మగారు.

—• సభాకార్యక్రమ వివరములు •—

13–6–50 మంగళవారము

ఉదయం 8 ఘంటలకు తోటలోనుండి జోడుసన్నాయిమేళముతో కాలినడకతో తిరుక ఉత్సవము ప్రారంభించబడెను.

9 ఘంటలకు వైదిక లౌకిక ప్రార్థనలతో సభాకార్యక్రమము ప్రారంభించబడె అధ్యక్షవరణము, కార్యదర్శి నివేదిక అయినతర్వాత అధ్యక్షభాషణము తె. కం. గోపా చార్యులుగారి ఆశీర్వచన శ్లోక ఉపన్యాసములతో సభ ముగింపుచేయబడెను.

మధ్యాహ్నము శ్రీ అద్దంకి అయ్యావార్లంగారి తిరుమాళిగలో స్త్రీలసభ ప్రారంభ శ్రీ ముడుంబై రామానుజమ్మగారి ఉపన్యాసముతో పూర్తిచేయబడె

32 వ పేజీ తరువాయి 36 పేజీలో చూడుడు.

సాయంకాలము 4 ఘం॥ సభాప్రారంభమై శ్రీమాన్ స. గోపాలకృష్ణమాచార్యులు గారు "భగవద్గీతాసారము" షడ్విధతాంతర్యలింగములతో నుపన్యసించిరి. అధ్యక్షులు దానిని వివరించుచు విపులముగ మాట్లాడిరి. సభికులలో నొకరు జిజ్ఞాసశబ్దార్థమునుగూర్చి ప్రశ్నించగా తె. కం. గోపాలాచార్యులుగారు దానినిగూర్చి సమాధానమొసగుచు విపులముగా నుపన్యసించిరి. ౧౧ంటలకు మొదటిరోజుసభ పూర్తి చేయబడినది.

14-6-50 బుధవారము.

ఉదయం 7 ఘం॥ తిరువీధి ఉత్సవము స్వస్తివాచనములతో ప్రారంభమైనది.

8 ఘం॥ సభా ప్రారంభము.

అధ్యక్షులవారి "శ్రీవల్లభీతి" అను శ్లోకార్థోపన్యాసము జరిగిన తర్వాత శ్రీ తి. పు. వెంకటాచార్యులుగారి చరమశ్లోకార్థ వివరణ ఉపన్యాసముతో సభ పూర్తి చేయబడినది.

స్త్రీల సభ

మధ్యాహ్నము శ్రీమతి మరింగంటి రంగనాయకమ్మగారు సభావేదికలోనే ప్రత్యేకము స్త్రీలకు ఉపన్యసించిరి.

సాయంకాలము శ్రీశ్రీశ్రీ జీయర్ స్వామివారి భక్తిప్రపత్తులనుగురించిన ఉపన్యాసము, పరస్పర విరోధిసూక్తిపరిహారము.

అధ్యక్షులు పై ఉపన్యాస విమర్శ, తర్వాత శ్రీమాన్ ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులవారి కఠోపనిషత్తునందలి మూడవవల్లి ఉపన్యాసముతో సభ పూర్తి చేయబడినది.

15-6-50 గురువారము.

ఉదయం 7 ఘం॥ తిరువీధి స్వస్తివాచనములతో ప్రారంభమైనది.

8 ఘం॥ సభాప్రారంభమై శ్రీమాన్ ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యుల వారి "అర్చిరాది మార్గోపన్యాసము" తర్వాత శ్రీ గొల్లపూడి నారాయణ గుప్తగారి ప్రశ్నలకు సమాధానములు ఆళ్వార్ల భక్తినిగూర్చి ప్రశ్న, తదితర ప్రశ్నలు.

## స్త్రీల సభ

మధ్యాహ్నము శ్రీమతి ముడుంబై రామానుజమ్మగారు ఉపన్యసించిరి.

సాయంకాలము శ్రీ దాస శేషగారు శ్రీవైష్ణవమాహాత్మ్యోపన్యాసము, దేశికప్రబంధమునకు వారు వ్రాసిన అనువాదము, పంచకాలకృత్యములు.

శాస్త్రులవారి ప్రశ్నలు; సమాధానములు.

శ్రీ అధ్యక్షులవారు యజ్ఞములనుగూర్చి ప్రశ్నకు ఉత్తరమురూపముగా నుపన్యసించిరి.

శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులుగారు శ్రీవిశిష్టాద్వైతమునందలి మోక్షోపాయ వివరణమును గూర్చిన ఉపన్యాసము.

ప్రసాదవినియోగము, అధ్యక్ష, సంఘ. సన్మానములతో సభ ముగింప చేయబడెను.

---

(36 వ పేజీ తరువాయి)

| | | | |
|---|---|---|---|
| గాలి ఓబులుగారు | 2 | 0 | 0 |
| దివెల రాఘవయ్యగారు | 2 | 0 | 0 |
| గొల్లపూడి రాఘవులుగారు | 2 | 0 | 0 |
| చీమకుర్తి మహాలక్ష్మమ్మగారు | 2 | 0 | 0 |
| పద్మనాభుని వెంకటేశ్వర్లుగారు | 2 | 0 | 0 |
| శిఖాకొల్లు గురునాదంగారు | 2 | 0 | 0 |
| మువ్వల వెంకటసుబ్బారావు అండ్ కంపెనీ | 2 | 0 | 0 |
| మేదూరి సుబ్బారావుగారు | 2 | 0 | 0 |
| బందా వెంకటనరసింహంపంతులుగారు | 1 | 0 | 0 |
| కొల్లా సత్యనారాయణగారు | 1 | 0 | 0 |
| భోగ్యం వెంకయ్యగారు | 5 | 0 | 0 |
| ఓలిశెట్టి ఆదెమ్మగారు | 10 | 0 | 0 |
| ఆలపాటి పున్నమ్మగారు | 2 | 0 | 0 |
| తీగెల పిచ్చెమ్మగారు | 4 | 0 | 0 |
| పట్నిశెట్టి రామయ్య అండ్ సత్యంగార్లు | 4 | 0 | 0 |
| దాసరి అప్పన్నగారు | 5 | 0 | 0 |
| బగ్గారపు పోలయ్యగారు | 1 | 0 | 0 |
| పోలాని రాజులుగారు | 5 | 0 | 0 |
| మురారిశెట్టి నమశ్శివాయగారు | 2 | 0 | 0 |
| బుమ్మడిశెట్టి రామయ్యగారు | 2 | 0 | 0 |
| పద్మనాభుని కేశవులుగారు | 3 | 0 | 0 |
| ఒకభక్తులు | 2 | 0 | 0 |
| పద్మనాభుని చిననాగయ్యగారు | 10 | 0 | 0 |
| మొత్తం | 537 | 0 | 0 |

★ ఈసభలకై అయిన ఖర్చులు జాబితా:-

| | | | |
|---|---|---|---|
| సంఘమునకై సమర్పించిన సంభావన | 58 | 0 | 0 |
| అధ్యక్షులవారికి సంభావనకై | 58 | 0 | 0 |
| పండితుల కిచ్చిన రాకపోక ఖర్చులు | 92 | 0 | 0 |
| విదుషీమణులకిచ్చిన రాకపోకఖర్చులు | 22 | 0 | 0 |
| సభ ఏర్పాటులకు | 15 | 0 | 0 |
| అచ్చుకు పోష్టేజివగైరాలు | 22 | 0 | 0 |
| తదీయారాధన లైటింగు పనివార్లకు ఉత్సవములకు తళిహాస్వామికిచేర్చి | 208 | 0 | 0 |
| మొత్తం | 475 | 0 | 0 |

| | | | |
|---|---|---|---|
| జమలు మొత్తం | 537 | 0 | 0 |
| ఖర్చులు మొత్తం | 475 | 0 | 0 |
| పోను నిల్వ | 62 | 0 | 0 |

ఈరూపాయిలు ఈసంఘ కేంద్ర కార్యాలయము నందు నిల్వయుంచబడినది.

ఇదిగాక విరోధిసంవత్సరం సభల బాపతు 48-0-0రు ఈసంఘ చీరాలశాఖకార్యదర్శులైన శ్రీ ఘట్వాడ గోపాలస్వామిగారివద్ద నిల్వయుంచ బడినవి.

ఈసభలకు విరాళములు నొసంగిన దాతల నామధేయములు.

| | రు. | అ. | పై. |
|---|---|---|---|
| శ్రీమదద్దంకి తిరుమల సమయోద్దండ కోలాహలలక్ష్మీనరసింహకుమారతిరువేంగడ తాతదేశికాచార్యులు అయ్యవార్లంగారు | 50 | 0 | 0 |
| ముప్పాల లక్ష్మయ్యగారు బక్షిబియ్యం | 48 | 0 | 0 |
| పద్మనాభుని సుబ్బారాయుడుగారు | 35 | 0 | 0 |
| పువ్వాడ గోపాలస్వామి అండ్ బ్రిదర్స్ | 25 | 0 | 0 |
| గుంటూరు శేషయ్యగారు | 25 | 0 | 0 |
| పద్మనాభుని బాపనయ్య అండ్ వెంకటసుబ్బారావు | 25 | 0 | 0 |
| కొమాండూరి వెంకటవరదాచార్యులుగారు | 25 | 0 | 0 |
| పద్మనాభుని బాపనయ్యగారు | 21 | 0 | 0 |
| నేరెళ్ళ శ్రీరామమూర్తి అండ్ బ్రిదర్స్ | 10 | 0 | 0 |
| గొల్లపూడి నారాయణగుప్తగారు | 10 | 0 | 0 |
| తడవర్తి సుబ్బారాయుడు అండ్ సన్స్ | 10 | 0 | 0 |
| అరవపల్లి సుబ్బారావుగారు | 10 | 0 | 0 |
| గర్రింధి రామకోటి బ్రిదర్స్ | 10 | 0 | 0 |
| పచ్చిపులుసు అప్పయ్య రాఘవయ్యగార్లు | 10 | 0 | 0 |
| చుందూరు స్వామిగారు | 10 | 0 | 0 |
| దావుల హరిప్రసాదరావుగారు | 10 | 0 | 0 |
| సంకా బాపనయ్యదూరెడ్లనారాయణఅండ్ కంపెనీ | 10 | 0 | 0 |
| కోటేశ్వరటింబర్ డిపోవారు | 10 | 0 | 0 |
| పద్మనాభుని సుబ్బారావుగారు | 10 | 0 | 0 |
| పద్మనాభుని రామకోటిగారు | 5 | 0 | 0 |
| ఎంగిసెట్టి సుబ్బారావు అండ్ కంపెనీ | 5 | 0 | 0 |
| కొత్త శేషయ్యగారు | 5 | 0 | 0 |
| ముద్దాలి సుబ్రహ్మణ్యంగారు | 5 | 0 | 0 |
| చుందూరు ఓబయ్యగారు | 5 | 0 | 0 |
| ముప్పాల సుబ్బారావుగారు | 5 | 0 | 0 |
| అచ్యుతుని వెంకటసుబ్బారావుగారు | 5 | 0 | 0 |
| శిరాం రామయ్యగారు | 5 | 0 | 0 |
| కోట సుబ్బయ్యగారు | 5 | 0 | 0 |
| దివెల సూర్యంగారు | 5 | 0 | 0 |
| దివెల కాశీవిశ్వనాధంగారు | 5 | 0 | 0 |
| గొల్లపూడి వెంకటేశ్వర్లుగారు | 5 | 0 | 0 |
| తప్పా నాగభూషణంగారు | 5 | 0 | 0 |
| పద్మనాభుని రాఘవమ్మగారు | 5 | 0 | 0 |
| రంగా సుబ్బారావుగారు | 5 | 0 | 0 |
| సోమూరి లక్ష్మయ్యగారు | 5 | 0 | 0 |
| దివెల బుచ్చయ్యగారు | 4 | 0 | 0 |
| వై. రంగనాయకులుగారు | 3 | 0 | 0 |
| పల్లంపట్టి సుబ్బారావుగారు | 2 | 0 | 0 |
| నాగవరపు వెంకయ్యగారు | 2 | 0 | 0 |
| మేడూరి రామమూర్తిగారు | 2 | 0 | 0 |
| చందూరి సుబ్బయ్యగారు | 2 | 0 | 0 |
| నిట్టూరి కోటయ్యగారు | 2 | 0 | 0 |
| దివెల సత్యనారాయణగారు | 2 | 0 | 0 |
| దివెల సీతారామస్వామిగారు | 2 | 0 | 0 |

(మిగతావి 35 వ పేజీలో)

(32 వ పేజీ తరువాయి)

నిరతిశయ పురుషార్థమగు అమృతత్వమును సాధించును.

ఈ పై నాల్గవస్థలకును క్రమములనుగా మారకుండుట మారినను వాటియందు సంగము లేకుండుట లేనిచో మాత్రి సంగముచే నవి యనుభవించబడుచున్నను వానియందత్యంత స్నేహము లేకుండుటే విషయరాగితము ప్రసక్తమై యున్నను దాని సరిదిద్దుటకు యత్నించుట యనునవి యిందు చెప్పబడిన క్రమము ననుసరించి పరస్పర వైషమ్యము సాధించుకొనవలెను. అజ్ఞునకు కలిగిన ప్రశ్నలకు ఆత్మరతిత్వమే స్థితప్రజ్ఞుని స్వరూపమనియు ఆశ్చర్యవత్పశ్యతి యనునట్లు సతత మాత్మనుగురించియే యాతడు భావించు ననియు "సుచౌ దేశే ప్రతిష్ఠాప్య ఇత్యాదులచే నీవ యధ్యాయమున చెప్పబడినట్లు ఆత్మానుసంధానమే యాతని మానసిక వ్యాపారమనియు ఆత్మప్రాప్తికై ఆతడు ప్రవర్తించుటయే ఆతని కాయిక వ్యాపారమనియు సమాధాన మొసంగబడెను.

రిజిష్టరు నెం. 5049.

Book-Post

# భక్తినివేదన

(వేదాంత మాసపత్రిక)

ఇందు వేదాంత విషయ రాజములున్ను; భక్తిప్రచార విషయమైన వార్తలున్ను; వేదాంత సాంప్రదాయ విషయకమైన ప్రశ్నోత్తరములున్ను ప్రచురింపబడును,

## చందాలు:

| | | |
|---|---|---|
| సాధారణ చందా | సం. రం 1కి | రు. 5-0-0 |
| సహాయ చందా | ,, | రు. 10-0-0 |

## పోషకులు:

| | | |
|---|---|---|
| పోషకులు | సం. రం 1కి | రు. 25-0-0 |
| రాజపోషకులు | ,, | రు. 58-0-0 |
| మహారాజ పోషకులు | ,, | రు. 116-0-0 |

## కార్యాలయము:

“భక్తి నివేదన” కార్యాలయము,

అర్తమూరు (వయా) మండపేట.

తూర్పుగోదావరిజిల్లా.

Edited printed & published by A. ch. Srimannarayana charyulu at Sriman press, Artamuru,

శ్రీమతే రామానుజాయ నమః



# శిఖాయజ్ఞోపవీతముల వైజ్ఞానిక రహస్యము

హిందూ సంస్కృతికి ఉపయుక్తములగు బాహ్యచిహ్నములలో త్రైవర్ణికుల (బ్రాహ్మణ క్షత్రియ వైశ్యుల)కు ప్రధానమగునవి శిఖా యజ్ఞోపవీతములు. ఇవి శాస్త్రమూలకములును, అదృష్టమూలకములును అగుటచే వీటికి దృష్ట (ఈలోకమున వెంటనే గాన్పించు) ప్రయోజనమును జెప్పవలసిన యవసరములేదు. ఐనను కేవల హేతువాదముపై నాధారపడు ఆధునిక సమయమున నందరును బాహ్యమగు దృష్ట ప్రయోజనమును ప్రశ్నించుట యాచారము. వారినికూడ సంతృప్తిపరచుటకే యీక్రింది పంక్తులు వ్రాయబడుచున్నవి.

మొదట యీ చిహ్నములను వైదికప్రమాణములను విచారింతము. ఇందులకు మను విట్లు చెప్పుచున్నాడు.

శ్లో. చూడాకర్మ ద్విజాతీనాం సర్వేషామేవ ధర్మతః।
ప్రథమేఽబ్దే తృతీయే వా కర్తవ్యం శ్రుతిచోదనాత్॥

(సమస్తమగు ద్విజాతులకును మొదటి సంవత్సరమునందుగాని, మూడవసంవత్సరమునందు గాని ధర్మపద్ధతి ననుసరించి చూడాకర్మ గావింపవలెనని శ్రుతి దెల్పుచున్నది.)

ఈ శ్లోకమున 'శ్రుతి తెల్పుచున్నద'ని యున్నదిగాన శిఖయుంచుట ముఖ్యకర్తవ్యమని శ్రుతియే తెల్పుచున్నదని చెప్పబడెను.

వేదము మంత్రభాగమనియు బ్రాహ్మభాగమనియు రెండుభాగములు. అందు మంత్రభాగమున "యత్ర బాణాః సంపతంతి కుమారా విశిఖా ఇవ" (శ్రీ. య. 11-48)

అను మంత్రమునందలి విశాఖాశబ్దముచే గోష్పదముతో సమానమగు పరిమాణముగల శిఖకలవారని తెలుపబడుచున్నది.

ఆత్మన్నుపస్థే న వృకస్య లోమ,
ముఖే శ్మశ్రూణి న వ్యాఘ్రలోమ।
కేశా న శీర్షన్ యశసే శ్రియై శిఖా।
సింహస్య లోమ త్విషిరింద్రియాణి॥

(యజు. 19 92)

అనునీమంత్రమున 'యశసేశ్రియైశిఖా'యనెడు వాక్యముచే ఐశ్వర్యము కొఱకును కీర్తికొఱకును శిఖనుధరించవలెనని యున్నది, మరియునిందుశిఖయందలి వెంట్రుకలు సింహముజూలుతో పోల్చబడినవి.

ఇట్లీ రెండు మంత్రములను శిఖాధారణకు సంబంధించిన మంత్రభాగమునకు జెందియున్నవి.

ఇక బ్రాహ్మణ భాగమునకు ప్రమాణములు నారయుదము. ఆపస్తంబసూత్రమున—

"అథాపి బ్రాహ్మణం రిక్తోవా ఏషోఽనపిహితో
యన్ముణ్డః తస్యైత దపిధానం యచ్ఛిఖా"
(అప 1. 10 8)

అను వాక్యమున శిఖలేనివాడు దరిద్రుడగు నని చెప్పబడెను. ఇట్టి విషయమున సనేక ప్రమాణములు కలవు. వాటినటుంచి మన మిపుడు లౌకిక యుక్తులచే శిఖారహస్యమును తెలుసుకొనవలసియున్నది,

యజుర్వేదాంతర్గతమగు తైత్తిరీయోపనిషత్తు నందలి శీక్షాధ్యాయమునందు ప్రథమవల్లి 6వ అనువాకముగందలి ప్రశ్నము[illegible] ఇట్లు చెప్పబడుచున్నది,

అన్తరేణ తాలుకే యఏషస్తన ఇవావలమ్బతే ।
సేన్ద్రయోనిః। యత్రాఽసౌ కేశాన్తో వివర్తతే ।
వ్యపోహ్య శీర్షకపాలే ।

అనగా రెండు దవుడలకును మధ్యభాగమున స్తనమువలె వేలాడుచుండు కొండనాలుక శిరోజముల యొక్క మూలస్థానము, అచ్చట శిరఃకపాలమును భేదించికాని పరమాత్మను పొందుటకు మార్గమగు సుషుమ్నా నాడికలదు, యోగులీనాడిని మేల్కొలిపి దానిమూలమున ఆత్మసాక్షాత్కారమును గావించుచున్నారు. ఈనాడి తనమూలస్థానమునుండి బయలుదేరి లలాటమధ్యభాగమున విహరించుచుండును. ఈ సుషుమ్నానాడియొక్క మూలస్థానమును వైద్యులు 'మస్తులింగము' నుచున్నారు. ఈ మస్తులింగముతో కూడియుండునట్టి అగ్రభాగ మును యోగిశేఖరులు బ్రహ్మరంధ్రమనియు, వైద్యులు 'మస్తిష్క' [illegible] చెప్పుచున్నారు. వైద్యులు అగ్రభాగము[illegible]మునందలి పశ్చాద్భాగమును [illegible] మస్తిష్కమని [illegible] వ్యాపించి యున్న[illegible] సంబంధము కలదు. ఈ రెండు[illegible]యనియు, కర్మశక్తి యనియు రెండు [illegible]. ఈ రెండు శక్తులను [illegible]యు వ్యాపించియున్నవి. [illegible] శక్తియని రెండు[illegible] కలవు. ఈ రెండు భాగములు [illegible] సుషుమ్నానాడి [illegible] మస్తులింగ మస్తిష్కములతో. [illegible] కర్మశక్తిని రెండవది [illegible] ద్రియము [illegible] మస్తులింగ[illegible] సంబంధము కలదు. కావున [illegible] ఆరోగ్య-సామర్థ్యములపై ఆయా ఇంద్రియముల యొక్క ఆరోగ్యసామర్థ్యము లాధారపడి యుండును. ఆ రెండును [illegible] సేంద్రియములకూడ [illegible] యుండును.

ప్రాకృతిక మహామునుల [illegible] స్వభావముకూడ [illegible]. అనగా మస్తిష్కమునకు చల్లదనమును, మస్తులింగమునకు వెచ్చదనమును, ఆవశ్యకములు. కను మస్తిష్కమును చల్లబరచుటకే శిరము [illegible] మొదలగునవి సేవింపబడుచున్నవి.

ఇక మస్తులింగమున కెంత వేడిమి కావలెనను నది విమర్శింపతగిన ప్రశ్నయై యున్నది. ఈ

వేడియొక్క హెచ్చుతగ్గులవలన నాడులయందు ప్రకోప మేర్పడుచుండును. దానిచే ననేక హానులు కలుగవచ్చును. కావున నా వేడిని మధ్యస్థితిలో నుంచవలెను. అది వస్త్రాదులచే కలుగజాలదు. వాటి గుణములు నెరగుటచేనాటి వలన పూర్తిగా లాభము చేకూరజాలదు.

వాస్తవమున నేవస్తువు పేవస్తువునుండి పుట్టుచున్నదో అది దానికి సహాయపడును. మట్టినుండి పుట్టిన కుండయొక్క ప్రతి యవయవమున్ను మన్ను వల్లనే పూర్తియగుచున్నది, గాని నీరు నిప్పు మొదలగు వాటిచేకాదు. అట్లే యీ మస్తులింగము తలలోని యొక భాగము కావున తలనుండి పుట్టిన పదార్థముచేతనే యిది రక్షింపబడవలెను. కాని తలగుడ్డ టోపి మొదలగు వాటిచేకాదు. అట్లు తలనుండిపుట్టినవి వెంట్రుకలు కావున నవియే గోష్పదమాత్రి పరిమాణము కలిగి యీస్థానమందుండి దానిని మధ్యమ ఉష్ణస్థితిలో నుంచగలవు. మస్తిష్కము శైత్యమును, మస్తులింగము ఔష్ణ్యమును అపేక్షించునని ఇదివరలో చెప్పబడెనుగదా! కావున మస్తిష్కమును చల్లగా నుంచుట కచ్చటి వెంట్రుకలు దట్టముగ నుండుట ముఖ్యావసరము. ఈ కారణముచే మస్తులింగమందెల్లప్పుడు దట్టమైనట్టియు యితర స్థలము నందుకంటె దీర్ఘమైనట్టియు వెంట్రుకలుండవలెను. కావుననే దానికి 'శిఖ' యని పేరుంచబడెను. అది కర్మ ప్రవర్తక మగుటచే దానికి ధర్మముతో సంబంధముకలదు. సంధ్యావందనాది కర్మల గావించునపుడు పరమాత్మ కృప యీ శిఖాద్వారముననే మనలో ప్రవేశించుచున్నది. కావుననే తలకు ఆవరణ లేకనే సంధ్యావందనము గావించవలెనను నియమమేర్పడినది. ఈకారణముచేతనే తైత్తిరీయమునందలి శిక్షావల్లి యీస్థానమునకు 'ఇంద్రయోని' యనిపేరుంచినది.

ఇంద్రస్య = పరమాత్మనః, యోనిః = మార్గః అనగా పరమాత్మకు మార్గమని దాని యర్థము.

సన్యాసికి శిఖాపరిత్యాగము వైకల్పికము. అనగా ఉండవచ్చును. ప్రాయశః సన్యాసము డెబ్బదియైదు సంవత్సరములకు పైబడియే స్వీకరింపబడును. అప్పటికి ఆయుర్వృద్ధి అయియే యుండుటచే శరీరవృద్ధి పూర్ణమయియే యుండును. అప్పుడు శిఖాస్థానమందలి చర్మము గట్టిపడియుండును. శిఖవలన కలుగవలసిన లాభమా వయస్సునకు శరీరమంతటను వ్యాపించియే యుండును. అందుచే అట్టి సమయమున శిఖను పరిత్యజించినను నష్టమేమియు నుండదు. అప్పటికి కర్మకాండయు ఉపాసనకాండయు సఫలపరచబడియే యుండునుగాన వాటితో సంబంధము గల శిఖను, సూత్రమును పరిత్యజించుట సమంజసమే.

ఈశిఖనుగూర్చి ఒక పండిత ప్రవరుడు ఇతర ఉపపత్తులను కూడ ప్రదర్శించి యుండెను. అదెట్లన—

సమస్త సృష్టికిని మూలము అగ్ని. దాని స్వరూపము దాని జ్వాలచే వ్యక్తమగును. అగ్ని అగ్నికి సంస్కృతమున 'శిఖ' యనిపేరు. జ్వాల

(శిఖతో) నున్న అగ్నిహోత్రము నెవ్వడును స్పృశింపనైనను సమర్థుడు కాడు. దాని శిఖత్వము (జ్వాలతో వెలుంగుచుండుట) పోయినచో క్షుద్రమగు బూడిదయును దానిని అచ్ఛాదించవేయును. మనమందరము అగ్ని యుపాసకులము. "శ్రియమిచ్ఛేద్ధుతాశనాత్" అగ్నివలన ఐశ్వర్యము లభించును. దాని నెవ్వడపేక్షించడు? మన మగ్ని వలననే పుట్టుచున్నాము. మన మగ్నిని 'తన్వం మే పాహి' నాశరీరమును కాపాడుము. (పారస్కరస్మృ 2-4) తయా మా మధ్య మే ధయాగ్నే మేధావినంకురు స్వాహా; ఓ! అగ్నిహోత్రుడా! నాకు మేధస్సును ప్రసాదించి నన్ను మేధావిని గావింపుము. (శుక్ల యజుః 32-14) అని యీవిధముగ ప్రార్థించుచున్నాము.

ఎవడెవనినుపాసించుచున్నాడో వాడు చివరకాతని స్వరూపమునే పొందుచున్నాడు. ఉపాసకునకు కావలసినదదియే. కావుననే వాడు ఉపాసింపబడు వాని చిహ్నముల ధరించుచున్నాడు. శైవులు భస్మరుద్రాక్షాదులను వైష్ణవులు తులసీమాలాదులను ధరించుచున్నారు. ఇందువల్లనే శుక్ల యజుర్వేదమునందలి శతపథ బ్రాహ్మణమున 'దేవో భూత్వా దేవానేతి' (14-6-10-4) అని యున్నది. ఈ విధముగ అగ్న్యుపాసకులమగు మనము మూడు ఆశ్రమములయందును అగ్నియొక్క చిహ్నమగు శిఖను ఉంచుకొనుచున్నాము. సన్న్యాసాశ్రమమున అగ్నిని పరిత్యజించుటచే అగ్నియొక్క చిహ్నమగు శిఖను కూడ పరిత్యజించుచున్నారు. అగ్నిహోత్రమును గావించుటకు అధికారపట్టమనదగు యజ్ఞోపవీతమును కూడ యందువలననే పరిత్యజించుచున్నారు. ఈస్థితియందు సన్న్యాసికి అగ్నిమయమగు సంసారముతో సంబంధము లేకుండుటచేతనే ఆతడు మరణించిన పిమ్మట కూడ అగ్నితో దగ్ధము గావింపబడుటలేదు.

—: యజ్ఞోపవీతము :—

యజ్ఞోపవీతధారణకు పూర్వము బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు 'ఏకజులే' అనియు యజ్ఞోపవీతధారణానంతరము గాయత్రీ యుపదేశమును బడసి ద్విజులు గావింపబడుచున్నారనియు శాస్త్రమునందు చెప్పబడుచున్నది. అథర్వణవేదమునందు—

ఆచార్య ఉపనయమానో బ్రహ్మచారిణం కృణుతే
గర్భ మన్తః తం రాత్రీ స్తిస్ర ఉదరే బిభర్తి తం జాతం
ద్రష్టు మభిసంయంతి దేవాః (శౌ॥ సం. 11-5-3)

అను మంత్రమునందు ఆచార్యులు శిష్యుని మూడు దినములు తన గర్భమం దుంచుకొన్నాడనియు పిమ్మట ఆతనికి రెండవజన్మను ప్రసాదించుటచే నతడు ద్విజుడగుచున్నాడనియు చెప్పబడియున్నది.

యజ్ఞోపవీతమునకు యజ్ఞముతోను యజ్ఞమునకు వేదములతోను వేదమునకు వేదాధికారి యగు ద్విజునితోను సంబంధ ముండుటచే బ్రాహ్మణవంశమునందు పుట్టినను యజ్ఞోపవీతము లేనివాడు అనగా ఉపనయనము గానివాడు వేదాధ్యయనమునకు అధికారి కానేరడు అట్టిచో ఉపనయనాధికారము లేని ఇతరులు వానికెట్లు అధికారు లగుదురు?

యజ్ఞోపవీతము పురుషునియందే విధముగ వేదభారము నుంచుచున్నదియును యజ్ఞోపవీత ధారులకెంత వేదాధ్యయనావశ్యకతయున్నదియు యజ్ఞోపవీతమును బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులేల ధరించుచున్నదియు మొదలగు విషయములకు యజ్ఞోపవీత సూత్రమే సమాధాన మొసంగుచున్నది, కడుపుపై నడికిన భారము బెత్తపై 96 సార్లు చుట్టబడుచున్నది. వేదము కర్మకాండ అనియు ఉపాసనాకాండ అనియు జ్ఞానకాండ యనియు మూడుభాగములుగ నున్నది. అందు కర్మకాండ యందు 80 వేల మంత్రములును ఉపాసనకాండ యందు 16 వేల మంత్రములును జ్ఞానకాండయందు 4 వేల మంత్రములును గలవు. బెత్తపై 96 సార్లు చుట్టబడిన యజ్ఞోపవీతసూత్రము నాల్గువేదముల యందున్న ఉపాసనా కాండములయొక్క 96 వేల మంత్రములకు అధికారపట్టము (డవాలా) వలె బ్రాహ్మణుని మెడయందు ధరించబడుచున్నది. శాస్త్రముకూడ యీ రెండు కాండల యధికారులకే యజ్ఞోపవీతధారణ నియమమును విధించుచున్నది. యీ 96 వేల మంత్రములును నాలుగు వేదములకు సంబంధించినవి గనుకనే నాలుగు వేళ్లపై 96 సారులు యీ సూత్రము చుట్టబడుచున్నది. తిరిగి దానిని మూడు పేటలవైచి ఎడమవైపు పురిపెట్టుటచే బ్రాహ్మణ క్షత్రియ వైశ్యు లనబడు మూడు వర్ణములు మాత్రమే యీ సూత్రమున కధికారు లని తెలుపబడుచున్నది. ఈ మూడు పోచల ధారమును తిరిగి మూడు మడతలువైచి కుడిప్రక్కపునకు పురిపెట్టబడుచున్నది. ఇందుమూలమున బ్రహ్మచారి గృహస్థ వానప్రస్థులనబడు ముగ్గురు ఆశ్రమస్థులకే ఇందధికారమున్నదని తెలుపబడుచున్నది. ఈనవ సూత్రతనువు మూడు సూత్రములయొక్క కొనలు ముడియందిమునడుల్లు తిరిగి మూడు మడతలు వేయబడుచున్నది. ఇటుల వేయబడిన మూడుపేటలచేతను ఋషిఋణము దేవఋణము పితృఋణమును సూచించబడుచున్నవి. ఇట్లు యజ్ఞోపవీతము ఒకే సూత్రముచే ప్రారంభింపబడి దానినుండి మూడుసూత్రములై చివరకు ఒకే బ్రహ్మముడియందు సమాప్తనగుచుండుటయు మధ్యయందు మాత్రము త్రిగుణచక్రము (మూడుపేటలుగా వేయబడుచుండుట) గాన్పించుచుండుటయు ఒక వేదాంతరహస్యమును వెల్లడి చేయుచున్నది. ఒక సాంప్రదాయమునకు చెందిన సన్యాసులు యజ్ఞోపవీతమును బరిత్యజించుటకు గారణము ఏమనగా? జ్ఞానముచే మోక్షము లభించును కాని కర్మోపాసనచే గాదు. గావున వారికి జ్ఞానకాండతో మాత్రమే వుపయోగము కలదు. అందుచే కర్మోపాసనామంత్రములకు అధికారము నొసంగు యజ్ఞోపవీతసూత్రముతో వారి కేమి పనియున్నది? చేరవలసిన స్థానమునకు చేరిన ప్రయాణీకుడు అచట తన టిక్కెట్టును వప్పగించి పోవునటులే వీరును తమ యజ్ఞోపవీతమును బరిత్యజించుచున్నారు.

గృహస్థునకు శ్రౌత, స్మార్తము లనబడు ఉభయవిధ కర్మలును చేయబడవలసి యున్నవి. గాన "యజ్ఞోపవీతే ద్వే ధార్యే శ్రౌతే స్మార్తే చ కర్మణి" అనెడు హేమాద్రిసూక్తి ననుసరించి రెండు యజ్ఞోపవీతములు ధరించబడు చున్నవి.

యజ్ఞోపవీతము కుడిచెవికి ఏల చుట్టబడవలెను?

దక్షిణే కర్ణే యజ్ఞోపవీతం కృత్వా మూత్రపురీషే।
విసృజేత్। (వైఖానసధర్మప్రశ్నే 2-9-1 గౌతవిధౌ)

కుడిచెవియందు యజ్ఞోపవీతమును ధరించి మల మూత్రములను విసర్జించవలెను.

యజ్ఞోపవీతం శిరసి దక్షిణకర్ణే వా కృత్వా
(బోధాయనగృహ్యశేషసూత్రే 4-6-1)

యజ్ఞోపవీతమును శిరస్సునందు గాని కుడిచెవి యందు గాని ధరించి యనియు, 'కర్ణస్థ బ్రహ్మ సూత్రః ఉదఙ్ముఖః కుర్యాత్ మూత్రపురీషేతు' (యాజ్ఞవల్క్యస్మృతౌ ఆచారాఽధ్యాయే బ్రహ్మచారి ప్రకరణే 16వ॥ శ్లో॥)

యజ్ఞోపవీతమును చెవియందు ధరించి ఉత్తరాభిముఖుడై మలమూత్రములను విసర్జించవలెను.

కర్ణస్థబ్రహ్మసూత్రో మూత్రపురీషం విసృజతి
(అగ్నివేశ్య గృహ్య సూత్రే 2-6-8)

ఇత్యాది ప్రమాణములు శౌచాదిసమయములలో యజ్ఞోపవీతమును కుడిచెవియం దుంచుకొనవలె నని విధించుచున్నది.

యజ్ఞోపవీతమును కుడిచెవియందు ధరించుటకు కారణ మేమనగా—

"ఊర్ధ్వం నాభేః మేధ్యతరః పురుషః ప్రకీర్తితః (మను1-92)

అనునటుల పురుషుని బొడ్డునకు క్రింది భాగము మలమూత్రములకు ఆధార మగుటచే శౌచసమయమున అది మిక్కిలి అపవిత్రమై యుండును. ఈ కారణమువలన అట్టి సమయములయందు పవిత్రమైన యజ్ఞోపవీతమును అచట నుంచక "ముఖ ముక్తం స్వయం భవ" (మను.1-92) అను ప్రమాణమువలన యజ్ఞోపవీతము జ్ఞానమునకు ఆకరమగుటచే బోధాయనుడు చెప్పినట్లు తలనుగాని ఇతర ఋషులు చెప్పినట్లు తలలో నొకభాగమగు చెవి యందుగాని ధరించవలెను.

దీక్షోపనయనముల నాచార్యులు గుప్తమంత్రోపదేశమును కుడిచెవియందే గావించుటచే దాని పవిత్రత వ్యక్తమగుచున్నది. మరియు—

మరుతః సోమ ఇన్ద్రాగ్నీ మిత్రావరుణౌ తథైవ చ।
ఏతే సర్వే చ విప్రస్య శ్రోత్రే తిష్ఠన్తి దక్షిణే॥
(గోభిలగృహ్యసంగ్రహం 2-90)

వాయువులు, చంద్రుడు, ఇంద్రుడు, అగ్ని, సూర్యుడు, వరుణుడు అను నీ దేవతలందరును బ్రాహ్మణుని కుడిచెవియందుందురు. ఇట్టి ప్రమాణములచే దేవతలకు నివాసమగుటచేత కూడ కుడిచెవి కట్టి పవిత్రత కలుగుచున్నది.

క్షుతే నిష్ఠీవనే చైవ దన్తోచ్ఛిష్టే తథాఽనృతే।
పతితానాం చ సంభాషే దక్షిణం శ్రవణం స్పృశేత్।
(గృహ్యసంగ్రహే 2-81)

తుమ్మినను, ఉమిసినను, దంతములయెంగిలితగిలినను అబద్ధములాడినను పతితులతో మాట్లాడినను కుడిచెవిని స్పృశించవలెను. ఇందువల్లనే నేరస్థులు శుద్ధికొరకు కుడిచెవిని తాకుచున్నారు.

ఇంకను మనశరీరమున ముక్కు పార్థివేంద్రియము, జిహ్వ జలీయము, నేత్రము తైజసము త్వక్కు వాయవ్యము, చెవి ఆకాశీయమును అయియున్నవి. దేశకాలాదులను బట్టి ఈ భూతములన్నియు నపవిత్రము లగుచున్నవి. స్మశానరూపమున పృథివియు, అగ్నియును సురాదిసంబంధముచే జలమును, మలాదిసంసర్గముచే వాయువును, అశుద్ధము లగుచున్నవి.

(తరువాయి 7వ పేజీ)

శ్రీమతే రామానుజాయ నమః



1949 సం. మే నెల విరోధినామ సంవత్సరం



శ్రీవరదరాజమణవాళమహాముని సన్నిధికి ఎదురుగా వుండే సుధానిధి, అనే తిరుక్కొళందెగ్గిర శ్రీవిశిష్టాద్వైతప్రచారక సంఘ త్రిశాఖ. శ్రీయతిరాజసేవామహిళాసమితి సంఘకార్యదర్శి శ్రీమతి పువ్వాడ చెల్వపిళ్లెశెట్టిగారి భార్య మంగమ్మగారు సుధానిది యందు పిళ్లలోకంజీయ్యార్ సాయించిన శ్రీవైష్ణవ సమాచారనిష్కర్ష గ్రంథము ఆరంభించి మధ్యాహ్నం గం 4-0 గం 6-0 వరకు సోమవారం మొదలు శుక్రవారం వరకు జరిగినది—

ఆడినెల, 5 తేది తిరువాశిప్పూరం.

1. మొదటిదినం. పెరియాళ్వార్ విందు
2. దినం నమ్మాళ్వార్లువిందు.
3. దినం. శ్రీఆళ్వాంధార్లువిందు.
4. దినం. ఎంబెరుమానారువిందు
5. దినం. బట్టర్ వారి ముత్తుకూరి.
6. దినం. నంబిళ్ల విందు.
7. దినం. తిరువాయ్‌మొడిప్పిళ్లైవిందు
8. దినం. మనవాళమహాముములవిందు
9. దినం. అష్టదిగ్గజములు.
10. దినం. తిరుకల్యాణం. ప్రతివాదిభయంకరంఅణ్ణా
11. దినం. శీర్‌పాడల్. కోయిలణ్ణా

ఆడినెల 14 తేది శుక్రవారం. పెరియళ్వార్లకు అడకియ మనవాళమర్యాద పంపినారు.

ఆడినెల. 21. తే. శుక్రవారం.

---

(6వ పేజీ తరునాయి)

కాని ఆకాశముమాత్రి మేదళయందును కూడ యజ్ఞోపవీతసంబంధము కలుగుటచేనది (యజ్ఞోప
అపవిత్రిము కానేరదు. మన శరీరములో నా వీతము) అపవిత్రిము కానేరదు.
భూతమునకు ప్రతినిధి యను నింద్రియము ఇదియే యజ్ఞోపవీతమునకు సంబంధించిన
చెవియే. దానికి శౌచాది సమయములలో వైజ్ఞానికరహస్యము.

ఆషీనెల. 28. తే. యజ్ఞమూర్తి యెంబెరుమానార్లినా శ్రీయించినది.

ఆవణి. 3. తే. శుక్రవారం సన్నిధికి పెద్దలతోటి పాద్యోక్రమం

ఆవణి. 10. తే. భట్టరు వేదాంత దేశికులను జయించినది.

ఆవణి. 17. తే. నంబిళ్ల విషయము. కందాడై తోషప్పర్ అపరాధక్షమాపణం,

ఆవణి. 24. తే. శుక్రవారం బట్టగు దివసుందరరాయునినుంచి శ్రీరంగం విడిచి పోవుట

ఆవణి. 31. తే. శుక్రవారం నడువిల్ తిరువీధిపిళ్లైబట్టరు రాజసలముపోవుట

పెరటాశి. 7, తే, పిళ్లైయురంగావిల్లిదాసర్ పొన్నాంచ్చారమ్మ విషయం

పెరటాశి. 14. తే. ఎంబెరుమానార్ సరస్వతి భండారమునకు వేంచేసిన ఐతిహ్యాం

పెరటాశి. 21. తే. ప్రతివాదిభయంకర అణ్ణా స్వమత స్థాపన పరమత నిరసన విషయం.

పెటాశి. తే. 28. కోవిలణ్ణా విషయం.

అల్పిసి. 19. శుక్రవారం. ఎంబెరుమానార్లు. తిరుక్కోట్టియూర్ నంబిగారి వద్ద చరమ శ్లోకార్థమును లభించు కొన్న విషయం.

అల్పిసి, 26. తే. శుక్రవారం. విభీషణ తిరువారాధన శ్రీరంగం పోవుచిన వైభవము

కార్తికి. 3. తే. శుక్రవారం. వాక్య గురుపరం పరవైభవము.

కార్తికి. 10. తే. శుక్రవారం. పరమ పద కోట్టు చట్టం.

కార్తికి. 17. తే. శుక్రవారం. ఆండాళ్ నాయికావస్థ.

కార్తికి. 24. తే. ఆండాళ్ అవతారం.

మార్గళి. 28. తే. ఆండాళ్ నీరాట్ట వుత్సవం

తైనెల, 7. తే. పరమపద కోట్టు.

తై , , 14. తే. స్వారాజ్యం

తై , , 20 తే. పరమపద గోష్ఠి.

తై , ; 27. తే. పరమపద గోష్ఠి.

మాశి. 6, తే. ఈడుముప్పత్తారాయిరం.

మాశినెల. 20. తే. మనవాళమహామునులు శుక్రవారం తోవులో పరాంకుశాష్టకం.

మాశి. 27. శుక్రవారం శిరియతిరుమడల్.

పంగుని. 4. శుక్రవారం శిరియతిరుమడల్. పెరియాళ్వార్ తిరుమొళి ఆరంభం

(తరువాయి 23వ పేజీలో)




(గతసంచిక తరువాయి)

## ముఖ ప్రక్షాళనము

పిమ్మట పండ్లు తోముకొనవలయును. ఇసుక, ఇటుకపొడి మొదలగు గరుకుపదార్థములతో పండ్లు తోముకొన కూడదు. వానిచే దంతములకు, చిగుళ్ళకు హానికలుగును. బాగుగా కాలిన మంచిబొగ్గుతో కొన్నిమిరియములు, ఉప్పు లేక పటికను చేర్చి మెత్తగా నూరి దానిని వస్త్రకాళితముచేసి, అందు కావలసినచో కొంచెము పిప్పరమెంటు అరక కొన్ని చుక్కలు చేర్చుకొనవచ్చును. దీనిలో కొంచెము కర్పూరము, దాల్చినచెక్క, మాచికాయ, కొద్ది పలకగింజలు కూడ కలుపుకొనవచ్చును. లేనిచో పచ్చిదైన ఉత్తరేణి, వేప, బత్తెంక, నేపాళంపుల్లలలో దేనిదైనను చివరభాగమును కుంచవలె బాగుగ నమలి దానితోనైగాని పండ్లు తోముకొనవలయును. దీనివలన దంతములు గట్టిపడి చిగుళ్ళు వాపు లేకుండ జేయును. దేనిదో ఒకరకపు బొచ్చుతో తయారుచేయబడిన బజారులో అమ్మబడు బొమికలుబొచ్చు కుంచెలతో తోముకొనుటగాని దానిని తిరిగి కడుగుకొని మర్నాటికి దానినే ఉపయోగించుటగాని మంచిదికాదు. అనారోగ్యకరము. పైగా దానిని నీవెంత కడిగినను మర్నాడు తిరిగి ఉపయోగించుటకు వలయు ఆరోగ్యస్థితిలో అవి యుండవు. అగ్నిస్పర్శ వలన, లేక అగ్నివంటి ద్రావకముతో కడిగిన గాని ఆ ఎంగిలి, పాచి, దోషము, మాలిన్యము పోయి తిరిగి అకుంఠ ఉపయోగించుటకు తగిన స్థితిలో యుండజాలవు. రోజురోజు క్రొత్త కుంచె ఉపయోగించుటకు మహారాజులకైనను సాధ్యముగ జరుగగల పనిగాదు, గదా!

అందుచేత రోజురోజూ క్రొత్తగా ఉపయోగించుటకు అనుకూలమైనటువంటిన్ని, దంతములకు ఆరోగ్యదాయకమైనటువంటిన్ని, అన్నిచోట్లయందును, అన్నికాలములయందును, అందరకు అతిసులభముగా అందుబాటులో యున్నటువంటిన్ని, ఆర్థికముగా చాల చౌకయైనటువంటిన్ని పైన తెలిపిన రకములలోని ఏదో ఒక రకపు పుల్లనే ప్రతిదినము పళ్ళుతోముకొనుట కుపయోగించుట అన్నివిధములా అతి శ్రేష్ఠమైనపద్ధతి. పండ్లకు హానికలిగించు ఈత, తుమ్మ, కంద వగైరా పుల్లల నుపయోగించరాదు. పాలు వగరుగల పుల్లలు మంచివి. ఇప్పుడు బజార్లలో నమ్ము టూతుపేష్టులు,

టూత్‌పౌడర్లను వాడుట మనకు, మన సాంప్రదాయమునకు, మన దేశ పరిస్థితులకును తగదు; గుణము, ఆస్వాస్థ్యాధిక్యము, అనవసరము అని నా యభిప్రాయము.

పండ్లు తోముకొనిన తర్వాత నాలుక గీసుకొనుటకు కూడ కొంతమంది నవనాగరికులు సెల్యులాయిడు బద్దలుగాని, లోహముతో చేసిన బద్దలుగాని ఉపయోగించుచున్నారు. ఇట్టి బద్దలను వాడుకొనుటకూడ నోటికి చాలా అనర్థదాయకమే. నాజూకు కొఱకై ఈ నాగరికులు మనుకొనునారు ఎంతో అనాగరికపు పని చేయుచున్నారు. పండ్లు తోముకొనిన పుల్లనే రెండుభాగములుగ చీల్చిగాని, లేక మంచి దళసరి తాటాకుతోగాని, కొబ్బరి ఈనెతో గాని, మామిడియాకుతోగాని నాలుకను గీసి, ఆ వచ్చు మలినపదార్థమును నీటితో కడిగి పారవేయవలయును. ఆ వచ్చిన మలినపదార్థమును కడగనిచో మంత్రశాస్త్ర కుతంత్రములవల్ల ఆపదలు కలుగవచ్చును.

పండ్లుతోముటకున్ను, నాలుకగీచుటకున్ను కూడ మామిడాకు నుపయోగించుట చాల మంచిదందురు. ఆ ఆకునందు పొటాసియం పర్మాంగనేటును సంబంధించిన ధాతువులు కలవనియు, అవి పండ్లకు చాలా మంచివని శాస్త్రజ్ఞులు తెలుపుచున్నారు.

కుడిచేతి నడిమి మూడువ్రేళ్ళతో నాలుక రుద్దవలయును. అంగిలివరకు వ్రేళ్ళుపోవలయును. దీనివలన కఫదోషము పోవును. దంతములు శుద్ధిచేసుకొనిన తర్వాత చల్లని నీళ్ళతో 7, 8 పర్యాయములు కండ్లను కడుగవలెను. కన్నులను బయటకొలుకులనుండి లోపలికొలుకుల వైపునకు తుడుచుకొనవలయును. కాని లోపలి కొలుకులనుండి వెలుపలికి తీసుకొనగూడదు. ఈపద్ధతివలన కన్నులకు మిక్కిలి మేలుచేయును. కొన్ని నేత్రరోగములు హరించును.

మనశరీరము ఒక అద్భుతమైన మహాయంత్రము. ఇందు రెండు భాగములున్నవి. ఒకటి పంచభూతాత్మకమైనది. దీనినే శరీరమందురు. మరొకటి జ్ఞానాత్మకమైనది. దీనినే ఆత్మయందురు. శరీరము మంచి యారోగ్యస్థితిలో యున్ననేగాని రెండవభాగమైన యాత్మ సరిగా పనిచేయదు. మనము నివసించు యిల్లు శుభ్రముగాను, గట్టిగాను లేనిచో అందునివసించు జనుని స్థితి యెట్లుండును? అందుచే శరీరరక్షణ ప్రతివానికి ప్రధానమైన కార్యము. ఇది భగవంతుడు మనయెడలి కరుణచే యిచ్చిన మహాధనము. దీనియొక్క సుస్థిత్వముపైననే మన ఐహిక-ఆముష్మిక ధర్మానుష్ఠానము లన్నియు ఆధారపడి యున్నవి.

## వ్యాయామము

శరీరమును మంచిస్థితిలో నుంచుటకై ప్రతి రోజూ వ్యాయామమును చేయవలయును. మన శరీరము, మాంసము, నెత్తురు, కొవ్వు మొదలయిన పదార్థములచే మిశ్రితమై వృద్ధిపొందుచున్నదను సంగతి నీకు తెలిసినదియే కదా! భగవంతుడు ఈ పదార్థములను మన శరీరము

నకు అనువగునటులనే ప్రసాదించి యున్నాడు. కాని మనయొక్కయు, మనపూర్వులయొక్కయు, మన చుట్టుప్రక్కలవారియొక్కయు, మనము నివసించు ప్రదేశముయొక్కయు, కాలము యొక్కయు అన్నిటికంటె ముఖ్యముగ ప్రస్తుత నాగరికతయొక్కయు, ప్రవర్తనలనుబట్టియు, పరిస్థితులనుబట్టియు మన శరీరపరిస్థితులలో అనేక మార్పులు కల్గుచున్నవి. అందుచే మనశరీరములో మాంసము, రక్తము, క్రొవ్వు మొదలైన పదార్థములు సరిగా యుండకపోవుట తటస్థించుచున్నది. అందుచేత ప్రతిదినము ఉదయమునను, సాయంకాలమునను ప్రతివ్యక్తియు తప్పకుండ కనీసము ఒక అరగంటచొప్పున నైనను శరీర వ్యాయామము జేయుచుండవలెను. ఇందువలన మంచి శరీరలాఘవము, పుష్టి, ఆరోగ్యము, ఉత్సాహశక్తి, బుద్ధిబలము, మనోనిర్మలత్వము చేకూరును. వ్యాయామమును శక్తికిమించి ఎప్పుడునూ చేయరాదు. మంచి శుభ్రమైన వెలుతురు, గాలియున్న ప్రదేశములో చేయవలెను. ఆరుబయట చేయుట చాలా మంచిది. వ్యాయామము చేయునపుడు మనస్సును భగవంతునియందుంచి "ఆయనచే ప్రసాదించబడిన ఈశరీరము, ఈఅవయవములు బలిష్ఠములై ఆరోగ్యవంతములై ఆయన సేవరూపమగు నిస్వార్థదేశకల్యాణమునకై వినియోగపడుగాక" అని స్మరించుచుండుము.

ఈ వ్యాయామమునకు బదులు కొందరు యోగాసనములను వేయుచుందురు. యోగాసనములు వేయుటకూడ ఒకవిధమైన వ్యాయామమే. శ్రేష్ఠమైనదే. గాని అవి యమ, నియమములులేకుండా చేయుట చాలా ప్రమాదకరములు, అనర్థదాయకములగును. మంచి అనుభవముగల గురువులేకుండగ వాటి నెప్పుడునూ ఆచరించకూడదు. వాటిలో ఏవేవి ఎప్పుడెప్పుడు ఎటుల అభ్యసించి ఆచరణయందుంచుకోవలెనో ముందు ముందు నీవే తెలిసికొనగలవు. గాన ప్రస్తుతము వాటివిషయమై ఇచ్చట వ్రాయక విడుచుచున్నాను.

నడచుట, పరుగెత్తుటకూడ చాలా మంచి శరీరవ్యాయామములు. బలహీనుడు పృథ్వికి బరువుచేటు. అట్టివాడు తనకే ఉపకరించజాలడు. ఇతరులకు ఉపయోగపడడు. బలవంతులకు సర్వము హితమేయగును. బలవంతులకు సర్వము పవిత్రమే యగును. బలవంతులకు సర్వము ధర్మమే యగును. బలవంతులకు సర్వమును స్వీయముగనే యుండును. మంచి ఆరోగ్యమే బలము. లావు, ఒడ్డు, పొడుగు బలముకాజాలవు. శరీరబలము లేనివానికి ఆత్మబలముండదు. ఆత్మ బలము లేనిదె హరికటాక్షముండదు.

## స్నానము

పిమ్మట స్నానముచేయవలయును. స్నానమును అవకాశమున్నంతవరకు మంచి ప్రవాహముగల నదియందుగాని, కాలువయందుగాని, అవిలేనిచోట్ల చెరువునందుగాని చేయుట శ్రేష్ఠము. శరీరమారోగ్యముగ నున్నంతకాలము చన్నీటిస్నానమే చాలామంచిది.

ప్రవాహపునీటిలో మనశరీరమున కత్యంత పోషకములగు ప్రాణశక్తులనేకములు గలవు. సూర్యోదయమైన తరువాత ఆప్రాణశక్తు లనేకములు సూర్యకిరణములచే ఆకర్షించబడును. కాన స్నానము నెల్లప్పుడును సూర్యోదయము కాకుండగ చేయుటచే ఆప్రాణశక్తులు మనశరీరమందు ప్రవేశించి ఆరోగ్యమును, మనోనిర్మలత, బుద్ధివికాసమును, ఆత్మశక్తిని కలిగింపజేయును. స్నానముచేయునప్పుడు నీశరీరమంతయు పూర్తిగా తడియునట్లును, నీశరీరమందలి మలిన పదార్థము పూర్తిగపోయి రోమకూపము లన్నియు శుభ్రపడునట్లును బాగుగా శరీరమంతను రుద్దుకొనవలయును. రుద్దుకొనుటకు సీకాయపొడిగాని, కుంకుడుకాయ పులుసుగాని శ్రేష్ఠము. ఇప్పుడు అనేకమంది సబ్బులను వాడుచున్నారు. సామాన్యముగా సబ్బులలో క్రొవ్వు కలిపెదరు. మరియు అనేకమలినమైన నూనెలను కలిపి తయారుచేసెదరు. ఆక్రొవ్వు మనదేహము లోని రోమకూపములులోని సూక్ష్మరంధ్రము లలో నిండెనా, ఆరోగ్యమునకు బదులు అనేక రోగములు సంభవించును. సబ్బులు వాడుట కంటె సీకాయపొడి, కుంకుడుకాయలు వాడుటే ఎన్నోరెట్లు మంచిది. అయినను నీవుకూడ సబ్బు వాడవలెనని అభిలాషపడినచో నీవే దానిని తయారుచేసుకొనవచ్చును. లేదా క్రొవ్వుకలుపని సబ్బుల కొని వాడవచ్చును.

ఒకవంతు 'కాస్టిక్‌సోడా' అనుదానిని తెచ్చి దాని తూకమునకు మూడురెట్లు మంచినీటిలో వేయుము. కాస్టికుసోడా మంచినీటిలో కరిగి పోవును. అప్పుడు నీరు చాలా వేడిగా యుండును. అదిను బాగుగా చల్లారిన తరువాత దానిలో నీవుపోసిన మంచినీటికి సమానతూకముగల కొబ్బరి నూనెనుపోసి బాగుగా కలుపుము. కొంతసేపటికి అది బాగుగా చిక్కగా అగును. దానిని వెడల్పు కొయ్యపెట్టెలోపోసి 24 గంటలు బయట చల్లని ప్రదేశములో నుంచిన తరువాత అది బాగుగా గట్టిపడి బిళ్ళవలె నగును. అప్పుడు దానిని నీకు కావలసినట్లు ముక్కలుగ కోసికొని ఉపయోగించుము. ఇట్లు తయారుచేసిన సబ్బు శరీరమునకు హాని కలిగించదు. మురికిని బాగుగా పోగొట్టును. కావలసినచో యిందులో యేదైనా పరిమళద్రవ్యమును కలుపుకొనవచ్చును. ఈ సబ్బు చేయునప్పుడు చేతికి కాస్టికుసోడా తగులకుండ చూచుకొనుము. చేతికి తగిలినచో ప్రమాదించును. ఇదిగాక యింకా అనేకపద్ధతులుగ సబ్బులను చేసుకొనవచ్చును. ఇది అందరికి అందుబాటులో యుండునని దీనినే తెలిపితిని. ఇట్టి మంచిరకపు కొవ్వువగైరా కలవని సబ్బులు వాడవచ్చును. ఏదీలేనిచో తడిబట్టతోనైనను శరీరమును రుద్దుకొనవలెను. దినమున కొక పర్యాయమైనను శిరస్నానము చేయవలెను. లేనిచో శరీరముయొక్క వేడి శిరస్సునకెక్కి, కంటికిని, మెదడునకును కీడుచేయును.

స్నానముచేయునప్పుడును మీమనస్సు మీరు చేయుపనిమందే లగ్నమై యుండవలెను. స్నానముయొక్క ఫలము దేహముపైనది మురికిపోవుట

మాత్రమేకాదు. ప్రాణమను భగవచ్ఛక్తి, నీళ్ళు, గాలి, ఆహారపదార్థములు సూర్యకిరణ, ములు మొదలైన యన్నింటిలోను యున్నది. మనము ప్రతినిమిషమున్ను ఆలోచించుట, చూచుట, వినుట, మాట్లాడుట, కదలుట మొదలైనవాట్లమూలముగా మనలోని ప్రాణశక్తిని యెంతో ఖర్చుచేయుచున్నాము. పోయిన ప్రాణశక్తిని తిర్గి సంపాదించుకోకుండ వున్నచో కొంతకాలమునకు మనమెందుకు పనికిరానివారమగుదుము. ఇట్లు ఖర్చుఅయిన శక్తిని తిర్గి పైజెప్పిన నీరు, గాలి, ఆహారపదార్థములు, సూర్యకిరణములు మొదలైన వాట్లనుండి గ్రహించుచుండవలయును. మనము చేయుఖర్చు అధికము, సంపాదన తక్కువా అయ్యెనా బలహీనులము, రోగులము అగుదుము. ప్రాణశక్తి మనలో నెంత యెక్కువగా యుండునో అంత ఆరోగ్యముగాను, శక్తి, తేజస్సులను కలిగియుందుము. మనని రక్షించునవి కేవలము మనము త్రాగునీళ్ళు, తినెడి అన్నము, పీల్చెడు గాలి గావు. వాటన్నిటిలోను వుండే ప్రాణశక్తియే. ఆపదార్థములనుంచి ఆప్రాణశక్తిని తీసివేసి; ఎంత ఆహారము తినినను, ఎంతనీరు త్రాగినను, అవి మనలనెంతమాత్రమును రక్షించజాలవు. గాని ప్రతిపదార్థమును మన మనుభవించునపుడు వాటియందే మనసుంచి వాటియందలి ప్రాణశక్తిని మనము గ్రహించుచుండవలయును.

అందులకై స్నానము చేయునపుడు "స్వామీ! జలరూపముగ ప్రకాశించువాడవు నీవే. ఇట్టి నిన్ను ధ్యానించుచున్నాను. ఇందలి ప్రాణశక్తిని నాయందు ప్రవేశింపజేసి నాకారోగ్యము, జ్ఞానము, బలము నిమ్ము." అని ధ్యానించవలయును. మరియు స్నానము చేయునపుడు ఈ జలములోనుండు ప్రాణము నాశరీరములోనికి వచ్చుచున్నదని తలంచుచు అటులనే భావించుము. ఊరక స్నానము చేయుటకంటె యిట్లు చేసిన రెట్టింపు ప్రాణశక్తి నీకు కలుగును. మరియు నీశరీర బాహ్య మాలిన్యముతో బాటు ఆంతరంగికమాలిన్యముకూడ క్రమముగా తొలగిపోవుచుండును.

స్నానాంతరమున మంచి పొడిబట్టతో శరీరమును నొక్కి తుడుచుకొనవలెను. శరీరమునుండి నీళ్ళు వోడుచు తుడుచుకొనుటకై ఒకచోటునుండి మరొకచోటికి పోవుట చాలా దురలవాటు. స్నానము చేయబోవునప్పుడే తుడుచుకొనుటకుగూడ వేరే బట్టను తీసుకొని నెళ్ళి అప్రక్కనే యుంచుకొనవలెను. కట్టుకున్ని విడిచిన బట్టతోగాని, కట్టుకొనియున్న బట్టతోగాని, మాసిపోయిన బట్టతోగాని యెప్పుడును తుడుచుకొనగూడదు. స్నానము చేయునపుడు శరీరముపై నీలైనంత చిన్నబట్టతో మాత్రమే యుండవలెను. అసలు బట్టలేకుండగ నగ్నముగను యుండరాదు. స్నానానంతరము అవుసరమైనచో దానిని బాగుగా పిండి నీరుకారకుండునటుల ధరించవలెను.

(తరువాయి మరుసటిసంచికలో)

---

(16 వ పేజీ తరువాయి)

ఆస్వరూప మున్ఛాందోగ్యోపనిషత్తు నందలి 8వ ప్రపాఠకములోని 7వఖండమందలి మొదటిమంత్ర మగు 'య ఆత్మా అపహతపాప్మా' ఇత్యాది ప్రజాపతి వాక్యమున చెప్పబడినది. అట్టి సాక్షాత్కారమునకు సాధనము జ్ఞానయోగము. ఆజ్ఞానయోగము వర్ణాశ్రమవిహిత నిత్యనైమిత్తికకర్మలను ఫలసంగ కర్తృత్వములనువీడి ఆచరించిన లభించును అట్లాచరించుటకు మునుముందు శరీరమునకంటె అతిరిక్తమగు ఆత్మ కలదనియు ఆత్మనిత్యమనెడు జ్ఞానముండి తీరవలెను. కావున ఆత్మనిత్యతా జ్ఞానపూర్వకమగు అసంగ కర్మానుష్ఠానమువలన జ్ఞాననిష్ఠ యలవడునని చెప్పబడెను. ఇదియే కర్మయోగము.

ఇయ్యది జ్ఞాననిష్ఠ కెట్లుపయోగపడుచున్నదో చూతము. జ్ఞానము 'సత్త్వాత్సంజాయతే జ్ఞాన' మ్మనునట్లు సత్వగుణాభివృద్ధిచే కలుగును. ఆసత్వగుణాభివృద్ధి 'రజస్తమశ్చాభిభూయ సత్త్వం భవతి భారత' అనునట్లు రజస్తమః ప్రకోపమడంగిననే సంభవించును. ఈరజస్తమః ప్రాచుర్యము పాపముచే పెరుగుచుండును. గాన ముందాపాపమును నిర్మూలించవలెను. అది 'ధర్మేణపాపమపనుదతి' యజ్ఞోదానం తపశ్చైవ పావనాని మనీషిణాం' అనునట్లు ఫలసంగ కర్తృత్వములనువీడి శాస్త్రోక్తములగు కర్మల నాచరించుటయనెడు కర్మయోగమువల్లనే సిద్ధించును. ఇట్లు కర్మయోగము ననుష్ఠించుటవలన క్రమముగ పాపమడగి రజస్తమస్సులు సంకుచించి సత్వము తలయెత్తును. అంతట నీయోగికి నిష్ప్రత్యూహమైన ధ్యానము సిద్ధించును. ఇదియే జ్ఞానయోగము. దానివలన యోగమలవడును. యోగమనగా ఆసనాదివిశేషపరికరములతోగూడి ఆత్మసాక్షాత్కారముకొరకు చేయబడు చిత్తనియమనరూపమైన వ్యాపారము. దానిచే ఆత్మసాక్షాత్కారరూపమగు ఆత్మానుభవము కలుగును. దానిచే రాజపుత్ర దృష్టాంతానుసారముగ పరమపురుషప్రాప్తికి సాధనమగు భక్తియోగమును దానివలన పరమపురుషార్థరూపమగు మోక్షమును లభించును.

ఈకర్మయోగము రెండు విధములు. ఒకటి జ్ఞానమును పుట్టించి దానివలన యోగమును సాధించును. వేరొకటి నడుమజ్ఞానయోగసహాయమున పేక్షించక తానే అంతర్గతాత్మజ్ఞానము కలదై యోగారంభమునరకు దృఢముగ ననుష్ఠింపబడి యోగప్రాప్తిని కలిగించును, మొదటిది రెండవ యధ్యాయమునను రెండవది ఐదవ అధ్యాయమునందును చెప్పబడినది.

సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదంతి న పండితాః ।
ఏకమప్యాస్థితస్సమ్యగుభయోర్విందతే ఫలం॥

జ్ఞానయోగ కర్మయోగములు రెంటికిని ఆత్మదర్శన మొక్కటియే ఫలము కావున నా రెండును స్వరూపమునందు వేరువేరైనను ఫలమునందొక్కటియేయగును. అయినను కొందరు, కర్మయోగము జ్ఞానయోగమును మాత్రమే సాధించుచున్నది. జ్ఞానయోగమొక్కటియే ఆత్మదర్శనమును సాధించుచున్నది. అని కర్మయోగమునకును జ్ఞానయోగమే ఫలముగాను, జ్ఞానయోగమునకు మాత్రమే ఆత్మావలోకనము

ఫలముగాను ఇట్లు రెండింటికిని వేరువేరు ఫలములను చెప్పుచున్నారు, వీరు బాలురవలె పరిపక్వముగాని జ్ఞానముకలవారని భగవానుడు నిందించుచున్నాడు.

శ్రీయామునాచార్యులువారు తమ గీతార్థ సంగ్రహమునందు "కర్మయోగ స్తప స్తీర్థదాన యజ్ఞాదిసేవనం."

అనగా శాస్త్రవిహితమగు కాయశోషణము పుణ్యతీర్థస్నానము దివ్యదేశదర్శనము, దానము, యజ్ఞము, మొదలైనవానిని ఫలము కలుగువరకు ఆదరముతో నెడతెగక యాచరించుట, కర్మయోగమని సాయించిరి. ఇందుకొన్ని నాలుగవ అధ్యాయమున కర్మయోగ అవాంతర భేదములుగా చెప్పబడినవి. కొన్ని క్రొత్తగా నిచ్చట విధింపబడినవి. ఇచ్చట ఇవియే ఆదిశబ్దముచే నాలుగవ అధ్యాయమున

ద్రవ్యయజ్ఞాః తపోయజ్ఞా యోగయజ్ఞా స్తథా పరే ।
స్వాధ్యాయ జ్ఞానయజ్ఞాశ్చ యతయ స్సంశితవ్రతాః॥

న్యాయముగ ద్రవ్యమునార్జించి కొందరు దేవతార్చనమందును కొందరు దానము నందును కొందరు యాగమునందును, కొందరు హోమము నందును వినియోగింతురు. వీరిని ద్రవ్యయజ్ఞులందురు. కొందరు కృచ్ఛ్రచాంద్రాయణోపవాసాదులయందు నిష్ఠగలవారై యుందురు. కొందరు పుణ్యతీర్థ పుణ్యక్షేత్రాది యాత్రలయందు ఆసక్తిగలవారై యుందురు. మరికొందరు వేదాధ్యయ నాభ్యాసపరులై యుందురు, కొందరు తదర్థజ్ఞానాభ్యాసము నందు ఆసక్తికలవారై యుందురని చెప్పబడెను, అందు కొన్ని పైసంగ్రహ శ్లోకమునందు కంఠరవముతోను, మరి కొన్ని ఆదిపదముతోను చెప్పబడినవి.

ఈకర్మయోగము కర్మాంశమనియు జ్ఞానాంశమనియు రెండు అంశలతో కూడియుండును. అందు మొదటది ఆయావర్ణమునకును ఆశ్రమమునకును తగునట్లు శాస్త్రములో విధింపబడిన మహాయజ్ఞాది నిత్యనైమిత్తిక కర్మలను ఆచరించుట రెండవది.

కర్మణ్యే వాఽధికార స్తే మాఫలేషు కదాచన ।
మా కర్మఫలహేతుర్భూః । మాతేసంగో స్త్వకర్మణి॥

అనెడు శ్లోకమున చెప్పబడినట్లు ఫలసంగ కర్తృత్వములను విడిచి యాచరించుట, ఫలమును విడుచుట యనగా 'సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ!' అనునట్లు శాస్త్రీయములగు కర్మల నాచరించునపుడు కలిగెడు సుఖమునకు పొంగును, దుఃఖమునకు క్రుంగును లేక ఫలము సిద్ధించినను సిద్ధించకున్నను చిత్తము నందేవిధమైన చాంచల్యమును లేకయే ఆకర్మను పూర్తిగా నాచరించు చిత్తస్థైర్యముకలిగి యాచరించుట.

కర్తృత్వత్యాగమనగా ఆకర్మలను ప్రకృతియే చేయించుచున్నదని తలంచుట. అనగా ఈ విధమగు కర్మల నాచరించుట ఆత్మకు సహజసిద్ధముకాదు, స్థాలీ (గిన్నె) సంపర్కముచే నీటికి వేడి కలుగునట్లు ప్రకృతి సంబంధముచే దాని గుణసంపర్కమే యీ కర్మల నాచరించుటకు నిదానమని తలంచుట లేక పరమపురుషుడే తనకు

(తరువాయి 17 వ పేజీలో)

# కర్మ యోగము

(శ్రీ ఉ. వే. శ్రీమాన్ తె. గం. గోపాలాచార్యులుగారు)

"బ్రహ్మవి దాప్నోతి పరమ్"

నిరతిశయ బృహత్త్వము గల పరమాత్మ నుపాసించువాడు సర్వోత్కృష్టమై సకలకల్యాణ గుణముల కాశ్రయమగు బ్రహ్మను పొందు చున్నాడు.

> "య ఏష సంప్రసాదోఽ స్మాచ్ఛరీరా త్సముత్థాయ పరం జ్యోతిరుపసంపద్య స్వేన రూపేణాఽభినిష్పద్యతే"

ఈజీవుడు నిహీనమగు యీశరీరమును వీడి పరమపదమునకు పోయి యచ్చట పరమాత్మను పొంది తన కసాధారణమగు 'అపహతపాప్మా విజరో విమృత్యు ర్విశోకో విజిఘత్సోఽపిపాస స్సత్యకామ స్సత్యసంకల్పః' అనెడు శ్రుతి యందు చెప్పబడినట్లు పాపములు, ముసలితనము మృత్యువు, దుఃఖము, ఆకలి, దప్పియు, యనెడు హేయగుణములు లేక సత్యసంకల్పత్వ ప్రభృతు లగు కల్యాణగుణములతో కూడియుండు రూప మును పొందును,

> "యథా నద్యస్స్యందమానా స్సముద్రే అస్తంగచ్ఛంతి నామరూపే విహాయ తథా విద్వాన్నామరూపాద్విముక్తః పరాత్పరం పురుషము పైతిదివ్యం"

గంగా, యమునా, సరస్వతీ, మొదలగు నదులు తమ ఉత్పత్తిస్థానము నుండి ప్రవహించి గంగాయమునాది నామభేదములను, తెలుపు నలుపు మొదలగు రూపములను విడిచి సముద్ర మునందు ప్రవేశించుచున్నవో అట్లే విద్వాంసుడగు బ్రహ్మోపాసకుడును దేవుడు మనుష్యుడు మొదలగు భేదములను తెలుపు నామరూపాదులను విడిచి పరాత్పరుడగు బ్రహ్మను పొందు చున్నాడు.

> "యదాపశ్యః పశ్యతే రుక్మవర్ణం కర్తారమీశం పురుషం బ్రహ్మయోనిం, తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ నిరంజనః పరమం సామ్యముపైతి"

ఉపాసకుడగు జీవుడు ప్రత్యక్షమైన దివ్యవిగ్ర హముతో కూడియున్నట్టియు, జగత్కర్తయగు నట్టియు, జగన్నియామకుడగునట్టియు, సర్వఫల ప్రదుడగునట్టియు, అప్రాకృతమగు ప్రకృతికి ఉపాదానకారణమునగు పరమాత్మను ఉపాసన కాలమునందే సాక్షాత్కరించుచున్నాడు. గాన వాడప్పుడే తనపుణ్యపాపములనువీడి ప్రకృతి సంబంధములేనివాడై పరమపురుషునితో పరమ సామ్యమును పొందుచున్నాడు,

మొదలగు ప్రమాణములచే మోక్షమున పేక్షించువానికి పొందవలసినదిగా చెప్పబడినది పరమపురుష ప్రాప్తియే. "భక్త్యాత్వనన్యయా నాయమాత్మా" దానికుపాయమై కాంతికమగు అత్యంతభక్తియే. దీనికే వేదనము ఉపాసనము ధ్యానము అనునామాంతరములు. దీనికి అంగము జీవాత్మయొక్క వాస్తవస్వరూప సాక్షాత్కా రము" ఉదాహరణ రాజకుమార వృత్తాంతము.

(తరువాయి 14 వ పేజీలో)

(15 వ పేజీ తరువాయి)

శేషభూతుడనగు నన్ను ప్రేరేపించి తనయారాధన కొఱకు నా కొఱకు సంగబడిన నీ యుపకరణములచే తన యతిశయసిద్ధికొఱకు తన యారాధన రూప మగు నీ కర్మలను తానే నాచే చేయించు చున్నాడు. ఇట్టి కర్మలచే తానారాధింపబడి నన్ను సంసారబంధమునుండి విముక్తుని గావించు నని నమ్మి యాచరించవలెను. ఇట్లాచరించినచో పరమపురుషుడు ప్రసన్నుడై యనాదిరూపమున అనాది కాలమునుండి పెరిగియున్న కర్మబంధనము నశింప చేసి నిష్కళంకమగు నాత్మావలోకమును ప్రసాదించును.

కామ్యకర్మలకంటె నీ నిష్కామ కర్మయోగము మిక్కిలి విశిష్టమైనది. కామ్యకర్మలకు నిర్బంధములు మెండు. అంగవైకల్యము కలిగి నను ఆచరించుచుండగ విఘ్నమువాటిల్లినను ప్రత్యవాయము మెండు. ఈకర్మయోగమన్ననో

నేహాభిక్రమ నాశోస్తి ప్రత్యవాయో న విద్యతే
స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్

అనగా భగవదారాధనా రూపమగు నీ కర్మయోగము నారంభించి ముగింపకపోయినను. ఫలము లేకపోదు. ప్రారంభించినది మధ్య చెడిపోయినను పాపము సంభవింపదు. ఈ యోగము కొద్దిగా నాచరింపబడినను మహత్తర మగు సంసారభయమునుండి రక్షించును.

ఈవిషయమై శ్రీకృష్ణార్జునులకు ప్రశ్నోత్తరములు జరిగినవి. "శ్రీకృష్ణా! కర్మ అనుష్ఠింప వలసిన ప్రకారముగా ననుష్ఠింపబడినచో ఫలము నొసంగును గాని. ఫలాపేక్షలేక యాచరింపబడి నచో నది ఫలప్రదము కానేరదు. ఆత్మప్రాప్తి నైనను కలిగించునందుమా! దానిని ప్రారంభించి మధ్యగా మోహముచేనలన దానినుండి భ్రష్టుడగు చున్నాడు. కావున కర్మయోగమువలన సంసారికి ఫలప్రాప్తిగాని, ఆత్మప్రాప్తిగాని లేక ఉభయ భ్రష్టుడగును గా" అని యర్జునుడు శ్రీకృష్ణుని ప్రశ్నించెను.

అందులకు శ్రీకృష్ణుడు "నాయనా! అట్టివాడెన్నడును చెడడు. వాడు ఆచరింపబడిన యోగ మహిమచే కల్యాణమైన భోగముల ననుభవించి పిమ్మట శుచిగల శ్రీమంతుల కులమునందు పుట్టును. లేక తమంతనే యోగము నాచరించుచు యితరులకుపదేశింప సమర్థులగువారి యింటనైనను పుట్టును. అట్లు పుట్టి నిద్రనుండి మేల్కొన్నవానివలెనే తిరిగి యవశముగా నా యోగమునందే ప్రవర్తించి సిద్ధించువరకు ప్రయత్నించి చివరకు సఫలతగాంచియే తీరునని" సమాధాన మొసంగెను.

కావున కర్మయోగి నిత్యనైమిత్తిక కర్మల యొక్క ప్రధానఅవాంతర ఫలములను వీడి కర్మలన్నియు మోక్షమొక్కటియే ఫలముగా కలవని యాచరించవలయును. తమ తమ వర్ణాశ్రమములకు తగినట్టి కామ్యకర్మలను గూడ ఫలమును విడిచి మోక్షసాధనముగ నిత్యనైమిత్తికములతో జేర్చి శక్తికొలది యాచరించవలెను.

## ★ కామ్యకర్మలు

వేదోక్తములగు కర్మల ననుష్ఠించువారు

ముముక్షువులనియు, బుభుక్షువులనియు రెండు విధములుగ నుందురు. ముముక్షువులనగా మోక్షమునొక్కదానిని మాత్రమే అపేక్షించి దానియందు నిశ్చలమగు అధ్యవసాయము గలవారై తన్నిమిత్తమై కర్మలననుష్ఠించువారు బుభుక్షువులనగా ఐహికాముష్మిక ఫలముల నపేక్షించి కర్మలనాచరించువారు. ఫలము లనేకములగుటచే వీరిబుద్ధులును అనంతములై యుండును. వారికి దేహముకంటె వేరైన ఆత్మ యొక్కటి కలదని జ్ఞానమాత్రమున్న చాలును. వారిఆత్మ యాథాత్మ్యనిశ్చయము అంతగా నవసరములేదు అవి యున్నను వారు మోక్షమును గోరక స్వర్గమునో బిడ్డలనో పశువులనో అన్నవస్త్రాదులనో కోరి వానికివలయు సాధనముల ననుష్ఠించి తత్ఫలమును మాత్రమే అనుభవించుచుందురు. వీరిని శ్రీకృష్ణుడు "యామిమాం పుష్పితాం వాచం" అను శ్లోకము మొదలు మూడు శ్లోకములలో మిక్కిలి నిందించి యున్నాడు.

ఈకర్మఠులు వేదముయొక్క పూర్వభాగమందు చెప్పబడిన కర్మలు స్వర్గాదిఫలసాధనములని చేయబడు వాదములను మాత్రమే నమ్మి వైదికకర్మలన్నిటికిని స్వర్గముతప్ప వేరొకఫలము లేదని పలుకుచు కామ్యవిషయములయందు ప్రసక్తులై స్వర్గమే పొందగోరుచుందురు. ఆకర్మలు వానికి ఫలముల ననుభవించినపిదప తిరిగి జన్మనొందు మరల ఇట్టి కర్మలనే యాచరించి ఇట్టి ఫలములనే పొందుటను ఫలముగా ప్రసాదించును గాని మోక్షము నొసంగజాలవు. మోక్షమనెడు ఒకేఫలము నుద్దేశింపక పశ్వన్నాది బహువిధ ఫలము లుద్దేశింపబడును గాన వాటికి సాధనములగు కర్మలుకూడ పెక్కులాచరింపబడవలెను. ఇందుకును నశ్వరమగు భోగైశ్వర్యముల ప్రాప్తి కొరకే ప్రవర్తించును గాని మోక్షము కొరకు గాదు. కావుననే ఆవేదభాగమును పండ్లు పండక పువ్వులను మాత్రమే పూయు నొకానొక చెట్టువలె ప్రయోజనములేక పైకిమాత్రము రమణీయముగా శోభించుచుండును. ఇట్టి వాక్యములను ప్రమాణములుగా నాచరించువారు అల్పజ్ఞులు వీరికి మిక్కుటమగు భోగైశ్వర్యప్రావణ్యము కలుగుటవల్ల ఆకర్మలయందే మనస్సులగ్నమై యుండుటవల్ల ఆత్మజ్ఞానము సున్నయగును. కావున వారికి మోక్షమునకై సమస్త వైదిక కర్మలను అనుష్ఠించినను బుద్ధి యెన్నటికిని కలుగనేరదు.



# పురంజనోపాఖ్యానము

శ్రీమద్భాగవతమునందలి పురంజనోపాఖ్యానము యీకామ్యకర్మలయందు రోతజనించుటకు ముఖ్యసాధనము.

పూర్వము ప్రాచీనబర్హి అనబడు నొకరాజునకు కర్మకాండయందే మిక్కిలి మక్కువ యుండెడిది. ఒకనాడు బ్రహ్మజ్ఞానియగు నారదుడు ఆతనికి ఒకచక్కని యుపదేశ మొసంగెను. ఈకర్మలవలన ఆత్యాంతిక దుఃఖవినాశమున్ను, నిరతిశయ సుఖప్రాప్తియును కలుగనేరదనియు చెప్పి యజ్ఞములో నారాజు హింసించిన పశుసమూహము నంతను ఆకాశమునందు చూపి యీతడు మరణించి పరలోకమున కేగినపుడు అవియన్నియు మిక్కిలి కోపముతో కఠోరమగు కొమ్ములతో నీతనిని చీల్చి చెండాడి పగతీర్చుకొనుటకై ఎదురుచూచుచున్నవని చెప్పెను. మరియు యీవిషయమునందు నమ్మకము జనించుటకై ఆరాజునకు పురంజనోపాఖ్యానమును వినిపించెను. ఇదియొక అద్భుతమగు వేదాంత గాథ.

## ★ పురంజనోపాఖ్యానము

పూర్వకాలమునందు పురంజనుడను నొక రాజుండెను. యీతని కవిజ్ఞాతుడను నొక మిత్రుడుండెను. ఆతడాచరించు పనులన్నియు రహస్యపూర్ణములు. పురంజనుడొకతరి తను నివసించుటకు తగిన స్థానము నన్వేషించుచు భూమియందంతటనూ తిరుగుచుండెను. ఒక దివమున హిమాలయపర్వతమునకు దక్షిణముగ తొమ్మిది ద్వారములుగల సుందరమగు పట్టణమొకటి గాన్పించెను. అందు మానవుని సుఖోచితమగు సాధనసామగ్రి యంతయు పుష్కలముగ నుండెను. ఆనగరమునకు బయట సుందరమగు తోటయొకటి యుండెను. అందలి పశువులుగూడ అహింసాది వ్రతములను పాలించుచుండెను. పురంజనుడావనమునందు తిరుగుచూ నొకచోట నొక్కొక్కడు నూర్గురు నాయికులకు పతిగా నుండు పదిమంది సేవకులతో గూడియున్న పదునారు సంవత్సరములుగల నొక సుందరమగు స్త్రీని గాంచెను. ఐదుపడగల పామొకటి యామెనన్నివిధముల రక్షించుచుండెను. వారొకరిని చూచి యొకరు మోహించి పరస్పర వివాహము గావించుకొనిరి. ఆమె యాపట్టణమునకు స్వామినియగుటచే యామె యనుమతిని బడసి ఆపట్టణమందే మానవోచితసకల సుఖముల ననుభవించుచు నూరు సంవత్సరములామెతో కాపురముచేసెను. ఆపట్టణమునకుండు తొమ్మిది ద్వారములలోను యేడు ద్వారములు పయికిని, రెండు ద్వారములు క్రిందకును యుండెను. ఈనగరమును పాలించు రాజు యీద్వారముల గుండా వేర్వేరు దేశములకు జనుచుండెను. ఇందయిదు తూర్పుముఖములుగను, ఒకటి దక్షిణ

మిత్రుడగు అభిజ్ఞాతుడు బ్రహ్మజ్ఞానియగు బ్రాహ్మణాకారముతో నచట కేతెంచి స్త్రీయై విలపించుచున్న పురంజనుని జూచి ఓ!మిత్రుడా! ఎందుల కిట్లు విలపించుచున్నావు? నీవు నీ వాస్తవ స్వరూపమును గాని నా వాస్తవ స్వరూపమును గాని ఎరుంగవు నేనే యీవిధమగు మాయను కల్పించితిని, నేను మన ఉభయుల రహస్యమును చెప్పెద వినుము. నీవు పూర్వజన్మమున పురంజనుడను రాజవు. నేనపుడు నీకు మిత్రుడగు అభిజ్ఞాతుడను. వాస్తవమున నేనీశ్వరుడను. నీవు జీవుడవు. భూమండలమున భోగముల ననుభవించవలెనని అందుల కుచితమగు నివాసస్థానము నన్వేషించుచు నన్ను విడిచి భూమండలమునకు వచ్చివేసితివి. ఇచట నొక స్త్రీచే రచింపబడిన నగరమున బ్రవేశించితివి. తొలిజన్మమున నీవు పురంజనుడవు. అనగా పురమనబడు శరీరమును నీకర్మలచే నిర్మించువాడవు. నే నవిజ్ఞాతుడను. అనగా జీవులచే ఏవిధమునను తెలియబడని ఈశ్వరుడను. నీ వన్వేషించిన నవద్వారపురము కర్మలవలన జీవుడార్జించు శరీరమే. రెండు నేత్రగోళకములు రెండు ముక్కురంధ్రములు రెండు కర్ణరంధ్రములు నోరు లింగము, (ఆసనస్థానము,) ఆసనము అనునవి యీ పట్టణమునకు గల నవద్వారములు. ఇందు నేత్రగోళకములు నాసాచ్ఛిద్రములు నోరు అను నైదును తూర్పుద్వారములు. కుడుచెవి దక్షిణద్వారము ఎడమచెవి ఉత్తరద్వారమును అగుచున్నవి. మలమూత్ర విసర్జనద్వారములు క్రింద నుండు పశ్చిమద్వారములు. జీవుడా ద్వారముల గుండ విషయముల ననుభవించుచుండును. కావున నవిరాజునకు దేశాంతరముపోవు మార్గములుగా వర్ణింపబడినది. బుద్ధియే ఆనగరమునకు స్వామిని యగు పురంజని. దీనిమూలముననే శరీరేంద్రియాదులయందు నేను నాది యనెడు భావములుత్పన్నములగుచున్నవి. దీనినాధారముగా గొనియే జీవుడు ఇంద్రియములద్వారా విషయముల ననుభవించుచుండును. పదియింద్రియములే ఆమెకుగల పదిమంది మిత్రులనియు ఆఇంద్రియవ్యాపారములే ఆమె చెలికత్తెలనియు వర్ణింపబడెను. ప్రాణాపానవ్యానోదానసమాన రూపములగు అయిదు వృత్తులతోగూడిన ప్రాణవాయువే ఆ నగరమును కాపాడు అయిదు పడగలుగల సర్పముగా వర్ణింపబడెను. జ్ఞానకర్మేంద్రియములకు నియామకమగు మనస్సు పదునొకండవ బాహుబలాఢ్యుడగు యోద్ధగా వర్ణింపబడెను. శబ్దాదిపంచవిషయములే పాంచాలదేశము. దానిమధ్యయందే యీ నవద్వార పట్టణము నిర్మింపబడెను. పురంజనుడను జీవుని నడిపించు అంధులగు మిత్రులిద్దరు కాలుసేతులే యని యెరుంగుము. వాటి సహాయము వల్లనే గదా జీవుడే పనిచేసినను. హృదయమే అంతఃపురము. అందుండు మనస్సే విషూచియను పేరుగల ప్రధానసేవకుడు. జీవుడు ఆ మనస్సుయొక్క సత్త్వాది గుణములవల్లనే హర్షశోకమోహములనుపొందుచున్నాడు. పురంజనుడు తన భార్యకు వశంవదుడై వర్తించుచున్నాడని చెప్పబడెను. అనగా జీవుడు బుద్ధికి వశుడై ప్రవర్తించెను. కాలకన్య యనగా వృద్ధావస్థ. అది ఏపురుషునికి

రుచించును ? యవనరాజు దానిని సాదరిగా అంగీకరించెను. యవనరాజు మృత్యువే మృత్యువు ముసలితనమును సహాయముగా తీసుకొనియే ప్రాయశః ప్రాణులను హింసించును. వాని సోదరుడగు ప్రజ్వాలు డనగా ప్రజలను హింసించి త్వరలో చంపెడు శీత-ఉష్ణజ్వరములు.

ఈవిధముగ జీవుడు కర్మవశమున పరమ పురుషుని మరచి దేహమున బడి బుద్ధికి వశుడై అజ్ఞానముచే నాచ్ఛాదింపబడి ఆధ్యాత్మిక ఆధిభౌతిక ఆధిదైవిక భోగముల ననుభవించుచు నూరువర్షములు జీవించి వార్ధక్యముచే నావరింపబడి మృత్యువు వాత బడును. ఓరాజా! నీవు కామ్యకర్మలయందు పరమార్థబుద్ధితో పరమాత్మను మరచి యిన్నికష్టములకు పాత్రుడైతివి. ఈ కర్మలు వినుట కింపుగ నుండునుగాని వీటియందు పరమార్థ మించుకను లేదు. ఉన్నట్లు తోపించుట అజ్ఞానకృత్యము. వేదమంతయు కర్మపర మనువారు మలినమతులు. వారాత్మతత్త్వము నెరుంగరు. పూర్వాగ్రములగు దర్భలచే భూమినంతను కప్పివేసి అనేకపశువులను హింసించి మేము కర్మాభిమానులమని గర్వించుచున్నారు. వారు కర్మరహస్యము నెరుంగనివారు. భగవత్ప్రీతికొరకై యాచరింపబడునదియే కర్మ. భగవంతునియందు చిత్తము లగ్నముచేయునదియే విద్య, భగవంతుడు దేహాదారులకంతరాత్మయు నియామకుడును, స్వతంత్రుడును. కావున యీతని చరణకమలములే మానవులకు ముఖ్యావలంబనములు, వానివల్లనే సంసారులకు కల్యాణము చేకూరును.” అని ఆ వృద్ధబ్రాహ్మణుడు స్త్రీజన్మమందున్న పురంజనున కుపదేశించెనని నారదుడు ప్రాచీనబర్హికి ఉపదేశించెను.



(8 వ పేజీ తరువాయి)

పంగుని. 11. తే. శుక్రవారం. పెరియాళ్వార్ తిరుమొడి.
పంగుని. 18. తే. శుక్రవారం. శిరియతిరుమడల్
పంగుని. 25. తే. శుక్రవారం. శిరియతిరుమడల్

వికృతినామసంవత్సర చిత్రినెల

చిత్రినెల- 2 తేదీ శుక్రవారం పెరియ తిరుమడల్
చిత్రినెల- 9 తేదీ శుక్రవారం శిరియ తిరుమడల్

యిది మొదలుకొని ఉడయవర్ల చరిత్రకాలక్షేపము

చిత్రినెల-16 తేదీ శుక్రవార పెరియ తిరుమడల్
చిత్రినెల-23 తేదీ శుక్రనారం శిరియ తిరుమడల్
చిత్రినెల-23 తేదీ శుక్రవారం పెరియతిరుమడల్
చిత్రినెల-30 తేదీ శుక్రవారం పెరియ తిరుమడల్

ఈమాదిరిగా శుక్రవారములున్ను-మధ్యాహ్నం 4 ఘం॥లకు తిరునారాధనయున్ను అయి, తిరుమడల్ సేవ గురుపరంపర కాలక్షేపము, తిరుప్పావుశాత్తుమొర, రాత్రి 9 ఘం॥వరకు జరుగుతూ ఒక సంవత్సరం గడిపితిమి.

కార్యదర్శిణి :-
పువ్వాడ మంగమ్మ,
శ్రీ యతిరాజసేవా మహిళాసంఘము మదరాసు శాఖ.

సుధానిధిలో ఎంబెరుమానార్ పఠంవుంచి. కలశంవుంచి రామానుజ అష్టోత్తరఅర్చవుత్సవం జరిపిన భాగవతుల తిరునామములు.

12 మొదటిదినం. పూరా శ్రీదేవమ్మ, పువ్వాది లక్ష్మీతాయారమ్మ
2. దినం. పాతూరు క్రిష్ణవేణమ్మ
3. దినం. తవ్వా కుట్టిఅమ్మ
4. దినం. పొన్నూరు శ్రీరంగనాంచారమ్మ
5. దినం. శ్రీదేవమ్మ

మొదటిదినం కలశం వుంచినశీట, చెంబు, పువ్వాడ మంగమ్మగారిది. ఉడయవర్ల ఫఠములు చిన్నది. ఉత్సవంచేయంచినవార్లకు సమర్పించినది. పఠములు 10, యివికూడా పువ్వాడ మంగమ్మ

సమర్పించినారు, కలశమునకు, పటములకు, అయినఖర్చు, 8-0-0 రూపాయిలు.

కార్యదర్శిణి.

పువ్వాడ మంగమ్మ,

శ్రీయతిరాజసేవా మహిళా సంఘ మదరాసు శాఖ.

మదరాసులో జార్జిటవున్‌లోని శ్రీఎంబెరుమానారు సన్నిధియందు శ్రీవిశిష్టాద్వైతమత ప్రచారక సంఘముయొక్క శ్రీశాఖ శ్రీయతిరాజ సేవామహిళా సంఘమువారు జరిపిన ప్రచార విశేషములు,

ఎంబెరుమానారుకు వడాయిత్తు. 5. వ నాలు నడిచినది, ఈ 5 రోజులు ఎంబెరుమానార్లు సుధానిధికి వేంచేసి తిరుమండనం అయ్యి, శ్రీమద్రామానుజ సహస్రనామ స్తోత్రము నామావళీ సహితంగా అర్చనలు జరిగినది. ఈఅర్చనకైంకర్యములకు చందాలను సమర్పించిన భాగవతుల తిరునామములు.

| | | | |
|---|---|---|---|
| 1. వత్తి జానకమ్మ | 1-0-0 | 22. కొత్తూరు కమలమ్మ. | 1-0-0 |
| 2. వోలేటి రంగనాయకమ్మ | 2-0-0 | 23. గావం శ్రీఆండాళమ్మ. | 0-8-0 |
| 3. యి. ఆండాళమ్మ. | 1-0-0 | 24 పుద్దంటి మహాలక్ష్మమ్మ. | 1-0-0 |
| 4. కొత్తూరు రంగనాయకమ్మ | 4-0-0 | 25. కునగా మంగమ్మ. | 1-0-0 |
| 5. పువ్వాడి సుభద్రమ్మ. | 0-8-0 | 26. కొత్తూరు ఆదెమ్మ. | 1-0-0 |
| 6. గుగ్గిలం వరలక్ష్మిఅమ్మ. | 0-8-0 | 27. తాతా కమలమ్మ. | 0-8-0 |
| 7. పుప్పులూరు పద్మాలమ్మ. | 2-0-0 | 28. పూరా కనకమ్మ. | 1-0-0 |
| 8. మద్దాలి పెరుందేవితాయారమ్మ. | 0-8-0 | 29. నాని కణ్ణమ్మ. | 1-0-0 |
| 9. ఏలూర్చూరు లక్ష్మితాయారమ్మ. | 1-0-0 | 30. గా. అన్నపూర్ణమ్మ. | 0-8-0 |
| 10. పుప్పులూరు పద్మాలమ్మ. | 1-0-0 | 31. సావిత్రమ్మ. | 1-0-0 |
| 11. పొత్తూరు లక్ష్మికాంతమ్మ. | 1-0-0 | 32. గా. మీనాక్షమ్మ | 0-8-0 |
| 12. కోటా మంగమ్మ. | 0-8-0 | 33. సుబ్బరత్నమ్మ | 1-0-0 |
| 13. చంద్రగిరి మాణిక్యమ్మ. | 5-0-0 | 34. కొత్తా కనకమ్మ | 1-0-0 |
| 14. రె. ఆండాళమ్మ. | 0-8-0 | 35. పొత్తూరు కిష్టవేణమ్మ | 5-0-0 |
| 15. మద్దాలి అమ్మణ్ణి. | 1-0-0 | 36. గొల్లపూడి అమ్మణ్ణి | 2-0-0 |
| 16. పసుమర్తి మరకతమ్మ. | 0-8-0 | 37. పువ్వాడి లక్ష్మితాయారమ్మ | 1-0-0 |
| 17. మద్దాలి వెంకటసుబ్బమ్మ. | 1-0-0 | 38. గొబ్బూరు అమృతవల్లితాయారమ్మ | 2-0-0 |
| 18. మిరియాల ఆండాళమ్మ. | 1-0-0 | 39 నామా జయరాంశెట్టి | 1-0-0 |
| 19. పెసల అమ్మణ్ణిఅమ్మ. | 0-8-0 | 40. పబ్బిశెట్టి అమ్మణ్ణి | 1-0-0 |
| 20. కోమలపల్లి రుప్పమ్మ. | 0-8-0 | 41. కమలమ్మ | 2-0-0 |
| 21. బుద్దారం ఆండాళమ్మ. | 0-8-0 | 42. బెజవాద రామానుజదాసి | 1-0-0 |

43. విజయలక్ష్మి అమ్మ 0-8-0
44. తవ్వా కుట్టి అమ్మ 1-0-0
45. దోగుపర్తి గంగనాయకమ్మ 2-0-0
46. పాకాళం దేవమ్మ 5-0-0
47. పూరా శ్రీదేవమ్మ 5-0-0
48. గెంధా సుందరమ్మ 2-0-0
49. యం. ఆదిలక్ష్మి 0-8-0
50. సున్నా రాజమ్మ 0-8-0
51. భాగవతురాలు 0-5-0
52. కంకణాల బాలమ్మ 0-8-0
53. ధొర్నాదుల కృష్ణవేణమ్మ 6-8-0
54. ఆత్మకూరు వెంకటసుబ్బమ్మ 1-0-0
55. మునగావారి తాలూకు 3-0-0
56. సాని సుందరమ్మ 2-0-0
57. నారాయణమ్మ 0-8-0
58 పొత్తూరి యదుగిరి అమ్మ 1-0-0
59. సుందరమ్మ 1-0-0
60. గుళ్ళపల్లి అమ్మణి 1-0-0
61. పసుమర్తి పెరుందేవితాయారమ్మ 1-0-0
62. అంతరంగ భక్తులు. భువనగిరి 5-0-0
63. ఓలేటి సుందరమ్మ 0-4-0
64. వెంకటనారాయణస్వామి 0-4-0
65. ధూపాటి కామాక్షమ్మ 0-8-0
66. తాతా ఆండాళమ్మ 2-0-0
67. నెనిగపల్లి అమ్మణిఅమ్మ 1-0-0
68. తిరుమూర్తి కనకలక్ష్మీ అమ్మ 0-8-0
69. యేల్చూరి యతిరాజమ్మ 1-0-0
70. కడప కమలమ్మ 1-0-0
71. ఆత్మకూరి వాసవాంబ 1-0-0
72 లేమా పూలమ్మ 1-0-0
73. మువ్వల మంగమ్మ 1-0-0
74. కోటా రుక్మిణమ్మ 0-8-0
75 బొమ్మిశెట్టి వెంకటలక్ష్మమ్మ 1-0-0
76. చల్లాపురం అన్నపూర్ణమ్మ 1-0-0
77 గౌరెవాళ్ళ మరకతమ్మ 1-0-0
78 దొర్నాదం రంగమ్మ 0-8-0
79. మాదిరెడ్డి అన్నపూర్ణమ్మ. కనకమ్మ 2-0-0

114-9-0

పీవితాలూకు అయిన ఖర్చు 110-6-0

ఉన్న నిల్వ 4-3-0

(1) పెరియాళ్వార్ల విందుకు గోష్టి వివరం.
పువ్వాడ లక్ష్మీతాయారమ్మ తట్టలు 3 విందుకు పావతతల్వాం బియ్యం, పడిపప్పు వగయిరాలు పెట్టినారు. విందుకు అందరు పయిమాదిరిగానే పెట్టినారు.

(2) పరాంకుశ గోష్టి విందు గొబ్బూరు అమృతాలమ్మ, చవల అలివేలు తాయారమ్మ మువ్వాల మంగమ్మ గార్లు జరిపినారు.

(3) శ్రీయాళవందార్లు విందు దోగుపర్తి శ్రీరంగనాంచారమ్మ గారు జరిపినారు.

(4) యెంబెరుయానార విందు కూరపాట కమలవల్లి తాయారమ్మ గారు జరిపినారు.

(5) బట్టరు విందు నెందాత్రి కణ్ణమ్మ, సానికణ్ణమ్మ, కోటా మంగమ్మ, యేల్చూరు లక్ష్మీతాయారమ్మ గార్లు జరిపినారు

(6) ముత్తుకురినాడు విందు పూరాశ్రీ దేవమ్మగారు గొల్లపూడి నార్లు జరిపినారు.

(7) నంబిళ్ళ విందు లేమా పుష్పాలమ్మ శ్రీరాంశెట్టి అండాళమ్మ గార్లు జరిపించినారు.

(8) తిరువాయిమొళిపిళ్ళగారి విందు తాతా సుశీలమ్మ, కొంజేటి అలివేలు తాయారమ్మ

వోలేటి రంగనాయకమ్మ, పాతులూరు పూలమ్మ, కంకిపాటి అమ్మణమ్మ, చదెళ్ళ శ్రీరంగ నాంచారమ్మ, సాని పద్మాలమ్మ గార్లు జరిపించినారు.

(9) మనవాళమామూలతిరువడి సంబంధస్తులు అష్టదిగ్గజములు పెట్టుకోలకుము దాలమ్మ, సాని సుందరమ్మ, పొనుగొండ సరస్వతమ్మ, పొత్తూరు క్రిష్ణవేణమ్మ, బొమ్మశెట్టి వెంకట సుబ్బమ్మ, పొత్తూరు లక్ష్మీకాంతమ్మ, పొత్తూరు యెదిగిరమ్మ రాచూరు మాణిక్యమ్మ గార్లు జరిపించినారు.

(10) ఆండాళ్ళుతిరుకల్యాణంకు పాతాళం వేదవల్లి తాయారమ్మగారు చదివింపులు తట్టెలు మంగళసూత్రం పెట్టినారు.

మద్రాసునందు యతిరాజ సేవా మహిళా సభ వారి చే జరుపబడిన అనగా మార్చి నెల తే 28 ది 1950వ సం॥ అండాళ్ళు నీరాటవుభయంకు కయింకర్యములు సమర్పించిన వారి నామ ధేయములు.

బుక్కు దాఖలా పేర్ల ప్రకారం

| | | |
|---|---|---|
| వసూళ్ళు మొత్తం | రు | 79–10–0 |
| నీరాటవుత్సవంకు కర్చులు | | 55– 0–9 |
| నిల్వ | రు | 24– 9–3 |

తిరువాడిపూరు వుత్సవంలో

| | | |
|---|---|---|
| మిగిలిన రూపాయలు | | 24–12–0 |
| వెరశి మొత్తం | రు | 49– 5–3 |



శ్రీమతే రామానుజాయ నమః



ది 11-7-1950 సం॥రం తేదీని గుంటూరు జిల్లా ఒంగోలు గ్రామంలో శ్రీకోదండరామ స్వామివారి సన్నిధియందు శ్రీ ఉ. వే. శ్రీమాన్ అద్దంకి తిరుమల సమయోద్దండ కోలాహల లక్ష్మీ నృశింహ కుమార తిరువేంగడ తాత దేశికాచార్యులయ్యవార్లంగారి అధ్యక్షత క్రింద జరిగిన శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ కార్యకారిణి సంఘ సమావేశమున ఉత్తీర్ణమైన

## తీ ర్మా న ము లు.

౧ తీర్మానము:-

ప్రస్తుతకాలమున ఉభయవేదాంతముల పాండిత్యమునకు తగిన యవలంబనము, ఆదరణము తగ్గుచుండుటచే దానిని అభివృద్ధిపరచుటకై ఉభయవేదాంతముల యందును వేదము. స్మార్తములు యందును పరీక్షల నేర్పరచి వాటియందు ఉత్తీర్ణులైనవారలకు తగినబిరుదములు ఆర్ధిక సన్మానములు చేయుటకు ఈ క్రింది కార్యక్రమములను అనుసరించుటకు తీర్మానించబడినది.

## సం స్కృ త వే దాం త ము.

పాఠ్యక్రమము:-

౧ ప్రవేశపరీక్ష 1. వేదాంతసిద్ధాంతకౌముది. సవ్యాఖ్యానము.
2. యతీంద్రమతదీపిక.
3. సిద్ధాంత సిద్ధాంజనము.
4. వేదాంతసారము.
5. వేదాంత దీపము.

౨ ప్రాథమికపరీక్ష 1. విషయవాక్యదీపిక.
2. శ్రీభాష్యము-చతుస్సూత్ర్యంత శ్రుతప్రకాశిక.

3 మాధ్యమికపరీక్ష 1. గీతాభాష్యం.
2. కూరనారాయణీయ భాష్యసహిత 'ఈశ' రంగరామానుజ, భాష్య సహిత కేన, కఠ, ప్రశ్న,ముండక, మాండూక్య తైత్తరీయ, బృహదారణ్య కషష్టాధ్యాయము. ఛాందోగ్య షష్ఠప్రపాఠకము,లున్ను; ఐతరీయ, శ్వేతాశ్వేతర, కౌషీత

కము మూలార్థము మాత్రం.
3. వేదార్థ సంగ్రహము-సవ్యాఖ్యానము.
4. గద్యత్రయము-భాష్యసహితము.
5. నిత్యగ్రంథము,

౪ ఉత్తమపరీక్ష 1. వేదాంతవాదావళి పూర్వభాగము.
2. సుదర్శన సురద్రుమము,
3. చండామారుత సహిత శతదూషణీ 25 వాదములు.
4. న్యాయ భాస్కరం.4 భంగములు
5. సర్వదర్శన సంగ్రహము.

సన్మానములు- ఉత్తమపరీక్షయందు ఉత్తీర్ణులైనవారికి "యతిరాజసిద్ధాంత ప్రవీణ" అను బిరుదము నిచ్చుటకున్ను, వీరికి ఉత్తీర్ణులైన సంవత్సరము నుండి సంవత్సరము ఒక్కంటికి రూ 100-0-0 చొప్పున వార్షిక సంభావనను వారి జీవితాంతము వరకు యిచ్చు చుండుటకున్ను; ప్రవేశపరీక్ష లో ఉత్తీర్ణులైన వారికి ఆసంవత్సరమునకు మాత్రము రూ 10లు సన్మానమిచ్చుటకున్ను; ప్రాథమికపరీక్షలో ఉత్తీర్ణులైనవారికి ఆసంవత్సరమునకు మాత్రము రూ 20-0-0లు సన్మానమిచ్చుటకున్ను; మాధ్యమికపరీక్షలో ఉత్తీర్ణులైనవారికి ఆసంవత్సరమునకు మాత్రము రూ 40-0-0లు సన్మానమిచ్చుటకున్ను; తీర్మానించబడినది.

## ద్రావిడ వేదాంతము.



### ♦ పాఠ్యక్రమము. ♦

౧ ప్రవేశపరీక్ష 1. తిరుపల్లాండు, తిరుప్పళ్ళియెళుచ్చి తిరుప్పావై నీరాట్టం, పూచ్చుడల్, కాప్పిడల్, శెన్నియోంగు, అమలనాధపిరాన్, కణ్ణినుణ్ శిరుత్తాంబు,కోయిల్ తిరువాయ్‌మొడి, రామానుజ నూత్తందాది, ఉపదేశరత్నమాల, మాణిక్కంగట్టు, వారణమాయిరం, పణ్ణమాడంగళ్. (అన్నీ మూలమాత్రం ప్రధానము.)
2. తిరువాయిమొడి. చంగోలము . (అన్నీ మూలమాత్రం ప్రధానం)
3. మిగతమువ్వాయిరము. (మూలమాత్రం. సామాన్యం)

౨ ప్రాథమికపరీక్ష:— నాలాయిర, ప్రబంధములకు, ఇరామానుజ నూత్తాందాది ఉప దేశనూలలకు ప్రతిపదార్థము సహితము.

3 మాధ్యమికపరీక్ష:— 1. ముముక్షుప్పడి, శ్రీవచనభూషణము, తత్వత్రయము తిరుప్పావై ఆచార్య హృదయము జీయర్ వ్యాఖ్యానముతో

2. మిగత 15 రహస్యములు, పిళ్ళైలోకాచార్యులు వారు సాయించినవి.

౪ ఉత్తమ పరీక్ష:— భగవద్విషయము ఈడు ముప్పత్తారాయిరప్పడి- (ప్రమాణ తిరట్టుతో)

స న్మా న ము లు.

ఉత్తమపరీక్షలో పూర్తిగా ఉత్తీర్ణులైనవారికి "శఠకోప వాఙ్నిపుణ" అను బిరుదము నిచ్చుటకున్ను; వీరికి ఉత్తీర్ణులైన సంవత్సరమునుండి సంవత్సరము ఒక్కొంటికి రూ 100-0-0 చొ॥న వార్షిక సంభావనను వారి జీవితాంతమువరకు యిచ్చుచుండుటకున్ను; ప్రవేశపరీక్షలో ఉత్తీర్ణులైన వారికి "ద్రావిడ వేదాధ్యాపక" అను బిరుదము నిచ్చుటకున్ను, వారికి ఉత్తీర్ణులైన సంవత్సరము నుండి సంవత్సరము ఒక్కంటికి రూ 100-0-0లు చొ॥న వార్షిక సంభావనను వారి జీవితాంతము వరకు యిచ్చుచుండుటకున్ను,

ప్రవేశపరీక్షలో ఉత్తీర్ణులైనవారికి ఆసంవత్సరమునకు మాత్రము రూ 10-0-0 సన్మానమును "ద్రావిడవేదాధ్యాపక" అను బిరుదమును యిచ్చుటకున్ను;

ప్రాథమిక పరీక్షలో ఉత్తీర్ణులైన వారికి ఆసంత్సమునకు మాత్రము రూ 20-0-0 లు న్మానమును."ద్రావిడవేద విశేషాధ్యాపక" అను బిరుదమును యిచ్చుటకున్ను;

మాధ్యమిక పరీక్షలో ఉత్తీర్ణులైన వారికి ఆసంవత్సరమునకు మాత్రం రూ 40-0-0 లు సన్మానమును "కాలక్షేపప్రవీణ" అను బిరుదమును యిచ్చుటకున్ను; తీర్మానించబడినది.

వే ద ము.

ఋగ్వేదము, శుక్లయజుర్వేదము, కృష్ణయజుర్వేదము, సామవేదము, అధర్వణవేదము అను వేదశాఖలలో ఏదో ఒక వేదశాఖను కేవల సంహితామాత్రమును పరీక్షనిచ్చి ఉత్తీర్ణులైన వారికి "వేదవిద్వాన్" అను బిరుదమును, ఉత్తీర్ణులైనసంవత్సరము నుండి వీరి జీవితాంతము వరకు సంవత్సరం ఒక్కంటికి రూ 25-0-0లు చొ॥స వార్షిక సంభావను యిచ్చుచుండుటకున్ను.

ఆయా వేదశాఖల పదము-క్రమము-బ్రాహ్మణము-అరణ్యాకములో పరీక్షనిచ్చి ఉత్తీర్ణులైన

వారికి "వేదపండిత" అను బిరుదమును, ఉత్తీర్ణులైన సంవత్సరమునుండి వీరి జీవితాంతము వరకు సంవత్సరం ఒక్కంటికి రూ. 58-0-0లు చొప్పున వార్షిక సన్మాన మిచ్చుచుండుటకున్ను;

3. ఆయా వేదశాఖయొక్క మంత్ర-బ్రాహ్మణ-ఆరణ్యకములకు అర్థముతోసహా పరీక్షనిచ్చి ఉత్తీర్ణులైనవారికి "వేదవిశేషజ్ఞ" అను బిరుదమును ఉత్తీర్ణులైన సంవత్సరము నుండి వీరి జీవితాంతమువరకు సంవత్సరము ఒక్కంటికి రూ. 100-0-0 లు చొప్పున వార్షిక సన్మాన మిచ్చుచుండుటకున్ను తీర్మానించబడినది.

## స్మార్తము

૪. పాఠ్యక్రమము:-

ప్రవేశ పరీక్ష:- విష్వక్సేనపూజ లగాయతు ఉపనయనాంతము సహా ప్రయోగవిధి-తిరువారాధన క్రమము ప్రక్రియా సహితము.

ప్రాథమిక పరీక్ష:- వివాహము, గర్భాదానము, సీమంతము, పుంసవనము, వైష్ణవేష్టి, శైభవేష్టి, శాంతులు, ప్రక్రియాసహితము.

మాధ్యమిక పరీక్ష:-సామాన్య ప్రాయశ్చిత్తములు, ఆశీర్వచన పనసలు, అపరము-శ్రీచూర్ణ పరిపాలనాది సపిండీకరణాంతము ప్రక్రియా సహితము.

ఉత్తమ పరీక్ష:- పైమూడు తరగతులలో అన్నికర్మలకు అర్థసహితము.
ముహూర్త నిర్ణయము,

ఈ పాఠ్యక్రమము సూత్రము ననుసరించిన దైననుసరియే. వేదోక్త పురాణోక్తములు రెండును కావలయును.

## సన్మానములు

ఉత్తమ పరీక్షయందు ఉత్తీర్ణులైన వారలకు "షోడశకర్మాధికారి" అని బిరుదము నిచ్చుటకున్ను, వారికి ఉత్తీర్ణులైన సంవత్సరమునుండి సంవత్సరము ఒక్కంటికి రూ. 40-0-0 లు చొప్పున వీరి జీవితమువరకు వార్షిక సన్మాన మిచ్చుచుండుటకున్ను,

ప్రవేశపరీక్షలో ఉత్తీర్ణులైనవారలకు ఆ ఒక్క సంవత్సరమునకుమాత్రము రూ. 10-0-0 లు సన్మానమిచ్చుటకును; ప్రాథమిక పరీక్షలో ఉత్తీర్ణులైన వారలకు ఆ ఒక్కసంవత్సరమునకు మాత్రము రూ. 20-0-0 లు సన్మానమిచ్చుటకును;

మాధ్యమిక పరీక్షలో ఉత్తీర్ణులైన వారలకు ఆ ఒక్క-సంవత్సరమునకు మాత్రము రూ. 30-0-0 లు సన్మానమిచ్చుటకున్ను తీర్మానించబడినది.

## పరీక్షా నియమములు

1. ఈ పరీక్షలలో ద్రావిడవేద పరీక్షలన్నింటికిన్ని పంచసంస్కార పరులైన శ్రీవైష్ణవులందరు వర్ణ-ఆశ్రమ-స్త్రీ-పురుషవయోభేదములు లేకుండగ పాల్గొనవచ్చును.
   మిగత పరీక్షలకు ఉపనయనసంస్కార పరులై పంచసంస్కారపరులైన వారు మాత్రము ఆశ్రమ-వయోభేదములు లేకుండగ పాల్గొనవచ్చును.
2. ఆయా విభాగముల యందుగల అన్ని కక్షలయందును ఉత్తీర్ణులైనగాని ఆయావిభాగ ఉత్తమ కక్షలలో ఉత్తీర్ణులైనటుల అంగీకరించబడదు. మరియు బిరుదులు గాని వార్షిక సన్మానములు గాని ఈయబడవు.
2. ఆయా విభాగ కక్షలన్నింటికిని ఒకే పర్యాయముగ గాని లేక తమ తమ శక్త్యానుసారముగ పర్యాయత్వేనగాని పాల్గొనవచ్చును. ప్రథమ కక్షలో నుత్తీర్ణులైన తరువాత ఎనిమిది సంవత్సరములలో మాత్రము ఉత్తమతరగతిలో పాల్గొను నర్హత యుండజాలదు.
4. పరీక్షలు లేఖన-వాచికములుగ కూడ నుండును.
5. పరీక్షలను గురించిన యావత్తు విషయములలోను పరీక్షాపరిషత్తువారిదే తుదినిర్ణయము.

## ఆర్థికము

ఈ శాశ్వత-తాత్కాలిక సన్మానములను శాశ్వతముగ జరుపుచుండుటకు కనీసము ఆయిదు లక్షల రూపాయిలైనను మూలధనము కావలసియుండును. దీనిని ప్రభుత్వబ్యాంకులలో ఫిక్సెడు డిపాజిటు చేయుటద్వారా సంవత్సరము వక్కంటికి పదునైదువేల రూపాయల వడ్డీ రాగలదు. కాన ప్రారంభదశలో ఈకార్యక్రమము చక్కగా నెరవేరగలదని నమ్ముచున్నాము.

ఎవరైతే ఒకేపర్యాయము రూ. 3333-0-0 లను మూలధనముగా సమర్పింతురో వారి తిరునామముతో ఒక పండితునకు శాశ్వతముగ నీయబడు వార్షికసన్మానము రూ. 100-0-0 ను ప్రతిసంవత్సరము సమర్పించబడుచుండును.

ఎవరైతే ఒకేపర్యాయము రూ. 2000-0-0 లను మూలధనముగా సమర్పింతురో వారి తిరునామముతో ఒక పండితులకు శాశ్వతముగ నీయబడు వార్షిక సన్మానము రూ. 58-0-0 ను ప్రతిసంవత్సరము సమర్పించబడును.

ఎవరైతే ఒకేపర్యాయము రూ. 1000-0-0 లను మూలధనముగా సమర్పింతురో వారి తిరునామముతో ఒక పండితులకు శాశ్వతముగ నీయబడు వార్షిక సన్మానము రూ. 25-0-0 ను ప్రతిసంవత్సరము సమర్పించబడుచుండును.

ఒకరు ఇద్దరు లేక ముగ్గురుకాని కలిసియైనను ఒక్కొక్క నిధిని ఏర్పాటుచేయవచ్చును.

ఒకరే అనేకనిధులను ఏర్పాటుచేయవచ్చును.

దాతలు ప్రత్యేకించి ఫలానా సన్మానమునకని నిర్ణయించికూడ నిధులను ఏర్పాటు చేయవచ్చును.

తాత్కాలిక బహుమతుల నిచ్చుటకుకూడ దాతలు తమతమ పేరులతో నిధుల నేర్పాటు చేయవచ్చును.

ఈ నిధులన్నియు ఈ సంఘ సంచాలక సమితి ప్రధానసభ్యుని పేరున ప్రభుత్వబ్యాంకులలో జమచేయబడును.

ఈ పరీక్షల జరుపుట ఉత్తీర్ణానుత్తీర్ణుల నిర్ణయించుటకు ఈ సంఘ పండిత పరిషత్తులోని ప్రథమ శ్రేణి పండితులనుండి అయిదుగురుని ప్రతిసంవత్సరము ఎన్నుకొనబడుచుండవలెను. ఈ పరీక్షలనుగూర్చి వీరినిర్ణయమే ఆఖరినిర్ణయముగా పరిగణించబడవలయును. సంచాలకసమితి ప్రధానసభ్యుడు ఈ పంచాయితీక అధికారరీత్యా అధ్యక్షులై యుందురు. వీరితో కలిపియే పంచాయతీపూర్తి.

(తరువాయి ప్రక్క పేజీలో)

★ వినతి ★

ఈ కార్యక్రమమును నిర్విఘ్నముగాను శాశ్వతముగాను నిర్వహించుటకు కావలసిన ఆర్థిక సహాయమును కల్పించవలసినదిగ దాతల నందరిని సవినయముగ కోరుచున్నారము.

తగిన ఆర్థిక సహాయము కలిగిన వెంటనే ఈకార్యక్రమమును ప్రారంభించుటకు కార్యదర్శికి అధికారమివ్వడమైనది.

కార్యాలయము :
అర్తమూరు, (వయా) ద్వారపూడి,
తూర్పుగోదావరిజిల్లా.

ఇట్లు,
శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము.
11—7—1950.

★ కట్నములు—కానుకలు ★

తూర్పుగోదావరి జిల్లా రాజమహేంద్రవరం కాపురస్థులు శ్రీమతి ముకుంబై రామానుజమ్మ గారు తమ మనుమడు చి. మురళీకృష్ణావతారం యొక్క నామకరణ మహోత్సవమున భక్తి 'నివేదన' పత్రికకు రూ 58—0—0లు కానుకగ సమర్పించిరి. వీరికి శ్రియఃపతి సమస్తైశ్వరముల నొసంగుగాక.

గుంటూరు జిల్లా పందిళ్ళపల్లి గ్రామ కాపురస్థులు శ్రీమాన్ పద్మనాభుని నాగేంద్రుడు గారు శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు—పత్రికకు రూ 10—0—0 లను విరాళముగ సమర్పించిరి. వీరికి శ్రియఃపతి సమస్తైశ్వర్యముల నొసంగుగాక.

కృష్ణాజిల్లా మైలవరం జమీందారిణి శ్రీశ్రీ శ్రీమతి సూరానేని వరమంగయ్యామ్మ బహద్దూరువారు శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు, ఈసంఘముచేనిర్మించబడిన శ్రీమానుజ కూటమున (కోరుకొండ. (వయా) రాజమహేంద్రవరం) ఉంచుటకై తిరువారాధన మున్ను, తాత్కాలిక విరాళముగ రూ 40—0—0 లును సమర్పించిరి.
వీరికి శ్రియఃపతి సమస్తైశ్వర్యముల నొసంగుగాక.

గుంటూరుజిల్లా కొత్తపట్టణము గ్రామస్థులు శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు రూ 9—0—0లను విరాళముగ సమర్పించిరి.
వీరికి శ్రియఃపతి సమస్తైశ్వర్యముల నొసంగుగాక.

గుంటూరుజిల్లా ఒంగోలు గామస్థులు శ్రీమాన్ కాండ్యూరి వెంకట జగన్నాధా చార్యులుగారు శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ పరీక్షానిధికిగాను రూ॥ 25-0-0 లను సమర్పించిరి

వీరికి శ్రియఃపతి సమస్తైశ్వర్యముల నొసంగు గాక.

---

గుంటూరుజిల్లా పందిళ్ళపల్లి గ్రామ కాపురస్తులు శ్రీమాన్ మువ్వల రామయ్యగారు భక్తి "నివేదన" పత్రికకు రూ 5-0-0లు విరాళముగ సమర్పించిరి. వీరికి శ్రియఃపతి సమస్తైశ్వర్యముల నొసంగుగాక.

---

శ్రీమాన్ వంగల లక్ష్మణాచార్యులుగారు తమ కుమార్తె వివాహమహోత్సవమున శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు రూ 1-0-0 కట్నమును సమర్పించిరి. వీరికి శ్రియఃపతి సమస్తైశ్వర్యముల నొసంగు గాక.

---

పశ్చిమగోదావరిజిల్లామల్లంపట్రువా స్తవ్యులు శ్రీమాన్ పూలపల్లి రామానుజాచార్యులుగారు శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు రూ 5-0-0 కట్నమును సమర్పించిరి. వీరికి శ్రియఃపతి సమస్తైశ్వర్యముల నొసంగు గాక.

---

బందరు జవ్వాజిపేట కాపురస్తులు వైశ్య శిఖామణులు శ్రీమాన్ కొత్తబాల కృష్ణయ్యగారు తమ కుమారుడు పాండురంగారావు అనే నెంబరుమాళ్ళ ఆచార్య సమాశ్రయణ సమయమున శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు రూ 5-0-0లు సంభావనను సమర్పించిరి.

వీరికి శ్రియఃపతి సమస్తైశ్వర్యముల నొసంగు గాక.

---

రాజమహేంద్రవరం కాపురస్తులు పణిహారం పార్థసారథిగారు తమ కుమారుని ఉపనయన మహోత్సవములో శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘమునకురూ 1-0-0 కట్నమును సమర్పించిరి

వీరికి శ్రియఃపతి సమస్తైశ్వర్యముల నొసంగు గాక.

శ్రీమతే రామానుజాయ నమః

## శ్రీయతిరాజ ఉభయవేదాంత పాఠశాల



శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘము, కోరుకొండ (వయా) రాజమహేంద్రవరం.

---

ఈ పాఠశాలలో యిపుడు శ్రీగీతాభాష్యము, శ్రీభాష్యము, భగవద్విషయము, శ్రీరామాయణము పాఠములు చురుకుగా జరుగుచున్నవి.

శ్రీ ఉ. వే. శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులుగారు అధ్యయనము చేయుచున్నారు.

ఇంకను యోగ్యులైన ఒకవిద్యార్థికి ఉచిత వేతనము యిచ్చుటకు అవకాశమున్నది. తగిన అర్హతకలవారు దరఖాస్తు చేసుకొనవలసినది.

ఇట్లు,
సహాయకార్యదర్శి,
ఆ. చి. శ్రీమన్నారాయణ.

# భక్తి నివేదన

(వేదాంత మాసపత్రిక)

ఇందు వేదాంత విషయ రాజములున్ను; భక్తిప్రచార విషయమైన వార్తలున్ను; వేదాంత సాంప్రదాయ విషయకమైన ప్రశ్నోత్తరములున్ను ప్రచురించబడును.

| | | |
|---|---|---|
| సాధారణ చందా | సం. కు 1కి | రు. 5-0-0 |
| సహాయ చందా | ,, | రు. 10-0-0 |

పోషకములు:

| | | |
|---|---|---|
| పోషకులు | సం. కు 1కి | రు. 25-0-0 |
| రాజపోషకులు | ,, | రు. 58-0-0 |
| మహారాజ పోషకులు | ,, | రు. 116-0-0 |

కార్యాలయము:

"భక్తి నివేదన" కార్యాలయము,

అర్తమూరు (పోస్టు) ద్వారపూడి.

తూర్పు గోదావరి జిల్లా.

Edited printed & published by A. ch. Srimannarayana charya, at Sriman press, Artamuru, E. G. Dt.

శ్రీమతే రామానుజాయ నమః



# భక్తి
# నివేదన

వేదాంత మాసపత్రిక.


| సంపుటి ౨ | వికృతి – భాద్రపదము | సంచిక ౬ |
|---|---|---|


శ్రీమన్నారాయణ

## శ్రీ విశిష్టాద్వైతము



శిష్యుడు:- భగవద్రామానుజాచార్యులవారు ఈమతమును తిర్గి ఎటుల ప్రచారము జేసిరి.

గురువు:- మతప్రచారమునకు ముఖ్యముగ నాలుగు మార్గములు గలవు.

1. వేద-వేదాంత-వేదాంగ-ఇతిహాస-పురాణాముల సమగ్రముగ విచారించి తమ పూర్వాచార్యులు ఉపదేశపరంపరగావచ్చునట్టి శిష్టసమ్మతమైన ఒక సిద్ధాంతమును తాము గట్టిగ నమ్ముట
2. తాము నమ్మిన సిద్ధాంతమును దేశములోని నలుదిక్కులకు తాము వెళ్ళి యితరమతనిరసన పూర్వకముగ స్వమతప్రాశస్త్యమును ప్రజలకు భోధించుట. దీనినే జైత్రయాత్ర యనవచ్చును.
3. తాము నమ్మిన సిద్ధాంతమును వాఙ్మయరూపముగ వ్రాసి ప్రచురించుట. యిందులో ప్రస్థానత్రయములలోను తమ మతసిద్ధాంతమునకున్న అనుకూల్యమును చాటుట ప్రధానము.
4. తమ తవనంతరమునకూడ తమసిద్ధాంతము వ్యాపించుటకు వలయు స్థిరమైన కట్టుబాట్లను జేయుట. ఇవి ముఖ్యములు,

శిష్యుడు:- శ్రీరామానుజాచార్యులువారు వీనిలో ఏఏమార్గముల నవలంబించిరి.

గురువు:- వారు ఈనాలుగు మార్గములను కూడ అవలంబించిరి.

శిష్యుడు:- దాని వివరము లెట్టివి?

గురువు:- శ్రీరామానుజాచార్యులువారు మొదట సామాన్య శాస్త్రముల తమ తండ్రి గారి వద్ద నభ్యసించిరి. పిమ్మట ప్రస్థానత్రియమును యాదవప్రకాశులవద్ద చదివిరి. గాని యాదవ ప్రకాశువులు ప్రస్థానత్రియమునకున్ను తాను సొంతముగ భాష్యముల వ్రాసి వానిని మాత్రమే వీరికి చెప్పిరి. ఆభాష్యములన్నియు అపసిద్ధాంతములై యుండుటచే శ్రీరామానుజాచార్యులువారు వాటి నన్నిటిని పూర్వపక్షముగ స్వీకరించిరి.

శ్రియఃపతి కటాక్షముచే నమ్మాళ్వార్లు వ్రాయించిన ప్రబంధములు, నాథములు వ్రాయించిన కారికలు, శ్రీయామునాచార్యులువారు వ్రాయించిన సిద్ధిత్రియము వగైరా గ్రంధములను భగవద్బోధాయన- ద్రమిడాచార్య టంక-గుహదేవ-భారుచి-కపర్ది వగైరా ఋషిపుంగవుల గ్రంధముల యాధారముచేతను శిష్టసాంప్రదాయసమ్మతమై పూర్వాచార్య గురుపరంపరా ప్రాప్తమైన విశిష్టాద్వైత సిద్ధాంతమే సరియైన సిద్ధాంతమని నమ్మి నిశ్చయించుకొనిరి.

శిష్యుడు:- వీరి నమ్మిక సరియైనదనుట ప్రమాణమేమి?

గురువు:- దీనికి రెండు ఆధారములున్నవి.

1. చేతనోజ్జీవనార్థమై కరుణామయుడైన సర్వేశ్వరునిచే వేదము లనుగ్రహించబడినవి. అవి అపౌరుషేయములు. నిత్యములు. నిర్దోషములు-భ్రమ-ప్రమ-విప్రలంబాది దోషములులేనివి. అట్టి వానిలో తెలుపబడిన వాక్యములన్నియు ప్రమాణములేకాని అప్రమాణములు పూర్వపక్షములు మిథ్యావచనములు -నిరర్థకములు. పరస్పరవిరుద్ధములు- అని అనుట న్యాయము కాదుకదా.

శిష్యుడు:- ఈవిషయమును అందరు అంగీకరించి-తీరవలసినదే.

గురువు:- నిజమే. కాని కొంతమంది మతకర్తలు అట్లుల అంగీకరించలేదు. కొంతభాగమే సత్యము మిగతది అసత్యమని కొందరు; కొంతభాగము పూర్వపక్షవచనములు. కొంతభాగము సిద్ధాంతవచనమని కొందరు కొంతభాగము నిరర్థకమైనది. కొంతభాగము సార్థకమైనదని కొందరు ఇట్లుల ఇతర మతకర్తలందరు తమ కనుకూలించిన వాక్యములను మాత్రమే గ్రహించి మిగత వాటిని ఏదో పేరుపెట్టి త్రోసివేసిరి.

శిష్యుడు:- అయితే అట్టివారలు వేదముల బట్టి తాము మతమును నిర్ణయించుకొనలేదనియు, తమ బుద్ధిననుసరించి తోచిన దానినే వేదసమ్మతమైన దానినిగా లోకమును భ్రమింపజేసితిరని తోచుచున్నది.

గురువు:- నాయనా సరిగా గ్రహించితివి. ఇతరమతస్థులు చేసిన సిద్ధాంతము లిట్టివే. తలను బట్టి తలపాగా చుట్ట ప్రయత్నించలేదు. తలపాగాను బట్టి తలను చెక్కుటకు ప్రయత్నించిరి.

శిష్యుడు:- భగవద్రామానుజు లెట్లు నిర్ణయించిరి ?

గురువు:- సంగ్రహముగ తెలిపెద వినుము. వేద వేదాంతాదులలో జీవ-పరమాత్మలకు భేదమున్నదని తెలుపు వాక్యములు కొన్నియు; అభేదమును తెలుపువాక్యములుకొన్నియు యున్నవి.

పరమాత్మకు సగుణుడను తెలుపు వాక్యములు కొన్నియు; నిర్గుణుడని తెలుపువాక్యములు కొన్నియు యున్నవి.

కొందరు జీవ-పరమాత్మలు భిన్నులను సిద్ధాంతము నేర్పరుచుకొని భేదమును తెలుపు వాక్యములు మాత్రమే ప్రమాణములు-మిగతవి కావని త్రోసివేసిరి.

కొందరు పరమాత్మ నిర్గుణుడను సిద్ధాంతము నేర్పరచుకొని నిర్గుణుడని తెలుపు వాక్యములు మాత్రమే ప్రమాణములు మిగతవి కావని త్రోసివేసిరి.

అటులనే మరికొందరు అభేదమునే సిద్ధాంతముగ నేర్పరచుకొని తదనుకూలమగు అభేధవాక్యములనే ప్రమాణముగ తీసుకొని భేధమును తెలుపువాక్యములను త్రోసివేసిరి.

మరికొందరు పరమాత్మను గుణుడను సిద్ధాంతము నేర్పరచుకొని తదనుకూలమగు సగుణ పరవాక్యములనే ప్రమాణముగ తీసుకొని నిర్గుణత్వమును తెలుపు వాక్యములను త్రోసివేసిరి.

భగవద్రామానుజాచార్యులువారు వీని నంగీకరించలేదు. వేద-వేదాంతములలో ఇటుల పరస్పరవిరుద్ధ-అప్రమాణిక-మిధ్య-వ్యర్థవాక్యములుండవనియే వీరి సిద్ధాంతము. అందుచే వానిలో తెలిపిన భేదము-అభేదము-సగుణత్వము-నిర్గుణత్వము కూడ ప్రామాణికములే అని వానికన్నింటికిన్ని సమన్వయమును జూపిరి.

శిష్యుడు:- అదెటుల? ఒకదానికొకటి పరస్పర విరుద్ధములైన వానికి సమన్వయ మెటుల స్వామీ?

గురువు:- 'నేను' అనుదాని కర్థమేమి.

శిష్యుడు:- ఈకంటికి కనిపించు పాంచభౌతిక శరీరమున్ను, దీనియందు అంతరాత్మరూపేణ యుండు ఆత్మయున్ను అర్థము.

గురువు:- అనగా నేను అనుదానిలో ఎన్నిపదార్థములున్నట్లు?

శిష్యుడు:- శరీరము-ఆత్మ అను రెండు పదార్థములున్నవి.

గురువు:- నేను అనునపుడు ఒకదానినే చూపుదువా? రెండువస్తువుల చూపుదువా?

శిష్యుడు: ఒక వస్తువును మాత్రమే జూపుదును.

గురువు:- నీవు చెప్పిన శరీరము, ఆత్మ అను పదార్థములు ఒకే రకమైనవా, భిన్న భిన్న తరగతివా?

శిష్యుడు :- అయ్యో! రెండు ఒకే రకమెటులగును. ఒకదానికొకటి పరస్పరము విరుద్ధ ధర్మముల కలవి. ఈశరీరము అచేతనము-నశించునది. ఆత్మయనునది-చేతనము-నిత్యమైనది.

గురువు :- ఇట్టి విరుద్ధ ధర్మములు కలిగి పరస్పరము భిన్నమైన వాటిని 'ఒకదానిని' గానే ఎటుల వ్యవహరింతువు ?

శిష్యుడు :- రెండును ఎప్పుడును కలిసి మెలిసియుండి విడదీయుటకు వీలులేకుండగ 'ఒకటే' అనుకొనుటకు వీలుగా యుండుటచేతను.

గురువు :- ఒకటేయని యనుకొనుటకు వీలుగా యుండుటచే ఒకటేయని వ్యవహరించినను వీనిలో వీనికి పరస్పరము భేదమున్నదందువా ? లేదందువా ?

శిష్యుడు :- పరస్పరము పూర్తిగా భేదమున్నదని యిదివరలోనే వప్పుకొంటినిగదా.

గురువు:- నాయనా! పరస్పరము భిన్నములైనట్టి పదార్థములు విడదీయుటకు వీలులేకుండగ అనవరతము కలిసిమెలిసియుండి ఒకటే అని యనుకొనుటకు వీలుండుటచే ఒకటే అనగా అభిన్నము అని శరీరాత్మలను ఎటుల అందువో అటులనే జీవ-పరమాత్మలకు కూడ అభేదము-భేదముకూడ సత్యములై సిద్ధించుచున్నవి.

శిష్యుడు :- ఎటుల ?

గురువు :- పరమాత్మకు మొట్టమొదట పంచభూతముల సృజించి నిత్యుడైన జీవునిలో తాను అంతరాత్మ రూపముగా ప్రవేశించి, ఆ జీవుని ఈ పంచభూతాత్మకశరీరములో ప్రవేశపెట్టును. అటుపిమ్మటనే వీనికో పేరు, ఒకరూపము ఏర్పడును. దీనినే సృష్టి యందురు. దీనికిముందు కూడ జీవుడు-ప్రకృతి యనునవి యున్నను అవి వేరువేరుగా పడియుండి ఎట్టిపేరుగాని-రూపముగాని లేనివైయుండును. అట్టి స్థితినే ప్రళయము-లయము యందురు. సృష్టి అయిన తరువాత శరీరము-అందులో జీవుడు- అందులో పరమాత్మ ఈముగ్గురుకలిసి విడతీయవీలులేకుండగ 'ఒకటే' అని అనుటకు వీలుగయుందురు. దీనినే స్థితి యందురు.

శిష్యుడు :- అయితే యిపుడు 'నేను' అనగా ఈ పాంచభౌతిక శరీరము-అందులో జీవాత్మ-అందులో పరమాత్మ అని మూడుపదార్థములయొక్క- కలయిక అన్నమాట.

గురువు :- అవును-ప్రతివస్తువు, ఈ మూడుపదార్థముల సమ్మేళనమే-ప్రతిపేరు ఈమూడింటిని తెలుపు సంజ్ఞయే. సృష్టిలో ఈమూడులేని వస్తువేదియులేదు. ఈమూడింటిని తెలుపని పేరులేదు. ఈమూడుపదార్థములు పరస్పరము భిన్నమైనవి-జన్మస్వరూపములు-భిన్నస్వరూపములు-భిన్నస్వభావమును-భిన్నగుణములు-భిన్నప్రకృతులు-భిన్నకార్యములు గలవి. గాన వేద-వేదాంతాదులలో భేదమును తెలుపు వాక్యములన్నియు ఈమూడు తత్త్వములభేదమును భోదించు

నవి, గాన అవన్నియు ప్రమాణములే. ఈమూడున్ను కలిసి మెలిసియుండి విడదీయుటకు వీలు లేకుండగ ఒకటేయని వ్యవహరించుటకు వీలుగా పరస్పరము సంబంధించియున్నవి. అందుచే వేద-వేదాంతాదులలో ఈవిడదీయజాలని శరీరాత్మసంబంధమునుబట్టి అభిన్నములని తెలుపు వాక్యము లన్నియు ప్రమాణములే. వీనిక పరస్పరము ఎట్టి విరోధములేదు.

శిష్యుడు :- మిగతా మతస్థులీవిషయమేల తెలుసుకొనలేదు.

గురువు :- అజ్ఞానులు నేను అనుదానికి ఈ పంచభూతాత్మకమైన శరీరమునే అర్థమందురు.

సామాన్యజ్ఞానులు నేను అనుదానికి ఈ జీవాత్మయుక్తమైన శరీరమందురు.

విశేషవేదాంతజ్ఞానులు నేను అనుదానికి పరమాత్మ శరీరకుడైన జీవాత్మయుక్త శరీర మందురు.

ఈ విషయగ్రహణాలో తారతమ్యము. జ్ఞానముయొక్క తరతరములననుసరించి మాత్రమే యుండును. గాని యదార్థమేమన-

పరమాత్మకు జీవుడు శరీరము. జీవునికి ఈ పంచభూతపిండము శరీరము. ఈపంచ భూతపిండమునకు జీవుడు ఆత్మ, జీవునికి పరమాత్మ ఆత్మ-

గాన వీనికి గల సంబంధమును శరీరాత్మ సంబంధమని వేదాంతులు వ్యవహరింతురు.

ఈ శరీరాత్మ సంబంధముచే అభేదమూ సత్యమే.

శరీరత్వేన-ఆత్మత్వేన-పరమాత్వత్వేన భేదమూ సత్యమే.

శిష్యుడు :- సగుణనిర్గుణ శ్రుతుల సమన్వయమెటుల ?

గురువు :- ఎట్టినేతిని మంచిదని స్వీకరింతుము ?

శిష్యుడు :- వాసనలేని నెయ్యి మంచిదందుము.

గురువు :- యిచ్చట 'వాసన' అను శబ్దమునకు అర్థమేమి ?

శిష్యుడు :- దుర్వాసన అని అర్థము.

గురువు :- లోకములో వాసన అను శబ్దమునకు 'మంచివాసన' అని కూడ అర్థమున్నదా ? లేదా ?

శిష్యుడు :- ఉన్నది కాని, సామాన్యముగా లోకములో 'వాసన' శబ్దమునకు దుర్వాసన అనియే అర్థముచెప్పచుండుట వాడుక.

గురువు :- 'వాసనలేని నెయ్యి' అనగా దుర్వాసనలేని నెయ్యి అనే గాని ఏవాసనలేని నెయ్యి అని అర్థముకాదుకదా ?

శిష్యుడు :- అసలే వాసనలేని నెయ్యి యుండనేయుండదండి.

గురువు :- ఆలాగుననే వేద-వేదాంతములో నిర్గుణుడుఅనుచోట గుణము అను శబ్దమునకు

హేయగుణములు అని అర్థము వాడుక.

శిష్యుడు :- అయితే నిర్గుణుడనగా హేయగుణములేవియు లేనివాడని అర్థమన్నమాట.

గురువు :- అవును-అసలు ఏగుణములేని వస్తువేయుండదు. కనుక సగుణుడనగా సమస్త కల్యాణగుణములుకల వాడనియు, నిర్గుణుడనగా హేయగుణము లేవియు లేనివాడనియు అర్థము. గనుక సగుణ-నిర్గుణ వాక్యములకెట్టి పరస్పర విరోధములేదు. రెండును సత్యములైనవే. ఈవిధముగానే భగవద్రామానుజాచార్యులువారు వేద-వేదాంతవాక్యముల కన్నింటికిన్నికూడ చక్కగా సమన్వయమును జేసిరి.

ఈ విషయమునే పూర్వాచార్యులు ఒకచిన్న శ్లోకములో సిద్ధాంత సంగ్రహమును చక్కగా వివరించిరి.

శ్లో॥ ఆద్యే భేదశ్రుతీనా మనృతవిషయతా లక్షణా చైక్యవాచాం।
దూరే తావత్ ప్రహాణం తదుభయఘటనా-తత్పరాణాం చ వాచాం ।
ప్రత్యక్షాది-ప్రమాణ-స్వరస-గతి-హతి స్తర్క-బాధశ్చ భూయాన్ ।
మాయావాదే తదేత న్నిఖిల మితరథా లక్ష్మణాచార్య పక్షే ॥

శిష్యుడు :- దీనికి తాత్పర్యమును సాయించగోరెద.

గురువు :- సంక్షేపముగా తెలిపెదవినుము. లోకములో తత్త్వములు మూడు,

చిత్తు=జీవుడు; అచిత్తు=ప్రకృతి; ఈశ్వరుడు=భగవంతుడు;

చిత్తు అచిత్తులను రెంటిని ఈశ్వరుడు తన శరీరములనుగా కలిగియుండి వాటికి ఆత్మయై యున్నాడు. ఆయనే స్వసంకల్పముచే జగత్తును సృజించును. ఈజగత్తుయొక్క సృష్టి-స్థితి-లయములలో కాలాదులను సహాయముగా తీసుకొనును.

లోకములో ప్రతిపదార్థమునకు మూడుకారణములున్నవి.

1. ఉపాదానకారణము. 2. సహకారికారణము. 3. నిమిత్తకారణము. ఈమూడు కారణములు పరస్పరము భిన్నములై యుండును.

గాని ఈజగత్తునకు సాలపురుగువలె పరమాత్మ ఒక్కడే ఈమూడుకారణములు అగుచున్నాడు.



# మంత్రార్ధవివరణమంజరి



(శ్రీమాన్ కోడూరి వెంకటాచార్యులుగారు, - వేటపాలెం.)

కం. శ్రీరామానుజమునివర। నాదగుచిత్తమున నిలిచి నాణెంబుగనా
తిరుమంత్రవివరణంబుల, తెలుగుల క్షేమంబుకొరకు, తెలుగున జెపుమా!

సిరికిమగండగు శ్రీమహావిష్ణు
డురుతరకారుణ్య పూరవారాశి
నిత్యముక్తులకును నియతానుభావ్యు
డాద్యంతశూన్యుడా యఖిలేశ్వరుండు
ఇజ్జగంబులలోన నిమిడిన సర్వ
చేతనవర్గంబు చిత్రంబుగాను
నేనునాదనునట్టి యినుపసంకెలల
బద్ధులై సంసార భారంబులోన
విధినిషేధంబుల వెరవులు గనక
జ్ఞానంబులేనట్టి జడములువోలె
నాదిసిద్ధంబైన హరియోగమెల్ల
మరచియు శబ్దాది నిరతులై నిద్ర
దేహాత్మభేదంబు దెలియంగలేక
ఘోరకృత్యంబుల వెరువక జేసి
పుట్టుచు చచ్చుచు పుణ్యాపాపముల
ఫలముల గుడుచుచు పరిపరివిధుల
సంసారమనునట్టి సాగరమునందు
మునుగుచు దేలుచు ముప్పిరిగాను
దరిజేరుద్రోవకు దూరులై లెస్స
చెడిపోవుచున్నట్టి చేలువలోన
నిర్హేతుకంబగు నిజకటాక్షమున
వీక్షించి తెలియంగ విద్యలనిచ్చి
విద్యలకంతులు వెలయంగలేమి
కొంతయే జదువుద మింతలోనన్న
నెరుగంగదగినది యొక్కడై యుంట
సాధ్యమైనంతలో సాగుదమన్న
కాలంబుజూడగా చాలకయుంట
ఉన్నంతలోవిద్య నొందుదమన్న
విఘ్నంబులెక్కువై వెలయుచునుంట
శాస్త్రవిజ్ఞానంబు చాలకష్టంబై
బుద్ధికిచలనంబు బొసగించుచుంట
నుపదేశమే తెల్వికున్న మార్గంబు
దీనికిదగినది తిరుమంత్రమొండే
చెప్పెదనంచును చేతనుజూచి
దరిజేరరారనా దాసుడనీవు
మంత్రంబుజెప్పెద మద్గతినొంద
నంచన్నజీవుండు నాదాసుడేను
యెంచంగదాసుండ వీవెనాకాదు
వనునట్టి యజ్ఞాన వార్ధిలోనుండ
నుపదేశములబొంద నుద్యుక్తులైన
శిష్యులులేమికి చింతలనొంది
వేరుపాయంబులు వెదకినలేక
నరుడు నారాయుడన్నామాలదాల్చి
తానెశిష్యుండును దానెయాచార్యుం
డగుచును నప్పుడెయవతారమంది
పరమపావనమైన బదరికాటవిని

తిరుమంత్రమును నుపదేశించె బ్రీతి
వీరలగనుగొనివిబుధులౌ జనులు
గురుశిష్యవర్తన ల్గురుతుగ నెరిగి
నారాయణుని వేగ నాశ్రయించుచును
మంత్రోపదేశాలమాన్యులై చనిరి
ద్వయమనబడియెడి పరమంత్రమణిని
వైకుంఠలోకాన వరలక్ష్మిదేవి
కెలమిని నుపదేశమిచ్చెనువిభుడు
శ్రీకృష్ణుడై యవతరించినయపుడు
సారథియగుచును సైన్యమధ్యమున
పార్థుకుపదేశించె పావనకృపను
చరమశ్లోకంబును పరమగోప్యంబు
లైనయీమూడును నదియాదిగాను
ఉపదేశబోధ్యతనొందిన వగుచు
గురుపరంపరలచే గుప్తంబులాయె
అజ్ఞులందరువీని నాచార్యువలన
నుపదేశమునుబొంది నుపయోగమాను
ఉపదేశహీనంబ దుపయోగిగాదు
ఆచార్యకృపముక్తి కాధారమండ్రు
ఆచార్యసేవలన తిత్తృప్తుడౌను
నారాయణుండవ్వ నాణెంబుగనుము
ఆదృతి తిరుమంత్రమునుదానివినుము
"ఓమ్‌నమో" యనిముందు నుచ్చరించుచును
"నారాయణా" నానమరునునెలమి
ఎనిమిదక్షరముల నెసగుటవలన
అష్టాక్షరియటంచు నతికీర్తిగాంచె
దీనివివరమును దెలియంగవినుము
"ఓమ్మ"నుదానిలో నుండునుమూడు
అక్షరంబులువరస స. ఉ. మ. లనంగ

"ఆ"కర్ధ మహావిష్ణు వఖిలరక్షకుడు
"ఉ"యనుదానికి "నే"యననగును
"మ"యనజీవుండు మానుగనౌను
ఫలితార్థమానిట్లు పరికించిచూడ
జీవుండువిష్ణునే శేషుండుగాని
ఇతరులకెప్పుడు నిమ్మహిగాడు
మంత్రబ్రహ్మములోన మధ్మదౌనమసు
ఓమ్మనుదానితో నొప్పుగజేరి
జీవునకెన్నడు జీవుండుగాడు
దాసుండుదప్పక దామోదరునకె
యంచాత్మశేషత్వ ముపహరించుచును
విష్ణుశేషత్వమే విశదంబుగాను
రూపుజీవునకంచు రూపించెదాను
తనతోడగూడుచు దప్పకనమసు
నారక్షణంబెన్న నాయదిగాదు
సర్వరక్షకుడగు సర్వేశ్వరుండె
రక్షకుడనుచును రక్షణాలోన
తనయత్నములనెల్ల దప్పకమాన్పి
భగవంతునకువీడు పరతంత్రుడనుచు
పారతంత్ర్యంబును పఠియింపజేసె
నారాయణాయతో నమనుదాగలసి
సర్వంబులకు శేషి శర్వేశుడైన
గరుడధ్వజునకేను కైంకర్యమెల్ల
తనకేమియును లేదు తథ్యంబటంచు
ఆత్మభోక్తృత్వంబు నావలద్రోచి
కైంకర్యరూపము స్గరుణించునిట్లు
మూడుపదములతోన మొనయుచునమసు
జీవస్వరూపంబు జీవునిగతిని

(తరువాయి 15వ పేజీలో)




గతసంచిక తరువాయి

## వస్త్రధారణ

తరువాత మంచి పరిశుభ్రమైన పొడిబట్టలను ధరించవలెను. నీవుధరించు దుస్తులు, నీవు ధరించు యితరచిహ్నములు నిరాడంబరముగను, శుభ్రముగను దుర్వాసనలేనివిగను యుండవలయును. రంగుబట్టలకంటె తెల్లనిబట్టలే మంచివి. ఈకాలపు రంగులలో మనశరీరమునకు హాని కలుగజేయు యెన్నోరసాయనిక పదార్థములు కలియుచున్నవి. వీటిని ధరించుటవలన అనేక మంది అనారోగ్యవంతులగుట యెరుగుదుము. నీవు ధరించు దుస్తులవలన నీశరీరమునకు, నీదుస్తులకుగూడ గాలి, వెలుతురులు తగులుటకు ఏమాత్రము ఆటంకముండరాదు. బట్టలను ధరించుటలో మనఆదర్శ, ఉద్దేశ్యములు యితరులకు వెల్లడియగుటకు అవకాశముండునటులను, మనదేశకాల పరిస్థితులకు, వాతావరణమునకు. మనస్వభావనడవడులకు అనుకూల మగునటులను, కొన్ని పద్ధతులు యేర్పాటుచేయబడినవి. వాట్లలో మార్పులు రానంతవరకు దుస్తులధరించుటలోకూడ మార్పులుచేయ నవసరములేదు.

మనశరీరములో అనేక ప్రాణశక్తులున్నవని తెలుసుకొంటిమికదా వాటిని ఆకర్షించుశక్తి భూమికి గలదు. మన శరీరములో సంపర్కము గల ప్రతిదానిద్వారా భూమి ఈ మనశక్తులను ఆకర్షించ సర్వదా ప్రయత్నించుచుండును.

అందుచే గోళ్ళు పెంచుకొనరాదనియు, జుట్టు ముడివేయకుండ విరియబోసుకొని యుంచరాదనియు, వేళ్ళతో నేలమీద వ్రాయరాదనియు పెద్దలందురు. మనము ధరించు దుస్తుల ద్వారా మనప్రాణశక్తులు భూమిచే ఆకర్షించుటకు హెచ్చు అవకాశము లున్నవి. గాన మనము చాలా జాగ్రత్తగా మనదుస్తులను ధరించుచుండవలయును. బట్టలయొక్క కొసలను భూమివైపునకు జారవిడువరాదు. జారుగోచీల పెట్టరాదు. స్త్రీలు గూడకట్టు కట్టుటకంటె గోచీపోసి కట్టుకొనుటే మంచిది.

ప్రతిపురుషుడున్నూ వయోభేదములేకుండగ ఎల్లప్పుడు కౌన (గోచీ) ధరించుచుండుట అలవాటుచేసుకొనవలెను. యిందువలన ఎంతో ఉపయోగము ఆరోగ్యము కలదు. నీవు పెద్ద అయిన తరువాత దీనియదార్థమును ఉద్దేశ్యమును

పూర్తిగా గ్రహించకలుగుదువు.

కట్టివిడిచిన బట్టను ఉతికి ఆరవేయకుండగ ఎప్పుడును కట్టరాదు. బట్టలను కనీసముకూడ పర్యాయముతైనను ఉసముకుండగ ఆరవేయరాదు.

తిలకధారణము

తరువాత నీ ముఖమునందు బొట్టును పెట్టుకొనవలెను. ప్రతీవారుకూడ తమ తమరుచికి అనుకూలమయిన బొట్టును తప్పక ముఖమున ధరించవలయును. బొట్టులేని ముఖము అసుభసూచకము. బొట్టువలన ముఖమునకు అందము, ఆరోగ్యము, ఆకర్షణలు కలుగుటేకాక నీఆధ్యాత్మికాభిప్రాయములుకూడ యితరులకు సులభముగ అర్థముకాగలవు. నీవు నీ ముఖమునందు బొట్టును ధరించియుండుటవలన యితరులయొక్క మానసికశక్తిచే నీవు త్వరలో ఆకర్షింపబడి లొంగిపోజాలవు. బొట్టు పెట్టుకొననివారిపై మెస్మరిజం, హిప్నోటిజం మొదలయిన మానసికశక్తులు ప్రసరించునట్లు బొట్టుధరించినవారిమీద ప్రసరించజాలవు. బొట్టుకు నామమని మరొకపేరున్నది. నామమనగా మనయొక్క స్వరూపమును తెలుపుచిహ్నము. ఇది ప్రతిదినము మన స్వరూపమును స్మరింపజేయునన్నమాట. స్వస్వరూపజ్ఞానములేని మానవుడు సర్వదా వ్యర్థుడు కదా. యింతేగాక బొట్టుపెట్టుకొనుటలో ఎన్నియో ప్రయోజనము లున్నవి. వాటిని తరువాత విశదీకరించి తెల్పెదను.

స్నానానంతరము, దేహమును బాగుగ తుడుచుకొనకుండగ గాని, జుట్టుయున్నచో ముడివేసుకొనకుండగ గాని, తడిబట్టలతో గాని, ముఖమున బొట్టు ధరించకుండగ గాని ఏపనిని చేయరాదు.

స్నానాంతరమున ఆహారమేమియు తీసుకొనకుండగ ప్రతివ్యక్తియు తమ తమ మతసాంప్రదాయానుసారముగ దైవప్రార్థన చేయవలెను. నీకు ఉపనయనము అయిన తరువాత సంధ్యావందనముచేసుకొని తిరువారాధనయు (భగవదారాధన) పారాయణము చేయవలయును. శ్రీభగవద్గీతను, ప్రతిదినము కొన్ని శ్లోకముల వరస్తైనను అర్థయుక్తముగ పారాయణచేయుచుండుము ఉపనయనసంస్కారములు లేనివారు, ఆడవారు కూడ, తమకిష్టమైన భగవంతుని సంబంధమైన సద్గ్రంథమును పారాయణనుగాని, గురుదైవధ్యానము పూజనుగాని నియమముగ చేయుచుండవలయును, శ్రీరామాయణపారాయణకూడ చాల మంచిది.

ఇవి చేయునపుడు కర్రతో చేసిన పీటనుగాని, పొడిబట్టనుగాని, దర్భాసనమును గాని, నేలమీద పరచి దానిపై కూర్చుండవలయును. ఇంకా అవకాశమున్నవారలు చిత్రాసనము, కృష్ణాజినము మొదలయిన వాటిని గూడ ఉపయోగించుచుందురు. కాని వట్టినేలమీద మాత్రము కూర్చొని పైవాటిని చేయరాదు. అలాచేసినచో ఆత్మశక్తిని భూమి ఆకర్షించివేయును.

యింతటితో నీప్రాతఃకాల నియమిత కృత్యములు పూర్తియైన వనవచ్చును. ఈ పైని తెలిపిన పనులన్నియు ఉదయమున అయిదుగంటలు

లగాయితు ఉదయం 6-30 గంటలకు పరిపూర్తి కాగలవు. అవకాశమున్న వారు తెల్లవారు ఝామున ఇంకొకగంటగాని అరగంటగాని ముందుగనే నిద్రనుండి లేవకలిగినచో యింత కంటెను హెచ్చు సావకాశముగ చేసుకొన వచ్చును. ఉదయము గం 6½ లగాయితు రాత్రి గం 9 వరకు విద్యాభ్యాసమునకున్ను, సన్వ్యాపారములకున్ను, భోజనాదికములకున్ను వినియోగించవలెను.

ఈ ప్రసంగమున తెలుసుకొనవలసిన వాటిలో ముఖ్యమయినది ఆహారస్వీకారమొకటి. ధర్మసాధనకై దయామయుడగు భగవంతునిచే మనకీ శరీర మివ్వబడినది. ఆహారాదులచే ఈ శరీరముపోషింప బడుచున్నది. ఏక్షణమున ఆహార విహారాదులలో లోపముకలుగునో అప్పటి నుండియు ఈ శరీరముబలహీనమై క్షీణించ ప్రారంభించును. బలహీనమై క్షీణించిన దేహము ఇహపరసాధనముల కెందుకును పనికిరాక తనకూ యితరులకుగూడ బరువై బాధాకరమై యుండును. కాన శరీరపోషణవిషయమై మనము అత్యంతజాగరూకులమై యుండవలయును. సర్వవ్యాపియయిన సర్వేశ్వరుడు ఆత్మస్వరూపుడై మనశరీరములందు నివసించుచున్నాడు. కాన భగవంతునికి మన శరీరము నివసించు ఇల్లువంటిది. కనుకనే మనశరీరములను మనము అత్యంత జాగ్రత్తగాను, పరిశుభ్రముగాను, కాపాడు చుండవలెను. "బ్రతకడానికై తినడముగాని తినుటకై బ్రతకడంలేదు." అనే ముఖ్యవిషయాన్ని ఎన్నటికి మరచిపోకూడదు. రాజ్యముల జయించినవాడువీరుడే. గాని తన ఇంద్రియములు జయించినవాడు బ్రహ్మాండములను జయించిన మహావీరుడనతగును. మనస్సు స్వాధీనపడిన గాని యింద్రియజయము సాధ్యముకాదు. మనోజయము జిహ్వేంద్రియస్వాధీనముపై ఆధారపడి యున్నది. కనుక నేను మానవుడను," అను కొను ప్రతివాడుముందు జిహ్వేంద్రియవిషయమై అతిజాగ్రత్త పడవలెను. రుచులకు ఎంత మాత్రము స్వాధీనుడుగాక మితము తప్పి ఎన్నడూ భుజింపకుము. మన పొట్టకు సగము వరకు ఘనపదార్థములను ఒకవంతు మంచినీరును భుజించి మిగత నాలుగవవంతును గాలికై ఖాళీగా యుంచవలయును.

మనముతిను ఆహారపదార్థములనుబట్టియే మన దేహమందలి సత్త్వ రాజస తామస గుణములు వృద్ధిక్షయములుండును. మనకు కావలసినది సత్త్వగుణము మాత్రమే. గాన దానిని అభివృద్ధి పరచు ఆహారమును మాత్రమే మనము భుజించు చుండవలయును. సత్త్వగుణాభివృద్ధి కలవారే సజ్జనులు. సజ్జనుడవుకాగోరు నీవుకూడ సాత్వి ప్రధానమైన ఆహారమునే భుజించుచుండవలెను.

సాత్వికాహారము; పుచ్చుకొనతగినవి.

అరటి, కాకరు, పొట్ల, చిక్కుడు, దోస, వంకాయ, ఆకాకర, బూడిదగుమ్మడి, చిసతిస్త్రి, కంద, చామ, పెండలము, ఎర్రచిలగడదుంప, అవిసికూర, పొన్నగంటికూర, చక్రవర్తికూర; పెరుగుతోటకూర; మట్టుబచ్చలి; జీలకర్ర, మిరియాలు, ఆవాలు, సొంఠి, అల్లం, ధనియాలు,

మెంతులు, కొత్తిమీర, కరివేప, తెల్లయింగువ, ఉప్పు, సైంధవలవణము, కొద్దిచింతపండు, కొద్దిమిరపకాయ, బెల్లము, పటికబెల్లము, కంది, పెసర, మినుము, శెనగ, గోధుమ, వరిబియ్యం, జొన్న, చోళ్ళు, నిమ్మ, మామిడి, జామ, వెలగ, ఉసిరి, అరటి; ద్రాక్ష, కిసిమిసి, ఖర్జూర, పనస, అనాస, దానిమ్మ, పెద్దరేగు, నారింజ, బత్తాయి, కొబ్బరి, బాదం, జీడిపప్పు, చారపప్పు, యాలుక, లవంగము, దాల్చినచెక్క; ఆవుపాలు, పెరుగు, మజ్జిగ, వెన్న నెయ్యి.

పై వాటిని నిర్మలమైన మనస్సుతోను, సంతోషముతోను, కూర్చునిసావకాశముగ నములుచుమౌనముగా తినవలెను. మనస్సునఅతివిచారము, భయము, కలిగినపుడు భోజనముచేసినచో అది శరీరమునకు ఉపద్రవము కలిగించు విషపదార్థములుగమారును. అసంతుష్టితో భోజనము చేయుటవలన అజీర్ణము, మలబద్ధకములు కలుగును. హడావిడిగా భోజనము చేయుటవలన ఆహారము జీర్ణముగాక, నిస్సత్తువను కలుగజేయును, అజీర్ణమే అన్నిరోగములకు తల్లి గనుక నిమ్మళముగా, బాగుగా నములుచు తినవలెను. మరియు ఈఆహారమువలన మన దేహమునకు బలము వచ్చుచున్నది అని మనస్సులో భావించుకొనుచుండవలెను. భోజనము చేయునపుడు కావలసిన పదార్థములను అడుగుటను, అక్కరలేని పదార్థముల వద్దనుటకుతప్ప మరితర ప్రసంగముల చేయరాదు. ముచ్చట లాడుచుండిన, చేయుపనిమీద మనస్సుండదు. మనస్సుండకపోయినచో ఆహారమునుండి మనము గ్రహించవలసినంత ప్రాణశక్తిని గ్రహింపజాలము. ప్రాణశక్తి గ్రహణలేని భోజనము వ్యర్థము, అనర్థము. ఏపదార్థమునైనను సగము చేతపట్టుకొని సగము దంతములతో కొరకికొనుచు తినుట చెడ్డఅలవాటు. భోజనము చేయునపుడుకూడ పీటమీద సిద్ధాసనము (బాసిపట్టు) గ కూర్చొనియే ఉండవలెను. వట్టినేలమీద కూర్చొనుట వలన భూమి ప్రాణశక్తిని ఆకర్షించును. అందుకనే ఎడమచేతిని పోటిగుంజవలె భూమిమీద ఆనరాదని పెద్దలందురు. ఎందువలన కూడ మన ప్రాణశక్తి ఆకర్షించబడును.

సిద్ధాసనముగ కూర్చొనుటవలన ప్రేగులు ఆంత్రములు, కాలేయము, అవి తమ తమ పనులను అనుకూలముగ నెరవేర్చుటకు కావలసిన సరియైన స్థితిలోయుండి మనము తిను ఆహారమును సరిగా జీర్ణింపజేయుటకున్ను, అందునుండి పూర్తి ప్రాణశక్తిని గ్రహించుటకున్ను. సమర్థములై యుండును. ఎడమచేతితో ఏపదార్థములను నోటిలో నుంచుకొనరాదు. నీవెంత శుభ్రపరచినను, నీకు కనుపించని సూక్ష్మములు ఎడమ చేతియందు సదాయుండును. ఆసూక్ష్మపదార్థములు శరీరమును ప్రవేశించుటవలన ఆరోగ్యమునకు చాలా భంగముకలుగును.

భోజనపదార్థములను దేనిని కూడ వ్యర్థముగ పారవేయరాదు. ఆహారము లేక అలమటించు దరిద్రసోదరులెంతమందో మన దేశములో నున్నారు. ముదట ఉంచుకొనునపుడే నీకెంత అవసరముండునో ఊహించి వడ్డించుకొనుము. ప్రతినిత్యము జరుగుపనియే యగుటవలన ఈ

విషయమై సరిగా ఊహించుకొనుట కష్టమెంత మాత్రము కాదు. నీవు ఎంగిలిచేసిన ఏవస్తువులు యితరులెవరికిన్ని పెట్టకుము. ఇది చాలా పాప హేతువు. రోగవ్యాప్తికి కారణము; భోజనము చేయునపుడు నీచేతినుండిగాని, నీవిస్తరాకునుండి గాని ఏపదార్థము నీప్రక్కవారి విస్తరివరకు పోకుండునటుల జాగ్రత్తగ యుండవలెను. భోజనము చేయునపుడు ఉమ్మివేయకూడదు. ఏదైనా నోటిలోనిది తీసివేయవలసినయెడల చేతితో తీసి ఆకుప్రక్కనుంచుము. ఆకుముందర ఛిఱ్ఱుమని-చీదుటగాని, ఉమ్మివేయుటగాని చేయకూడదు. తుమ్ము, దగ్గు, వచ్చినచో నోటికి చేయిగాని గుడ్డగాని అడ్డముంచుకొని యితరులెవరికి వాటి స్పర్శలేకుండునటుల చేయుము. వడ్డించునపుడు వడ్డించువారికి తగులునటుల నీచేతి నడ్డము పెట్టకుము.

వడ్డించువారికి వీలైనంతవరకు శ్రమకలుగకుండునటుల జాగ్రత్తపడవలెను. మిగిలిన వారందఱూ భోజనమునకు వచ్చిన వేళకే నీవు గూడ భోజనమునకు రావలెను. అట్లురాక వారికి ముందుగగాని, లేక వెనుక వచ్చినగాని అందరకు వడ్డించబడు పదార్థమును ఆసమయమునందే నీవు కూడా వడ్డించుకొనక తిర్గి మరొక మారు ప్రత్యేకముగ నీకై ఆపదార్థమునే తీసుకొని వచ్చునటుల చేయకూడదు. అందఱికి వడ్డించదగు పదార్థమును వారికింటె ముందుగ నీవు వడ్డించుకొని మిగిలినవారికై మరొక పర్యాయము తిరుగునటుల చేయకూడదు, అందువలన వడ్డించువారికి చాలాశ్రమకలుగును. అందరునూ భోజనమింకను చేయుచుండగా ముందుగా నొక్కరు లేచిపోరాదు. అందరి భోజనములు ఐనవరకు యుండవలెను. పనియుండి ముందుగ పోవలసియుండినచో తక్కినవారి అనుమతిని తీసుకొని పోవలయును భోజనప్రారంభమందు కూడ పంక్తిలోని అందఱితోను సమాన కాలమందే భోజనము చేయుట ప్రారంభించవలెను. గాని అందఱికంటె ముందు తానే తినుట ప్రారంభించరాదు.

భోజనానంతరమందు కొద్దిగా మంచినీటిని త్రాగుము. యిందువలన నీవు తినిన ఆహారము బాగుగా జీర్ణమగును. భోజనమునకు ముందు నీరు త్రాగరాదు. భోజనముచేయుచు మధ్యయందు నీరు త్రాగుట చాలామంచిది. బలకరము జీర్ణకారి. మనకీఆహారపదార్థము భగవంతునిచే ఈయబడినది. ఈయన చేతనే దీనియందలిసారము మన దేహమునకు సంక్రమింప చేయబడుచున్నది. గాన తత్కృతజ్ఞతా సూచకముగా మనము తినబోవు ప్రతి పదార్థమును ముందుగ భగవంతుని నివేదన చేయవలయును. యింటిలో వేరేగా దేవతార్చన ఉన్నను లేకున్నను దేవుని స్మరించి నీ యాకులో బెట్టిన యన్నమును ఆయనకు మనస్సులోనే నివేదనమును చేయుచుండవలెను. ఇట్లు కృతజ్ఞతా సూచకమైన భగవత్ స్మరణ భగవత్ నిర్మాల్యమును తినే వేదనముల వలన మనకెంతో మంచి కలుగును. ఈ విషయమై ఎప్పుడూ మరువకుము. నీకు ఎవరైనా ఏ పదార్థము నైన యిచ్చిన అచ్చట యున్న నలుగురికి పెట్టకుండ తినరాదు.

ఎవరైన నిన్ను భోజనమునకు బిలిచిరా వారి వేళకు సరిగా వెళ్ళుము. అటుల వెళ్ళుటకు వీలు లేనిచో రాలేనని ముందే తెలిపివేయుము. అంతే కాని నీకై వారు పలుమార్లు తిరుగునట్టుగా చేయుట నీచపుపని. పగటిపూట భోజనమునకు పిలిచిరా నీవైరాత్రికి వచ్చెదనని చెప్పకుము ఒకవేళ వారు ఒక పూటకు మాత్రమే యత్నించిన యెడల నీకై వారు రాత్రికి వేరు ప్రయత్నము చేయవలసివచ్చును. ఆహారమే ప్రాణము నిలబెట్టునది. హారమే ప్రాణమును హరించునది కూడను. గనుక దేశకాల పాత్రల ననుసరించి యుక్తా యుక్త వివేకివై ఆహారము స్వీకరించుచుండవలెను. ఆరోగ్యము ననుసరించి అప్పుడప్పుడు ఉపవాసము చేయుట మంచిది. ఇందువలన శరీరారోగ్యాభివృద్ధియు ఆధ్యాత్మికాభివృద్ధియు కూడ కల్గుచుండును. మంచి ఆరోగ్యవంతులు ప్రతి పదునైదు దినముల కొకపర్యాయముచొప్పున ఉపవసించుచుండుట చాలమేలు మిక్కిలి అవసరము. ఇట్లు ఉపవాసములో యెన్నో నిగూఢమైన మంచివిషయంబులున్నవి. బాగుగా ఆకలివేసినప్పుడు భుజించుట, దాహము వేసినప్పుడు వాసన, రుచి, రంగులేని మంచి శుభ్రమైన నీరుత్రాగుటయు చాల అవసరము. మంచినీటిని ఎప్పుడును వడబోసుకొనే త్రాగుచుండవలెను. త్రాగుటకు ముందుగ చెంబులో ఒకపర్యాయము బాగుగా చూచుకొని త్రాగవలెను. ఒక్కొక్కప్పుడు ఏదైన పుల్లలుగాని, పురుగులుగాని చెంబులో యుండుట తటస్థించినచో వాటినిత్రాగుటవలన శరీరమునకు ప్రమాదము సంభవించును. చెంబును నోటికితగిలించుచు ఎంగిలిచేసి మంచినీరు త్రాగుట చాల దురభ్యాసము. చెంబును నోటికి కొంచెము దూరములో యుంచుకొని ఎత్తిపెట్టుకొని త్రాగవలెను. నిలుచుండిగాని పరుండిగాని ఎన్నడును మంచినీటిని త్రాగకూడదు. ఇందువలన ఆనీరు శరీరములో సరిగా జీర్ణకోశములోనికి చేరుటకు అప్పుడప్పుడాటంకము కలుగును. అందువలన చాలప్రమాదములు సంభవించును గనుక కూర్చుని మాత్రమే మంచినీళ్ళు త్రాగుచుండవలెను.

అవసరమునుమించి ఎన్నడునూ అధికముగ నీటిని త్రాగకూడదు. ఇందువలన శరీరబలము పుష్టి తగ్గిపోవును. అతివేడినీటినిగాని చల్లనీటినిగాని త్రాగకూడదు. ఇందువలన దంతములకు, నేత్రములకు హాని కలుగును. జీర్ణశక్తి చెడిపోవును. దాహమువేసినపుడు మంచినీటినే త్రాగవలయునుగాని యితరయేపానీయములను త్రాగకూడదు. దాహమును అణచుకొనుటవలన చాల అపాయము కలుగును. అనేకరోగములకు అది కారణమగును.

విద్యార్థిదశలో తాంబూలము వేయకూడదు. వట్టిచెక్కలు అసలే నమలకూడదు.

కావలసినచో రోజునకొకటి రెండుమాత్రము లవంగములుగాని ఏలక్కాయలుగాని వేసికొనవచ్చును. ఆరోగ్యముగానుండునపుడు పగటినిద్ర ఎన్నడునూ కూడదు. దీనివలన పొరుపెరుగుట, అజీర్తి, బద్ధకము, శరీరమున కొవ్వు అభివృద్ధి చెందుట మొదలగునవి సంభవించును.

(తరువాయి మరుసటి సంచికలో)

(8 వ పేజీ తరువాయి)

చేతనుగమ్యంబు శిక్షించెబాగ
నారాయణాయ యన్నామవాచకము
నిత్యంబులకునెల్ల నియతంబుగాను
ఆదికాలంబంచిప నాధారుడగుచు
విశ్వంబుగా నవి వికృతినిజెంద
నన్నింటిలో దాను వ్యాపించియుండి
అంతర్బహిర్వ్యాప్త మలరినవాడై
పరుడుసులభుండగు పరమేశుకొరకె
చేతనవర్గంబు శేషంబుగాని
ఇతరుల కేరికి నెన్నండుగాదు
సత్యంబటంచును సరసంబుగాను
తెలిపెజీవులకెల్ల దెల్లంబుగాను
తిరుమంత్రిమిట్టుల దెలసినమీద
ద్వయమనుదానిని వరలంగవినుము
ద్వయమన రెండగుధరలోనలెక్క
రెండుభాగాలచేరెక్కనుచుంట
నీపేరుగలిగెను నిలలోనబాగ
"శ్రీమద" టంచన్నచెంగటనెలమి
"నారాయణ" యటన్న నామంబుజేర్చి
సరసన "చరణౌ. శరణంప్రపద్యే"
యంచుబల్కినభాగమాయెతొల్తటిది
రెండవదానినెరింగింతువినుము
"శ్రీమతే" యనుచును జెప్పినమీద
"నారాయణాయ" యన్పదమునుగూర్చి
"నమ" యనుదానిని నమరంగజేయ
పూర్తియాయెను కీర్తిగాను
మొత్తంబుగానిదిముక్తికిత్రోవ
భాగాలరెంటిలో పదములాంట
బరగుచునిదితెల్పు పదియర్థములను
వరుసతోవానిని బాగుగవినుము
శ్రీయనుశబ్దంబెప్పను నిట్లు
శ్రీదేవిజీవుండుజేయుదోషముల
తీరిచిపరమాత్మతిరువడిజేర్చు
మత్పదంబెప్పుడుమాధవునిడక
పురుషకారంబును బూనరించుననుస
నారాయణయటన్ననామంబుదాను
దాసరక్షకములుదామోదరునకు
వాత్సల్యసౌశీల్యస్వామిత్వములును
సౌలభ్యజ్ఞానముల్ శక్తితోగూడి
ప్రాప్తిపూర్తులటంచుబ్రధితంబులైన
గుణములుగలవంచు గురుతెరింగించు
చరణౌయటంచన్న శబ్దంబుదాను
దాసరక్షణములదప్పక జేయు
శంఖచక్రంబుల శార్జంబు తోడ
విడువకదాల్చిన విగ్రహంబొందు
దివ్యమంగళమాచు దీప్యమానంబు
గలదంచు దెల్పును గమలేక్షణునకు
శరణం బటంచన్న శబ్దమయ్యదియు
ఇష్టప్రాప్తియు ననిష్ట వారణము
చిన్మయు పదములె చేయునవగుట
ప్రాప్యమాతడెజూడ ప్రాపకమతడె.
పొమ్మంచుదెల్పును భోగ్యంబుగాను
త్రికరణంబులశుద్ధి తీరుగవిభుని
శ్రీపాదసేవల జేయుజెజీవు
పనియనిదెల్పు ప్రపద్యేయటన్న
పదమిట్టికైంకర్య మదియెల్లజూడ
శ్రీదేవితోనున్న శ్రీహరికంచు

శ్రీమతేయనునది జెప్పునుబాగ
నారాయణయటన్న నామమయ్యదియు
సర్వంబులకు స్వామి సర్వాధికుండు
చేతనాచేతన వ్రాతంబుకెల్ల
పతి పరాత్పరుడై సూ పరమాశ్రయంబు
వేరొక్కరును లేరు వెదకిన నను
సర్వకాలంబుల సర్వలోకేశ
నీ కొరకే వాని నిర్మలంబుగను
కైంకర్యముల జేయ కరుణింపుమనుచు
నాజ్ఞ నర్థించుట "నాయ"యు దెల్పు
నమయను పదమది నాణెంబుగాను
ఆది శత్రువులైన నా యహంకార
మమకారముల నెల్ల మానుట దెల్పు
నీపదియర్థాల నెరుగుచు మదిని
ద్వయచింతనము జేయుదాసుల కెల్ల
మోక్షసామ్రాజ్యంబు ముమ్మాటికగును
శ్రీదేవికరుణను. శ్రీహరికృపను
ద్వయమును దెల్పితి దాసుడవినుము
చరమశ్లోకంబును కరమనురక్తి
నన్ను బొందంగను మును జెప్పినట్టి
ధర్మంబులందు సాధనబుద్ధివీడి
హరియాజ్ఞయంచును నాచరించుచును
కర్మఫలంబుల కాశింపకెపుడు

సర్వేశు కైంకర్య సరణినిలచి
పరమాత్మయే ప్రాప్య ప్రాపకములనుచు
నమ్మికతో సుత నార్తుడవగుచు
భక్షణరక్షణ భారంబులెల్ల
నాయందుబడవైచి నీయత్నములను
వీడుచు పాదముల్ విడువకయున్న
సర్వేశ్వరుండను సర్వరక్షకుడ
సర్వశక్తుడను సర్వవిజ్ఞాని
నైనట్టినేను నీయఘములనెల్ల
దొలగించినను జేర్తు దుఃఖమొందకుమ
అనిబల్కనర్జునక పగతతముడై
హరిపదంబులబట్టి పరమార్తితోడ
స్వప్రయత్నంబుల సర్వంబువీడి
పరమప్రసన్నుడై బంధముల్వ్రాలగ
చేతనులారయా శ్రీహరికరుణ

జ్ఞానులై మానుల మానసవాసి
శ్రీహరిపదముల జేరి కైంకర్య
పూర్ణులై గోష్ఠుల పురుషోత్తమునితో
సారూప్యతనుగని సంతుష్టిగొనుడు
సర్వకాలంబుల సర్వలోకముల
శ్రీశ్రీనివాసుల శ్రీకటాక్షములు
కైకర్యసంపదల్ గలుగుత శ్రీ శ్రీః



# వైష్ణవ పరమార్ధిక విశ్వవిద్యాలయం
## బృందావనం : మధుర
## *Vaishnava Theological University : Brindavan* (MATHURA)

అఖిలభారత వైష్ణవ సాంప్రదాయ కేంద్రముగ, ఇట్టి విద్యాలయము స్థాపించబడినదనియు ఇందు జరుపబడు కృషిని గురించి నిబంధన మున్నగు వివరములు వెనుకటి సంచికలో సూచింపబడి యుండెను. 29-7-1949 ఉత్తర ప్రదేశ (U. P.) విద్యామంత్రి డా॥ సంపూర్ణానందుగారిచే ప్రారంభోత్సవము గావించబడిన వైష్ణవ తద్యానుశీలనగృహము (Theological Research Institute) కార్యక్రమానుసారము పనిచేయుచున్నది. ఉత్తరప్రదేశ రాష్ట్రమువారు సానుభూతితో ఛాత్రవృత్తియును (Scholarship) ఉపకారవేతనము నీయనిశ్చయించిరి. (Research Work) తథ్యానుశీలనపరిశ్రమలో వివిధప్రాంతములనుండిపాల్గొనుచున్న విద్యార్థికులు సహాయము నొందుచున్నారు. ఇందు పరమార్ధిక పట్టభద్రులగుటకు D. Litt, D. Phil మున్నగు స్థాయిలందు తీవ్రకృషి జరుగుచున్నది. "న్యాయసుధ పఠనము" "శ్రీచైతన్యతత్వబోధ" "బృందావన చరిత్ర" "దేశాంతరవైష్ణవప్రబోధ" "శ్రీ నరశింగమెహాత తత్వశిక్ష" "ఆధ్యాత్మిక రహస్య ఉద్ఘాటన" మున్నగు విషయము లిందుల కుదాహరణముగ నున్నవి.

Senate House కార్యాలయభవనము ప్రధమాంతస్సుపూర్తియై 28-2-1950 ప్రధానమంత్రి శ్రీగోవిందవల్లభపంతుగారి నియామక పురస్సరముగ గృహప్రవేశము జరిగింపబడినది. ఇందుపై రెండవ అంతస్తు నిర్మింపబడుచున్నది. ఇందులకు కూచిబిహారుమహారాజా భూపు బహద్దరువారు విరాళమిచ్చియుండిరి. విశ్వవిద్యాలయ భాండాగారమున నిప్పటివరకు రు 45000/- కిమ్మతుగల అమూల్యగ్రంధరాజములు సేకరించ బడినవి. శ్రీరణవీర భాగవత పాఠశాల (High School) కళాశాలానుబంధముగ పనిచేయుటకు శంఖుస్థాపన జరిగినది. ఇందులకగు వ్యయము రు 125000లు శ్రీజం ప్రకాశఅను ఢిల్లివాస్తవ్యుడు భరించును. ఇందుపాఠకులును ఉపాధ్యాయులును నివశించి విద్యనభ్యసింతురు. మతముగురించియు నైతికముగను నిందు అపూర్వమగు క్రమశిక్ష యొసగబడును.

శ్రీమహేంతురస విహారదాసుజీ మహారాజు of మలసారు (గుజరాతు) సాంప్రదాయ పూర్వకముగ చైతన్య కళాశాలను శంఖుస్థాపన జరిగించియుండిరి. శ్రీత్రిపుర (త్రివిష్టప) మహారాణీవారివల్ల నీపనిపూర్తి కావింపనైయున్నది.

శ్రీ నింబార్క పీఠాధీశులు శ్రీరాధాసర్వేశ్వర శరణదాసు జీదేవాచార్య (సలీమాబాదు)

వారు నింబార్క కళాశాలా స్థాపనను పూను కొనియుండిరి. శ్రీఆచార్యపాదులువారి శిష్యులలో నొక భక్తాగ్రేసరులే పనిపూర్తి గావించ నున్నారని నుడివియుండిరి.

సరస్వతీ పుస్తకాలయమునందును తద్ధ్యాను శీలన గృహమందును ఉపనిషదాది గ్రంథములు వేదాంతభాష్యములు రామానుజ మాధ్వ చైతన్య సాంప్రదాయక వాఙ్మయమును శ్రీమద్రామాయణ భాగవత భారతాది అఖిల పురాణేతిహాస గ్రంథములును వివిధప్రాకృతీ పరిష్కృతములును మతాంతర పఠనీయములును గూడ పెక్కులుగలవు. ఇందులకు శ్రీఅతీంద్రియ బెనర్జి విద్యావాచస్పతి of Calcutta శ్రీ S. C. Roy M. A I. E. S, Ex D. P. I. of Assam శ్రీకృష్ణచైతన్యదాసు బాబాజీ M. A. మున్నగు వారలు తోడ్పడియుండిరి. బేరిఘుల్లీ వాస్తవ్యుడు ఒక లక్షరూపాయలు సరస్వతీ భాండాగారమునకు వాగ్దానము చేశియుండిరి.

విశ్వవిద్యాలయస్థాపక నిర్ణయాను సారము ప్రతివైష్ణవ సాంప్రదాయమును గురించియు నొక కళాశాల నిర్మాణము బృందావన పరిసరమున నెలకొల్పుట ప్రథమకర్తవ్యము. శ్రీరామానుజ కళాశాలా భవనము గురించి విశ్వవిద్యాలయ ఆవరణమునందు ప్రముఖస్థాన మీయబడినది చైతన్యమార్గమునుండి భాగవత పాఠశాలకు నియమించిన క్షేత్రమునందే శ్రీరామానుజ కళాశాలయు నియమించబడియున్నది. శ్రీవైష్ణవ సాంప్రదాయములన్నిటిలోను కూటమై మార్గదర్శిగ ప్రథమస్థానమలంకరింపవలసిన యతిరాజ దర్శన భవనము నిర్మించుటలో పాటుబడుట శ్రీరామానుజీయ మతస్థులందరి సుకర్తవ్యమైనది. శ్రీఅహోబిలు శ్రీవానమామలు, శ్రీకంచి శ్రీతిరుపతి మున్నగు అష్టజీయరుస్వామి శిష్యులును వీరి శిష్యబృందమువారును మథుర బృందావన మాదుపక్రమించబడిన అఖిలభారతీయ వైష్ణవ సాంప్రదాయ విశ్వవిద్యాలయ సంస్థలన్నిటికి సహాయము గలుగులాగున శ్రీరామానుజ కళాశాల స్థాపనకు వలయు నార్థికసంపత్తియు నుత్సాహపూర్వక కార్యదీక్షయు నవలంబింతురని విశ్వసించవగును.

కాకినాడ.
9-7-50

M. V. V. K. Rangachary, Member of the Syndicate, V. T. University Brindavan (U. P)

షరా:- ఇందునుగురించి ఇతరవివరములు శ్రీస్వామిభక్తి హృదయభాను మహారాజుగారు Founder President, V. T. University Senate House, Brindavan వారికివ్రాసిన తెలియుగలరు.



# శ్రీ జటాయు మహారాజు వైభవము



శ్రీమాన్ శ్రీమత్తిరుమలై నల్లాన్ చక్రవర్తి సంపత్కుమార
జగన్నాథ తిరువేంకటాచార్యులవారు.

గోవిందరాజుల పేట, * విజయవాడ.

లోకములో మానవులు బుభుక్షువులు, ముముక్షువులు, నని రెండు తెగలు. బుభుక్షువు లన్నియు గావలెననువారు, ముముక్షువు లేవియు నక్కరలేదనువారు. వేదములోని పూర్వభాగము బుభుక్షువుల కాధారము. ఉత్తరభాగము ముముక్షువుల కాధారము. బుభుక్షులోకమున షోడశ మహారాజులు కీర్తింపబడిరి. వారందరు "అహింసా సత్య మస్తేయం దాన మింద్రియ నిగ్రహః" అను నిత్యాది సామాన్య గుణములు గలిగి సామాన్య ధర్మానుష్ఠానపరులై యుండువారు, ముముక్షువులలో కేవలులు, భగవదనుభవపరులు, నని రెండు తెగలు, అందులో కేవలులు గూడ పైషోడశ మహారాజులనే కీర్తించినట్లున్నది. ఇక భగవదనుభవపరులనగా వారే "ముముక్షువు క్కారియ వేండుమ్" అను చోట చేర్కొనబడినవారూ వీరు రహస్యత్రియజ్ఞానాపేక్షగలవారు. ఏలననగా కేవలులు వేదోత్తరభాగము నాధారముగ గొనినను స్థూలార్థగ్రాహులు మాత్రమే, వీరు వారి వంటివారుగాక సారాంశమును గ్రహించినవారు. అది రహస్యత్రయ మందిమిడి యున్నది. దీనిని భగవద్విషయాది గ్రంథములు వివరించినవి. అందువలన వానినే ప్రధానగ్రంథములుగా నాశ్రయించిరి. ఈ గ్రంథసాంప్రదాయమున జటాయువు మహారాజుగ చేర్కొనబడియెను. ఈయన పై షోడశమహారాజులలో చేరలేదు. ఈ వర్గము వేరు. ఆ వర్గము వేరు. ఈ వర్గము విశేషలక్షణములకు సంబంధించినది. కనుకనే యీసాంప్రదాయమున వ్యవహారము కల్గినది. ఇతనికి గలిగిన విశేషలక్షణ మేమనిన మంగళాశాసన పరత్వమే. ఈ జటాయువునకు శ్రీరామునితో సంబంధించిన చరిత్రమంతటను విమర్శించిన నితని కెట్టి కోరికయు నున్నట్లు గనుపడలేదు. ఇక మంగళశాసనపరత్వమే మిగిలినది. భగవంతు డవాప్తసమస్తకాముడు. వీరనపేక్షిత సమస్తకాములు. కావున నతనికన్నమిన్న యన దగును. శ్లో॥ తృణీకృత విరించాది నిరంకుశ

విభూతయః॥" అని చెప్పబడినవారు. 'నిరాశ్రియా నశోభంతే పండితా వనితా లతాః' అని గదా? యిక వీరనపేక్షిత సమస్తకాములైన వీరి కాశ్రియమేది? అనిన భగవదాశ్రియమే యాశ్రియము. అది గలవారు గావుననే దానికి విరుద్ధములగు నన్ని విషయములను అపేక్షింపక విడచినారు. తా మాశ్రయించిన యాశ్రయము సుఖస్థితిగా నుండిననేగదా వీరు శోభిల్లునది. అందువలన దానికి మంగళశాసనము జేయుచున్నారు. అది సుఖముగ లేనిచో నిరాశ్రయులందురు. అది గల్గుటచేతనే మహారాజని చెప్పబడిరి. ఏమియు లేనివానికన్న గొంత ధనముగలవాడు గొప్పవాడు. అతనికన్న గొంత రాజ్యముగల రాజు గొప్పవాడు. అతనికన్న నఖండ మహీమండలము నేలు మహారాజు గొప్పవాడు. ఇతనికన్న పైవాడికలేడు కావున మహారాజను పదము సర్వోత్కృష్ట వాచకము. బుభుక్షులోకమునం దఖండ మహీమండలము నేలువానికి పేరగు మహారాజ పదము ముముక్షులోకమున భగవదాశ్రియముగలవారై దానిని వ్యక్తము జేయు కేవల మంగళాశాసనపరత్వము గలవారియందు వాడబడును. ఇది యొకటియే యితనికి గలదని శ్రీమద్రామాయణము చాటుచున్నది. ఇతడు శ్రీరాముని భగవంతుడని తెలిసికొనెనా? అతనియెడ శరణాగతిచేసెనా? ఇట్లు శ్రీమద్రామాయణమున గలదా? పైగా నితని నొక సామాన్య రాజకుమారునిగ గ్రహించి తాను వృద్ధుడనని యతడు బాలుడని తలంచి 'వత్స' 'తాత' ఇత్యాది సంబోధనలు జేసెను. ఇట్టి జటాయువును భగవదాశ్రియపరుడనియు నందువలన ననభిలషితకాముడనియు నందువలననే మంగళాశాసనపరుడనియు జెప్పవచ్చునా? ఇతడు మంగళాశాసనపరుడైనట్లు మీరు చూపబోవు 'భద్రంతే' 'ఆయుష్మన్' ఇత్యాదులును ఇతని వృద్ధత్వాభిమానమును శ్రీరాముని యం దితనికి సామాన్యరాజకుమారుడను భావమున్నదను విషయమును జాటుచున్నవి, యనిన పంచవటియందు శ్రీరాముడు ప్రవేశించకమునుపు జటాయు వితనినే జూచియుండెనా? చూచిన ట్లిచ్చటను ప్రమాణము లేదు. కనుక నిత డంతవరకు నపరిచితుడే. అట్టి వానిని జూడగనే యితడు దశరథ కుమారుడని యెట్లు గ్రహించెను. గ్రహించనియెడల 'వత్స మాం విద్ధి వయస్యం పితు రాత్మనః' అని యెట్లనగల్గెను? ఇందులకు దివ్యజ్ఞానమే కారణమని గ్రహింపక తప్పదు. అదిగలవాడు "స వా దేవై రుదీర్ణస్య రావణస్య వధార్థిభిః। అర్థితో మానుషే లోకే జజ్ఞే విష్ణు స్సనాతనః" అని తెలిసికొన లేకయుండునా? తెలిసి నపుడితని శరణాగతి చేయకయుండునా? చేసినట్లుగలదా? యనిన మానసికముగ జేసెను. అదియే గదా ముఖ్యమయినది. దీనిని బహిర్గతము జేయుటకు రావణవధ పర్యంతము వీలులేదు గదా! అందువలననే మానసికముగ జేసెను. దానివలననే యనపేక్షిత సకల కాము డయ్యెను. సకలకాములందు నపేక్ష తీరుటచేతనే భగవద్విషయమం దపేక్ష గల్గెను. అది ప్రేమదశను జెందెను. చెందగనే రక్ష్య రక్షకభావములు మారిపోయెను.

దానివలననే 'వత్స' 'తాత' యనుట సంభవించెను. అటుపై 'భద్రంతే' ఇత్యాదులు ప్రారంభమయ్యెను. 'మహాబాహో' 'కాకుత్స' 'పరంతప' ఇత్యాదులభావమేమనిన శ్రీరాముడు పుంసాం దృష్టిచిత్తాపహారిగనుక నితని భుజమహత్త్వము వంశగౌరవము పరాక్రమవిశేషము జటాయువు దృష్టిచిత్తముల నపహరించినందున గల్గిన యానందములో నడంగక వాగ్రూపమున బయటికి వెడలెను. ఇంతయేగాక యీయానంద పారవశ్యమున మునిగియుండగా నింతలో నది ప్రేమపారవశ్యముగామారి యీభుజమున కేమి యాపదవచ్చునో యీవంశమున కేమి యప్రతిష్ఠ గలుగునో యీపరాక్రమమున కేమిహాని గలుగునోయని భయమందివానికి మంగళాశాసనము నిట్లు జేయుచున్నారు. ఇవి "మల్లాండతిండూళ్" ఇత్యాదులవంటివి. పెరియాళ్వార్లుగదా యిట్లు సాధించిరి. వారికిని వీరికిని మంగళాశాసనపరత్వమే లక్షణము గనుక వారికి పెరియాళ్వారని వీరిక పెరియవుడయారని తిరునామములు గలిగినవి. భాషాంతరీకరణములే భట్టనాథుడు మహారాజు అయ్యెను. "యామోషధిమివాయుష్మన్నన్వేషసిమహావనే సీతాచమమచ ప్రాణారావణేనో భయంహృతం" ఆరావణుడు నాప్రాణములకే యింత తెచ్చిపెట్టెను, నీప్రాణముల కేమిహానివాటిల్ల జేయునోగదా? అయ్యో చేయుననుటయేమి 'సీతాచ' సీతాదేవి 'ప్రాణేభ్యోపిగరీయసీ' గదా? అట్టియామెనే యపహరించెను. ఇక నీప్రాణములు నిలుచునా? 'అప్యహం జీవితం జహ్యాంతాం౦.వా సీతే" యన్న వాడవుగదా? ఇక నీప్రాణములు నిలుచునాధారమేదియని భయపడి "ఆయుష్మన్" అని మంగళాశాసనముజేసిరి. నాప్రాణములకన్న నెక్కువగు సీతనే వాడపహరించి నపుడిక నీ "వాయుష్మన్" అను మంగళాశాసనముజేసిన మాత్రమున నాప్రాణములు నిలుచు మార్గమేదని శ్రీరాముడడుగునని శంకించి "యేనయాతో ముహూర్తేన సీతామాదాయరావణః। విప్రణష్టం ధనం క్షిప్రంతత్స్వామి ప్రతిపద్యతే" శ్రీరామచంద్రా నీవట్లు భయపడకుము. సీతాదేవి నపహరించిన ముహూర్త మామెను తిరుగ నీవు జెందునట్లు జేయగలదు. అని తనమంగళాశాసన బలమునకు సహాయముగ ముహూర్తబలమును దెల్పి ధైర్యమొందించెను, ఇట్లు తన మంగళాశాసన బలమువలన భగవద్వస్తువును గాపాడుకొనుటకు సార్థక్యముగా నతని విషయమున శేషత్వపారతంత్ర్యకైంకర్యములను వహించుటనుగూడ జెప్పెను. ఎట్లనిన "సోహం వాసనసహాయస్తే భవిష్యామి" పంచవటియందు నివసించునది శ్రీరాముడే. అతనికి దాను సహాయముగ నుండుననుట. అంతేగాని యీపంచవటియందు నేనెంతకాలమునుంచియో యున్నాడను. కనుక నిక్కడ నొక కొంత ప్రదేశమును నీకిచ్చెదను. నాయండను సుఖముగ నుండుమని యనుటలేదు. తాను సహాయుడననుటచే ప్రాధాన్యమును రామునకిచ్చినందున నతని కతిశయమును గల్గించి యందుకై తాను సహాయముగ గ్రహింపబడు వాడనైనందున "పరగతాతిశయాధానేచ్ఛయా ఉపాదేయ త్వమేవ

యస్యస్వరూపం సశేషః" అను లక్షణము బాగుగ సమన్వయించినది. కనుక నిక్కడ శేషత్వము వ్యక్తమైనది. "యదీచ్ఛసి" యనుటచే పారతంత్ర్యము తెల్పబడినది. "సీతాంచతాత రక్షిష్యే" యనుటచే కైంకర్యము వెల్లడింపబడినది. 'త్వయియాతేసలక్ష్మణే' యనుట కైంకర్యమున కవకాశముకోరబడుచున్నది. మరియు "భవేయం శరణంవావః" యను సీతాదేవి విధిగా జెప్పినట్లేయన "సోహంవాస సహాయస్తే భవేయం" అనలేదు. ఏలనన 'యదీచ్ఛసి' గదా! ఏమో శ్రీరామునికిందు కనుమతించునో లేదో. భక్తుల కోరికలను నెరవేర్పక యుండునాయనిన నెరవేర్చితీరవలెనని నిర్బంధములేదు. ఆయన యిష్టము, గనుక 'భవేయం' అనక 'భవిష్యామి' యనియెను. ఈపరస్మైపది ప్రయోగముచే దీని యందు ఖ్యాతి లాభాద్యపేక్ష తనకు లేనట్లును యిందలి లాభాలాభములు శ్రీరామునివే యయినట్లును సూచింపబడినది. 'సీతాం చ తాత రక్షిష్యే' యనునాత్మనే పదిప్రయోగముచేత సీతారక్షణము తనకు విధాయక కృత్యమని తెల్పబడినది. ఏమనిన పురుషకారభూతురాలు సుఖస్థితి యందుండకున్నదా సర్వస్వమునకు రక్షణములేదు. కనుక సీమెను కాపాడుకొనుట తన కర్తవ్యపరమని తెల్పబడినది. "గురుంప్రకాశయేద్ధీమాన్" అన్నట్లు శ్రీరాముని ప్రభావమును వెల్లడింపవలెననితోచి 'అసకృత్సంయుగే యేన నిహతాదేవదానవాః' అని యంతలోనే శ్రీరాముని బలమునకేమి దృష్టిదోషము తగులునో యని 'చీరవాసాః' అని యాతని ప్రభావమును కప్పిపుచ్చుచున్నారు. అంతమాత్రమున రావణుడు శ్రీరాముని లెక్కసేయకపోవునేమోయని 'నచిరాత్' 'త్వాంరామోవధిష్యతి' యనియెను. అందున నారగుడ్డలవాడు నిన్ను జంపుననిన శ్రీరామునియందు క్షత్రతేజము శంకాస్పదమగునేమోయనిశంకించి 'యుధివధిష్యతి' యనియెను. మరియు "నచిరాచ్చీరవాసాస్త్వాం రామోయుధి వధిష్యతి" యనగా "చీరవాసాః" అనగా బ్రహ్మతేజస్సుగలవాడని యర్థము. "యుధి" యనుటచే క్షత్రతేజస్సుగలవాడని యర్థము. 'నచిరా'త్తనుటచే సంకల్పమాత్రముననే జంపగలడని యర్థము. "చీరవాసాః" తపోబలముచేతను జంపగలడు. "యుధి" క్షత్రియబలముచేతను జంపగలడు. ఈ రెంటిలో నొక్కొక్కదానిచేతను జంపగలడు. ఇక్కడ నీపాపమే యిందుకు కారణమని సూచింపబడుచున్నది. "నచిరాత్" నిన్ను జంపుటకు పెద్ద ప్రయత్నమక్కరలేదు. అనుకొన్నమాత్రమున జంపగలడు. "త్వాంవధిష్యతి" దారాపహరణముచే నాతతాయివి గనుక "ఆతతాయిన మాయాంతంహన్యాదేవావిచారయన్" అనుటచే శ్రీరాముడునిన్ను జంపగలడని చెప్పెను.

మరియు శ్రీరాముని గాపాడుటకై 'భద్రం తే' ఇత్యాది మంగళాశాసనమును వీరు జేసిరి గాని సీతావిషయమున మాత్ర మట్లుజేయక 'సీతాంచతాతరక్షిష్యే' సీతాదేవిని మాత్రము భుజబలముననే కాపాడెదమనుచున్నారు. ఏలననిన ఆమెకు వీరివద్ద మంగళాశాసనబలమున్నట్లు పాతివ్రత్యబలమొకటి యున్నది.

(22 వ పేజీ తరువాయి)

ఇంతేగాక తమవలెనే ఆమెయు "మంగళాన్యభి దధ్మహీ" మంగళాశాసనము జేయునదిగానె యున్నది. కనుక ఆమె విషయమున మంగళాశాసనమును ప్రయోగింపము. భుజబలమునే ప్రయోగించెద మనుచున్నారు. అట్లే చేసి యున్నారు. భగవద్విషయమున వీరు భుజబలమునుపయోగించెద మనలేదు. అట్టిది వారికి గలదు గనుక వారివిషయమున మంగళాశాసనమునుపయోగించెదమన్నారు. ఇవ్విధమున భగవద్విషయమున మంగళాశాసన బలమును దేవి విషయమున భుజబలమును వినియోగపరచి సార్థకితజన్ములై యయ్యనాది దంపతుల కటాక్ష విశేషమున పరమపదమును బొందుటచే నితనిని మహారాజని పూర్వాచార్యులు వ్యవహరించిరి. వీరిచరిత్రమును పఠించియు, వినియు నస్మదాదులము తరింతుముగాక యని యింతటితో విరమించుచున్నాడను.

శ్రీ సూత్మ్రకార్యమహాగురవే నమః

---

శ్రీమతే రామానుజాయనమః

తిరుక్కోట్టియూరు నంబిగారు సాయించిన

# శ్రీ సూక్తిషట్కము

"శ్రీమన్నారాయణ"

ముముక్షువైన వానికి విడువవలశినవారు ఆయిదుగురు. ఆశ్రయించతగినవారు ముగ్గురు. ఎటులయనగా పతివ్రతయైన స్త్రీకి విడువవలశినవారు అయిదుగురు ఉపాదేయులైనవారు ముగ్గురున్ను యుండునట్టులు.

పతివ్రతకు త్యాజ్యులెవరన- పెండ్లిగాని పడుచులు, వేశ్యలు, వేశ్యపతులు, ఒకనికివ్వబడి విడిచిపెట్టిపోయినస్త్రీ, లోపలే యుండి సంశయింపబడ్డస్త్రీయున్ను,

ఉపాదేయులెవరన-తల్లిదండ్రులు, తనభర్త కావశ్యకబందువులు, తనతో సమానమైన పతివ్రత స్త్రీలున్ను;

ముముక్షువైనవానికి త్యాజ్యులు-సంసారులు, ఇతరదేవతలు, ఇతరదేవతారాధకులు, తన సాంప్రదాయమందే యుండియు అసాంప్రదాయ సిద్ధాంతముల పాడుచేయువారు, పైకి తగిన రూపము-పేరు గలవారలై సిద్ధాంతమందు ప్రవేశించి ఇతర ప్రయోజనపరులతోకూడి సంశయము లతో విశ్వాసహీనులై తిరుగువారున్ను;

ఉపాదేయులెవరన స్వాచార్యులు, శ్రీవైష్ణవులు-యోగ్యులైన బ్రహ్మచర్యవ్రత నిష్టులున్ను.

ఇట్లు,

వరమంగయ్యమ్మ.

---

# శ్రీ వైష్ణవత్వము

"పరదుఃఖదుఃఖిత్వము శ్రీవైష్ణవస్వరూపము"

ఇతరులకు కలిగిన దుఃఖము వలన ఎవనికి నిజమైన దుఃఖము కలుగునో, ఇతరులకు కలిగిన బాధలవలన ఎవనికి నిజమైన దుఃఖము కలుగునో,

ఇతరులకు కలిగిన ఆపదలవలన ఎవనికి నిజమైన దుఃఖము కలుగునో

అట్టివాడే నిజమైన శ్రీవైష్ణవుడు.

శ్రీవైష్ణవత్వము స్వానుభవైకవేద్యము మాత్రమే.

దీనిని లభించుట కుపాయము :-భగవద్భాగవతాచార్యుల అవిరళసేవ, సజ్జనసాహవాసము- దుష్టవ్యతిరేక-సామాన్యుల సహవాస విసర్జనము, ఏకేశ్వరోపాసనము, ఉపాయోపాయములు భగవంతుడొక్కడే యని పరిపూర్ణవిశ్వాసము, తన యందలి లోపాన్వేషణము, తన్నివృత్తికై దృఢతర ప్రతిజ్ఞాపూర్వక నిశ్చల సాధకకాలిక కృషి, భగవత్ప్రార్థనమున్నూ.






శ్రీమతే రామానుజాయనమః



# పదునెనిమిది రహస్యములు

శ్రీమన్నారాయణ

తిరుక్కోటియూరు నంబిగారు భగవద్రామానుజులవారిని పదునెనిమిది పర్యాయములు తమ గ్రామమునకు త్రిప్పిరి. ఒక్కొక్కపరియాయము ఒక్కొక్క అర్థవిశేషమును సాయించిరి. అవి యేవియన :—

౧. ముముక్షువైనవారికి మొదట సంసారబీజము నశించవలెను. అది ఎటులనశించుననగా—

భార్యాపుత్రాదులపట్ల, శ్లో॥ పంకాదుత్పత్తి తే కీటం।
కీటం పంక న పత్యతే॥
లోకా దుత్పత్తి తే జ్ఞానీ।
జ్ఞానీ లోకం న పత్యతే॥

అని తెలిపినటుల, కుమ్మరిపురుగు బురదలోపుట్టి బురదలోనే యుండును. అయినను దాని కాబురద అంటదు. అటులనే జ్ఞానియైనవాడు కర్మవలననే పుట్టుచున్నాడు. కాని కర్మను అంటనివ్వకుండగ సంసారబీజమును నశింపజేసుకొనవలెను.

౨. సంసారబీజము నశించిననేగాని అహంకార-మమకారములు నశించజాలవు.

అహంకార-మమకారములు నశించుట ఎటులయనగా:—

అహంకారమనగా గర్వము; మమకారమనగా మాత్సర్యము. అగ్నివల్ల పుట్టినదీపము

చల్లనైనగాలిచే శాంతించునటుల అహంకార-మమకారముల నివృత్తి కలుగవలెను.
౩. అహంకార-మమకారములు నివర్తించిననేగాని దేహాభిమానము పోదు.
౪. దేహాభిమానము పోయిననేగాని ఆత్మజ్ఞానము ఉద్భవించజాలదు.
౫. ఆత్మజ్ఞానముద్భవించిననే గాని ఐశ్వర్యభోగాదులయందు ఉపేక్ష జనించదు.
౬. ఐశ్వర్యభోగాదులయందు ఉపేక్ష జనించినగాని భగవంతునియందు ప్రేమ కలుగదు.
౭. భగవంతుని యందు ప్రేమ అంకురించిననేగాని విషయాంతరములయందు రుచిపోదు.
౮. విషయాంతరములయందు రుచి పోయినగాని పారతంత్ర్యము సిద్ధించదు.
౯. పారతంత్ర్యము సిద్ధించిననేగాని అర్థ-కామ-రాగ-ద్వేషాదులు పోవు.
౧౦. రాగ-ద్వేషాదులు పోయిననేగాని శ్రీవైష్ణవత్వము లభించదు.
౧౧. శ్రీవైష్ణవత్వము చేజిక్కినగాని సాత్విక పరిగ్రహణ తటస్థించదు,
౧౨. సాత్విక పరిగ్రహణ తటస్థించిననేగాని భాగవత పరిగ్రహణ కవకాశములేదు.
౧౩. భాగవత పరిగ్రహణ అయిన గాని భగవంతుని పరిగ్రహణ కలుగదు.
౧౪. భగవంతుడు పరిగ్రహించినగాని అనన్యప్రయోజనుడు కాజాలడు.
౧౫. అనన్య ప్రయోజనుడు అయినగాని అనన్యార్హశేషభూతుడు కాడు.
౧౬. అనన్యార్హశేషభూతుడు అయినగాని అనన్యశరణుడు కాజాలడు.
౧౭. అనన్యశరణుడు అయినగాని అధికారిపురుషుడు కాలేడు.
౧౮. అధికారిపురుషుడైనవానికి తిరుమంత్రార్థము లభించును.

ఈ విధముగా పదునెనిమిది పర్యాయములు వేంచేశిన భగవద్రామానుజుల వారికి పదునెనిమిది రహస్యములను తిరుక్కోటియూరు నంబిగారు సాయించిరి.

ఇట్లు,
వరమంగయ్యమ్మ.



# శ్రీ యతిరాజ సేవా మహిళా సంఘము

## శుక్రవారోత్సవములు

శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ వినతి నాలించి శుక్రవారోత్సవములు ఈ నారీమణులచే తమతమ స్వంతగృహములలో అతివైభవముగా జరుపబడినవి. వీరు మిగత సభ్యురాండ్రందరిని తమయింటికాహ్వానించి ప్రార్థన, భజనాది కార్యక్రమముల చక్కగా జరిపిరి.

### అర్తమూరు

(వయా) ద్వారపూడి, తూర్పుగోదావరిజిల్లా.

1950.

5–5. శ్రీమతి తాడిగంగమ్మగారు
15–5. ,, పోతంశెట్టి మహాలక్ష్మిగారు
19–5. ,, ఉండమాటి అమ్మన్నగారు
26–5. ,, లంక వీరమ్మగారు
2–6. ,, కర్రి మాణిక్యంగారు
9–6. ,, పడాల చంద్రావతిగారు
16–6. ,, కర్రి పుల్లమ్మగారు
23–6. ,, కోనాల సత్యెమ్మగారు
30–6. ,, చిర్ల సుబ్బయ్యగారు
7–7. ,, సత్తి అచ్చయ్యగారు
14–7. ,, పోతంశెట్టి మహాలక్ష్మిగారు
21–7. ,, కర్రి సుబ్బయ్యగారు
28–7. ,, పోతంశెట్టి మాణిక్యంగారు
4–8. ,, చిర్ల మహాలక్ష్మిగారు

ఇంతవరకు వీరు సమర్పించినది రూ. 6–8–0. ఇందులో రూ. 5–0–0 లను పత్రికకు చందాగాను, కరపత్రములకు, చందా పుస్తకములకు రూ. 1–8–0 చెల్లించవలసినది.

### నరసాపురము

పశ్చిమగోదావరి జిల్లా.

1950.

5–5. డాక్టరు. కో. శేషాచార్యులుగారి సతీమణిగారు
12–5. ప్లీడరు. కో. శేషాచార్యులుగారి సతీమణిగారు
19–5. శ్రీమతి తై. కం. మంగమ్మగారు
26–5. తై. కం. నారాయణాచార్యులుగారి భార్య శ్రీమతి మంగమ్మగారు
2–6. డాక్టరు. అప్పలాచార్యులుగారి సతీమణిగారు
9–6. శ్రీమతి అ. వెం. ల. నరసమ్మగారు
16–6. మా. కేశవాచార్యులుగారి సతీమణిగారు
23–6. ఈయుణ్ణి రాఘవాచార్యులుగారి సతీమణిగారు
30–6. శ్రీమతి కనకమ్మగారు
7–7. డాక్టరు. కో. శేషాచార్యులుగారి సతీమణిగారు
14–7. ,, ,, ,,
21–7. ,, ,, ,,
28–7. శ్రీమతి అ. వెం. ల. నరసమ్మగారు
4–8. ,, ,, ,,

కోరుకొండ

(వయా) రాజమహేంద్రవరము, తూ.గో.జిల్లా.

1950.

5_5. శ్రీమతి తె. కం. సీతమ్మగారు
12_5. ,, మరింగంటి రంగనాయకమ్మగారు
19_5. ,, ,, ,,
26_5. ,, ,, ,,
2_6. ,, ,, ,,
9_6. ,, తె. కం. మంగమ్మగారు
16_6. ,, తె. కం. గోదాదేవిగారు
23_6. శ్రీమాన్ పరాశర సుదర్శనభట్టరయ్యవార్లంగారి సతీమణి
30_6. శ్రీమతి తెం. కం. సీతమ్మగారు
7_7. ,, మరింగంటి రంగనాయకమ్మగారు
14_7. ,, తె. కం. మంగమ్మగారు.
21_7. ,, తె. కం. గోదాదేవిగారు
28_7. ,, మరింగంటి రంగనాయకమ్మగారు
4_8. ,, తె. కం. గోదాదేవి

విజయవాడ

1950.

5_5. శ్రీమతి కర్రా తాయారమ్మగారు
12_5. ,, పారేపల్లి తాయారమ్మగారు
19_5. ,, ఉదయగిరి కృష్ణారావుగారితల్లిగారు
26_5. ,, ఉదయగిరి కృష్ణారావుగారి సతీమణిగారు
2_6. ,, శివకోటి నాధనాయకమ్మగారు
9_6. ,, శివకోటి లక్ష్మీనరసింహంగారి సతీమణిగారు
16_6. ,, పారేపల్లి రాధమ్మగారు
23_6. ,, కూరపాటి గోదాదేవిగారు
30_6. ,, పారెపల్లి తాయారమ్మగారు
7_7. ,, ఉదయగిరి కృష్ణారావుగారితల్లిగారు
14_7. ,, ,, ,,
21_7. ,, ,, ,,
28_7. ,, ,, ,,
4_8. ,, ,, ,,

విజయవాడ

(గవర్నరుపేట శాఖ)

1950.

21_7. శ్రీమతి కస్తూరి ధనమ్మగారు
29_7. ,, గోపు రామచంద్రరావుగారి సతీమణి నాగరత్నమ్మగారు
4_8. ,, కస్తూరి ధనమ్మగారు

వీరిప్పటివరకు రూ. 7_8_0 వసూలుచేసిరి. భక్తి 'నివేదన' పత్రికకు సాలు చందాకై రూ. 5_0_0 ను; కరపత్రములు, రశీదుపుస్తకములకై రూ. 2_8_0 ను ఖర్చుచేసిరి.

ఏలూరు

శ్రీమతి నంబూరి ఆనందమ్మగారీ ఉత్సవమును జరుపుచున్నారు.

విశాఖపట్టణం

శ్రీమతి దాసరిఆండాళమ్మగారీ ఉత్సవములనుజరుపుచున్నారు.

మైసూరు

శ్రీమతి పండిత. ఎ. సుందరమ్మగారు (ఆండాళ్లుమందిరము) ఈ ఉత్సవములు జరుపుచున్నారు.

## మై ల వ ర ము

శ్రీమైలవరమురాణీగారగు శ్రీమతి వరమంగ యమ్మ బహద్దూరు జమీందారిణీగారు ఈఉత్స వములు కోవిలలో జరుపుటకు తగు ఏర్పాటుల చేయుచున్నారు. వీరు ఇచ్చటనే గాకుండగ వివిధప్రాంతములలో ఈసంఘ శాఖల స్థాపించి పనిచేయ సంకల్పించుకొని యున్నారు.

## మ ద రా సు

శ్రీమతి పువ్వాడ మంగమ్మగారు వరదా ముత్తియప్పన్ వీధిలోనున్న శ్రీ సుధానిధిలో ఈ ఉత్సవములను అతివైభవముగా జరుపుచు న్నారు. వీరీ ఉత్సవములలో శిరియతిరుమడల్, తిరునెడూండారిశగం వగైరాల సేనకాల కాల క్షేపాదులను కూడ జరుపుచున్నారు.

మరియు ఆండాళ్ తిరునక్షత్రోత్సవమును, ఉడయవరుల తిరునక్షత్రోత్సవమును పదేసి రోజులు అతివైభవముగా జరిపిరి.

వీరెందులకై వసూలుపరచి ఖర్చుచేసిన జమ-ఖర్చులు క్రిందటిపత్రికలోను, ఈపత్రికలో స్థలాంతరమున ప్రచురించబడినవి.

వీరు భక్తి 'నివేదన' పత్రికకు రూ. 50-0-0 లును సమర్పించిరి.

మరియు

వచ్చేనెలనుండి ప్రతిమాసము రోహిణి నక్షత్రము రోజున శ్రీకణ్ణన్ తిరునక్షత్రోత్స వమును జరుపదలచినటుల ఈ సంఘ మదరాసు శాఖ అధ్యక్షురాలు శ్రీమతి మట్టుపల్లి చంద్రమ్మ గారు తెలుపుచున్నారు.

## నె ల్లూ రు

ఈ నెలనుండి ఈ గ్రామములో ఈశుక్రవా రోత్సవమును జరుప ఏర్పాటుల జేసుకొనిరి.

మొదటివారము: శ్రీమతి కనుమూరి శ్రీనివా సాచారిసోదరుల తల్లిగారు జరిపిరి.

రెండవవారము: శ్రీ రావు సాహెబు సుబ్బయ్యగారి సతిమణిగారు జరుప సంకల్పించు కొనిరి. వీరిద్దరు ఇచ్చట శాఖసంఘమునకు కార్యదర్శినులుగ పనిజేయుచు మొదటిరోజు ననే 150 మంది సభ్యురాండ్రను జేర్చిరి.

ఇప్పటికి ఆదాయము రూ. 39-8-0. ఇందు భక్తి 'నివేదన' పత్రికకు వార్షిక చందాకై రూ. 5-0-0 నూ; కరపత్రములు, రశీదు పుస్తక ములకై 5-0-0; కేంద్రసంఘ విరాళమునకై రూ. 29-8-0 నూ ఖర్చుచేసిరి.

ఈ జిల్లా కలెక్టరుగారగు జోగప్పగారి సతీమణిగారుకూడ ఈ శుక్రవారోత్సవ కార్య క్రమమున పాల్గొన సంకల్పించుట ఈసంఘ పురోభివృద్ధికెంతయు శుభసూచకము.



శ్రీమతే రామానుజాయనమః

# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ ఆషాఢమాస పండిత పరిషత్సభ

## ఒంగోలు.

(గుంటూరు జిల్లా)

వికృతినామసంవత్సర అధికాషాఢ బహుళ దశమి ఆదివారం (9-7-50 నుండి 11-7-50 తేదీ వరకు, వరుసగా 3 రోజులు శ్రీ ఉ. వే. శ్రీమాన్ గొడవర్తి శఠగోపాచార్యస్వామివారి అధ్యక్షతక్రింద ఒంగోలులోని కోదండరామ స్వామిఆలయములో మహావైభవముగ జరిగినది.

### సభాకార్యక్రమ వివరములు

### 9-7-50 ఆదివారం మొదటిరోజు.

ఉదయం 5½ఘంటలకు తిరువారాధనము. తీర్థప్రసాదగోష్ఠి. 6-30ఘంటలకు తిరువీధ్యుత్సవము సన్నాయిమేళముతోను అధ్యక్షులవారు కారులో వేంచేయగాఅందరును భజయతిరాజ స్తోత్రపారాయణములతోను సప్తవచనములతోను ప్రారంభమైనది. 8-30 ఘంటలకు సభాకార్యక్రమము ప్రారంభించబడినది. శ్రీ ఉ. వే. శ్రీమాన్ శ్రీమదద్దంకి తిరుమల సమయోద్దండ కోలాహల లక్ష్మీనృసింహకుమార తిరువేంగడతాతదేశికాచార్యులు అయ్యావార్లంగారు 'రామానుజుల ఔదార్యమును' గురించియు, శ్రీ ఉ. వే. శ్రీమాన్ న. చ. మహాభాష్యం వరదాచార్యులుగారు 'రామాయణమును' గురించియు, శ్రీ ఉ. వే. శ్రీమాన్ శ్రీ తి. పు. వెంకటాచార్యులుగారు 'సన్న్యాసయోగమును' గూర్చియు ఉపన్యసించిరి.

మధ్యాహ్నము శ్రీమతి మరింగంటి రంగనాయకమ్మగారు స్త్రీలసభలో నుపన్యసించిరి.

మరల 4-0 ఘంటలకు సభాకార్యక్రమము ప్రారంభమై శ్రీ ఉ. వే. శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల తిరువేంగడ జగన్నాథాచార్యులుగారు "జటాయువు మహారాజు" అను విషయమును గురించియు, శ్రీ ఉ. వే. శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులుగారు 'విశిష్టాద్వైతమును గురించియు, శ్రీ ఉ. వే. శ్రీమాన్ అ. చి. శ్రీమన్నారాయణాచార్యులుగారు "నేహనానాస్తికించన" అను శ్రుత్యర్థమును, శ్రీ ఉ. వే. శ్రీమాన్ కోమాండూరి యిళైవిల్లి శ్రీనివాసాచార్యులుగారు ఉపన్యసించిరి.

### 10-7-50 సోమవారం రెండవరోజు.

ఉదయం 6-30 ఘంటలకు తీర్థప్రసాదగోష్ఠి,

తిరువీధ్యుత్సవము జరిగి 7_30 ఘంటలకు సభా కార్యక్రమము ప్రారంభమై శ్రీ ఉ. వే. శ్రీమాన్ నడాథూరి గోపాలకృష్ణమాచార్యులు గారు భక్తిని గురించియు శ్రీ ఉ. వే. శ్రీమాన్ ఉత్పల తిరివేంగడాచార్యులుగారు "ఆండాళ్ వైభవమును" గూర్చియు, శ్రీ ఉ. వే. శ్రీమాన్ శేష భట్టర్ వీరరాఘవాచార్యులుగారు "ఏకాదశి మహాత్మ్యమును" గూర్చియు ఉపన్యసించిరి.

మధ్యాహ్నము స్త్రీలసభలో దాసరి అండాళమ్మగారు ఉపన్యసించిరి.

మరల 4_0 ఘంటలకు సభాకార్యక్రమము ప్రారంభమై శ్రీ ఉ. వే. శ్రీమాన్ దాసశేషు గారు "శ్రీవైష్ణవకర్తవ్యమును" గూర్చియు, శ్రీ శ్రీ శ్రీ పరమహంస పరివ్రాజకేత్యాది సంపత్కుమార యతిరాజ జియ్యరుస్వామివారు "అర్థపంచకమును" గూర్చియు, శ్రీ ఉ. వే. శ్రీమాన్ అధ్యక్షులవారు "తత్త్వత్రయమును" గూర్చియు, శ్రీ ఉ. వే. శ్రీమాన్ కవిరత్న గుదిమెళ్ల రామానుజాచార్యులుగారు "దనుర్దాసును" గురించియు (పద్యరూపేణ) ఉపన్యసించిరి.

**11_7_50 మూడవరోజు మంగళవారం**

ఉదయం శ్రీ ఉ. వే. శ్రీమాన్ కో. కం, వెంకటనర్సింహాచార్యులు గారు "శ్రీ వైష్ణవ లక్షణమును" గూర్చియు, శ్రీ ఉ. వే. శ్రీమాన్ మొలుగు రామానుజాచార్యులుగారు "సంధ్యావందనమును" గురించియు ఉపన్యసించిరి.

మధ్యాహ్నము స్త్రీలసభలో మరింగంటి రంగనాయకమ్మగారు ఉపన్యసించిరి.

4_0 ఘంటలకు సభాకార్యక్రమము ప్రారంభింపబడి శ్రీ ఉ. వే. శ్రీమాన్ శాంతలూరి వెంకటాచార్యులుగారు "నవవిధసంబన్ధములు" గూర్చియు, శ్రీ ఉ. వే. శ్రీమాన్ ఉపన్యాస కేసరి సుభోదక సుధీమణి కో. కం. రంగాచార్యులుగారు, శ్రీ ఉ. వే. శ్రీమాన్ అధ్యక్షుల వారి ఉపన్యాసముతో పూర్తి ఆయెను.

---

(34 వ పేజీ తరువాయి)

వీరు సభను అతిజయప్రదముగ జరిపిరి.

రావుసాహెబ్. చుండూరి సుబ్బయగారు, కనుమూరి శ్రీనివాస సోదరులు, ఊటుకూరి వెంకటసుబ్బయ్య సోదరులు, శ్రీవాకాటి కోటయ్యగార్లు తమతమ సహధర్మచారిణీలతో సహా చేసిన సేవ, జూపిన ఉత్సాహము అపరిమితము – ఆదర్శపాత్రమున్ను అయి యున్నది. తిరువీధ్యుత్సవములలో భక్తులుజూపిన భగవద్భాగవతాచార్య నిష్ఠయు, సేవానిరతియు, ఆస్తిక్యాభినివేశమున్ను అత్యంతముస్తుత్యములు.

ఈ సభా జమాఖర్చుల వివరములు ముందు సంచికలో ప్రచురించబడగలవు.

శ్రీమతే రామానుజాయనమః

# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ

## నిజాషాఢమాస పండితపరిషత్సభ

### నెల్లూరు.

విక్రుతినామ సంవత్సర నిజాషాఢ శుద్ధ పౌర్ణమి శనివారం మొదలు విదియ సోమవారం వరకు (29—7—50 నుండి 31—7—50 వరకు) వరుసగా 3 రోజులు శ్రీ ఉ. వే. శ్రీమాన్ పరాశర సుదర్శన భట్టర్ అయ్యవార్లంగారి అధ్యక్షతను నెల్లూరులోని స్టోన్ హౌస్ పేటలోని కన్యకాపరమేశ్వరి దేవాలయము వద్ద ఇందులకై ప్రత్యేకముగ నిర్మించబడి చాందినీవితానములతోను, విద్యుద్దీపములతోను, నానావిధతోరణములతోను, పతాకముల తోను, శ్రీసూక్తిపఠములతోను, శబ్దవిస్తీర్ణక యంత్రములతోను అలంకరించబడిన బ్రహ్మాండమైన పందిరిక్రింద యిదివరకెన్నడు కనివినిఎరుగనంతటి ఉత్సాహ వైభవములతో జరిగినది.

సభాకార్యక్రమ వివరము

29—7—50 శనివారం మొదటిరోజు,

ఉదయం 6—30 గంటలకు తిరువారాధన, తీర్థప్రసాదగోష్ఠి. 9—0గంటలకు తిరువీధ్యుత్సవము సన్నాయిమేళములతోను, కాలినడకతోను ప్రారంభించబడినది. 10—0 గంటలకు సభాకార్యక్రమము ప్రారంభించబడి ఆహ్వానసంఘాధ్యక్షోపన్యాసము, కార్యదర్శినివేదిక, అధ్యక్షాభిభాషణముతో సభాకార్యక్రమము పూర్తిచేయబడెను.

తిరిగి మధ్యాహ్నము సభాస్థానముననే 3—0 గంటలకు స్త్రీలసభాకార్యక్రమము ప్రారంభించబడి శ్రీ తి. స. ముకుందై రామానుజమ్మగారు ఉపన్యసించిరి.

మరల 4—0 గంటలకు సభాకార్యక్రమము ప్రారంభించబడినది. శ్రీ ఉ. వే. శ్రీమాన్ అధ్యక్షులవారు "భగవత్సౌశీల్యమును" గురించియు, శ్రీ ఉ. వే. శ్రీమాన్ మహాభాష్యం నల్లాన్ చక్రవర్తుల వరదాచార్యులుగారు "చరమోపాయ నిర్ణయమును" గురించియు, శ్రీ ఉ. వే. శ్రీమాన్ కో. యి. శ్రీనివాసాచార్యులుగారు "మనం ఎవరము" అను విషయమును గూర్చియు ఉపన్యసించిరి. తర్వాత సభాసమాప్తి ఆయెను.

30—7—50 ఆదివారము రెండవరోజు.

ఉదయం 7—30 గంటలకు తిరువీధ్యుత్సవము ప్రారంభమై 8—30 గంటలకు సభాకార్యక్రమము ప్రారంభింపబడినది. శ్రీ ఉ.వే. శ్రీమాన్ కిడాంబి వెంకటనరసింహాచార్యులుగారు "నారాయణపరత్వమును" గూర్చియు, శ్రీ ఉ. వే. శ్రీమాన్ ఆ. చి. శ్రీమన్నారాయణాచార్య

స్వామి వారు "అంతర్యామ్యారాధనను" గూర్చియు, శ్రీ ఉ. వే. శ్రీమాన్ శ్రీ తి. పు. వెంకటాచార్యులుగారు 'స్థితప్రజ్ఞావస్థ' అను విషయమునుగూర్చియు, శ్రీ ఉ. వే. శ్రీమాన్ శాంతలూరు వెంకటాచార్యులుగారు ఉపన్యసించిరి.

మధ్యాహ్నము 2_0 గంటలకు స్త్రీలసభలో శ్రీమతి మరింగంటి రంగనాయకమ్మగారు ఉపన్యసించిరి.

4_0 గంటలకు మరల సభాకార్యక్రమము ప్రారంభించబడి శ్రీ ఉ. వే. శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల తిరువేంగడాచార్య స్వామివారి 'ఆశీర్వచన శ్లోకమును' గురించియు, శ్రీ ఉ. వే. శ్రీమాన్ ఉపన్యాసకేశరి సుబోధక సుధీమణి కో. కం. రంగాచార్యులువారు 'ద్రౌపదీశరణాగతిని' గురించియు, శ్రీ ఉ. వే. శ్రీమాన్ నడాదూడ వెంకటకృష్ణమాచార్యులుగారు 'ప్రణవస్వరూపమును' గూర్చియు ఉపన్యసించిరి. సభాకార్యక్రమ మింతటితో పూర్తి అయ్యెను.

31_7_50 సోమవారం మూడవరోజు.

ఉదయం 7_30 గంటలకు తిరువీధ్యుత్సవము సన్నాయి వాద్యములతోను, స్వస్తివాచనములతోను ప్రారంభమై 9_0 గంటలకు సభాకార్యక్రమము ప్రారంభించబడి శ్రీ ఉ. వే. శ్రీమాన్ నడాధూరు గోపాల కృష్ణమాచార్యులు గారు 'మంగళాశాసన వైభవమును' గూర్చియు, శ్రీ ఉ. వే. శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులు గారు 'కృష్ణావతారము గీత' అను విషయమును గూర్చియు ఉపన్యసించిరి.

మధ్యాహ్నము శ్రీమతి మరింగంటి రంగనాయకమ్మగారు స్త్రీలసభలో నుపన్యసించిరి.

మరల4 _0 ఘంటలకు సభాకార్యక్రమము ప్రారంభమై శ్రీ ఉ. వే. శ్రీమాన్ శృంగారం అప్పలాచార్యులు గారు 'హనుమదాచార్యత్వమును' గూర్చియు, శ్రీ ఉ. వే. శ్రీమాన్ బెల్లంకొండ రాఘవాచార్యులుగారు 'అర్చిరాది' అను విషయమునుగూర్చియు, శ్రీ ఉ. వే. శ్రీమాన్ కో. కం. రంగాచార్యులుగారు 'విభీషణ శరణాగతిని' గురించియు ఉపన్యసించిరి.

తర్వాత ఆహ్వానసంఘ కార్యదర్శి ధన్యవాదములతో సభాకార్యక్రమము పూర్తిచేయబడెను.

పిమ్మట విచ్చేసిన పండితులయొక్కయు, ఆహ్వానసంఘము యొక్కయు ఛాయాచిత్రము తీయబడెను.

ఈ సభలకు ఆహ్వాన సంఘమున:

అధ్యక్షులు:

శ్రీ ఊటుకూరి వెంకటసుబ్బయ్యగారు.

ఉపాధ్యక్షులు:

శ్రీయడ్లపల్లి జయరామయ్యగారు.

శ్రీమెంటా వెంకటాచలంగారు.

శ్రీగుడ్లపల్లి రంగమన్నారుగారు.

ప్రధాన కార్యదర్శి:

రావుసాహెబ్. చుండూరి సుబ్బయ్యగారు.

సహాయ కార్యదర్శులు:

కె. దొరస్వామి అయ్యంగారు.

వాకాటి రోశయ్యగారు.

ఊటుకూరి కనకయ్యగారు.

కూనల సుబ్బరాయుడుగారు.

కోశాధికారి:

కొనుమూరి శ్రీనివాసాచార్యులుగారు,

(భగవాన్ ప్రెస్.)

(తరువాయి 32 వ పేజీలో)

# శ్రీవిశిష్టాద్వైతప్రచారకసంఘము

## ఏకాదశి ఉత్సవములు.

### అత్తమూరు

1. శ్రీమాన్ ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులుగారు
2. శ్రీమాన్ గుదిమెళ్ళ వేంకటనరసింహాచార్యులుగారు
3. శ్రీమాన్ వంగీపురం రంగాచార్యులుగారు
4. శ్రీమతి సబ్బిళ్ళ లక్ష్మిగారు

తమతమ యిండ్లలో ఈఉత్సవముల జరిపిరి.

### కోరుకొండ

శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులుగారు తమయింట్లోనే యిప్పటివరకు అన్ని ఏకాదశ్యుత్సవములను జరిపిరి.

### ఒంగోలు

10—6—50 శ్రీమాన్ నూనె వేంకటేశ్వర్లుగారింట్లో ఈఉత్సవము జరుపబడినది.

### నరసాపురము

1950.

28_4 శ్రీమాన్ డాక్టరు కో. శేషాచార్యులుగారు
12_5 ,, ప్లీడరు. కో. శేషాచార్యులుగారు
28_5 ,, తె. కం. వాసుదేవాచార్యులుగారు
11_6 ,, తె. కం. నారాయణాచార్యులుగారు
26_6 ,, మామిడిపల్లి కేశవాచార్యులుగారు
1_7 ,, ఈయుణ్ణి రాఘవాచార్యులుగారు
(శ్రీ యతిరాజాశ్రమంలో)
25_7 ,, కం. కనకమ్మగారు
(శ్రీ యతిరాజాశ్రమంలో)

ఈ ఉత్సవముల జరిపిరి.

### ● సానుభూతి

పశ్చిమగోదావరిజిల్లా పాలకొల్లు శ్రీవిశిష్టాద్వైతప్రచారకసంఘ శాఖాధ్యక్షులగు శ్రీసలాది చినరామలింగయ్యగారు వికృతి సం.రం నిజ మాఘ శుద్ధ ౯ ఆదివారం పరమపదించిరి.

వీరు పాలకొల్లునందు ఈసంఘ ప్రచారమునకై చేశిన సేవ అపారము. వీరి శ్రీవైష్ణవత్వ పరాకాష్ఠ అత్యాశ్చర్యకరమైనది. ఆదర్శపాత్రమైనది.

వీరు పరమపదించుట వలన సంఘమునకు తీరనిలోటు సంభవించినది.

వీరియాత్మకు శ్రియఃపతి తననిత్య కైంకర్యమును ప్రసాదించి కటాక్షించుగాక యని ప్రార్థించుచు, వీరికుటుంబమునకు మాసానుభూతిని అందజేయుచున్నాము.

శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘము.

### శాశ్వత సభ్యత్వము

నెల్లూరు వాస్తవ్యులు శ్రీమాన్ రావుసాహెబు చుండూరు సుబ్బయ్యశ్రేష్ఠి గారు భక్తి "నివేదన" పత్రికకు రూ. 116_0_0 లు విరాళమును సమర్పించి, ఈపత్రిక శాశ్వత పోషకవర్గ సభ్యులైరి.

వీరికి సర్వేశ్వరుడు సమస్త సన్మంగళము లొసంగుగాక.

# కట్నములు - కానుకలు.

గుంటూరు జిల్లా కొర్నిపాడు గ్రామస్థులగు శ్రీమాన్ చిగురుపాటి వెంకట శివరామయ్య గారు తమ కుమార్తె చిరంజీవి సౌభాగ్యవతి కాంతిమతి దేవియొక్క అన్నప్రాశన మహోత్సవమున శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘము నకు రు. 2-0-0 కానుకను సమర్పించినారు. వీరికి శ్రీయఃపతి ఆయురారోగ్యభాగ్యములనిచ్చుగాక.

విశాఖపట్టణవాస్తవ్యులు శ్రీమతి ద్వారం శ్రీనివాసమ్మగారున్ను వారి రెండవ కుమారుడు, కోడలుగారును శ్రీమాన్ పరవాస్తువారివద్ద సమాశ్రియణమును పొంది ఆశుభకార్యమున శ్రీవిశిష్టాద్వైతప్రచారక సంఘమునకు రు. 5-0-0 కానుకను సమర్పించినారు. వీరికి శ్రీయఃపతి ఆయురారోగ్య భాగ్యముల నిచ్చుగాక.

విశాఖపట్టణ శ్రీయతిరాజసేవా మహిళా సంఘ శాఖవారు ప్రతి ఆర్ద్రానక్షత్రమునను శ్రీఉడయవరుకోవిలలో సభల జరుపుచున్నారు. ఆనాడు పెరుమాళ్లకు అర్చన ధాటీ పంచక విన్నపము-భోగము- యతిరాజ వింశతిస్తోత్ర పఠనము జరుపుచున్నారు.

కిందటినెలలో జరిపిన ఈ సభా మహోత్సవమున శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు రు. 5-0-0 సంభావనను సమర్పించిరి,

ఈ సంఘము శ్రీయఃపతి కటాక్షముతో దిన దినాభివృద్ధిని గాంచుగాక.

అమలాపురం తాలూకా కొత్తపల్లి గ్రామస్థులు శ్రీమాన్ డా॥ క. శేషాచార్యులుగారున్ను శ్రీమాన్ గు. వెం. ల. నరసింహాచార్యులుగారున్ను తమ చిరంజీవుల వివాహమహోత్సవ శిరుపాడుత్సవ సమయమున శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు రు. 4-0-0 కట్నమును సమర్పించిరి. ఈనూతనదంపతులకు శ్రీయఃపతి ఆయురారోగ్య భాగ్యముల ప్రసాదించుగాక.

## సంభావనై

తణుకువాస్తవ్యులైన ఆత్మకూరి రంగమ్మగారి పరమపదోత్సవ సమయమున ఆమె కుమారులు శ్రీమాన్ రామానుజాచార్యులుగారు శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు రు. 2-0-0 సంభావనను సమర్పించిరి. వీరికి శ్రీయఃపతి సకలశ్రేయస్సు సమకూర్చుగాక.

విజయవాడ వాస్తవ్యులు కస్తూరి ధనమ్మగారు తమ భర్తగారి తిరువధ్యయనము సందర్భమున శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు రు. 5-0-0 లు సంభావనను సమర్పించిరి. వీరికి శ్రీయఃపతి సకలశ్రేయస్సు సమకూర్చుగాక.

పాలకొల్లు వాస్తవ్యులు కీ. శే. సలాది చిన రామలింగయ్యగారు ది. 23-7-50 (వికృతి-నిజాషాఢ-శు. ౯ ఆదివారం) పరమపదించగా వారి తీర్థ తిరువధ్యయన సమయమున వారి కుమారులు శ్రీమాన్ రామచంద్రరావు, వెంకటరత్నంగార్లు శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు రు. 10-0-0 విరాళమును శ్రీమాన్ అరవిల్లి అళహశింగరాచార్యులుగారి ద్వారా సమర్పించిరి. వీరికి శ్రీయఃపతి సకలశ్రేయస్సుల సమకూర్చుగాక.

భక్తి

# నివేదన







వికృతి - కార్తీకము.　　　　సంపుటి ౧.　సంచిక ౮

శ్రీమతే రామానుజాయనమః



భక్తి

# నివేదన

వేదాంత మాస పత్రిక

| సంపుటి ౨ | వికృతి – కార్తీకము | సంచిక ౮ |
| --- | --- | --- |

## విశిష్టాద్వైతము

"శ్రీ మన్నారాయణ"

సహకారి కారణమనియు; సృష్ట్యద్యనుకూల సంకల్పాదుల గాశ్రయుడైన పరయాత్మయే నిమిత్తకారణనియు; సగుణశ్రుతులన్నియు భగవంతునియొక్క వాస్తవిక అనంత కల్యాణగుణములను తెలుపునవనియు; నిర్గుణ శ్రుతులన్నియు భగవంతుని యందు ఎట్టి హేయగుణము లేవని తెలుపుచున్నవనియు;

అభేదమును తెలుపు శ్రుతులన్నియు 'ఆత్మభూతుడైన పరమాత్మను విడిచి చిత్తు అచిత్తులు భిన్నములై యుండజాలవు. ఆయనకు శరీరములై అపృథక్ సిద్ధి సంబంధముచే ఆయనతో కలిసి అభిన్నములైయ్యే యుండునవి గాని స్వతంత్రమైన భేదములేనివి, అని తెలుపుచున్నవనియు; భేదమును తెలుపు శ్రుతులన్నియు చిద చిత్తులు పరమాత్మతో కలసి యున్నను నిత్యత్వ అనిత్యత్వ; పరిణామత్వ–అపరిణామత్వ; అల్పత్వ–మహత్వత్వాది చేతనత్వ, అచేతనత్వాది స్వభావ–స్వరూపములలో చిత్తు, అచిత్తు–ఈశ్వరులు భిన్నులు, అని తెలుపుచున్నవనియు; వాచ్యత్వాదుల నిషేధించు శ్రుతులన్నియు; పరమాత్మ దేశతః–కాలతః వస్తుతః పరిచ్ఛేదించ వీలులేనివాడని తెలుపుచున్నవనియు; పరమాత్మకు ఉత్పత్తిలేదను శ్రుతులన్నియు, పరమాత్ముడు మనవలె కర్మకృతమైన ఉత్పత్తి లేనివాడని తెలుపుచున్నవనియు; పరమాత్మకు ఉత్పత్తిని తెలుపు శ్రుతులన్నియు, పరమాత్ముడు స్వాశ్రిత సాధుజన సంరక్షణార్థమై తన సంకల్పముచేతనే స్వేచ్ఛగ ఎత్తిన అవతారవిశేషములు కలవాడని తెలుపుచున్నవనియు; జీవుల పరస్పరైక్యమును తెలుపు శ్రుతు

లన్నియు 'జీవులందరు జ్ఞానమును ఆకారముచే ఏకరూపులై యుందురని ప్రకారైక్యమును తెలుపుచున్నవనియు; జీవుల పరస్పర భేదమును తెలుపు శ్రుతులనియు, 'జీవులు తమ తమ కర్మానుగుణమైన స్వరూప-స్వభావ-అనుభవములలో భిన్నులై యుందురని, తెలుపుచున్నవనియు; పరబ్రహ్మ అద్వితీయుడను తెలుపు శ్రుతులున్నియు: పరబ్రహ్మ చిత్తు-అచిత్తులను శరీరముగా కలిగి యుండుటచే స్వ జాతీయమైన మరియొకటి లేదను తెలిపినను; అవి తెలుపుచున్నవనియు;

ఈవిధముగా శరీరములైన చిత్తు అచిత్తులకును, శరీరమైన ఈశ్వరునికి భేదమును అంగీకరించుట వలన, బంధ-మోక్షవ్యవస్థయు, ఉపదేశాదులున్ను, తత్త్వజ్ఞానవ్యవస్థయు చక్కగా కుదురును. గాన ఇట్టివాటిని తెలుపు శ్రుతివాక్యముల కన్నియు ఈవిధముగానే అర్థమును తెలుసుకొనవలెననియు;

చేతనుని యొక్క మొట్టమొదటి ప్రవృత్తి సర్వేశ్వరునియొక్క స్వయంస్వాతంత్ర్యానుసారముగ చేతనుని యొక్క పూర్వకృత కర్మానుసారము జరుగును. గాన విధి-నిషేధముల తెలుపు శాస్త్రము నిరర్థకకము కాదు అనియు;

సర్వేశ్వరుడు నిర్వికారుడు యను అర్థమును తెలుపు శ్రుతులు, ఆయన నిత్యమైన కల్యాణగుణములను ఆశ్రయుడై, చేతనులు జేసిన యాగ-ఉపాసనాదులచే ప్రీతుడగుచు వారల యభీష్టాదుల దీర్చు పరమకారుణికుడగుట ప్రమాణసిద్ధమగుటవలన, ఆయన యందు కర్మజన్యమైన హేయవికారములేవియు లేవు అని తెలుపుచున్నవనియు;

సర్వేశ్వరుడు తానే సంకల్పించుకొని తదనుసారముగ ప్రపంచరూపముగా అనేకపదార్థముగా నాయెను. అని శ్రుతులు తెలుపుచుండుటచే, "వికారము లనునవి అపురుషార్థములుగాను అవి సర్వేశ్వరుని యందు లేవు" అని తెలుపు శ్రుతులకు సాక్షాత్తు సంబంధేన సర్వేశ్వరుని యందెట్టి వికారములులేవని తాత్పర్య మనియు;

చేతనుడు చేసిన పుణ్యకార్యముల వలన సర్వేశ్వరునికి ప్రీతికలుగును. దాని వలన స్వర్గాది పుణ్యలోకానుభవము కలుగును, చేతనుడు చేసిన పాపకార్యముల వలన సర్వేశ్వరునికి అప్రీతి కోపము కలుగును, దానివలన నరకాది పాపలోకానుభవము కలుగును, గాన యిట్టి భగవన్నిగ్రహానుగ్రహముల కంటె స్వర్గనరకాదులకు వేరే 'అపూర్వము' ను కారణము లేదనియు;

ఇంద్రాదివ్యక్తులు ఆయాకల్పాంతమున నశించినప్పటికిన్ని ఆయా ఇంద్రాదులకు అంతర్యామిగాయుండు పరమాత్మ ఎప్పటికిన్ని నిత్యుడై స్థాయిగా యుండును గాన అయనచే ఈ చేతనులు జేసిన కర్మలకు ఫలము కలుగుటలో హానిలేదనియు;

ఫలదాత సాక్షాత్తు సర్వేశ్వరుడే అయినను ఇంద్రాదులయొక్క అనుగ్రహములు అవాంతర

కారణములు కావున ఇంద్రాద్యారాధనములు వ్యర్థములుకావు. మరియు మనుష్యాదులచే సర్వేశ్వరుడు ఇంద్రాదులద్వారా ఆరాధించబడునుగాన మనుష్యాదులు ఇంద్రాదుల సాక్షాత్తు ఆరాధించుటలోగాని ఎట్టివిరోధము లేదనియు;

చేతనుడు మొట్టమొదట మోక్షమునందు ప్రవృత్తించుటలో, సర్వస్వతంత్రుడును, లీలారసానుభవాకాంక్షియు నిర్లిప్తుడును అగు సర్వేశ్వరుడు ఈచేతనుని ఆటంకపరచకుండగ జూచుచుండుటగాని, అనుమతించుట గాని ఎట్టిదోషావహము గాదనియు;

ఈవిధముగా శ్రుతులలోని అన్నివాక్యములకు శ్రీరామానుజులవారు ఎట్టివిరోధము లేకుండగ చక్కగ సమన్వయపరచి అర్థమును తెలిపిరి.

శిష్యుడు:- పరమాత్మునికి అట్టి స్వాతంత్ర్యము వహించుట దోషముకాదా?

గురువు:- నాయనా! పరమాత్మునియొక్క నిరంకుశ స్వాతంత్ర్యము గుణముగాని దోషమెంతమాత్రమున్ను గాదు. ఏలనన సర్వేశ్వరుడు జీవునికి జ్ఞానమున్ను, దానినుపయోగించుకొనే నడుచుకొనుటకు శరీరమున్ను, ఇంద్రియములను, విషయములను, మంచి చెడ్డల తెలిసికొనుటకు శాస్త్రములను, వాటిని విశదీకరించుటకు ఆచార్యులను, మధ్య మధ్య తానే అవతారములెత్తి తన ఉపదేశానుష్ఠానములను అనుగ్రహించియున్నాడు. గాన మధ్య మధ్యగ ప్రతివాని నిత్యకృత్యములలోను ఆయన కలుగజేసుకొనడు. ఎవడు ఏది చేయునో వానికి తదనుగుణ ఫలితమును అనుభవింపజేయుచుండును.

జీవునికిచ్చిన కించిత్స్వాతంత్ర్యమును వీడు తన దుర్బుద్ధిచే పాడుచేసుకొనిన అది భగవంతుని దోషమగునా? దోషముకాదు సరికదా ప్రత్యుత గుణమేయగునుగదా.

శిష్యుడు:- భగవంతునియందు దయాదిగుణములున్నవికాదా. వాని యుపయోగమేమి?

గురువు:- చేతనుడు తనయొక్కయు సర్వేశ్వరునియొక్కయు స్వరూపమును తెలుసుకొనినవాడై, తన ప్రాతికూల్యమువీడి, భగవంతునే ఆశ్రయించి, ప్రపత్తి చేయువానిని భగవంతుడు తనదయకు పాత్రునిగ జేయును. గాన ఆయనయందలి దయాదిగుణములు వ్యర్థములుకావు.

శిష్యుడు:- సంసారనివృత్తి దేనివలన కలుగును?

గురువు:- అనాదియైన కర్మయొక్క ప్రవాహమువలన ప్రకృతి సంబంధముకలుగును. ఇదియే సంసారబంధమనబడును. ఇది సత్యమైనది. భగవంతుని ఉపాసించుటవలన ఆయన అనుగ్రహము కలుగును. ఆ అనుగ్రహమువలన ఈ సంసారబంధము నశించును.

శిష్యుడు:- బంధమోక్ష వ్యవస్థ ఎటుల?

గురువు:- చేతనులు పరస్పరము భిన్నులు. కర్మలంపటుడు సంసారబంధమున చిక్కుకొనును.

భగవదుపాసనచే భగవదనుగ్రహ పాత్రుడు మోక్షమును జెందును, గాన బంధమోక్షవ్యవస్థ చక్కగా కుదురును.

శిష్యుడు :- వేదమున రెండుభాగములేల యున్నవి? అందేది ప్రమాణము?

గురువు :- వేదమున పూర్వభాగము సర్వేశ్వరునియొక్క ఆరాధన భూతమైన కర్మలయొక్క స్వరూపమును ప్రతిపాదించుచున్నది. ఉత్తరభాగము ఆరాధ్యుడైన సర్వేశ్వరుని ప్రతిపాదించుచున్నది. గాన మొత్తము రెండు భాగములు కూడ ప్రమాణసిద్ధములే.

శిష్యుడు :- ఈ వేదమునుగూర్చిన మీమాంసా శాస్త్రములెన్ని? వాని వివరములెవ్వి?

గురువు :- కేవల కర్మను గురించిన వివరముల తెలుపునది కర్మ మీమాంస. ఇది కేవల కర్మల స్వరూపమును తదనుష్ఠాన వివరములను తెలుపును.

కర్మలచే ఆరాధించబడు దేవతాంతరముల గురించిన వివరముల తెలుపునది దేవతా మీమాంస. ఇది ఆయా కర్మలచే సాక్షాత్తు ఆరాధించబడు దేవతాంతరుల స్వరూప విశేష ఫలితాదుల తెలుపును. ఫలప్రదాత యగు పరబ్రహ్మను గురించిన వివరముల తెలుపునది బ్రహ్మమీమాంస. ఇది దేవతాకాష్ఠాభూతుడైన పరమపురుషుని గురించిన వివరములనన్నింటిని తెలుపును. గాన ఈమూడు కూడ ప్రమాణములే.

వీటినన్నింటిని ప్రమాణములుగ తీసుకొని అన్నింటిని సమన్వయపరచి దేనిని విడిచిపెట్టకుండగను, దేనికి విరుద్ధములేకుండగను చక్కగ సమన్వయపరచి భగవద్రామానుజులు తమసిద్ధాంతమును వ్యాపింపజేసిరి.

శిష్యుడు :- శ్రీరామానుజులవారు తమసిద్ధాంత నిర్ణయమున ఇంకను ఎవరెవరిని గురువులుగ స్వీకరించిరి?

గురువు :- శ్రీరామానుజులవారు ముఖ్యముగ శ్రీయామునాచార్యులవారిని ఆచార్యులుగ గాని వారితో వీరికి సాక్షాత్తు సాన్నిధ్యము తటస్థించకపోవుటచే వారి యాజ్ఞానుసారముగ వారి శిష్యులను ఐదుగురిని ఆశ్రయించి వారిద్వారా శ్రీయామునాచార్యులవారి ఉపదేశముల గ్రహించిరి.

శిష్యుడు :-ఆ పంచాచార్యులు ఎవరు?

గురువు :- 1. పెరియనంబి, 2. పెరియతిరుమలనంబి, 3. తిరుక్కోట్టియూరునంబి, 4. తిరుకచ్చినంబి 5. మారనేరినంబి, అనువారైదుగురు.

శిష్యుడు :-వీరి శైత్రియాత్రి విశేషములేవి?

గురువు :-వీరు ఆసేతు శీతాచలము వరకు రెండుపర్యాయములు జైత్రయాత్ర చేసినటుల యున్నది.

జైత్రయాత్రలో ప్రధానవిశేషము-వీరు కాశ్మీరు వెళ్ళినప్పుడు అచ్చటి శారదాపీఠమందలి పండితప్రకాండులందరి ఎదుట తాము బ్రహ్మసూత్రములకు రచించిన శ్రీభాష్యమును ఉపన్యసించగా దానియందలి యదార్థసమన్వయ సిద్ధాంతమునకు అచ్చటి పండితులందరు ఏకగ్రీవముగ అంగీకరించి ముగ్ధులైరి. శారదాదేవి ప్రత్యక్షమై అపుడు వీరికి "శ్రీభాష్యకారులు" అని బిరుదును ప్రసాదించెను. వీరు తాము స్వయముగ వ్రాసిన శ్రీభాష్యకోశమును ఆ శారదాపీఠమునకు కానుకగ సమర్పించితనియు, ఇప్పటికిన్ని ఆ శ్రీకోశమచ్చట విరాజిల్లుచున్నదనియు తెలిపెదరు. మరియు వీరు అచ్చటచ్చట ప్రధాన స్థలములయందు మఠములు నేర్పరచిరి. మరియు జీర్ణమైన అనేక దేవాలయముల నుద్ధరించి తిర్గి వానిని సక్రమ నిర్వహణమునకై కొంతమంది జీయంగార్లను సన్యాసాశ్రమస్థులను ఏర్పాటుచేసిరి.

అందులో తిరుపతి, తిరునారాయణపురము, శ్రీరంగము, శ్రీవిల్లిభుత్తూరు మున్నగునవి ముఖ్యములు.

శిష్యుడు :- వీరు రచించిన వాఙ్మయమేమి ?

గురువు :- వీరు శ్రుత్యర్థమును విశదీకరించు వేదార్థసంగ్రహము; సూత్రార్థమును స్పష్టీకరించు శ్రీభాష్యము, వేదాంతసారము, వేదాంతదీపము అనువాటిని; స్మృత్యర్థమును స్థిరపరచు శ్రీగీతాభాష్యమును; పురుషార్థస్వరూపమును తెలుపు శ్రీరంగ గద్య; ఫలస్వరూపమును ప్రతిపాదించు శ్రీవైకుంఠ గద్య; ఉపాయస్వరూపమును ఉపదేశించు శ్రీశరణాగతి గద్య, నిత్యానుష్ఠానమును నిర్మించు నిత్యగ్రంథము అను తొమ్మిది గ్రంథములను రచించిరి.

ఈనవరత్నములు అమూల్యములు. అసమానములు. ముముక్షుజనులకనుష్ఠేయ ప్రకాశకములున్ను.

శిష్యుడు :- వీరు తమ తదనంతర ఏర్పాటులేమి జేసిరి ?

గురువు :- మతప్రచారమునకు సర్వసంగపరిత్యాగులేగాని పనిచేయజాలరు. అందుచే సామాన్యముగ సన్యాసులుమాత్రమే అందులకు తగియుండెదరు. కాని బౌద్ధమతవ్యాప్తిలో అందరు సన్యాసులగుటయు, వారి ప్రవర్తనాదికములు రానురాను సంఘశ్రేయోనిరోధకములై సంఘవిచ్ఛిత్తికిన్ని, మతముయొక్క పునాదుల నాశనమునకు దారితీయుటచేతను, మరియు శ్రీవిశిష్టాద్వైతములో భక్తియే ముక్తికి కారణమగుటచేతను, తత్ప్రచారమునకు నివృత్తిమార్గనిష్ఠులైన గృహస్థులుకూడ అనుకూలురే అయి యుండుటచేతను శ్రీరామానుజులవారు తమ తదనంతరము తమ సిద్ధాంతవ్యాప్తికై డెబ్బదినలుగురు యోగ్యులగువారిని ఆచార్యపురుషులుగ నిర్ణయించిరి. వీరందరికి

వలయు శిక్షణాదికముల నుపదేశించి వీరిని దేశములో నలుగడలను మతప్రచారమునకై వినియోగించిరి.

వీరలలోని సంతతివారు చాలమంది యిప్పటికిన్ని ఆచార్యపురుషులై ఈసిద్ధాంతమును ప్రచారము చేయుచునేయున్నారు. వీరినే స్వయమాచార్య పురుషులని వ్యవహరించుట కలదు.

శిష్యుడు :— ఈ డెబ్బది నలుగురు ఆచార్యపురుషులయొక్క తిరునామముల తెలుపఁగోరెద.

గురువు.— డెబ్బదినలుగురు ఆచార్యపురుషులెవరనగా :—

1. శ్రీ యామునాచార్యులవారు పుత్రులైన శొట్టనంబిగారు.
2. పెరియనంబి గారి కుమారులైన పుండరీకాక్షులు.
3. తిరుక్కోట్టియూరు నంబిగారి కుమారులైన తెర్కాళ్వారు.
4. తిరుమలైయాండాన్ కుమారులైన సుందరతోళుడయారు.
5. పెరియ తిరుమలనంబిగారు కుమారులైన తిరుక్కురుగైప్పిరాన్ పిళ్ళాన్.
6. పిళ్ళై తిరుమలనంబి.
7. కూరత్తాళ్వారులు.
8. కూరత్తాళ్వారుల కుమారులైన పరాశర భట్టరు.
9. శ్రీరామపిళ్ళై (వ్యాసభట్టరు.)
10. ముదలియాండాన్.
11. నడాదూరాళ్వాన్.
12. ఎంగళాళ్వాన్.
13. నడువిలాళ్వాన్.
14. కోమడత్తాళ్వాన్.
15. తిరుకోవలూరాళ్వాన్,
16. తిరుమోగూరాళ్వాన్.
17. పిళ్ళైయాళ్వాన్.
18. అనంతాళ్వాన్.
19. మిళగాళ్వాన్.
20. నెయ్యుండాళ్వాన్.
21. శేట్టలూరు సిరియాళ్వాన్.
22. తేడాంతి యాళ్వాన్.
23. కోయిలాళ్వాన్.
24. ఉక్కలాళ్వాన్.
25. అరణపురత్తాళ్వాన్.
26. ఎంబారు.
27. కిడాంబి యాచ్చాన్.
28. కణియనూరు సిరియాచ్చాన్.
29. కొంగిలాచ్చాన్.
30. ఈచ్చంబాడి యాచ్చాన్.
31. తిరుమలై నల్లాన్.
32. వంగిప్పురత్తాచ్చాన్.
33. తిరుక్కణ్ణపురత్తాచ్చాన్.
34. సిరియగోవింద పెరుమాళ్.
35. కిడాంబి పెరుమాళ్.
36. అమ్మంగి పెరుమాళ్.
37. ఆసూరి పెరుమాళ్.
38. పిళ్ళయుప్పన్.

39. వంగిప్పురత్తునంబి.
40. ముడుంబైనంబి.
41. పరాంకుశనంబి.
42. తిరుక్కురుంగుడినంబి.
43. తొండనూర్నంబి.
44. అరణపురత్తునంబి.
45. మరుదూర్నంబి.
46. మ యూర్నంబి.
47. వడుగనంబి.
43. కురవి నంబి.
49. కందాడై యాండాన్.
50. సోమాసి యాండాన్.
51. జియ్యరాండాన్.
52. ఈశాండాన్.
53. పెరియాండాన్.
54. సిరియాండాన్.
55. అమ్మంగియాండాన్.
56. ఆళవందారాండాన్.
57. ఉక్కలమ్మాళ్.
58. పరిత్తిక్కొల్లైయమ్మాళ్.
59. వైత్తమానిదియార్.
60. సిరిప్పళ్ళి దేవరాజభట్టర్.
61. పిళ్ళైయురందయుడయార్.
62. పిళ్ళై తిరువాయ్మొ యరయర్.
63. పిళ్ళై సెరునరయూరరయన్.
64. పిళ్ళై రాజమహేంద్రి పెరుమాళరయన్.
65. అధికారిప్పిళ్ళై.
66. తిరునగరి పిళ్ళై.
67. ఆర్క్కొట్టుపిళ్ళాన్.
68. కొమాండూరుప్పిళ్ళై.
69. అనంత సోమయాజియార్.
70. కాంచీసోమయాజియార్.
71. అలంనార వేంగడవన్.
72. సుంజిప్పూర్ సిరియాండాన్.
73. కొమాండూరు ఇళైయవిల్లి.
74. మారొనిల్లా మారుతియాండాన్.

ఈ ఆచార్యపురుషులలో కొందరికి నామాంతరములు గలవు.

ఈచెప్పబడినవారిలో తిరుక్కురుగైపిరాన్ పిళ్లాన్, నడదూరాళ్వాన్, కిడాంబియాచ్చాన్ మొదలియాండాన్, ఈనలుగుడు శ్రీభాష్యప్రవచనపరులు. తిరుక్కురుగైప్పిరాన్పిళ్ళాన్ అనువారు శ్రీభాష్యభగవద్విషయములు రెండింటికి ప్రవర్తకులైరి. వీరేగాక శ్రీరంగనారాయణ జియ్యరు, ఈచ్చంబాడి జియ్యరు; గోవిందజియ్యరు; శట్టైప్పళ్ళిజియ్యరు; తిరుమ్మళిశజియ్యరు; తిరువెళ్ళర జియ్యరు, తిరుప్పాడ్కడిజియ్యరు, ఆడ్కొంకవిల్లజియ్యరు, తిరుమాలిరుంజోలైజియ్యరు మొదలుగా; గల 700 మంది జీయరులు, నంబిగురుదేవర్ మొదలుగాగల పండ్రెడువేల పరమైకాంతులు తూయమునివే వర్ మున్నగు కైంకర్యపరులు, తిరువరంగమాయోన్ మొదలగు కావలివారలు, పిళ్ళైయురంగావల్లదాసులు మొదలు దాసజనులు, తిరువనందపురత్తమ్మై మొదలగు అమ్మంగార్లు, వీరందరు ఈసిద్ధాంతానుష్ఠానపరులై సిద్ధాంతవ్యాపకులై యుండిరి.

---

 గతసంచిక తరువాయి.




## సంభాషణ: సత్యము.

మనుష్యుని విద్యా బుద్ధి స్వభావములు అతని సంభాషణ వలన తెలియబడును. నీ కంటె తక్కువ వారినిగాని, చిన్నవారినిగాని "ఓరి, ఓసి" అని సంబోధించుట మంచిదిగాదు. అతి పరిచయము కలిగి నీ కంటె చిన్నవారి విషయమై ఏమోయి అనియు, పరిచయము లేనివారు, పెద్దవారు అగు అందరి విషయములోను "మీరు, తమరు, అండీ, గారు" అని ప్రయోగించుట ఉచితము. నీ సంభాషణలో యితరుల కెవ్వరికి దుఃఖముగాని అసూయగాని ద్వేషముగాని క్రోధముగాని అసహ్యముగాని, విసుగుగాని పుట్టకుండునట్లు ప్రసంగించవలెను. నీకు అధికారము, యోగ్యత ఉన్నప్పటికినీ అధీనములో నీ దయకు పాత్రులైన వారి విషయము నందైనను గర్వముతోగాని, అహంకార అభిమానములతోగాని. వ్యంగముగ గాని, అశ్లీలముగగాని, తిట్టుచుగాని, కఠినోక్తులతో గాని మాట్లాడకూడదు. ఇట్లు ప్రసంగించినచో నీ అసభ్యత్వమును వెల్లడించుకొనుటయే యగును.

నూతన వ్యక్తితో క్రొత్తగ పరిచయము కలుగజేసుకొను నపుడు తగినంత, అవసరము కలిగినంతవరకు వారి జాతినిగాని, మతమును గాని, వయస్సునుగాని, ప్రవర్తనను గాని, వృత్తిని గాని, వేతనమునుగాని ప్రశ్నించుట మంచిది గాదు.

సంభాషణలో కొద్దిపాటి హాస్యరసము అవసరమే. కాని దానిని హద్దుమీరి ఉపయోగించుట సర్వదా హానికరము. ఎదుటి వ్యక్తి నీతో మాట్లాడుచున్నపుడు "అవును, కాదు" అని అనుకూల జవాబు ఇచ్చుచుండినంతనే గాని నోరు మెదపకుండగ మొద్దువలె మౌనము వహించి యుండుట మంచిది గాదు.

సంభాషణలో ఆత్మస్తుతిగాని, పరనింద గాని, ఎంత మాత్రము జొరనివ్వరాదు.

నీయొక్క భావములను ఎదుటి వారు సులభముగాను, స్పష్టముగాను సంపూర్ణముగాను గ్రహించ కలుగునట్టి శిష్టపదముల నుపయోగించి మాట్లాడుటయే సంభాషణలో నేర్పు. ప్రయోజనము లేని ఎదుటివారికి సులభముగా అర్థము కానటువంటి కఠిన పదములుగాని, అన్య భాషా పదములు గాని, అశిష్టపదములనుగాని ఉపయోగించుట నీ మూఢత్వమును, అహంభావమును వెల్లడించుకొనుట మాత్రమే యగును.

అనవసరముగ ఎవరితోడను మాట్లాడకూడదు. ఎవరితోడనైనను మాట్లాడుటకు ముందు

నీవు మాట్లాడునది సత్యము, హితము ప్రియము అగునా యోజించుము. అటులైననే మాట్లాడుము.

ఎవరైననూ సరే నిన్ను పలుకరించినపుడు వారికి తగు సమాధాన మివ్వవలెను. అటులివ్వకుండగ యూరకుండట నీ మూర్ఖతను తెలివితక్కువ తనమును ప్రదర్శించుటయే యగును. ఇతరులను గూర్చి వారి పరోక్షముగ నెవ్వరితోడను దూరలాడకుము.

మిత్రులు, బంధువులు మొదలైన వారితో యున్నపుడు ఏదో ప్రసంగము చేయకున్న యెడల అది యసభ్యతగ నెంతురని గాని వారి నవమానించినటుల భావింతురని గాని తలచి వారితో అనవసర ప్రసంగము చేయకుము. మిత్రులుగాని బంధువులుగాని నీకెదురైనపుడు వారిని ఉచితరీతిగ పలుకరించవలెను. గాని మౌనము వహించి ఊరకుండుట అహంకార సూచకముగ నుండును.

నడుచు దోవలో గాని, సందులలో, రహస్య స్థలములలో గాని స్త్రీలతోను, అందులోను పరాయిస్త్రీలతో సంభాషించుట అనాగరిక లక్షణము.

ఏదో విషయమును గురించి దీర్ఘముగ ఆలోచనా నిమగ్నులై యున్న వారివద్ద గట్టిగా మాట్లాడ గూడదు. నీవడిగిన సమాధానము తెలుపనిష్టపడని సజ్జనుని సమాధానము కొఱకై బలవంతము చేయకూడదు. నీ ప్రశ్న నాయన వినలేదనిగాని, లేక పొరపాటున నీప్రశ్నకు సమాధాన మిచ్చుట మరచెననిగాని నీకు తోచినపుడు తప్పకుండా వినయ పూర్వకముగా తిర్గి ప్రశ్నింపవచ్చును.

నీ యభిప్రాయములతో సంపూర్ణముగా ద్వేషించు వారితోగాని సత్పురుషులచే అనాదరింపబడువానితో గాని, అనారోగ్యవంతునితో గాని అవసరము నతిక్రమించి అధికముగ నెంతమాత్రము సంభాషించరాదు.

కొందరు వ్యక్తులు ప్రత్యేకముగా సమావేశమై ఏకాంతముగ సంభాషించు కొనునపుడు సంభాషణలలో క్రోధమును ప్రవేశించనివ్వరాదు. ఒకవేళ దానిని నిలుపజాలనిచో అట్టి సమయముల యందు మౌనము ధరించుటయే యుచితము.

నీ మిత్రునిగాని లేక గౌరవనీయ వ్యక్తిని గాని నీ సన్నిహిత మిత్రుని గాని ఇతరులెవరైన నీయెదుట నిందించునపుడు వారి నటుల చేయవలదని వినయముతో కోరుము. వారటుల చేయనిచో ఆచ్చటనుండి నీవేమరొక స్థలమునకు లేచి పొమ్ము, ఏవైన సభా సమావేశములలో నీవు గూడ మాట్లాడుటకు అవసరము యోగ్యత యున్నదని తలచినచో తత్సమావేశ కర్తలు నిన్ను ఆహ్వానించలేదనిగాని కోరలేదనిగాని సందేహించబనిలేదు. వెంటనే మాటలాడవలెనను నీకోరికను ఆసమావేశకర్తలకు తెలియజేయుము. వారనుమతించిరా వారు నీకిచ్చిన కాలములో నీయభిప్రాయము అందరికి బాగుగా తెలియునట్లు మాట్లాడుము. నిర్ణీతకాలము

కంటె అధికకాలమును తీసుకొని వినువారిని అసమావేశకర్తలను విసిగించకుము. నీవు మాట్లాడుటకు నీకు అవకాశము ఇవ్వలేదా వారిపై కోపించక ఊరకుండుము.

సభలు సమావేశములు మొదలైన అనేక సమూహము లందు నీమిత్రునిగాని నీపరిచయస్థునితోగాని యితరులెవ్వరికిన్ని తెలియనటువంటి రహస్య-పారిభాషిక-సాంకేతిక పదములతో సంభాషించకూడదు. దీనిని వినిన యితరులు తమనుగురించి మీరేదో సంభాషించు చుందురని అనుమానపడెదరు. ఏవిషయము నైను నీయభిప్రాయము నడిగినపుడే చెప్పుము. గాని అనవసరముగ నీయంతట నీవేవిషయము గురించియు సలహానిచ్చుటకై ప్రయత్నించకుము. నీమాటలుగాని, చేష్టలుగాని ఎవ్వరికి అసహ్యముగగాని, కష్టముగాని కలిగించకుండునటుల జాగ్రత్త వహించుము.

నీవితరులకు ఏదైన చిన్నచీటి వ్రాసినను కూడ అది చదువుకొనువారికి సులభముగ నీఉద్దేశములు బోధపడునటులను, వారు నీపైఎట్టి దురుద్దేశముగాని అసహ్యతగాని పొందకుండునటులను ఆలోచించి జాగ్రత్తగా చక్కగా వ్రాయుము. చీటివ్రాసిన అనంతరము ఆచీటి అందుకొని వారివిషయమై నీమనస్సులో మంచి భావనలను తలంచి వాటిని చీటిపై ప్రసరించుము కొంతమంది సజ్జనులు ఎట్టి నూతన వ్యక్తితో నైనను చిన్నవ్యక్తితోనైనను అతిపరిచయముగను అతిచనువుగను మాటలాడుదురు. అది వారి అత్యధిక యోగ్యతాసూచకము. అట్టి వారితో వారి చనువును అపార్థ చేసుకొనక అత్యంతగౌరవముతోను వినయవిధేయతలతోను సంభాషించుము.

ఎట్టి మహావ్యక్తియందైనను ఎంచతగినటువంటి ఒకటి రెండు సుగుణములని చెప్పబడజాలని గుణము లుండవచ్చును. ఎంత దుష్ట, క్రూర, అజ్ఞాని వ్యక్తియందైనను ప్రశంసించతగినటువంటి సుగుణములుండి తీరును. గాన పరులయందలి దోషముల కనిపెట్టి వారిని నిందించుట కంటెను వారియందలి సుగుణములను గ్రహించి వారిని కూడ ప్రశంసించుటను అలవాటు చేసుకొనుము. నీతోసంభాషించు ఎదుట వారిని గురించి నీమనస్సులో మంచి తలంపు భావించుచు వాటిని వారిపై ప్రసరింపజేయుము. ఎంతటి తక్కువవారైనను సరే, అజ్ఞానులైనను నీతో ఏదైన మంచి సలహా తెలిపినపుడు, నీకుపకారము చేసినప్పుడున్ను, నీకు కొద్ది సహాయమునైనను సరే చేసినప్పుడున్ను వారికి నీధన్యవాదములను తెలుపుము.

ఎవరైనను తమ సంభాషణవలన నీకు కోపము ఉద్రేకమును కలుగ జేయవలెనని ప్రయత్న పూర్వకముగ ప్రయత్నించవచ్చును. అందువలన ఎప్పుడైన ఒకప్పుడు నీవు క్రోధమునకు ఉద్రేకమునకు ఆధీనుడవై పోవచ్చును. గాని అట్టి సమయములలో వెంటనే నీవు తిరిగి జవాబు చెప్పరాదు. నీ మనస్సులో కల్గిన మార్పులు ప్రకాశింపజేయరాదు. వెంటనే జవాబు చెప్ప ప్రయత్నించితివా నీ మనస్సులో

కలిగిన మార్పులు వెల్లడికాక మానవు. అందు వలన ఎదుట వారి సంకల్పము నెరవేరును. గాని అట్టి సమయములో కొద్ది నిమిషములు మౌనముగ యుండి వినయ పూర్వకముగ జవాబును, ఆలోచించి చిరునవ్వుతో తెలుపుము. లేకపోయిన నీవు మనశ్శక్తిని కోల్పోయి ఎదుట వారికి లొంగిపోయిన వాడవగుదువు. అపుడు ఎదుట వారు విఫలమనోరథులగుదురు, అందువలన నీకు ఏ హానియుకలుగదు. నీమనశ్శక్తియు వృద్ధి పొందును. క్రోధముతో పలికిన పలుకులు వాడిగల ములుకులవంటివి. బాణముపై నుండునది. శరీరమునకే గ్రుచ్చుకొనును. శరీరముయొక్క పుండు మానును గాని మనస్సుయొక్క పుండు మానదు. కాలుజారిన తీసుకొనవచ్చును గాని మాటజారిన తీసుకొనుట అసంభవము.

నీయెదుట నిన్ను స్తుతించువారు నిజముగ నీకు మహాహానియే కలిగించుచున్నారని తలచుము. వారు నిన్ను మోసము చేయుచున్నారనియే తలచుము. అట్టివారితో వెంటనే వినయముతో నిన్నుగురించిన స్తుతిని మానివేయవలసినదనియు అది నీకు కష్టముగ నున్నదనియు తెలుపుము. అప్పటికిని వారు మానకపోయిన చో అచ్చటనుండి లేచిపొమ్ము.

ఎవరైన నిన్ను నిందించుటకై గాని వ్యంగముగా శ్లేషతోటి మాట్లాడ వచ్చును. అట్టి వారితో అధిక ప్రసంగము చేయక అవసరమైన ఒకటి రెండు మాటలు వినయముగనే తెలిపి మౌనము వహించుము. లేనిచో అచ్చటినుండి లేచిపొమ్ము. నీవయస్సునకు, నీయోగ్యతను మించిన మాటలను ఎన్నడూ ఆడకూడదు. నీకు తెలియని విషయమునుగురించి ప్రసంగించరాదు. నీయొక్కగాని, యితరులయొక్కగాని యేదైనా వ్యవహారిక విషయములను గురించిగాని, ఆర్థిక, రాజకీయ, సాంఘికముగ సంబంధించి నటువంటి విషయముల గురించిగాని, నీపెద్దలయొక్క, నీహితులయొక్క సలహాను తీసుకొనకుండగ యెవరితోను యెన్నడు సంభాషించరాదు.

బాగుగా నమ్మదగినటువంటి వారిద్వారా వినిననే తప్ప నీవు విన్న ప్రతివిషయమును గురించియు అందరితోనూ ప్రసంగించకుము. నమ్మదగిన విషయములలో కూడ రహస్యముగ యుంచవలసిన దానిని రహస్యము గానే యుంచుము. మాటయే మంచిగ యుపయోగించిన మర్యాద తెచ్చును. మానము కాపాడును. ప్రాణమునిచ్చును. ధనవంతునిచేయును. అదియే విరసముగ నుపయోగించిన మర్యాదపోగొట్టును. మానమును ధ్వంసముచేయును. ప్రాణమును హరించును. దరిద్రునిచేయును.

భగవంతుని స్వాధీనపరచుకొను మంత్రము కూడ మాటయే యను విషయమును మరువకుము.

సత్యమే భగవంతుడు. సత్యమే యేనాటి కైనను జయించితీరును. సత్యమునే ఆధారము గను జీవముగను తలంచువారు నిజముగా ధన్యులు. సత్యముకంటె రక్షించునది ప్రపంచమున మరేదియులేదు. పరిహాసమునకైనను

కలయందైననుకూడ అసత్యమాడకుము.

సత్పురుషుల సమావేశమునందు, పరోపకారార్థమైన పనులయందు, దేవాలయములు పుణ్యతీర్థములు మొదలైనవాట్లయందు, అత్యవసరమైన పనికలిగినపుడు తప్ప జనసమూహము లోనికి పోవలదు. సాధ్యమైనంత వరకు ఏకాంతముగను, మౌనముగను యుండుము. మౌనము కల మాహాత్మ్యము, పాపనాశనము. అధికప్రసంగమును, అనవసర ప్రసంగమును, ఆత్మస్తుతిని, పరనిందను, అతిశయోక్తులను ప్రయత్నపూర్వకముగా మానివేయుము. మననాలుక అసత్యము లాడు స్వభావముకలదగునేని ప్రథమమున రెండు సార్లయినను ప్రయత్నపూర్వకముగా అసత్యమును జయించి సత్యమును తెలుపుటకు ప్రయత్నించుము. నీవు ఒకవేళ తెలియక అసత్యమును సత్యమని భ్రమపడి మాట్లాడినచో అది అసత్యమని తెలిసినవెంటనే హృదయపూర్వకముగ పశ్చాత్తాపపడి క్షమార్పణ గోరుకొనుము. సత్యమే యెప్పటికిని జయముపొందును. సత్యమునే ఆధారముగను, జీవితముగను తలంచువారు నిజముగ ధన్యులు. సత్యపథమును విడనాడకుండుటవలననే పంచభూతములు, సూర్యచంద్రులు చరించుచుండుటవలననే అవి లోకములో అంతప్రకాశవంతములై విరాజిల్లుచున్నవి వాటి ఆధారమున ఈ ప్రపంచ చక్రము తిరుగుచున్నది. లేనిచో యీక్షణముననో ప్రళయము సంభవించి యుండవలసినదే. సత్యముయొక్క ప్రభావము అత్యద్భుతమైనది.

పన్నెండు సంవత్సరములు మనోవాక్కాయకర్మ సత్యము ననుష్ఠించునెడల తాను నోట వచించినదెల్ల, తలచినదెల్ల సిద్ధించు ప్రభావము కలుగును. సత్యస్వరూపుడగు భగవంతుడు సత్యవాక్య సంపన్నులకే గాని కనుపించడు.



శ్రీమతే రామానుజాయ నమః

శ్రీ ఆళవందారులు శ్రీమహాలక్ష్మి విషయమున సాయించిన

# చతుః శ్లోకి

(టీకా తాత్పర్య సహితము)

"శ్రీమన్నారాయణ"

—:o:—

## సవినయవినతి

'చతుః శ్లోకి' యను ఈ చిన్ని స్తోత్రమును శ్రీవిశిష్టాద్వైత సిద్ధాంత నిర్ధారణ సార్వభౌములున్ను, చతుర్వేద షట్ఛాస్త్రాది సకలవిద్యా పారంగతులునగు శ్రీమద్యామునాచార్యులు వారు (వీరికే ఆళవందారను నామాంతరము కలదు.) జగన్మాతయగు శ్రీమహాలక్ష్మి విషయమున సాయించిరి,

ఈ స్తోత్రము రూపమున చిన్నదైనను అర్థమున-భావమున మహావిపులమైనది. ప్రతిమానవుడు దీనిని ప్రతినిత్యము అవశ్యము పఠించవలసినది. విశేషించి శుక్రవారములయందు శ్రీలక్ష్మీకటాక్ష పాత్రులు కాదలచినవారు అర్థానుసంధానపూర్వకముగ సేవించవలసిన స్తోత్రరాజమిది.



తనియన్.

శ్లో. యత్పదాంభోరుహధ్యాన
విధ్వస్తాఽశేషకల్మషః,
వస్తుతా ముపయాతోఽహం,
యామునేయం నమామ్యహమ్.

టీక: అహం - నేను
యత్ప. కల్మషః
యత్ - ఏ ఆళవందారులయొక్క
పదాంభోరుహ - పదకమలములయొక్క
ధ్యాన - ధ్యానము చేత
విధ్వస్త - నశింపచేయబడిన
అశేష - సమస్తమైన
కిల్బిషః - పాపములుగలవాడనై
వస్తుతాం - ఒకవస్తువుగానుండుటను
ఉపయాతః - పొందితినో
తం - అట్టి
యామునేయం - యమునాదేవి కుమారులైన ఆళవందారులను
నమామి - నమస్కరించుచున్నాను

తా. శ్రీఆళవందారులనెడు ఆచార్యులయొక్క పదకమలములను ధ్యానముచేసి దానిచే సకల పాపములనుండి తొలఁగినవాఁడనైన నేను ఒక వస్తువుగా నుండుటంబట్టి యమున మునులైన ఆచార్యులను నమస్కరించుచున్నాను.

ఈ మొదటిశ్లోకమునందు శ్రీమహాలక్ష్మీదేవి నిత్యవిభూతికిని లీలావిభూతికిని స్వామినియై యుండుట మొదలుగాఁగల కల్యాణగుణములను కృపచేయుచున్నారు.

శ్లో. కాంతః స్తే పురుషోత్తమః ఫణిపతిః,
శయ్యాఽఽసనం వాహనం
వేదాత్మా విహగేశ్వరో యవనికా,
మాయా జగన్మోహినీ,
బ్రహ్మేశాది సురవ్రజ స్సదయితః
త్వద్దాస దాసీగణః,
శ్రీ రిత్యేవ చ నామ తే భగవతి,
బ్రూమః కథం త్వాం వయమ్. ౧.

ప్ర. తే - నీకు
కాంతః - భర్త
పురుషోత్తమః - పరమపురుషుఁడైన విష్ణువు.
ఫణిపతిః - సర్పరాజైన ఆదిశేషుఁడు
శయ్యా - పానుపు.
ఆసనం - ఆసనము.
వేదాత్మా - వేదస్వరూపుఁడైన
విహగేశ్వరః - పక్షిరాజైనగరుత్మంతుడు.
ఆసనం - ఆసనము
వాహనం - వాహనము.
జగన్మోహినీ - లోకమును భ్రమింపఁజేయు
మాయా - మూలప్రకృతి
యవనికా - తెర.
సదయితః - పత్నులతోఁగూడిన
బ్రహ్మేశాదిసురవ్రజః.
బ్రహ్మ - బ్రహ్మదేవుఁడు
ఈశ - శివుఁడు
ఆది - మొదలుగాఁగల
సురవ్రజః - దేవసమూహము
త్వద్దాసదాసీగణః -
త్వత్ - నీకు
దాసః - భృత్యసమూహముగాను
దాసీగణః - పరిచారికా సమూహముగాను (ఉన్నది)
తే - నీకు
శ్రీః. ఇతి, ఏవ, చ - "శ్రీ" అనియే
నామ - పేరు
భగవతి - సర్వమంగళగుణములతోఁగూడిన
శ్రీ మహాలక్ష్మీదేవి !
వయం - మేము
త్వాం - నిన్ను
కథం - ఏమని
బ్రూమః - చెప్పగలము.

తా. శ్రీమహాలక్ష్మీదేవీః పరమపురుషుఁడైన శ్రీమన్నారాయణుఁడు నీకు భర్త. ఆదిశేషుఁడు శయ్యగను ఆసనముగనున్నాఁడు. వేదమూర్తియైన గరుత్మంతుఁడు నీకు వాహనముగను ఆసనముగను నున్నాఁడు. బ్రహ్మదేవుఁడు రుద్రుఁడు మొదలగు దేవతలు నీకు సేవకులుగనున్నారు. సరస్వతి పార్వతి మొదలగు దేవతాస్త్రీలు నీకు ఊడిగములు చేయువారుగ నున్నారు. శ్రీయనెడి పేరు నీకు గలిగియున్నది. కావున సకలకల్యాణ గుణములతోఁగూడిన నిన్ను నెట్లుస్తుతింపగలము? అనఁగా నీయొక్క కల్యాణగుణములు అపారము గాన పొగడుటకెవ్వరికిని సాధ్యముకాదని భావము.

శ్రీ మహాలక్ష్మియొక్క సౌలభ్యగుణమును అనుసంధించి స్తుతించుటకు సాధ్యము కాకపోయి

తన దాసులయందు వాత్సల్యముగల శ్రీలక్ష్మీదేవి తమయందు అనుగ్రహము చేయగలదని చెప్పుచున్నారు.

శ్లో. యస్యాస్తే మహిమాన మాత్మన ఇవ
　　త్వద్వల్లభోఽపి ప్రభుః
　నాలం మాతు మియత్తయా నిరవధిం
　　నిత్యానుకూలం స్వతః,
　తాం త్వాం దాస ఇతి ప్రపన్న ఇతి చ
　　స్తోష్యా మ్యహం నిర్భయో
　లోకైకేశ్వరి లోకనాథ దయితే
　　దాన్తే దయాం తే విదన్.　　౨.

టీ. యస్యాః - ఏ
　తే - నీయొక్క
　నిరవధిం - హద్దులేనిదిగాను
　నిత్యానుకూలం, నిత్య - సర్వకాలమును
　అనుకూలం - అనుకూలముగను (ఉండునట్టి)
　మహిమానం - మాహాత్మ్యమును
　త్వద్వల్లభోఽపి,
　త్వత్ - నీయొక్క
　వల్లభోఽపి - ప్రియుఁడైన భగవంతుఁడుకూడ
　ఆత్మనః - తనయొక్క
　మహిమానం ఇవ - మహిమవలెనే
　ఇయత్తయా - ఇంతమాత్రమని
　మాతుం - నిర్ణయించుటకు
　ప్రభుః - సమర్థుఁడు
　నఅలం - కాఁడు
　హే లోకనాథదయితే,
　లోకనాథ - లోకములకు ప్రభువైన భగవంతునకు
　దయితే - ప్రియురాలా!
　హే లోకైకేశ్వరి - సకలలోకములకు ఒకఁడేనాయకుఁడైన భగవంతునికి మహిషియైన శ్రీమహాలక్ష్మీదేవి!
　దాన్తే - ఇంద్రియములను నిరోధించిన ప్రపన్నులయందు
　తే - నీయొక్క
　దయాం - దయను
　విదన్ - తెలుసుకొన్నవాడగుచు,
　అహం - నేను
　తాం - అట్టిమహిమగల
　త్వాం - నిన్ను
　దాస ఇతి - దాసుఁడవనియును
　ప్రపన్న ఇతి - ప్రపన్నుఁడననియును (ఎంచి)
　నిర్భయః - భయములేనివాఁడనై
　స్తోష్యామి - స్తుతింపఁబోవుచున్నాఁడను.

తా. శ్రీమహాలక్ష్మీదేవి! సర్వము నెఱింగిన వాఁడును నీకు ప్రియుఁడును నగు భగవంతుఁడు తనమహిమ నెట్లు ఇంతయని నిర్ణయించి తెలిసికొనలేఁడో, అటులనే నిర్ణయింప సాధ్యముకానిదియును సకలచేతనులకును అనుకూలమును నైనట్టి నీయొక్క మహిమను ఇంతయని నిర్ణయించుటకు శక్తిలేనివాఁడై యున్నాఁడు. అయినను జితేంద్రియులైన ప్రపన్నులయందు నీవు మిగులదయతో గూడియుండుటను నేనెఱింగిన వాఁడనగుటచేత నీకు దాసుఁడుగను ప్రపన్నుఁడుగనునుండు దాసునియందు అనుగ్రహము చేయుదువని ఆ ప్రకారమైన మహిమతోడ (అపారమహిమతోడ) గూడిన నిన్ను నిర్భయుడనై నుతించుటకు యత్నించుచున్నాను.

శ్రీమహాలక్ష్మీదేవి ఆశ్రయించువారిని ఫలమొసంగునది యనియును భక్తసులభయనియును పురుషార్థదాయిని యనియును నిరూపించుచున్నారు.

శ్లో. ఈష త్త్వత్కరుణా నిరీక్షణ సుధా–
సంధుక్షణా ద్రక్ష్యతే
నష్టం ప్రాక్తదలాభత స్త్రిభువనం
సంప్రత్యనన్తోదయం,
శ్రేయో నహ్య రవింద లోచన మనః
కాన్తా ప్రసాదా దృతే
సంసృత్య క్షర వైష్ణవాధ్వసు నృణాం
సంభావ్యతే కర్హిచిత్.

టీ. ఈష......క్షణాత్.
ఈషత్ - స్వల్పమైన
త్వత్ - నీయొక్క
కరుణా - దయతో కూడుకున్న
నిరీక్షణ - చూపులను
సుధా - అమృతముయొక్క
సంధుక్షణాత్ - వృద్ధిచేయుటవలన
త్రిభువనం - ముల్లోకములును
రక్ష్యతే - రక్షింపఁబడుచున్నవి
ప్రాక్ - పూర్వము
తదలాభతః, తత్ - ఆకటాక్షమును
అలాభతః - పొందకపోవుటవలన
నష్టం - నాశనమైనది
సంప్రతి - ఇప్పుడు
అనన్తోదయం. అనన్త - అంతములేని
ఉదయం - జన్మములు గలెను
అరవింద...... దృతే,
అరవిందలోచన-పుండరీకాక్షుఁడైన భగవంతునియొక్క
మనఃకాన్తా - మనస్సున కాహ్లాదకారిణియైన
మహాలక్ష్మి దేవియొక్క
ప్రసాదాదృతే - అనుగ్రహమువలన తప్ప
సంసృత్యక్షరవైష్ణవాధ్వసు,
సంసృతి - సంసారమందుగాని
అక్షర - కైవల్యమందుగాని
వైష్ణవాధ్వసు - పరమపదమునందుగాని
నృణాం - చేతనులకు
శ్రేయః - శ్రేయస్సు
కర్హిచిత్ - ఒక్కప్పుడును
నసంభావ్యతే హి - కలుగుటలేదు కదా.

తా. శ్రీమహాలక్ష్మి దేవీ! నీయొక్క దయకు కారణమైన కటాక్షామృతలేశముచేత ఈత్రిలోకములయందుండువారును రక్షింపబడుచున్నారు. నీకటాక్షము లేని సమయమునందు నశించెదరు. మరల వారు నీయొక్క కటాక్షమును పొందిన యెడల సృష్టింపబడెదరు. ఈ యాత్మలకు ఈ భూలోకమునందు ఐశ్వర్యముల ననుభవించుట యందును, కైవల్యము సంబాత్మానుభవము చేయుటయందు పరమపదమునందు బ్రహ్మానుభవము చేయుటయందును, శ్రీమహాలక్ష్మియొక్క దయలేనిచో ఒకప్పుడును వీరికి శ్రేయస్సు కలుగుటలేదుకదా.

శ్రీ మహాలక్ష్మి దేవి భగవంతుని యొక్క స్వరూపముతోడను, దివ్యమంగళ విగ్రహము తోడను సదా కూడియున్నదనియును, భగవంతునివలెనే మోక్షప్రదురాలనియును జెప్పు చున్నారు.

శ్లో. కాన్తా స్త్వ మహో విభూతి పరమం
యద్బ్రహ్మ రూపం హరేః
మూర్తం బ్రహ్మ తతోపి త త్ప్రియతరం
రూపం య దత్యద్భుతం,
యాన్యన్యాని యథాసుఖం విహరతో
రూపాణి సర్వాణి తా
న్యాహు స్స్వైరనురూప రూప విభవై
గాఢోపగూఢాని తే. ౪.

టీ. శాన్తాన న్త మహావిభూతి
శాన్త - దోషరహితమైన
అనన్త - లెక్కింపఁ శక్యముగాని
మహావిభూతి - అధికైశ్వర్యములోఁగూడుకున్నట్టియు
పరమం - అన్నిఁటికంటె శ్రేష్ఠమైనట్టియు
బ్రహ్మ - గొప్పమహిమగలిగినట్టియు
హరేః - భగవంతునియొక్క
రూపం - దివ్యాత్మస్వరూపము
యత్ - ఏదిగలదో
తేభ్ అపి - ఆదివ్యాత్మస్వరూపముకంటెను
ప్రియతరమ్ - మిగులప్రియమైనట్టియు
మూర్తం - దివ్యమంగళవిగ్రహములోఁగూడినట్టియు
అత్యద్భుతం - మిక్కిలి ఆశ్చర్యకరమైనట్టియు
తత్ - అప్రసిద్ధినిబొందిన
రూపం - పరవాసుదేవరూపమైనది
యత్ - ఏదిగలదో
యథాసుఖం - సౌఖ్యముగ
విహరతః - క్రీడించుచుండు (భగవంతునియొక్క)
అన్యాని - ఇతరములైన
రూపాణి - వ్యూహవిభవాదులైన రూపములు
యాని - ఏవిగలవో
తాని - అట్టి
సర్వాణి - సమస్తములైన భగవద్రూపములు
తే - నీయొక్క
స్వైః - స్వకీయములైన
అనురూప రూపవిభవైః
అనురూప - తగినట్టి
రూప - అవతారములయొక్క
విభవైః - సంపదలచేత
గాఢోపగూఢాని - గాఢ - దృఢముగా
ఉపగూఢాని - చేర్పఁబడియున్నవానినిగా
ఆహుః - చెప్పుచున్నారు.

తా. క్షుత్పిపాసాది సర్వదోషములు లేనట్టియు దేశకాల స్వరూపములచేత లెక్కింప శక్యము కానట్టియు, అన్తములేనట్టియు, నిత్యవిభూతియనియు లీలావిభూతియనియును ద్వివిధవిభూతులు గలదియును, అన్నిటికంటె శ్రేష్ఠమైనదియును, అన్నిఁటికంటె అధికమైనదియునగు భగవంతునియొక్క దివ్యస్వరూపమునందును, రూపౌదార్యాదిగుణములచేత ఆ దివ్యాత్మస్వరూపము కంటెను ధ్యానముచేయువారికి మిగుల ప్రియమైనదిగను, దానిని సేవించువారికిమిగులఆశ్చర్యమొందఁదగినదిగను; మఱియు తన స్వేచ్ఛ ప్రకారము క్రీడార్థముగాఁ గావింపఁబడియుండు వ్యూహావతారములనియు విభవావతారములనియు, అర్చావతారములనియు పేరొందిన దివ్యావతార రూపములన్నిఁటి యందును; ఆయా రూపములను దగినట్లు నీయొక్క దివ్యరూపములు సదా యెడబాయక చేరియున్నవని శాస్త్రవేత్తలు చెప్పుచున్నారు.

భక్తులందరు దీనిని అనుసంధించుచు పురుషకారభూతురాలైన శ్రీలక్ష్మీదేవియొక్క దయకు పాత్రులగుదురుగాక.



# పంచోపనిషన్మయము

శ్రీమన్నారాయణ



అసలు తత్త్వములు మూడు:– ౧. చిత్తు ౨. అచిత్తు 3. ఈశ్వరుడు. ఇందు అచిత్తు తిరిగి మూడు విధములుగ యుండును.

౧. శుద్ధసత్త్వము.

౨. మిశ్రసత్త్వము.

3. సత్త్వశూన్యము.

ఇందులో శుద్ధసత్త్వము నిత్యవిభూతిరూపమై విరజానదికిఅవతల భగవత్–భాగవత–యిచ్ఛానుసారముగ ఆరామ–గోపుర–ప్రాకార–మంటప తటాక–ప్రాసాదాది (బహురూపేణ) అగణితమై అప్రమేయమై నిత్యమై కల్యాణప్రదమై, ఆనంద జనకమై, సుఖావహమై, శ్రేయోదాయకమై యుండును.

పరమపదమందలి భగవత్–భాగవత విగ్రహాదు లన్నియు ఈశుద్ధసత్త్వమయములే.

ఈశుద్ధసత్త్వము కూడ అచిత్తుయొక్క అవాంతరభేదమే అయినను దానియొక్క హేయ రాహిత్యాది గుణవిశేషమును బట్టి అది అప్రాకృతమని వ్యవహరించబడుచున్నది. వికారాస్పదమైన మూలప్రకృతియొక్క అవస్థ మొదలు తదనంతర అవస్థల బొందు అచిత్తు అంతయు మాత్రము ప్రకృతి అని వ్యవహరించబడు చున్నది.

కనుకనే నిత్యవిభూతిని, తదవాంతర వస్తు సముదాయమును అప్రాకృతమని నిర్ణయించిరి.

శ్రీపరమపదవాసుని దివ్యమంగళ విగ్రహము గూడ యిట్టి అప్రాకృతమైనదియే. దీనినే పంచోపనిషన్మయమని యందురు.

ఈశుద్ధసత్త్వమునకు అయిదు అధిష్ఠాన దేవతలు, తత్ప్రతిపాదకమైన ఉపనిషత్తులు ప్రధానమైనవి అయిదున్ను, అందు మూలభూతములైన ప్రధానబీజాక్షరములు అయిదున్ను గలవు.

ఇట్టి పంచోపనిషత్ప్రతిపాదకమై తదధిష్ఠాన దేవతాత్మకమై, తద్బీజాక్షర–సంఘటిత–మూలమై విలసిల్లు మూర్తియే పరమపదనాథుని భవ్యమైన దివ్యమూర్తి.

| పంచోపనిషన్మయ బీజములు | పంచోపనిషన్మయాధిష్ఠానస్వరూపములు | స్థానములు |
|---|---|---|
| (ఓం) షాం | పరమేష్ఠీ | శిరస్సు. |
| యాం. | పురుషః | నాసాగ్రము |
| రాం. | విశ్వాత్మా. | హృదయము. |
| వాం. | నివృత్తాత్మా. | గుహ్యము. |
| లాం. | సర్వాత్మా. | పాదములు. |






# ★ మోక్షసాధనము ★

న. చ. ఆండాళమ్మగారు.

మోక్షమునకు హరిభక్తియొక్కటేసాధనము. మరి సాధనమేదియులేదు. భక్తి యనగా మనోవాక్కాయకర్మలచే సర్వకాల-సర్వావస్థల యందును తైలధారవలె అవిచ్ఛిన్నముగా భగవానుని స్మరించుచుండుట. ఇది ఎట్లు కలుగును? భగవంతుని యందుమాత్రము ప్రీతియు, భగవదేతరములయందు వైరాగ్యమున్ను యుండిన కలుగును. మనకి మనతల్లి తండ్రులమీదను, భర్తమీదను, మన సంతానముమీదను, ఇష్టమైన యనుభవముల మీదను ఎట్టుల ప్రీతి కలుగుచున్నది? అవి మనకు కావలసినవని నిర్ణయించుకొని వాటి యందుగల గుణములను ప్రేమించుచుండుట చేతనేకదా. అట్టులనే భగవంతునితో మనకుగల నవవిధసంబంధములను

శ్లో॥ పితా చ రక్షక శ్శేషి ।
భర్తాజ్ఞేయో రమాపతిః ।

తెలుసుకొని ఆయనను ప్రేమించ నిశ్చయించుకొని తదేక ధ్యానముతో అభ్యసించుట వలన భగవంతునియందు మనకు ప్రేమ కలుగగలదు.

మనము సర్పమునుజూచిన భయపడుదుము. విషమునుజూచిన అసహ్యపడుదుము. ఎందుచేత? అవి మనకుహాని కలిగించునవనియు, మనకవసరమైనవి కావనియు నిర్ణయించుకొని వానియందలి దోషములను ద్వేషించు చుండుట చేతనేకదా. ఇందువలన వీనిపై మనకు విరక్తి కలుగుచున్నది దానివలన వానిని విడిచిపెట్టుచున్నాము.

అనగా మనము ప్రేమించ దలచినవానియందు గుణమును మాత్రమే గ్రహించుచుండవలయును కనుక మనకు కావలసినది భగవంతుడు. గాన భగవంతునియందలి కల్యాణగుణములనే గ్రహించవలయును. అక్కరలేనివి భగవదేతరములు గాన వాని యందలి అల్పత్వ-అస్థిరత్వ-హానికరత్వ-స్వరూప విరుద్ధత్వాది దోషములనే గ్రహించవలయును.

భగవంతుడు తప్ప దోషములులేని పదార్థ మేదియు ప్రపంచమున లేదు.

లోకములో భగవంతుని ద్వేషించు జనులు కూడ కొందరున్నారు. వారి ద్వేషమునకు కారణము భగవంతుని యందలి దోషములు కావు. దీనికి కారణము కేవలము వీని అజ్ఞానమే. మన ముఖమందలి మాలిన్యము స్వచ్ఛమైన అద్దములో ప్రతిబింబించుట లేదా?

అయితే ఈభక్తిని ఎంతకాలము అభ్యసించిన ఫలవంతమగును. భక్తినిష్ఠకి పరిమితిలేదు. ఈ ఆత్మ ఈ శరీరమును విడుచుటవరకుగల కాలమే దీని పరిమితి. అది ఒక క్షణమే కావచ్చును, లేదా కొన్ని సంవత్సరములే కావచ్చును.

దానికొక ఉదహారణ తెలిపెదను.

ఒకప్పుడు దేవతలకు దానవులకూ గొప్ప యుద్ధము జరిగెను. రాక్షసులు బలశాలులై యుండిరి. దేవతలకు ఓటమిస్థితి సంభవించెను. అప్పుడు భూలోకమున ఖట్వాంగుడను రాజశ్రేష్ఠుడు రాజ్యమేలుచుండెను. అతనుకడుంగగు బలవంతుడు. మహాజ్ఞానవైరాగ్య సంపన్నుడు. దూరదర్శి. ఈతనిని దేవతలు సహాయముకోరిరి. వల్లెయని ఇతను వెళ్ళి రాక్షసుల ఓడించెను. దేవతలు విజయులైరి. సంతుష్టులైన దేవతలు ఖట్వాంగుని తమవల్ల ఏదైన వరమడుగు మనిరి. జ్ఞానియైన ఖట్వాంగుడు తన కింకను ఎంత ఆయుర్దాయము కలదో తెలుపమనెను. దేవత లాలోచించి లెఖకట్టి ఇంక రెండు ఘడియలు మాత్రమే అతని కాయుఃపరిమితి కలదని తెలిపిరి.

తెలివిగల ఖట్వాంగుడు తన ఆయుష్షును తెలుసుకొని చాల సంతోషించెను. దివ్యమని భూలోకమునకు దిగెను. తన పుత్ర–మిత్ర–కళత్ర ధన–ధాన్య–పశు–అన్నాది సమస్తమును సవాసగ్న విడిచిబుచ్చెను. మహావైరాగ్య సంపన్నుడై ఏకాంతస్థానమున ఏకాగ్రచిత్తుడై భగవంతుని ఆకొద్దిసేపు పరమప్రీతితో ధ్యానించెను. ఇతని భక్తికి మెచ్చిన భగవంతుడు వెంటనే ఇతనికి మోక్షమిచ్చెను.

నిశ్చలమైన భక్తియే భగవంతునికి కావలసినది. అంతే కాని దాని కాలపరిమితితో గాని లేక వీని వర్ణ–ఆశ్రమ–వయో–అంగాదులతో గాని భగవంతునికి పనిలేదు. గాన మనము కూడ ఇతర విషయవైరాగ్యచిత్తులమై భగవంతుని ప్రేమించి, ధ్యానించి తరించ ప్రయత్నింతుము గాక.



ప్రచార విభాగము.

# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ
# శుక్రవారోత్సవములు

## అర్తమూరు.

13-10-50 కోనాల సుబ్బిరెడ్డి భార్య ఆదెమ్మగారు.

20-10-50 సబ్బెళ్ల నొల్లారెడ్డి భార్య పేరమ్మగారు.

27-10-50 సత్తి సూరయ్య భార్య సూరమ్మగారు.

3-11-50 లంక వీరాజు భార్య రవణమ్మ గారు

## మైలవరము

18-8-50 మైలవరపు శ్రీవెంకటేశ్వర దేవాలయములో

25-8-50 ,,

1-9-50 ,,

8-9-50 ,,

కస్తూరి మహిళా దేవికన్య 1-0-0 నిధి ఇచ్చెను.

## మదరాసు

మదరాసు శ్రీయతిరాజసేవా మహిళాసమితి కార్యదర్శి శ్రీమతి పువ్వాడ మంగమ్మగారిచే వరదా ముత్తియప్పన్ వీధిలోని సుధానిధిలో ఈ నెలలోని శుక్రవారోత్సవము లన్నియు జరుపబడినవి. తిరునెడుం దాండగం కాలక్షేపము జరుగుచున్నది.

## విజయవాడ

| | | వచ్చిన నిధి |
|---|---|---|
| 4-8-50 | కె. ధనమ్మ | 1-8-0 |
| 11-8-50 | కె. ధనమ్మ | 1-10-0 |
| 18-8-50 | జి. నాధనాయకమ్మగారు | 2-0-0 |
| 25-8-50 | కె. ధనమ్మ | 1-9-0 |
| 1-9-50 | సన్నిధిలో | 1- 0-0 |
| 8-9-50 | కె. ధనమ్మ | 1- 2-0 |
| 15-9150 | కె. ధనమ్మ | 1-13-6 |
| 22-9-50 | కె. ధనమ్మ | 1- 8-0 |
| 29-9-50 | కె. ధనమ్మ | 2- 3-6 |

## విశాఖపట్టణము

| | | |
|---|---|---|
| 4-8-50 | భక్తురాలు. | 0-4-0 |
| 11-8-50 | వ. వెంకటనరసమ్మగారు | 0-4-0 |
| 18-8-50 | రా. రామయ్యమ్మగారు | 0-4-0 |
| 25-8-50 | వా. ఆండాళ్లు. | 0-4-0 |
| 29- 9-50 | తాసరి నాగామణి. | 0-8-0 |
| 6-10-50 | క. లక్ష్మీనరసమ్మగారు | 0-8-0 |
| 13-10-50 | కొత్త అచ్యుతాంబగారు | 0-8-0 |
| 20-10-50 | వ. వెంకటనరసమ్మగారు | 0-8-0 |

## బందరు.

బందరులోని శ్రీయతిజసేవా మహిళాసమితి కార్యదర్శి శ్రీమతిరింగంటి సీతమ్మగారిచే ఈనెల

లోని శుక్రవారోత్సవము లన్నియు గొడుగుపేట లోని శ్రీ వెంకటేశ్వరస్వామివారి కోవిలలో జరుపబడినవి.

### కోరుకొండ.

కోరుకొండలోని శ్రీయతిరాజసేవా మహిళా సమితికార్యదర్శి శ్రీమతి మరింగంటి రంగనాయకమ్మగారిచే వారిస్వగృహమున ఈనెల శుక్రవారోత్సవములన్నియు జరుపబడినవి.

### అర్తమూరు

అర్తమూరులోని శ్రీయతిరాజసేవా మహిళా సమితి కార్యదర్శి శ్రీమతి తాడి గంగమ్మ, మహాలక్ష్మమ్మ వగైరాలచే వివిధప్రాంతము లందు ఈనెల శుక్రవారోత్సవము లన్నియు జరుపబడినవి.

### విశాఖపట్టణము

విశాఖపట్టణ శ్రీయతిరాజ సేవామహిళా సమితివారగు శ్రీమతి నారి ఆండాళమ్మ, రామసీమ నారాయణమ్మ మొదలగువారిచే ఈనెల శుక్రవారోత్సవము లన్నియు బాగుగా జరుపబడినవి.

---

## ఏకాదశి ఉత్సవములు

### విశాఖపట్టణము

| | | |
|---|---|---|
| 9-8-50 | భక్తురాలు. | 0 4 0 |
| 24-9-50 | డా. సుబ్బారావు. | 0 4 0 |
| 3 9 50 | డా. మధుసూధన్ | 0 4 0 |
| 22-9-50 | రా. వెంకటరాములు నాయుడుగారు. | 0 4 0 |

### అర్తమూరు

22-10-50 కీ. శే. కొవ్వూరి సత్తిరెడ్డి భార్య మహలక్ష్మమ్మగారిపేర జరిపినారు.



ఓం తత్ సత్.

శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః.

    

శ్రీమతే రామానుజాయ నమః.

# శ్రీ గీతా సందేశ మహోత్సవము

## శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము - మదరాసు, శాఖ

కార్యాలయము:— 147, అణ్ణాపిళ్లై వీధి, మదరాసు 1.

### —: ఆహ్వాన పత్రిక :—

ప్రపంచమున అనేకానేక మతము లున్నవి. ప్రతి మతమునకు ఆ మత తత్వమును తెలుపు గ్రంథము చిన్నదో పెద్దదో ఒకటి తప్పక యున్నది. ఆ గ్రంథమందలి విధులను చక్కగా తెలుసుకొని వాని ననుసరించుట ఆ మతానుయాయుల కందరకు విధియైయున్నది. అటుల చేసిననాడే వాడు ఆమతస్థుడన చెల్లును.

క్రైస్తవ మతస్థులు బైబిలును చదువుదురు. మహమ్మదీయులు ఖురానును పఠింతురు. హిందువుడు హిందూమత గ్రంథములను చదువని యెడల, దాని యందలి విషయముల తెలుసుకొనని యెడల, తెలుసుకున్న సద్విషయముల ఆచరించజాలని యెడల హిందువు డెటుల యగును? కేవలము హిందూ శబ్ద వాచ్యులమైనంత మాత్రమున హిందూత్వము మనకెట్లు సిద్ధించును.

హిందూమత గ్రంథమేది? వేదము. శ్రీమన్నారాయణుండు స్వయముగా శ్రీకృష్ణుడై అవతరించి సనాతనమగు ఆ వేదమందలి విషయములనే సర్వజన సుభోదకమగునటుల చక్కగా వెల్లడించెను. దానికే భగవద్గీత యని పేరు. దీని ననుసరించియే పూజ్యుడగు వ్యాసమహర్షి తిరిగి వేదముల యందలి సంశయ ఘట్టములవ్యక్తపరచుటకై బ్రహ్మసూత్రములను రచించెను. మరియు ఈ విషయముల ఉదాహరణ పూర్వకముగ వ్యక్తపరచుటకై ఇతిహాస పురాణముల వ్రాసెను.

అందుచే హిందూమత సిద్ధాంత సారములు పండిత పామరులకును; స్త్రీ పురుషులకును; బాల వృద్ధులకును; అతిసులభముగ, అతిస్పష్టముగ, అతిసుభోదకముగ, అనతికాలములో తెలుపు, బోధించు, ఉపదేశించు, ఆదేశించు, గ్రంథరాజము; పరమకారుణికుడగు భగవంతునిచే చేతనోజ్జీవనార్థమై స్వయముగ ఉపదేశించబడిన గ్రంథరాజము;

ఆసేతు - శీతాచల పర్యంతము భారతావని యందే గాక బుద్ధివికాసతగల ప్రతి మానవుని ఆకర్షించి ఆత్మోత్తారక - సులభోపాయమును వెల్లడించు గ్రంథశ్రేష్ఠము;

జీవుని జీవితమందలి ప్రతి సమస్యకున్ను, ప్రతి సంశయమునకున్ను, ప్రతి ప్రశ్నకున్ను, ప్రతి జిజ్ఞాసకున్ను, తిరుగులేని సిద్ధాంతరూప - సమాధాన మొసంగు నిఘంటురూప గ్రంథరత్నము;

లౌకిక - అలౌకికముల ; శరీర - ఆత్మల ; జీవ - పరమాత్మల సమస్యల నన్నింటిని చక్కగా సమన్వయపరచి చేతనోజ్జీవన రాచబాటను విశదపరచు గ్రంథరాజము;

ప్రపంచము యొక్క సృష్టి - స్థితి - లయ - మోక్షము మున్నగు రహస్యముల నన్నింటిని విస్పష్టముగ విశదపరచి వెల్లడించు గ్రంథరాజము భగవద్గీత,

మానవుని అదృష్టగీత భగవద్గీత.

శ్లో. గీతా సుగీతా కర్తవ్యా కిమన్యైశ్శాస్త్రసంగ్రహైః ।
యా స్వయం పద్మనాభస్య ముఖపద్మా ద్వినిస్సృతా. ॥
భారతా - మృత - సర్వస్వం విష్ణో ర్వక్త్రా ద్వినిసృతం ।
గీతా - గంగోదకం పీత్వా పునర్జన్మ న విద్యతే. ॥

ఇట్టి మహానిధిని కలిగియుండియు, మనము ఈ నాడు ఆధ్యాత్మికముగా నిర్వీర్యులమై యున్నామన్నచో, మతాంతరముల స్వీకరణలు జరుగుచున్నవనినచో; మతము యొక్క నిజమైన కట్టుబాట్లు శిథిలములై-భిన్న భిన్నములై పోవుచున్నవనినచో;ఆధ్యాత్మికముగ మానవజాతి అధోగతిని పొందుచున్నదనినచో; నాస్తికవాదము నలుగడల నలముకొనుచున్నదనినచో, కారణమేమి ? ఈ భగవద్గీతా మహానిధిని మనముపయోగించు కొనలేక పోవుటయే,

ఈ మహానిధిని మనము ఆచరణలో యుంచుకొనలేక పోవుటచేతనే కదా దేశములో కరువులు, కాటకములు - ఈతిబాధలు, తిష్ఠవేసి మనలను తినివేయుచున్నవి. ఈ మహానిధిని గూర్చిన ప్రచారము లేకపోవుట చేతనే కదా మానవునందలి దేవత్వము - మటుమాయమై, మానవత్త్వము మాసిపోయి, రాక్షసత్వము తాండవించుచు పరహింస, వంచన, అవినీతి, దురాశ, అశాంతి దినదినాభివృద్ధి గాంచుచున్నవి.

సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు, సర్వవ్యాపి, సర్వసముడు, సర్వమంగళ ప్రదుడు అగు సర్వేశ్వరునితో గల సన్నిహిత సంబంధమును అనుభవ పూర్వకముగ తెలుసుకొని తెలిపినట్టు మహాత్ముల-ఋషిపుంగవుల - మునీశ్వరుల - ఆళ్వారుల పరంపరకు చెందినవారము గదా మనము,

అట్టి మనము నేడు దేహాత్మాభిమానులమై, ఆభాస - శుష్క - మెట్ట - ఆచారణశూన్య - అర్థరహిత - ఆడంబరసహిత వ్యర్థ వేదాంతులమై, ఆత్మజ్ఞాన శూన్యులమై అధీరులమై యున్నాము.

ఇట్టి మన దుస్థితి, దురవస్థ, దుర్గతి, దుర్మార్గము, దురాలోచన పోవలెనన్నచో ; పవిత్రత-త్యాగము-సేవానిరతి - సర్వసమత్వము - సచ్ఛీలము - సమున్నతి - స్వార్థరాహిత్యము కలుగవలెనన్నచో 'వ్యక్తి-మతము-ధర్మము - నీతి - సంఘము - దేశము - జాతి - ప్రపంచము' - అభ్యున్నతిని పొందవలె నన్నచో భగవద్గీత ఒక్కటే మనకు శరణ్యము.

శ్లో. గీతాశాస్త్ర మిదం పుణ్యం, యఃపఠేత్ ప్రయతః పుమాన్ ।
విష్ణోః పద మవాప్నోతి, భయ - శోకాది - వర్జిత ః ॥

"భగవద్గీతాపఠనము - భగవద్గీతావిచారము - భగవద్గీతాన్వయము - భగవద్గీతోక్తాచరణము
భగవద్గీతాప్రచారము ఇవియే మనకర్తవ్యములు,

ఆస్తికాగ్రేసరులారా! భగవద్భక్తులారా!

దేశాభ్యుదయకరమైన ఈ పవిత్రభావముల, ఈ పవిత్ర ఆశయముల, ఈ పవిత్ర లక్ష్యముల నెరవేర్చుటకై భగవద్గీతాప్రచార ప్రబోధముల గావించుటకై శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘముచే మదరాసు పట్టణమున స్వస్తిశ్రీ వికృతినామ సంవత్సర కార్తీక బ ౭ మి. శనివారము (వృశ్చికమాసము 17.) అనగా ది 2-12-1950 తేది ఉదయము నుండి వరుసగా పదునెనిమిది దినములు అనగా ది 19-12-1950 తేది సాయము వరకు శ్రీ భగవద్గీతా సందేశ మహోత్సవము జరుప నిశ్చయింపబడినది.

ది 1-12-1950 తేది శుక్రవారము సాయంకాలమున అంకురార్పణము; ది 20-12-1950 తేది బుధవారము ఉదయమున అవభృదోత్సవము జరుగును.

## —: కార్యక్రమము :—

ది 1-12-1950 శుక్రవారము సాయంకాలముల తిరువళిక్కేణిలోని శ్రీ గీతాచార్య-పార్థసారథి స్వామి వారి కోవిలనుండి ఊరేగింపుతో బయలుదేరి శ్రీ ఉప్పుటూరి ఆళ్వారు శ్రేష్ఠి చారిటి వారి రామానుజకూటమునకు (42, గోవిందప్పనాయకన్ వీధి, మదరాసు 1.) వచ్చి అచ్చట పారాయణ మంటప ప్రవేశమహోత్సవము, అంకురార్పణము;

ది 2-12-50. శనివారము మొదలు ప్రతిదినము ఉదయము5. 0. గం. కు తిరువారాధనాదికములున్ను; గం. 6-30 నుండి గం. 7-30 వరకు తిరుప్పీమ్యుత్సవమున్ను గం. 7-30 నుండి గం. 8-0 వరకు అందరుకలసి రోజునకు ఒక్కొక్క అధ్యాయము చొప్పున సమిష్టి పారాయణమున్ను; గం. 8-0 నుండి గం. 8-15 వరకూ కృష్ణనామజపము (సముష్టి) గం. 8-15 నుండి 10-30 వరకు దీక్షితులగు పండితులచే శ్రీ భగవద్గీతయంతయు పూర్తిగా పారాయణమున్ను; అదేసమయమున ఉపన్యాసమంటపమున ఆరోజున సమిష్టిగ పారాయణజేసిన అధ్యాయముయొక్క అర్థవిశేషములు అవకాశమున్న వివిధభాషలలోను ఉపన్యసించబడుచుండుటయున్ను, మధ్యాహ్నము గం. 2-0 లగాయతు గం. 5-0 వరకు సుప్రసిద్ధ పండితప్రవరులచే ఆ దినమున సమిష్టిపారాయణచేయబడిన అధ్యాయముపై విశేషార్థవిమర్శన ఉపన్యాసపూర్వకముగా ప్రచారకులకు శిక్షణ నిచ్చుటయున్ను; సాయంత్రము గం. 5-30 లగాయతు గం. 8-30 వరకు భగవద్గీతపై వివిధ విషయముల గూర్చి ఉపన్యాసము లిచ్చుటయున్ను, రాత్రి గం. 8-30 నుండి 10 గం. వరకు హిందీభాషలో ఏకాంబరేశ్వర అగ్రహారపు గుంటకు వెనుకప్రక్కను ఉపన్యాసములు భగవద్గీతపై నొసంగబడును.

ది 20-12-1950 తేది బుధవారము ఉదయము గం. 8-0 కు జార్జిటవునుసముద్రతీరమున అవబృథోత్సవమున్ను జరుగును.

ఈ కార్యక్రమముతోపాటుగ ఈ పదునెనిమిది దినములు, అవకాశమున్నన్ని భారతదేశమందును ఖండాంతరములయందును గల శ్రీ భగవద్గీతయొక్క ముద్రితాముద్రిత గ్రంథరాజముల దీనికి సంబంధించిన వాఙ్మయ ప్రదర్శనమున్ను జరుపబడును.

మరియు శ్రీ భగవద్గీతమూలము అర్థము - వ్యాఖ్యానములు - విమర్శనలు - ఉపన్యాసములయందు పరీక్షల నేర్పరచి అందు తీర్ణులైన వారలకు బహుమతులును బిరుదములున్ను యివ్వబడును.

వీలునుబట్టి "గీతామందిరమును" స్థాపించు ప్రయత్నము చేయబడును.

కాన ఈ పవిత్రమహోత్సవమున తాము పాల్గొనియు, దీని ఆహ్వానసంఘమున తాము సభ్యులు రియు, యితరులచేర్పించియు, తమకందుబాటులోగల శ్రీ భగవద్గీతా వాఙ్మయమును ప్రదర్శనమునకిచ్చియు ఇంకను తమకుచితమనితోచిన విధముగ సహాయముజేసి ఈ మహోత్సవమును వైభవోపేతముగానడిపించ వల నెదిగ ప్రార్థించుచున్నాము.

(తాము ప్రదర్శనముకిచ్చు శ్రీ భగవద్గీతా వాఙ్మయమును తిరిగి ప్రదర్శనాంతరమున తమకు అతిజాగ్రత్తగా వప గించగలము.)

ఇట్లు,

శ్రీ విశిష్టాద్వైతప్రచారక సంఘ

శ్రీ భగవద్గీతా మహోత్సవాహ్వానసంఘము

అధ్యక్షులు

రావుబహదూర్

శ్రీమాన్ వేమూరి రంగనాథశ్రేష్ఠి.

(తిరువళ్లిక్కేని శ్రీపార్థసారథి స్వామివారి దేవాలయ ధర్మకర్తలు)

మద్రాసుశాఖ అధ్యక్షులు

మట్టుపల్లి రంగనాదయ్య.

కేంద్రకార్యదర్శులు

1. తెం. క. గోపాలాచార్యులు.

2. ఆ. చి. శ్రీమన్నారాయణ.

కార్యదర్శులు

కేశవలాల్ తర్యాడి బి. ఎ. బి. ఎల్

కరాలపాటి రాధాకృష్ణయ్య.

కోశాధిపతి

కొండేటి సుబ్బారాయులు శ్రేష్ఠి.

---

## ఆహ్వానసంఘ సభ్యత్వము.

| | | | | |
|---|---|---|---|---|
| మహారాజపోషకులు. | రూ. 1118-0-0. లు గాని | అంతకంటె | అధికముగాని | సమర్పించువారు. |
| రాజపోషకులు. | 518-0-0. | ,, | ,, | ,, |
| పోషకులు. | 218-0-0. | ,, | ,, | ,, |
| సహాయకులు. | 118-0-0. | ,, | ,, | ,, |
| సభ్యులు. | 58-0-0. | ,, | ,, | ,, |
| అభిమానులు. | 25-0-0. | ,, | ,, | ,, |
| చందాదారులు. | 18-0-0. | ,, | ,, | ,, |

T. V. C. Press Madras.

భక్తి

# నివేదన







వికృతి - కార్తీకము. भक्तिनिवेदन पत्रिका సంపుటి ౭. సంచిక ౮.

శ్రీమతే రామానుజాయనమః




భక్తి

# నివేదన

వేదాంత మాస పత్రిక

| సంపుటి ౨ | వికృతి — కార్తీకము | సంచిక ౮ |
| --- | --- | --- |


## విశిష్టాద్వైతము

"శ్రీ మన్నారాయణ"

సహకారి కారణమనియు; సృష్ట్యాద్యనుగుణ సంకల్పాదుల శక్తియుక్తుడైన పరమాత్మయే నిమిత్తకారణమనియు; సగుణశ్రుతులన్నియు భగవంతునియొక్క వాస్తవిక అనంత కళ్యాణగుణములను తెలుపునవనియు; నిర్గుణ శ్రుతులన్నియు భగవంతుని యందు ఎట్టి హేయగుణము లేవని తెలుపుచున్నవనియు;

అభేదమును తెలుపు శ్రుతులన్నియు 'ఆత్మభూతుడైన పరమాత్మను విడిచి చిత్తు అచిత్తులు భిన్నములై యుండజాలవు. ఆయనకు శరీరములై అపృథక్ సిద్ధి సంబంధముచే ఆయనతో కలిసి అభిన్నములైయే యుండునవి గాని స్వతంత్రమైన భేదములేనివి. అని తెలుపుచున్నవనియు; భేదమును తెలుపు శ్రుతులన్నియు చిద చిత్తులు పరమాత్మతో కలసి యున్నను నిత్యత్వ అనిత్యత్వ; పరిణామత్వ–అపరిణామత్వ; అల్పత్వ–మహత్వత్వాది చేతనత్వ. అచేతనత్వాది స్వభావ–స్వరూపములలో చిత్తు. అచిత్తు–ఈశ్వరులు భిన్నులు, అని తెలుపుచున్నవనియు; వాచ్యత్వాదుల నిషేధించు శ్రుతులన్నియు; పరమాత్మ దేశతః–కాలతః వస్తుతః పరిచ్ఛేదించ వీలు లేనివాడని తెలుపుచున్నవనియు; పరమాత్మకు ఉత్పత్తిలేదను శ్రుతులన్నియు, పరమాత్ముడు మనవలె కర్మకృతమైన ఉత్పత్తి లేనివాడని తెలుపుచున్నవనియు; పరమాత్మకు ఉత్పత్తిని తెలుపు శ్రుతులన్నియు, పరమాత్ముడు స్వాశ్రిత సాధుజన సంరక్షణార్థమై తన సంకల్పముచేతనే స్వేచ్ఛగ ఎత్తిన అవతారవిశేషములు కలవాడని తెలుపుచున్నవనియు; జీవుల పరస్పరైక్యమును తెలుపు శ్రుతు

లన్నియు 'జీవులందరు జ్ఞానమును ఆకారముచే ఏకరూపులై యుందురని ప్రకారైక్యమును తెలుపు చున్నవనియు; జీవుల పరస్పర భేదమును తెలుపు శ్రుతులనియు, 'జీవులు తమ తమ కర్మాను గుణమైన స్వరూప-స్వభావ-అనుభవములలో భిన్నులై యుందురని, తెలుపుచున్నవనియు; పర బ్రహ్మ అద్వితీయుడను తెలుపు శ్రుతులన్నియు: పరబ్రహ్మ చిత్తు-అచిత్తులను శరీరముగా కలిగి యుండుటచే స్వ సజాతీయమైన మరియొకటి యేదియు లేనివాడు; అని తెలుపుచున్నవనియు;

ఈవిధముగా శరీరములైన చిత్తు అచిత్తులకును, శరీరములైన ఈశ్వరునికి భేదమును అంగీకరించుట వలన, బంధ-మోక్షవ్యవస్థయు, ఉపదేశాదులున్ను, తత్వజ్ఞానవ్యవస్థయు చక్కగా కుదురును. కాన ఇట్టివాటిని తెలుపు శ్రుతివాక్యముల కన్నియు ఈవిధముగానే అర్థమును తెలుసుకొనవలె ననియు;

చేతనుని యొక్క మొట్టమొదటి ప్రవృత్తి సర్వేశ్వరునియొక్క స్వీయస్వాతంత్ర్యానుసారముగ చేతనుని యొక్క-పూర్వకృత కర్మానుసారము జరుగును. కాన విధి-నిషేధముల తెలుపు శాస్త్రము నిరర్థకము కాదు అనియు;

సర్వేశ్వరుడు నిర్వికారుడు యను అర్థమును తెలుపు శ్రుతులు, ఆయన నిత్యమైన కల్యాణ గుణములకు ఆశ్రయుడై, చేతనులు జేసిన యాగ-ఉపాసనాదులచే ప్రీతుడగుచు వారల యభీష్టాదుల దీర్చు పరమకారుణికుడగుట ప్రమాణసిద్ధమగుటవలన, ఆయన యందు కర్మజన్యమైన హేయవికారములేవియు లేవు అని తెలుపుచున్నవనియు;

సర్వేశ్వరుడు తానే సంకల్పించుకొని తదనుసారముగ ప్రపంచరూపముగా అనేకపదార్థముగా నాయెను. అని శ్రుతులు తెలుపుచుండుటచే, "వికారము లనునవి అపురుషార్థములు గాన అవి సర్వేశ్వరుని యందు లేవు" అని తెలుపు శ్రుతులకు సాక్షాత్తు సంబంధేన సర్వేశ్వరుని యందెట్టి వికారములులేవని తాత్పర్య మనియు;

చేతనుడు చేసిన పుణ్యకార్యముల వలన సర్వేశ్వరునికి ప్రీతికలుగును. దాని వలన స్వర్గాది పుణ్యలోకానుభవము కలుగును, చేతనుడు చేసిన పాపకార్యముల వలన సర్వేశ్వరునికి అసంతృప్తి కోపము కలుగును, దానివలన నరకాది పాపలోకానుభవము కలుగును, గాన ఇట్టి భగవన్నిగ్రహానుగ్రహముల కంటె స్వర్గనరకాదులకు వేరే 'అపూర్వము' ను కారణము లేదనియు;

ఇంద్రాదివ్యక్తులు ఆయకల్పాంతమున నశించినప్పటికిన్ని ఆయా ఇంద్రాదులకు అంతర్యామిగాయుండు పరమాత్మ ఎప్పటికిన్ని నిత్యుడై స్థాయిగా యుండును గాన అయనచే ఈ చేతనులు జేసిన కర్మలకు ఫలము కలుగుటలో హాని లేదనియు;

ఫలదాత సాక్షాత్తు సర్వేశ్వరుడే అయినను ఇంద్రాదులయొక్క అనుగ్రహములు అవాంతర

కారణములు కావున ఇంద్రాద్యారాధనములు వ్యర్థములుకావు, మరియు మనుష్యాదులచే సర్వేశ్వరుడు ఇంద్రాదులద్వారా ఆరాధించబడునుగాన మనుష్యాదులు ఇంద్రాదుల సాక్షాత్తు ఆరాధించుటలోగాని ఎట్టివిరోధము లేదనియు?

చేతనుడు మొట్టమొదట దుష్కర్మలయందు ప్రవృత్తించుటలో, సర్వస్వతంత్రుడును, లీలారసానుభవకాంక్షియు నిర్లిప్తుడును అయినసర్వేశ్వరుడు ఈచేతనుని ఆటంకపరచకుండగ జూచుచుండుటగాని, అనుమతించుటగాని ఎట్టిదోషావహము గాదనియు;

ఈవిధముగా శ్రుతులలోని అన్నివాక్యములకు శ్రీరామానుజులవారు ఎట్టివిరోధము లేకుండగ చక్కగ సమన్వయపరచి అర్థమును తెలిపిరి.

శిష్యుడు:- పరమాత్మునికి అట్టి స్వాతంత్ర్యము వహించుట దోషముకాదా ?

గురువు:- నాయనా ! పరమాత్మునియొక్క నిరంకుశ స్వాతంత్ర్యము గుణముగాని దోషమెంతమాత్రమున్ను గాదు. ఏలనన సర్వేశ్వరుడు జీవునికి జ్ఞానమున్ను, దానినుపయోగించుకొనవలెనుచు(?) నుటకు శరీరమున్ను, ఇంద్రియములను, విషయములను, మంచి చెడ్డల తెలిసికొనుటకు శాస్త్రములను, వాటిని విశదీకరించుటకు ఆచార్యులను, మధ్య మధ్య తానే అవతారములెత్తి తన ఉపదేశానుష్ఠానములను అనుగ్రహించియున్నాడు. గాన మధ్య మధ్యగ ప్రతివాని నిత్యకృత్యములలోను అయన కలుగజేసుకొనడు. ఎవడు ఏది చేయునో వానికి తదనుగుణ ఫలితమును అనుభవింపజేయుచుండును.

జీవునికిచ్చిన కించిత్స్వాతంత్రమును వీడు తన దుర్బుద్ధిచే పాడుచేసుకొనిన అది భగవంతుని దోషమగునా ? దోషముకాదు సరికదా ప్రత్యుత గుణమేయగునుగదా.

శిష్యుడు:- భగవంతునియందు దయాదిగుణములున్నవికాదా. వాని వుపయోగమేమి ?

గురువు :- చేతనుడు తనయొక్కయు సర్వేశ్వరునియొక్కయు స్వరూపమును తెలుసుకొనినపుడు, తన ప్రాతికూల్యమునుమాని, భగవంతునే ఆశ్రయించి, ప్రపత్తి చేయువానిని భగవంతుడు తనదయకు పాత్రునిగ జేయును. గాన ఆయనయందలి దయాదిగుణములు వ్యర్థములుకావు.

శిష్యుడు :- సంసారనివృత్తి దేనివలన కలుగును ?

గురువు :- అనాదియైన కర్మయొక్క ప్రవాహమువలన ప్రకృతి సంబంధముకలుగును. ఇదియే సంసారబంధమనబడును. ఇది సత్యమైనది. భగవంతుని ఉపాసించుటవలన ఆయన అనుగ్రహము కలుగును. ఆ అనుగ్రహమువలన ఈ సంసారబంధము నశించును.

శిష్యుడు :- బంధమోక్ష వ్యవస్థ ఎటుల ?

గురువు :- చేతనులు పరస్పరము భిన్నులు. కర్మలంపటుడు సంసారబంధమున చిక్కుకొనును.

భగవదుపాసనచే భగవదనుగ్రహ పాత్రుడు మోక్షమును జెందును. గాన బంధమోక్షవ్యవస్థ చక్కగా కుదురును.

శిష్యుడు :- వేదమున రెండుభాగములేల యున్నవి ? అందేది ప్రమాణము ?

గురువు :- వేదమున పూర్వభాగము సర్వేశ్వరునియొక్క ఆరాధన భూతమైన కర్మలయొక్క స్వరూపమును ప్రతిపాదించుచున్నది. ఉత్తరభాగము ఆరాధ్యుడైన సర్వేశ్వరుని ప్రతిపాదించు చున్నది. గాన మొత్తమురెండు భాగములు కూడ ప్రమాణసిద్ధములే.

శిష్యుడు :- ఈవేదమునుగూర్చిన మీమాంసా శాస్త్రములెన్ని ? వాని వివరములెట్టి ?

గురువు :- కేవల కర్మను గురించిన వివరముల తెలుపునది కర్మ మీమాంస. ఇది కేవల కర్మల స్వరూపమును తదనుష్ఠాన వివరములను తెలుపును.

కర్మలచే ఆరాధించబడు దేవతాంతరముల గురించిన వివరముల తెలుపునది దేవతా మీమాంస. ఇది ఆయా కర్మలచే సాక్షాత్తు ఆరాధించబడు దేవతాంతముల స్వరూప విశేష ఫలితాదుల తెలుపును. ఫలప్రదాత యగు పరబ్రహ్మను గురించిన వివరముల తెలుపునది బ్రహ్మమీమాంస. ఇది దేవతాకాష్ఠాభూతుడైన పరమపురుషుని గురించిన వివరములనన్నింటిని తెలుపును. గాన ఈమూడు కూడ ప్రమాణములే.

వీటినన్నింటిని ప్రమాణములుగ తీసుకొని అన్నింటిని సమన్వయపరచి దేనిని విడిచిపెట్ట కుండగను, దేనికి విరుద్ధములేకుండగను చక్కగ సమన్వయపరచి భగవద్రామానుజులు తమసిద్ధాం తమును వ్యాపింపజేసిరి.

శిష్యుడు :- శ్రీరామానుజులవారు తమసిద్ధాంత నిర్ణయమున ఇంకను ఎవరెవరిని గురువు లుగ స్వీకరించిరి ?

గురువు :- శ్రీరామానుజులవారు ముఖ్యముగ శ్రీయామునాచార్యులవారిని ఆచార్యులుగ గాని వారితో వీరికి సాక్షాత్తు సాన్నిధ్యము తటస్థించకపోవుటచే వారి యాజ్ఞానుసారముగ వారి శిష్యులను అయిదుగురిని ఆశ్రయించి వారిద్వారా శ్రీయామునాచార్యులవారి ఉపదేశముల గ్రహించిరి.

శిష్యుడు :-ఆ పంచాచార్యులు ఎవరు ?

గురువు :- 1. పెరియనంబి, 2. పెరియతిరుమలనంబి, 3. తిరుకొట్టియూరునంబి, 4. తిరుకచ్చినంబి 5. మారనేరినంబి, అనువారైగురురు-

శిష్యుడు :-వీరి జైత్రయాత్ర విశేషములేవి ?

గురువు :-వీరు ఆసేతు శీతాచలము వరకు రెండుపర్యాయములు జైత్రయాత్ర చేసినటుల యున్నది.

జైత్రయాత్రలో ప్రధానవిశేషము-వీరు కాశ్మీరువెళ్ళినప్పుడు అచ్చటి శారదాపీఠమందలి పండితప్రకాండులందరి ఎదుట తాము బ్రహ్మసూత్రములకు రచించిన శ్రీభాష్యమును ఉపన్యసించగా దానియందలి యదార్థసమన్వయ సిద్ధాంతమునకు అచ్చటి పండితులందరు ఏకగ్రీవముగ అంగీకరించి ముగ్ధులైరి. శారదాదేవి ప్రత్యక్షమై అప్పుడు వీరికి "శ్రీభాష్యకారులు" అని బిరుదును ప్రసాదించెను. వీరు తాము స్వయముగ వ్రాసిన శ్రీభాష్యకోశమును ఆ శారదాపీఠమునకు కానుకగ సమర్పించిరనియు, ఇప్పటికిన్ని ఆ శ్రీకోశమచ్చట విరాజిల్లుచున్నదనియు తెలిపెదరు. మరియు వీరు అచ్చటచ్చట ప్రధాన స్థలములయందు మఠముల నేర్పరచిరి. మరియు జీర్ణమైన అనేక దేవాలయముల నుద్ధరించి తిర్గి వానిని సక్రమ నిర్వహణమునకై కొంతమంది జీయంగార్లను సన్యాసాశ్రయమస్థులను ఏర్పాటుచేసిరి.

అందులో తిరుపతి, తిరునారాయణపురము, శ్రీరంగము, శ్రీవిల్లిభుత్తూరు మున్నగునవి ముఖ్యములు.

శిష్యుడు :- వీరు రచించిన వాఙ్మయమేమి ?

గురువు :- వీరు శ్రుత్యర్థమును విశదీకరించు వేదార్థసంగ్రహము; సూత్రార్థమును స్పష్టీకరించు శ్రీభాష్యము, వేదాంతసారము, వేదాంతదీపము అనువాటిని; స్మృత్యర్థమును స్థిరపరచు శ్రీగీతాభాష్యమును; పురుషార్థస్వరూపమును తెలుపు శ్రీరంగ గద్య; ఫలస్వరూపమును ప్రతిపాదించు శ్రీవైకుంఠ గద్య; ఉపాయస్వరూపమును ఉపదేశించు శ్రీశరణాగతి గద్య. నిత్యానుష్ఠానమును నిర్మించు నిత్యగ్రంథము అను తొమ్మిది గ్రంథములను రచించిరి.

ఈనవరత్నములు అమూల్యములు. అసమానములు. ముముక్షుజనులకనుష్ఠేయ ప్రకాశకములున్ను.

శిష్యుడు :- వీరు తమ తదనంత ఏర్పాటులేమి జేసిరి ?

గురువు :- మతప్రచారమునకు సర్వసంగపరిత్యాగులేగాని పనిచేయజాలరు. అందుచే సామాన్యముగ సన్యాసులుమాత్రమే అందులకు తగియుండిరి. గాన బౌద్ధమతవ్యాప్తిలో అందరు సన్యాసులగుటయు, వారి ప్రవర్తనాదికములు రానురాను సంఘశ్రేయోనిరోధకములై సంఘవిచ్ఛిత్తికిన్ని, మతముయొక్క పునాదుల నాశనమునకు దారితీయుటచేతను, మరియు శ్రీవిశిష్టాద్వైతములో భక్తియే ముక్తికి కారణమగుటచేతను, తత్ప్రచారమునకు నివృత్తిమార్గనిష్ఠులైన గృహస్థులుకూడ అనుకూలురే అయి యుండుటచేతను శ్రీరామానుజులవారు తమ తదనంతరము తమ సిద్ధాంతవ్యాప్తికై డెబ్బదినలుగురు యోగ్యులగువారిని ఆచార్యపురుషులుగ నిర్ణయించిరి. వీరందరికి

వలయు శిక్షణాదికముల నుపదేశించి వీరిని దేశములో నలుగడలను మతప్రచారమునకై వినియోగించిరి.

వీరలలోని సంతతివారు చాలమంది యిప్పటికన్ని ఆచార్యపురుషులై ఈసిద్ధాంతమును ప్రచారము చేయుచునేయున్నారు. వీరినే స్వయమాచార్య పురుషులని వ్యవహరించుట కలదు.

శిష్యుడు :— ఈ డెబ్బది నలుగురు ఆచార్యపురుషులయొక్క తిరునామముల తెలుపగోరెద.

గురువు :— డెబ్బదినలుగురు ఆచార్యపురుషులెవరనగా :—

1. శ్రీ యామునాచార్యులవారు పుత్రులైన తొట్టనంబిగారు.
2. పెరియనంబి గారి కుమారులైన పుండరీకాక్షులు.
3. తిరుక్కోటియూరు నంబిగారి కుమారులైన తెర్కాళ్వారు.
4. తిరుమలైయాండక్ కుమారులైన సుందర తోళుడయారు.
5. పెరియ తిరుమలనంబిగారు కుమారులైన తిరుక్కురుగైప్పిరాన్పిళ్ళాన్.
6. పిళ్ళై తిరుమలనంబి.
7. కూరత్తాళ్వారులు,
8. కూరత్తాళ్వారుల కుమారులైన పరాశర భట్టరు.
9. శ్రీరామపిళ్ళై (వ్యాసభట్టరు.)
10. ముదలి యాండాన్.
11. నడాదూరాళ్వాన్.
12. ఎంగళాళ్వాన్.
13. నడువిలాళ్వాన్.
14. కోమడత్తాళ్వాన్.
15. తిరుకో, వహూరాళ్వాన్,
16. తిరుమోగూరాళ్వాన్.
17. పిళ్ళైయాళ్వాన్.
18. అనంతాళ్వాన్.
19. మిళగాళ్వాన్.
20. నెయ్యుండాళ్వాన్.
21. శొట్టలూరు సిరియాళ్వాన్.
22. వేదాంతి యాళ్వాన్.
23. కోయిలాళ్వాన్.
24. ఉక్కలాళ్వాన్.
25. అరణపురత్తాళ్వాన్.
26. ఎంబారు.
27. కిడాంబి యాచ్చాన్.
28. కణియనూరు సిరియాచ్చాన్.
29. కొంగిలాచ్చాన్.
30. ఈచ్చంబాడి యాచ్చాన్.
31. తిరుమలై నల్లాన్.
32. వంగిపురత్తాచ్చాన్.
33. తిరుక్కణ్ణపురత్తాచ్చాన్.
34. సిరియగోవింద పెరుమాళ్.
35. కిడాంబి పెరుమాళ్.
36. అమ్మంగి పెరుమాళ్.
37. ఆసూరి పెరుమాళ్.
38. పిళ్ళైయప్పన్.

39. వంగిప్పురత్తునంబి.
40. ముడుంబైనంబి.
41. పరాంకుశనంబి.
42. తిరుక్కురుంగుడినంబి.
43. తొండనూర్నంబి.
44. అరణపురత్తునంబి.
45. మరుదూర్నంబి.
46. మ యూర్నంబి.
47. వడుగనంబి.
43. కురవి నంబి.
49. కందాడై యాండాన్.
50. సోమాసి యాండాన్.
51. జియ్యరాండాన్.
52. ఈశాండాన్.
53. పెరియాండాన్.
54. సిరియాంటాన్.
55. అమ్మంగియాండాన్.
56. ఆళవందారాండాన్.
57. ఉక్కలమ్మాళ్.
58. పరిత్తిక్కొల్లైయమ్మాళ్.
59. వైత్తమానిదియార్.
60. సిరిప్పళ్ళి దేవరాజభట్టర్.
61. పిళ్ళైయురందయుడయాన్.
62. పిళ్ళై తిరువాయ్మొ యగయర్.
63. పిళ్ళై తిరునరయూరరయర్.
64. పిళ్ళై రాజమహేంద్రి పెరుమాళరయర్.
65. అధికారిప్పిళ్ళై.
66. తిరునగరి పిళ్ళై.
67. అర్కాట్టుపిళ్ళాన్.
68. కొమాండూరుపిళ్ళై.
69. అనంత సోమయాజియార్.
70. శాండిలిసోమయాజియార్.
71. అలంనాడ వేంగడవర్.
72. కుంటివృప్పుర్ సిరియాండాన్.
73. కొమాండూరు ఇళయవిల్లి.
74. మారొనిల్లా మారుతియాండాన్.

ఈ ఆచార్యపురుషులలో కొందరికి నామాంతరములు గలవు.

ఈచెప్పబడినవారిలో తిరుక్కురుగైపిరాన్ పిళ్లాన్, నడదూరాళ్వాన్, కిడాంబియాచ్చాన్ మొదలియాండాన్, ఈనలుగురు శ్రీభాష్యప్రవచనపరులు. తిరుక్కురుగైప్పిరాన్పిళ్ళాన్ అనువారు శ్రీభాష్యభగవద్విషయములు రెండింటికి ప్రవర్తకులైరి. వీరేగాక శ్రీరంగనారాయణ జియ్యరు, ఈచ్చంబాడి జియ్యరు; గోవిందజియ్యరు; శట్టెప్పళ్ళిజియ్యరు; తిరుమ్రళిశజియ్యరు; తిరువెళ్ళర జియ్యరు, తిరుప్పుడుక్కుడిజియ్యరు, ఆడ్కొంకవిల్లజియ్యరు, తిరుమాలిరుంజోలై జియ్యరు మొదలుగా; గల 700 మంది జీయరులు, నంబిగురుదేవర్ మొదలుగాగల పండ్రెడువేల పరమైకాంతులు తూయమునివేవర్ మున్నగు కైంకర్యపరులు, తిరువరంగమాయోన్ మొదలగు కావలివారలు, పిళ్ళైయురంగావల్లదాసులు మొదలు దాసజనులు, తిరువనందపురత్తమ్మై మొదలగు అమ్మంగార్లు, వీరందరు ఈసిద్ధాంతానుష్ఠానపరులై సిద్ధాంతవ్యాపకులై యుండిరి.

★ గతసంచిక తరువాయి.

# దినహితచర్య

## సంభాషణ; సత్యము.

మనుష్యుని విద్యా బుద్ధి స్వభావములు అతని సంభాషణ వలన తెలియబడును. నీ కంటె తక్కువ వారినిగాని, చిన్నవారినిగాని "ఓరి, ఓసి" అని సంభోధించుట మంచిదిగాదు. అతి పరిచయము కలిగి నీ కంటె చిన్నవారి విషయమై ఏమోయి అనియు, పరిచయము లేనివారు, పెద్దవారు అగు అందరి విషయములోను "మీరు, తమరు, అండి, గారు"అని ప్రయోగించుట ఉచితము. నీ సంభాషణలో యితరుల కెవ్వరికి దుఃఖముగాని అసూయగాని ద్వేషముగాని క్రోధముగాని అసహ్యముగాని, విసుగుగాని పుట్టకుండునటుల ప్రసంగించవలెను. నీకు అధికారము, యోగ్యత ఉన్నప్పటికినీ అధీనములో నీ దయకు పాత్రులైన వారి విషయము నందైనను గర్వముతోగాని, అహంకార అభిమానములతోగాని. వ్యంగముగ గాని, అశ్లీలముగగాని, తిట్టుచుగాని, కఠినోక్తులతో గాని మాట్లాడకూడదు. ఇట్లు ప్రసంగించినచో నీ అసభ్యత్వమును వెల్లడించుకొనుటయే యగును.

నూతన వ్యక్తితో క్రొత్తగ పరిచయము కలుగజేసుకొను నపుడు తగినంత, అవుసరము కలిగినంతవరకు వారి జాతినిగాని, మతమును గాని, వయస్సునుగాని, ప్రవర్తనుకాని, వృత్తిని గాని, వేతనమునుగాని ప్రశ్నించుట మంచిది గాదు.

సంభాషణలో కొద్దిపాటి హాస్యరసము ఆసందరకమే. కాని దానిని హద్దుమీరి ఉపయోగించుట సర్వదాహానికరము. ఎదుటి వ్యక్తి నీతో మాట్లాడుచున్నపుడు "అవును, కాదు" అని అనుకూల జవాబు ఇచ్చుచుండ వలెనే గాని నోరు మెదపకుండగ మొద్దువలె మౌనము వహించి యుండుట మంచిది గాదు.

సంభాషణలో ఆత్మస్తుతిగాని, పరనింద గాని, ఎంత మాత్రము జొరనివ్వరాదు.

నీయొక్క భావములను ఎదుటి వారు సులభముగాను, స్పష్టముగాను సంపూర్ణముగాను గ్రహించ కలుగునట్టి శిష్టపదముల నుపయోగించి మాట్లాడుటయే సంభాషణలో నేర్పు. ప్రయోజనములేని ఎదుటివారికి సులభముగా అర్థము కానటువంటి కఠిన పదములుగాని, అన్యభాషా పదములుగాని, అశిష్టపదములనుగాని ఉపయోగించుట నీ మూర్ఖత్వమును, అహంభావమును వెల్లడించుకొనుట మాత్రమే యగును.

అనవసరముగ ఎవరితోడను మాట్లాడ కూడదు. ఎవరితోడనైనను మాట్లాడుటకు ముందు

నీవు మాట్లాడునది సత్యము, హితము ప్రియము అగునా యోజించుము. అట్లైననే మాట్లాడుము.

ఎవరైననూ సరే నిన్ను పలుకరించినపుడు వారికి తగు సమాధాన మివ్వవలెను. అటులివ్వకుండగ యూరకుండట నీ మూర్ఖతను తెలివి తక్కువ తనమును ప్రదర్శించుటయే యగును. ఇతరులను గూర్చి వారి పరోక్షముగ నెవ్వరితోడను దూరలాడకుము.

మిత్రులు, బంధువులు మొదలైన వారితో యున్నపుడు ఏదో ప్రసంగము చేయకున్న యెడల అది యసభ్యతగ నెంతురని గాని వారి నవమానించినటుల భావింతురని గాని తలచి వారితో అనవసర ప్రసంగము చేయకుము. మిత్రులుగాని బంధువులుగాని నీకెదురైనపుడు వారిని ఉచితరీతిగ పలుకరించవలెను. గాని మౌనము వహించి ఊరకుండుట అహంకార సూచకముగ నుండును.

నడుచు దారిలో గాని, సందులలో, రహస్య స్థలములలో గాని స్త్రీలతోను, అందులోను పరాయిస్త్రీలతో సంభాషించుట అనాగరిక లక్షణము.

ఏదో విషయమును గురించి దీర్ఘముగ ఆలోచనా నిమగ్నుడై యున్న వారివద్ద గట్టిగా మాట్లాడ గూడదు. నీవడిగిన సమాధానము తెలుపనిష్టపడని సజ్జనుని సమాధానము కొఱకై బలవంతము చేయకూడదు. నీ ప్రశ్ననాయన వినలేదనిగాని, లేక పొరపాటున నీప్రశ్నకుసమాధాన మిచ్చుట మరచెననిగాని నీకు తోచినపుడు తప్పకుండా వినయ పూర్వకముగా తిర్గి ప్రశ్నింపవచ్చును.

నీ యభిప్రాయములతో సంపూర్ణముగా ద్వేషించు వారితోగాని సత్పురుషులచే అనాదరింపబడువానితో గాని, అనారోగ్యవంతునితో గాని అవసరము నతిక్రమించి అధికముగ నెంతమాత్రము సంభాషించరాదు.

కొందరు వ్యక్తులు ప్రత్యేకముగా సమావేశమై ఏకాంతముగ సంభాషించు కొనునపుడు సంభాషణలలో క్రోధమును ప్రవేశించనివ్వరాదు. ఒకవేళ దానిని నిలుపజాలనిచో అట్టి సమయముల యందు మౌనము ధరించుటయే యుచితము.

నీ మిత్రునిగాని లేక గౌరవనీయ వ్యక్తినిగాని నీ సన్నిహిత మిత్రుని గాని ఇతరులెవ్వరైన నీయెదుట నిందించునపుడు వారి నటుల చేయవలదని వినయముతో కోరుము. వారటుల చేయనిచో అచ్చటనుండి నీవేమరొక స్థలమునకు లేచి పొమ్ము, ఏవైన సభా సమావేశములలో నీవు గూడ మాట్లాడుటకు అవసరము యోగ్యత యున్నదని తలచినచో తత్సమావేశ కర్తలు నిన్ను ఆహ్వానించలేదనిగాని కోరలేదనిగాని సందేహించబనిలేదు. వెంటనే మాటలాడవలెనను నీకోరికను ఆసమావేశకర్తలను తెలియజేయుము. వారనుమతించిరా వారు నీకిచ్చిన కాలములో నీయభిప్రాయము అందరికి బాగుగా తెలియునట్లు మాట్లాడుము. నిర్ణీతకాలము

కంటె అధికకాలమును తీసుకొని వినువారిని ఆసమావేశకర్తలను విసిగించకుము. నీవు మాట్లాడుటకు నీకు అవకాశము మివ్వలేదా వారిపై కోపించక ఊరకుండుము.

సభలు సమావేశములు మొదలైన అనేక సమూహము లందు నీమిత్రునిగాని నీపరిచయస్తునితోగాని యితరులెవ్వరికిన్ని తెలియనటువంటి రహస్య-పారిభాషిక-సాంకేతిక పదములతో సంభాషించకూడదు. దీనిని విని యితరులు తమనుగురించి మీరేదో సంభాషించుచుందురని అనుమానపడెదరు. ఏవిషయమునైను నీయభిప్రాయము నడిగినపుడే చెప్పుము. గాని అనవసరముగ నీయంతట నీవేవిషయము గురించియు సలహానిచ్చుటకై ప్రయత్నించకుము. నీమాటలుగాని, చేష్టలుగాని ఎవ్వరికి అసహ్యముగగాని, కష్టముగాని కలిగించకుండునటుల జాగ్రత్త వహించుము.

నీవితరులకు ఏదైన చిన్నచీటి వ్రాసినను కూడ అది చదువుకొనువారికి సులభముగ నీఉద్దేశ్యములు బోధపడునటులను, వారు నీపైఎట్టి దురుద్దేశముగాని అసహ్యతగాని పొందకుండునటులను ఆలోచించి జాగ్రత్తగా చక్కగా వ్రాయుము. చీటివ్రాసిన అనంతరము ఆచీటి అందుకొని వారివిషయమై నీమనస్సులో మంచి భావనలను తలంచి వాటిని చీటిపై ప్రసరించుము. కొంతమంది సజ్జనులు ఎట్టి నూతన వ్యక్తితోనైనను చిన్నవ్యక్తితోనైనను అతిపరిచయముగను అతిచనువుగను మాటలాడుదురు. అది వారి అత్యధిక యోగ్యతాసూచకము. అట్టివారితో వారి చనువును అపార్థ చేసుకొనక అత్యంతగౌరవముతోను వినయవిధేయతలతోను సంభాషించుము.

ఎట్టి మహావ్యక్తియందైనను ఎంచతగినటువంటి ఒకటి రెండు సుగుణములని చెప్పబడజాలని గుణము లుండవచ్చును. ఎంత దుష్ట, క్రూర, అజ్ఞాని వ్యక్తియందైనను ప్రశంసించతగినటువంటి సుగుణములుండి తీరును. గాన పరులయందలి దోషముల కనిపెట్టి వారిని నిందించుట కంటెను వారియందలి సుగుణములను గ్రహించి వారిని కూడ ప్రశంసించుటను అలవాటు చేసుకొనుము. నీతోసంభాషించు ఎదుట వారిని గురించి నీమనస్సులో మంచి తలంపు భావించుచు వాటిని వారిపై ప్రసరింపజేయుము. ఎంతటి తక్కువవారైనను సరే, అజ్ఞానులైనను నీతో ఏదైన మంచి సలహా తెలిపినపుడు, నీకుపకారము చేసినప్పుడున్ను, నీకు కొద్ది సహాయమునైనను సరే చేసినప్పుడున్ను వారికి నీధన్యవాదములను తెలుపుము.

ఎవరైనను తమ సంభాషణవలన నీకు కోపమును ఉద్రేకమును కలుగ జేయవలెనని ప్రయత్న పూర్వకముగ ప్రయత్నించవచ్చును. అందువలన ఎప్పుడైన ఒకప్పుడు నీవు క్రోధమునకు ఉద్రేకమునకు ఆధీనుడవై పోవచ్చును. గాని అట్టి సమయములలో వెంటనే నీవు తిర్గి జవాబు చెప్పరాదు. నీ మనస్సులో కల్గిన మార్పులు ప్రకాశింపజేయరాదు. వెంటనే జవాబు చెప్ప ప్రయత్నించితివా నీ మనస్సులో

కలిగిన మార్పులు వెల్లడికాక మానవు. అందు వలన ఎదుట వారి సంకల్పము నెరవేరును. గాని అట్టి సమయములో కొద్ది నిమిషములు మౌనముగ యుండి వినయ పూర్వకముగ జవాబును, ఆలోచించి చిరునవ్వుతో తెలుపుము. లేకపోయిన నీవు మనశ్శక్తిని కోల్పోయి ఎదుట వారికి లొంగిపోయిన వాడవగుదువు. అపుడు ఎదుట వారు విఫలమనోరథులగుదురు, అందువలన నీకు ఏ హానియుకలుగదు. నీమనశ్శక్తియు వృద్ధి పొందును. క్రోధముతో పలికిన పలుకులు వాడిగల ములుకులవంటివి. బాణముపై నుండునది. శరీరమునకే గుచ్చుకొనును. శరీరముయొక్క పుండు మానును గాని మనస్సుయొక్క పుండు మానదు. కాలుజారిన తీసుకొనవచ్చును గాని మాటజారిన తీసుకొనుట అసంభవము.

నీయెదుట నిన్ను స్తుతించువారు నిజముగ నీకు మహాహానియే కలిగించుచున్నారని తలచుము. వారు నిన్ను మోసము చేయుచున్నారనియే తలచుము. అట్టివారితో వెంటనే వినయముతో నిన్నుగురించిన స్తుతిని మానివేయవలసినదనియు అది నీకు కష్టముగ నున్నదనియు తెలుపుము. అప్పటికిని వారు మానకపోయినచో అచ్చటనుండి లేచిపొమ్ము.

ఎవరైన నిన్ను నిందించుటకైగాని వ్యంగముగా శ్లేషతోటి మాట్లాడ వచ్చును. అట్టి వారితో అధిక ప్రసంగము చేయక అవసరమైన ఒకటి రెండు మాటలు వినయముగనే తెలిపి మౌనము వహించుము. లేనిచో అచ్చటినుండి లేచిపొమ్ము. నీవయస్సునకు, నీయోగ్యతను మించిన మాటలను ఎన్నడూ ఆడకూడదు. నీకు తెలియని విషయమునుగురించి ప్రసంగించరాదు. నీయొక్కగాని, యితరులయొక్కగాని యేదైనా వ్యవహారిక విషయములను గురించిగాని, ఆర్థిక, రాజకీయ, సాంఘికముగ సంబంధించి నటువంటి విషయముల గురించిగాని, నీపెద్దలయొక్క, నీహితులయొక్క సలహాను తీసుకొనకుండగ యెవరితోను యెన్నడు సంభాషించరాదు.

బాగుగా నమ్మదగినటువంటి వారిద్వారా వినిననే తప్ప నీవు విన్న ప్రతివిషయమును గురించియు అందరితోనూ ప్రసంగించకుము. నమ్మదగిన విషయములలో కూడ రహస్యముగ యుంచవలసిన దానిని రహస్యము గానే యుంచుము. మాటయే మంచిగ యుపయోగించిన మర్యాద తెచ్చును. మానము కాపాడును. ప్రాణమునిచ్చును. ధనవంతునిచేయును. అదియే విరసముగ నుపయోగించిన మర్యాదపోగొట్టును. మానమును ధ్వంసముచేయును. ప్రాణమును హరించును. దరిద్రునిచేయును.

భగవంతుని స్వాధీనపరచుకొను మంత్రము కూడ మాటయే యను విషయమును మరువకుము.

సత్యమే భగవంతుడు. సత్యమే యేనాటికైనను జయించితీరును. సత్యమునే ఆధారముగను జీవముగను తలంచువారు నిజముగా ధన్యులు. సత్యముకంటె రక్షించునది ప్రపంచమున మరేదియు లేదు. పరిహాసమునకైనను

కలయందైననుకూడ అసత్యమాడకుము.

సత్పురుషుల సమావేశమునందు, పరోపకారార్థమైన పనులయందు, దేవాలయములు పుణ్యతీర్థములు మొదలైనవాట్లయందు, అత్యవసరమైన పనికలిగినపుడు తప్ప జనసమూహము లోనికి పోవలదు. సాధ్యమైనంత వరకు ఏకాంతముగను, మౌనముగను యుండుము. మౌనము కల హాశూన్యము, పాపనాశనము. అధికప్రసంగమును, అనవసర ప్రసంగమును, ఆత్మస్తుతిని, పరనిందను, అతిశయోక్తులను ప్రయత్నపూర్వకముగా మానివేయుము. మననాలుక అసత్యము లాడు స్వభావముకలదగునేని ప్రధమమున రెండు సార్లయినను ప్రయత్నపూర్వకముగా అసత్యమును జయించి సత్యమును తెలుపుటకు ప్రయత్నించుము. నీవు ఒకవేళ తెలియక అసత్యమును సత్యమని భ్రమపడి మాట్లాడినచో అది అసత్యమని తెలిసినవెంటనే హృదయపూర్వకముగ పశ్చాత్తాపపడి క్షమార్పణ గోరుకొనుము. సత్యమే యెప్పటికిని జయముపొందును. సత్యమునే ఆధారముగను, జీవితముగను తలంచువారు నిజముగ ధన్యులు. సత్యపధమును విడనాడకుండుటవలననే పంచభూతములు, సూర్యచంద్రులు చరించుచుండుటవలననే అవి లోకములో అంతఃప్రకాశవంతములై విరాజిల్లుచున్నవి వాటి ఆధారమున ఈ ప్రపంచ చక్రము తిరుగుచున్నది. లేనిచో యేక్షణముననో ప్రళయము సంభవించి యుండవలసినదే. సత్యముయొక్క ప్రభావము అత్యద్భుతమైనది.

పన్నెండు సంవత్సరములు మనోవాక్కాయకర్మ సత్యము ననుష్ఠించునెడల తాను నోట వచించినదెల్ల, తలచినదెల్ల సిద్ధించు ప్రభావము కలుగును. సత్యస్వరూపుడగు భగవంతుడు సత్యవాక్య సంపన్నులకే గాని కనుపించడు.



శ్రీమతే రామానుజాయ నమః

శ్రీ ఆళవందారులు శ్రీమహాలక్ష్మి విషయమున సాయించిన

# చతుః శ్లోకి

(టీకా తాత్పర్య సహితము)

"శ్రీమన్నారాయణ"

—:o:—

## సవినయవినతి

'చతుః శ్లోకి' యను ఈ చిన్నిస్తోత్రమును శ్రీవిశిష్టాద్వైత సిద్ధాంత నిర్ధారణ సార్వభౌములున్న, చతుర్వేద షట్ఛాస్త్రాది సకలవిద్యా పారంగతులునగు శ్రీమద్యామునాచార్యులువారు (వీరికే ఆళవందారను నామాంతరము కలదు.) జగన్మాతయగు శ్రీమహాలక్ష్మి విషయమున సాయించిరి,

ఈ స్తోత్రము రూపమున చిన్నదైనను అర్థమున-భావమున మహావిపులమైనది.

ప్రతిమానవుడు దీనిని ప్రతినిత్యము అవశ్యము పఠించవలశినది. విశేషించి శుక్రవారములయందు శ్రీలక్ష్మీకటాక్ష పాత్రులు కాదలచినవారు అర్థానుసంధానపూర్వకముగ సేవించవలశిన స్తోత్రరాజమిది.



తనియన్.

శ్లో. యత్పదాంభోరుహధ్యాన
విధ్వస్తాశేషకల్మషః,
వస్తుతా ముపయాతోహం,
యామునేయం నమామ్యహమ్.

టీక. అహం - నేను
యత్ప, కల్మషః
యత్ - ఏ ఆళవందారులయొక్క
పదాంభోరుహ - పదకమలములయొక్క
ధ్యాన - ధ్యానము చేత
విధ్వస్త - నశింపచేయబడిన
అశేష - సమస్తమైన
కల్మషః - పాపములుగలవాడనై
వస్తుతాం - ఒకవస్తువుగానుండుటను
ఉపయాతః - పొందితినో
తం - అట్టి
యామునేయం - యమునాదేవి కుమారులైన ఆళవందారులను
నమామి - నమస్కరించుచున్నాను

తా. శ్రీఆళవందారులనెడు ఆచార్యులయొక్క పదకమలములను ధ్యానముచేసి దానిచే సకల పాపములనుండి తొలఁగినవాఁడనైన నేను ఒక వస్తువుగా నుండుటంబట్టి యమున సూనులైన ఆచార్యులను నమస్కరించుచున్నాను.

ఈ మొదటిశ్లోకమునందు శ్రీమహాలక్ష్మీదేవి నిత్యవిభూతికిని లీలావిభూతికిని స్వామినియై యుండుట మొదలుగాఁగల కల్యాణగుణములను కృపచేయుచున్నారు.

శ్లో. కాంతః స్తే పురుషోత్తమః ఫణిపతిః,
శయ్యాఽఽసనం వాహనం
వేదాత్మా విహగేశ్వరో యవనికా,
మాయా జగన్మోహినీ,
బ్రహ్మేశాది సురవ్రజ స్సదయితః
త్వద్దాస దాసీగణః,
శ్రీ రిత్యేవ చ నామ తే భగవతి,
బ్రూమః కథం త్వాం వయమ్. ౧.

టీ. తే - నీకు
కాంతః - భర్త
పురుషోత్తమః - పరమపురుషుఁడైన విష్ణువు.
ఫణిపతిః - సర్పరాజైన ఆదిశేషుఁడు
శయ్యా - పాన్పు.
ఆసనం - ఆసనము.
వేదాత్మా - వేదస్వరూపుఁడైన
విహగేశ్వరః - పక్షిరాజైనగరుత్మంతుడు.
ఆసనం - ఆసనము
వాహనం - వాహనము.
జగన్మోహినీ - లోకమునుభ్రమింపఁజేయు
మాయా - మూలప్రకృతి
యవనికా - తెర.
సదయితః - పత్నులతోఁగూడిన
బ్రహ్మేశాదిసురవ్రజః.
బ్రహ్మ - బ్రహ్మదేవుఁడు
ఈశ - శివుఁడు
ఆది - మొదలుగాఁగల
సురవ్రజః - దేవసమూహము
త్వద్దాసదాసీగణః -
త్వత్ - నీకు
దాసః - భృత్యసమూహముగాను
దాసీగణః - పరిచారికా సమూహముగాను (ఉన్నది)
తే - నీకు
శ్రీః. ఇతి, ఏవ, చ - "శ్రీ" అనియే
నామ - పేరు
భగవతి - సర్వమంగళగుణములతోఁగూడిన
శ్రీ మహాలక్ష్మీదేవీ!
వయం - మేము
త్వాం - నిన్ను
కథం - ఏమని
బ్రూమః - చెప్పగలము.

తా. శ్రీమహాలక్ష్మీదేవీ: పరమపురుషుఁడైన శ్రీమన్నారాయణుఁడు నీకు భర్త. ఆదిశేషుఁడు శయ్యగను ఆసనముగనునున్నాఁడు. వేదమూర్తియైన గరుత్మంతుఁడు నీకు వాహనముగను ఆసనముగను నున్నాఁడు. బ్రహ్మదేవుఁడు రుద్రుఁడు మొదలగు దేవతలు నీకు సేవకులుగనున్నారు. సరస్వతి పార్వతి మొదలగు దేవతాస్త్రీలు నీకు ఊడిగములు చేయువారుగ నున్నారు. శ్రీయనెడి పేరు నీకు గలిగియున్నది. కావున సకలకల్యాణ గుణములతోఁగూడిన నిన్ను నెట్లుస్తుతింపగలము? అనఁగా నీయొక్క కల్యాణగుణములు అపారము గాన పొగడుటకెవ్వరికిని సాధ్యముకాదని భావము.

శ్రీ మహాలక్ష్మియొక్క సౌలభ్యగుణమును అనుసంధించి స్తుతించుటకు సాధ్యము కాకపోయి

నను దాసులయందు వాత్సల్యముగల శ్రీలక్ష్మీ దేవి తమయందు అనుగ్రహము చేయగలదని చెప్పుచున్నారు.

శ్లో. యస్యాస్తే మహిమాన మాత్మన ఇవ
త్వద్వల్లభోఽపి ప్రభుః
నాలం మాతు మియత్తయా నిరవధిం
నిత్యానుకూలం స్వతః,
తాం త్వాం దాస ఇతి ప్రపన్న ఇతి చ
స్తోష్యా మ్యహం నిర్భయో
లోకైకేశ్వరి లోకనాథ దయితే
దాన్తే దయాం తే విదన్.    ౨.

టీ. యస్యాః - ఏ
తే - నీయొక్క
నిరవధిం - హద్దులేనిదిగాను
నిత్యానుకూలం, నిత్య - సర్వకాలమును
అనుకూలం - అనుకూలముగను (ఉండునట్టి)
మహిమానం - మాహాత్మ్యమును
త్వద్వల్లభోఽపి.
త్వత్ - నీయొక్క
వల్లభోఽపి - ప్రియుఁడైన భగవంతుఁడుకూడ
ఆత్మనః - తనయొక్క
మహిమానం ఇవ - మహిమవలెనే
ఇయత్తయా - ఇంతమాత్రమని
మాతుం - నిర్ణయించుటకు
ప్రభుః - సమర్థుఁడు
నఅలం - కాఁడు
హే లోకనాధదయితే,
లోకనాథ - లోకములకు ప్రభువైన భగవంతునకు
దయితే - ప్రియురాలా!
హే లోకైకేశ్వరి - సకలలోకములకు ఒకఁడేనాయకుఁడైన భగవంతునికి మహిషియైన శ్రీమహాలక్ష్మీదేవి!
దాన్తే - ఇంద్రియములను నిరోధించిన ప్రపన్నులయందు
తే - నీయొక్క
దయాం - దయను
విదన్ - తెలుసుకొన్నవాడగుచు.
అహం - నేను
తాం - అట్టిమహిమగల
త్వాం - నిన్ను
దాసఇతి - దాసుఁడననియును
ప్రపన్నఇతి - ప్రపన్నుఁడననియును (ఎంచి)
నిర్భయః - భయములేనివాఁడనై
స్తోష్యామి - స్తుతింపఁబోవుచున్నాఁడను.

తా. శ్రీమహాలక్ష్మీదేవి! సర్వము నెఱింగిన వాఁడును నీకు ప్రియుఁడును నగు భగవంతుఁడు తనమహిమ నెట్లు ఇంతయని నిర్ణయించి తెలిసికొనలేఁడో, అట్టులనే నిర్ణయింప సాధ్యముకానిదియును సకలచేతనులకును అనుకూలమును నైనట్టి నీయొక్క మహిమను ఇంతయని నిర్ణయించుటకు శక్తిలేనివాఁడై యున్నాఁడు. అయినను జితేంద్రియులైన ప్రపన్నులయందు నీవు మిగులదయతో గూడియుండుటను నేనెఱింగిన వాఁడనగుటచేత నీకు దాసుఁడుగను ప్రపన్నుఁడుగనునుండు దాసునియందు అనుగ్రహము చేయుదువని ఆ ప్రకారమైన మహిమతోడ (అపారమహిమతోడ) గూడిన నిన్ను నిర్భయుడనై నుతించుటకు యత్నించుచున్నాను.

శ్రీమహాలక్ష్మీదేవి ఆశ్రయించువారిని ఫలమొసంగునది యనియును భక్తసులభయనియును పురుషార్థదాయిని యనియును నిరూపించుచున్నారు.

శ్లో. ఈష త్త్వత్కరుణా నిరీక్షణ సుధా-
సంధుక్షణా ద్రక్ష్యతే
నష్టం ప్రాక్తదలాభత స్త్రిభువనం
సంప్రత్యనన్తోదయం,
శ్రేయో నహ్యరవింద లోచన మనః
కాన్తా ప్రసాదా దృతే
సంసృత్యక్షర వైష్ణవాధ్వసు నృణాం
సంభావ్యతే కర్హిచిత్.

టీ. ఈష......క్షణాత్.
ఈషత్ - స్వల్పమైన
త్వత్ - నీయొక్క
కరుణా - దయతో కూడుకున్న
నిరీక్షణ - చూపులను
సుధా - అమృతముయొక్క
సంధుక్షణాత్ - వృద్ధిచేయుటవలన
త్రిభువనం - ముల్లోకములును
రక్ష్యతే - రక్షింపఁబడుచున్నవి
ప్రాక్ - పూర్వము
తదలాభతః, తత్ - ఆకటాక్షమును
అలాభతః - పొందకపోవుటవలన
నష్టం - నాశనమైనది
సంప్రతి - ఇప్పుడు
అనన్తోదయం. అనన్త - అంతములేని
ఉదయం - జన్మములు గలెను
అరవింద...... దృతే,
అరవిందలోచన-పుండరీకాక్షుఁడైన భగవంతునియొక్క
మనఃకాన్తా - మనస్సున కాహ్లాదకారిణియైన
మహాలక్ష్మీదేవియొక్క
ప్రసాదాదృతే - అనుగ్రహమువలన తప్ప
సంసృత్యక్షరవైష్ణవాధ్వసు,
సంసృతి - సంసారమందుగాని
అక్షర - కైవల్యమందుగాని
వైష్ణవాధ్వసు - పరమపదమునందుగాని
నృణాం - చేతనులకు
శ్రేయః - శ్రేయస్సు
కర్హిచిత్ - ఒక్కప్పుడును
నసంభావ్యతే హి - కలుగుటలేదు కదా.

తా. శ్రీమహాలక్ష్మీదేవీ! నీయొక్క దయకు కారణమైన కటాక్షామృతలేశముచేత ఈత్రిలోకములయందుండువారును రక్షింపబడుచున్నారు. నీకటాక్షములేని సమయమునందు నశించెదరు. మఱల వారు నీయొక్క కటాక్షమును బొందిన యెడల సృష్టింపఁబడెదరు. ఈ యాత్మలకు ఈ భూలోకమునందు ఐశ్వర్యముల ననుభవించుటయందును, కైవల్యము నందాత్మానుభవము చేయుటయందు పరమపదమునందు బ్రహ్మానుభవము చేయుటయందును, శ్రీమహాలక్ష్మియొక్క దయలేనిచో ఒకప్పుడును వీరికి శ్రేయస్సు కలుగుటలేదుకదా.

శ్రీ మహాలక్ష్మీదేవి భగవంతుని యొక్క స్వరూపముతోడను, దివ్యమంగళ విగ్రహము తోడను సదా కూడియున్నదనియును, భగవంతునివలెనే మోక్షప్రదురాలనియును జెప్పు చున్నారు.

శ్లో. శాన్తానన్త మహా విభూతి పరమం
యద్బ్రహ్మ రూపం హరేః
మూర్తం బ్రహ్మ తతోపి తత్ప్రియతరం
రూపం య దత్యద్భుతం,
యాన్యన్యాని యథాసుఖం విహరతో
రూపాణి సర్వాణి తా
న్యాహు స్స్వైరనురూప రూప విభవై ర్
గాఢోపగూఢాని తే. ౪.

టీ. శాన్తాన న్త మహావిభూతి
శాన్త - దోషరహితమైన
అనన్త - లెక్కింపఁ శక్యముగాని
మహావిభూతి - అధికైశ్వర్యముతోఁగూడుకున్నట్టియు
పరమం - అన్నిటికంటె శ్రేష్ఠమైనట్టియు
బ్రహ్మ - గొప్పమహిమగలిగినట్టియు
హరేః - భగవంతునియొక్క
రూపం - దివ్యాత్మస్వరూపము
యత్ - ఏదిగలదో
తేత్ అపి - ఆదివ్యాత్మస్వరూపముకంటెను
ప్రియతరమ్ - మిగులప్రియమైనట్టియు
మూర్తం -దివ్యమంగళవిగ్రహముతోఁగూడినట్టియు
అత్యద్భుతం - మిక్కిలి ఆశ్చర్యకరమైనట్టియు
తత్ - ఆప్రసిద్ధినిబొందిన
రూపం - పరవాసు దేవరూపమైనది
యత్ - ఏదిగలదో
యథాసుఖం - సౌఖ్యముగ
విహరతః - క్రీడించుచుండు (భగవంతునియొక్క)
అన్యాని - ఇతరములైన
రూపాణి - వ్యూహవిభవాదులైన రూపములు
యాని - ఏవికలవో
తాని - ఆట్టి
సర్వాణి - సమస్తములైన భగవద్రూపములు
తే - నీయొక్క
స్వైః- స్వకీయములైన
అనురూప రూపవిభవైః
అనురూప - తగినట్టి
రూప - అవతారములయొక్క
విభవైః - సంపదలచేత
గాఢోపగూఢాని - గాఢ - దృఢమిగా
ఉపగూఢాని - చేర్పఁబడియున్నవానినిగా
ఆహుః - చెప్పుచున్నారు.

తా. క్షుత్పిపాసాది ఏదోషములు లేనట్టియు దేశకాల స్వరూపములచేత లెక్కింప శక్యము కానట్టియు, అన్తములేనట్టియు, నిత్యవిభూతియని యును లీలావిభూతియనియును ద్వివిధవిభూతులు గలదియును, అన్నిటికంటె శ్రేష్ఠమైనదియును, అన్నిటికంటె అధికమైనదియునునగు భగవంతునియొక్క దివ్యస్వరూపమునందును, రూపౌదార్యాదిగుణములచేత ఆ దివ్యాత్మస్వరూపము కంటెను ధ్యానముచేయువారికి మిగుల ప్రియమైనదిగను, దానిని సేవించువారికిమిగులఆశ్చర్యమొందఁదగినదిగను; మఱియు తమ స్వేచ్ఛప్రకారము క్రీడార్థముగాఁ గావింపఁబడియుండు వ్యూహావతారములనియు విభవావతారములనియు, అర్చావతారములనియు పేరొందిన దివ్యావతార రూపములన్నిటి యందును; ఆయా రూపములకుఁ దగినట్లు నీయొక్క దివ్యరూపములు సదా యెడబాయక చేరియున్నవని శాస్త్రవేత్తలు చెప్పుచున్నారు.

భక్తులందరు దీనిని అనుసంధించుచు పురుషకారభూతురాలైన శ్రీ లక్ష్మీదేవియొక్క దయకు పాత్రులగుదురుగాక.



# పంచోపనిషన్మయము

శ్రీమన్నారాయణ



అసలు తత్త్వములు మూడు:- ౧. చిత్తు ౨. అచిత్తు ౩. ఈశ్వరుడు. ఇందు అచిత్తు తిరిగి మూడు విధములుగ యుండును.

౧. శుద్ధసత్త్వము.

౨. మిశ్రసత్త్వము.

౩. సత్త్వశూన్యము.

ఇందులో శుద్ధసత్త్వము నిత్యవిభూతిరూపమై విరజానదికిఅవతల భగవత్-భాగవత-సంచారానుసారముగ ఆరామ-గోపుర-ప్రాకార-మంటప తటాక-ప్రాసాదాది బహురూపేణ అగణితమై అప్రమేయమై నిత్యమై కల్యాణప్రదమై, ఆనంద జనకమై, సుఖావాసమై, శ్రేయోదాయకమై యుండును.

పరమపదమందలి భగవత్-భాగవత విగ్రహాదులన్నియు ఈశుద్ధసత్త్వమయములే.

ఈశుద్ధసత్త్వము కూడ అచిత్తుయొక్క అవాంతరభేదమే అయినను దానియొక్క హేయరాహిత్యాది గుణవిశేషమును బట్టి అది అప్రాకృతమని వ్యవహరించబడుచున్నది. వికారాస్పదమైన మూలప్రకృతియొక్క అవస్థ మొదలు తదనంతర అవస్థల బొందు అచిత్తు అంతయు మాత్రము ప్రకృతి అని వ్యవహరించబడుచున్నది.

కనుకనే నిత్యవిభూతిని, తదవాంతర వస్తు సముదాయమును అప్రాకృతమని నిర్ణయించిరి.

శ్రీపరమపదవాసుని దివ్యమంగళ విగ్రహము కూడ యిట్టి అప్రాకృతమైనదియే. దీనినే పంచోపనిషన్మయమని యందురు.

ఈశుద్ధసత్త్వమునకు అయిదు అధిష్ఠాన దేవతలు, తత్ప్రతిపాదకమైన ఉపనిషత్తులు ప్రధానమైనవి అయిదున్ను, అందు మూలభూతములైన ప్రధానబీజాక్షరములు అయిదున్ను గలవు.

ఇట్టి పంచోపనిషత్ప్రతిపాదకమై తదధిష్ఠాన దేవతాత్మకమై, తద్బీజాక్షర-సంఘటిత-మూలమై విలసిల్లు మూర్తియే పరమపదనాథుని భవ్యమైన దివ్యమూర్తి.

| పంచోపనిషన్మయ బీజములు | పంచోపనిషన్మయాధిష్ఠానస్వరూపములు | స్థానములు |
|---|---|---|
| (ఓం) షాం | పరమేష్ఠిః | శిరస్సు. |
| యాం. | పురుషః | నాసాగ్రము |
| రాం. | విశ్వాత్మం. | హృదయము. |
| వాం. | నివృత్తాత్మా. | గుహ్యము. |
| లాం. | సర్వాత్మా. | పాదములు. |






# ★ మోక్షసాధనము ★

న. చ. ఆండాళమ్మగారు.

మోక్షమునకు హరిభక్తియొక్కటే సాధనము. మరి సాధన మేదియు లేదు. భక్తి యనగా మనోవాక్కాయకర్మలచే సర్వకాల-సర్వావస్థల యందును తైలధారవలె అవిచ్ఛిన్నముగా భగవానుని స్మరించుచుండుట. ఇది ఎట్లు కలుగును? భగవంతుని యందుమాత్రము ప్రీతియు, భగవదేతరముల యందు వైరాగ్యమున్ను యుండిన కలుగును. మనకి మనతల్లి తండ్రులమీదను, భర్త మీదను, మన సంతానముమీదను, ఇష్టమైన యనుభవముల మీదను ఎటుల ప్రీతి కలుగుచున్నది? అవి మనకు కావలసినవని నిర్ణయించుకొని వాటి యందుగల గుణములను ప్రేమించుచుండుట చేతనే కదా. అటులనే భగవంతునితో మనకుగల నవవిధసంబంధములను

శ్లో॥ పితా చ రక్షక శ్శేషీ ।
భర్తాజ్ఞేయో రమాపతిః ।

తెలుసుకొని ఆయనను ప్రేమించ నిశ్చయించుకొని తదేక ధ్యానముతో అభ్యసించుట వలన భగవంతునియందు మనకు ప్రేమ కలుగగలదు.

మనము సర్పమునుజూచిన భయపడుదుము. విషమునుజూచిన అసహ్యపడుదుము. ఎందుచేత? అవి మనకు హాని కలిగించునవనియు, మనకవసరమైనవి కావనియు నిర్ణయించుకొని వానియందలి దోషములను ద్వేషించుచుండుట చేతనే కదా. ఇందువలన వీనిపై మనకు విరక్తి కలుగుచున్నది దానివలన వానిని విడిచిపెట్టుచున్నాము.

అనగా మనము ప్రేమించ దలచినవానియందు గుణమును మాత్రమే గ్రహించుచుండవలయును కనుక మనకు కావలసినది భగవంతుడు. గాన భగవంతునియందలి కల్యాణగుణములనే గ్రహించవలయును. అక్కరలేనివి భగవదేతరములు గాన వాని యందలి అల్పత్వ-అస్థిరత్వ-హానికరత్వ-స్వరూప విరుద్ధత్వాది దోషములనే గ్రహించవలయును.

భగవంతుడు తప్ప దోషములులేని పదార్థ మేదియు ప్రపంచమున లేదు.

లోకములో భగవంతుని ద్వేషించు జనులు కూడ కొందరున్నారు. వారి ద్వేషమునకు కారణము భగవంతుని యందలి దోషములు కావు. దీనికి కారణము కేవలము వీని అజ్ఞానమే. మన ముఖమందలి మాలిన్యము స్వచ్ఛమైన అద్దములో ప్రతిబింబించుట లేదా?

అయితే ఈభక్తిని ఎంతికాలము అభ్యసించిన ఫలవంతమగును. భక్తినిష్ఠకి పరిమితి లేదు. ఈ ఆత్మ ఈ శరీరమును విడుచుటవరకుగల కాలమే దీని పరిమితి. అది ఒక క్షణమే కావచ్చును, లేదా కొన్ని సంవత్సరములే కావచ్చును.

దానికొక ఉదహారణ తెలిపెదను.

ఒకప్పుడు దేవతలకు దానవులకూ గొప్ప యుద్ధము జరిగెను. రాక్షసులు బలశాలులై యుండిరి. దేవతలకు ఓటమిస్థితి సంభవించెను. అప్పుడు భూలోకమున ఖట్వాంగుడను రాజ శ్రేష్ఠుడు రాజ్యమేలుచుండెను. అతనుకడుంగడు బలవంతుడు. మహాజ్ఞానవైరాగ్య సంపన్నుడు. దూరదర్శి. ఈతనిని దేవతలు సహాయముకోరిరి. వల్లెయని ఇతను వెళ్ళి రాక్షసుల ఓడించెను. దేవతలు విజయులైరి. సంతుష్టులైన దేవతలు ఖట్వాంగుని తమవల్ల ఏదైన వరమడుగు మనిరి. జ్ఞానియైన ఖట్వాంగుడు తన కంకను ఎంత ఆయుర్దాయము కలదో తెలుపమనెను. దేవత లాలోచించి లెఖకట్టి ఇంక రెండు ఘడియలు మాత్రమే అతని కాయుఃపరిమితి కలదని తెలిపిరి.

తెలివిగల ఖట్వాంగుడు తన ఆయుష్షును తెలుసుకొని చాల సంతోషించెను. దివ్యమని భూలోకమునకు దిగెను. తన పుత్ర–మిత్ర–కళత్ర ధన–ధాన్య–పశు–అన్నాది సమస్తమును సవాసగ్న విడిచిబుచ్చెను. మహావైరాగ్య సంపన్నుడై ఏకాంతస్థానమున ఏకాగ్రచిత్తుడై భగవంతుని ఆకొద్దిసేపు పరమప్రీతితో ధ్యానించెను. ఇతని భక్తికి మెచ్చిన భగవంతుడు వెంటనే యితనికి మోక్షమిచ్చెను.

నిశ్చలమైన భక్తియే భగవంతునికి కావలశినది. అంతే కాని దాని కాలపరిమితితో గాని లేక వీని వర్ణ–ఆశ్రమ– వయో– అంగాదులతో గాని భగవంతునికి పనిలేదు. గాన మనము కూడ యితర విషయవైరాగ్యచిత్తులమై భగవంతుని ప్రేమించి, ధ్యానించి తరించ ప్రయత్నింతుము గాక.



## ప్రచార విభాగము.

# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ

# శుక్రవారోత్సవములు

### అత్తమూరు.

13-10-50 కోనాల సుబ్బిరెడ్డి భార్య ఆదెమ్మగారు.

20-10-50 సబ్బెళ్ల గొల్లారెడ్డి భార్య వీరమ్మగారు.

27-10-50 సత్తి సూరయ్య భార్య సూరమ్మగారు.

3-11-50 లంక వీరారాజు భార్య రవణమ్మ గారు

### మైలవరము

18-8-50 మైలవరపు శ్రీవెంకటేశ్వర దేవాలయములో

25-8-50 ,,

1-9-50 ,,

8-9-50 ,,

కస్తూరి మహిళాసేవికన్య 1-0-0 నిధి ఇచ్చెను.

### మదరాసు

మదరాసు శ్రీయతిరాజసేవా మహిళాసమితి కార్యదర్శి శ్రీమతి పువ్వాడ మంగమ్మగారిచే ఎరదా ముత్తియప్పన్ వీధిలోని సుధానిధిలో ఈ నెలలోని శుక్రవారోత్సవము లన్నియు జరుపబడినవి. తిరునెడూ౦ దాండగం కాలక్షేపము జరుగుచున్నది.

### విజయవాడ

| | | వచ్చిన నిధి |
|---|---|---|
| 4-8-50 | కె. ధనమ్మ | 1-8-0 |
| 11-8-50 | కె. ధనమ్మ | 1-10-0 |
| 18-8-50 | క. రాధనాయకమ్మగారు | 2-0-0 |
| 25-8-50 | కె. ధనమ్మ | 1-9-0 |
| 1-9-50 | సన్నిధిలో | 1- 0-0 |
| 8-9-50 | కె. ధనమ్మ | 1- 2-0 |
| 15-9150 | కె. ధనమ్మ | 1-13-6 |
| 22-9-50 | కె. ధనమ్మ | 1- 8-0 |
| 29-9-50 | కె. ధనమ్మ | 2- 3-6 |

### విశాఖపట్టణము

| | | |
|---|---|---|
| 4-8-50 | భక్తురాలు. | 0-4-0 |
| 11-8-50 | ఎ. వెంకటనరసమ్మగారు | 0-4-0 |
| 18-8-50 | రా. రామయ్యమ్మగారు | 0-4-0 |
| 25-8-50 | వా. ఆండాళ్లు. | 0-4-0 |
| 29- 9-50 | తాసరి నాగామణి. | 0-8-0 |
| 6-10-50 | క. లక్ష్మీనరసమ్మగారు | 0-8-0 |
| 13-10-50 | కొత్త అచ్యుతాంబగారు | 0-8-0 |
| 20-10-50 | వ. వెంకటనరసమ్మగారు | 0-8-0 |

### బందరు.

బందరులోని శ్రీయతిజసేవా మహిళాసమితి కార్యదర్శి శ్రీమరింగంటి సీతమ్మగారిచే ఈ నెల

లోని శుక్రవారోత్సము లన్నియు గొడుగుపేట లోని శ్రీ వెంకటేశ్వరస్వామివారి కోవిలలో జరుపబడినవి.

## కో రు కొం డ.

కోరుకొండలోని శ్రీయతిరాజసేవామహిళా సమితికార్యదర్శి శ్రీమతి మరింగంటి రంగనాయకమ్మగారిచే వారిస్వగృహమున ఈనెల శుక్రవారోత్సవములన్నియు జరుపబడినవి.

## అ ర్త మూ రు

అర్తమూరులోని శ్రీయతిరాజసేవా మహిళా సమితి కార్యదర్శి శ్రీమతి తాడి గంగమ్మ, మహాలక్ష్మమ్మ వగైరాలచే వివిధప్రాంతము లందు ఈనెల శుక్రవారోత్సవము లన్నియు జరుపబడినవి.

## వి శా ఖ ప ట్ట ణ ము

విశాఖపట్టణ శ్రీయతిరాజ సేవామహిళా సమితివారు శ్రీమతి గొసరి ఆండాళమ్మ, రామునీడు రామాయమ్మ మొన్నగువారిచే ఈనెల శుక్రవారోత్సవములన్నియు బాగుగా జరుపబడినవి.

---

# ఏ కా ద శి ఉ త్స వ ము లు

## వి శా ఖ ప ట్ట ణ ము

| | | |
|---|---|---|
| 9_8_50 | భక్తురాలు. | 0 4 0 |
| 24_9_50 | దా. సుబ్బారావు. | 0 4 0 |
| 3 9 50 | దా. మధుసూధన్ | 0 4 0 |
| 22_9_50 | రా. వెంకటరాములు నాయుడుగారు. | 0 4 0 |

## అ ర్త మూ రు

22_10_50 కీ. శే. కొవ్వూరి సత్తిరెడ్డి భార్య మహాలక్ష్మమ్మగారిపేర జరిపినారు.

---



ఓం తత్ సత్.

శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః.

    

శ్రీమతే రామానుజాయ నమః.

# శ్రీ గీతా సందేశ మహోత్సవము

## శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము - మదరాసు, శాఖ

కార్యాలయము:— 147, అణ్ణాపిళ్లైవీధి, మదరాసు 1.

### —: ఆహ్వాన పత్రిక :—

ప్రపంచమున అనేకానేక మతము లున్నవి. ప్రతి మతమునకు ఆ మత తత్వమును తెలుపు గ్రంథము చిన్నదో పెద్దదో ఒకటి తప్పక యున్నది. ఆ గ్రంథమందలి విధులను చక్కగా తెలుసుకొని వాని ననుసరించుట ఆ మతానుయాయుల కందరకు విధియైయున్నది. అటుల చేసిననాడే వాడు ఆమతస్థుడన చెల్లును.

క్రైస్తవ మతస్థులు బైబిలును చదువుదురు. మహమ్మదీయులు ఖురానును పఠింతురు. హిందువుడు హిందూమత గ్రంథములను చదువని యెడల, దాని యందలి విషయముల తెలుసుకొనని యెడల, తెలుసుకున్న సద్విషయముల ఆచరించజాలని యెడల హిందువు డెటుల యగును? కేవలము హిందూ శబ్ద వాచ్యులమైనంత మాత్రమున హిందూత్వము మనకెట్లు సిద్ధించును.

హిందూమత గ్రంథమేది? వేదము. శ్రీమన్నారాయణుండు స్వయముగా శ్రీకృష్ణుడై అవతరించి సనాతనమగు ఆ వేదమందలి విషయములనే సర్వజన సుభోదకమగునటుల చక్కగా వెల్లడించెను. దానికే భగవద్గీత యని పేరు. దీని ననుసరించియే పూజ్యుడగు వ్యాసమహర్షి తిరిగి వేదముల యందలి సంశయ ఘట్టములవ్యక్తపరచుటకై బ్రహ్మసూత్రములను రచించెను. మరియు ఈ విషయముల ఉదాహరణ పూర్వకముగ వ్యక్తపరచుటకై ఇతిహాస పురాణముల వ్రాసెను.

అందుచే హిందూమత సిద్ధాంత సారములు పండిత పామరులకును; స్త్రీ పురుషులకును; బాల వృద్ధులకును; అతిసులభముగ, అతిస్పష్టముగ, అతిసుభోదకముగ, అనతికాలములో తెలుపు, బోధించు, ఉపదేశించు, ఆదేశించు, గ్రంథరాజము; పరమకారుణికుడగు భగవంతునిచే చేతనోజ్జీవనార్థమై స్వయముగ ఉపదేశించబడిన గ్రంథరాజము;

ఆసేతు - శీతాచల పర్యంతము భారతావని యందే గాక బుద్ధివికాసతగల ప్రతి మానవుని ఆకర్షించి ఆత్మోత్తారక - సులభోపాయమును వెల్లడించు గ్రంథశ్రేష్ఠము;

జీవుని జీవితమందలి ప్రతి సమస్యకున్ను, ప్రతి సంశయమునకున్ను, ప్రతి ప్రశ్నకున్ను, ప్రతి జిజ్ఞాసకున్ను, తిరుగులేని సిద్ధాంతరూప - సమాధాన మొసంగు నిఘంటురూప గ్రంథరత్నము;

లౌకిక - అలౌకికముల ; శరీర - ఆత్మల ; జీవ - పరమాత్మల సమస్యల నన్నింటిని చక్కగా సమన్వయపరచి చేతనోజ్జీవన రాచబాటను విశదపరచు గ్రంథరాజము;

ప్రపంచము యొక్క సృష్టి - స్థితి - లయ - మోక్షము మున్నగు రహస్యముల నన్నింటిని విస్పష్టముగ విశదపరచి వెల్లడించు గ్రంథరాజము భగవద్గీత.

## మానవుని అదృష్టగీత భగవద్గీత.

శ్లో. గీతా సుగీతా కర్తవ్యా కిమన్యైశ్శాస్త్రసంగ్రహైః ।
యా స్వయం పద్మనాభస్య ముఖపద్మాద్వినిస్సృతా. ॥
భారతా - మృత - సర్వస్వం విష్ణోర్వక్త్రా ద్వినిస్సృతం ।
గీతా - గంగోదకం పీత్వా పునర్జన్మ న విద్యతే. ॥

ఇట్టి మహానిధిని కలిగియుండియు, మనము ఈ నాడు ఆధ్యాత్మికముగా నిర్వీర్యులమై యున్నామన్నచో, మతాంతరముల స్వీకరణలు జరుగుచున్నవనినచో; మతము యొక్క నిజమైన కట్టుబాట్లు శిథిలములై - భిన్న భిన్నములై పోవుచున్నవనినచో;ఆధ్యాత్మికముగ మానవజాతి అధోగతిని పొందుచున్నదనినచో; నాస్తికవాదము నలుగడల నలముకొనుచున్నదనినచో, కారణమేమి ? ఈ భగవద్గీతా మహానిధిని మనముపయోగించు కొనలేక పోవుటయే.

ఈ మహానిధిని మనము ఆచరణలో యుంచుకొనలేక పోవుటచేతనే కదా దేశములో కరవులు, కాటకములు - ఈతిబాధలు, తిష్ఠవేసి మనలను తినివేయుచున్నవి. ఈ మహానిధిని గూర్చిన ప్రచారము లేకపోవుట చేతనే కదా మానవు నందలి దేవత్వము - మటుమాయమై, మానవత్వము మాసిపోయి, రాక్షసత్వము తాండవించుచు పరహింస, వంచన, అవినీతి, దురాశ, అశాంతి దినదినాభివృద్ధి గాంచుచున్నవి.

సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు, సర్వవ్యాపి, సర్వసముడు, సర్వమంగళ ప్రదుడు అగు సర్వేశ్వరునితో గల సన్నిహిత సంబంధమును అనుభవ పూర్వకముగ తెలుసుకొని తెలిపినట్టు మహాత్ముల-ఋషిపుంగవుల - మునీశ్వరుల - ఆళ్వారుల పరంపరకు చెందినవారము గదా మనము.

అట్టి మనము నేడు దేహాత్మాభిమానులమై, ఆభాస - శుష్క - మెట్ట - ఆచారణశూన్య - అర్థ రహిత - ఆడంబరసహిత వ్యర్థ వేదాంతులమై, ఆత్మజ్ఞాన శూన్యులమై అధీరులమై యున్నాము.

ఇట్టి మన దుస్థితి, దురవస్థ, దుర్గతి, దుర్మార్గము, దురాలోచన పోవలెనన్నచో ; పవిత్రత-త్యాగము-సేవానిరతి - సర్వసమత్వము - సచ్ఛీలము - సమున్నతి - స్వార్థరాహిత్యము కలుగవలెనన్నచో 'వ్యక్తి-మతము-ధర్మము - నీతి - సంఘము - దేశము - జాతి - ప్రపంచము' - అభ్యున్నతిని పొందవలె నన్నచో భగవద్గీత ఒక్కటే మనకు శరణ్యము.

శ్లో. గీతాశాస్త్ర మిదం పుణ్యం, యఃపఠేత్ ప్రయతః పుమాన్ ।
విష్ణోః పద మవాప్నోతి, భయ - శోకాది - వర్జిత ః ॥

"భగవద్గీతాపఠనము - భగవద్గీతావిచారము - భగవద్గీతాన్వయము - భగవద్గీతోక్తాచరణము
భగవద్గీతాప్రచారము ఇవియే మనకర్తవ్యములు.

ఆస్తికాగ్రేసరులారా! భగవద్భక్తులారా!

దేశాభ్యుదయకరమైన ఈ పవిత్రభావముల, ఈ పవిత్ర ఆశయముల, ఈ పవిత్ర లక్ష్యముల నెరవేర్చుటకై భగవద్గీతాప్రచార ప్రబోధముల గావించుటకై శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘముచే మదరాసు పట్టణమున స్వస్తిశ్రీ వికృతినామ సంవత్సర కార్తీక బ ౭ మి. శనివారము (వృశ్చికమాసము 17.) అనగా ది 2-12-1950 తేది ఉదయము నుండి వరుసగా పదునెనిమిది దినములు అనగా ది 19-12-1950 తేది సాయము వరకు శ్రీ భగవద్గీతా సందేశ మహోత్సవము జరుప నిశ్చయింపబడినది.

ది 1-12-1950 తేది శుక్రవారము సాయంకాలమున అంకురార్పణయు; ది 20-12-1950 తేది బుధవారము ఉదయమున అవభృదోత్సవము జరుగును.

## —: కార్యక్రమము :—

ది 1-12-1950 శుక్రవారము సాయంకాలముల తిరువల్లిక్కేణిలోని శ్రీ గీతాచార్య-పార్థసారథి స్వామి వారి కోవిలనుండి ఊరేగింపుతో బయలుదేరి శ్రీ ఉప్పుటూరి ఆళ్వారు శ్రేష్ఠి చారిటి వారి రామానుజకూటమునకు (48, గోవిందప్పనాయకన్ వీధి, మదరాసు 1.) వచ్చి అచ్చట పారాయణ మంటప ప్రవేశమహోత్సవము, అంకురార్పణము;

ది 2-12-50. శనివారము మొదలు ప్రతిదినము ఉదయము5. 0. గం. కు తిరువారాధనాదికములున్ను; గం. 6-30 నుండి గం. 7-30 వరకు తిరుప్పావైఉత్సవమున్నుగం. 7-30 నుండి గం. 8-0 వరకు అందరుకలసి రోజునకు ఒక్కొక్క అధ్యాయము చొప్పున సమిష్టి పారాయణమున్ను; గం. 8-0 నుండి గం. 8-15 వరకూ కృష్ణనామజపము (సముష్టి) గం. 8-15 నుండి 10-30 వరకు దీక్షితులగు పండితులచే శ్రీ భగవద్గీతయంతయు పూర్తిగా పారాయణమున్ను; అదేసమయమున ఉపన్యాసమంటపమున ఆరోజున సమిష్టిగ పారాయణజేసిన అధ్యాయముయొక్క అర్థవిశేషములు అవకాశమున్న వివిదభాషలలోను ఉపన్యసించబడుచుండుటయున్ను, మధ్యాహ్నము గం, 2-0 లగాయతు గం. 5-0 వరకు సుప్రసిద్ధ పండితప్రవరులచే ఆ దినమున సమిష్టిపారాయణచేయబడిన అధ్యాయముపై విశేషార్థవిమర్శన ఉపన్యాసపూర్వకముగా ప్రచారకులకు శిక్షణ నిచ్చుటయున్ను; సాయంత్రము గం. 5-30 లగాయతు గం. 8-30 వరకు భగవద్గీతపై వివిధ విషయముల గూర్చి ఉపన్యాసము లిచ్చుటయున్ను, రాత్రి గం. 8-30 నుండి 10 గం. వరకు హిందీబాషలో ఏకాంబరేశ్వరఅగ్రహారపు గుంటకు వెనుకప్రక్కను ఉపన్యాసములు భగవద్గీతపై నొసంగబడును.

ది 20-12-1950 తేది బుధవారము ఉదయము గం. 8-0 కు జార్జిటవునుసముద్రతీరమున అవబృధోత్సవమున్ను జరుగును.

ఈ కార్యక్రమముతోపాటుగ ఈ పదునెనిమిది దినములు, అవకాశమున్నన్ని భారతదేశమందును ఖండాంతరములయందును గల శ్రీ భగవద్గీతయొక్క ముద్రితాముద్రిత గ్రంథరాజముల దీనికి సంబంధించిన వాఙ్మయ ప్రదర్శనమున్ను జరుపబడును.

మరియు శ్రీ భగవద్గీతమూలము అర్థము - వ్యాఖ్యానములు - విమర్శనలు - ఉపన్యాసములయందు పరీక్షుల నేర్పరచి అందు తీర్ణులైన వారలకు బహుమతులును బిరుదములున్ను యివ్వబడును.

వీలునుబట్టి "గీతామందిరమును" స్థాపించు ప్రయత్నము చేయబడును.

ఈ పవిత్రమహోత్సవమున తాము పాల్గొనియు, దీని ఆహ్వానసంఘమున తాము సభ్యులుగ ... తరులచేర్పించియు, తమకందుబాటులోగల శ్రీ భగవద్గీతా వాఙ్మయమును ప్రదర్శనమునకిచ్చియు, ఇంకను తమకుచితమనితోచిన విధముగ సహాయముజేసి ఈ మహోత్సవమును వైభవోపేతముగానడిపించ వలసినదిగ ప్రార్థించుచున్నాము.

(తాము ప్రదర్శనముకిచ్చు శ్రీ భగవద్గీతా వాఙ్మయమును తిరిగి ప్రదర్శనాంతరమున తమకు అతిజాగ్రత్తగా వప్పగించగలము.)

ఇట్లు,

శ్రీ విశిష్టాద్వైతప్రచారక సంఘ
శ్రీ భగవద్గీతా మహోత్సవాహ్వానసంఘము.

అధ్యక్షులు

రావుబహదూర్
శ్రీమాన్ వేమూరి రంగనాథశ్రేష్టి.
(తిరువళ్లిక్కేని శ్రీపార్థసారథి స్వామివారి దేవాళయ దర్మకర్తలు)

మద్రాసుశాఖ అధ్యక్షులు
మట్టుపల్లి రంగనాదయ్య.

కేంద్రకార్యదర్శులు
1. తెం. క. గోపాలాచార్యులు.
2. ఆ. చి. శ్రీమన్నారాయణ.

కార్యదర్శులు
కేశవలాల్ తర్వాడి బి. ఎ. బి. ఎల్
కరాలపాటి రాధాకృష్ణయ్య.

కోశాధిపతి
కొంజేటి సుబ్బారాయులు శ్రేష్టి.

---

## ఆహ్వానసంఘ సభ్యత్వము.

| | | | | |
|---|---|---|---|---|
| మహారాజపోషకులు. | రూ. 1118-0-0. లు గాని | అంతకంటె | అధికముగాని | సమర్పించువారు. |
| రాజపోషకులు. | 518-0-0. | ,, | ,, | ,, |
| పోషకులు. | 218-0-0. | ,, | ,, | ,, |
| సహాయకులు. | 118-0-0. | ,, | ,, | ,, |
| సభ్యులు. | 58-0-0. | ,, | ,, | ,, |
| అభిమానులు. | 25-0-0. | ,, | ,, | ,, |
| చందాదారులు. | 18-0-0. | ,, | ,, | ,, |

T. V. C. Press Madras.

శ్రీమతే రామానుజాయనమః



భక్తి

# నివేదన

వేదాంత మాస పత్రిక

| సంపుటి ౨ | వికృతి – కార్తీకము | సంచిక ౮ |
| --- | --- | --- |

## విశిష్టాద్వైతము

"శ్రీమన్నారాయణ"

సహకారి కారణమనియు; సృష్ట్యాద్యనుగుణ సంకల్పాదుల నాశ్రయుఁడైన పరమాత్ముఁడే నిమిత్తకారణనియు; సగుణశ్రుతులన్నియు భగవంతునియొక్క వాస్తవిక అనంత కళ్యాణగుణములను తెలుపునవనియు; నిర్గుణ శ్రుతులన్నియు భగవంతుని యందు ఎట్టి హేయగుణము లేవని తెలుపుచున్నవనియు;

అభేదమును తెలుపు శ్రుతులన్నియు 'ఆత్మభూతుఁడైన పరమాత్మను విడిచి చిత్తు అచిత్తులు భిన్నములై యుండజాలవు. ఆయనకు శరీరములై అపృథక్ సిద్ధి సంబంధముచే ఆయనతో కలిసి అభిన్నములైయే యుండునవి గాని స్వతంత్రమైన భేదము లేనివి. అని తెలుపుచున్నవనియు; భేదమును తెలుపు శ్రుతులన్నియు చిదచిత్తులు పరమాత్మతో కలసి యున్నను నిత్యత్వ అనిత్యత్వ; పరిణామత్వ-అపరిణామత్వ; అల్పత్వ-మహత్త్వాది చేతనత్వ, అచేతనత్వాది స్వభావ-స్వరూపములలో చిత్తు, అచిత్తు-ఈశ్వరులు భిన్నులు, అని తెలుపుచున్నవనియు; వాచ్యత్వాదుల నిషేధించు శ్రుతులన్నియు; పరమాత్మ దేశతః-కాలతః వస్తుతః పరిచ్ఛేదించ వీలులేనివాడని తెలుపుచున్నవనియు; పరమాత్మకు ఉత్పత్తిలేదను శ్రుతులన్నియు, పరమాత్ముఁడు మనవలె కర్మకృతమైన ఉత్పత్తి లేనివాడని తెలుపుచున్నవనియు; పరమాత్మకు ఉత్పత్తిని తెలుపు శ్రుతులన్నియు, పరమాత్ముఁడు స్వాశ్రిత సాధుజన సంరక్షణార్థమై తన సంకల్పముచేతనే స్వేచ్ఛగ ఎత్తిన అవతారవిశేషములు కలవాఁడని తెలుపుచున్నవనియు; జీవుల పరస్పరైక్యమును తెలుపు శ్రుతు

లన్నియు 'జీవులందరు జ్ఞానమును ఆకారముచే ఏకరూపులై యుందురని ప్రకారైక్యమును తెలుపు చున్నవనియు; జీవుల పరస్పర భేదమును తెలుపు శ్రుతులనియు, 'జీవులు తమ తమ కర్మాను గుణమైన స్వరూప-స్వభావ-అనుభవములలో భిన్నులై యుందురని, తెలుపుచున్నవనియు; పర బ్రహ్మ అద్వితీయుడను తెలుపు శ్రుతులన్నియు; పరబ్రహ్మ చిత్తు-అచిత్తులను శరీరముగా కలిగి యుండుటచే స్వ జాతీయమైన మరియొకటి యేదియు లేనివాడు; అని తెలుపుచున్నవనియు:

ఈవిధముగా శరీరములైన చిత్తు అచిత్తులకును, శరీరములైన ఈశ్వరునికి భేదమును అంగీక రించుట వలన, బంధ-మోక్షవ్యవస్థయు, ఉపదేశాదులును, తత్త్వజ్ఞానవ్యవస్థయు చక్కగా కుదురును. గాన ఇట్టివాటిని తెలుపు శ్రుతివాక్యముల కన్నియు ఈవిధముగానే అర్థమును తెలుసుకొనవలె ననియు;

చేతనుని యొక్క మొట్టమొదటి ప్రవృత్తి సర్వేశ్వరునియొక్క స్వీయస్వాతంత్ర్యానుసార ముగ చేతనుని యొక్క-పూర్వకృత కర్మానుసారము జరుగును. గాన విధి-నిషేధముల తెలుపు శాస్త్రము నిరర్థకము కాదు అనియు;

సర్వేశ్వరుడు నిర్వికారుడు యను అర్థమును తెలుపు శ్రుతులు, ఆయన నిత్యమైన కల్యాణ గుణములకు ఆశ్రయుడై, చేతనులు జేసిన యాగ-ఉపాసనాదులచే ప్రీతుడగుచు వారల యభీష్టా దుల దీర్చు పరమకారుణికుడగుట ప్రమాణసిద్ధమగుటవలన, ఆయన యందు కర్మజన్యమైన హేయవికారములేవియు లేవు అని తెలుపుచున్నవనియు;

సర్వేశ్వరుడు తానే సంకల్పించుకొని తదనుసారముగ ప్రపంచరూపముగా అనేకపదార్థ ముగా నాయెను. అని శ్రుతులు తెలుపుచుండుటచే, "వికారము లనునవి అపురుషార్థములుగాన అవి సర్వేశ్వరుని యందు లేవు" అని తెలుపు శ్రుతులకు సాక్షాత్తు సంబంధేన సర్వేశ్వరుని యందెట్టి వికారములులేవని తాత్పర్య మనియు;

చేతనుడు చేసిన పుణ్యకార్యముల వలన సర్వేశ్వరునికి ప్రీతికలుగును. దాని వలన స్వర్గాది పుణ్యలోకానుభవము కలుగును, చేతనుడు చేసిన పాపకార్యముల వలన సర్వేశ్వరునికి అయిష్టత కోపము కలుగును, దానివలన నరకాది పాపలోకానుభవము కలుగును, గాన యిట్టి భగవన్ని గ్రహానుగ్రహముల కంటె స్వర్గనరకాదులకు వేరే 'అపూర్వము' ను కారణము లేదనియు;

ఇంద్రాదివ్యక్తులు ఆయకల్పాంతమున నశించినప్పటికిన్ని ఆయా ఇంద్రాదులకు అంతర్యామిగాయుండు పరమాత్మ ఎప్పటికిన్ని నిత్యుడై స్థాయిగా యుండును గాన అయనచే ఈ చేత నులు జేసిన కర్మలకు ఫలము కలుగుటలో హానిలేదనియు;

ఫలదాత సాక్షాత్తు సర్వేశ్వరుడే అయినను ఇంద్రాదులయొక్క అనుగ్రహములు అవాంతర

కారణములు కావున ఇంద్రాద్యారాధనములు వ్యర్థములుకావు. మరియు మనుష్యాదులచే సర్వేశ్వరుడు ఇంద్రాదులద్వారా ఆరాధింపబడును గాన మనుష్యాదులు ఇంద్రాదుల సాక్షాత్తు ఆరాధించుటలోగాని ఎట్టివిరోధము లేదనియు!

చేతనుడు నొల్లనొల్లని విధుక్కర్మలయందు ప్రవర్తించుటలో, సర్వస్వతంత్రుడును, లీలారసానుభవకాంక్షియు నిర్నిమిత్తుడైన అయినసర్వేశ్వరుడు ఈచేతనుని ఆటంకపరచకుండగ జూచుచుండుటగాని, అనుమతించుటగాని ఎట్టిదోషావహము గాదనియు:

ఈవిధముగా శ్రుతులలోని అన్నివాక్యములకు శ్రీరామానుజులవారు ఎట్టివిరోధము లేకుండగ చక్కగ సమన్వయపరచి అర్థమును తెలిపిరి.

శిష్యుడు:- పరమాత్మునకి అట్టి స్వాతంత్ర్యము వహించుట దోషముకాదా?

గురువు:- నాయనా! పరమాత్మునియొక్క నిరంకుశ స్వాతంత్ర్యము గుణముగాని దోషమెంతమాత్రమున్ను గాదు. ఏలనన సర్వేశ్వరుడు జీవునికి జ్ఞానమున్ను, దానినుపయోగించుకొనవలెనంటే నడుచుకొనుటకు శరీరమున్ను, ఇంద్రియములను, విషయములను, మంచి చెడ్డల తెలిసికొనుటకు శాస్త్రములను, వాటిని విశదీకరించుటకు ఆచార్యులను, మధ్య మధ్య తానే అవతారములెత్తి తన ఉపదేశానుష్ఠానములను అనుగ్రహించియున్నాడు. గాన మధ్య మధ్యగ ప్రతివాని నిత్యకృత్యములలోను ఆయన కలుగజేసుకొనడు. ఎవడు ఏది చేయునో వానికి తదనుగుణ ఫలితమును అనుభవింపజేయుచుండును.

జీవునికిచ్చిన కించిత్స్వాతంత్రమును వీడు తన దుర్బుద్ధిచే పాడుచేసుకొనిన అది భగవంతుని దోషమగునా? దోషముకాదు సరికదా ప్రత్యుత గుణమేయగునుగదా.

శిష్యుడు:- భగవంతునియందు దయాదిగుణములున్నవికావా. వాని వుపయోగమేమి?

గురువు:- చేతనుడు తనయొక్కయు సర్వేశ్వరునియొక్కయు స్వరూపమును తెలుసుకొనినవాడై, తన ప్రాతికూల్యముమాని, భగవంతునే ఆశ్రయించి, ప్రపత్తి చేయువానిని భగవంతుడు తనదయకు పాత్రునిగ జేయును. గాన ఆయనయందలి దయాదిగుణములు వ్యర్థములుకావు.

శిష్యుడు:- సంసారనివృత్తి దేనివలన కలుగును?

గురువు:- అనాదియైన కర్మయొక్క ప్రవాహమువలన ప్రకృతి సంబంధముకలుగును. ఇదియే సంసారబంధమనబడును. ఇది సత్యమైనది. భగవంతుని ఉపాసించుటవలన ఆయన అనుగ్రహము కలుగును. ఆ అనుగ్రహమువలన ఈ సంసారబంధము నశించును.

శిష్యుడు:- బంధమోక్ష వ్యవస్థ ఎటుల?

గురువు:- చేతనులు పరస్పరము భిన్నులు. కర్మలంపటుడు సంసారబంధమున చిక్కుకొనును.

భగవదుపాసనచే భగవదనుగ్రహ పాత్రుడు మోక్షమును జెందును. గాన బంధమోక్షవ్యవస్థ చక్కగా కుదురును.

శిష్యుడు :- వేదమున రెండుభాగములేల యున్నవి? అందేది ప్రమాణము?

గురువు :- వేదమున పూర్వభాగము సర్వేశ్వరునియొక్క ఆరాధన భూతమైన కర్మలయొక్క స్వరూపమును ప్రతిపాదించుచున్నది. ఉత్తరభాగము ఆరాధ్యుడైన సర్వేశ్వరుని ప్రతిపాదించుచున్నది. గాన మొత్తము రెండు భాగములు కూడ ప్రమాణసిద్ధములే.

శిష్యుడు :- ఈవేదమునుగూర్చిన మీమాంసా శాస్త్రములెన్ని? వాని వివరములెవ్వి?

గురువు :- కేవల కర్మను గురించిన వివరముల తెలుపునది కర్మ మీమాంస. ఇది కేవల కర్మల స్వరూపమును తదనుష్ఠాన వివరములను తెలుపును.

కర్మలచే ఆరాధించబడు దేవతాంతరముల గురించిన వివరముల తెలుపునది దేవతా మీమాంస. ఇది ఆయా కర్మలచే సాక్షాత్తు ఆరాధించబడు దేవతాంతముల స్వరూప విశేష ఫలితాదుల తెలుపును. ఫలప్రదాత యగు పరబ్రహ్మను గురించిన వివరముల తెలుపునది బ్రహ్మమీమాంస. ఇది దేవతాకాష్ఠాభూతుడైన పరమపురుషుని గురించిన వివరములనన్నింటిని తెలుపును. గాన ఈమూడు కూడ ప్రమాణములే.

వీటినన్నింటిని ప్రమాణములుగ తీసుకొని అన్నింటిని సమన్వయపరచి దేనిని విడిచిపెట్టకుండగను, దేనికి విరుద్ధములేకుండగను చక్కగ సమన్వయపరచి భగవద్రామానుజులు తమసిద్ధాంతమును వ్యాపింపజేసిరి.

శిష్యుడు :- శ్రీరామానుజులవారు తమసిద్ధాంత నిర్ణయమున ఇంకను ఎవరెవరిని గురువులుగ స్వీకరించిరి?

గురువు :- శ్రీరామానుజులవారు ముఖ్యముగ శ్రీయామునాచార్యులవారిని ఆచార్యులుగ గాని వారితో వీరికి సాక్షాత్తు సాన్నిధ్యము తటస్థించకపోవుటచే వారి యాజ్ఞానుసారముగ వారి శిష్యులను ఐదుగురిని ఆశ్రయించి వారిద్వారా శ్రీయామునాచార్యులవారి ఉపదేశముల గ్రహించిరి.

శిష్యుడు :-ఆ పంచాచార్యులు ఎవరు?

గురువు :- 1. పెరియనంబి, 2. పెరియతిరుమలనంబి, 3. తిరుకొట్టియూరునంబి, 4. తిరుకచ్చినంబి 5. మారనేరినంబి, అనువారైగురుదు

శిష్యుడు :-వీరి జైత్రయాత్ర విశేషములేవి?

గురువు :-వీరు ఆసేతు శీతాచలము వరకు రెండుపర్యాయములు జైత్రయాత్ర చేసినట్లుల యున్నది.

జైత్రయాత్రలో ప్రధానవిశేషము-వీరు కాశ్మీరువెళ్ళినప్పుడు అచ్చటి శారదాపీఠమందలి పండితప్రకాండులందరి ఎదుట తాము బ్రహ్మసూత్రములకు రచించిన శ్రీభాష్యమును ఉపన్యసించగా దానియందలి యదార్థసమన్వయ సిద్ధాంతమునకు అచ్చటి పండితులందరు ఏకగ్రీవముగ అంగీకరించి ముగ్ధులైరి. శారదాదేవి ప్రత్యక్షమై అపుడు వీరికి "శ్రీభాష్యకారులు" అని బిరుదును ప్రసాదించెను. వీరు తాము స్వయముగ వ్రాసిన శ్రీభాష్యకోశమును ఆ శారదాపీఠమునకు కానుకగ సమర్పించిరనియు, ఇప్పటికిన్ని ఆ శ్రీకోశమచ్చట విరాజిల్లుచున్నదనియు తెలిపెదరు. మరియు వీరు అచ్చటచ్చట ప్రధాన స్థలములయందు మఠముల నేర్పరచిరి. మరియు జీర్ణమైన అనేక దేవాలయముల నుద్ధరించి తిర్గి వానిని సక్రమ నిర్వహణమునకై కొంతమంది జీయంగార్లను సన్యాసాశ్రయమఠస్థులను ఏర్పాటుచేసిరి.

అందులో తిరుపతి, తిరునారాయణపురము, శ్రీరంగము, శ్రీవిల్లిభుత్తూరు మున్నగునవి ముఖ్యములు.

శిష్యుడు :- వీరు రచించిన వాఙ్మయమేమి ?

గురువు :- వీరు శ్రుత్యర్థమును విశదీకరించు వేదార్థసంగ్రహము; సూత్రార్థమును స్పష్టీకరించు శ్రీభాష్యము, వేదాంతసారము, వేదాంతదీపము అనువాటిని; స్మృత్యర్థమును స్థిరపరచు శ్రీగీతాభాష్యమును; పురుషార్థస్వరూపమును తెలుపు శ్రీరంగ గద్య; ఫలస్వరూపమును ప్రతిపాదించు శ్రీవైకుంఠ గద్య; ఉపాయస్వరూపమును ఉపదేశించు శ్రీశరణాగతి గద్య. నిత్యానుష్ఠానమును నిర్మించు నిత్యగ్రంథము అను తొమ్మిది గ్రంథములను రచించిరి.

ఈనవరత్నములు అమూల్యములు. అసమానములు. ముముక్షుజనులకనుష్ఠేయ ప్రకాశకములున్ను.

శిష్యుడు :- వీరు తమ తదనంత ఏర్పాటులేమి జేసిరి ?

గురువు :- మతప్రచారమునకు సర్వసంగపరిత్యాగులేగాని పనిచేయజాలరు. అందుచే సామాన్యముగ సన్యాసులుమాత్రమే అందులకు తగియుందురు. గాన బౌద్ధమతవ్యాప్తిలో అందరు సన్యాసులగుటయు, వారి ప్రవర్తనాదికములు రానురాను సంఘశ్రేయోనిరోధకములై సంఘవిచ్ఛిత్తికిన్ని, మతముయొక్క పునాదుల నాశనమునకు దారితీయుటచేతను, మరియు శ్రీవిశిష్టాద్వైతములో భక్తియే ముక్తికి కారణమగుటచేతను, తత్ప్రచారమునకు నివృత్తిమార్గనిష్ఠులైన గృహస్థులుకూడ అనుకూలురే అయి యుండుటచేతను శ్రీరామానుజులవారు తమ తదనంతరము తమ సిద్ధాంతవ్యాప్తికై డెబ్బదినలుగురు యోగ్యులగువారిని ఆచార్యపురుషులుగ నిర్ణయించిరి. వీరందరికి

వలయు శిక్షణాదికముల నుపదేశించి వీరిని దేశములో నలుగడలను మతప్రచారమునకై వినియోగించిరి.

వీరలలోని సంతతివారు చాలమంది యిప్పటికన్ని ఆచార్యపురుషులై ఈసిద్ధాంతమును ప్రచారము చేయుచునేయున్నారు. వీరినే స్వయమాచార్య పురుషులని వ్యవహరించుట కలదు.

శిష్యుడు :-ఈ డెబ్బది నలుగురు ఆచార్యపురుషులయొక్క తిరునామముల తెలుపగోరెద.

గురువు.- డెబ్బదినలుగురు ఆచార్యపురుషులెవరనగా :-

1. శ్రీ యామునాచార్యులవారి పుత్రులైన శొట్టనంబిగారు.
2. పెరియనంబి గారి కుమారులైన పుండరీకాక్షులు.
3. తిరుక్కోట్టియూరు నంబిగారి కుమారులైన తెర్కాళ్వారు.
4. తిరుమలై యాండాన్ కుమారులైన సుందర తోళుడైయారు.
5. పెరియ తిరుమలనంబిగారు కుమారులైన తిరుక్కురుగై ప్పిరాన్ పిళ్ళాన్,
6. పిళ్ళై తిరుమలనంబి.
7. కూరత్తాళ్వారులు.
8. కూరత్తాళ్వారుల కుమారులైన పరాశర భట్టరు.
9. శ్రీరామపిళ్ళై (వ్యాసభట్టరు.)
10. ముదలి యాండాన్.
11. నడాదూరాళ్వాన్.
12. ఎంగళాళ్వాన్.
13. నడువిలాళ్వాన్.
14. గోమఠత్తాళ్వాన్.
15. తిరుక్కోవలూరాళ్వాన్,
16. తిరుమోగూరాళ్వాన్.
17. పిళ్ళైయాళ్వాన్.
18. అనంతాళ్వాన్.
19. మిళగాళ్వాన్.
20. నెయ్యుండాళ్వాన్.
21. శేట్టలూరు సిరియాళ్వాన్.
22. వేదాంతి యాళ్వాన్.
23. గోమఠాళ్వాన్.
24. ఉక్కలాళ్వాన్.
25. అరణపురత్తాళ్వాన్.
26. ఎంబారు.
27. కిడాంబి యాచ్చాన్.
28. కణియనూరు సిరియాచ్చాన్.
29. కొంగిలాచ్చాన్.
30. ఈచ్చంబాడి యాచ్చాన్.
31. తిరుమలై నల్లాన్.
32. వంగిపురత్తాచ్చాన్.
33. తిరుకణ్ణపురత్తాచ్చాన్.
34. సిరియగోవింద పెరుమాళ్.
35. కిడాంబి పెరుమాళ్.
36. అమ్మంగి పెరుమాళ్.
37. ఆసూరి పెరుమాళ్.
38. పిళ్ళయుప్పన్.

39. వంగిప్పురత్తునంబి.
40. ముదుంబైనంబి.
41. పరాంకుశనంబి.
42. తిరుక్కురుంగుడినంబి.
43. తొండనూర్నంబి.
44. అరణపురత్తునంబి.
45. మరుదూర్నంబి.
46. మ యూర్నంబి.
47. నరుగనంబి.
48. కురవి నంబి.
49. కందాడై యాండాన్.
50. సోమాసి యాండాన్.
51. జియ్యరాండాన్.
52. ఈశాండాన్.
53. పెరియాండాన్.
54. సిరియాండాన్.
55. అమ్మంగియాండాన్.
56. ఆళవందారాండాన్.
57. ఉక్కలమ్మాళ్.
58. పరుత్తిక్కొల్లైయమ్మాళ్.
59. సైత్తమానిదియార్.
60. సిరిప్పళ్ళి దేవరాజభట్టర్.
61. పిళ్ళైయురందయుడయార్.
62. పిళ్ళై తిరువాయ్మొ యరయర్.
63. పిళ్ళై తిరునరయూరరయర్.
64. పిళ్ళై రాజమహేంద్రి పెరుమాళరయర్.
65. అగ్నిశాక్కిప్పిళ్ళై.
66. తిరునగరి పిళ్ళై.
67. అర్కాట్టుపిళ్ళాన్.
68. కోమాండూరుపిళ్ళై.
69. అనంత సోమయాజియార్
70. కాంచిసోమయాజియార్.
71. అలగినార్ వేంగడవర్.
72. కుంజిప్పూర్ సిరియాండాన్.
73. కోమాండూరు ఇళయవిల్లి.
74. మాగ్గొనిల్లా మారుతియాండాన్.

ఈ ఆచార్యపురుషులలో కొందరికి నామాంతరములు గలవు.

ఈచెప్పబడినవారిలో తిరుక్కురుగైపిరాన్ పిళ్లాన్, నడదూరాళ్వాన్, కిడాంబియాచ్చాన్ మొదలియాండాన్, ఈనలుగుడు శ్రీభాష్యప్రవచనపరులు. తిరుక్కురుగైప్పిరాన్ పిళ్ళాన్ అనువారు శ్రీభాష్యభగవద్విషయములు రెండింటికి ప్రవర్తకులైరి. వీరేగాక శ్రీరంగనారాయణ జియ్యరు, ఈచ్చంబాడి జియ్యరు; గోవిందజియ్యరు; శట్టైప్పళ్ళిజియ్యరు; తిరుమళిశైజియ్యరు; తిరువెళ్ళర జియ్యరు, తిరుప్పుడ్కుడిజియ్యరు, అడ్కొంకవిల్లజియ్యరు, తిరుమాలిరుంజోలైజియ్యరు మొదలుగా; గల 700 మంది జీయరులు, నంబిగురుదేవర్ మొదలుగాగల పండ్రెండువేల పరమైకాంతులు పూయమునివే వర్ మున్నగు కైంకర్యపరులు, తిరువరంగమాయోన్ మొదలగు కావలివారలు, పిళ్ళైయురంగావల్లదాసులు మొదలు దాసజనులు, తిరువనందపుర లక్ష్మై మొదలగు అమ్మంగార్లు, వీరందరు ఈసిద్ధాంతానుమానపరులై సిద్ధాంతవ్యాపకులై యుండిరి.

★ గతసంచిక తరువాయి.

# దినహితచర్య

## సంభాషణ: సత్యము.

మనుష్యుని విద్యా బుద్ధి స్వభావములు అతని సంభాషణ వలన తెలియబడును. నీ కంటె త క్కువ వారినిగాని, చిన్నవారినిగాని "ఒరే, ఓసీ" అని సంభోధించుట మంచిదిగాదు. అతి పరి చయము కలిగి నీ కంటె చిన్నవారి విషయమై ఏమోయి అనియు, పరిచయము లేనివారు, పెద్ద వారు అగు అందరి విషయములోను "మీరు, తమరు, అండి, గారు" అని ప్రయోగించుట ఉచి తము. నీ సంభాషణలో యితరుల కెవ్వరికి దు ఖఃముగాని అసూయగాని ద్వేషముగాని క్రో ధముగాని అసహ్యముగాని, విసుగుగాని పుట్ట కుండునటుల ప్రసంగించవలెను. నీకు అధికా రము, యోగ్యత ఉన్నప్పటికినీ అధీనములో నీ దయకు పాత్రులైన వారి విషయము నం దైనను గర్వముతోగాని, అహంకార అభి మానములతోగాని. వ్యంగముగ గాని, అశ్లీల ముగగాని, తిట్టుచుగాని, కఠినోక్తులతో గాని మాట్లాడకూడదు. ఇట్లు ప్రసంగించినచో నీ అ సభ్యత్వమును వెల్లడించుకొనుటయే యగును.

నూతన వ్యక్తితో క్రొత్తగ పరిచయము కలుగజేసుకొను నపుడు తగినంత, అవుసరము కలిగినంతవరకు వారి జాతినిగాని, మతమును గాని, వయస్సునుగాని, ప్రవర్తనను కాని, వృత్తిని గాని, వేతనమునుగాని ప్రశ్నించుట మంచిది గాదు.

సంభాషణలో కొద్దిపాటి హాస్యరసము ఆనం దకరమే. కాని దానిని హద్దుమీరి ఉప యోగించుట సర్వదాహానికరము. ఎదుటి వ్యక్తి నీతో మాట్లాడుచున్నపుడు "అవును, కాదు" అని అనుకూల జవాబు ఇచ్చుచుండ వలెనే గాని నోరు మెదపకుండగ మొద్దువలె మౌనము వహించి యుండుట మంచిది గాదు.

సంభాషణలో ఆత్మస్తుతిగాని, పరనింద గాని, ఎంత మాత్రము జొరనివ్వరాదు.

నీయొక్క భావములను ఎదుటి వారు సుల భముగాను, స్పష్టముగాను సంపూర్ణముగాను గ్రహించ కలుగునట్టి శిష్టపదముల నుపయో గించి మాట్లాడుటయే సంభాషణలో నేర్పు. ప్రయోజనములేని ఎదుటివారికి సులభముగా అర్థము కానటువంటి కఠిన పదములుగాని, అన్య భాషా పదములుగాని, అశిష్టపదములనుగాని ఉప యోగించుట నీ మూఢత్వమును, అహంభావ మును వెల్లడించుకొనుట మాత్రమే యగును.

అనవసరముగ ఎవరితోడను మాట్లాడ కూ డదు. ఎవరితోడనైనను మాట్లాడుటకు ముందు

నీవు మాట్లాడునది సత్యము, హితము ప్రియము అగునా యోజించుము. అటులైననే మాట్లాడుము.

ఎవరైననూ సరే నిన్ను పలుకరించినపుడు వారికి తగు సమాధాన మివ్వవలెను. అటులివ్వకుండగ యూరకుండట నీ మూర్ఖతను తెలివి తక్కువ తనమును ప్రదర్శించుటయే యగును. ఇతరులను గూర్చి వారి పరోక్షముగ నెవ్వరితోడను దూరలాడకుము.

మిత్రులు, బంధువులు మొదలైన వారితో యున్నపుడు ఏదో ప్రసంగము చేయకున్న యెడల అది యసభ్యతగ నెంతురని గాని వారి నవమానించినటుల భావింతురని గాని తలచి వారితో అనవసర ప్రసంగము చేయకుము. మిత్రులుగాని బంధువులుగాని నీకెదురైనపుడు వారిని ఉచితరీతిగ పలుకరించవలెను. గాని మౌనము వహించి ఊరకుండుట అహంకార సూచకముగ నుండును.

నడుచు దోవలో గాని, సందులలో, రహస్య స్థలములలో గాని స్త్రీలతోను, అందులోను పరాయిస్త్రీలతో సంభాషించుట అనాగరిక లక్షణము.

ఏదో విషయమును గురించి దీర్ఘముగ ఆలోచనా నిమగ్నులై యున్న వారివద్ద గట్టిగా మాట్లాడ గూడదు. నీవడిగిన సమాధానము తెలుపనిష్టపడని సజ్జనుని సమాధానము కొఱకై బలవంతము చేయకూడదు. నీ ప్రశ్ననాయన వినలేదనిగాని, లేక పొరపాటున నీప్రశ్నకుసమాధాన మిచ్చుట మరచెననిగాని నీకు తోచినపుడు తప్పకుండా వినయ పూర్వకముగా తిర్గి ప్రశ్నింపవచ్చును.

నీ యభిప్రాయములతో సంపూర్ణముగా ద్వేషించు వారితోగాని సత్పురుషులచే అనాదరింపబడువానితో గాని, అనారోగ్యవంతునితో గాని అవసరము నతిక్రమించి అధికముగ నెంతమాత్రము సంభాషించరాదు.

కొందరు వ్యక్తులు ప్రత్యేకముగా సమావేశమై ఏకాంతముగ సంభాషించు కొనునపుడు సంభాషణలలో క్రోధమును ప్రవేశించనివ్వరాదు. ఒకవేళ దానిని నిలుపజాలనిచో అట్టి సమయముల యందు మౌనము ధరించుటయే యుచితము.

నీ మిత్రునిగాని లేక గౌరవనీయ వ్యక్తిని గాని నీ సన్నిహిత మిత్రుని గాని ఇతరులెవరైన నీయెదుట నిందించునపుడు వారి నటుల చేయవలదని వినయముతో కోరుము. వారటుల చేయనిచో అచ్చటనుండి నీవేమరొక స్థలమునకు లేచి పొమ్ము, ఏవైన సభా సమావేశములలో నీవు గూడ మాట్లాడుటకు అవసరము యోగ్యత యున్నదని తలచినచో తత్సమావేశ కర్తలు నిన్ను ఆహ్వానించలేదనిగాని కోరలేదనిగాని సందేహించబనిలేదు. వెంటనే మాటలాడవలెనను నీకోరికను ఆసమావేశకర్తలను తెలియజేయుము. వారనుమతించిరా వారు నీకిచ్చిన కాలములో నీయభిప్రాయము అందరికి బాగుగా తెలియునట్లు మాట్లాడుము. నిర్ణీతకాలము

కంటె అధికకాలమును తీసుకొని వినువారిని ఆసమావేశకర్తలను విసిగించకుము. నీవు మాట్లాడుటకు నీకు అవకాశము మివ్వలేదా వారిపై కోపించక ఊరకుండుము.

సభలు సమావేశములు మొదలైన అనేక సమూహము లందు నీమిత్రునిగాని నీపరిచయస్తునితోగాని యితరులెవ్వరికిన్ని తెలియనటువంటి రహస్య-పారిభాషిక-సాంకేతిక పదములతో సంభాషించకూడదు. దీనిని వినిన యితరులు తమనుగురించి మీరేదో సంభాషించుచుందురని అనుమానపడెదరు. ఏవిషయమునైను నీయభిప్రాయము నడిగినపుడే చెప్పుము. గాని అనవసరముగ నీయంతట నీవేఏవిషయము గురించియు సలహానిచ్చుటకై ప్రయత్నించకుము. నీమాటలుగాని, చేష్టలుగాని ఎవ్వరికి అసహ్యముగగాని, కష్టముగాని కలిగించకుండునటుల జాగ్రత్త వహించుము.

నీవితరులకు ఏదైన చిన్నచీటి వ్రాసినను కూడ అది చదువుకొనువారికి సులభముగ నీఉద్దేశ్యములు బోధపడునటులను, వారు నీపైఎట్టి దురుద్దేశముగాని అసహ్యతగాని పొందకుండునటులను ఆలోచించి జాగ్రత్తగా చక్కగా వ్రాయుము. చీటివ్రాసిన అనంతరము ఆచీటి అందుకొని వారివిషయమై నీమనస్సులో మంచి భావనలను తలంచి వాటిని చీటిపై ప్రసరించుము కొంతమంది సజ్జనులు ఎట్టి నూతన వ్యక్తితోనైనను చిన్నవ్యక్తితోనైనను అతిపరిచయముగను అతిచనువుగను మాటలాడుదురు. అది వారి అత్యధిక యోగ్యతాసూచకము. అట్టి వారితో వారి చనువును అపార్థ చేసుకొనక అత్యంతగౌరవముతోను వినయవిధేయతలతోను సంభాషించుము.

ఎట్టి మహావ్యక్తియందైనను ఎంచతగినటువంటి ఒకటి రెండు సుగుణములని చెప్పబడజాలని గుణము లుండవచ్చును. ఎంత దుష్ట, క్రూర, అజ్ఞాని వ్యక్తియందైనను ప్రశంసించ తగినటువంటి సుగుణములుండి తీరును. గాన పరులయందలి దోషముల కనిపెట్టి వారిని నిందించుట కంటెను వారియందలి సుగుణములను గ్రహించి వారిని కూడ ప్రశంసించుటను అలవాటు చేసుకొనుము. నీతోసంభాషించు ఎదుట వారిని గురించి నీమనస్సులో మంచి తలంపు భావించుచు వాటిని వారిపై ప్రసరింపజేయుము. ఎంతటి తక్కువవారైనను సరే, అజ్ఞానులైనను నీతో ఏదైన మంచి సలహా తెలిపినపుడు, నీకుపకారము చేసినప్పుడున్ను, నీకు కొద్ది సహాయమునైనను సరే చేసినప్పుడున్ను వారికి నీధన్యవాదములను తెలుపుము.

ఎవరైనను తమ సంభాషణవలన నీకు కోపము ఉద్రేకమును కలుగ జేయవలెనని ప్రయత్న పూర్వకముగ ప్రయత్నించవచ్చును. అందువలన ఎప్పుడైన ఒకప్పుడు నీవు క్రోధమునకు ఉద్రేకమునకు ఆధీనుడవైపోవచ్చును. గాని అట్టి సమయములలో వెంటనే నీవు తిర్గి జవాబు చెప్పరాదు. నీ మనస్సులో కల్గిన మార్పులు ప్రకాశింపజేయరాదు. వెంటనే జవాబు చెప్ప ప్రయత్నించితివా నీ మనస్సులో

కలిగిన మార్పులు వెల్లడికాక మానవు. అందు వలన ఎదుట వారి సంకల్పము నెరవేరును. గాని అట్టి సమయములో కొద్ది నిమిషములు మౌన ముగ యుండి వినయ పూర్వకముగ జవాబును, ఆలోచించి చిరునవ్వుతో తెలుపుము. లేకపో యిన నీవు మనశ్శక్తిని కోల్పోయి ఎదుట వారికి లొంగిపోయిన వాడవగుదువు. అపుడు ఎదుట వారు విఫలమనోరథులగుదురు, అందువలన నీకు ఏ హానియుకలుగదు. నీమనశ్శక్తియు వృద్ధి పొం దును. క్రోధముతో పలికిన పలుకులు వాడిగల ములుకులవంటివి. బాణముపై నుండునది. శరీ రమునకే గుచ్చుకొనును. శరీరముయొక్క పుండు మానును గాని మనస్సుయొక్క పుండు మానదు. కాలుజారిన తీసుకొనవచ్చును గాని మాటజారిన తీసుకొనుట అసంభవము.

నీయెదుట నిన్ను స్తుతించువారు నిజముగ నీకు మహాహానియే కలిగించుచున్నారని తల చుము. వారు నిన్ను మోసము చేయుచున్నా రనియే తలచుము. అట్టివారితో వెంటనే విన యముతో నిన్నుగురించిన స్తుతిని మానివేయ వలసినదనియు అది నీకు కష్టముగ నున్నదనియు తెలుపుము. అప్పటికిని వారు మానకపోయి నచో అచ్చటనుండి లేచిపొమ్ము.

ఎవ్వరైన నిన్ను నిందించుటకై గాని వ్యంగ ముగా శ్లేషతోటి మాట్లాడ వచ్చును. అట్టి వారితో అధిక ప్రసంగము చేయక అవసరమైన ఒకటి రెండు మాటలు వినయముగనే తెలిపి మౌనము వహించుము. లేనిచో అచ్చటినుండి లేచిపొమ్ము. నీవయస్సునకు, నీయోగ్యతను మించిన మాటలను ఎన్నడూ ఆడకూడదు. నీకు తెలియని విషయమునుగురించి ప్రసంగించరాదు. నీయొక్క-గాని, ఇతరులయొక్క-గాని యేదైనా వ్యవహారిక విషయములను గురించిగాని, ఆర్థిక, రాజకీయ, సాంఘికముగ సంబంధించి నటువంటి విషయముల గురించిగాని, నీపెద్దలయొక్క, నీహితులయొక్క సలహాను తీసుకొనకుండగ యెవరితోను యెన్నడు సంభాషించరాదు.

బాగుగా నమ్మదగినటువంటి వారిద్వారా విననదే తప్ప నీవు విన్న ప్రతివిషయమును గురించియు అందరితోనూ ప్రసంగించకుము. నమ్మదగిన విషయములలో కూడ రహస్యముగ యుంచవలసిన దానిని రహస్యము గానే యుంచుము. మాటయే మంచిగ యుపయోగిం చిన మర్యాద తెచ్చును. మానము కాపాడును. ప్రాణమునిచ్చును. ధనవంతునిచేయును. అదియే విరసముగ నుపయోగించిన మర్యాదపోగొట్టును. మానమును ధ్వంసముచేయును. ప్రాణమును హరించును. దరిద్రునిచేయును.

భగవంతుని స్వాధీనపరచుకొను మంత్రము కూడ మాటయే యను విషయమును మరువ కుము.

సత్యమే భగవంతుడు. సత్యమే యేనాటి కైనను జయించితీరును. సత్యమునే ఆధారము గను జీవముగను తలంచువారు నిజముగా ధన్యులు. సత్యముకంటె రక్షించునది ప్రపంచ మున మరేదియు లేదు. పరిహాసమునకైనను

కలయందైననుకూడ అసత్యమాడకుము.

సత్పురుషుల సమావేశమునందు, పరోపకారార్థమైన పనులయందు, దేవాలయములు పుణ్యతీర్థములు మొదలైనవాట్లయందు, అత్యవసరమైన పనికలిగినపుడు తప్ప జనసమూహము లోనికి పోవలదు. సాధ్యమైనంత వరకు ఏకాంతముగను, మౌనముగను యుండుము. మౌనము కల హాశూన్యము, పాపనాశనము. అధికప్రసంగమును, అనవసర ప్రసంగమును, ఆత్మస్తుతిని, పరనిందను, అతిశయోక్తులను ప్రయత్నపూర్వకముగా మానివేయుము. మననాలుక అసత్యము లాడు స్వభావముకలదగునేని ప్రథమమున రెండు సార్లయినను ప్రయత్నపూర్వకముగా అసత్యమును జయించి సత్యమును తెలుపుటకు ప్రయత్నించుము. నీవు ఒకవేళ తెలియక అసత్యమును సత్యమని భ్రమపడి మాట్లాడినచో అది అసత్యమని తెలిసినవెంటనే హృదయపూర్వకముగ పశ్చాత్తాపపడి క్షమార్పణ గోరుకొనుము. సత్యమే యెప్పటికిని జయముపొందును. సత్యమునే ఆధారముగను, జీవితముగను తలంచువారు నిజముగ ధన్యులు. సత్యపథమును విడనాడకుండుటవలననే పంచభూతములు, సూర్యచంద్రులు చరించుచుండుటవలననే అవి లోకములో అంత ప్రకాశవంతములై విరాజిల్లుచున్నవి వాటి ఆధారమున ఈ ప్రపంచ చక్రము తిరుగుచున్నది. లేనిచో యేక్షణముననో ప్రళయము సంభవించి యుండవలసినదే. సత్యముయొక్క ప్రభావము అత్యద్భుతమైనది.

పన్నెండు సంవత్సరములు మనోవాక్కాయకర్మ సత్యము ననుష్టించునెడల తాను నోట వచించినదెల్ల, తలచినదెల్ల సిద్ధించు ప్రభావము కలుగును. సత్యస్వరూపుడగు భగవంతుడు సత్యవాక్య సంపన్నులకే గాని కనుపించడు.



శ్రీమతే రామానుజాయ నమః

శ్రీ ఆళవందారులు శ్రీమహాలక్ష్మి విషయమున సాయించిన

# చతుః శ్లోకి

(టీకా తాత్పర్య సహితము)

“శ్రీమన్నారాయణ”

—:o:—

## సవినయవినతి

‘చతుః శ్లోకి’ యను ఈ చిన్నిస్తోత్రమును శ్రీవిశిష్టాద్వైత సిద్ధాంత నిర్ధారణ సార్వభౌములున్ను, చతుర్వేద షట్ఛాస్త్రాది సకలవిద్యా పారంగతులునగు శ్రీమద్యామునాచార్యులు వారు (వీరికే ఆళవందారను నామాంతరము కలదు.) జగన్మాతయగు శ్రీమహాలక్ష్మి విషయమున సాయించిరి.

ఈ స్తోత్రము రూపమున చిన్నదైనను అర్థమున, భావమున మహావిపులమైనది.

ప్రతిమానవుడు దీనిని ప్రతినిత్యము అవశ్యము పఠించవలసినది. విశేషించి శుక్రవారములయందు శ్రీలక్ష్మీకటాక్ష పాత్రులు కాదలచినవారు అర్థానుసంధానపూర్వకముగ సేవించవలసిన స్తోత్రరాజమిది.



### తనియన్.

శ్లో. యత్పదాంభోరుహధ్యాన
విధ్వస్తాఽశేషకల్మషః,
వస్తుతా ముపయా తోఽహం,
యామునేయం నమామ్యహమ్.

టీక. అహం - నేను
యత్ప, కల్మషః
యత్ - ఏ ఆళవందారులయొక్క

పదాంభోరుహ - పదకమలములయొక్క
ధ్యాన - ధ్యానము చేత
విధ్వస్త - నశింపచేయఁబడిన
అశేష - సమస్తమైన
కిల్బిషః - పాపములుగలవాఁడనై
వస్తుతాం - ఒకవస్తువుగానుండుటను
ఉపయాతః - పొందితినో
తం - అట్టి
యామునేయం - యమునాదేవి కుమారులైన ఆళవందారులను
నమామి - నమస్కరించుచున్నాను

తా. శ్రీఆళవందారులనెడు ఆచార్యులయొక్క పదకమలములను ధ్యానముచేసి దానిచే సకల పాపములనుండి తొలఁగినవాఁడనైన నేను ఒక వస్తువుగా నుండుటంబట్టి యమున నూసులైన ఆచార్యులను నమస్కరించుచున్నాను.

ఈ మొదటిశ్లోకమునందు శ్రీమహాలక్ష్మీదేవి నిత్యవిభూతికిని లీలావిభూతికిని స్వామినియై యుండుట మొదలుగాఁగల కల్యాణగుణములను కృపచేయుచున్నారు.

శ్లో. కాంతః స్తే పురుషోత్తమః ఫణిపతిః,
శయ్యాఽసనం వాహనం
వేదాత్మా విహగేశ్వరో యవనికా,
మాయా జగన్మోహినీ,
బ్రహ్మేశాది సురవ్రజ స్సదయితః
త్వద్దాస దాసీగణః,
శ్రీ రిత్యేవ చ నామ తే భగవతి,
బ్రూమః కథం త్వాం వయమ్. ౧.

టీ. తే - నీకు
కాంతః - భర్త
పురోషోత్తమః - పరమపురుషుఁడైన విష్ణువు.
ఫణిపతిః - సర్పరాజైన ఆదిశేషుఁడు
శయ్యా - పానుపు.
ఆసనం - ఆసనము.
వేదాత్మా - వేదస్వరూపుఁడైన
విహగేశ్వరః - పక్షిరాజైనగరుత్మంతుడు.
ఆసనం - ఆసనము
వాహనం - వాహనము.
జగన్మోహినీ - లోకమునుభ్రమింపఁజేయు
మాయా - మూలప్రకృతి
యవనికా - తెర.
సదయితః - పత్నులతోఁగూడిన
బ్రహ్మేశాదిసురవ్రజః.
బ్రహ్మ - బ్రహ్మదేవుఁడు
ఈశ - శివుఁడు
ఆది - మొదలుగాఁగల
సురవ్రజః - దేవసమూహము
త్వద్దాసదాసీగణః -
త్వత్ - నీకు
దాసః - భృత్యసమూహముగాను
దాసీగణః - పరిచారికా సమూహముగాను (ఉన్నది)
తే - నీకు
శ్రీః, ఇతి, ఏవ, చ - "శ్రీ" అనియే
నామ - పేరు
భగవతి - సర్వమంగళగుణములతోఁగూడిన
శ్రీ మహాలక్ష్మీదేవీ!
వయం - మేము
త్వాం - నిన్ను
కథం - ఏమని
బ్రూమః - చెప్పగలము.

తా. శ్రీమహాలక్ష్మీదేవీ! పరమపురుషుఁడైన శ్రీమన్నారాయణుఁడు నీకు భర్త. ఆదిశేషుఁడు శయ్యగను ఆసనముగనునున్నాఁడు. వేదమూర్తియైన గరుత్మంతుఁడు నీకు వాహనముగను ఆసనముగను నున్నాఁడు. బ్రహ్మదేవుఁడు రుద్రుఁడు మొదలగు దేవతలు నీకు సేవకులుగనున్నారు. సరస్వతి పార్వతి మొదలగు దేవతాస్త్రీలు నీకు ఊడిగములు చేయువారుగ నున్నారు. శ్రీయనెడి పేరు నీకు గలిగియున్నది. కావున సకలకల్యాణ గుణములతోఁగూడిన నిన్ను నెట్లుస్తుతింపగలము? అనఁగా నీయొక్క కల్యాణగుణములు అపారము గాన పొగడుట కెవ్వరికిని సాధ్యముకాదని భావము.

శ్రీ మహాలక్ష్మియొక్క సౌలభ్యగుణమును అనుసంధించి స్తుతించుటకు సాధ్యము కాకపోయి

నను దాసులయందు వాత్సల్యముగల శ్రీలక్ష్మీదేవి తమయందు అనుగ్రహము చేయగలదని చెప్పుచున్నారు.

శ్లో. యస్యాస్తే మహిమాన మాత్మన ఇవ
త్వద్వల్లభోఽపి ప్రభుః
నాలం మాతు మియత్తయా నిరవధిం
నిత్యానుకూలం స్వతః,
తాం త్వాం దాస ఇతి ప్రపన్న ఇతి చ
స్తోష్యా మ్యహం నిర్భయో
లోకైకేశ్వరి లోకనాథ దయితే
దాన్తే దయాం తే విదన్. ౨.

టీ. యస్యాః - ఏ
తే - నీయొక్క
నిరవధిం - హద్దులేనిదిగాను
నిత్యానుకూలం, నిత్య - సర్వకాలమును
అనుకూలం - అనుకూలముగను (ఉండునట్టి)
మహిమానం - మాహాత్మ్యమును
త్వద్వల్లభోఽపి,
త్వత్ - నీయొక్క
వల్లభోపి - ప్రియుఁడైన భగవంతుఁడుకూడ
ఆత్మనః - తనయొక్క
మహిమానం ఇవ - మహిమవలెనే
ఇయత్తయా - ఇంతమాత్రమని
మాతుం - నిర్ణయించుటకు
ప్రభుః - సమర్థుఁడు
నఅలం - కాఁడు
హే లోకనాథదయితే,
లోకనాథ - లోకములకు ప్రభువైన భగవంతునకు
దయితే - ప్రియురాలా!
హే లోకైకేశ్వరి - సకలలోకములకు ఒకఁడేనాయకుఁడైన భగవంతునికి మహిషియైన శ్రీమహాలక్ష్మీదేవి!
దాన్తే - ఇంద్రియములను నిరోధించిన ప్రపన్నులయందు
తే - నీయొక్క
దయాం - దయను
విదన్ - తెలుసుకొన్నవాఁడగుచు,
అహం - నేను
తాం - అట్టిమహిమగల
త్వాం - నిన్ను
దాస ఇతి - దాసుఁడనని యును
ప్రపన్న ఇతి - ప్రపన్నుఁడనని యును (ఎంచి)
నిర్భయః - భయములేనివాఁడనై
స్తోష్యామి - స్తుతింపఁబోవుచున్నాఁడను.

తా. శ్రీమహాలక్ష్మీదేవి! సర్వము నెఱింగినవాఁడును నీకు ప్రియుఁడును నగు భగవంతుఁడు తనమహిమ నెట్లు ఇంతయని నిర్ణయించి తెలిసికొనలేడో, అటులనే నిర్ణయింప సాధ్యముకానిదియును సకలచేతనులకును అనుకూలమును నైనట్టి నీయొక్క మహిమను ఇంతయని నిర్ణయించుటకు శక్తిలేనివాఁడనై యున్నాఁడను. అయినను జితేంద్రియులైన ప్రపన్నులయందు నీవు మిగులదయతో గూడియుండుటను నేనెఱింగిన వాఁడనగుటచేత నీకు దాసుఁడుగను ప్రపన్నుఁడుగనునుండు దాసునియందు అనుగ్రహము చేయుదువని ఆ ప్రకారమైన మహిమతోడ (అపారమహిమతోడ) గూడిన నిన్ను నిర్భయుడనై నుతించుటకు యత్నించుచున్నాను.

శ్రీమహాలక్ష్మీదేవి ఆశ్రయించువారిని ఫలమొసంగునది యనియును భక్తసులభయనియును పురుషార్థదాయిని యనియును నిరూపించుచున్నారు.

శ్లో. ఈష త్త్వత్కరుణా నిరీక్షణ సుధా–
సంధుక్షణా ద్రక్ష్యతే
నష్టం ప్రాక్తదలాభత స్త్రిభువనం
సంప్రత్యనన్తోదయం,
శ్రేయో నహ్యరవింద లోచన మనః
కాన్తా ప్రసాదా దృతే
సంసృత్య క్షర వైష్ణవాధ్వసు నృణాం
సంభావ్యతే కర్హిచిత్.

టీ. ఈష......క్షణాత్.
ఈషత్ - స్వల్పమైన
త్వత్ - నీయొక్క
కరుణా - దయతో కూడుకున్న
నిరీక్షణ - చూపులను
సుధా - అమృతముయొక్క
సంధుక్షణాత్ - వృద్ధిచేయుటవలన
త్రిభువనం - ముల్లోకములను
రక్ష్యతే - రక్షింపబడుచున్నవి
ప్రాక్ - పూర్వము
తదలాభతః. తత్ - ఆకటాక్షమును
అలాభతః - పొందకపోవుటవలన
నష్టం - నాశనమైనది
సంప్రతి - ఇప్పుడు
అనన్తోదయం. అనన్త - అంతములేని
ఉదయం - జనన్మములు గలెను
అరవింద...... దృతే.
అరవిందలోచన-పుండరీకాక్షుడైన భగవంతునియొక్క
మనఃకాన్తా - మనస్సున కాహ్లాదకారిణియైన
మహాలక్ష్మి దేవియొక్క
ప్రసాదాదృతే - అనుగ్రహమువలన తప్ప
సంసృత్యక్షరవైష్ణవాధ్వసు.
సంసృతి - సంసారమందుగాని
అక్షర - కైవల్యమందుగాని
వైష్ణవాధ్వసు - పరమపదమునందుగాని
నృణాం - చేతనులకు
శ్రేయః - శ్రేయస్సు
కర్హిచిత్ - ఒక్కప్పుడును
నసంభావ్యతే హి - కలుగుటలేదు కదా.

తా. శ్రీమహాలక్ష్మీదేవీ! నీయొక్క దయకు కారణమైన కటాక్షామృతలేశముచేత ఈత్రిలోకములయందుండువారును రక్షింపబడుచున్నారు. నీకటాక్షములేని సమయమునందు నశించెదరు. మరల వారు నీయొక్క కటాక్షమును బొందిన యెడల సృష్టింపఁబడెదరు. ఈ యాత్మలకు ఈ భూలోకమునందు ఐశ్వర్యముల ననుభవించుట యందును, కైవల్యము నందాత్మానుభవము చేయుటయందు పరమపదమునందు బ్రహ్మాను భవము చేయుటయందును, శ్రీమహాలక్ష్మియొక్క దయలేనిచో ఒకప్పుడును వీరికి శ్రేయస్సు కలుగుటలేదుకదా.

శ్రీ మహాలక్ష్మీదేవి భగవంతుని యొక్క స్వరూపముతోడను, దివ్యమంగళ విగ్రహము తోడను సదా కూడియున్నదనియును, భగవంతునికి వలెనే మోక్షప్రదురాలనియును జెప్పుచున్నారు.

శ్లో. శాన్తా నన్త మహా విభూతి పరమం
యద్బ్రహ్మ రూపం హరేః
మూర్తం బ్రహ్మ తతోపి త త్ప్రియతరం
రూపం య దత్యద్భుతం,
యాన్యన్యాని యథాసుఖం విహరతో
రూపాణి సర్వాణి తా
న్యాహు స్స్వైరనురూప రూప విభవైః
గాఢోపగూఢాని తే. ౪.

శాన్తాన న్త మహావిభూతి
శాన్త - దోషరహితమైన
అనన్త - లెక్కింపఁ శక్యముగాని
మహావిభూతి - అధికైశ్వర్యముతోఁగూడుకున్నట్టియు
పరమం - అన్నిఁటికంటె శ్రేష్ఠమైనట్టియు
బ్రహ్మ - గొప్పమహిమగలిగినట్టియు
హరేః - భగవంతునియొక్క
రూపం - దివ్యాత్మస్వరూపము
యత్ - ఏదిగలదో
తేత్ అపి - ఆదివ్యాత్మస్వరూపముకంటెను
ప్రియతరమ్ - మిగులప్రియమైనట్టియు
మూర్తం -దివ్యమంగళవిగ్రహముతోఁగూడినట్టియు
అత్యద్భుతం - మిక్కిలి ఆశ్చర్యకరమైనట్టియు
తత్ - అప్రసిద్ధినిబొందిన
రూపం - పరవాసుదేవరూపమైనది
యత్ - ఏదిగలదో
యథాసుఖం - సౌఖ్యముగ
విహరతః - క్రీడించుచుండు (భగవంతునియొక్క)
అన్యాని - ఇతరములైన
రూపాణి - వ్యూహవిభవాదులైన రూపములు
యాని - ఏవికలవో
తాని - ఆట్టి
సర్వాణి - సమస్తములైన భగవద్రూపములు
తే - నీయొక్క
స్వైః - స్వకీయములైన
అపురూప రూపవిభవైః
అనురూప - తగినట్టి
రూప - అవతారములయొక్క
విభవైః - సంపదలచేత
గాఢోపగూఢాని - గాఢ - దృఢమిగా
ఉపగూఢాని - చేర్పఁబడియున్నవానినిగా
ఆహుః - చెప్పుచున్నారు.

తా. క్షుత్పిపాసాది ఏదోషములు లేనట్టియు దేశకాల స్వరూపములచేత లెక్కింప శక్యము కానట్టియు, అన్తములేనట్టియు, నిత్యవిభూతియనియు లీలావిభూతియనియును ద్వివిధవిభూతులు గలదియును, అన్నిటికంటె శ్రేష్ఠమైనదియును, అన్నిఁటికంటె అధికమైనదియునగు భగవంతునియొక్క దివ్యస్వరూపమునందును, రూపౌదార్యాదిగుణములచేత ఆ దివ్యాత్మస్వరూపము కంటెను ధ్యానముచేయువారికి మిగుల ప్రియమైనదిగను, దానిని సేవించువారికిమిగులఆశ్చర్యమొందఁదగినదిగను: మఱియు తన స్వేచ్ఛ ప్రకారము క్రీడార్థముగాఁ గావింపఁబడియుండు వ్యూహావతారములనియు విభవావతారములనియు, అర్చావతారములనియు పేరొందిన దివ్యావతార రూపములన్నిఁటి యందును; ఆయా రూపములకుఁ దగినట్లు నీయొక్క దివ్యరూపములు సదా యెడబాయక చేరియున్నవని శాస్త్రవేత్తలు చెప్పుచున్నారు.

భక్తులందరు దీనిని అనుసంధించుచు పురుషకారభూతురాలైన శ్రీ లక్ష్మీదేవియొక్క దయకు పాత్రులగుదురుగాక.



# పంచోపనిషన్మయము

శ్రీమన్నారాయణ



అసలు తత్వములు మూడు:- ౧. చిత్తు ౨. అచిత్తు 3. ఈశ్వరుడు. ఇందు అచిత్తు త్రిగ్గి మూడు విధములుగ యుండును.

౧. శుద్ధసత్త్వము.

౨. మిశ్రసత్త్వము.

3. సత్త్వశూన్యము.

ఇందులో శుద్ధసత్త్వము నిత్యవిభూతిరూపమై విరజానదికిఅవతల భగవత్-భాగవత-యిచ్ఛాను సారముగ ఆరామ- గోపుర- ప్రాకార-మంటప తటాక-ప్రాసాదాది బహురూపేణ అగణితమై అప్రమేయమై నిత్యమై కల్యాణప్రదమై, ఆనంద జనకమై, సుఖావహమై, శ్రేయోదాయకమై యుండును.

పరమపదమందలి భగవత్-భాగవత విగ్రహములన్నియు ఈశుద్ధసత్త్వమయములే.

ఈశుద్ధసత్త్వము కూడ అచిత్తుయొక్క అవాంతరభేదమే అయినను దానియొక్క హేయ రాహిత్యాది గుణవిశేషమును బట్టి అది అప్రాకృతమని వ్యవహరించబడుచున్నది. వికారాస్పదమైన మూలప్రకృతియొక్క అవస్థ మొదలు తదనంతర అవస్థల బొందు అచిత్తు అంతయు మాత్రము ప్రకృతి అని వ్యవహరించబడు చున్నది.

గనుకనే నిత్యవిభూతిని, తదవాంతర వస్తు సముదాయమును అప్రాకృతమని నిర్ణయించిరి.

శ్రీపరమపదవాసుని దివ్యమంగళ విగ్రహము కూడ యిట్టి అప్రాకృతమైనదియే. దీనినే పంచో పనిషన్మయమని యందురు.

ఈశుద్ధసత్త్వమునకు అయిదు అధిష్ఠాన దేవతలు, తత్ప్రతిపాదకమైన ఉపనిషత్తులు ప్రధానమైనవి అయిదున్ను, అందు మూలభూతములైన ప్రధానబీజాక్షరములు అయిదున్ను గలవు.

ఇట్టి పంచోపనిషత్ప్రతిపాదకమై తదధిష్ఠాన దేవతాత్మకమై, తద్బీజాక్షర-సంఘటిత-మూలమై విలసిల్లుమూర్తియే పరమపదనాథుని భవ్యమైన దివ్యమూర్తి.

| పంచోపనిషన్మయ బీజములు | పంచోపనిషన్మయాధిష్ఠానస్వరూపములు | స్థానములు |
|---|---|---|
| (ఓం) షౌం | పరమేష్ఠీ | శిరస్సు. |
| యాం. | పురుషః | నాసాగ్రము |
| రాం. | విశ్వాత్మం. | హృదయము. |
| వాం. | నివృత్తాత్మా. | గుహ్యము. |
| లాం. | సర్వాత్మా. | పాదములు. |






# ★ మోక్షసాధనము ★

న. చ. అంజాళమ్మగారు.

మోక్షమునకు హరిభక్తియొక్కటే సాధనము. మరి సాధన మేదియు లేదు. భక్తి యనగా మనోవాక్కాయకర్మలచే సర్వకాల-సర్వావస్థల యందును తైలధారవలె అవిచ్ఛిన్నముగా భగవానుని స్మరించుచుండుట. ఇది ఎట్లు కలుగును? భగవంతుని యందుమాత్రము ప్రీతియు, భగవదేతరముల యందు వైరాగ్యమున్ను యుండిన కలుగును. మనకి మనతల్లిదండ్రులమీదను, భర్త మీదను, మన సంతానముమీదను, ఇష్టమైన యనుభవముల మీదను ఎటుల ప్రీతి కలుగుచున్నది? అవి మనకు కావలసినవని నిర్ణయించుకొని వాటి యందుగల గుణములను ప్రేమించుచుండుట చేత నేకదా. అటులనే భగవంతునితో మనకుగల నవవిధసంబంధములను

శ్లో॥ పితా చ రక్షక శ్శేషీ ।
భర్తా జ్ఞేయో రమాపతిః ।

తెలుసుకొని ఆయనను ప్రేమించ నిశ్చయించుకొని తదేక ధ్యానముతో అభ్యసించుట వలన భగవంతునియందు మనకు ప్రేమ కలుగగలదు.

మనము సర్పమునుజూచిన భయపడుదుము. విషమునుజూచిన అసహ్యపడుదుము. ఎందుచేత? అవి మనకుహాని కలిగించునవనియు, మనకవసరమైనవి కావనియు నిర్ణయించుకొని వానియందలి దోషములను ద్వేషించుచుండుట చేతనేకదా. ఇందువలన వీనిపై మనకు విరక్తి కలుగుచున్నది దానివలన వానిని విడిచిపెట్టుచున్నాము.

అనగా మనము ప్రేమించ దలచినవానియందు గుణమును మాత్రమే గ్రహించుచుండవలయును కనుక మనకు కావలసినది భగవంతుడు. గాన భగవంతునియందలి కల్యాణగుణములనే గ్రహించవలయును. అక్కరలేనివి భగవదేతరములు గాన వాని యందలి అల్పత్వ-అస్థిరత్వ-హానికరత్వ-స్వరూప విరుద్ధత్వాది దోషములనే గ్రహించవలయును.

భగవంతుడు తప్ప దోషములులేని పదార్థ మేదియు ప్రపంచమున లేదు.

లోకములో భగవంతుని ద్వేషించు జనులు కూడ కొందరున్నారు. వారి ద్వేషమునకు కారణము భగవంతుని యందలి దోషములు కావు. దీనికి కారణము కేవలము వీని అజ్ఞానమే. మన ముఖమందలి మాలిన్యము స్వచ్ఛమైన అద్దములో ప్రతిబింబించుట లేదా?

అయితే ఈభక్తిని ఎంతకాలము అభ్యసించిన ఫలవంతమగును. భక్తినిష్ఠకి పరిమితి లేదు. ఈ ఆత్మ ఈ శరీరమును విడుచుటవరకుగల కాలమే దీని పరిమితి. అది ఒక క్షణమే కావచ్చును, లేదా కొన్ని సంవత్సరములే కావచ్చును.

దానికొక ఉదహారణ తెలిపెదను.

ఒకప్పుడు దేవతలకు దానవులకూ గొప్ప యుద్ధము జరిగెను. రాక్షసులు బలశాలులై యుండిరి. దేవతలకు ఓటమిస్థితి సంభవించెను. అప్పుడు భూలోకమున ఖట్వాంగుడను రాజశ్రేష్ఠుడు రాజ్యమేలుచుండెను. అతనుకడుంగను బలవంతుడు. మహాజ్ఞానవైరాగ్య సంపన్నుడు. దూరదర్శి. ఈతనిని దేవతలు సహాయముకోరిరి. సరేయని ఇతను వెళ్ళి రాక్షసుల ఓడించెను. దేవతలు విజయులైరి. సంతుష్టులైన దేవతలు ఖట్వాంగుని తమవల్ల ఏదైన వరమడుగు మనిరి. జ్ఞానియైన ఖట్వాంగుడు తన కంకను ఎంత ఆయుర్దాయము కలదో తెలుపమనెను. దేవత లాలోచించి లెఖకట్టి ఇంక రెండు ఘడియలు మాత్రమే అతని కాయుఃపరిమితి కలదని తెలిపిరి.

తెలివిగల ఖట్వాంగుడు తన ఆయుష్షును తెలుసుకొని చాల సంతోషించెను. రివ్వుమని భూలోకమునకు దిగెను. తన పుత్ర-మిత్ర-కళత్ర ధన-ధాన్య-పశు-అన్నాది సమస్తమును సవాసగ్న విడిచిబుచ్చెను. మహావైరాగ్య సంపన్నుడై ఏకాంతస్థానమున ఏకాగ్రచిత్తుడై భగవంతుని ఆకొద్దిసేపు పరమప్రీతితో ధ్యానించెను. ఇతని భక్తికి మెచ్చిన భగవంతుడు వెంటనే యితనికి మోక్షమిచ్చెను.

నిశ్చలమైన భక్తియే భగవంతునికి కావలసినది. అంతే కాని దాని కాలపరిమితితో గాని లేక వీని వర్ణ-ఆశ్రమ- వయో- అంగాదులతో గాని భగవంతునికి పనిలేదు. గాన మనము కూడ యితర విషయవైరాగ్యచిత్తులమై భగవంతుని ప్రేమించి, ధ్యానించి తరించ ప్రయత్నింతుము గాక.



పరివార విభాగము.

## శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ

## శుక్రవారోత్సవములు

### అత్తిమూరు.

13-10-50 కోనాల సుబ్బిరెడ్డి భార్య ఆదెమ్మగారు.

20-10-50 సబ్బెళ్ల గొల్లారెడ్డి భార్య వీరమ్మగారు.

27-10-50 సత్తి సూరయ్య భార్య సూరమ్మగారు.

3-11-50 లంక వీరారాజు భార్య రవణమ్మగారు

### మైలవరము

18-8-50 మైలవరపు శ్రీవెంకటేశ్వర దేవాలయములో

25-8-50 ,,

1-9-50 ,,

8-9-50 ,,

కస్తూరి మహిళాదేవికన్య 1-0-0 నిధి ఇచ్చెను.

### మదరాసు

మదరాసు శ్రీయతిరాజసేవా మహిళాసమితి కార్యదర్శి శ్రీమతి పువ్వాడ మంగమ్మగారిచే వరదా ముత్తియప్పన్ వీధిలోని సుధానిధిలో ఈ నెలలోని శుక్రవారోత్సవము లన్నియు జరుపబడినవి. తిరునెడుం దాండగం కాలక్షేపము జరుగుచున్నది.

### విజయవాడ

| | | వచ్చిన నిధి |
|---|---|---|
| 4-8-50 | కె. ధనమ్మ | 1-8-0 |
| 11-8-50 | కె. ధనమ్మ | 1-10-0 |
| 18-8-50 | జ. రాధానాయకమ్మగారు | 2-0-0 |
| 25-8-50 | కె. ధనమ్మ | 1-9-0 |
| 1-9-50 | సన్నిధిలో | 1- 0-0 |
| 8-9-50 | కె. ధనమ్మ | 1- 2-0 |
| 15-9150 | కె. ధనమ్మ | 1-13-6 |
| 22-9-50 | కె. ధనమ్మ | 1- 8-0 |
| 29-9-50 | కె. ధనమ్మ | 2- 3-6 |

### విశాఖపట్టణము

| | | |
|---|---|---|
| 4-8-50 | భక్తురాలు. | 0-4-0 |
| 11-8-50 | వ. వెంకటనరసమ్మగారు | 0-4-0 |
| 18-8-50 | రా. రామయ్యమ్మగారు | 0-4-0 |
| 25-8-50 | వా. ఆండాళ్లు. | 0-4-0 |
| 29- 9-50 | తాసరి నాగామణి. | 0-8-0 |
| 6-10-50 | క. లక్ష్మీనరసమ్మగారు | 0-8-0 |
| 13-10-50 | కొత్త అచ్యుతాంబగారు | 0-8-0 |
| 20-10-50 | వ. వెంకటనరసమ్మగారు | 0-8-0 |

### బందరు.

బందరులోని శ్రీయతిరాజసేవా మహిళాసమితి కార్యదర్శి శ్రీమతి రింగంటి సీతమ్మగారిచే ఈ నెల

లోని శుక్రవారోత్సవము లన్నియు గొడుగుపేట లోని శ్రీ వెంకటేశ్వరస్వామివారి కోవిలలో జరుపబడినవి.

## కో రు కొం డ.

కోరుకొండలోని శ్రీయతిరాజసేవామహిళా సమితికార్యదర్శి శ్రీమతి మఱింగంటి రంగనాయకమ్మగారిచే వారిస్వగృహమున ఈనెల శుక్రవారోత్సవములన్నియు జరుపబడినవి.

## అ ర్త మూ రు

అర్తమూరులోని శ్రీయతిరాజసేవా మహిళా సమితి కార్యదర్శి శ్రీమతి తాడి గంగమ్మ, మహాలక్ష్మమ్మ వగైరాలచే వివిధప్రాంతము లందు ఈనెల శుక్రవారోత్సవము లన్నియు జరుపబడినవి.

## వి శా ఖ ప ట్ట ణ ము

విశాఖపట్టణ శ్రీయతిరాజ సేవామహిళా సమితివారు శ్రీమతి గాదిరి అండాళమ్మ, రాము నీడు రామాయమ్మ మున్నగువారిచే ఈనెల శుక్రవారోత్సవములన్నియు బాగుగా జరుపబడినవి.

# ఏ కా ద శి ఉ త్స వ ము లు

## వి శా ఖ ప ట్ట ణ ము

| | | |
|---|---|---|
| 9-8-50 | భక్తురాలు. | 0 4 0 |
| 24-9-50 | దా. సుబ్బారావు. | 0 4 0 |
| 3 9 50 | దా. మధుసూధన్ | 0 4 0 |
| 22-9-50 | రా. వెంకటరాములు నాయుడుగారు. | 0 4 0 |

## అ ర్త మూ రు

22-10-50 శ్రీ. శే. కొవ్వూరి సత్తిరెడ్డి భార్య మమలక్ష్మమ్మగారి పేర జరిపినారు.



ఓం తత్ సత్.

శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః.

    

శ్రీమతే రామానుజాయ నమః.

# శ్రీ గీతా సందేశ మహోత్సవము

## శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము – మదరాసు, శాఖ

కార్యాలయము:— 147, అణ్ణాపిళ్లై వీధి, మదరాసు 1.

### —: ఆహ్వాన పత్రిక :—

ప్రపంచమున అనేకానేక మతము లున్నవి. ప్రతి మతమునకు ఆ మత తత్వమును తెలుపు గ్రంథము చిన్నదో పెద్దదో ఒకటి తప్పక యున్నది. ఆ గ్రంథమందలి విధులను చక్కగా తెలుసుకొని వాని ననుసరించుట ఆ మతానుయాయుల కందరకు విధియైయున్నది. అటుల చేసిననాడే వాడు ఆమతస్థుడన చెల్లును.

క్రైస్తవ మతస్థులు బైబిలును చదువుదురు. మహమ్మదీయులు ఖురానును పఠింతురు. హిందువుడు హిందూమత గ్రంథములను చదువని యెడల, దాని యందలి విషయముల తెలుసుకొనని యెడల, తెలుసుకున్న సద్విషయముల ఆచరించజాలని యెడల హిందువు డెటుల యగును? కేవలము హిందూ శబ్ద వాచ్యులమైనంత మాత్రమున హిందూత్వము మనకెట్లు సిద్ధించును.

హిందూమత గ్రంథమేది? వేదము. శ్రీమన్నారాయణుండు స్వయముగా శ్రీకృష్ణుడై అవతరించి సనాతనమగు ఆ వేదమందలి విషయములనే సర్వజన సుబోధకమగునటుల చక్కగా వెల్లడించెను. దానికే భగవద్గీత యని పేరు. దీని ననుసరించియే పూజ్యుడగు వ్యాసమహర్షి తిరిగి వేదముల యందలి సంశయ ఘట్టములవ్యక్తపరచుటకై బ్రహ్మసూత్రములను రచించెను. మరియు ఈ విషయముల ఉదాహరణ పూర్వకముగ వ్యక్తపరచుటకై ఇతిహాస పురాణముల వ్రాసెను.

అందుచే హిందూమత సిద్ధాంత సారములు పండిత పామరులకును; స్త్రీ పురుషులకును; బాల వృద్ధులకును; అతిసులభముగ, అతిస్పష్టముగ, అతిసుబోధకముగ, అనతికాలములో తెలుపు, బోధించు, ఉపదేశించు, ఆదేశించు, గ్రంథరాజము; పరమకారుణికుడగు భగవంతునిచే చేతనోజ్జీవనార్థమై స్వయముగ ఉపదేశించబడిన గ్రంథరాజము;

ఆసేతు – శీతాచల పర్యంతము భారతావని యందే గాక బుద్ధివికాసతగల ప్రతి మానవుని ఆకర్షించి ఆత్మోత్తారక – సులభోపాయమును వెల్లడించు గ్రంథశ్రేష్ఠము;

జీవుని జీవితమందలి ప్రతి సమస్యకును, ప్రతి సంశయమునకును, ప్రతి ప్రశ్నకును, ప్రతి జిజ్ఞాసకును, తిరుగులేని సిద్ధాంతరూప – సమాధాన మొసంగు నిఘంటురూప గ్రంథరత్నము;

లౌకిక - అలౌకికముల; శరీర - ఆత్మల; జీవ - పరమాత్మల సమస్యల నన్నింటిని చక్కగా సమన్వయపరచి చేతనోజ్జీవన రాచబాటను విశదపరచు గ్రంథరాజము;

ప్రపంచము యొక్క సృష్టి - స్థితి - లయ - మోక్షము మున్నగు రహస్యముల నన్నింటిని విస్పష్టముగ విశదపరచి వెల్లడించు గ్రంథరాజము భగవద్గీత.

## మానవుని అదృష్టగీత భగవద్గీత.

శ్లో. గీతా సుగీతా కర్తవ్యా కి మన్యై శ్శాస్త్రసంగ్రహైః।
యా స్వయం పద్మనాభస్య ముఖపద్మా ద్వినిస్సృతా. ॥
భారతా - మృత - సర్వస్వం విష్ణో ర్వక్త్రా ద్వినిసృతం।
గీతా - గంగోదకం పీత్వా పునర్జన్మ న విద్యతే. ॥

ఇట్టి మహానిధిని కలిగియుండియు, మనము ఈ నాడు ఆధ్యాత్మికముగా నిర్వీర్యులమై యున్నామన్నచో, మతాంతరముల స్వీకరణలు జరుగుచున్నవనినచో; మతము యొక్క నిజమైన కట్టుబాట్లు శిథిలములై - భిన్న భిన్నములై పోవుచున్నవనినచో; ఆధ్యాత్మికముగ మానవజాతి అధోగతిని పొందుచున్నదనినచో; నాస్తికవాదము నలుగడల నలముకొనుచున్నదనినచో, కారణమేమి? ఈ భగవద్గీతా మహానిధిని మనముపయోగించుకొనలేక పోవుటయే.

ఈ మహానిధిని మనము ఆచరణలో యుంచుకొనలేక పోవుటచేతనే కదా దేశములో కరువులు, కాటకములు - ఈతిబాధలు. తిష్ఠవేసి మనలను తినివేయుచున్నవి. ఈ మహానిధిని గూర్చిన ప్రచారము లేకపోవుట చేతనే కదా మానవు నందలి దేవత్వము - మటుమాయమై, మానవత్వము మాసిపోయి, రాక్షసత్వము తాండవించుచు పరహింస, వంచన, అవినీతి, దురాశ, అశాంతి దినదినాభివృద్ధి గాంచుచున్నవి.

సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు, సర్వవ్యాపి, సర్వసముడు, సర్వమంగళ ప్రదుడు అగు సర్వేశ్వరునితో గల సన్నిహిత సంబంధమును అనుభవ పూర్వకముగ తెలుసుకొని తెలిపినట్టు మహాత్ముల-ఋషిపుంగవుల - మునీశ్వరుల - ఆళ్వారుల పరంపరకు చెందినవారము గదా మనము.

అట్టి మనము నేడు దేహాత్మాభిమానులమై, ఆభాస - శుష్క - మెట్ట - ఆచారణశూన్య - అర్థరహిత - ఆడంబరసహిత వ్యర్థ వేదాంతులమై, ఆత్మజ్ఞాన శూన్యులమై అధీరులమై యున్నాము.

ఇట్టి మన దుస్థితి, దురవస్థ, దుర్గతి, దుర్మార్గము, దురాలోచన పోవలెనన్నచో; పవిత్రత-త్యాగము-సేవానిరతి - సర్వసమత్వము - సచ్ఛీలము - సమున్నతి - స్వార్థరాహిత్యము కలుగవలెనన్నచో 'వ్యక్తి-మతము-ధర్మము - నీతి - సంఘము - దేశము - జాతి - ప్రపంచము' - అభ్యున్నతిని పొందవలె నన్నచో భగవద్గీత ఒక్కటే మనకు శరణ్యము.

శ్లో. గీతాశాస్త్ర మిదం పుణ్యం, యఃపఠేత్ ప్రయతః పుమాన్ ।
విష్ణోః పద మవాప్నోతి, భయ - శోకాది - వర్జిత ః ॥

"భగవద్గీతాపఠనము - భగవద్గీతావిచారము - భగవద్గీతాన్వయము - భగవద్గీతోక్తాచరణము
భగవద్గీతాప్రచారము ఇవియే మనకర్తవ్యములు,

ఆస్తికాగ్రేసరులారా! భగవద్భక్తులారా!

దేశాభ్యుదయకరమైన ఈ పవిత్రభావముల, ఈ పవిత్ర ఆశయముల, ఈ పవిత్ర లక్ష్యముల నెర వేర్చుటకై భగవద్గీతాప్రచార ప్రబోధముల గావించుటకై శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘముచే మదరాసు పట్టణమున స్వస్తిశ్రీ వికృతినామ సంవత్సర కార్తీక బ ౭ మి. శనివారము (వృశ్చికమాసము 17.) అనగా ది 2-12-1950 తేది ఉదయము నుండి వరుసగా పదునెనిమిది దినములు అనగా ది 19-12-1950 తేది సాయము వరకు శ్రీ భగవద్గీతా సందేశ మహోత్సవము జరుప నిశ్చయింపబడినది.

ది 1-12-1950 తేది శుక్రవారము సాయంకాలమున అంకురార్పణయు; ది 20-12-1950 తేది బుధవారము ఉదయమున అవభృదోత్సవము జరుగును.

## —: కార్యక్రమము :—

ది 1-12-1950 శుక్రవారము సాయంకాలముల తిరువళిక్కేణిలోని శ్రీ గీతాచార్య-పార్థసారథి స్వామి వారి కోవిలనుండి ఊరేగింపుతో బయలుదేరి శ్రీ ఉప్పుటూరి ఆళ్వారు శ్రేష్ఠి చారిటి వారి రామానుజకూటమునకు (48, గోవిందప్పనాయకన్ వీధి, మదరాసు 1.) వచ్చి అచ్చట పారాయణ మంటప ప్రవేశమహోత్సవము. అంకురార్పణము;

ది 2-12-50. శనివారము మొదలు ప్రతిదినము ఉదయము5. 0. గం. కు తిరువారాధనాది కములున్ను; గం. 6-30 నుండి గం. 7-30 వరకు తిరుప్పియ్యత్సవమున్నుగం. 7-30 నుండి గం. 8-0 వరకు అందరుకలసి రోజునకు ఒక్కొక్క అధ్యాయము చొప్పున సమిష్టి పారాయణమున్ను; గం. 8-0 నుండి గం. 8-15 వరకూ కృష్ణనామజపము (సముష్టి) గం. 8-15 నుండి 10-30 వరకు దీక్షితులగు పండితులచే శ్రీ భగవద్గీతయంతయు పూర్తిగా పారాయణమున్ను; అదేసమయమున ఉపన్యాసమంటపమున ఆరోజున సమి ష్టిగ పారాయణజేసిన అధ్యాయముయొక్క అర్థవిశేషములు అవకాశమున్న వివిదభాషలలోను ఉపన్యసించబడు చుండుటయున్ను, మధ్యాహ్నము గం. 2-0 లగాయతు గం. 5-0 వరకు సుప్రసిద్ధ పండితప్రవరులచే ఆ దిన మున సమిష్టిపారాయణచేయబడిన అధ్యాయముపై విశేషార్థవిమర్శన ఉపన్యాసపూర్వకముగా ప్రచారకు లకు శిక్షణ నిచ్చుటయున్ను; సాయంత్రము గం. 5-30 లగాయతు గం. 8-30 వరకు భగవద్గీతపై వివిధ విషయముల గూర్చి ఉపన్యాసము లిచ్చుటయున్ను, రాత్రి గం. 8-30 నుండి 10 గం. వరకు హిందీభాషలో ఏకాంబరేశ్వరఅగ్రహారపు గుంటకు వెనుకప్రక్కను ఉపన్యాసములు భగవద్గీతపై నొసంగబడును.

ది 20-12-1950 తేది బుధవారము ఉదయము గం. 8-0 కు జార్జిటవునుసముద్రతీరమున అవబృథో త్సవమున్ను జరుగును.

ఈ కార్యక్రమముతోపాటుగ ఈ పదునెనిమిది దినములు, అవకాశమున్నన్ని భారతదేశమందును ఖండాంతరములయందును గల శ్రీ భగవద్గీతయొక్క ముద్రితాముద్రిత గ్రంథరాజముల దీనికి సంబంధించిన వాఙ్మయ ప్రదర్శనమున్ను జరుపబడును.

మరియు శ్రీ భగవద్గీతమూలము అర్థము - వ్యాఖ్యానములు - విమర్శనలు - ఉపన్యాసములయందు పరీక్షల నేర్పరచి అందు తీర్ణులైన వారలకు బహుమతులును బిరుదములున్ను యివ్వబడును.

వీలునుబట్టి "గీతామందిరమును" స్థాపించు ప్రయత్నము చేయబడును.

గాన ఈ పవిత్రమహోత్సవమున తాము పాల్గొనియు, దీని ఆహ్వానసంఘమున తాము సభ్యులుగ రియు, యితరులచేర్పించియు, తమకందుబాటులోగల శ్రీ భగవద్గీతా వాఙ్మయమును ప్రదర్శనమునకిచ్చియు, ఇంకను తమకుచితమనితోచిన విధముగ సహాయముజేసి ఈ మహోత్సవమును వైభవోపేతముగానడిపించ వలసి నదిగ ప్రార్థించుచున్నాము.

(తాము ప్రదర్శనముకిచ్చు శ్రీ భగవద్గీతా వాఙ్మయమును తిరిగి ప్రదర్శనాంతరమున తమకు అతిజాగ్రత్తగా వప్ప గించగలము.)

ఇట్లు,

శ్రీ విశిష్టాద్వైతప్రచారక సంఘ

శ్రీ భగవద్గీతా మహోత్సవాహ్వానసంఘము.

అధ్యక్షులు

రావుబహదూర్

శ్రీమాన్ వేమూరి రంగనాథశ్రేష్టి.

(తిరువల్లిక్కేని శ్రీపార్థసారథి స్వామివారి దేవాలయ ధర్మకర్తలు)

కార్యదర్శులు

కేశవలాల్ తర్వాడి బి. ఎ. బి. ఎల్

కరాలపాటి రాధాకృష్ణయ్య.

కోశాధిపతి

కొంజేటి సుబ్బరాయులు శ్రేష్టి.

మద్రాసుశాఖ అధ్యక్షులు

మట్టుపల్లి రంగనాదయ్య.

కేంద్రకార్యదర్శులు

1. తెం. క. గోపాలాచార్యులు.

2. ఆ. చి. శ్రీమన్నారాయణ.

---

## ఆహ్వానసంఘ సభ్యత్వము.

| | | | | |
|---|---|---|---|---|
| మహారాజపోషకులు. | రూ. 1118-0-0. | లు గాని అంతకంటె | అధికముగాని | సమర్పించువారు. |
| రాజపోషకులు. | 518-0-0. | ,, | ,, | ,, |
| పోషకులు. | 218-0-0. | ,, | ,, | ,, |
| సహాయకులు. | 118-0-0. | ,, | ,, | ,, |
| సభ్యులు. | 58-0-0. | ,, | ,, | ,, |
| అభిమానులు. | 25-0-0. | ,, | ,, | ,, |
| చందాదారులు. | 18-0-0. | ,, | ,, | ,, |

శ్రీ రామ జయం.



అష్టోత్తర శత { శ్రీ సీతాకల్యాణ / శ్రీ రామపట్టాభిషేక / శ్రీ రామాయణపారాయణ } శ్రీరామ క్రతువు



ఓం

శ్రీ

మదరాను.

1949.

5

# నివేదిక

: నిర్వాహకులు :

(శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము.)

కార్యాలయము 147 అణాపిళ్ల వీధి,

మదరాసు 1.

సత్యం వద

ధర్మం చర

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము మదరాసు శాఖ
యాజమాన్యమున జరిగిన

# శ్రీరామక్రతువు యొక్క

ఆహ్వానసంఘమువారి తిరునామములు.

—:అధ్యక్షులు:—

శ్రీ యస్. గోవిందరాజులనాయుడు ప్రిన్సిపాల్ లా కాలేజి; (ఆక్టింగు) వైస్ ఛాన్సిలర్ మద్రాసు విశ్వవిద్యాలయము.

కార్యదర్శులు :

శ్రీ మాదిరెడ్డి విరూపాక్షరావునాయుడు బి. యస్. సి.
,, సామి చెన్నకేశవులు శ్రేష్టి - కేశవరాం కంపెనీ,
,, కరాలపాటి రాధాకృష్ణయ్య.

కోశాధికారులు :

శ్రీ మట్టుపల్లి రంగనాథయ్య.
శ్రీ యం. వి. నరసింహులునాయుడు.

సభ్యులు :

మెసర్సు అమీచంద్ నగ్‌దాసు అండ్ కో.
శ్రీ కొత్తూరు అప్పయ్య శ్రేష్ఠి.
,, ముడుంబై వెంకటరంగ అణ్ణహరాచార్యులు.
,, అల్లత్తూరు కణ్ణన్ శ్రేష్ఠి.
,, కొత్తూరు గోవిందరాజులు శ్రేష్ఠి
,, కె. యస్. చంపకేశ అయ్యంగారు.
,, గిరంజీ ఆనందజీ.
,, వి. దేవరాజులు శ్రేష్టి
,, పసుమర్తి నరసింహులు శ్రేష్ఠి
,, కొప్పురం నటేశం శ్రేష్ఠి.
,, ఆర్. వి. నారాయణస్వామి శ్రేష్ఠి.
,, నారాయణదాసు దతియా.
,, ముక్కాల నమ్మాళ్వారు శ్రేష్ఠి
,, రావుబహద్దూర్ అల్లత్తూరు నాథముని శ్రేష్ఠి
,, సి. నరసింహాచార్యులు. అడ్వకేటు.
,, గుంటూరు నరసింహరావు. యం. యల్. ఎ.
,, సర్బత్ శంకరభట్టు.
,, ఊటుకూరి పిచ్చయ్య శ్రేష్ఠి.
,, రేపూరి పద్మనాభం శ్రేష్ఠి.

శ్రీ ఉమ్మిడి పాండురంగం శ్రేష్ఠి
,, పి. యస్. భాష్యం శ్రేష్ఠి. (కౌన్సిలర్)
,, సామి యతిరాజసంపత్తు శ్రేష్ఠి.
,, కంకిపాటి రామానుజం శ్రేష్ఠి.
,, రావుబహదూర్ వేమూరి రంగనాథం శ్రేష్ఠి.
,, రామానుజం కూటం రామానుజయ్య.
,, చవల రామానుజయ్య శ్రేష్ఠి.
,, సి. ఆర్. రాజగోపాలాచార్యులు
,, సామి రాధాకృష్ణ శ్రేష్ఠి.
,, జె. రంగయ్య శ్రేష్ఠి.
,, పోలేపల్లి రామానుజయ్య. బి. ఎ.
,, కొత్తూరు రంగనాయకులు శ్రేష్ఠి.
,, కొప్పురం రాజాబాదరు శ్రేష్ఠి.
,, పి. వి. రాధాకృష్ణ శ్రేష్ఠి.
,, పంచాంగం లక్ష్మీనరశింహాచార్యులు.
,, కె. వెంకటస్వామినాయుడు ఎం. ఎల్. సి.
మద్రాసు కౌన్సిల్ ఉపాధ్యక్షులు
,, కొప్పురం వీరరాఘవులు శ్రేష్ఠి.
,, యిస్నా వెంకటరామయ్య శ్రేష్ఠి.
,, పాతాళం వీరరాఘవులు శ్రేష్ఠి.
,, తాటికొండ వెంకటరాఘవులు శ్రేష్ఠి.
,, సత్రసాల వెంకటరంగం శ్రేష్ఠి.
,, సత్రసాల వెంకట్రాం. కౌన్సిలర్.
,, చిమటా శేషాచలం శ్రేష్ఠి.
,, ఉమ్మిడి శ్రీరాములు శ్రేష్ఠి.
,, జలగం సుబ్రమణ్యం నాయుడు.
,, నాదెళ్ళ సంపతు శ్రేష్ఠి.
,, గొల్లపూడి సూర్యనారాయణ శ్రేష్ఠి.
,, చీకిరాల సుబ్రమణ్యం శ్రేష్ఠి.
,, మందారం రంగనాథం శ్రేష్ఠి.
,, కొంజేటి సుబ్బరాయలు శ్రేష్ఠి.

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక కేంద్రసంఘ కార్యదర్శులు :—

తే. కం. గోపాలాచార్యులు,

ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులు.

# శ్రీ రామ క్రతువునందలి కొన్ని ఛాయాపటములు



పారాయణ మండపము



విద్వా౯. శ్రీమా౯. కారప్పంగాడు వెంకటా
చార్య స్వామివారు



శ్రీమా౯. ప్రతివాదిభయంకరం అణ్ణంగరా
చార్య స్వామివారు



శ్రీ కొడకొంచ సుదర్శన భట్టరువారు



శ్రీమా౯ కాంద్యూరి రామానుజాచారి
స్వామివారు



శ్రీ యతిరాజాసేవా మహిళాసంఘమువారి
వుపన్యాస దృశ్యము



శ్రీ యతిరాజసేవా మహిళాసంఘమున పాల్గొ
నిన యొకబాలిక



అధ్యక్షులు. శ్రీ. యన్. గోవిందరాజులు
నాయుడుగారు, వి. వి. శ్రీనివాసఅయ్యంగారు



ఉపన్యాస మండపము

# శ్రీరామ క్రతువునందలి కొన్ని ఛాయాపటములు



శ్రీమాన్. ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులు వారు



[illegible]



శ్రీ గోపాలస్వామిశెట్టిగారి గానకచ్చేరి



శ్రీ సంగీతాచార్యస్వామి వల్లభదాస్ మహారాజుగారు



శ్రీ. వి. వి. శ్రీనివాసఅయ్యంగారు. అధ్యక్షులు



శ్రీ బులుసు. సాంబమూర్తిగారు



శ్రీ. S. B. జ్యోషి హిందూ థియలాజికల్ హైస్కూలు ప్రధానోపధ్యాయులు



శ్రీ చెన్నకేశవ చెన్నమల్లీశ్వర దేవస్థాన ఎక్సిక్యుటివ్ ఆఫీసర్



సముద్రతీరమునందలి స్నానదృశ్యము

# శ్రీరామ క్రతువుసందలి కొన్ని ఛాయాపటములు



సముద్రమునకు వెళ్లుదృశ్యము



అవభృత స్నానమునకై మదరాసు సముద్ర తీరమునకు పోవునపుడు దృశ్యము



శ్రీ చెన్నకేశవ పెరుమాళ్ళతో



సముద్రతీరమున పోవునపుడు దృశ్యము



గోష్ఠి తిరువీధి పురప్పాడు



అవభృత స్నానదృశ్యము



రాజాజీహాలులో జరిగిన ఉపన్యాససమయము



శ్రీమాన్. తే. కం. గోపాలాచార్యుల స్వామి వారు. శ్రీమాన్. అ. చి. శ్రీమన్నారాయణాచార్యుల స్వామివారు

ఓం.



# శ్రీసీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్స మేత శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

---

(శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము.)

## అష్టోత్తరశత { శ్రీ సీతా కల్యాణ / శ్రీ రామ పట్టాభిషేక / శ్రీ రామ పారాయణ } శ్రీరామక్రతువు

—: నివేదిక :—

ప్రస్తుతము దేశములో అతివృష్టి అనావృష్టి మున్నగు ఈతిభాదలును బట్టియు అన్న వస్త్రాది కోరతలను బట్టియు, పరస్పర ఈర్ష్య ద్వేషము మోసము దురాశ హింస అధికారవాంచ మున్నగు అవినీతిని బట్టియు వ్యాపించియున్న అశాంతిపోయి సమస్తజీవులు సౌఖ్యవంతులై రాజు, రాష్ట్రము ప్రజలు ఆనందముతో వర్ధిల్లుచు లోకకల్యాణము సిద్ధించుటకొరకు ప్రజాసామాన్యమున ఆస్తికత – భక్తిభావన – సేవానిరతి – ధర్మము – వినమ్రత – వృద్ధిపొందుటకు మదరాసు నగరమున, శ్రీ చెన్నకేశవస్వామి పెరుమాళ్ కోవిలయందు స్వస్తిశ్రీ విరోధినామ సంవత్సర చైత్రశుద్ధ పాడ్యమీ బుదవారము (30-3-1949 తేది) నుండి. నవాహ్నిక దీక్షతో శిష్టాచార సంప్రదాయాను సారముగ అష్టోత్తరశత శ్రీ సీతాకల్యాణ శ్రీరామపట్టాభిషేక శ్రీరామాయణ పారాయణసహిత శ్రీరామక్రతువు శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ మదరాసు శాఖవారిచే మహావైభవముగ జరుపబడినది, ఈక్రతు నిర్వహణమునకై ఒకఆహ్వాన సంఘ మేర్పాటు చేయ బడినది.

వారుభక్తులగు పురప్రముఖుల సహాయముచే ఈకృతువును దిగ్విజయముగజరిపిరి. మదరాసు రాజధానిలోని నలుప్రాంతములవారు ఇందు పాల్గొనిరి. ప్రతినిత్యము క్రతు సంబంధమైన

వైదిక ప్రక్రియతోబాటు, శ్రీరామాయణోపన్యాసములు, అనేక వేదాంతార్థములున్ను, రామ రాజ్యమును గురించి అనేకప్రముఖులు ఉపన్యాసములున్ను, స్త్రీలకై ప్రత్యేకము విదుషీమణు లచే ఉపన్యాసములున్ను ఏర్పాటు చేయబడినవి. మరియు గానవినోదములుకూడ జరుపబడినవి.

శ్రియఃపతి కరుణా కటాక్షముచే ఈ శ్రీరామక్రతువు సలక్షణముగా జరిగినది.

—: సర్వేజనా సుఖినోభవంతు :—

ఈ కృతునిర్వాహణాకై ఆహ్వానసంఘముగ ఏర్పడి ఈ కృతువును మహావైభవముగ నడి పించిన ఆహ్వాన సంఘముకీవారిన్ని; ఈ కృతువునందు పాల్గొని దీక్షితులై దీనిని సలక్షణముగ జరిపిన ఋషిస్థానీయులుకున్ను ఋత్విక్కులుకున్ను, అన్నివిధములైన పారాయణపరులుకున్ను, ఈ కృతువును అతివైభవముగా జరుపుటకై విరాళముల నొసగిన దాతలకున్ను,

ఈ క్రతువును జరిపించుటకు జార్జిటవునులోని శ్రీ శ్రీ శ్రీ చెన్నకేశవ పెరుమాళ్ళకోవిల నంతను క్రతువు జరుగు కాలమునందు, మా ఆధీనములో యుంచిన సదరు దేవాలయ ధర్మకర్త లుకున్ను, ఎగ్జిక్యూటివు ఆఫీసరుగారికిన్ని: ఈ క్రతు నిర్వహాణమునకై వలయు సమస్త సదు పాయములను చక్కగజేసి దీనిని వైభవముగ జరిపించిన ఈదేవాలయ మేనేజరు, మణిగారు స్వామివార్కి. అర్చక - పరిచారక - అధ్యాపక - స్థానాచార్య. పాచకాది కైంకర్యపరులందరికిన్ని,

యజ్ఞశాల - ఉపన్యాసమంటప, పారాయణమంటపాదుల నలంకరించుటకు వలయు అరటిచెట్లు, పోకచెట్లు, మామిడాకు, కొబ్బరియాకు వగైరాల ఉచితముగ నిప్పించిన శ్రీమార్ణ మణలి. శ్రీనివాస మొదలియారు గారికిన్ని, ఈ క్రతు నిర్వాహణమునకున్ను, దర్శనమునకున్ను విచ్చే సిన భక్తబృందము బసచేయు టకున్ను, తదీయారాధనలు జరుగుటకున్ను తమ తమ రామానుజ కూటములను, సత్రములను ఉచితముగ యిచ్చి మాకు అన్ని విధములుగను తోడ్పడిన శ్రీ ఉప్పూ టూరు ఆళ్వారుశ్రేష్ఠివారి రామానుజకూట ధర్మకర్తలకున్ను; శ్రీ సింగంశ్రేష్ఠి యతీంద్రులు శ్రేష్ఠివారి రామానుజకూట ధర్మకర్తలకున్ను; శ్రీ కలివి రామన్న శ్రేష్ఠివారి సత్ర ధర్మ కర్తలకున్ను; శ్రీ నారాయణ గురువయ్య శ్రేష్ఠివారి సత్ర ధర్మకర్తలకున్ను; శ్రీ కన్యకాపరమే శ్వరీ దేవస్థానము వారి సత్ర ధర్మకర్తలకున్ను; శ్రీ పప్పుశ్రేష్ఠి రాఘవులశ్రేష్ఠివారి రామానుజ కూట ధర్మకర్తలకున్ను,

ఈ క్రతు నిర్వహణమున అనేక కష్టముల కోర్చి చక్కగ తమ సేవాధర్మమును అను ష్ఠించిన స్వయంసేవక భక్తబృందమునకున్ను వీరికి నాయకత్వము వహించి నడిపించిన శ్రీ. సి. గోవిందరాజులు శ్రేష్ఠి గారికిన్ని; గాన మండపమునందు పాల్గొనిన, గాన విద్వాంసులకునూ, భజనమండలీల వారికున్ను, నాగస్వర కచ్చేరో నర్పిన వారికిన్ని, సన్నదియందు తళిగెలు సమర్పించినీ వారికిన్ని, తదియారాదనకు సామాగ్రుల నొసంగిన వారికిన్ని ఇంకను అనేక విధముల ఈ పవిత్ర కార్యమున తోడ్పడిన భక్తవరులకున్ను మాకృతజ్ఞతా వందనముల నర్పించుచున్నాము.

ఈ క్రతువున దీక్షితులైన వారందరికి శ్రీమాన్ పి. అనంతకృష్ణశ్రేష్ఠి అనువారు రావతుల సమర్పించిరి.

శ్రీ సీతాకల్యాణ సమయమున సుమారు 240 జతల బంగారుపూతగల రజిత మంగళ సూత్రములను, యజ్ఞోపవీతములను, మట్టెలను, పాదుకాలను మొదర్సు చెమ్మిడి బంగారు శెట్టి అండు సన్సువారు సమర్పించిరి.

మరియు అనేకరకములైన చిన్నచిన్న వెండి సామగ్రులను, ఫల - పుష్పాదులను, చేతి సంచులను, అనేకమంది భక్తులు సమర్పించిరి. వీరందరికి మా కృతజ్ఞతా వందనములు.

ఈ మహత్కార్యమును అత్యంత-మహోన్నైభవముగా నిర్వహించిన విశిష్టాద్వైత ప్రచారక సంఘ మదరాసు శాఖవారికి మాకృతజ్ఞతా వందనములు—

జరిగిన కార్యక్రమముల వివరములు :—

## 29 మార్చి 1949 మంగళవారము

స్వస్తిశ్రీ సర్వధారినామ సంవత్సర ఫాల్గున బ॥ అమావాస్య (పంగుని 16 వ) మంగళ వారము సాయంకాలం 6 గంటలకు కన్యాలగ్నమున ప్రారంభమై భగవత్ప్రార్థన, విష్వక్సే నారాధనము, ఋత్విగ్వరణము, దేవతాహ్వానము, దేవతాప్రార్థనము, మృత్సంగ్రహణము. అంకురార్పణము, పాలికాస్థాపనము, కుంభస్థాపనము, వాస్తుపూజ, వాస్తుహోమము, బలిప్రదానం ద్వాత్రింశత్కలశావాహనం. నవగ్రహక్షేత్రపాలక సర్వతోభద్రాది మండలారాధనం. దిక్పాలకపూజ, ధ్వజ, గరుడ ప్రతిష్ట. శ్రీరామయంత్ర స్థాపనముజరిగెను.

## 30 మార్చి 1949 బుధవారం.

ఉదయం 5-గం. లకు తిరువారాధనము (నారాయణ మొదలి వీధిలోని శ్రీ కలివివారి రామానుజ కూటములో) జరిగెను.

గం, 5-15 తిరుప్పావై సేవాకాలం గోష్టి. గం. 6-0 శ్రీరామానుజ కూటంనుండి తిరు వీధి ఉత్సవము బయలుదేరెను. 7-.లకు యాగశాలచేరి మహాశాంతి, 7-30 గం,లకు కలశార్చన యంత్రములకర్చన, చతుర్దశకలశ తిరుమంజనం, ధ్వజారోహణము. రక్షాబంధనారాధనము, క్రతు దీక్షితులకు రక్షాబంధనము, హారతి, మంత్రపుష్పం శ్రీకోశాది ఆరాధనము శ్రీకోశాది వస్త్ర సమర్పణము.

గం. 9-30 శ్రీరామ మంత్రకోటి జపములు.

108. శ్రీరామాయణ పారాయణములు ప్రారంభమాయెను.

ఉభయ – వేదాంత, భారత, భాగవత, విష్ణుపురాణ, విరాటపర్వ శ్రీవిష్ణుసహస్రనామ, శ్రీరామాయణ పారాయణముల ప్రారంభము, లక్షతులసి అర్చనప్రారంభము, హోమము, ఉప న్యాస మండపమున శ్రీరామాయణోపన్యాస ప్రారంభము ఆయెను.

## ప్రతినిత్యముకూడ జరిగిన హోమ విషయములు.

ఉదయమున 7-30 గం. నుండి 10-30 గం. వరకు

చతుర్వింశతినామ హోమము, నారాయణాష్టాక్షరి హోమము. సంగ్రహరామాయణ శ్లోక హోమము, పురుషసూక్త హోమము, హనుమన్మంత్ర హోమము, విష్ణుసూక్తహోమము, శ్రీరామ షడక్షరి హోమము, హనుమద్గాయత్రీ హోమము, శ్రీసూక్త హోమము. శ్రీరామ దశాక్షరీ హోమము, గాయిత్రీహోమము, శ్రీరామ గాయత్రీ హోమము, శ్రీరామమంత్రాది జపాదులున్ను.

సాయంకాలమున 5-30 గం. నుండి. 8-30 గం. వరకు.

తిరిగి యాగారంభము, పారమాత్మ్య హోమము, తదంగవేద – ప్రబంధ పారాయణ సేవాకాలములు పూర్ణాహుతి నివేదనం, చాత్తుముఱై జరుపబడుచుండెను.

ఇవిగాక ఆయారోజులలో జరిగిన ప్రత్యేక విశేష హోమములు.

మొదటి రోజున 30-3-49 ఉదయం:—పుత్రకామేష్టి హోమము, రెండవ రోజున 31-3-49 ఉదయం:—శ్రీ సీతారామ కల్యాణ హోమము (శ్రీ సీతా కల్యాణము), మూడవ రోజున 1-4-49 ఉదయం:— పాదుకా పట్టాభిషేక హోమము, నాలుగవ రోజున 2-4-49 ఉదయం:—చిత్తిప్రశ్న హోమము (జటాయు మోక్షము), అయిదవ రోజున 3-4-49 ఉద యం:—సఖ్యహోమము (సుగ్రీవ సఖ్యము), ఆరవ రోజున 4-4-49 ఉదయం:—పంచ సం స్కార హోమము సుదర్శన హోమము (అంగుళీ ప్రదానము), ఏడవ రోజున 5-4-49 ఉద యం:—శరణాగతి హోమము (విభీషణ శరణాగతి), ఎనిమిదవ రోజున 6-4-49 ఉదయం:— బ్రహ్మాస్త్ర హోమము, తొమ్మిదవ రోజున 7-4-49 ఉదయం:—కల్యాణ హోమము, పదవ రోజున 8-4-49 ఉదయం:—శ్రీరామ పట్టాభిషేక హోమము (శ్రీరామ పట్టాభిషేకము) శత కలశ తిరుమంజనము పూర్ణాహుతియు జరుపబడినవి.

ప్రతినిత్యము జపించబడిన మంత్రములు:—

శ్రీరామ షడక్షరి మంత్రము; ఆంజనేయ గాయత్రీ మంత్రము; విష్ణు సహస్రనామము; శ్రీరామ దశాక్షరి మంత్రము; నారాయణ అష్టాక్షరి మంత్రము; శ్రీరామ సహస్రనామము;

శ్రీరామ గాయత్రీ మంత్రము ; నారాయణ గాయత్రీ మంత్రము ; శ్రీలక్ష్మీ సహస్రనామము; ఆంజనేయ మంత్రము గాయత్రీ మంత్రము శ్రీలక్ష్మీ అష్టోత్తరము ; జపించబడినవి.

ప్రతినిత్యము జరిగిన పండితుల ఉపన్యాసములు.:—

ప్రతి దినము ఉపన్యాస మంటపమున ఉదయం గం 7-30 లు మొదలు గం 10-30 వరకు ఒక్కొక్క ఉపన్యాసము యించుమించు అరగంట కాలము చొప్పున జరుగుచుండెడివి.

విరోధినామ సం॥ ర చైత్ర శు ౧, 30-3-49 బుధవారము (మొదటిరోజు.)

శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ కార్యదర్శి నివేదిక.
అధ్యక్షులు :— శ్రీ. ఉ. వే. శ్రీమాన్ ప్ర. భ. అణ్ణంగరాచార్యులువారు.
పుత్రకామేష్టి ; పాయసభాగము ; శ్రీరామజననము ఉపన్యాసము—

31-3-49 గురువారము. (రెండవరోజు.)

అధ్యక్షులు :—శ్రీ. ఉ. వే. శ్రీమాన్. పండిత చక్రవర్తి శ్రీనివాస రంగాచార్యులు గారు. మద్రాసు. అహల్యా:—శ్రీ. ఉ. వే. శ్రీమాన్ తి. ప. లక్ష్మీనరసింహాచార్యులుగారు. పెంటపాడు. సీతాకల్యాణము:-శ్రీ అధ్యక్షులవారు. శ్రీరామవతారతత్వము:-రావుబహద్దూర్ శ్రీ వేమూరి రంగనాథ శ్రేష్ఠిగారు. మద్రాసు. రామగుహ సమావేశము.

1-4-49 శుక్రవారము. (మూడవరోజు.)

అధ్యక్షులు. శ్రీ. ఉ. వే శ్రీమాన్ పండిత పురిశై కృష్ణమాచార్యులు గారు మద్రాసు. సభాప్రారంభకులు-శ్రీ. ఉ. వే. శ్రీమాన్ విద్వాన్ తైయూర్ జో. రంగాచార్యులుగారు. తిరువళ్లూరు. భరద్వాజాతిథ్యము:—శ్రీ. ఉ. వే. శ్రీమాన్ బెల్లపుకొండ రాఘవాచార్యులుగారు. గుంటూరు. భరతభక్తి:—మీమాంసా విశారద. శ్రీ. ఉ. వే. శ్రీమాన్ వంగిపురం రంగనాథాచార్యులుగారు. మద్రాసు.

పాదుకాపట్టాభిషేకం - శ్రీ. ఉ. వే. శ్రీమాన్ శాంతలూరి వెంకటాచార్యులుగారు:
,, ,, - శ్రీ. ఉ. వే. శ్రీమాన్. ఎ. వి. గోపాలాచార్యులుగారు.
అత్రి ఆశ్రమ ప్రవేశం - శ్రీ. ఉ. వే. శ్రీమాన్. ఆరవిల్లి అళహసింగరాచార్యులుగారు.

2-4-49. శనివారం (నాల్గవరోజు)

అధ్యక్షులు - శ్రీ. ఉ. వే. శ్రీమాన్ కు. యి. శ్రీనివాస రామానుజాచార్యులుగారు.
సీతాపహరణం.
కబంధ మోక్షము - శ్రీ అధ్యక్షులవారు.

జటాయుమోక్షము –
పెరియ ఉక్తైయార్ – శ్రీ. ఉ. వే. శ్రీమాన్ శ్రీపరాశర సుదర్శనభట్టర్ అయ్యావార్లంగారు.
శబరి అరాధనము – శ్రీ. ఉ. వే. శ్రీమాన్ కవిరత్న గుదిమెళ్ల రామానుజాచార్యులుగారు.
రామహనుమత్సమావేశం – శ్రీ. ఉ. వే. శ్రీమాన్ తూ. వెంకటాచార్యులుగారు.

3-4-49 ఆదివారం (ఐదవరోజు.)

అధ్యక్షులు – శ్రీ. ఉ. వే. శ్రీమాన్ పరవస్తు గోవిందాచార్యులుగారు. (విజయనగరం.)
సభాప్రారంభకులు – శ్రీ. ఉ. వే. శ్రీమాన్ వ్యాకరణ శిరోమణి కందాడై వేంకటరామాచార్యులగారు. విజయనగరం, ,, ,,
హనుమత్ప్రభావము – శ్రీ, ఉ. వే. శ్రీమాన్, కాం. రామానుజాచార్యులుగారు.
వాల్యు పాలంభనం – శ్రీ. ఉ. వే. శ్రీమాన్ ములుగు రామానుజాచార్యులుగారు.
సుగ్రీవ పట్టాభిషేకం – శ్రీ. ఉ. వే. శ్రీమాన్ గు. తి. అం. వెంకటనరసింహాచార్యులుగారు.
సీతాన్వేషణము – శ్రీ ఉ. వే. శ్రీమాన్ సి. నరసింహాచార్యులుగారు.
సంపాతి శాపవిమోచనక – శ్రీ. ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి రాఘవాచార్యులుగారు.

4-4-49 సోమవారం. (ఆరవరోజు.)

అధ్యక్షులు – శ్రీ. ఉ. వే. శ్రీమాన్ చి. మా. వెం. రాఘవాచార్యులుగారు. హైదరాబాద్.
త్రిజటాస్వప్నం – శ్రీ. ఉ. వే. శ్రీమాన్ ప. చ. నరసింహాచార్యులుగారు.
శ్రీరామవర్ణనం – శ్రీ. ఉ. వే. శ్రీమాన్ కిడాంబిభాష్యం రామానుజాచార్యులుగారు.
అంగుళీప్రదానం – శ్రీ అధ్యక్షులు.
చూడామణి సమర్పణం – శ్రీమాన్ తె. క. గోపాలాచార్యులుగారు. కోరుకొండ.
లంకాపురి శుద్ధ్యకరణం – శ్రీ. ఉ. వే. శ్రీమాన్. టి. ఎ. వరదాచార్యులగారు.
హనుమదాలింగనము – శ్రీ. ఉ. వే. శ్రీమాన్ కో. కం. వెంకటేశ్వర్లుగారు. శ్రీరామతీర్థం.

5-4-49 మంగళవారం. (ఏడవ రోజు.)

అధ్యక్షులు – ఉపన్యాసభూషణ. సుబోధక సుధీరణి శ్రీ. ఉ. వే. శ్రీమాన్. కో. కం. రంగాచార్యులుగారు. వరంగల్లు.
విభీషణ శరణాగతి – శ్రీ అధ్యక్షులు.
సేతు బంధనము – శ్రీ. ఉ. వే. శ్రీమాన్. కు. యి. వెంకటాచార్యులుగారు. కాళ్ళకూరు.
సుగ్రీవభక్తి – శ్రీ. ఉ. వే. శ్రీమాన్. ని. కం గో. శ్రీ భాష్యకాచార్యులుగారు

6-4-49 బుధవారం. (ఎనిమిదవరోజు.)

అధ్యక్షులు – శ్రీ. ఉ. వే. శ్రీమాన్. ఆళ్వార్ తిరునగరి రామకృష్ణ అయ్యంగారు. మదరాసు.

సభాప్రారంభకులు - అయుర్వేదాచార్య, శ్రీ. ఉ. వే. శ్రీమాన్. తి. ప. రామానుజస్వామిగారు
అంగదరాయభారం - శ్రీ. అధ్యక్షులు.
నాగపాశ విమోచనం. శ్రీ సభాప్రారంభకులు.
,, ,, శ్రీ. ఉ. వే. శ్రీమాన్ టి. శ్రీనివాస రాఘవాచారులుగారు.
ఇంద్రజిత్తు - శ్రీ. ఉ. వే. శ్రీ. న. చ. రంగాచార్యులుగారు (శుభ్రపీఠు.)
కుంభకర్ణుని మోక్షము - శ్రీ. ఉ. వే. శ్రీమాన్. కె. శఠగోపాచారులుగారు.
బ్రహ్మాస్త్రనిరసనము - శ్రీ. ఉ. వే- శ్రీమాన్. న. గోపాలకృష్ణమాచార్యులుగారు.

7-4-49. గురువారం (తొమ్మిదవ రోజు.)

అధ్యక్షులు - ఉపన్యాసభూషణ. విద్వాన్. శ్రీ. ఉ. వే. శ్రీమాన్. కాంచ్యూరి రామానుజాచార్యులుగారు. మద్రాసు.
సభాప్రారంభకులు - శ్రీ. ఉ. వే. శ్రీమాన్. కారప్పంగాడు వెంకటాచార్యులుగారు. మద్రాసు.
సంజీవినీకైంకర్యము - శ్రీసభా ప్రారంభకులు.
లక్ష్మణ విజయము - శ్రీ అధ్యక్షులు.
రామానుజవైభవము - శ్రీ. ఉ. వే. శ్రీమాన్. శ్రీ. తి. వు. వెంకటాచార్యులుగారు.
శ్రీరామ విజయము - శ్రీ. ఉ. వే. శ్రీమాన్. శ్రీ. తి. పె. సంపత్కుమారాచార్యులుగారు.
సీతాపాతివ్రత్యము - శ్రీ. ఉ. వే. శ్రీమాన్. అచ్చి. వెంకట నరసింహాచార్యులుగారు.

ప్రతినిత్యము సభాంతమున 15 ని॥ కాలము శ్రీమాన్. కాంచ్యూరి రామానుజాచార్యులుగారు ఉపన్యసించిరి.

---

## విదుషీమణుల ఉపన్యాసములు.

---

ప్రతిదినము మధ్యాహ్నము గం 2-0 లు మొదలు గం 4-0 ల వరకు ఉపన్యాసమండపమునందు శ్రీ యతిరాజ సేవామహిళాసంఘ విదుషీమణులచే ప్రత్యేకము స్త్రీలకు మాత్రమే యీ క్రింది ఉపన్యాసములు గావింపబడినవి.

30-3-49 బుధవారం. (మొదటి రోజు.)

పుత్రకామేష్టి - కౌసల్యాదేవి - శ్రీ. న. చ. పెరుందేవితాయారమ్మగారు రాజమండ్రి.
పాయసవిభాగము-శ్రీరామజననం - శ్రీ. యమ్. ఏ. రుక్మిణి అమ్మాళ్-మదరాసు-(అడ్వకేటు)

31-3-49 గురువారం. (రెండవరోజు)

సీతాకల్యాణం-శ్రీ. యమ్. ఏ. జానికమ్మాళ్-అడ్వకేటు మద్రాసు

పరశురామ గర్వభంగము-రామగుహ సమావేశము శ్రీరాజ్యలక్ష్మమ్మ అమ్మాళ్-ప్రొఫెసర్, క్వీన్ మేరీస్ కాలేజీ, మద్రాసు.

1-4-49 శుక్రవారం. (మూడవ రోజు)

భరద్వాజాతిథ్యం-శ్రీపువ్వాడ మంగమ్మగారు. పాదుకాపట్టాభిషేకం. శ్రీ కాండ్యూరి వెంకటమ్మగారు.

2-4-49 శనివారం. (నాలుగవ రోజు)

సీతావియోగము-శ్రీముడుంబై రామానుజమ్మగారు. శ్రీరామతీర్థం. కబంధమోక్షము. శబర్యారాధనము— శ్రీ మరంగంటి రంగనాయకమ్మగారు. కోరుకొండ.

3-4-49 ఆదివారం. (ఐదవ రోజు.)

హనుమత్ప్రభావము, శ్రీ కద్రి లక్ష్మీనరసమ్మగారు. సింహాచలం. సుగ్రీవపట్టాభిషేకం.-

సంపాతి శాపవిమోచనము,—

4-4-49 సోమవారం. (ఆరవ రోజు.)

అంగుళీప్రదానము - శ్రీపండిత. డి. కృష్ణవేణమ్మగారు. మద్రాసు. చూడామణి సమర్పణము - విద్వాన్. కె. వి. పద్మావతమ్మగారు మద్రాసు. హనుమదాలింగనము.

5-4-49 మంగళవారం. (ఏడవ రోజు.)

విభీషణ శరణాగతి - శ్రీ. అ. వెం. లక్ష్మీనరసమ్మగారు. నరసాపురం. సేతుబంధనం-సుగ్రీవ ఉక్తి - శ్రీమత్తిరుమల భాగ్యలక్ష్మమ్మగారు. మద్రాసు.

6-4-49 బుధవారం. (ఎనిమిదవ రోజు.)

అంగదరాయభారము నాగపాశవిమోచనము. బ్రహ్మాస్త్ర నిరసనము.

7-4-49 గురువారం. (తొమ్మిదవ రోజు,)

లక్ష్మణ విజయము-శ్రీ. శా. చూడికుడుత్తమ్మగారు. గుడివాడ. రావణమోక్షము-సీతా పాతివ్రత్యం - శ్రీ. యం. ఎ. కృష్ణమ్మాళ్-అడ్వకేటు. మద్రాసు.

8-4-49 శుక్రవారం. (పదియవ రోజు.)

శ్రీరామ పట్టాభిషేకం-ఈ విధముగ విదుషీమణుల ఉపన్యాసములు జరిగినవి.

# రామరాజ్య ఉపన్యాసములు.

---

ప్రతిదినము ఉపన్యాసమంటపమున సాయంకాలము గం 6-0 లు మొదలు గం. 8-0 ల వరకు ప్రముఖులచే శ్రీరామరాజ్యమును గురించి ఉపన్యాసములు గావింపబడినవి.

### 30-3-1949 బుధవారం (మొదటిరోజు.)

కార్యక్రమనివేదిక :—శ్రీ. ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులుగారు. శ్రీకరాలపాటి రాధాకృష్ణయ్యగారు. అధ్యక్షులు:—శ్రీ. వి. వి. శ్రీనివాసఅయ్యంగారు—అడ్వొకేటు. ఉపన్యాసకులు :—ఉ. వే. శ్రీమాన్. ప్రతివాదిభయంకర అణ్ణంగరాచార్యులువారు శ్రీ. ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులుగారు. శ్రీ. వి. ప్రచారక సంఘకార్యదర్శి అంగళ్చ్చాయణమయ్య, ఉపన్యాస విద్వాన్ శ్రీకోయిల్ తిరువేంకట రామానుజదాసుగారు.

### 31-3-49 గురువారం (రెండవరోజు)

అధ్యక్షులు :—శ్రీబులుసు సాంబమూర్తిగారు. ఉపన్యాసకులు :—శ్రీ. పి. యతిరాజ రామానుజ దాసుగారు. శ్రీ బైసాని కృష్ణయ్యశ్రేష్ఠిగారు. శ్రీరామనాథశాస్త్రిగారు.

### 1-4-1949 శుక్రవారం-(మూడవరోజు.)

ప్రారంభకులు :—శ్రీ గీతాగోవింద రత్నాకర, కే. రాజగోపాలరావుగారు. బి, ఎ. ఉపన్యాసకులు :—శ్రీ. జి మణవాళ రామానుజదాసుగారు. శ్రీ బ్రహ్మశ్రీ వాచస్పతి, కడలుంగుడి నటేశశాస్త్రి గారు.

### 2-4-49 శనివారము-(నాలుగవరోజు.)

అధ్యక్షులు :—శ్రీ హానరబుల్ జస్టిస్ సి. హెచ్. రాఘవరావుగారు. హైకోర్టు జడ్జి. ప్రారంభకులు :—రావుబహద్దూర్ శ్రీ. వి భాష్యం అయ్యంగారు. రిటైర్డు హైకోర్టు జడ్జి. ఉపన్యాసకులు :—శ్రీ కల్లూరి వీరభద్ర శాస్త్రులుగారు. ఉపన్యాసకులు :—శ్రీ సి, నరసింహాచార్యులుగారు. అడ్వకేటు.

### 3-4-49 ఆదివారము-(ఐదవరోజు.)

అధ్యక్షులు :—శ్రీడాక్టరు. కె. రంగాచార్యులుగారు. ఎమ్. బి. బి. ఎస్. హైదరాబాద్. ఉపన్యాసకులు :—శ్రీ. బి. ఆర్. పురుషోత్తమనాయుడుగారు. టమిల్ ప్రొఫెసర్ మదరాసు యూనివర్సిటీ. ఉపన్యాసకులు :—

4-4-49 సోమవారము-(ఆరవరోజు.)

ప్రారంభకులు:—శ్రీ. కె. వెంకటస్వామి నాయుడుగారు ఎమ్. ఎల్. సి. ఉపన్యాసకులు:—శ్రీ. కె. యం. సుబ్రహ్మణ్యంగారు కౌన్సిలర్. మదరాసు. ఉపన్యాసకులు:—శ్రీ. యన్. వేణుగోపాల్ నాయగర్‌గారు బి. ఎ. బి. యల్. అడ్వకేటు.

5-4-49 మంగళవారము-(ఏడవరోజు.)

అధ్యక్షులు:—శ్రీ. పి. కామేశ్వరరావుగారు ఎమ్. ఎ. ఎమ్. ఎల్. హిం. దే. బోర్డు కమీషనర్. ఉపన్యాసకులు:—శ్రీ. కృష్ణరావు నాయుడుగారు. మదరాసు. శ్రీ. చంద్రశేఖరయ్యరుగారు. రిటైర్డు హైకోర్టు జడ్జి. శ్రీ. కె. నరసింహాచారియర్ గారు. శ్రీ. యస్. బాలకృష్ణ జోషి. బి. ఎ. బి. యల్. ప్రధానోపాధ్యాయులు. హిందూథియలాజికల్ హైస్కూలు—మద్రాసు.

6-4-1949 బుధవారం. (ఎనిమిదవరోజు.)

అధ్యక్షులు:—జస్టిస్ శ్రీ. ఎ. విశ్వనాథ శాస్త్రి అవరగళ్. ప్రారంభకులు:—తిరుప్పుగళ్ మణి శ్రీ. టి. యం. కృష్ణస్వామి అయ్యర్-అడ్వకేటు-మదరాసు. ఉపన్యాసకులు:—శ్రీ పండితశాస్త్రిజీ (హిందీభాషలో)

ప్రతిదినము వీరేగాక ఇంకను ఇతరులుకూడా ఉపన్యసించిరి.



ప్రతి దినము రాత్రి గం 9-0 మొదలు గం 11-0 ల వరకు ఈ క్రిందివిధముగా గాన కైంకర్యములు జరిగినవి. పిమ్మట శ్రీరామ సంకీర్తనము భజనరూపముగా జరిగినవి.

30-3-49 బుధవారము. (మొదటిరోజు.)

శ్రీరామన్ కుట్టిగారు-గాత్రము. శ్రీచిత్తూరు సుబ్రహ్మణ్యం పిళ్ళైగారు-ఫిడేలు. శ్రీ గోవిందస్వామి నాయుడుగారు-మృదంగము. శ్రీదొరై బాబు నాయుడుగారు-కంజీర.

31-3-49. గురువారము. (రెండవరోజు.)

శ్రీ ఎస్. వి. పార్థసారధిగారు-గాత్రము. శ్రీ మద్రాసు బాలకృష్ణయ్యర్‌గారు-ఫిడేలు. శ్రీ దొరై బాబు నాయుడుగారు-మృదంగం. శ్రీ నరసింహులు నాయుడుగారు-కంజిర.

1-4-49 శుక్రవారము. (మూడవరోజు.)

శ్రీ వీణ సుబ్బన్న అండ్ పార్టీ-గాత్రము పిడేలు సహా

2-4-49. శనివారము. (నాల్గవరోజు.)

శ్రీ. యస్. వి. బాలసుబ్రహ్మణ్యం అయ్యరుగారు అండుపార్టీ ఫీడేలు. శ్రీ. ఆర్, యస్. గోపాలకృష్ణన్‌గారు-ఫిడేలు.

3-4-49. ఆదివారము. (ఐదవరోజు.)

శ్రీ ఆర్. యస్. శ్రీనివాసన్‌గారి బృందము. శ్రీ ఆర్. యస్. గోపాలకృష్ణన్‌గారు-ఫిడేలు.

4-4-49. సోమవారం. (ఆరవరోజు.)

శ్రీ సంగీతాచార్య-స్వామి శ్రీవల్లభదాస్ మహారాజుగారు.

5-4-49. మంగళవారం. (ఏడవరోజు.)

శ్రీ గోపాలస్వామి శెట్టిగారు వారిపార్టీ. శ్రీ పిచ్చులహరి సూర్యనారాయణగారు వారి బృందము. (బందరు-) నాగస్వరము.

6-4-49. బుధవారము. (ఎనిమిదవరోజు.)

శ్రీ సత్యనారాయణ అండ్ పార్టీ. (అర్తమూరు) నాగస్వరము.

భ జ న లు

ప్రతిదినము రాత్రి గం 11-1 లు మొదలు భజనచేసిన భక్తబృందము.

శ్రీ అల్లూరి వెంకటాద్రి స్వామిగారిశిష్యులు. శ్రీ కట్టారామదాసుగారి శిష్యులు. శ్రీ సిద్ధాంతం నంబిస్వామివారి శిషులు, చాత్తాద శ్రీవైష్ణవ భక్తసభాధ్యక్షులు. శ్రీ బి. తిరువెంగళత్తయ్యగారు. వారిబృందము. శ్రీ గుజరాత్ భక్తబృందము. శ్రీ విష్ణుచిత్త భక్తజన సభవారు. శ్రీ సంతసేవా భజనమండలివారు. ఇతరులు భజనలు సలిపిరి.

ఈ మహనీయుల కందరకున్ను మాసంఘము తరపున ప్రజాసామాన్యము తరపునను మా కృతజ్ఞతా వందనము లర్పించుచున్నాము.

# ఈక్రతువున దీక్షారూపమున పాల్గొని నిర్వహించినమహనీయులు

---

## అధిష్ఠానీయులు

శ్రీ ఉ. వే. శ్రీమాన్ న్యాయవేదాంత వాచస్పతి రామానుజాచార్యులు గారు. నరసాపురము.

,, ప్రతివాదిభయంకరం అణ్ణంగరాచార్యులు గారు. కాంచీపురము

,, షట్ఛిత్తి చక్రవర్తి శ్రీనివాస రంగాచార్యులుగారు. మదరాసు.

,, పరవాస్తు గోవిందాచార్యులు గారు. విజయనగరము.

,, కోమాండూరి యిళ్లైవిల్లి శ్రీనివాస రామానుజాచార్యులు గారు. బాపట్ల.

,, పరాశర సుదర్శనభట్టరు అయ్యవార్లంగారు. శ్రీరంగం, కోరుకొండ.

,, మొలుగు రామానుజాచార్యులుగారు. ముగ్గుళ్ల.

,, శాంతలూరు వెంకటాచార్యులుగారు. పాలకొల్లు.

,, కవిరత్న గుదిమెళ్ల రామానుజాచార్యులుగారు. ముక్తిపల్లి.

,, కంగిపురం రంగనాథాచార్యులుగారు. మదరాసు.

,, చి. మా. వెం. రాఘవాచార్యులు గారు. హైదరాబాదు.

,, ?. జో. రంగాచార్యులుగారు. తిరువళ్లూరు.

## అధ్వర్యులు-ఋత్విక్కులు.

,, ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులు గారు. అత్తమూరు.

,, తిరుక్కాడ్యూరు విద్వాన్ రామానుజాచార్యులుగారు. మదరాసు.

,, పంచాంగం శేషాద్రిభట్టాచార్యులు గారు. పూలపల్లి.

,, రాఘవభట్టాచార్యులు గారు. మదరాసు.

,, ఆయలూరు పట్టస్వామిభట్టాచార్యులు గారు. కోయంబేడి.

శ్రీ ఉ. వే. శ్రీమాన్ భాష్యభట్టాచార్యులు గారు. శ్రీపెరుంబూదూరు.

,, రంగస్వామి భట్టాచార్యులు గారు. సింగప్పెరుమాళ్ కోవిల.

,, రంగభట్టాచార్యులు గారు.

,, సుందరరాజభట్టాచార్యులు గారు.

,, ఆరావముదభట్టాచార్యులు గారు.

,, సుందరరాజభట్టాచార్యులు గారు.

## శ్రీరామాయణ పారాయణ పరులు.

శ్రీ ఉ. వే. శ్రీమాన్ శ్రీనివాస రామానుజాచార్యులుగారు. మదరాసు.

,, అ. రామయ్యంగారు. చోళపురం.

,, ఆర్. శ్రీనివాసాచార్యులు గారు. శ్రీ విల్లిబుత్తూరు.

,, వి. గోపాలఅయ్యంగారు.

,, కోవిల నీందాడ వెంకటనరసింహాచార్యులు గారు. వరంగలు.

,, కిడాంబి నరసింహాచార్యులు గారు. ఉమ్మాచ్చురు.

,, తిరుమల వింజమూరి శేషాచార్యులు గారు నెల్లూరు.

,, న. చ. లక్ష్మణాచార్యులు గారు. చాటపల్లి.

,, గోపినంబాక కూర్మాచార్యులు గారు. శ్రీకూర్మం.

,, ఉమ్మాచ్చురు శ్రీనివాసాచార్యులుగారుర ఉమ్మాచ్చురు.

,, గోపినంబాళ వెంకట నరశింహాచార్యులుగారు. ఆముదాలవలస.

,, కందాళ. వెం. వ. మన్నాథాచార్యులుగారు. శ్రీకూర్మం.

,, తిరుమల పల్లెర్లమూడి జగన్నాథాచార్యులు గారు. శ్రీరామతీర్థం.

,, కరి నారాయణాచార్యులు గారు. శ్రీరామతీర్థం.

,, తిరుమల పల్లెర్లమూడి గోపాలాచార్యులు గారు. సీతానగరం.

పరమకారుణికుడగు పురుషోత్తముని ఆజ్ఞారూపములగు వేదములు విషమును కలిపిన మధుభోజనము నుపదేశించినట్లనుచితములే యగును గదా !

చేయుమని విధించి చేయవలదని నిషేధించుట విరుద్ధము గదా! కర్మలను బోధించు వేదభాగమైన నప్రామాణ్యము కావలెను. అది ప్రమాణమన్నచో వాటిని నిషేధించు నీయుపదేశమైన నప్రామాణ్యము కావలెను. నీవంటి ఆప్తుడు వేద విరుద్ధమైనది విడువమని చెప్పవలెను గాని వేద విహితమైనది కాదే!

శ్రీకృష్ణుడు:- నాయనా! ఒకతల్లికి ముగ్గురు పుత్రులుందురు. వారలకు విద్యాబుద్ధులలో తారతమ్యముండిన నుండనిమ్ము. వేరొకనికి పులుసును ఇష్టమనుకొనుము. తల్లి తండ్రి పెట్టు నప్పుడేమి చేయును? వారి ముగ్గురకు నిష్టమగునట్లు మాత్రమే చేసిపెట్టి తక్కినవారిని పస్తుపెట్టునా?

ఆప్తుడగు చతురుడైన ఒక యింటివైద్యుడు కలడు. ఆయింటిలో నొకడు వాత ప్రకృతియు, ఒకడు పిత్తప్రకృతియు మరియొకడు శ్లేష్మప్రకృతియు కలరు. వారికి రోగము వచ్చినప్పుడా వైద్యుడు వారి ప్రకృతుల ననుసరించి మందులను వాడి పథ్యమును చేయించి యపథ్యముల నిషేధించనిచో వారేమగుదురు?

తాంబూలాదులు కలవడిన బిడ్డలకు తండ్రులవి లభించు నేర్పాటుల గావింపనిచో నేమి చేయుదురు? క్రమముగ చౌర్యాదుల కలవడి చెడుదురుగదా! దాహముచే చావనున్న వానికి రసాయనమును విధించుట భావ్యమా? అట్లే లోకమున పురుషులు తమోగుణ ప్రకృతులు, రజోగుణప్రకృతులు సత్వగుణప్రకృతులు గాను నుందురు.

అనగా ఇతర రెండుగుణముల కంటె ఏదో యొక్కగుణమే సర్వదా వారి శరీరమున రాజ్యము చేయుచుండును. వీరందరి యెడలను వేదమాతకు సమానప్రేమయే యుండునుగదా! కావున వీరికి వీరి రుచిని బట్టి హితమును బోధించవలదా! రాజసులును తామసులును సాత్వికుల ఫలమగు మోక్షరూప పురుషార్థమునకు సహజముగనే విముఖులుగా నుందురు. వీరికి కామ్యకర్మలయందే యాసక్తి ప్రబలియుండును. దానికి వశ్యులై తమ మనస్సును నియమింపజాలక యుందురు. అంత వీరుబౌద్ధాదులవలె శాస్త్రవిరుద్ధకర్మలనే కర్తవ్యములని భ్రమించి వాటి నాచరించి యందువలన కలిగిన పాపము పండినతోడనే చెట్లుగనో పుట్లుగనే పుట్టి యిక పురుషార్థప్రాప్తికి యోగ్యతయే లేక నశింతురు. తల్లి వంటి వేదము వారి యనర్థమును జూచి యెట్లు సహించి యుపేక్షించి యుండగలదు. తల్లి తనబిడ్డలరుచికి తగినట్లువండి పెట్టినట్లే తానే యట్టి రాజసతామసులకు పయోగించు కామ్యకర్మలనుకూడ ఉపదేశించెను. వారు వాటిని గాంచి సంతోషముతో నాచరించి కొన్నిట ప్రత్యక్షముగనే ఫలమును లభించి వేదము

నందు విశ్వాసముకలవారై క్రమముగ కొన్ని జన్మలకైనను సాత్వికులై తరించగలుగుదురు.

అర్జునుడు:- కృష్ణా ఇట్లు కలగూర గంపవలె నానావిధకర్మల బోధించినచో కేవల మోక్షమునే యపేక్షించు సాత్వికులు గుణత్రయ విశిష్టులేగాన నెప్పటికైనను భ్రమించి వేదమున చెప్పబడినవియేగదా యని వాటి నవలంభించి చెడుటయు సంభవించవచ్చునే. అట్లు చెడకుంచే వారకేమైన నుపాయము కలదా?

కృష్ణుడు:- లేకేమి? చూడుము నీవు మొదట నన్నాశ్రయించి యేడ్చుచు నేను నీ శిష్యుడను నిన్ను శరణాజొచ్చుచున్నాను నన్ను తగు రీతిని శిక్షింపుమని ప్రార్థించితివి గదా! అట్లు ప్రార్థించుట సాత్వికునికి గాని పొసగదు. అందుచే నీవు సాత్వికుడవు. అనగా, సత్వగుణము, రజస్తమస్సుల నణచి నీమనస్సు నేలుచున్నది. కావున నీవు దానిని వీడి చేయమని శాస్త్రము విధించిన కర్మలను విడిచి చేయరాని వాటిని చేసి రజస్తమస్సులను పెంచకుము.

అర్జునుడు:- కృష్ణా! వాటిని పెంచుటకును పెంచకుండుటకును మన శక్యమగునా? అది ప్రకృతి ధర్మముకదా!

కృష్ణుడు:- అట్లనకుము. అది మనలోనే యున్నది. దానికి ఆహారము ముఖ్యతమమగు నుపాయము. అది మూడువిధములుగా నుండి ఆయా గుణములను పెంచుచుండును. దానిని గూర్చి మరియొకసారి విపులముగా చెప్పగలను. కావున నీవు రజస్తమోగుణములను పెంచుఆహారాదులను విడిచి సాత్వికాహారమునే సేవించుచుండిన నీ కది శక్యమగును.

అర్జునుడు:- కృష్ణా! రజస్తమఃప్రకోపమునడచుము. సత్వప్రాచుర్యమును వృద్ధిపొందించుమనుచున్నావే! ఎవడైనను 'ఇది రజోగుణము' ఇది తమోగుణము, దీనిని నేనుపెంచుచున్నాను అని తెలిసి ప్రవర్తించునా నివర్తించుటకు? ఎవడైనను సత్వగుణమునుకాని దాని యుపాయమును గాని యెఱుంగునా వాటియందు ప్రవర్తించుటకు? కావున యిందు విషయమై యేమి చేయవలెను? ఎట్లు చేయవలెను. స్పష్టముగా చెప్పుము

కృష్ణుడు:- అడుగవలసిన విషయము నడిగితివి. చెప్పెద సావధానముగా వినుము. నీవు సాక్షాత్తుగా ఆ గుణములను గూర్చి చేయవలసిన దేదియు లేదు. కాని నీవు సాత్వికములు కాని యాహారములను పూర్తిగ విడిచి పుణ్యపాపములకు మూలమైన సకల సాంసారిక స్వభావముల నుపేక్షించి యాత్మస్వరూపము నెఱింగుటకును దానిని పొందుటకును ఉపాయములు కానివాటి నన్నిటిని బొత్తుగ దరిజేరనీయక ఆత్మస్వరూపమును మాత్రమే నియమముగ నన్వేషింపుము. ఇట్లుంటివేని రజస్తమోగుణముల ఉద్రేకము తనంతనే యడుగంటి సత్వగుణము పూర్తిగ తలయెత్తును.

అర్జునుడు:- వేద మపౌరుషేయము. కావున దానికి మనుష్యులు రచించిన గ్రంధములకున్నట్లు భ్రమ, ప్రమాద, విప్రలంభ, అశక్తి దోషములుండవు. అది కొంత ప్రమాణము కొంత అప్రమాణముఅనుట సాహసము. కావుననందు కొన్నిటిని పరిగ్రహించుట కొన్నిటిని విడచుట పాపహేతువుకదా!

కృష్ణుడు:- అర్జునా! ఒక ధర్మాత్ముడు స్నానమునకు, పానమునకు, పశువులకు, పక్షులకు, పంటను, ఉపయోగపడవలెనని ఒక నూతినో చెరువునో, త్రవ్వించెననుకొనుము. వానియందు నీరు పుష్కలముగ నున్నది. ఒక అపరిమితదాహము తో దాని చెంతకేగి తనకు కావలసిన నీటిని త్రాగి పోవునా? అందున్న నీటినంతను త్రాగవలెనను నిర్బంధమేమైన కలదా? అట్లే వేదములు,వర్ణములు, ఆశ్రమములు ప్రవరలు మొదలగు భేదముల ననుసరించి ఆ యా యధికారుల కవసరమగు ధర్మములను విధించును. అందొక వర్ణమునకును ఒక యాశ్రమమునకును చెందిన వాడొకని ఒక విధమైన ఫలము నపేక్షించినవాడుకాని వేరొక వర్ణమునకును వేరొక యాశ్రమమునకును వేరొక ఫలమునకును సంబంధించిన కర్మల నాచరింపరాదు. అట్లే బ్రాహ్మణుడగు ముముక్షువుతనకుపరిగ్రహించవలసిన వేవియో విడిచి పెట్టవలసిన వేవియో బాగుగ నెఱింగి యా విషయములో నేవిమోక్షసాధనములో వాటినే పరిగ్రహించుట సకలశాస్త్రసమ్మతమైనమర్యాద అంతియే గాని వేదమున జెప్పబడినను తానధికారి కాకుండుటచే నితరవిధుల నాతడు విడుచు టచే పాప మించుకయును లేదు.

అర్జునుడు:- కృష్ణా! నేను నన్ను గూర్చి ప్రశ్నింపగా బ్రాహ్మణునికర్తవ్యము నుపదేశించితి వేమి? అదిగాక బ్రహ్మవిద్యయందు త్రైవర్ణికులనబడు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులను ముగ్గురకు నధికారముండగా నిచ్చట బ్రాహ్మణుని విశేషమేమి?

కృష్ణుడు:- ఓసీ! యిదియా నీ సందేహము. నీవు గ్రహింతు వనుకొంటిని పోనిమ్ము ఆ మర్మమును నేనే చెప్పి నీ సందేహమును తొలగింతును. వినుము.

ఇచ్చట 'బ్రహ్మ X అణతి' (అణ-శబ్దే)అను వ్యుత్పత్తిని బట్టి 'బ్రహ్మ X అణ' యని యుండగా యీ బ్రహ్మశబ్దము శకన్ధ్వాది గణములో చేరినదగుటచే 'శకన్ధ్వాదిషు పరరూపం వాచ్య' మ్మని పరరూపము వచ్చుటచే 'బ్రాహ్మణ'యని యగును దీనికి 'ప్రజ్ఞాదిభ్యా దణ్' అని అణ్ ప్రత్యయమువచ్చి'అచో ఞ్ణితి'యనుసూత్రముచే ఆదివృద్ధి వచ్చి'బ్రాహ్మణ'యగుచున్నది. ఇచ్చట 'బ్రహ్మ' శబ్దమునకు 'సర్వేషు వేదేషు' అను చోటనే ప్రసక్తమైనది గాన వేదమని యర్థము 'అణ' ధాతువునకు శబ్దించుట యర్థము. కావున వేదమును శబ్దించువాడు 'బ్రాహ్మణుడు' అని యర్థమును జెప్పవలెను. వేదమును చదువుకొను యధికారము బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకు ముగ్గురకును కలదు గాన నిచ్చట 'బ్రాహ్మణ' శబ్దమునకు త్రైవర్ణికు లర్థమగుదురు. అందునీవు క్షత్రియుడ వగుటచే నీకును యీ యుపదేశము వర్తించుట కాక్షేపము లేదు. తెలిసినదా?



అస్మద్గురుభ్యోనమః

# ప్రపన్నకృత్యము

ఆ. చి. శ్రీమన్నారాయణ.

---

[నమ్మాళ్వార్లు చింతతోఁగూడిన జ్ఞానముద్రతో కూర్చునియుందురు. మధురకవులు వారి సమీపమున అంజలి ఘటించి వినయముతో నిలబడియుందురు.]

---

శ్రీనమ్మాళ్వార్లు:– ఓ మధురం! శ్రీకణ్ణనును ఇప్పుడే పొందవలెనోయీ. ఆయన తిరునావాయ్ యందుకదా వేంచేసియున్నాడు.

తిరువాయ్మొழி ౯. ౮. ౧.

అఱుక్కుం వినైయాయిన ఆకత్తవనై ।
నిఱుత్తుమ్మనత్తొన్నియ శిందైయినార్క్కు ।
వెఱిత్తణ్ మలర్ చ్చోలైకళ్ శూழ் తిరునావాయ్।
కుఱుక్కుం వకైయుండు కొలో కొడియేఱ్కే ॥

హృదయమునందు ఆసర్వేశ్వరుని ఉంచవలయుననెడి అధ్యవసాయమందు ఉద్యోగించిన మనోరథముగలవారియొక్క పాపములైనవాటి నన్నిటిని పోగొట్టినదియు పరిమళములుగల చల్లనైన పుష్పములుగల తోటలచే చుట్టబడిన తిరునావాయ్ యనెడు దివ్యదేశమును పాపముగల నాకు పొందుటకుపాయము ఉన్నదా?

తిరువాయ్మొழి ౯. ౯. ౧.

పా॥ మల్లికై కమழ் తెన్ఱల్ ఈరుమాలో
వణ్ కుఱింజి యిశై తవழுమాలో
శెల్కదిర్ మాలైయుం మయక్కుమాలో
శెక్కర్ నల్ మేకంగళ్ శిందైక్కుమాలో
అల్లియం తామరైక్కణ్ణన్ ఎమ్మాన్
ఆయర్కళ్ ఏఱు అరియేఱు ఎన్ మాయోన్

పుళ్ళియ ముల్లైకళుం తోళింకొండు
పుషలిశం అతికిలం తబయమాలో

మల్లెపుష్పముల పరిమళముగల మలయమారుతము నన్ను చీల్చివేయుచున్నది. అందమైన కుఱింజియనెడి రాగము దొలచివేయుచున్నది. అస్తమించుచున్న సూర్యునిగల సంధ్యాకాలమున్ను మైటాకము జేయుచున్నది. ఎఱ్ఱని వర్ణముగల శ్రేష్ఠమైన మేఘములు కోయుచున్నవి. వికసించు చున్న సుందరమైన పద్మమువంటి నేత్రములుగల మాస్వామియు గోపశ్రేష్ఠుడును సింహశ్రేష్ఠుడును నాకాశ్చర్యభూతుడైన సర్వేశ్వరు సంశ్లేషించిన ఈ స్తనములను భుజములను తీసుకొనిపోయి; ఒం టరిగాయున్న మానము ప్రవేశింపతగిన స్థానము ఏమియో మనము ఎఱుంగము గదా. ఓయ్యో నికటిక శినది.

"మాలైయుం వందదు, మాయన్ వారాన్" (తిరు. ౮. ౫. ౧౦):
సాయంకాలము కూడ వచ్చినది. గాని, ఏమి ఆశ్చర్యమో ఆశ్చర్య గుణాభూతుడైన శ్రీకృష్ణుడు రాడే. అయ్యో అయ్యో ఇక నాగతి ఏమి.

మధురకవులు:_ (స్వగతము) పట్టపగలంతయు పలుతెఱంగుల పలవరించినను రాని కృష్ణుడు సాయంకాలమైనంతనే సాక్షాత్కరించునా ఏమి చెప్మా!

అవునవును. గీతలో రెండవయధ్యాయమున ఆయనే తెలిపెనుగదా!

'యానిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ' ప్రపంచమంతయు రాత్రిగా భావించుకొని నిద్రించియుండు కాలముననే జితేంద్రియుడగుయోగి, భగవత్ సాక్షాత్కారాను భవము గలవాడై యుండునని.)

అయ్యో. గురువుగారు భగవద్ సాక్షాత్కారము కాలేదని మూర్ఛిల్లిరే.

ఓహో. ఇదియే కాబోలు సమాధ్యవస్థ. ఆహాహ. ఏమీ, వీరి తన్మయావస్థ. భగవంతునితో ఏదియో మాట్లాడుచున్నారని తోచుచున్నది.

భగవంతుడు:_ ఏమండీ, నమ్మాళ్వారూ. మీరే యిలాగతలచుకొని తలచుకొని, నాసాక్షా త్కారము కలుగలేదని భాదపడుచున్నారే. ఇదేమి న్యాయము.

మిమ్ములను పొందాలని తలచేవారము మేముకదా. మీరు రాకపోతే దానిని కొఱతగా తలంచి దానికై పరితపించు వారలము మేముకదా.

మీకిప్పుడు వచ్చిన లోటేముందండి? మేముచేయవలశిన పనిని మీరు చేయుచున్నారు. నేము పడవలశిన బాధ మీరు పడుచున్నారు.

౩. తిరువందాది ౬౧.

అవనే యరువరైయాల్ ఆనిరైకళ్ కాత్తాన్ ।
అవనే యణిమరుతం శాయ్త్తాన్ - అవనే।
కలంగా పేరునకరం కాట్టువాన్ కండీర్ ।
ఇలంగాపురం ఎరిత్తాన్ ఎయ్తు॥

ఆసర్వేశ్వరుడే (గోవర్ధనోద్ధరణాది) అతిమానుషచేష్టలచే గోసమూహముల రక్షించుచుండె ఆసర్వే శ్వరుడే మద్దివృక్షముల ద్వంద్వమును పడగొట్టెను. ఆసర్వేశ్వరుడే కలతజెందని విశాలమైన పరమ పదమ్మును జూపువాడె సుమండీ లంకాపట్టణమ్మును భాదించి దహింపజేసెను సుమండీ. అని మీ ఆళ్వారులే సాధించినారు కదా.

అట్టి వైకుంఠమును కూడ విడిచిపెట్టి తిరుక్కణ్ణపురమున మేము వచ్చి మీకు దగ్గఱగా యున్నది మీ నిమిత్తమయ్యే కదా.

నమ్మాళ్వార్లు మూర్ఛావస్థలోనే పలవరించుచుండుట

శరణమాకుం తనతాళ్ అడైందార్క్కెల్లాం ।
మరణమానాల్ వైకుందం కొడుక్కుంపిరాన్ ।
అరణమైంద మదిళ్ శూళ్ తిరుక్కణ్ణపురత్తు ।
తరణియాళన్ తనదు అంబర్క్కు అంబాకుమే॥

సర్వేశ్వరుడు తనపాదముల నాశ్రయించిన వారికందరికి రక్షకుడగును.
మృతిపొందిన వారికి వైకుంఠమునిచ్చు ఉపకారకుడు.
రక్షణార్థమై నిర్మించబడిన ప్రాకారములచే చుట్టబడిన తిరుక్కణ్ణపురమున సంసారుల రక్షణార్థమై వేంచేసియున్న సర్వేశ్వరుడు తనభక్తులకు భక్తుడగును.

నమ్మాళ్వార్లు మేల్కాంచి! ఓమనసా. ఓమనసా. ఆహా ఏమి నాయదృష్టము. భగవంతుడు స్వయముగా సాక్షాత్కరించి నాడోయి. నాకభయమిచ్చినాడోయి. అంతేకాదు. సద్భావము కూడ సమాశ్రయణీయుడై తిరుక్కణ్ణపురమునందే వేంచేసినాడోయి. ఆశ్రయించవయ్యా। పదండి ఎవరైనా సరే. ఆశ్రయిస్తేచాలు. ఆయన శ్రీపాదములయందు భక్తినుంచండి.

మనసు:— అయ్యాంగరి. ఆహా ఏమి యదృష్టము. ఏమి యదృష్టము అయితే, స్వామి, మేమైతే అకించనులము భక్తి నిష్ఠులము కాగలమా. అందుకు వలయు పరికరములు మాకు లభించునా?

నమ్మాళ్వార్లు:— అయ్యో. అట్లనా భక్తి పరికరములు లేవూ అది మీకు దుర్లభమా. పోనీ

ప్రపత్తినిష్ఠులు అవ్వండి.

మధురకవి:- స్వామి ప్రపత్తినిష్ఠ మాత్రము అంత సులభమా. విశ్వాస-సాయస-భూయస్త్వ స్వాసన-భజనయో ర్గౌరవే కో విశేషః (న్యాసతిలకం)

దానికెంతో అధ్యవసాయ ముండవలెనండి.

నమ్మాళ్వారు:- ఓహో ప్రపత్తినిష్ఠకూడా అంత కష్టమండీ! పోనిండి, కేవలం తిరుక్కణ్ణపురాధీశుని అనుసంధించండి చాలును. దానినే ఆయన అధికముగా తలంచును. మనలను ఆయన విడిచిపెట్టడు. తప్పక రక్షించితీరును. చాలు అంతమాత్రమే చాలును. తప్పక అందరూ ఆయనను ఆశ్రయించండి.

మధురకవి:- తప్పక ఆయన రక్షించెద నన్నాడండి.

నమ్మాళ్వారు:- ఆహా ఆయనే స్వయముగా చెప్పినయ్యా! ముమ్ముక్షువులకు ఆదిరాజ మేనయ్యా ఇంకా సందేహమే.

మధురకవి:- అయితే వ్యాసమహర్షి బ్రహ్మసూత్రములలో ౪. ౧. ౧౯.

"భోగేన త్వితరే క్షపయిత్వా అథ సంపద్యతే"

(ఇతరే=సంచిత- ఆగములకంటె యితరములైన పుణ్య పాప రూప ప్రారబ్ధకర్మలను;

భోగేన= అనుభవముచే

క్షపయిత్వా= నశింపజేసి

అథ= తత్ఫలభోగ సమాప్త్యనంతరమున,

సంపద్యతే= బ్రహ్మసాయుజ్యమును పొందు చున్నాడు.

తు= పక్షవ్యావృత్తి

అని ప్రారబ్ధకర్మయొక్క పరిపూర్ణానుభవానంతరమేకదా పరబ్రహ్మసాన్నిధ్యము. ఈ దేహావసానంతరమే తప్పక సాన్నిధ్యమిస్తామనుట అందుకు వ్యతిరేకముగా కనుపించుచున్నదే.

నమ్మాళ్వారు:- ఇదా నీ సందేహము. —

వ్యాసమహర్షి వాక్యము ప్రమాణమే. ఇప్పటి ఈ భగవంతుని అభయప్రదానము సత్యమే. భక్తినిష్ఠులు అవ్వండి దానికి శక్తిమంతులు గాకపోతే ప్రపత్తినిష్ఠులు అవ్వండి అనిగదా చెప్పితిని.

భక్తినిష్ఠులను ఉపాసకులందురు. వీరు భక్తిని ఉపాయముగా భావింతురు. వీరలకు గీతలో "జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్ కురుతే—

(జ్ఞానమను అగ్ని ప్రారబ్ధేతరకర్మల నన్నింటిని భస్మీభూతము గావించును.)

బ్రహ్మసూత్రము:- "తదధిగమ ఉత్తరపూర్వాఘయో రశ్లేషవినాశౌ॥

అనునటుల సంచితము జ్ఞానాగ్నిచే భస్మముకాగా ఆగామి నిష్కామ కర్మాచరణచే నంటకుండగ పోగా మిరిలిన పుణ్యాపాపరూప ప్రారబ్ధము అనుభవించుటచే మాత్రమే నశించును ఆప్రారబ్ధము ఏశరీరానుభవముతో పూర్తియగునో అట్టి చరమ శరీరానంతరమున మాత్రమే ఆఉపాసకునీకు మోక్షము సిద్ధించును.

ఇక ప్రపన్ననకో. అట్లుకాదు.

ఉపాయభక్తిః ప్రారబ్ధ-వ్యతిరిక్తాఘనాశినీ !
సాధ్యభక్తిస్తు సా హంత్రీ ప్రారబ్ధస్యాపి భూయసీ॥

(ఉపాయభక్తి ప్రారబ్ధమును నశింపచేయజాలదు. మిగత సంచిత ఆగామి రూప పుణ్యాపాపాత్మక కర్మను మాత్రమే నశింపజేయును.

మరి సాధ్యభక్తి ప్రపత్తి యన్నదే. అది ప్రారబ్ధకర్మ ఎంత పెద్దదైయున్నను సరిమే తక్షణమే పూర్తిగా నశింపజేయును.)

గాన ప్రపత్తినిష్ఠుడైన వెంటనే ప్రపన్ననకు ప్రారబ్ధము పూర్తిగా భస్మమై పోవును. గాన అట్టివాని దేహావసానమందే తప్పక మోక్షము లభించగలదు.

ఛాందోగ్యోపనిషత్తులో చెప్పబడలేదయ్యా- ఉంగ.

"తస్య తావదేవ చిరం యావన్నవిమోక్ష్యే".

(యావత్- ఎంతకాలమువరకు ; నవిమోక్ష్యే- ప్రారబ్ధకర్మనుండి విడువబడడో; తస్య - అట్టిఉపాసకునకు తావదేవ - ఆప్రారబ్ధకర్మనాశనమువరకు మాత్రమే; చిరం - ఆలస్యము. దేహనాశనానంతరము మోక్షము కలుగును.)

మధురకవి:- ఈప్రకారము కర్మావసానము నుద్దేశించి చెప్పినదలకే కొంతమంది పెద్దలు వారలటుల యభిప్రాయపడుట ఎటుల తటస్థించినదండి?

నమ్మాళ్వార్లు:- నాయనా ఏవాక్యమునకైన అర్థనిర్ణయము చేయవలసివచ్చినపుడు దాని పూర్వాపరపరిస్థితి సందర్భముల చక్కగా పర్యాలోచన జేయవలసియుండును. ఉపాసకుడు భక్తిని ఉపాయముగా అవలంబించును. గాన అట్టి సాధనభక్తి పక్వమైన గాని ఫలించదు. అది పక్వమగుటకు కొంత విలంబిన తప్పదు, అది ఫలించినగాని కర్మనశించదు. గాన ఉపాసకునికి ప్రారబ్ధకర్మ అనుభవించినగాని నశించదు.

ఏక ప్రపన్నన కన్నన్ మొట్టమొదటనే తన సర్వభారమును సర్వేశ్వరునిపైనిడి తానకించనుడై అగతికుడై నిర్భరుడై యుండును. అందుచే ఈతను చేయవలసినదేమియు మిగిలియుండదు.

శక్తి పర్యాప్తమవ్వవలసిన విషయ మేది? అందుచే పక్వమై ఫలించవలెను? అనుఆలస్యముండదు. మరియు ప్రపన్నుని భారము వహించిన సర్వేశ్వరుడు అనర్థిమంతుడు కానిచో విలంబమునకు హేతువుండి యుండును. అట్టివాడు కాడే.

అందుచే ప్రపన్నునకు ఈశరీరావసానమందే మోక్షము లభించుటలో మరి యేాటంకమే మున్నది, నాయనా!

మధురకవి:— స్వామీ ఇలాగున ఎవరైన ఇదివరలో ప్రపత్తిజేసిన దేహావసానమందే మోక్షమును పొందిరో?

నమ్మాళ్వార్లు:— అయ్యో! అట్టివారు ఒకరు ఇద్దరుటయ్యా! అనేకమంది.

గరుడపురాణమున శ్రీరంగమాహాత్మ్యమున

శ్లో॥ అథాత్రి మాధవీ సాపి తప స్తప్త్వా సుదుష్కరం ।
భగవంతం ప్రపన్నా సా భగవంత మవాపసా ॥

మాధవీదేవి అతిదుర్లభమైన తపమాచరించి భగవంతుని ప్రపత్తిజేసెను. పిమ్మట ఆ దేహావసానముననే తామె భగవంతుని సన్నిధినిచేరెను.

ముద్గలో పాఖ్యానమున చెప్పలేదుటయ్యా?

“భగవన్నామశ్రవణమున ప్రపత్తినిష్ఠులైన గకనివాసులు వెంటనే ముక్తులైరని”

మధురకవి:— ప్రభూ! ఈరహస్యమును సర్వేశ్వరుడు మాత్రమే యిప్పుడు వెల్లడించెనా? లేక ఇదివరలో ఎవరికైన నన్ను ఉపదేశించెనా?

నమ్మాళ్వార్లు:— ఇప్పుడుమాత్రమేకాదు నాయనా. ఇదివరలో అర్జునునకు గీతారూపమున కూడ ఈరహస్యమును వెల్లడించెను. భగవద్గీత. ౪. ౯.

జన్మ కర్మ చ మే దివ్యం ఏవం యో వేత్తి తత్త్వతః ।
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున ॥

అర్జునా! నాజన్మము కర్మనిబంధనమైనది కాదు. అనుగ్రహ నిబంధనమైనది. నేచేయు పనులు. నేననుభవించు విషయములు కర్మనిబంధనమైనవిగావు. కృపానిబంధమైనవి. ఈయదార్థమును ఎవడు సరిగా తెలుసుకొనగలడో అతడే దేహమును విడిచిన పిమ్మట మరల జన్మించడు. నాసాన్నిధ్యమునే పొందును. భగవద్గీత. ౧౮. ౬౬.

సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచ.॥

ధర్మములనన్నింటియందును ఉపాయబుద్ధిని పరిత్యజించి నన్నొకనినే రక్షకునిగా నాశ్రయింపుమా! నేను నిన్ను సమస్త పాపములనుండీయు = (ప్రారబ్ధకర్మనుండియు కూడ) విడిపింతును. దుఃఖించకుమా!

మధురకవి:—అయితే స్వామి! మాకొక్క సందేహం బాధించుచున్నది. దానిని దేవరవారు తీర్చాలి. ప్రపత్తి చేసిన వెంటనే భగవత్ప్రాప్తి కలుగవలెనుకదా! 'విరోధిని పోగొట్టి నీ శ్రీపాదములజేర్చుకొనుమా' అనికదా ప్రపన్నుడు కోరునది. వానికి దేహసంబంధము విరోధికదా. అయినను ప్రపత్తి చేసిన ప్రపన్నునకు కూడ దేహావసానమువరకు ఉండవలసియే కనుపించుచున్నదే. ఈ మధ్యకాలానుభవము కర్మశేషముచేతనే అనికదా అనవలెను. కర్మశేషముచేకాదు సర్వేశ్వరుని సంకల్పముచే అని అనినచో ప్రపత్తి జేసినా దుఃఖమనుభవింపజేయును. అని భగవంతునియందు నైర్ఘృణ్యరూపదోషారోపణచేసినట్లు యగును మరియు "ప్రపత్తి చేధన వెంటనే వాని విరోధిని పోగొట్టి వెంటనే మోక్షమునకు గొనిపోవుదున"ను ఆయనప్రతిజ్ఞకు భంగము కలుగును. గనుక రెండుల అనుటకూ వీలు లేదు.

ప్రపన్నునకుకూడ ఆదేహావసానము వరకు కర్మవశ్యులనువలెనే సుఖదుఃఖాద్యనుభవము తప్పుటలేదు. ప్రపన్నునకుకూడ ఈ దేహావసానమువరకు మాత్రమేనైనను కర్మవశ్యత్వం తప్పదనెదరా— ప్రారబ్ధకర్మానుసారమువరకుకూడ ఏదోవక దేహధారణముండును. దాని నాశనానంతరము మాత్రమే మోక్షము లభించును" అనినచో మాత్రం దోషమేమి?

నమ్మాళ్వారు:— ప్రపత్తిచేసినవెంటనే మోక్షమివ్వక ఆదేహావసానంవరకు ప్రపన్నునికి దేహసంబంధముంచడం నిజమే. కాని నీ వనుకొనునటుల ప్రపన్నునకు ఇది కర్మనిబంధనమైనదికాదు. భక్తునకుమాత్రమే దేహసంబంధము కర్మనిబంధనమైనది. మరి ప్రపన్నునకెందువల్ల దేహసంబంధమునంటుమా?

దానికి కారణములు వేరు:—

౧. ప్రపత్తిచేసినవెంటనే దేహసంబంధమునుకూడ లేకుండజేసినచో లోకములో కీని విషయమై భయము వ్యాపించి ప్రపత్తిజేయు మనిషే యిక యుండడు.

౨. భీష్మునికి కాలము తీరినను, మరికొంతకాలముంచుటచే ఆయనద్వారా అనేకధర్మములు లోకమునకు వెల్లడించబడి లోకోద్ధరణ జరిగెను. అటులనే ప్రపన్నునికికూడ వెంటనే దేహవియోగము చేయకుండగ నట్టునెట్టుటచే ఆయనద్వారా ఎన్నో రహస్యవిషయములు లోకమున కుపదేశింపబడగలవు. మరియు ఆయన యనుష్ఠానము ఎందరికో ఆదర్శప్రాయమై వారి నుద్ధరించగలదు.

౩, ఈశరీరము ద్వారానేకదా ఈశను ప్రపత్తిజేయ నగిగెను, ఈశనిని మనకిచ్చుటలో సహకరించిన

ఈశరీరమును వెంటనే పాడవనివ్వకూడదు." అని సర్వేశ్వరుడే కృతజ్ఞతాబుద్ధిచే ఈ దేహసంబంధమును తానే నశింపచేయజాలడు.

మధురకవి:- ఓహో. అలాగా. పోనివ్వండి దృప్తప్రపన్నుని విషయమై అటులనే కానివ్వండి మరిఆర్తప్రపన్నునికేల యుంచవలెను. ఈ దేహసంబంధము?

సమాధానము:- ఆర్తప్రపన్నుడు ప్రపత్తిచేయునప్పుడుకూడ "ఇప్పుడే విరోధినశించి నీతిరువడిఘళ్ళను పొందవలెను. అని త్వరపడుచుండునని చెప్పుటకవకాశము లేదు. అంతేకాదు. ఎంతో కాలము నుండి అలవాటు పడిన దగుటచే 'దానిని తక్షణమే విడువుమా' అనిఅన్నను వెంటనే సమ్మతించజాలడు.

వీడు కోరునదెల్ల మరొకశరీరపరిగ్రహము లేకుండజేయుమా? గర్భవాసదుఃఖము లేకుండజేయుమా అని మాత్రమేకదా. ఈతని కోరిక ననుసరించియే భగవంతుడుకూడ అనుగ్రహించును. వీనికీ శరీరమందు చాపల్యముండునా. ఈనాలుగురోజులు యిచ్చుటనే యుండనీ అని భగవంతుడూరకుండును.

మధురకవి:- అయితే ఆర్తప్రపన్నునికీ ఈనాలుగురోజులైనను యితరులవలె ఆధివ్యాధులులేకుండగను, అత్యధిక సౌఖ్యవంతుడుగాను యుండునటుల చేయవలదా? మామూలు సంసారులవలె ఏదైన నష్టము, కష్టము, సంభవించినపుడు శోకించుటకున్ను, ఏదైన లాభము కలిగినపుడు సంతోషించుటకున్ను వీలగునటులను ఏల వీని నుంచవలయును?

సమాధానము:- ఈప్రపన్నుడు కోరునది "ఈవిరోధిని పోగొట్టి నీసాన్నిధ్యము ననుగ్రహించుమా" అనిమాత్రమేకదా. ఈశరీరసంబంధము నీచమైనదని వీనికి తెలిసియున్నను వెంటనే విడువజాలని వీడు ఈశరీరసంబంధమును అత్యంతసుఖకరమైనదిగ యుంచినచో ఇదే బాగున్నది. ఇంకా కొంతకాలము ఈశరీరసంబంధముండనీ" అని అనుకొనును కదా.

2. వీనియొక్క యభిప్రాయానుసారమే యుంచినచో యింకను మరియొక శరీరమందు వీనికి కోరికకూడ కలుగవచ్చును. కనుకనే హితపరుడైన భగవంతుడు 'వీడున్నటులనే యుండనీ' అని ఊరకుండును.

దీనివలన అలవాటైన యీశరీరము తనంతట యదియే నశించి, మరియొక శరీరమందు వీనికి కోరికపుట్టకముందుగనే సర్వేశ్వరుడు వీనిని తన సాన్నిధ్యమునకు చేర్చుకొనుట కనుకూలముగ నుండును.

౧. అలవాటైన శరీరమూ, తనంతటతానే నశించిపోవును.

౨. ముందురాబోవుదని తెలియనిపోవుటచే దానియందు కోరికయూ యుండదు.

3. ఈశరీర భావానుభవముచే ఇది నీచమైనదను నిశ్చయముండుటచే, దీని యుదాహరణనే మరోకడానియందు కూడ భావించును,

ఇట్టి చిదచిదశలో సర్వేశ్వరుడు వీనిని దనసాన్నిధ్యమున చేర్చుకొనును,

మధురకవి:- సత్త్వగుణ ప్రభోదదశయందు ఈదేహసంబంధమును నశింపజేయుమా. అని అన్నను చరమ దశలో వీడు ఆటంకపరచినచో?

నమ్మాళ్వార్లు:- నిజమే గాని ఎప్పుడో ఒకప్పుడు దేహసంబంధమును నశింపజేయగోరెను. కదా. ఆయనకామాత్రమేచాలును. వీడు అంతిమదశలో కాష్ఠపాషాణ సన్నిభుడై ఆటంకపరచ జాలకయున్న సమయములో ఇదివరలో వీడు ప్రార్థించిన ప్రార్థననేనిమిత్తముగా గాని భగవంతుడు వీనిని రక్షించును.

మధురకవి:- శ్లో॥ యం యోగినః ప్రాణవియోగకాలే ।
యత్నేన చిత్తే వినివేశయంతి ।
స తం పురస్తాద్ధరి మీక్షమాణః ।
ప్రాణాన్ జహౌ ప్రాప్తఫలో హి భీష్మః॥

(ప్రాణవియోగకాలమునందు తమచిత్తమందు ధ్యానించు ఆ హరిని భీష్ముడు తనఎదుట సాక్షాత్తుగ దర్శించుకొనుచు ప్రాణముల విడిచి విష్ణుసాన్నిధ్యమును బొందెను.)

అని మోక్షసిద్ధికి అంతిమస్మృతి అవసరము కదా స్వామీ!

నమ్మాళ్వార్లు:- అవును. నిజమే.గాని కొద్దిపారపాటుకూడ పడితివి. ఫలసిద్ధికి అంతిమస్మృతి అవసరమే. కాని వీడే అంతిమస్మృతి కలిగియుండవలశినది యితరుల విషయమునగాని ప్రపన్నునకు గాదు. ప్రపన్నుడు ప్రపత్తిచేయునపుడే తన యావత్తు భారమును, తను చేయవలశిన కృత్యముల నన్నింటిని భగవంతుని మీదనే యుంచి యున్నాడు. గనుక అత నింకచేయవలశిన దేమియులేదు. అన్నిపనులను ఆభగవంతుడే జేసుకొనును.

ఈ అంతిమస్మరణను కూడ ఆయనే స్వయముగ జేసుకొని ఈప్రపన్నుని తన సన్నిధికి గొని పోవును. ఈసంగతిని ఆయనే ప్రతిజ్ఞారూపమున పలికియున్నాడు కదా.

వరాహపురాణమున:-

స్థితే మనసి సుస్వస్థే శరీరే సతి యో నరః ।
ధాతుసామ్యే స్థితే స్మర్తా విశ్వరూపం చ మామజం॥

తత స్తం మ్రియమాణం తం కాష్ఠపాషాణసన్నిభం ।

అహం స్మరామి మద్భక్తం నయామి పరమాం గతిం ॥

మనస్సు నిశ్చలమైనదే శరీరమారోగ్యవంతమైనదై ధాతువులు సామ్యస్థితి గలవై యుండగా ఏనరుడైతే విశ్వాత్మకుడు శాశ్వతుడునైన నన్ను ప్రపత్తిజేయునో, అట్టి మద్భక్తుని వాని అంతిమ దశలో చావుకుసిద్ధమై, కొయ్యవలెనో రాయివలెనో చేష్టలుడిగి జ్ఞానవిహీనుడై యుండగా, నేనే అంతిమస్మరణను చేసి నేనే స్వయముగా వానిని పరమపదమ్మునకు గొనిపోవుదును.)

అని భగవంతుడు ప్రతిజ్ఞ జేసియున్నాడు. గాన ప్రపన్నునకు అంతిమస్మృతి అవసరము లేదు గాన యిప్పుడే భగవంతుని గూర్చి ప్రపత్తిజేయుండి, తప్పక తరింతురు,

మధురకవి:- చిత్తము స్వామీ—

శ్రీమతే రామానుజాయనమః



# ఆచార్యవైభవము

శ్రీ. ఉ. వే. శ్రీమాన్ శ్రీమదద్దంకి తిరుమల సమయోద్దండ కోలాహల
లక్ష్మీనృసింహకుమార తిరువేంకట తాతదేశికాచార్యుల అయ్యవార్లంగారు, చీరాల.

శ్లో. గోభి ర్వ్యస్యా శ్రితాత్మాన్తర్గాఢ ముత్సార్య తే తమః ।
కృపామృతాత్మనే తస్మై స్వాచార్యాయ నమో నమః॥

"ఆచార్యవాన్ పురుషో వేద" అను శ్రుతి, ఆచార్య కటాక్షపాత్రుడైన చేతనుడే జ్ఞానముకలవా డగుచున్నాడు అని చెప్పుటచే "జ్ఞానం నరాణామధికం" అనిన పశుపక్ష్యాది వైజాత్యా పేదకమాత్ర జ్ఞానాధిక్యమునే గాక స్వసజాతీయ సంసారిచేతన విలక్షణార్థపంచకజ్ఞాన నిష్ఠు డగుటను వెల్లడించుచున్నది, ఇందుచే ఏతాదృశజ్ఞాన ప్రదత్వేన పరమోపకారకుడైన ఆచార్యుని ఈ చేతనుడు, 'దేవ మివా చార్య ముపాసీత' అని ఇష్ట దైవతమునువలె ఉపాసించవలెను. ఉపాస్యత్వ మాత్రసాధర్మ్య ముచే ఇచట ఆచార్య దైవతములకు సాదృశ్య ముపపాదించ బడినది ఆచార్యునియొక్క పరమోపకారకత్వ వైభవమును తెలిసికొనినచో నీ ఆచార్యునికి దైవముకూడ సదృశముకాజాల దని పూర్వాచార్యులును సాయించియున్నారు. కావున ఆచార్యుని దైవమునకన్న నెక్కుడుగ భావించి ధ్యానస్తుతి ప్రణతి పూజనాగు లనవరత ముపాసించి పరితృప్తు నొనరింపవల యును దీనివలన, ఆచార్యుడే పరదేవతయనియు, ఉపాయోపేయస్వరూపుడనియు, ఆచార్యకైంకర్యమే పరమపురుషార్థ మనియు, చక్కగ నధ్యవసించి యుజ్జీవించవలయునని అర్థముగ స్పష్టమగుచున్నది. ఆచార్యుడన భగవద్విభవ విశేషస్వరూపుడనియు, అరవ వ్యూహరూపుడనియు చెప్పబడియున్నది యీవిషయము - 'గురు రేవ పరం బ్రహ్మ గురు రేవ పరా గతిః గురు రేవ పరా విద్యా గురు రేవ పరం ధనం గురు రేవ పరః కామో గురు రేవ పరాయణం యస్మాత్ త దుపదేష్టా సౌ తస్మాద్ గురుతరో గురుః అర్చనీయశ్చ వంద్యశ్చ కీర్తనీయశ్చ సర్వదా ధ్యాయ జ్జపే న్నమే ద్భక్త్యా భజే దభ్యర్చయే త్సదా ఉపాయోపేయభావేన తమేవ శరణం వ్రజేత్' అని స్పష్టముగ నుడువబడియున్నది. 'మంత్రే తద్దేవతాయాం చ తథా మంత్ర ప్రదే గురౌ త్రిషు భక్తి స్సదా కార్యా సా హి ప్రథమసాధనమ్' అనుటచేతను శ్రుతిస్మృతి పాంచరాత్రాగ మంబులచే ప్రతిపాదితములగుటచే పరమవైదికములగు 'తాపః పుండ్ర స్తథా నామ మంత్రో యాగశ్చ పంచమః' అనియెడు పంచ సంస్కారములను ప్రసాదించిన ఆచార్యుని యందు భక్తి శ్రాద్ధ న్యము నిర్దేశించబడినది. ఇట్టి ఆచార్యునియందు మనుష్య భావమును చేసిన వారికి, భగవదర్చారూపములయందు లోహబుద్ధిని చేసినవారి కెట్టి దుర్గతియో అదియే వీరికి సంప్రాప్తమగు నని

"విష్ణో రర్చావతారేషు లోహభావం కరోతి యః ।
యో గురౌ మానుషం భావ ముభౌ నరకపాతినౌ"॥

అను బ్రహ్మాండ పురాణవచనముచే వ్యక్తమగుచున్నది.

"పాపిష్ఠః క్షత్రబన్ధుశ్చ పుణ్డరీకశ్చ పుణ్యకృత్ ।
ఆచార్యవృత్తయా ముక్తౌ తస్మా దాచార్యవా న్భవేత్"॥

అనుటచే, పాపులకును, పుణ్యకృత్తులకును, ఆచార్యాశ్రయణము విధియని నిరూపితమయినది. కావున తానెంత జ్ఞానాధికుడైనను వర్ణాశ్రయాచారాది నిష్ఠుడైనను భక్తుడైనను ఆచార్యాశ్రయణములేనిది భగవత్కటాక్షము గలుగదు అను విషయము 'నారాయణోఽపి వికృతిం యాతి గురోః ప్రచ్యుతస్య దుర్బుద్ధేః । కమలంజలా దపేతిం శోషయతి రవిర్న తోషయతి' అని చెప్ప బడియున్నది. దీనినే శ్రీమణవాళమామునులును. తన్ కురువిన్ తాళిణైకళ్ తన్నిల్ అన్బొన్ఱిల్లాదార్ యిరాన్ అడలాల్ నణ్ణార్ అవర్కళ్ తిరునాడు" ఆచార్యవిముఖునకు పరమపదము నిచ్చుట కీశ్వరుడిచ్ఛగింపడని సాయించి యున్నారు గాన పంచసంస్కారప్రదుడగు నాచార్యు నాశ్రయించి భగవత కైంకర్య నిష్ఠులై ఉజ్జీవించుటయే సమస్తచేతనులకు స్వరూపానురూప ధర్మ మని పరమవైదిక, వమ్మత, సిద్ధాంత తత్త్వార్థము.

తే. గీ. సకలవేదసారవిత్త్వత్త్వమై కనుగను గురువర వైభవ
స్ఫూర్తివి వృతి యగునె, మాదృశమ దోక్తియైన
నాయెంబరమ భాగవత నిదేశ భవ్య యుక్తిః॥

★ గతసంచిక తరువాయి

దినహితచర్య

## కామము

కామముఅనగా కోరిక. దానినే వాంఛయని కూడ అందురు. మన ఈజన్మకు కారణము కామమే. తెల్లవారినది మొదలు పరుండు వరకు మనము అనుభవించు అన్ని బాధలకు ముఖ్య కారణము కామమే. కామము లేనివాడు భగవత్సమానుడు. కామమను మహాదుర్వారశక్తియే మానవుని ద్విపాదపశువుగా చేయుచున్నది. కామమునకు లోబడితిమా యుక్తాయుక్త పరిజ్ఞానము దేహారోగ్యము, కీర్తి, సౌఖ్యము, ధనము నశించును. పరుల హేళనకును, పలువ్యాధులకును పాల్పడి అకాలమృత్యువునోట పడవలసివచ్చును.

ఆత్మసుఖమును అనుభవించు మనుజులు విషయ సుఖములనుకోరరు. విషయములు: ఇంద్రియములచే ననుభవించబడు ప్రకృతిపదార్థములు. విషయములు విషమువంటివి. విషయ సుఖములనెడి వేశ్యను వెంబడించినచో సంసారమను ఘోరారణ్యము మధ్యమందు విడిచిపెట్టి పరుగును. కామమును ఆలోచనచే మాత్రమే జయించవచ్చును. కాన కామోద్రేకము కలిగినప్పుడు, అందువలన కలుగబోవు ఫలితముల గురించి బాగుగా ఆలోచించుము. మానవశరీరము అతి హేయము. ఎముకలు, మాంసము, క్రొవ్వు రక్తము, చీము, మలము, మూత్రము మొదలగు వానిలో నిండిన అశాశ్వతపు తోలుబొమ్మయని సదా జ్ఞాపకముంచుకొనుము. మోహము భయంకరమగు అగ్నిజ్వాలవంటిది.

పటమునందైనను స్త్రీల సౌందర్యమును పరిశీలించకుము. శృంగార గ్రంథముల జదువకుము. నీయొక్క అక్కచెల్లెండ్రును, తల్లియు, స్త్రీలను అవమాన పరచకుండవలెనన్నచో నీవు ఏస్త్రీవిషయమై పాపపు తలంపుల మనస్సున జొర నీయకుము. స్త్రీలను, తల్లులు, అక్కచెల్లెండ్రి వలెను, పురుషులను తండ్రులు అన్నతమ్ములు వలెను భావించుము. రహస్యస్థలములయందు గాని, ఒంటరితనమునగాని, పరస్త్రీలతోగాని, పరపురుషులతోగాని సంభాషించకుండుము. కామోద్దీపనకరములగు నాటకములు, సినిమాలు ...

న్నగునవి చూచుట మానుకొనవలెను. మనస్సును, శరీరమునుకూడ సదా ఆరోగ్యకరములగు వ్యాపారములలో పెట్టవలెను.

చెడుతలంపులు కలిగినపుడుగాని, కామోద్రేకము కలిగినపుడుగాని, దుస్స్వప్నములు కలిగినపుడుగాని రోగి గాకుండయున్నచో వెంటనే చన్నీళ్ళలో స్నానమాచరించవలెను. నేను అహంకార మమకార రహితుడనుగాను, జితేంద్రియుడనుగానుఉండునటుల అనుగ్రహించుమా' యని ప్రతిదినము అవకాశమున్నన్ని పర్యాయములు భగవంతుని ప్రార్థించుచుండుము. 12 సంవత్సరములు మనోవాక్కాయ కర్మలచే బ్రహ్మచర్యవ్రతమును నిష్ఠగా జరిపినవానికి బ్రహ్మతేజస్సు కలుగును. దాని ద్వారా వాడు సాధించజాలని కార్యమొక్కటియు ఈలోకమున లేదు.

ఓర్పుకలవాడే బలము గలవాడు.

మనయందలి క్రోధమే మనప్రబలశత్రువు. క్రోధమే మనలను యితరులకు స్వాధీనపరచును. యితరులచేత మనకవమానము కలుగజేయును. దీని వలన మనస్సు కలతచెందును. ఇది మంచి, చెడ్డలను ఆలోచించుజ్ఞానము నశించును. దేహమందు రక్తము వేడెక్కి విషరూపముగా మారి అనేకరోగములు త్పన్నమగుటకు కారణమగును చిత్తచాంచల్యము, పిచ్చి,మూర్ఛ, రక్తవమనము ఒకొక్కప్పుడు చివరకు మరణముగూడ సంభవించును. క్రోధమువలననే ఆత్మశక్తి నశించును. సౌఖ్యముశూన్యమగును. క్రోధమువలననే మోహము, దాని వలన సర్వనాశనము కలుగును. క్రోధముకంటె పాపము వేరేలేదు క్రోధము కలవాడు మహాపాపి. నీవు కోపమను శత్రువున కధీనుడవు గాకుండుటకై తలచుట అభ్యసించుము.

1. ఏదోషము, లేనివాడే కోపింపబడ తగని వాడు నాయందనేక దోషములు కలవు గావున నేను కోపింపబడ తగదుఅని శాంతించుము.

2. మనలను కోపించువారు మనదోషములను వెల్లడించుచున్నారు. వానిని మనము దిద్దుకొనవకాశము కలుగజేయుచున్నారు. గాన వారు మనకు ఉపకారకులు, పూజ్యులు.

3. మనలనుకోపించువారు మనమంచికొరకై వారి అమూల్య మనశ్శాంతికిని, ఆత్మశక్తిని కోల్పోవుచున్నారు. గాన వారి విషయమై మనము సానుభూతిని కలిగి కృతజ్ఞత చూపవలెను. కాని మనముకూడ అట్టి ఆత్మవినాశకరమైన కోపమునకు స్వాధీనమై యితరుల సానుభూతికి గురికాకూడదు.

4. అన్నిటికంటె అధికక్లేశమును, నష్టమును కలుగజేయు కోపముపై ఏల కోపమురాకూడదు అని నీ మనస్సున ప్రశ్నించుకొనుము.

5. ఎప్పుడైన నీకు కోపమువచ్చిన 1, 2, 3 అని 30 వరకు లెక్కించి అటుతరువాత జవాబు చెప్పుము.

6. మనము పూర్తిగా నిర్దోషులమై యున్నప్పుడు ఎవరైన నీపై నిష్కారణముగ కోపించినచో తిర్గి వారిపై కోపించకుము. కోపించినచో మన మశక్తులము పనికిమాలిన వారలము అని వారనుకొనిన అనుకోని మనముగూడ కోపించి

మరకా మనము వారికి లొంగిపోయిన వారమగు దుము. దోషులమే యగుదుము. క్రోధము క్రోధముచే ఎన్నటికినీ జయించబడదు. క్రోధము శాంతముచే మాత్రమే జయించబడును. కనుక సంపూర్ణ వినయవిధేయతలతో నీనిర్దోషత్వము శాంతముగ తెలియపరచుము అప్పటికీ ఎదుటి వాడు సరియైనమార్గమునకు రానిచో మౌనము ధరించుము. వాని క్రోధమునకు ప్రతిఫలము లేకపోవుటచే వానిశక్తి వ్యర్థమై గాలిలో కలసి పోవును.

నీకెంత అయిష్టుడైనను సరే, ఎంతటి అప కారియైనను సరే న్యాయమగు నీ సహాయము కోరి నీవద్దకు వచ్చినప్పుడు నీకవకాశ మున్నంత వరకు వారికి సహాయము చేసిపంపుము. లేకున్న మంచిమాటలు చెప్పి పంపుము. గానివిపరీతస్థితుల యందు గూడ పరుషములాడుటగాని దూషించు టగాని కూడదు.

12 సంవత్సరములు మనోవాక్కాయ కర్మలచే కోపమును లొంగకుండయుండిన నీకు ఎం తటి క్రూరమృగమైనను లొంగియుండును. వాటి క్రూరత్వము నీపై ప్రేమగ మారును.

## లో భ ము .

పూర్వజన్మమందు మనప్రవర్తన ననుసరించి భగవంతుడు ఈజన్మమందు కొంతజ్ఞానమును, ధనమున్ను, శక్తిని మనకిచ్చి మనను వాటి విని యోగమునకు ధర్మకర్తలుగ జేసెను. యుక్తా యుక్తముల నాలోచించి మన స్వాధీనములో యున్న జ్ఞానమును, ధనమును, శక్తిని మనము ఖర్చు చేయుచుండవలెను. అవసర, అవకాశ సమయములందు కూడ అట్లు ఖర్చుచేయకుండగ వ్యర్థముగ దాచియుంచుట లోభమనబడును. లోభము వహించుట యనగా భగవదాజ్ఞను ఉల్లంఘించుట అగును. అందుచే లోభము మహాపాపము. లోభమునకు ఫలితము అజ్ఞాని యగుట, దరిద్రుడగుట, శక్తివిహీనుడగుట యున్నూ:

లోభి తాను తినలేడు. ఇతరులకు పెట్టలేడు. కాన లోభియొక్క జ్ఞాన ధనశక్తులచేత ఎవ్వరికి ఏవిధమైన సౌఖ్యమూ లేదు. సుఖము కలిగింప జాలనివి లేకున్న లోపమేమి? అవి ఉన్నచో వాటిని జాగ్రత్త పెట్టుటయందు బాధమాత్రము అధికమగును. లోభిని ఎవ్వడూ మనసార ప్రేమిం చడు. ఈదేహము క్షణభంగురము. ఎప్పుడో ఒకప్పుడునశించకతప్పదు. దేహావసానకాలమందు ఎంతవచ్చినను ఎంతబాధపడినను ఒకచిల్లిగవ్వైన నను వెంట తీసుకొని పోవుటకు వలనుపడదుగదా! ఇతరుల మెప్పునకై ఇతరుల సౌఖ్యమునకై మన మేలువీటిని నిలువచేయుటలో బాధపడవలెను. కాన ఈలోభము మనవ్యాధికి దానము-ధర్మము అను ఔషదములను ప్రయోగించవలయును. తగిన వారికి మనశక్తికి తగినటుల చదువుచెప్పుట చెప్పించుట, సలహాలనిచ్చుట, అన్నవస్త్రము, ఉదకము ద్రవ్యము మొదలైన విచ్చుచుండుట, ఉపకారములు చేయుచుండుట చేయుచుండ వలెను.

[ సశేషము.






శ్రీమతే రామానుజాయనమః

# మనసాధనము

శ్రీమతి గొట్టుముక్కల లక్ష్మీరంగనాయకమ్మగారు. తంగడుపల్లి.

నిర్గుణమైన భగవత్ స్వరూపమును వ్యష్టీకృతమై స్థావరజంగమాత్మకమై, దృశ్యమగునదియే సృష్టియనబరగు, ఈసృష్టికి జన్మభంగక్షేమములయే విశేషతత్వము వలన జరుగుచున్నవో; దానినే. పరమాత్మయందురు. అట్టిపరమాత్మతత్వమందే సకలజీవ సముదాయములు యెల్లకాలమున్నను పాంచభౌతికమైన ప్రకృతియందున్నంతకాలము దుఃఖభ్రాంతిని; దానినుండి విడువడగనే సుఖానుభూతిని పొందుచున్నారు, అట్లు విడువడుటయే మోక్షము. ఇట్టి మోక్షస్వరూప నిర్ణయమునందు త్రిమతాచార్యులకు ఎట్టిభేదాభిప్రాయమునున్ననూ మోక్షసాధనకు జ్ఞానమే మూలసాధనమను విషయముపట్ల వారికి భేదాభిప్రాయములేదు— అట్టి జ్ఞానస్వరూపమును ప్రామాణ్యగ్రంథమైన శ్రీభగవత్ గీతయందు సంక్షిప్తముగ చెప్పియున్నారు. క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగమున 8వ శ్లోకము మొదలు 12వ శ్లోకము వరకూ)

శ్లో॥ అమానిత్వం మదమ్భిత్వ మహింసాక్షాన్తి
రాజ్జీనమ్. ఆచార్యోపాసనం శౌనస్థైర్యమా
త్మవినిగ్రహః

శ్రీమానిత్వమును పదమున కర్థము, పరుల మన్ననల కపేక్షింపకుండుట, ఇట్లపేక్షింపని వారికి శ్రీశుకులు. తార్కాణము. ఆనాడు పరీక్షిన్ మహారాజుకు మోక్షవిద్య నుపదేశింప నరుగు కాలమున శుకుని బాలురును యజ్ఞానులగు పామరులును, పిచ్చివానిగాను, భావించి హేళనములను జేయ మొదలిడిరి. వానికి. శుకుడావంతయు వైక్లబ్యము జూపింపక, పరీక్షితుడున్న పండిత గోష్ఠి కేగెను. అచట శుకునికంటె వయస్సుగల వశిష్టాది మహర్షులు యేవన్మందియులేచి నిలచి శుకునకు ప్రత్యుత్థానాది సత్కారములాచరించి.

సత్కార్యములనుగూడ నుచితనియంత్రణాంతయు మార్పు కలుగలేదు.—అదంభిత్వ మన (దంభ) ప్రదర్శనములేని భగవదధ్యవసాయమని అర్థము. దీనికి తార్కాణము జడభరతుని జీవితము అంత రంగమున దృఢతర భగవదను సంధానమున్నను. పైకి జడుని విధముననూ, మూఢుని విధముననూ కాన్పించును. లేశమాత్రదంభమైన లేకుండెను.

అహింస యనగా: తనవలన పరశరీరధారికి లేశమాత్రపు హింసనయిననూ కలిగింప కుం డుట, క్షాంతియన (ఓరిమి) పరులవలన తనకు యంత పీడ కలిగినను వారిని సహించి క్షమిం చుట అర్జవమన ఋజుభావప్రదర్శనము. అంత రంగముగల భావములనే బాహ్యమునకు ప్రద ర్శించుటయే ఋజుప్రవర్తనము యీపైమూడు లక్షణములను స్వాతిత సంపన్నులైన పూర్వపు రుషుల ప్రవర్తనయే తార్కాణము, ఆచార్యోపాసన మనగా, ఆధ్యాత్మజ్ఞాన ప్రదానముజేయు గురు వును భగవత్సమానునిగా నుపాశించుట. దీనిని దృష్టాంతర పురుషులు, మన పూర్వాచార్యులు, శౌచమనగా పరిశుభ్రత, ఇది అంతఃశౌచము, బాహ్యశౌచము. అని రెండువిధములు, ఈర్య మన చలనములేని స్థిరస్వభావము కలిగియుం డుట. అనగా పరమాత్మసాధనపట్ల విసుగులేని ప్రయత్నము, ఆత్మనిగ్రహమనగా తానింద్రియ వశుడుగా కుండుటయు, తన మనస్సును ఇంద్రి యవిషయములు కందకుండ నుంచుటయున్న. ఈపై రెండులక్షణములకును మన పూర్వులయిన భాగవతులే తార్కాణము.

శ్లో॥ ఇంద్రియార్థేషు వైరాగ్య.........యద తోన్యథా అని,-ఇంద్రియవిషయములన, కర్మేం ద్రియ జ్ఞానేంద్రియములుచేయు లౌకికవుపనులు, వానిపట్ల వైరాగ్యమని ఆపనులయందనురక్తిలే కుండుట, అహంకారమనగా సర్వకర్మలకూ కర్తృత్వసిద్ధి తనదిగా భావించుట అట్లు భావిం పక, కర్తృత్వము తనకు లేదనుకొనుటయే పు ట్టుక చావు, ముసలితనము, రోగము, వీనియం దలి దుఃఖమును చూడగల శక్తియు భార్యా పుత్రాగారములయందు ఆసక్తిలేమియు, వాని సాంగత్యము పట్ల నుపేక్ష కలిగియుండుటయు, ఇష్టానిష్టములపట్ల మోదఖేదముల నొందకుం డుటయు, పరమాత్మ విషయమున యేకేశ్వరో పాసన కలిగియుండుటయు ఏకాకిగానుండి భగ వదను సంధానము చేయుచుండుటయు. జనసా మాన్యము యొక్క సంఘములయందు అను రక్తివీడుటయు నిరంతరము నిత్యానిత్యవివేకము కల్గి ధ్యయానుసంధానము చేయుచుంటయు జ్ఞా నము యొక్క ప్రధాన లక్షణములయు వీనికి ఈమణాగ్ర భేదమున్నను, నది జ్ఞానముకాదనియు, చెప్పబడినది, గానసను భీతిలేకుండుటకై మన పూర్వాచార్యులు, ధ్యానానుసంధాన మను క్ష ణము చేయుచుండుటవలన దృఢతరజ్ఞానము లభింపగలదని నిర్దేశించిరి, అట్టి నిరంతర ధ్యా యాను సంధానమువలన తరింతుము గాత, యని ప్రార్థన చేయుచు యింతటితో విరమించు చున్నాను,



# "యజ్ఞమూర్తి"

అను

అరుళాళ పెరుమాళెంబెరుమానార్

---

శ్రీమతి మరింగంటి రంగనాయకమ్మగారు.

---

...నాడు యజ్ఞమూర్తియను పేరుగల ఒక ...మైన విద్వాంసుడు గంగా స్నానముచేసి ...నున్న విద్వాంసులనెల్ల జయించి యచ్చ ...మాయావాది సన్యాసాశ్రమమును స్వీక... ఆతడు శిష్యబృందముచేతను విద్యచే ...క్కలి గర్వించి యుండెను. ఇట్లుండగ ఒక ...కను ఉభయవరుల వైభవమును విని వారి ...వచ్చి వారితో తర్కింపవలెనను సంక...గల వాడాయెను. అమరునాడే తాను ...లిగినంత బరువుగల శాస్త్ర గ్రంథము కట్టలు కట్టుకొని వచ్చి తన విద్యాగర్వ ...తెల్లమగునట్లు భాష్యకారులతో ని... చెను.

...మానుజా! నీవు నాతో వాదించవలెను. నేనోడినచో నేను మీపాదరక్షలు మో... మీపేరుపెట్టుకొని మీసిద్ధాంత మందే ...తును. మీరోడిన నేమిచేయుదురు? ...ందులకు శ్రీభాష్యకారులు

...ప్పుడు కే మున్నది? నేనే ఓడితినేని గ్రంథ ...ము గావించి నాటినుండి ఒప్పుకొందును;

ఇట్లన్యోన్య ప్రమాణములు గావించుకొని పదునెనిమిది దినములు గడువుపెట్టుకొని మత్తగ జంబులరీతి నొకరితో నొకరు తర్కింపమొదలి...రి. ఇట్లు పదునారు దినములు గడచెను. పదియేడవ దినమున యజ్ఞమూర్తి యొక్క యుక్తి ప్రబలమాయెను. ఉభయవరులకుపై యుక్తితో ...చక విచారగ్రస్తులై మఠమునకు వేంచేసి తమ తిరువారాధనరూపమగు పేరరుళాళపెరుమాళ్లకు ఆరాధన సమర్పించి వారిపై కోపించిన వారై ఇట్లు పల్కదొడంగిరి.

...రుమాళ! ఆళ్వారు మొదలు ఆళవందారు పర్యంత మింతకాలము దేవర వారి యొక్క స్వరూప రూపగుణ విభూతులు సత్యమనెడు ప్రమాణప్రసిద్ధముగ ప్రవర్తింపజేయబడుచున్న ఈదర్శనమును నేడు నాకాలమున నొకమాయావాదిచే ప్రతిఘటింప జేయబడుట లీలా పంకల్పము నీకు జనించెనా? అట్లైనచో కానిమ్మని విన్నవించి నిరాహారదీక్షతో శయనించియుండ, వారిక పెరుమాళ్ళు స్వప్నమున సేవసాయించి రామానుజా! మీరట్లు నాపై కోపింపనేల? మీ...

నొక సమర్థుడగు శిష్యునియిచ్చియుంటిని. మీకు పరమాచార్యులగు ఆళ్వందారు సాయించిన మాయావాదఖణ్ణనముచే వానినిజయించి స్వాధీన పరచుకొనుడు. అనిసాయించిరి.

అంత రామానుజులు మహాశ్చర్యభరితులై తెల్లవారగనే లేచి ఆస్వప్నమునే స్మరించుకొనుచు మిక్కిలి సంతోషముతో తర్కగోష్ఠికి వేంచేసిరి. ఆనాడువారి గాంభీర్యమును జూచి భావజ్ఞుడగుటచే యజ్ఞమూర్తి యుదియతిమానుష చేష్టితమనిభావించి వారికి సమస్కరించి 'మీకు ఓడితిని మీపాదరక్షను శిరసాధరింతు' ననినుడివిరి అంత ఉభయవారులు వాదించక గెలుచుట ఎట్లని [illegible] దీపధారగ కొన్ని యుక్తులను వినిపించి [illegible] గావింపబడి యాతని శిష్యునిగా [illegible]గ్రహించి అరుళాళప్పెరుమాళ్ ఎంబెరుమానారులని తిరునామము నుంచిరి.

ఆయుక్తులేవియనిన:—

మీరు బ్రహ్మకు గుణములు లేవన్నచో ఆ బ్రహ్మకు సత్యత్వాదిగుణములు కలవని చెప్పెడు వేదవాక్యముల ప్రమాణములు కావలసివచ్చును.

బ్రహ్మపాస్తమునకు నిర్గుణుడే. అయినను అవిద్యా తిరోహితుడగుటచే గుణములున్నట్లు భాసించుచున్నది. కావున అట్టి ఔపాధిక గుణములు బ్రహ్మకు కలవని బోధించుటచే సగుణ శ్రుతులు ప్రమాణములే యగుచున్నవందురా? అట్లనవగదు. అవిద్యయనగా అజ్ఞానము. ఇది జ్ఞానముచే బంధింపబడి నశించును. బ్రహ్మజ్ఞాన స్వరూపుడు. అట్టిజ్ఞానస్వరూపుని యీయవిద్య యెట్లు ఆక్రమించును.? అట్లు ఆక్రమించుటయే యంగీకరింపబడెనేని ఇకయీఅజ్ఞానమును నశింపజేయునదేది? కావున నది నిత్యమేకావలసియుండును. ఇట్లు నిత్యమైనచో అవిద్యయు, బ్రహ్మయు రెండును నిత్యవస్తువులు కావలసివచ్చును. దీనిచే నద్వైతమునకు భంగమువాటిల్లును.''ఇత్యాదులు

అంత నా యజ్ఞమూర్తి ఆ తిరునామమును ధరించి ఉడయవరుల ప్రసాదించిన ఒక పెద్ద మఠమున నుండి విశిష్టాద్వైతసిద్ధాంత రహస్యములను శిష్యుల కుపదేశించుచు సుఖముగ కాలక్షేపమును గావించుచుండ నొకనాడు యిరువురు శ్రీవైష్ణవులు శ్రీరంగమునకు వచ్చి వీధిలో కొందరిని యెంబెరుమానారుల మఠ మెచ్చట యని ప్రశ్నించగా 'వారే యెంబెరుమానారు' లని యడిగిరి. అది విని వారు యీాదర్శనమున కిద్దరు ఎంబెరుమానారులున్నారా ?యని ప్రశ్నించిరి. అంతటవారు ఔను! అరుళాళపెరుమాళ్ ఎంబెరుమానారులున్నారని చెప్పగా ఆవైష్ణవులు వారిని మేమెరుంగము మేమే శ్రీభాష్యకారును గూర్చియే అడిగితిమనిరి. అంతవారికా గ్రామస్థులు ఉడయవరుల మఠమును జూపిరి. ఈ సమాచారము క్రమముగ అరుళాళప్పెరుమాళకు తెలిసి అత్యంత వ్యాకులచిత్తులై ఉడయవరుల సన్నిధికి జరిగిన సమాచారమంతయు సవిస్తరముగ తెల్పి దాసుడు దేవరకు ఎదురై అనర్థపడుట తగునా ? దాసుని నీడవలె మీతిరువడి క్రింద చేర్చుకొని నిత్యకైంకర్యానుభవమును కలుగచేయవలెను అని ప్రార్థింప నాట

నుండియు ఉభయనరులు వారికి ఉజ్జీవనాధారమగు సమస్తార్థములను ప్రసాదించిరి.

ఇందలి సారమేమనగా:– 'శరణాగతి తద్ధ తన్నిత్తైవన్ తాళ్ అరణాగు' మున్ను, శరణాగతిని తెలిపిన ఆచార్యుల తిరువడిగళ్లే తనకురక్షకమగు కోట యనయు,

'తేనాల్ కమలత్తిరుమామగళ్ కొళునయి నన్ తానే గురువాకి' మకరంద పూర్ణమగు పద్మపుత్రిక భర్తయగు సర్వేశ్వరుడే ఆచార్యుడై యవతరించెననియు మొదలగు ప్రమాణములను బట్టి సచ్ఛిష్యునకు సదాచార్యులే పరదైవమనియు సర్వజ్ఞులైన అరుళాళపెరుమాళ్ సాయించిరని మన జీయరు సాయించిరిగాన మనము అట్టి అధ్యవసాయము కరవారమై ఆచార్యుల నాశ్రయించి ఉజ్జీవించవలెను.



# తస్మిన రామానుజార్యే గురురితిపదం నాన్యత్ర

---

శ్రీమతి గొట్టుముక్కల వెంకట లక్ష్మీరంగనాయకమ్మగారు, (తంగుటుపల్లి)

గురు వనగా సంసారాంధకారము నుండి విడిపించి రక్షించువాడు అని అర్థము. అనగా పునర్జన్మరహితమగు పరమపదమును యిచ్చువారే పరిపూర్ణ గురువులనబడుదురు. కలియుగములో అట్టి గురువు లెవరు ? భగవద్రామానుజుల వారొక్కరే అట్టి గురువులు. తదితరులు ... గురువులే గాని మోక్షప్రదాతలగు, గురువులుగారు. ఆఖరికి భగవంతుడు కూడ అట్టి గురుశబ్ద వాచ్యుడు కాడు. దీనికొక అనుభవ పూర్వకమైన ఇతిహాసము కలదు.

విశాఖపట్నం జిల్లాలో సింహాచలమను దివ్యక్షేత్రముకలదు. అందు చిన్నకొండయు దానిపై శ్రీనృసింహస్వామి పెరుమాళ్లు గలరు. అది అతి పురాతనమైన మహా మహిమాన్వితమైన మహాక్షేత్రము. ఆక్షేత్రమున శ్రీ తాండవ కృష్ణమాచార్యులుగారు అను మహాభక్తులు లుండెడివారు. ఆయన గానవిద్యావిశారదులు. వారి కీర్తనల విస్తృతికి కూడ అధ్యయనోత్సవాదులలో కోవెలలో సేవింతురు.

ప్రతి దినము రాత్రి పెరుమాళ్లు ఆరాధన పూర్తైన తరువాత వీరు వీణతో రాళ్లను [illegible]తము కరగించు మాధుర్యముతో పెరుమాళ్లకు గాన సేవచేయుచుండిరి. వీరి పాటను మెచ్చి భగవంతుడు స్వయముగ వచ్చి నృత్యము చేయుచుండెడివాడు. తనపై భగవంతునికి గల దయను జూచి ఈయన ఉప్పొంగిపోయి క్రమముగా గర్విష్ఠులై ఏ భాగవతోత్తములను గౌరవించకుండ యుండిరి.

ఒకనాడు భగవద్రామానుజులు-వారు యాత్రార్థమై సింహాచలమునకు వేంచేసిరి. వారు యతీశ్వరు లగుటచే కోవెలలోనే ఈశాన్యభాగమున గల హంసమూల మంటపమున వేంచేసి యుండి కాలక్షేపమును సాగించుచుండిరి. మామూలు ప్రకారముగ తాండవకృష్ణమాచార్యులుగారు వీణ ధరించి ఆమార్గమున వెళ్లుచు శ్రీ యతిరాజుల సేవించుకొనకుండగ నిర్లక్ష్యముగ వెళ్లిపోయిరి.

ఆ ప్రక్కనున్న స్వాములు వారిని హెచ్చరించిరి.

"స్వామీ వీరు జగద్గురువులు. వీరిని సేవించుకొనకుండ వెళ్ళకూడదు. అందును వీరు యతీశ్వరులు కదా. యతికి నమస్కరించ కుండగ వెళ్ళకూడదని పెద్దలందురు!

తాండవ.కృ:- వీరు జగత్తునకు గురువులైన కావచ్చును. గాని నాకు వీరితో పనియేమి? సాక్షాత్తు భగవంతుడే నేను చెప్పినటుల ఆడు

చుండగా ఈమానవ మాతుల్రల లెక్కేమినాకు?

స్వామి:- అనుచు ఆయన పెరుమాళ్ళ సన్నిధికి వెళ్ళిపోయెను. ఈవిషయము భగవద్రామానుజులవారికి తెలిసెను. తన వద్దకు రాకపోతే పోయె గాని యింత జ్ఞాన భక్తి వైరాగ్యములు గలవారు. యిట్టి భాగవత నిరాకరణ రూప అసహ్యాపచారముచే పాడగుచున్నారే. వీరినెట్లైన తరింపచేయవలెనని సంకల్పించుకొనిరి.

వారివద్దనున్న స్వామిని పిలిచి, నీవు వెళ్ళి శ్రీతాండవ కృష్ణమాచార్యులు గారిని రామానుజులవారికి మోక్షమున్నదా? అది ఎపుడు వచ్చునో. శ్రీనృశింహస్వామివారిని అడిగి చెప్పమనుము. అని పంపిరి.

ఆనాటిరాత్రి గానసేవ అంతయు ముగిసిన పిమ్మట శ్రీకృష్ణమాచార్యులుగారు పెరుమాళ్ళను శ్రీరామానుజులగూర్చి అడిగిరి. "నాకు నీకు కూడ మోక్షమివ్వవలసినవాడు రామానుజులే. ఆయనకు మోక్షమున్నదా యని ప్రశ్నేమిటి? అనిపెరుమాళ్ళు సమాధానమిచ్చిరి.

తాండవ కృ:- మరినాకు మోక్షము కూడ ఆయనే ఈయవలెనా?

పెరుమాళ్లు:- సందేహమేమి?

తాండవకృ: - మరి యిన్నాళ్ళు నుంచి నీ సేవచేసిన నేను గూడ ఆయనను ఆశ్రయించవలసినదేనా?

పెరుమాళ్ళు:- తప్పకుండగ

తాండవ కృ:- నాసేవ కేమియు ఫలితము లేదా?

పెరుమాళ్ళు:- లేకేమి? నీవుపాడితివి. నేనాడితిని. నీపాటకు నాఆటకు చెల్లు.

అంత ఖిన్నులై శ్రీ తాం.కృష్ణమాచార్యులు గారు యింటికి జని మర్నాడు శ్రీరామానుజులు వద్దకు వెళ్ళిరి. వారు శిష్యులకు కాలక్షేపము సాయించుచుండిరి. నేను వచ్చానని చెప్పండిఅని శ్రీతాం. కృష్ణమాచార్యులుగారు శ్రీరామానుజులకు కబురుపంపిరి.

"నేనుచచ్చినగాని వారిచ్చటకు వచ్చినందు వల్ల లాభములేదని శ్రీరామానుజులువారు తిర్గి కబురంపిరి,

తాండవకృష్ణమాచార్యులుగారు దీనికిమరింత ఖిన్నులై యింటికిజని విచారముతో ఉపవాసముతో పరుండిరి. భార్యబ్రతిమాలగా జరిగిన సంగతి నాతను ఆమె కాయన తెలిపిరి.

వారి భార్య మహాపతివ్రతా శిరోమణి మంచి సాంప్రదాయజ్ఞురాలైన సాధ్వీమతల్లి.* ఆమె జరిగిన తప్పిదమంతను గ్రహించినది.

"స్వామి. శ్రీరామానుజులవారు జగద్గురువులు. ఉభయవిభూతి నాయకులు, చేతనోజ్జీవనార్ధమై సర్వేశ్వరునిచే సర్వాధికారమును పొంది అవతరించిన ఆదిశేషులు వారిని మనమై పోయి సేవించుకొనవలదా? అట్టివారికి మనమందరము దాసులము కదా. వారివద్దమనము 'అడియేన్ అనిగాని లేక "దాసుడు" అని గాని కదా అనవలెను. 'నేను అని అహంకారపడుట అపచార హేతువుకదా స్వామీ? 'నేను'అను అహంకారము చావకున్నచో మనకు వైష్ణవత్వ సిద్ధి లేదు కదా?

యిప్పుడు యింటనే వెళ్ళెదము రండు. అపరాధక్షమార్పణము వేడుకొందము. వారి కటాక్షము లేనిచో భగవంతునికే గతిలేదు. ఇక మనకా స్వామీ? అని కాంతా సమ్మతముగ సుహృత్ సమ్మతముగ హితబోధ జేసెను.

ఇద్దరు శ్రీరామానుజులవారివద్దకు వెళ్ళి అనేకములు అపరాధముల క్షమించి కటాక్షించుమని వారి పాదములపై బడిరి.

దయార్ద్రహృదయులగు శ్రీరామానుజులు వారిని లేవనెత్తి పెరుమాళ్ళకు మంగళాశాసనము చేయు మరియొక భాగవతోత్తములు దొరికిరి గదా యని సంతోషముతో వారిని కటాక్షించిరి.

గాన రామానుజులే మనకందరికి ఉత్తారకులగు గురువులు. ఇంకెవరూ కారు.

---

శ్రీమతే రామానుజాయనమః

# "రామానుజ రామానుజ రామానుజ"

శ్రీమతి నంబూరి ఆనందమ్మగారు.



ఇప్పుడే నా సాపాటు అయినది. శ్రీమతే రామానుజాయనమః అంటూ విశ్రమించ బోతున్నా ... ఇంతలో పొరగింటి తాయారమ్మ గారు వచ్చారు.

తాయారమ్మగారు:— ఏమండీ. అంతా 'రామా' 'కృష్ణా' అని స్మరించు కుంటూ ఉంటే మీరు ఎప్పుడూ 'రామానుజా' అంటా రేమండీ?

నేను:— అమ్మా, రామానుజ అని, ఇదొక మహా మంత్రం తల్లీ. రామ—కృష్ణమంత్రముల బంధ మోక్ష ఉభయ హేతువులు గాని ఈమంత్రము కేవలము మోక్షైక హేతువుతల్లీ.

తాయా:— అబ్బా—అలాగునా? అంత మహిమ ఉందా దీనిలో?

నేను:— రామానుజ అనగా శ్రీరామచంద్రులకు తమ్ములన్నమాట. ఆ అవతారములో వీరే నా[illegible] తమ్ములై యుండి 'అహం సర్వం కరిష్యామి' అని అరణ్యములోను, పట్టణములోను, బాల్యంలోను—వృద్ధాప్యంలోను సర్వవిధకైంకర్యములను చేశిరి.

అలాగుననే ఈ అవతారలో 'శ్రీరంగనాథా నీకు సర్వవిధకైంకర్యములను చేయాలి. ఓవరదా నీకు నేను సర్వావస్థలలోను అన్నికైకర్యములను చేయాలి. అని తాము పెరుమాళ్లకు

అన్ని కైంకర్యములను స్వయముగా చేయు టయే గాక "రామానుజార్య దివ్యాజ్ఞా వర్ధతా మభివర్ధతాం" అని మనము కూడ నేటికిన్ని పేరుమాళ్ల సేవ చేయునటుల చేశిరి గనుక వీరు రామానుజులైరి.

తాయా:- చాలా బాగున్నదండి.

నేను:- గుణములనే వీరు శ్రీరామచంద్రునికి అన్నగారైని కూడ చెప్పవచ్చును. శరణు జొచ్చిన కాకాసురుని-విభీషణుని వారు రక్షిస్తే వీరు-శరణాగతిని కూడ చేయలేని మనలను రక్షించుటకై ఆచార్యాజ్ఞమీరి, నరకమున ప్రవేశించ నిశ్చయించు కొని తిరుమంత్రార్థము వెల్లడించినారే! గాన వాత్సల్యములో వీరు శ్రీరామచంద్రునికి అన్నగారన్నమాట.

తాయా:- అయితే ఆనంగమ్మగారూ. ముకుంద మాలలో 'హేరామానుజ' 'హేజగత్రియ గురో!' అని శ్రీకృష్ణపరమాత్మని వర్ణించినారేమి?

నేను:- బలరాముని తమ్ముడు గనుక శ్రీకృష్ణుడు రామానుజ శబ్దవాచ్యుడే. ఈరామానుజులకు ఆశ్రీకృష్ణుని పోలికకూడ పూర్తిగా కలదు సుమండీ.

తాయా:- ఏలాగు నండీ.

నేను:- శ్రీకృష్ణపరమాత్మయగు ఆరామానుజులు అంతకు పూర్వము ఏడు అవతారములు ఎత్తి ఆచార్యబిరుదు పొందలేక పొయ్యాడు. చివరికి ఎలాగైతేనేమి చేటపెయ్యలాంటి అర్జునుని శిష్యుడుగా సంపాదించి అతనిని బ్లిగిపడిపించి గీతను గోపించి ఎలాగైతేనేం "గీతాచార్యుడు" అని ఆచార్యపదవిని స్వయముగ తగిలించుకున్నాడు.

యిక ఈ రామానుజులో ఆసేతుహిమాచల పర్యంతము కోటానుకోట్ల సచ్ఛిష్యబృందము కలవారై తాము తమని ఆశ్రయించినవారు తరించ గలిగినట్టివారై 'జగదాచార్యులని' జనులచే యిప్పటికీ కీర్తించిబడుచున్నారు.

తాయా:- శ్రీకృష్ణుని అవతారముగ ఆకాశవాణి ముందుగా సూచించినది. గాన వారధికులు కారా.

నేను:- అవునమ్మా వీరి విషయములోకూడ నమ్మాళ్వార్లు తమ తిరువాయ్మొడి ని పదలో "కండోంకండో" అని వీరి అవతారమును భవిష్యదాచారత్వమునుసూచించిరి. అగమ్యగోచరమ అచేతనమైన ఆకాశవాణి సూచన గొప్పదా. సాక్షాత్తుగ సాయించిచున్న చేతనులైన నమ్మాళ్వార్ల దివ్యతాముఖమండల శ్రీసూక్తి గొప్పదా?

తాయా:- అయితే ఆరామానుజులు చెరసాలలో అవతరించిరి. సిరో!

నేను:- ఏరూ అంతకంటె పెద్దచెరసాలలో అవతరించిరి. ఈ ప్రకృతిబంధము చెరసాలగాదు టమ్మా! జీయుడు సాయించినారుగా-

తాయా:- ఆరామానుజులు అష్టమగర్భము గదా. సిరో?

నేను:-వీరూ ప్రపన్నకులములో అష్టగర్భులే.

1 శ్రీమతే విష్వక్సేనాయ నమః.

2 శ్రీమతే శఠకోపాయ నమః.

3 శ్రీమన్నాథమునయేనమః

4 శ్రీపుండరీకాక్షాయ నమః

ప్రచార విభాగము

శ్రీమతే రామానుజాయనమః

# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ

## ఆశ్వయుజమాస పంచమ సభలు

★

ఈసభలు నెల్లూరు జిల్లాలోని 'మంగళంపాడు' అనే అగ్రహారమున స్వస్తిశ్రీ వికృతి నామ సం. రం. ఆశ్వయుజ శు. ౧. గురువారం 12-10-50 తేది లగాయతు తొమ్మిది దినములున్ను; "చతుర్వింశతి శ్రీసీతాకల్యాణ, శ్రీరామపట్టాభిషేక, శ్రీరామాయణపారాయణ సహిత శ్రీరామక్రతువుతో పాటుగ అత్యంత-మహా-వైభవముగా జరిగినవి.

ఇందు మంగళంపాడు, ఉమ్మార్చరు, తిరుపతి, అత్తమూరు, కోరుకొండ, చిత్తూరు, అల్లూరు, మదరాసు, కుంభకోణము, సూళ్ళూరుపేట, హైదరాబాదు కాంచీపురము, మున్నగు వివిధప్రాంతములనుండియు విచ్చేసిన పండితులు పాల్గొనిరి.

ఆహ్వానసంఘ కార్యదర్శిగారగు శ్రీ ఉ. వే. శ్రీమాన్ నడాదూరి గోపాలకృష్ణమాచార్యులుగారు అనేక శ్రమలకోర్చి విచ్చేసిన స్వాములకు, ప్రేక్షకులకు వలయు అన్ని సౌకర్యములను స్వయముగ అతివైభవముగా జరిపించిరి.

ఈఉత్సవములలోన శ్రీపిళ్లైలోకాచార్యులవారు తిరునక్షత్రముకూడ వచ్చుటచే తన్నిర్వాహకులుకూడ ఆఉత్సవమును ఈఉత్సవముతో కలిపి జరిపించుటచే మొత్తము కార్యక్రమమంతయు బహుళశోభాయమానముగను, అత్యంత విలక్షణముగను, అతి శ్లాఘనీయముగను జరుపబడినది.

మంగళంపాడు, ఉమ్మార్చరు భాగవత బృందము ఈకార్యక్రమ విషయమున జూపిన శ్రద్ధాభక్తులు, కార్యదీక్ష, సేవానిరతియు అత్యంతము కొనియాడదగినవై, ఆదర్శప్రాయములై యున్నవి.

ఈఉత్సవమునను, ఈసభలలోను పాల్గొన్నట్టియు శ్రీరామాయణమునుగూర్చి ఉపన్యసించునట్టియు భాగవతోత్తముల నామధేయములు-

1. శ్రీ ఉ. వే. శ్రీమాన్. శృంగారం వెంకట అప్పలాచార్యులుగారు అల్లూరు.
2. ,, టి. కె. వి. ఎన్. సుదర్శనాచార్యులుగారు న్యాయవిద్వాంసులు - సంస్కృతకాలేజి-తిరుపతి.
3. ,, టి. కె. వీరస్వామి అయ్యంగారు-రిసెర్చి కాలేజివిద్వాంసులు-తిరుపతి.
4. ,, ఆర్. శ్రీనివాసరాఘవాచార్యులుగారు, ఎస్. వి. ఓరియంటలు రీసెర్చి ఇన్‌స్టిట్యూటును విద్వాంసులు-తిరుపతి,

5. శ్రీ ఉ. వే. శ్రీమాన్ కె. శ్రీనివాస రామానుజాచార్యులుగారు-మంగళంపాడు.
6. ,, ఉమ్మాచ్చారు అనంతశయనాచార్యులుగారు-ఉమ్మాచ్చారు.
7. ,, నడాదూరి వెంకటకృష్ణమాచార్యులుగారు-చెన్నూరు.
8. ,, తై. కం. గోపాలాచార్యులుగారు-కోరుకొండ.
9. ,, ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులుగారు-అర్తమూరు.
10. ,, నడాదూరి గోపాలకృష్ణమాచార్యులుగారు-మంగళంపాడు.

ఋత్విక-పారాయణాదికములలో పాల్గొన్నవారు.

11. ,, చిత్తూరి నరశింహాచార్యులుగారు-చిత్తూరు
12. ,, రంగాచార్యులుగారు-మంగళంపాడు.
13. ,, కృష్ణమాచార్యులుగారు-మంగళంపాడు.
14. ,, సి. శేషాచార్యులుగారు-తిరుపతి.
15. ,, నడాదూరి రామానుజాచార్యులుగారు-చెన్నూరు.
16. ,, ఇ. చినరామానుజాచార్యగారు-మంగళంపాడు.
17. ,, కె. తిరువేంగళాచార్యులుగారు-ఉమ్మాచ్చారు.
18. ,, వి. కె. నరశింహాచార్యులుగారు-ఉమ్మాచ్చారు.
19. ,, వి. నరశింహాచార్యులుగారు-ఉమ్మాచ్చారు.
20. ,, వి. వెంకట కృష్ణమాచార్యులుగారు-ఉమ్మాచ్చారు.
21. ,, వి. శ్రీనివాసాచార్యులుగారు.-ఉమ్మాచ్చారు
22. ,, కే. అనంతాచార్యులుగారు-ఉమ్మాచ్చారు.
23. ,, వి. సి. గోపాలకృష్ణమాచార్యులుగారు-ఉమ్మాచ్చారు.
24. ,, యజమానం చినశ్రీనివాసాచార్యులుగారు-మంగళంపాడు.
25. ,, కె. వి. అప్పలాచార్యులుగారు-హైదరాబాదు.
26. ,, ఎం. వి. గోపాలాచార్యులుగారు-హైదరాబాదు.
27. ,, రంగరాచార్యులుగారు-మంగళంపాడు.
28. ,, యజమానం రంగాచార్యులుగారు-మంగళంపాడు.
29. ,, యజమానం శ్రీనివాసాచార్యులుగారు-మంగళంపాడు.
30. ,, కుంభకోణం ఆచార్యగారు.
31. ,, నాలాయిరం అధ్యాపకాచార్యులుగారు.

# శ్రీ యతిరాజ సేవా మహిళా సంఘం
## శుక్రవారోత్సవములు

అ ప్ర మూ వ

11-8-50 శ్రీమతి గోనాల మహాలక్ష్మిగారు
18 ,, నల్లిమిల్లి మాణిక్యంగారు
23 ,, చిర్ల మాణిక్యంగారు
25 ,, లంక మహాలక్ష్మిగారు
,, చిర్ల మంగయ్యమ్మగారు
1-9-50 శ్రీమతి సత్తి సుబ్బయ్యమ్మగారు
సత్తి సూరమ్మగారు
చిర్ల వీరమ్మగారు
8-9-50 శ్రీమతి పేపర్తి మంగయ్యమ్మగారు
,, పేపర్తి గంగరాజుగారు
,, మేడపాటి మంగరాజుగారు
15 ,, కర్రి మాణిక్యంగారు
22 ,, లంక వీరమ్మగారు
,, దాసరి సుబ్బమ్మగారు
29 ,, కర్రి బుల్లిఅమ్మాయిగారు
6-10-50 నల్లిమిల్లి వెంకయ్యమ్మగారు
మండబుల్లి వెంకయ్యగారు

మదరాసు

పెద్దలు:

1. శ్రీమతి వస్గాల అమణమ్మగారు, సుదానిధి.
2. ... పూడి కనకవల్లమ్మగారు ,,
3. తవ్వా కుట్టెమ్మగారు, ,,
4. మట్టుపల్లి చంద్రమ్మగారు ,,

ఉద్బోధకులు:

1. పొన్నూరు శ్రీరంగనాంచారమ్మగారు ,,
2. వేల్చూరు అలివేలుతాయారమ్మగారు ,,
3. శారదాంబగారు ,,
4. శ్రీరామశెట్టి సీతమ్మగారు ,,

కార్యదర్శి.
పువ్వాడ మంగమ్మ.

సేవచేయు విధానము:-

ప్రతి శుక్రవారము సాయంత్రం గం 4-0 లగాయతు గం 7-0 వరకున్ను-

1. తిరువారాధనము, 2. తిరుప్పల్లాండు-శిరియ తిరుమడల్ గోష్ఠిసేవాకాలము, 3. తిరునెడుం దాండగం ఉపన్యాసము, 4. శ్రీరామానుజ-శ్రీలక్ష్మీఅష్టోత్తరస్తోత్రం నామావళి చెప్పుట, 5. చాత్తుమొఱ, 6. తిరునామ సంకీర్తనము.

ఏలూరు

1. శ్రీసఖాదివారింట్లో
2. ,, ,,
3. ,, ,,
4. శ్రీమోతే నరసింహారావుగారి సతీమణి స్వగృహములో
1. శ్రీమతి ముడుంబై రంగనాయకమ్మగారు స్వగృహంలో
2. ము. వెం. రంగనాయకమ్మగారు ,,

3. ముడుంబై వేసం దేవిగారు–శేషశే యూరశిరలో
4. ముడుంబై రంగనాయకమ్మగారు ,,
1. చిలకమర్రి సింహాద్రమ్మగారు ,,
2. ముడుంబై వెంకట సత్యవతమ్మగారు ,,
3. ముడుంబై చినవెంకట సత్యవతమ్మగారు ,,
4. న. చ. లక్ష్మీనరసమ్మగారు ,,

కార్యదర్శి.
ముడుంబై రామానుజమ్మ

## విశాఖపట్టణము

1 శుక్రవారం శ్రీమతి వక్కలంక వెంకటనరసమ్మగారు. స్వగృహంలో
2 ,, ,, దాసరి ఆండాళమ్మగారు ,,
3 ,, ,, రామినీడు రామాయమ్మగారు ,,
4 ,, ,, పున్నమరాజు బంగారమ్మగారు ,,

శ్రీగుణరత్నకోశము, గోదా చతుశ్శ్లోకి–గోదాస్తుతి.తిరుప్పావై సేవకాలములు, ఉపన్యాసములు వీణాగానములు అష్టపదులు–తిరునామములు. మంగళహారతులు సంకీర్తనములు జరిగినవి.

కార్యదర్శి:– దాసరి ఆండాళమ్మ.

---

# ఏకాదశోత్సవములు

ఉత్తమూరు

9–8–50 ,, నల్లమిల్లి అచ్చెయ్యమ్మగారు
23 ,, కొప్పిరెడ్డి బూమణంగారు
8–9–50 పెన్మెత్స మంగయ్యమ్మగారు
పెన్మెత్స గంగరాజుగారు
మేకపాటి మంగరాజుగారు
22 లంకపేరమ్మగారు

దాసరి సుబ్బయ్యమ్మగారు
7–10–50 మండబుల్లి వెంకయ్యగారు
శ్రీకృష్ణాష్టమి:–చిర్ల సూరమ్మగారు వారిచేత కార్యక్రమము జరుపబడినది.

సరసాపురం

8–9–50 యతిరాజాశ్రమంలో:–
శ్రీమతి మాజేటి సుబ్బమ్మగారిద్వారా,

## శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు

### సంభావన

కృష్ణాజిల్లాలోని ముదునూరు గ్రామ స్థులు శ్రీమతి జాస్తి లక్ష్మీదేవమ్మగారు తమ తల్లిగారి తిరువధ్యయనోత్సవమున శ్రీవిశిష్టాద్వైత పరిచారక సంఘమునకు రూ 5-0-0లు సంభావనను సమర్పించిరి వీరికి శ్రియఃపతి కరుణా కటాక్షములు కలుగుగాక.

### కానుకలు

మచిలీపట్టణము, జనాగుపేట కాపు రస్తులు వైశ్యశిఖామణులు శ్రీమాన్ కొత్త బాలకృష్ణయ్యగారి సత్తత కుమారుడు నంబెరుమాళ్ళుగారియొక్క ఆచార్య సమాశ్రయణ సందర్భములో శ్రీ విశిష్టాద్వైత పరిచారక సంఘమునకు రూ 5-0-0లు కానుకను సమర్పించిరి.

వీరికి శ్రియఃపతి ఆయురారోగ్య భాగ్యములను కటాక్షించుగాక.

## శ్రీ విశిష్టాద్వైత పరిచారక సంఘ

### పుష్యమాస పండిత పరిషత్ సభలు.

పాలకొల్లు, చిన్నగోపురం.

### ఆహ్వాన పత్రిక

స్వస్తిశ్రీ వికృతి నం. రం పుష్య బ ౧౩ ఆదివారము (ది 4-2-51) మొదలు మూడు రోజులు పశ్చిమగోదావరిజిల్లా పాలకొల్లు పట్టణమున శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ పుష్యమాస పండిత పరిషత్ సభలు శ్రీ. ఉ. వే. శ్రీమాన్. కాంగ్యారి విద్వాన్ రామానుజాచార్యులుగారి అధ్యక్షతను జరుగును. గాన భక్తులందరు విచ్చేసి యుండు పాల్గొని ఆనందించ గోరుచున్నాను.

ఇట్లు,
ఆహ్వాన సంఘము.

### మాఘమాస పండిత పరిషత్ సభలు

అంగలకుదురు, తెనాలి తా॥ గుంటూరు జిల్లా.

### ఆహ్వాన పత్రిక

స్వస్తిశ్రీ వికృతి సం॥రం మాఘ శు. 3 శుక్రవారము (ది 9-2-1951) మొదలు మూడు రోజులు గుంటూరు జిల్లా తెనాలివద్దనున్న అంగలకుదురులోని దాసకుటీరమున శ్రీవిశిష్టాద్వైత పరిచారక సంఘ మాఘ మాస పండిత పరిషత్సభలు జరుపబడును. గాన భక్తులందరు విచ్చేసి యుండు పాల్గొని ఆనందించ గోరుచున్నాము.

ఇట్లు
ఆహ్వాన సంఘము.

శ్రీమతే రామానుజాయ నమః



భక్తి

# నివేదన

వేదాంత మాస పత్రిక

| సంపుటి ౨ | వికృతి — మార్గశిరము | సంచిక ౭ |
| --- | --- | --- |

## కృష్ణార్జున సంవాదము—

## కామ్యకర్మ వివేకము

(శ్రీ ఉ. వే శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులుగారు, గోలకొండ)

అర్జునుడు:- కృష్ణా! ఇట్లు కామ్య కర్మలను వాటినాచరించువారలను నిందించుట తగునా? వేదములు ప్రియములును, హితమును ఉపదేశించునట్టి వేయిమంది తల్లిదండ్రులవలె నత్యంత వాత్సల్యముతో నాత్మలన్నింటికిని ధర్మార్థకామమోక్షములను పురుషార్థములను బడయుటకును అపురుషార్థములను పరిహరించుటకును సాధనములను సర్వదా బోధించుచు నాత్మోజ్జీవనమునకే ప్రవర్తించుచున్నవి గాని దేహాది ఆరోగ్యాదులకొరకు మాత్రము ప్రవర్తించుచున్నవి కావుకదా! అట్టితరి ఫల మల్పమైనను శ్రమయధికమగు పునర్జన్మనొసంగు నీ కామ్య కర్మల నేల యుపదేశించుచున్నవి? వంచనకా? కాదు! హితోపదేష్టలట్లు గావింతురా? తల్లి బిడ్డచే మందుకలిపిన వెన్నను తినిపించినట్లు వేరొక మంచిఫలమున కట్లు లాలనచే ననుష్ఠింపజేయుటను బోధించునందువా? ప్రతిప్రకరణమునకును వాటివాటికి ప్రత్యేక ఫలములను బోధించుచునే యున్నవికదా!

పరమకారుణికుడగు పురుషోత్తముని ఆజ్ఞారూపములగు వేదములు విషమును కలిపిన మధుభోజనము నుపదేశించినట్లనుచితమే యగును గదా!

చేయమని విధించి చేయవలదని నిషేధించుట విరుద్ధము కదా! కర్మలను బోధించు వేదభాగమైన నప్రామాణ్యము కావలెను. అది ప్రమాణమన్నచో వాటిని నిషేధించు నీయుపదేశమైన నప్రామాణ్యము కావలెను. నీవంటి ఆప్తుడు వేదవిరుద్ధమైనది విడువమని చెప్పవలెను గాని వేదవిహితమైనది కాదే!

శ్రీకృష్ణుడు:- నాయనా! ఒకతల్లికి ముగ్గురు పుత్రులుందురు. వారలకు విద్యాబుద్ధులలో తారతమ్యముండిన నుండనిమ్ము. వేరొకనికి పులుసును ఇష్టమనుకొనుము. తల్లి వండి పెట్టునప్పుడేమి చేయును? వారి ముగ్గురకు నిష్టమగునట్లు మాత్రమే చేసిపెట్టి తక్కినవారిని పస్తుపెట్టునా?

ఆప్తుడగు చతురుడైన ఒక యింటివైద్యుడు కలడు. ఆయింటిలో నొకడు వాతప్రకృతియు, ఒకడు పిత్తప్రకృతియు మరియొకడు శ్లేష్మప్రకృతియు కలరు. వారికి రోగము వచ్చినప్పుడా వైద్యుడు వారి ప్రకృతుల ననుసరించి మందులను వాడి పథ్యమును చేయించి యపథ్యముల నిషేధించనిచో వారేమగుదురు?

తాంబూలాదుల కలవడిన బిడ్డలకు తండ్రులవి లభించు నేర్పాటుల గావింపనిచో నేమి చేయుదురు? క్రమముగ చౌర్యాదుల కలవడి చెడుదురుగదా! దాహముచే చావనున్న వానికి రసాయనమును విధించుట భావ్యమా? అట్లే లోకమున పురుషులు తమోగుణప్రకృతులు, రజోగుణప్రకృతులు సత్వగుణప్రకృతులు గాను నుందురు.

అనగా ఇతర రెండుగుణముల కంటె ఏదో యొక్కగుణమే సర్వదా వారి శరీరమున రాజ్యము చేయుచుండును. వీరందరి యెడలను వేదమాతకు సమానప్రేమయే యుండునుగదా! కావున వీరికి వీరి రుచిని బట్టి హితమును బోధించవలదా! రాజసులును తామసులును సాత్వికుల ఫలమగు మోక్షరూప పురుషార్థమునకు సహజముగనే విముఖులుగా నుందురు. వీరికి కామ్యకర్మలయందే యాసక్తి ప్రబలియుండును. దానికి వశ్యులై తమ మనస్సును నియమింపజాలక యుందురు. అంత వీరు బౌద్ధాదులవలె శాస్త్రవిరుద్ధకర్మలనే కర్తవ్యములని భ్రమించి వాటి నాచరించి యందువలన కలిగిన పాపము పండినతోడనే చెట్టుగనో పుట్టగనే పుట్టి యిక పురుషార్థప్రాప్తికి యోగ్యతయే లేక నశింతురు. తల్లివంటి వేదము వారి యనర్థమును జూచి యెట్లు సహించి యుపేక్షించి యుండగలదు. తల్లి తనబిడ్డలరుచికి తగినట్లువండి పెట్టినట్లే తానే యట్టి రాజసతామసులకు పయోగించు కామ్యకర్మలనుకూడ ఉపదేశించెను. వారు వాటిని గాంచి సంతోషముతో నాచరించి కొన్నిట ప్రత్యక్షముగనే ఫలమును లభించి వేదము

నందు విశ్వాసముకలవారై క్రమముగ కొన్ని జన్మలకైనను సాత్వికులై తరించగలుగుదురు.

అర్జునుడు:- కృష్ణా ఇట్లు కలగూర గంపవలె నానావిధకర్మల బోధించినచో కేవల మోక్ష మునే యపేక్షించు సాత్వికులు గుణత్రయ విశి ష్టులేగాన నెప్పటికైనను భ్రమించి వేదమున చెప్పబడినవియేగదా యని వాటి నవలంభించి చెడుటయు సంభవించవచ్చునే. అట్లు జరుగకుండుటకు వారికేమైన నుపాయము కలదా?

కృష్ణుడు:- లేకేమి? చూడుము నీవు మొదట నన్నాశ్రయించి యేడ్చుచు నేను నీ శిష్యుడను నిన్ను శరణుజొచ్చుచున్నాను నన్ను తగు రీతిని శిక్షింపుమని ప్రార్థించితివి గదా! అట్లు ప్రార్థిం చుట సాత్వికునికి గాని పొసగదు. అందుచే నీవు సాత్వికుడవు. అనగా, సత్వగుణము, రజస్తమస్సు ల నణచి నీమనస్సు నేలుచున్నది. కావున నీవు దానిని పీడి చేయమని శాస్త్రము విధించిన కర్మ లను విడిచి చేయరాని వాటిని చేసి రజస్తమస్సు లను పెంచకుము.

అర్జునుడు:- కృష్ణా! వాటిని పెంచుటయును పెంచకుండుటయును మన శక్యమగునా? అది ప్ర కృతి ధర్మముకదా!

కృష్ణుడు:- అట్లనకుము. అది మనలోనే యున్నది. దానికి ఆహారము ముఖ్యతమమగు నుపాయము. అది మూడువిధములుగా నుండి ఆ యా గుణములను పెంచుచుండును. దానిని గూర్చి మరియొకసారి విపులముగా చెప్పగలను. కావున నీవు రజస్తమోగుణములను పెంచుఆహా రాదులను విడిచి సాత్వికాహారముకే సేవించు చుండిన నీ కది శక్యమగును.

అర్జునుడు:- కృష్ణా! రజస్తమఃప్రకోపమునడ చుము. సత్వప్రాచుర్యమును వృద్ధిపొందించు మనుచున్నావే! ఎవడైనను 'ఇది రజోగుణము' ఇది తమోగుణము, దీనిని నేనుపెంచుచున్నాను అని తెలిసి ప్రవర్తించునా నివర్తించుటకు? ఎవ డైనను సత్వగుణమునుకాని దాని యుపాయము ను గాని యెఱుంగునా వాటియందు ప్రవర్తించు టకు? కావున యిందు విషయమై యేమి చేయ వలెను? ఎట్లు చేయవలెను. స్పష్టముగాచెప్పుము

కృష్ణుడు:-అడుగవలసిన విషయము నడిగితివి. చెప్పెద సావధానముగా వినుము. నీవు సాక్షా త్తుగా ఆ గుణములను గూర్చి చేయవలసిన దేది యు లేదు. కాని నీవు సాత్వికములు కాని యా హారములను పూర్తిగ విడిచి పుణ్యపాపములకు మూలమైన సకల సాంసారిక స్వభావముల నుపే క్షించి యాత్మస్వరూపము నెఱింగుటకునుదానిని పొందుటకును ఉపాయములు కానివాటి నన్నిటిని బొత్తుగ దరిజేరనీయక ఆత్మస్వరూపమును మా త్రమే నియమముగ నన్వేషింపుము. ఇట్లుంటివేని రజస్తమోగుణముల ఉద్రేకము తనంతనే యడు గంటి సత్వగుణము పూర్తిగ తలయెత్తును.

అర్జునుడు:- వేద మపౌరుషేయము. కావున దానికి మనుష్యులు రచించిన గ్రంథము లకున్న భ్రమ, ప్రమాద, విప్రలంభ, అశక్తి దోష ములుండవు. అది కొంత ప్రమాణము కొంత అప్రమాణముఅనుట సాహసము. కావుననందు కొన్నిటిని పరిగ్రహించుట కొన్నిటిని విడచుట పాపహేతువుకదా!

కృష్ణుడు:— అర్జునా! ఒక ధర్మాత్ముడు స్నానమునకు, పానమునకు, పశువులకు, పక్షులకు, పంటకు, ఉపయోగపడవలెనని ఒక మూతినో చెరువునో త్రవ్వించెననుకొనుము. దానియందు నీరు పుష్కలముగ నున్నది. ఒక అపరిమితదాహము గలవాడు దాని చెంతకేగి తనకు కావలసిన నీటిని త్రాగి పోవునా? అందున్న నీటినంతను త్రాగవలెనను నిర్బంధమేమైన కలదా? అట్లే వేదము లన్ను,వర్ణములు, ఆశ్రమములు ప్రవరలు మొదలగు భేదముల ననుసరించి ఆ యా యధికారుల కవసరమగు ధర్మములను విధించును. అందొక వర్ణమునకును ఒక యాశ్రమమునకును చెందిన వాడొకని ఒక విధమైన ఫలము నపేక్షించినవాడుకాని వేరొక వర్ణమునకును వేరొక యాశ్రమమునకును వేరొక ఫలమునకును సంబంధించిన కర్మల నాచరింపరాదు. అట్లే బ్రాహ్మణుడగు ముముక్షువుతనకుపరిగ్రహించవలసిన లేవియో విడిచి పెట్టవలసిన వేవియో బాగుగ నెఱింగి యా విధులలో నేవిమోక్షసాధనములో వాటినే పరిగ్రహించుట సకలశాస్త్రసమ్మతమైనమర్యాద అంతియే గాని వేదమున జెప్పబడినను తానధికారి కాకుండుటచే నితరవిధుల నాతడు విడుచుటచే పాప మించుకయును లేదు.

అర్జునుడు:— కృష్ణా! నేను నన్ను గూర్చి ప్రశ్నింపగా, బ్రాహ్మణునికర్తవ్యము నుపదేశించితి వేమి? అదిగాక బ్రహ్మవిద్యయందు త్రైవర్ణికు లనబడు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులను ముగ్గురకు నధికారముండగా నిచ్చట బ్రాహ్మణుని విశేషమేమి?

కృష్ణుడు:— ఓసీ! యిదియా నీ సందేహము. నీవు గ్రహింతు వనుకొంటిని పోనిమ్ము ఆ మర్మమును నేనే చెప్పి నీ సందేహమును తొలగింతును. వినుము.

ఇచ్చట 'బ్రహ్మ × అణతి' (అణ—శబ్దే) అను వ్యుత్పత్తిని బట్టి 'బ్రహ్మ × అణ' యని యుండగా యీ బ్రహ్మశబ్దము శకన్ధ్వాది గణములో చేరినదగుటచే 'శకన్ధ్వాదిషు పరరూపం వాచ్య' మ్మని పరరూపము వచ్చుటచే 'బ్రాహ్మణ'యని యగును దీనికి 'ప్రజ్ఞాదిత్వా దణ్' అని అణ్ ప్రత్యయమువచ్చి 'అచో ఞ్ణితి'యనుసూత్రముచే ఆదివృద్ధి వచ్చి 'బ్రాహ్మణ'యగుచున్నది. ఇచ్చట 'బ్రహ్మ' శబ్దమునకు 'సర్వేషు వేదేషు' అను చోటనే ప్రసక్తమైనది గాన వేదమని యర్థము 'అణ' ధాతువునకు శబ్దించుట యర్థము. కావున వేదమును శబ్దించువాడు 'బ్రాహ్మణుడు' అని యర్థమును జెప్పవలెను. వేదమును చదువుకొను యధికారము బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకు ముగ్గురకును కలదు గాన నిచ్చట 'బ్రాహ్మణ' శబ్దమునకు త్రైవర్ణికు లర్థమగుదురు. అందునీవు క్షత్రియుడ వగుటచే నీకును యీ యుపదేశము నొప్పించుట కాక్షేపము లేదు. తెలిసినదా?



అస్మద్గురుభ్యోనమః

# ప్రపన్నకృత్యము

ఆ. చి. శ్రీమన్నారాయణ.

---

[నమ్మాళ్వార్లు చింతచెట్టులో జ్ఞానముద్రతో కూర్చునియుందురు. మధురకవులు వారి సమీపమున అంజలి ఘటించి వినయముతో నిలబడియుందురు.]

---

శ్రీనమ్మాళ్వార్లు:- ఓ మధురం! శ్రీకణ్ణాను ఇప్పుడే పొందవలెనోయీ. ఆయన తిరునావాయ్ యందుకదా వేంచేసియున్నాడు.

తిరువాయ్‌మొழி ౯. ౮. ౧.

అఱుక్కుం విన్నైయాయిన ఆకత్తవన్నై ।
నిఱుత్తుం మనత్తొన్ఱియ శింద్దైయినార్క్కు ।
వెఱిత్తణ్ మలర్ చ్చోలైకళ్ శూళ్ తిరునావాయ్।
కుఱుక్కుం వకైయుండు కొలో కొడియేఱ్కే ॥

హృదయమునందు ఆసర్వేశ్వరుని ఉంచవలయుననెడి అధ్యవసాయమందు ఉద్యోగించిన మనోరథముగలవారియొక్క పాపములైనవాటి నన్నిటిని పోగొట్టినదియు పరిమళములుగల చల్లనైన పుష్పములుగల తోటలచే చుట్టబడిన తిరునావాయ్ యనెడు దివ్యదేశమును పాపముగల నాకు పొందుటకుపాయము ఉన్నదా?

తిరువాయ్‌మొழி ౯. ౯. ౧.

పా॥ మల్లిగై కమళ్ తెన్ఱల్ ఈరుమాలో
వణ్ కుఱింజి యిశై తవళుమాలో
శెల్కదిర్ మాలైయుం మయక్కుమాలో
శెక్కర్ నల్ మేకంగళ్ శిదైక్కుమాలో
అల్లియం తామరైక్కణ్ణ నెమ్మాన్
ఆయర్కళ్ ఏఱు అరియేఱు ఎన్ మాయోన్

పున్నైయ ముల్లైకళుం తోళుం కొండు
పుషలిడం అఱికిలం తబయమాలో

మల్లెపుష్పముల పరిమళముగల మలయమారుతము నన్ను చీల్చివేయుచున్నది. అందమైన కుఱింజియనెడి రాగము దొలచివేయుచున్నది. అస్తమించుచున్న సూర్యునిగల సంధ్యాకాలమున్ను మైటాకము జేయుచున్నది. ఎఱ్ఱని వర్ణముగల శ్రేష్ఠమైన మేఘములు కోయుచున్నవి. వికసించుచున్న సుందరమైన పద్మమువంటి నేత్రములుగల మాస్వామియు గోపశ్రేష్ఠుడును సింహశ్రేష్ఠుడును నాకాశ్చర్యభూతుడైన సర్వేశ్వరు సంశ్లేషించిన ఈ స్తనములను భుజములను తీసుకొనిపోయి; ఒంటరిగాయున్న మనము ప్రవేశింపతగిన స్థానము ఏమియో మనము ఎఱుంగము గదా. ఓయ్యో వికటించినది.

"మాలైయుం వందదు, మాయన్ వారాన్" (తిరు. ౯. ౯. ౧౦)
సాయంకాలము కూడ వచ్చినది. గాని, ఏమి ఆశ్చర్యమో ఆశ్చర్య గుణాభూతుడైన శ్రీకృష్ణుడు రాడే. అయ్యో అయ్యో ఇక నాగతి ఏమి.

మధురకవులు:- (స్వగతము) పట్టపగలంతయు పలు తెఱంగుల పలవరించినను రాని కృష్ణుడు సాయంకాలమైనంతనే సాక్షాత్కరించునా ఏమి చెప్మా!

అవునవును. గీతలో రెండవయధ్యాయమున ఆయనే తెలిపెనుగదా!

'యానిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ' ప్రపంచమంతయు రాత్రిగా భావించుకొని నిద్రించియుండు కాలముననే జితేంద్రియుడగు యోగి, భగవత్ సాక్షాత్కారానుభవము గలవాడై యుండునని.)

అయ్యో. గురువుగారు భగవద్ సాక్షాత్కారము కాలేదని మూర్ఛిల్లిరే.

ఓహో. ఇదియే కాబోలు సమాధ్యవస్థ. ఆహాహ. ఏమీ, వీరి తన్మయావస్థ. భగవంతునితో ఏదియో మాట్లాడుచున్నారని తోచుచున్నది.

భగవంతుడు:- ఏమండీ, నమ్మాళ్వారూ. మీరే యిలాగతలచుకొని తలచుకొని, నాసాక్షాత్కారము కలుగలేదని భాదపడుచున్నారే. ఇదేమి న్యాయము.

మిమ్ములను పొందాలని తలచేవారము మేముకదా. మీరు రాకపోతే దానిని కొఱతగా తలంచి దానికై పరితపించు వారలమున్ను మేముకదా.

మీకిపుడు వచ్చిన లోటేముండంది? మేముచేయవలసిన పనిని మీరు చేయుచున్నారు, మేము పడవలసిన బాధ మీరు పడుచున్నారు.

3. తిరువందాది ౭౧.

అవనే యరువరైయాల్ ఆనిరైకళ్ కాత్తాన్ ।
అవనే యణిమరుతం శాయ్త్తాన్ - అవనే।
కలంగా పేరునకరం కాట్టువాన్ కండీర్ ।
ఇలంగాపురం ఎరిత్తాన్ ఎయ్తు.

ఆసర్వేశ్వరుడే (గోవర్ధనోద్ధరణాది) అతిమానుషచేష్టలచే గోసమూహములు రక్షించుచుండే. ఆసర్వేశ్వరుడే మద్దివృక్షముల ద్వంద్వమును పడగొట్టెను. ఆసర్వేశ్వరుడే కలతజెందని విశాలమైన పరమపదమును జూపువాడె సుమండీ లంకాపట్టణమును భాదించి దహింపజేసెను సుమండీ. అని మీ పేయాళ్వారులే పాడించినారు కదా.

అట్టి వైకుంఠమును కూడ విడిచిపెట్టి తిరుకణ్ణపురమున మేము వచ్చి మీకు దగ్గఱగా యున్నది మీనిమిత్తమయ్యే కదా.

నమ్మాళ్వార్లు మూర్ఛావస్థలోనే పలవరించుచుండుట)

శరణమాకుం తనతాళడైందార్కు ఎల్లాం ।
మరణమానాల్ వైకుంతం కొడుక్కుంపిరాన్ ।
అరణమైంద మదిల్సూళ్ తిరుకణ్ణపురత్తు ।
తరణి యాళన్ తనతు అంబర్కు అంబానుమే॥

సర్వేశ్వరుడు తనపాదముల నాశ్రయించిన వారికందరికి రక్షకుడగును.

మృతిపొందినచో వైకుంఠమునిచ్చు ఉపకారకుడు.

రక్షణార్థమై నిర్మించబడిన ప్రాకారములచే చుట్టబడిన తిరుకణ్ణపురమున సంసారుల రక్షణార్థము వేంచేసియున్న సర్వేశ్వరుడు తనభక్తులకు భక్తుడగును.

నమ్మాళ్వార్లు మేల్కాంచి! ఓమధురం, ఓమధురం. ఆహా ఏమి నాయదృష్టము, భగవంతుడు స్వయముగా సాక్షాత్కరించి నాడోయి. నాకభయమిచ్చినాడోయి. అంతేకాదు, మనకొఱకు కూడ సమాశ్రయణీయుడై తిరుకణ్ణపురమునందే వేంచేసినాడోయి. ఆశ్రయించ దయ్యా! పదండి ఎవరైనాసరే. ఆశ్రయిస్తేచాలు. ఆయన శ్రీపాదములయందు భక్తి నుంచండి.

మధురకవి:- అలాగండి. ఆహా! ఏమి యదృష్టము. ఏమి యదృష్టము అయితే, స్వామి, మావంటి అకించనులము భక్తి నిష్ఠులము కాగలమా. అందుకు వలయు పరికరములు మాకు లభించునా?

నమ్మాళ్వార్లు:- అహో! అట్లనా భక్తి పరికరములు లేవా అవి మీకు దుర్లభమా, కాని

ప్రపత్తినిష్ఠులు అవ్వండి.

మధురకవి:— స్వామి ప్రపత్తినిష్ఠ మాత్రము అంత సులభమా. విశ్వాస-సాయస-భూమ్నా స్వాసభజనయో గ్గౌరవే కో విశేషః (న్యాసతిలకం)
దానికెంతో అధ్యవసాయ ముండవలెనండి.

నమ్మాళ్వారు:— ఓహో ప్రపత్తినిష్ఠకూడా అంత కష్టమండీ! పోనిండి, కేవలం తిరుక్కణ్ణపురాధీశుని అనుసంధించండి చాలును. దానినే ఆయన అధికముగా తలంచును. మనలను ఆయన విడిచిపెట్టడు. తప్పక రక్షించితీరును. చాలు అంతమాత్రమే చాలును. తప్పక అందరూ ఆయనను ఆశ్రయించండి.

మధురకవి:— తప్పక ఆయన రక్షించెద నన్నాడండి.

నమ్మాళ్వారు:— ఆహా ఆయనే స్వయముగా చెప్పాడయ్యా! మమ్మాశ్రయించి అజినిజమేన య్యా ఇంకా సందేహమే.

మధురకవి:— అయితే వ్యాసమహర్షి బ్రహ్మసూత్రములలో ౪. ౧. ౧౯.

"భోగేన త్వితరే క్షపయిత్వా అథ సంపద్యతే"

(ఇతరే=సంచిత- ఆగములకంటె యితరములైన పుణ్య పాప రూప ప్రారబ్ధకర్మలను;

భోగేన= అనుభవముచే

క్షపయిత్వా= నశింపజేసి

అథ= తత్ఫలభోగ సమాప్త్యనంతరమున,

సంపద్యతే= బ్రహ్మసాయుజ్యమును పొందుచున్నాడు.

శేషు= పఠవ్యాస్యూత్రి

అని ప్రారబ్ధకర్మకొంక్క— పరిపూర్ణానుభవానంతరమేకదా పరబ్రహ్మసాన్నిధ్యము. ఈ దేహావసానంతరమే తప్పక సాన్నిధ్యమిస్తామనుట అందులకు వ్యతిరేకముగా కనుపించుచున్నదే.

నమ్మాళ్వారు:— ఇదా నీ సందేహము. —

వ్యాసమహర్షి వాక్యము ప్రమాణమే. ఇప్పటి ఈ భగవంతుని అభయప్రదానము సత్యమే. భక్తినిష్ఠులు అవ్వండి దానికి శక్తిమంతులు గాకపోతే ప్రపత్తినిష్ఠులు అవ్వండి అనిగదా చెప్పితిని.

భక్తినిష్ఠులను ఉపాసకులందురు. వీరుభక్తిని ఉపాయముగా భావింతురు. వీరలకు
గీతలలో "జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్ కురుతే"
(జ్ఞానమను అగ్ని ప్రారబ్ధేతరకర్మల నన్నింటిని భస్మీభూతము గావించును.)

బ్రహ్మసూత్రము:- "తదధిగమ ఉత్తరపూర్వాఘయో రశ్లేషవినాశౌ"॥

అనుసటుల సంచితము జ్ఞానాగ్నిచే భస్మముకాగా ఆగామి నిష్కామ కర్మాచరణచే నంట కుండగ పోగా మిగిలిన పుణ్యపాపరూప ప్రారబ్ధము అనుభవించుటచే మాత్రమే నశించును ఆప్రారబ్ధము ఏశరీరానుభవముతో పూర్తియగునో అట్టి చరమ శరీరానవంతరమున మాత్ర మే ఆఉపాసకునికు మోక్షము సిద్ధించును.
ఇక ప్రపన్నునకో. అట్లుకాదు.

ఉపాయభక్తిః ప్రారబ్ధవ్యతిరిక్తాఘనాశినీ !
సాధ్యభక్తిస్తు సా హంత్రీ ప్రారబ్ధస్యాపి భూయసీ॥

(ఉపాయభక్తి ప్రారబ్ధమును నశింపచేయజాలదు. మిగత సంచిత ఆగామి రూప పుణ్యపా పాత్మక కర్మను మాత్రమే నశింపజేయును.

మరి సాధ్యభక్తి ప్రపత్తి యన్నదే. అది ప్రారబ్ధకర్మ ఎంత పెద్దదై యున్నను సరిమే తక్ష ణమే పూర్తిగా నశింపజేయును.)

గాన ప్రపత్తినిష్ఠుడైన వెంటనే ప్రపన్ననకు ప్రారబ్ధము పూర్తిగా భస్మమై పోవును. గాన అట్టివాని దేహావసానమందే తప్పక మోక్షము లభించగలదు.

ఛాందోగ్యోపనిషత్తులో షష్ఠప్రపాఠకము- ౬-౧౪.

"తస్య తావదేవ చిరం యావన్నవిమోక్ష్యే".

(యావద్- ఎంతకాలమువరకు ; నవిమోక్ష్యే- ప్రారబ్ధకర్మనుండి విడువడడో; తస్య - అట్టిఉపాస కునకు తావదేవ - ఆప్రారబ్ధకర్మనాశనమువరకు మాత్రమే; చిరం - ఆలస్యము. తన్నాశనానంత రము మోక్షము కలుగును.)

మధురకవి:- ఈప్రకృతి కర్మావసానము నుద్దేశించి చెప్పినదల కే కొంతమంది పెద్దలు వారి లటుల యభిప్రాయపడుటకైయెట్లు తటస్థించినదండి?

నమ్మాళ్వార్:- నాయనా ఏవాక్యమునకైన అర్థనిర్ణయము చేయవలసివచ్చినపుడు దాని పూర్వాపరపరిస్థితి సందర్భముల చక్కగా పర్యాలోచన జేయవలసియుండును. ఉపాసకుడు భక్తిని ఉపాయముగా అవలంభించును. గాన అట్టి సాధనభక్తి పక్వమైన గాని ఫలించదు. అది పక్వమగు టకు కొంత విలంబిన తప్పదు, అది ఫలించినగాని కర్మనశించదు. గాన ఉపాసకునికి ప్రారబ్ధకర్మ అనుభవించినగాని నశించదు.

ఎక ప్రపన్నున కన్ననో మొట్టమొదటనే తన సర్వభారమును సర్వేశ్వరునిపై నిడి తానకించ నుడై అగతికుడై నిర్భరుడై యుండును. అందుచే ఈతను చేయవలసినదేమియు మిగిలియుండదు.

ఇక ప్రపత్తి చేయవలసిన విషయమేది? అందుచే ప్రపత్తి ఫలించవలెను' అను ఆలస్యముండదు. మరియు ప్రపన్నుని భారము వహించిన సర్వేశ్వరుడు అశక్తిమంతుడు కానిచో విలంబమునకు హేతువుండి యుండును. అతడట్టివాడు కాడే.

అందుచే ప్రపన్నునకు ఈశరీరావసానమందే మోక్షము లభించుటలో మరి యాటంకమే మున్నది. నాయనా!

మధురకవి:- స్వామీ ఇలాగున ఎవరైన ఇదివరలో ప్రపత్తిజేసిన దేహావసానమందే మోక్షమును పొందిరో?

నమ్మాళ్వారు:- అయ్యో! అట్టివారు ఒకరు ఇద్దరుటయ్యా! అనేకమంది.

గరుడపురాణమున శ్రీరంగమాహాత్మ్యమున

శ్లో॥ అథాన్యా మాధవీ సాపి తప స్తప్త్వా సుదుష్కరం ।
భగవంతం ప్రపన్నా సా భగవంత మవాపసా ॥

మాధవీదేవి అతిదుర్లభమైన తపమాచరించి భగవంతుని ప్రపత్తిజేసెను. వెంటనే ఆ దేహావసానముననే తమో భగవంతుని సన్నిధిని చేరెను.

ముద్గలో పాఖ్యానమున చెప్ప లేదుటయ్యా?

"భగవన్నామశ్రవణమున ప్రపత్తినిష్ఠులైన నరకనివాసులు వెంటనే ముక్తులైరని"

మధురకవి:- ప్రభూ! ఈరహస్యమును సర్వేశ్వరుడు మాత్రమే యిప్పుడు వెల్లడించెనా? లేక ఇదివరలో ఎవరికైనను ఉపదేశించెనా?

నమ్మాళ్వారు:- ఇప్పుడుమాత్రమేకాదు నాయనా. ఇదివరలో అర్జునునకు గీతారూపమున కూడ ఈరహస్యమును వెల్లడించెను. భగవద్గీత. ౪. ౯.

జన్మ కర్మ చ మే దివ్యం ఏవం యో వేత్తి తత్త్వతః ।
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మా మేతి సోఽర్జున ॥

అర్జునా! నాజన్మము కర్మనిబంధనమైనదికాదు. అనుగ్రహ నిబంధనమైనది. నేచేయుపనులు, నేననుభవించు విషయములు కర్మనిబంధమైనవిగావు. కృపానిబంధమైనవి. ఈయథార్థమును ఎవడు సరిగా తెలుసుకొనగలడో అతడీ దేహమును విడిచిన పిమ్మట మరల జన్మించడు. నాసాన్నిధ్యమునే పొందును. భగవద్గీత. ౧౮. ౬౬.

సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః ॥

ధర్మములనన్నింటియందును ఉపాయబుద్ధిని పరిత్యజించి నన్నొకనినే రక్షకునిగా నాశ్రయింపుమా! నేను నిన్ను సమస్త పాపములనుండియు = (ప్రారబ్ధకర్మనుండియు కూడ) విడిపింతును. దుఃఖించకుమా!

మధురకవి:—అయితే స్వామి! మకొక్క సందేహం బాధించుచున్నది. దానిని దేవరవారు తీర్చాలి. ప్రపత్తి చేసినవెంటనే భగవత్ప్రాప్తి కలుగవలెనుకదా! 'విరోధిని పోగొట్టి నీ శ్రీపాదములకేర్పుకొనుమా' అనికదా ప్రపన్నుడు కోరునది. వీనికి దేహసంబంధము విరోధికదా. అయినను ప్రపత్తి చేసిన ప్రపన్నునకు కూడ దేహావసానమువరకు ఉండవలసియే కనుపించుచున్నదే. ఈ మధ్యకాలానుభవము కర్మశేషముచేతనే అనికదా అనవలెను. కర్మశేషముచేకాదు సర్వేశ్వరుని సంకల్పముచే అని అనినచో ప్రపత్తి చేసినా దుఃఖమనుభవింపజేయును. అని భగవంతునియందు నైర్ఘృణ్యరూపదోషారోపణ చేసినట్లు యగును. మరియు "ప్రపత్తి చేసిన వెంటనే వాని విరోధిని పోగొట్టి వెంటనే మోక్షమునకు గొనిపోవుదును"ను ఆయనప్రతిజ్ఞకు భంగము కలుగును. గనుక అటుల అనుటకూ వీలు లేదు.

ప్రపన్నునకుకూడ ఆ దేహావసానము వరకు కర్మవశ్యులకువలెనే సుఖదుఃఖాద్యనుభవము తప్పుటలేదు. ప్రపన్ననకుకూడ ఈ దేహావసానమువరకు మాత్రమేనైనను కర్మవశ్యత్వం తప్పదనెదరా— ప్రారబ్ధకర్మానుసారమువరకుకూడ ఏదోవక దేహధారణముండును. దాని నాశనానంతరము మాత్రమే మోక్షము లభించును" అనినచో మాత్రం దోషమేమి?

నమ్మాళ్వారు:— ప్రపత్తి చేసినవెంటనే మోక్షమివ్వక ఆ దేహావసానంవరకు ప్రపన్ననికి దేహసంబంధముంచడం నిజమే. కాని నీ వనుకొనునటుల ప్రపన్నునకు ఇది కర్మనిబంధనమైనదికాదు. భక్తునకుమాత్రమే దేహసంబంధము కర్మనిబంధనమైనది. మరి ప్రపన్ననకెందువల్ల దేహసంబంధముంచడమువా?

దానికి కారణములు వేరు:—

౧. ప్రపత్తి చేసిన వెంటనే దేహసంబంధమునుకూడ లేకుండజేసినచో లోకములో వీని విషయమై భయము వ్యాపించి ప్రపత్తి జేయు మనిషే యిక యుండడు.

౨. భీష్మునికి కాలము తీరినను, మరికొంతకాలముంచుటచే ఆయనద్వారా అనేకధర్మములు లోకమునకు వెల్లడించబడి లోకోద్ధరణ జరిగెను. అటులనే ప్రపన్ననికికూడ వెంటనే దేహవియోగము చేయకుండగ నట్టిపెట్టుటచే ఆయనద్వారా ఎన్నో రహస్యవిషయములు లోకమున నుపదేశింపబడగలవు. మరియు ఆయన యనుష్ఠానము ఎందరికో ఆదర్శప్రాయమై వారి నుద్ధరించగలదు.

౩. ఈ శరీరము ద్వారానేకదా ఈతను ప్రపత్తి జేయ గలిగెను. ఈ శరీరమును మనకిచ్చుటలో ఉపకరించిన

ఈశరీరమును వెంటనే పోఁడవనివ్వకూడదు.” అని సర్వేశ్వరుడే కృతజ్ఞతాబుద్ధిచే ఈ దేహసంబంధమును తానే నశింపజేయవలెను.

మధురకవి:- ఓహో. అట్లాగా. పోనివ్వండి దృప్తప్రపన్నుని విషయమై అటులనే కానివ్వండి మరి ఆర్తప్రపన్నునికేల యుండవలెను. ఈ దేహసంబంధము?

నమ్మాళ్వార్లు:- ఆర్తప్రపన్నుడు ప్రపత్తిచేయునపుడుకూడ “ఇప్పుడే విరోధినశించి నీతిరువడిఘళ్ళను పొందవలెను. అని త్వరపడునని చెప్పుటకవకాశము లేదు. అంతేకాదు. ఎంతోకాలము నుండి అలవాటు పడిన దగుటచే ‘దానిని తక్షణమే విడువుమూ’ అనిఅన్నను వెంటనే సమ్మతించను జాలడు.

వీడు కోరునదెల్ల మరొకశరీరపరిగ్రహము లేకుండ జేయుమూ? గర్భవాసదుఃఖము లేకుండ జేయుమూ అని మాత్రమేకదా. ఈతని కోరిక ననుసరించియే భగవంతుడుకూడ అనుగ్రహించను. వీనికే శరీరమందు చాపల్యముండునా, ఈనాలుగురోజులు యిచ్చటనే యుండనీ అని భగవంతుడూరకుండును.

మధురకవి:- అయితే ఆర్తప్రపన్నునికి ఈనాలుగురోజులైనను యితరులవలె ఆధివ్యాధులు లేకుండగను, అత్యధిక సౌఖ్యవంతుడుగాను యుండునటుల చేయవలదా? మామూలు సంసారులవలె ఏదైన నష్టము, కష్టము, సంభవించినపుడు శోకించుచుకున్న, ఏదైన లాభము కలిగినపుడు సంతోషించుచున్న వీలగునట్టులను ఏల వీని నుంచవలయును?

నమ్మాళ్వార్లు:- ఈప్రపన్నుడు కోరునది “ఈవిరోధిని పోగొట్టి నీసాన్నిధ్యము ననుగ్రహించుమూ” అనిమాత్రమేకదా. ఈశరీరసంబంధము నీచమైనదని వీనికి తెలిసియున్నను వెంటనే విడువజాలని వీడు ఈశరీరసంబంధమును అత్యంతసుఖకరమైనదిగ యుంచినచో ఇదే బాగున్నది. ఇంకా కొంతకాలము ఈశరీరసంబంధముండనీ” అని అనుకొనును కదా.

2. వీనియొక్క యభిప్రాయానుసారమే యుంచినచో యింకను మరియొక శరీరమందు వీనికి కోరికకూడ కలుగవచ్చును. కనుకనే హితపరుడైన భగవంతుడు ‘వీడున్నటులనే యుండనీ’ అని ఊరకుండును.

దీనివలన అలవాటైన ఈశరీరము తనంతట యదియే నశించి, మరియొక శరీరమందు వీనికి కోరికపుట్టుటకు ముందుగనే సర్వేశ్వరుడు వీనిని తన సాన్నిధ్యమునకు చేర్చుకొనుట కనుకూలముగ నుండును.

౧. అలవాటైన శరీరమూ, తనంతటతానే నశించిపోవును.

౨. ముందురాబోవునది తెలియకపోవుటచే దానియందు కోరికయూ యుండదు.

౩. ఈశరీర భాదానుభవముచే ఇది నీచమైనదను నిశ్చయముండుటచే, దీని యుదాహరణనే మనోగ్లానియందు కూడ భావించును,

అట్టి చివరిదశలో సర్వేశ్వరుడు వీనిని తనసాన్నిధ్యమున చేర్చుకొనును.

మధురకవి:- సత్త్వగుణ ప్రభోదదశయందు ఈదేహసంబంధమును నశింపజేయుచూ, అని యన్నను చరమ దశలో వీడు ఆటంకపరచినచో?

నమ్మాళ్వార్లు:- నిజమే గాని ఎప్పుడో ఒకప్పుడు దేహసంబంధమును నశింపజేయగోరెను. కదా. ఆయనకామాత్రమే చాలును. వీడు అంతిమదశలో కాష్ఠపాషాణ సన్నిభుడై ఆటంకపరచ జాలకయున్న సమయములో ఇదివరలో వీడు ప్రార్థించిన ప్రార్థననే నిమిత్తముగా గొని భగవంతుడు వీనిని రక్షించును.

మధురకవి:- శ్లో॥ యం యోగినః ప్రాణవియోగకాలే ।
యత్నేన చిత్తే వినవేశయంతి ।
స తం పురస్తా ద్ధరి మీక్షమాణః ।
ప్రాణాన్ జహూ ప్రాప్తఫలో హి భీష్మః॥

(ప్రాణవియోగకాలమునందు తమచిత్తమందు ధ్యానించు ఆ హరిని భీష్ముడు తనయెదుట సాక్షాత్తుగ దర్శించుకొనుచు ప్రాణముల విడిచి విష్ణుసాన్నిధ్యమును పొందెను.)

అని మోక్షసిద్ధికి అంతిమస్మృతి అపసరము కదా స్వామీ!

నమ్మాళ్వార్లు:- అవును. నిజమే. గాని కొద్దిపొరపాటుకూడ పడితివి. ఫలసిద్ధికి అంతిమస్మృతి అవసరమే. కాని వీడే అంతిమస్మృతి కలిగియుండవలశినది యితరుల విషయముననేగాని ప్రపన్నునకు గాదు. ప్రపన్నుడు ప్రపత్తిచేయునపుడే తన యావత్తు భారమును, తను చేయవలశిన కృత్యముల నన్నింటిని భగవంతుని మీదనే యుంచి యున్నాడు. గనుక అత నింక చేయవలశిన దేమియు లేదు. అన్నిపనులను ఆభగవంతుడే జేసుకొనును.

ఈ అంతిమస్మరణను కూడ ఆయనే స్వయముగ జేసుకొని ఈప్రపన్నుని తన సన్నిధికి గొని పోవును. ఈసంగతిని ఆయనే ప్రతిజ్ఞారూపమున పలికియున్నాడుగదా.

వరాహపురాణమున:-

స్థితే మనసి సుస్వస్థే శరీరే సతి యో నరః ।
ధాతుసామ్యే స్థితే స్మర్తా విశ్వరూపం చ మామజం॥

★ గతసంచిక తరువాయి




### కామము

కామముఅనగా కోరిక. దానినే వాంఛయని కాంక్ష అందురు. మన ఈజన్మకు కారణము కామమే. తెల్లవారినది మొదలు పరుండు వరకు మనము అనుభవించు అన్ని బాధలకు ముఖ్య కారణము కామమే. కామము లేనివాడు భగవత్సమానుడు. కామమను మహాదుర్వారశక్తియే మానవుని ద్విపాదపశువుగా చేయుచున్నది. కామమునకు లోబడితిమా యుక్తాయుక్త పరిజ్ఞానము దేహారోగ్యము, కీర్తి సౌఖ్యము, ధనము నశించును. పరుల హేళనకును, పలువ్యాధులకును పాల్పడి అకాలమృత్యువునోట పడవలసివచ్చును.

ఆత్మసుఖమునను భవించు మనుజులు విషయసుఖములను కోరరు. విషయములు: ఇంద్రియములచే ననుభవించబడు ప్రకృతిపదార్థములు. విషయములు విషమువంటివి. విషయసుఖముల నెడి వేశ్యను పెంపొందించినచో సంసారమను ఘోరారణ్యము మధ్యమందు విడిచిపెట్టబడును. కామమును ఆలోచనచే మాత్రమే జయించవచ్చును. కాన కామోద్రేకము కలిగినప్పుడు, అందువలన కలుగబోవు ఫలితముల గురించి బాగుగా ఆలోచించుము. మానవశరీరము అతి హేయము. ఎముకలు, మాంసము, కొవ్వు, రక్తము, చీము, మలము, మూత్రము మొదలగు వానిలో నిండిన అశాశ్వతపు తోలుబొమ్మయని జ్ఞాపకముంచుకొనుము. మోహము భయంకరమగు అగ్నిజ్వాలవంటిది.

పటమునందైనను స్త్రీల సౌందర్యమును పరిశీలించకుము. శృంగార గ్రంథముల జదువకుము. నీయొక్క అక్కచెల్లెండ్రను, తల్లియు, స్త్రీలను అవమాన పరచుచుండినయెడల నీవు ఏ స్త్రీవిషయమై పాపపు తలంపుల మనస్సున రానీయకుము. స్త్రీలను, తల్లులు, అక్కచెల్లెండ్ర వలెను, పురుషులను తండ్రులు అన్నతమ్ముల వలెను భావించుము. రహస్య స్థలములయందు గాని, వంటరితనమునగాని, పరస్త్రీలతోగాని, పరపురుషులతోగాని సంభాషించకూడదు. కామోద్దీపనకరములగు నాటకములు, సినిమాలు చూ

న్నగునవి చూచుట మానుకొనవలెను. మనస్సును, శరీరమునుకూడ సదా ఆరోగ్యకరములగు వ్యాపారములలో పెట్టవలెను.

చెడుతలంపులు కలిగినపుడుగాని, కామోద్రేకము కలిగినపుడుగాని, దుస్స్వప్నములు కలిగినపుడుగాని రోగి గాకుండయున్నచో వెంటనే చన్నీళ్ళలో స్నానమాచరించవలెను. నేను అహంకార మమకార రహితుడనుగాను, జితేంద్రియుడనుగాను ఉండునటుల అనుగ్రహించుమా యని ప్రతిదినము అవకాశమున్నన్ని పర్యాయములు భగవంతుని ప్రార్థించుచుండుము. 12 సంవత్సరములు మనోవాక్కాయ కర్మలచే బ్రహ్మచర్యవ్రతమును నిష్ఠగా జరిపినవానికి బ్రహ్మతేజస్సు కలుగును. దాని ద్వారా వాడు సాధించజాలని కార్యమొక్కటియు ఈలోకమున లేదు.

ఓర్పుకలవాడే బలము గలవాడు.

మనయందలి క్రోధమే మన ప్రబలశత్రువు. క్రోధమే మనలను ఇతరులకు స్వాధీనపరచును. ఇతరులచేత మనకవమానము కలుగజేయును. దీనివలన మనస్సు కలతచెందును. ఇది మంచి, చెడ్డలను ఆలోచించుజ్ఞానము నశించును. దేహమందు రక్తము వేడెక్కి విషరూపముగా మారి అనేకరోగములు త్పన్నమగుటకు కారణమగును చిత్తచాంచల్యము, పిచ్చి, మూర్ఛ, రక్తవమనము ఒకొక్కప్పుడు చివరకు మరణముగూడ సంభవించును. క్రోధమువలననే ఆత్మశక్తి నశించును. సౌఖ్యముశూన్యమగును. క్రోధమువలననే మోహము, దాని వలన సర్వనాశనము కలుగును. క్రోధముకంటె పాపము వేరేలేదు క్రోధము కలవాడు మహాపాపి. నీవు కోపమను శత్రువునకధీనుడవు గాకుండుటకై తలచుట అభ్యసించుము.

1. ఏదోషము, లేనివాడే కోపింపబడ తగనివాడు నాయందనేక దోషములు కలవు గావున నేను కోపింపబడ తగదుఅని శాంతింపుము.

2. మనలను కోపించువారు మనదోషములను వెల్లడించుచున్నారు. వానిని మనము దిద్దుకొనవకాశము కలుగజేయుచున్నారు. గాన వారు మనకు ఉపకారకులు, పూజ్యులు.

3. మనలనుకోపించువారు మనమంచికొరకై వారి అమూల్య మనశ్శాంతికిని, ఆత్మశక్తిని కోల్పోవుచున్నారు. గాన వారి విషయమై మనము సానుభూతిని కలిగి కృతజ్ఞత చూపవలెను. కాని మనముకూడ అట్టి ఆత్మవినాశకరమైన కోపమునకు స్వాధీనమై యితరుల సానుభూతికి గురికాకూడదు.

4. అన్నిటికంటె అధికక్లేశమను, నష్టమును కలుగజేయు కోపముపై ఏల కోపమురాకూడదు అని నీ మనస్సున ప్రశ్నించుకొనుము.

5. ఎప్పుడైన నీకు కోపమువచ్చిన 1, 2, 3 అని 30 వరకు లెక్కించి అటుతరువాత జవాబు చెప్పుము.

6. మనము పూర్తిగా నిర్దోషులమై యున్నప్పుడు ఎవరైన నీపై నిష్కారణముగ కోపించినచో తిర్గి వారిపై కోపించకుము. కోపించినచో మన మశక్తులము పనికిమాలిన వారలము అని వారనుకొనిన అనుకోని మనముగూడ కోపించి

తిమా మనము వారికి లొంగిపోయిన వారమగుదుము. దోషులమే యగుదుము. క్రోధము క్రోధముచే ఎన్నటికినీ జయించబడదు. క్రోధము శాంతముచే మాత్రమే జయించబడును. కనుక సంపూర్ణ వినయవిధేయతలతో నీనిర్దోషత్వము శాంతముగ తెలియపరచుము అప్పటికీ ఎదుటివాడు సరియైనమార్గమునకు రానిచో మౌనము ధరించుము. వాని క్రోధమునకు ఏదీలక్ష్యము లేకపోవుటచే వానిశక్తి వ్యర్థమై గాలిలో కలసిపోవును.

నీకెంత అయిష్టుడైనను సరే, ఎంతటి అపకారియైనను సరే న్యాయమగు నీ సహాయము కోరి నీవద్దకు వచ్చినప్పుడు నీకవకాశ మున్నంత వరకు వారికి సహాయము చేసిపంపుము. లేకున్న మంచిమాటలు చెప్పి పంపుము. గానివిపరిస్థితుల యందు గూడ పరుషములాడుటగాని దూషించుటగాని కూడదు.

12 సంవత్సరములు మనోవాక్కాయ కర్మలచే కోపమును లొంగకుండయుండిన నీకు ఎంతటి క్రూరమృగమైనను లొంగియుండును. వాటి క్రూరత్వము నీపై ప్రేమగ మారును.

## లోభము.

పూర్వజన్మమందు మనప్రవర్తన ననుసరించి భగవంతుడు ఈజన్మమందు కొంతజ్ఞానమును, ధనమున్ను, శక్తిని మనకిచ్చి మనను వాటి వినియోగమునకు ధర్మకర్తలుగ జేసెను. యుక్తాయుక్తముల నాలోచించి మన స్వాధీనములో యున్న జ్ఞానమును, ధనమును, శక్తిని మనము ఖర్చు చేయుచుండవలెను. అవసర, అవకాశక సమయములందు కూడ అట్లు ఖర్చుచేయకుండగ వ్యర్థముగ దాచియుంచుట లోభమనబడును. లోభము వహించుట యనగా భగవదాజ్ఞను ఉల్లంఘించుట అగును. అందుచే లోభము మహాపాపము. లోభమునకు ఫలితము అజ్ఞానియగుట, దరిద్రుడగుట, శక్తివిహీనుడగుట యున్ను;

లోభి తాను తినలేడు. ఇతరులకు పెట్టలేడు. కాన లోభియొక్క జ్ఞాన ధనశక్తులచేత ఎవ్వరికీ ఏవిధమైన సౌఖ్యమూలేదు. సుఖము కలిగింపజాలనివి లేకున్న లోపమేమి? అవి ఉన్నచో వాటిని జాగ్రత్త పెట్టుటయందు బాధమాత్రము అధికమగును. లోభిని ఎవ్వడూ మనసారప్రేమించడు. ఈదేహము క్షణభంగురము. ఎప్పుడో ఒకప్పుడునశించకతప్పదు. దేహావసానకాలమందు ఎంతఏడ్చినను ఎంతబాధపడినను ఒక చిల్లిగవ్వనైనను వెంట తీసుకొని పోవుటకు వలనుపడదుగదా! ఇతరుల మెప్పునకై ఇతరుల సౌఖ్యమునకై మన మేలపీటిని నిలువచేయుటలో బాధపడవలెను. కాన ఈలోభము మనవ్యాధికి దానము-ధర్మము అను ఔషదములను ప్రయోగించవలయును. తగిన వారికి మనశక్తికి తగినటుల చదువుచెప్పుట చెప్పించుకు, సలహాలనిచ్చుట, అన్నవస్త్రము, ఉదకము ద్రవ్యము మొదలైన విచ్చుచుండుట, ఉపకారములు చేయుచుండుట చేయుచుండవలెను.

[ సశేషము.






శ్రీమతే రామానుజాయనమః

# మన సాధనము

శ్రీమతి గొట్టుముక్కల లక్ష్మీరంగనాయకమ్మగారు, తంగడుపల్లి.

---

నిర్గుణమైన భగవత్ స్వరూపమును వ్యష్టీకృతమై స్థావరజంగమాత్మకమై, దృశ్యమగుటయే సృష్టియనబరగు, ఈసృష్టికి జన్మభంగస్థేమములుయే విశేషతత్వము వలన జరుగుచున్నవో; దానినే. పరమాత్మయందురు. అట్టిపరమాత్మ తత్వమందే సకలజీవ సముదాయములు యెల్లకాలమున్నను పాంచభౌతికమైన ప్రకృతి యందున్నంతకాలము దుఃఖభ్రాంతిని; దానినుండి విడువడగనే సుఖానుభూతిని పొందుచున్నారు, అట్లు విడువడుటయే మోక్షము. ఇట్టి మోక్షస్వరూప నిర్ణయమునందు త్రిమతాచార్యులకు ఎట్టిభేదాభిప్రాయమున్ననూ మోక్షసాధనకు జ్ఞానమే మూలసాధనమను విషయముపట్ల వారికి భేదాభిప్రాయములేదు— అట్టి జ్ఞానస్వరూపమును ప్రామాణ్య గ్రంథమైన శ్రీభగవత్ గీతలో సంక్షిప్తముగ చెప్పియున్నారు. క్షేత్రక్షేత్రజ్ఞ విభాగ యోగమున 8వ శ్లోకము మొదలు 12వ శ్లోకము వరకూ)

శ్లో॥ అమానిత్వం మదమ్భిత్వ మహింసాక్షాన్తి
రార్జవమ్. ఆచార్యోపాసనం శౌచస్థైర్యమా
త్మవినిగ్రహః

శ్రీమానిత్వమను పదమున కర్థము, పరుల మన్ననల కపేక్షింపకుండుట, ఇట్లు పేక్షింపని వారికి శ్రీశుకులు. తార్కాణము. ఆనాడు పరీక్షిన్ మహారాజుకు మోక్షవిద్య నుపదేశింప నరుగు కాలమున శుకుని బాలురును యజ్ఞానులగు పామరులును, పిచ్చివానిగాను, భావించి హేళనములను జేయమొదలిడిరి. వానికి. శుకుడావంతయు వైక్లబ్యము జూపింపక, పరీక్షితుడున్న పండిత గోష్ఠి కేగెను. అచట శుకునికంటె వయస్సుగల వశిష్ఠాది మహర్షులు యేవస్మందియు లేచి నిలచి శుకునకు ప్రత్యుత్థానాది సత్కారములాచరించి.

సత్కారములనుగూర్చి ఘనునియందావంతయు మార్పు కలుగలేదు.—అదాంభిత్వ మన,(దంభ) ప్రదర్శనములేని భగవదధ్యవసాయమని అర్థము, దీనికి తార్కాణము జడునివలెనే జీవితము అంతరంగమున ధృఢతరభగవదనుసంధానమున్నను, పైకి జడుని విధముననూ, మూఢుని విధముననూ కాన్పించును, లేశమాత్రదంభమైన లేకుండెను.

అహింస యనగా: తనవలన పరశరీరధారికి లేశమాత్రపు హింసనయిననూ కలిగింపకుండుట, క్షాంతియన (ఓరిమి) పరులవలన తనకు యెంత పీడ కలిగినను వారిని సహించి క్షమించుట అర్జవమన ఋజుభావప్రదర్శనము. అంతరంగముగల భావములనే బాహ్యమునకు ప్రదర్శించుటయే ఋజుప్రవర్తనము ఇట్టి పైమూడు లక్షణములకు ప్రాతిత సంపన్నులైన పూర్వపురుషుల ప్రవర్తనయే తార్కాణము, ఆచార్యోపాసనమనగా, ఆధ్యాత్మజ్ఞాన ప్రదానముజేయు గురువును భగవత్సమానునిగా నుపాశించుట. దీనిని దృష్టాంతర పురుషులు, మన పూర్వాచార్యులు, శౌచమనగా పరిశుభ్రత, ఇది అంతఃశౌచము, బాహ్యశౌచము, అని రెండువిధములు, స్థైర్యమన చలనములేని స్థిరస్వభావము కలిగియుండుట, అనగా పరమాత్మసాధనపట్ల విసుగులేని ప్రయత్నము, ఆత్మనిగ్రహమనగా తానింద్రియవశుడుగా నుండుటయు, తన మనస్సును ఇంద్రియవిషయముల కందకుండ నుంచుటయున్ను. ఈపై రెండులక్షణములకును మన పూర్వులయిన భాగవతులే తార్కాణము.

శ్లో॥ ఇంద్రియార్థేషు వైరాగ్య ... ... ... యుదతోన్యథా అని,—ఇంద్రియవిషయములన, కర్మేంద్రియ జ్ఞానేంద్రియములుచేయు లౌకికవ్యాపనులు. వానిపట్ల వైరాగ్యమని ఆసక్తిలేకుండుట, అహంకారమనగా సర్వకర్మలకూ కర్తృత్వసిద్ధి తనదిగా భావించుట అట్లు భావింపక, కర్తృత్వము తనకు లేదనుకొనుటయే పుట్టుక చావు, ముసలితనము, రోగము, వీనియందలి దుఃఖమును చూడగల శక్తియు భార్యాపుత్రాగారములయందు ఆసక్తిలేమియు, వానిసాంగత్యము పట్ల నుపేక్ష కలిగియుండుటయు, ఇష్టానిష్టములపట్ల మోదఖేదముల నొందకుండుటయు, పరమాత్మ విషయమున యేకోపాసన కలిగియుండుటయు ఏకాకిగానుండి భగవదను సంధానము చేయుచుండుటయు. జనసామాన్యము యొక్క సంఘములయందు అనురక్తివీడుటయు నిరంతరము నిత్యానిత్యవివేకము కల్గి ధ్యానానుసంధానము చేయుచుంటయు జ్ఞానము యొక్క ప్రధాన లక్షణములయు వీనికి ఈమనాళిత్రి భేదమున్నను, నది జ్ఞానముకాదనియు, చెప్పబడినది, గాన,నను భితిలేకుండుటకై మన పూర్వాచార్యులు, ధ్యానానుసంధానమును క్షణము చేయుచుండుటవలన ధృఢతరజ్ఞానము లభింపగలదని నిర్దేశించిరి, అట్టి నిరంతర ధ్యానానుసంధానమువలన తరింతుము గాత, యని ప్రార్థన చేయుచు యింతటితో విరమించుచున్నాను.

# "యజ్ఞమూర్తి"

అను

## అరుళాళపెరుమాళెంబెరుమానార్

శ్రీమతి మరింగంటి రంగనాయకమ్మగారు

ఒకనాడు యజ్ఞమూర్తియను పేరుగల ఒక బ్రాహ్మణ విద్వాంసుడు గంగా స్నానముచేసి అచ్చటనున్న విద్వాంసులనెల్ల జయించి యచ్చటనే మాయావాది సన్యాసాశ్రమమును స్వీకరించెను. ఆతడు శిష్యబృందముచేతను విద్యచేతను మిక్కిలి గర్వించి యుండెను. ఇట్లుండ ఒకనాడాతడు ఉభయవరుల వైభవమును విని వారి యొద్దకు వచ్చి వారితో తర్కింపవలెనను సంకల్పముగల వాడాయెను. ఆమరునాడే తాను మోయగలిగినంత బరువుగల శాస్త్ర గ్రంథములను కట్టలు కట్టుకొని వచ్చి తన విద్యాగర్వమెల్ల తెల్లమగునట్లు భాష్యకారులతో నిట్లు భాషించెను.

'రామానుజా! నీవు నాతో వాదించవలెను. అందు నేనోడినచో నేను మీపాదరక్షలు మోయుచు మీ పేరుపెట్టుకొని మీసిద్ధాంతమందే ప్రవర్తింతును. మీరోడిన నేమిచేయుదురు?' అని అందులకు శ్రీభాష్యకారులు

'చెప్పుటకేమున్నది? నేనే ఓడితినేని గ్రంథసన్యాసము గావించి నాయోటమిని ఒప్పుకొందును;

ఇట్లన్యోన్య ప్రమాణములు గావించుకొని పదునెనిమిది దినములు గడువుపెట్టుకొని మత్తగజంబులరీతి నొకరితో నొకరు తర్కింపమొదలిడిరి. ఇట్లు పదునారు దినములు గడచెను. పదియేడవ దినమున యజ్ఞమూర్తి యొక్క యుక్తి ప్రబలమాయెను, ఉభయవరుకుపై యుక్తితో చక విచారగ్రస్తులై మఠమునకు వేంచేసి తమ తిరువారాధనరూపముగు పేరరుళాళపెరుమాళ్లకు ఆరాధన సమర్పించి వారిపై కోపించిన వారై ఇట్లు పల్కదొడంగిరి.

పెరుమాళ్! ఆళ్వారుముదలు ఆళవందారు పర్యంత మింతకాలము దేవర వారి యొక్క స్వరూప రూపగుణ విభూతులు సత్యమనెడు ప్రమాణప్రసిద్ధముగ ప్రవర్తింపజేయబడుచున్న ఈదర్శనమును నేడు నాకాలమున నొకమాయావాదిచే ప్రతిఘటింప జేయబడుట లీలా సంకల్పము నీకు జనించెనా? అట్లైనచో కానిమ్మని విన్నవించి నిరాహారదీక్షతో శయనించియుండ, వారికి పెరుమాళ్ళు స్వప్నమున సేవసాయించి రామానుజా! మీరట్లు నాపై కోపింపనేల? మీ

కొక సమర్థుడగు శిష్యునిచ్చియుంటిని. మీకు పరమాచార్యులగు ఆళ్వందారు సాయించిన మాయావాదఖణ్డనముచే వానినిజయించి స్వాధీన పరచుకొనుడు. అనిసాయించిరి.

అంత రామానుజులు మహాశ్చర్యభరితులై తెల్లవారగనే లేచి ఆస్వప్నమునే స్మరించు కొనుచు మిక్కిలి సంతోషముతో తర్కగోష్ఠికి వేంచేసిరి. ఆనాడువారి గాంభీర్యమును జూచి భావజ్ఞుడగుటచే యజ్ఞమూర్తి యిదియతిమానుష చేష్టితమనిభావించి వారికి నమస్కరించి 'మీకు ఓడితిని మీపాదరక్షను శిరసాధరింతు' ననినుడివిరి అంత ఉడయవరులు వాదించక గెలుచుట ఎట్లని యాతనికి దిటముగ కొన్ని యుక్తులను వినిపించి యాతనిచే గౌరవింపబడి యాతనిని శిష్యునిగా నంగ్రహించి అరుళాళప్పెరుమాళ్ ఎంబెరు మానారులని తిరునామము నుంచిరి.

ఆయుక్తులేవియనిన:—

మీరు బ్రహ్మకు గుణములు లేవన్నచో ఆ బ్రహ్మకు సత్యత్వాదిగుణములు కలవని చెప్పెడు వేదవాక్యముల ప్రమాణములు కావలసి వచ్చును.

బ్రహ్మవాస్తమునకు నిర్గుణుడే. అయినను అవిద్యా తిరోహితుడగుటచే గుణములున్నట్లు భాసించుచున్నది. కావున అట్టి ఔపాధిక గుణ ములు బ్రహ్మకు కలవని బోధించుటచే సగుణ శ్రుతులు ప్రమాణములే యగుచున్నవందురా? అట్లనరాదు. అవిద్యయనగా అజ్ఞానము, ఇది జ్ఞానముచే బంధింపబడి నశించును. బ్రహ్మజ్ఞాన స్వరూపుడు. అట్టిజ్ఞానస్వరూపుని యీయవిద్య యెట్లు ఆక్రమించును.? అట్లు ఆక్రమించుటయే యంగీకరింపబడెనేని ఇకయీఅజ్ఞానమును నశింప జేయునదేది? కావున నది నిత్యమేకావలసియుం డును. ఇట్లు నిత్యమైనచో అవిద్యయు, బ్రహ్మయు రెండును నితువస్తువులు కావలసివచ్చును. దీనిచే నద్వైతమునకు భంగమువాటిల్లును.''ఇత్యాదులు

అంత నా యజ్ఞమూర్తి ఆ తిరునామమును ధరించి ఉడయవరుల ప్రసాదించిన ఒక పెద్ద మఠమున నుండి విశిష్టాద్వైతసిద్ధాంత రహస్యము లను శిష్యుల కుపదేశించుచు సుఖముగ కాల క్షేపమును గావించుచుండ నొకనాడు యిరువురు శ్రీవైష్ణవులు శ్రీరంగమునకు వచ్చి వీధిలో కొందరిని యెంబెరుమానారుల మఠ మెచ్చట యని ప్రశ్నించగా 'వారే యెంబరుమానారు' లని యుడిగిరి. అది విని వారు యీదర్శనమున కిద్దరు ఎంబెరుమానారులున్నారా ?యని ప్రశ్నిం చిరి. అంతటవారు ఔను! అరుళాళపెరుమాళ్ ఎంబెరుమానారులున్నారని చెప్పగా ఆవైష్ణ వులు వారిని మేమెరుంగము మేమే శ్రీభాష్య కారును గూర్చియే అడిగితిమనిరి. అంతవారికా గ్రామస్థులు ఉడయవరుల మఠమును జూపిరి. ఈ సమాచారము క్రమముగ అరుళాళప్పెరు మాళకు తెలిసి అత్యంత వ్యాకులచిత్తులై ఉడ యవరుల సన్నిధికి జరిగిన సమాచారమంతయు సవిస్తరముగ తెల్పి దాసుడు దేవర్లకు ఎదురై అనర్థపడుట తగునా? దాసుని నీడవలె మీతిరు వడి క్రింద చేర్చుకొని నిత్యకైంకర్యానుభవ మును కలుగచేయవలెను అని ప్రార్థింప నాట

నుండియు ఉభయువరులు వారికి ఉజ్జీవనాధార మగు సమస్తార్థములను ప్రసాదించిరి.

ఇందలి సారమేమనగా:— 'శరణాగతి తన్ధ తన్నిలైవన్ తాళ్ అరణాగు' మున్ను, శరణాగతిని తెలిపిన ఆచార్యుల తిరువడిగళ్లే తనకురక్షక మగు కోట యనయు,

'తేనాల్ కమల త్తిరుమామగళ్ కొళునన్ తానే గురువాకి' మకరంద పూర్ణమగు పద్మ పుత్రిక భర్తయగు సర్వేశ్వరుడే ఆచార్యుడై యవతరించెననియు మొదలగు ప్రమాణములను బట్టి సచ్ఛిష్యునకు సదాచార్యులే పరదైవమనియు సర్వజ్ఞులైన ఆరుళాళపెరుమాళ్ సాయించిరని మన జీయరు సాయించిరిగాన మనముకు అట్టి అధ్యవసాయము కరవారమై ఆచార్యుల నాశ్రయించి ఉజ్జీవించవలెను.



శ్రీమతే రామానుజాయనమః

# తస్మిన రామానుజార్యే గురురితిపదం నాన్యత్ర

---

శ్రీమతి గొట్టిముక్కల వెంకట లక్ష్మీరంగనాయకమ్మగారు, (తంగుడుపల్లి)

గురు వనగా సంసారాంధకారము నుండి విడిపించి రక్షించువాడు అని అర్థము. అనగా పునర్జన్మరహితమగు పరమపదమును యిచ్చువారే పరిపూర్ణ గురువులనబడుదురు. కలియుగములో అట్టి గురువు లెవరు? భగవద్రామానుజుల వారొక్కరే అట్టి గురువులు. తదితరులు... గురువులే గాని మోక్షప్రదాతలగు, గురువులుగారు. ఆఖరికి భగవంతుడు కూడ అట్టి గురుశబ్ద వాచ్యుడు కాడు. దీనికొక అనుభవ పూర్వకమైన ఐతిహ్యము కలదు.

విశాఖపట్టణం జిల్లాలో సింహాచలమను దివ్యక్షేత్రముకలదు. అందు చిన్నకొండయు దానిపై శ్రీనృసింహస్వామి పెరుమాళ్లు గలరు. అది అతి పురాతనమైన మహా మహిమాన్వితమైన మహాక్షేత్రము. ఆక్షేత్రమున శ్రీ తాండవ కృష్ణమాచార్యగారు అను మహాభక్తులు లుండెడి వారు ఆయన గానవిద్యావిశారదులు. వారి కీర్తనల నిప్పటికి కూడ అధ్యయనోత్సవాదులలో కోవిలలో సేవింతురు.

ప్రతి దినము రాత్రి పెరుమాళ్లు ఆరాధన పూర్తియైన తరువాత వీరు వీణతో రాళ్లను సైతము కరగించు మాధుర్యముతో పెరుమాళ్లకు గాన సేవచేయుచుండెడి. వీరి పాటకు మెచ్చి భగవంతుడు స్వయముగ వచ్చి నృత్యము చేయుచుండెడివాడు. తనపై భగవంతునికి గల దయను జూచి ఈయన ఉప్పొంగిపోయి క్రమముగా గర్విష్ఠులై ఏ భాగవతోత్తములను గౌరవించకుండ యుండిరి.

ఒకనాడు భగవద్రామానుజులు-వారు యాత్రగా సింహాచలమునకు వేంచేసిరి. వారు యతీశ్వరు లగుటచే కోవిలలోనే, ఈశాన్యభాగమున గల హంసమూల మంటపమున వేంచేసి యుండి కాలక్షేపమును సాగించుచుండిరి. మామూలు ప్రకారముగ తాండవకృష్ణమాచార్యులు గారు వీణ ధరించి ఆమార్గమున వెళ్లుచు శ్రీ యతిరాజుల సేవించుకొనకుండగ నిర్లక్ష్యముగ వెళ్లిపోయిరి.

ఆ ప్రక్కనున్న స్వాములు వారిని హెచ్చరించిరి.

"స్వామీ వీరు జగద్గురువులు. వీరిని సేవించుకొనకుండ వెళ్ళకూడదు. అందును వీరు యతీశ్వరులు కదా. యతికి నమస్కరించ కుండగ వెళ్ళకూడదని పెద్దలందురు!

తాండవ.కృ:- వీరు జగద్గురువు లైన కావచ్చును. గాని నాకు వీరితో పనియేమి? సాక్షాత్తు భగవంతుడే నేను చెప్పినట్లు ఆడు

చుండగా ఈమానవ మాత్రుల తెక్కేమినాకు?

స్వామి:- అనుచు అయన పెరుమాళ్ళ సన్నిధికి వెళ్ళిపోయెను. ఈవిషయము భగవ ద్రామానుజులవారికి తెలిసెను. తన వద్దకు రాకపోతే పోయె గాని యింత జ్ఞాన భక్తి వైరాగ్యములు గలవారు. ఇట్టి భాగవత నిరాకరణ రూప అపచారముచే పాడగుచున్నారే. వీరినెట్లైన తరింపచేయవలెనని సంకల్పించుకొనిరి.

వారివద్దనున్న స్వామిని పిలిచి, నీవు వెళ్ళి శ్రీ తాండవ కృష్ణమాచార్యులు గారిని రామానుజులవారికి మోక్షమున్నదా? అది ఎప్పుడు వచ్చునో. శ్రీరంగనాథస్వామివారిని అడిగి. చెప్పమనుము, అని పంపిరి.

ఆనాటిరాత్రి గానసేవ అంతయు ముగిసిన పిమ్మట శ్రీకృష్ణమాచార్యులుగారు పెరుమాళ్ళను శ్రీరామానుజులగూర్చి అడిగిరి. "నాకు నీకు కూడ మోక్షమివ్వవలసినవాడు రామానుజుడే. ఆయనకు మోక్షమున్నదా యని ప్రశ్నేమిటి? అని పెరుమాళ్ళు సమాధానమిచ్చిరి.

తాండవ కృ:- మరినాకు మోక్షము కూడ ఆయనే ఈయవలెనా?

పెరుమాళ్లు:- సందేహమేమి?

తాండవకృ: - మరి యిన్నాళ్ళు మంచి నీ సేవచేసిన నేను కూడ ఆయనను ఆశ్రయించవలసినదేనా?

పెరుమాళ్ళు:- తప్పకుండగ

తాండవ కృ:- నాసేవ కేమియు ఫలితము

పెరుమాళ్ళు:- లేకేమి? నీవుపాడితివి. నేనాడితిని. నీపాటకు నాఆటకు చెల్లు.

అంత ఖిన్నులై శ్రీ తాం.కృష్ణమాచార్యులు గారు యింటికి జని మర్నాడు శ్రీరామానుజులు వద్దకు వెళ్ళిరి. వారు శిష్యులకు కాలక్షేపము సాయించుచుండిరి. నేను వచ్చానని చెప్పండిఅని శ్రీ తాం. కృష్ణమాచార్యులుగారు శ్రీరామానుజులకు కబురుపంపిరి.

"నేనుచచ్చినగాని వారిచ్చటకు వచ్చినందువల్ల లాభములేదని శ్రీరామానుజులువారు తిర్గి కబురంపిరి.

తాండవకృష్ణమాచార్యులుగారు దీనికిమరింత ఖిన్నులై యింటికిజని విచారములో ఉపవాసములో పరుండిరి. భార్యబ్రతిమాలగా జరిగిన సంగతి నాతను ఆమె కాయన తెలిపిరి.

వారి భార్య మహాపతివ్రతా శిరోమణి మంచి సాంప్రదాయజ్ఞురాలైన సాధ్వీమతల్లి. ఆమె జరిగిన చెప్పినదంతయు గ్రహించినది.

"స్వామి, శ్రీరామానుజులవారు జగద్గురువులు. ఉభయవిభూతి నాయకులు, చేతనోజ్జీవనార్థమై సర్వేశ్వరునిచే సర్వాధికారమును పొంది అవతరించిన ఆదిశేషులు వారిని మనమైపోయి సేవించుకొనవలదా? అట్టివారికి మనము దరము దాసులము కదా. వారివద్ద మనము 'అడియేన్' అనిగాని లేక "దాసుడు" అని గాని కదా అనవలెను. 'నేను అని అహంకారపడుట అపచార హేతువుకదా స్వామి? 'నేను' అను అహంకారము చావకున్నచో [illegible] లేదు కదా?

యున్నను గానటనే నిష్ఫలము గదా. అపరాధత్వమార్జనము వేడుకొందము. వారి కటాక్షము లేనిచో భగవంతునికే గతి లేదు. ఇక మనకా స్వామీ? అని కాంతా సమ్మతముగ బ్రహ్మాత్ సమ్మతముగ హితబోధ చేసెను.

ఇద్దరు శ్రీరామానుజులవారి వద్దకు వెళ్ళి అజ్ఞానము అపరాధముల క్షమించి కటాక్షించమని వారి పాదములపై బడిరి.

దయార్ద్రహృదయులగు శ్రీరామానుజులు వారిని లేవనెత్తి పెరుమాళ్ళకు మంగళాశాసనము చేయు మరియొక భాగవతోత్తములు దొరకిరి గదా యని సంతోషముతో వారి కటాక్షించిరి.

గాన రామానుజులే మనకందరికి ఉద్ధారకులగు గురువులు. వేరెవరూ కారు.

---

శ్రీమతే రామానుజాయనమః

# "రామానుజ రామానుజ రామానుజ"

శ్రీమతి నందూరి అనంతమ్మగారు.



ఇప్పుడే నా పాపాటు అయినది. శ్రీమతే రామానుజాయనమః అంటూ విశ్రమించ బో తున్నా ... ఇంతలో పొరగింటి తాయారమ్మ గారు వచ్చారు.

తాయారమ్మగారు:-ఏమండీ, అంతా 'రామా' 'కృష్ణా' అని స్మరించు కుంటూ ఉంటే మీరు ఎప్పుడూ 'రామానుజా' అంటా రే మండీ?

నేను:- అమ్మా 'రామానుజ' అని ఇదొక మహా మంత్రం లెండి. రామ-కృష్ణమంత్రముల బంధ మోక్ష ఉభయ హేతువులు గాని ఈమంత్రము కేవలము మోక్షైక హేతువు లెండి.

తాయా:- అబ్బా-అలాగునా? అంత మహిమ ఉందా దీనిలో?

నేను:- రామానుజ అనగా శ్రీరామచంద్రులకు తమ్ముడన్నమాట. ఆ అవతారములో వీరే వారికి తమ్ములై యుండి 'అహం సర్వం కరిష్యామి' అని అరణ్యములోను, పట్టణములోను, బాల్యంలోను-వృద్ధాప్యంలోను సర్వవిధకైంకర్యములను చేసిరి.

అలాగుననే ఈ అవతారలో 'శ్రీరంగనాథా నీకు సర్వవిధకైంకర్యములను చేయాలి. ఓనరదా నీకు నేను సర్వావస్థలలోను అన్నికై కర్యములను చేయాలి. అని తాము పెరుమాళ్ళకు

అన్ని కైంకర్యములను స్వయముగా చేయుటయే గాక "రామానుజార్య దివాజ్ఞా వర్ధతా మభివర్ధతాం" అని మనము కూడ నేటికిన్ని పేరుమాళ్లసేవ చేయునటుల చేశిరి గనుక వీరు రామానుజులైరి.

తాయా:- చాలా బాగున్నదండి.

నేను:- గుణములచే వీరు శ్రీరామచంద్రునికి అన్నగారైని కూడ చెప్పవచ్చును. శరణు జొచ్చిన కాకాసురుని-విభీషణుని నారు రక్షిస్తే వీరు-శరణాగతిని కూడ చేయలేని మనలను రక్షించుటకై ఆచార్యాజ్ఞమీరి, నరకమున ప్రవేశించ నిశ్చయించు కొని తిరుమంత్రార్థము వెల్లడించినారే? గానవాత్సల్యములో వీరు శ్రీరామచంద్రునికి అన్నగారన్నమాట.

తాయా:- అయితే ఆనందమ్మగారూ. ముకుందమాలలో 'హేరామానుజ' 'హేజగత్త్రియ గురో!' అని శ్రీకృష్ణపరమాత్మని వర్ణించినారేమి?

నేను:- బలరాముని తమ్ముడు గనుక శ్రీకృష్ణుడు రామానుజ శబ్దవాచ్యుడే. ఈరామానుజులకు ఆశ్రీకృష్ణుని పోలికకూడ పూర్తిగా కలదు సుమండీ.

తాయా:- ఏలాగు నండీ.

నేను:- శ్రీకృష్ణపరమాత్మయగు ఆరామానుజులు అంతకు పూర్వము ఏడు అవతారములు ఎత్తి ఆచార్యబిరుదు పొందలేక పోయ్యాడు. చివరికి ఎలాగైతేనేమి పేటపెట్టలాంటి అర్జునుని శిష్యునుగా సంపాదించి అతనిని బ్రతిమాలి గీతను గొని ఎలాగైతేనేం "గీతాచార్యుడు" అని ఆచార్యపదవిని స్వయముగ తగిలించుకున్నాడు.

యిక ఈ రామానుజులో ఆసేతుహిమాచల పర్యంతము కోటానుకోట్ల సచ్ఛిష్యబృందము కలవారై తాము తమని ఆశ్రయించినవారు తరించగలిగినట్టివారై 'జగదాచార్యులని' జనులచే యిప్పటికీ కీర్తించబడుచున్నారు.

తాయా:- శ్రీకృష్ణుని అవతారముగ ఆకాశవాణి ముందుగా సూచించినది. గాన వారధికులు కారా.

నేను:- అవునమ్మా వీరి విషయములోకూడ నమ్మాళ్వార్లు తమ తిరువాయ్మొడి 5 పదలో "కండోంకండో" అని వీరి అవతారమును భవిష్యదాచారత్వమునుసూచించిరి. అగమ్యగోచరమ అచేతనమైన అకాశవాణి సూచన గొప్పగా, సాక్షాత్తుగ సాయించిచున్న చేతనులైన నమ్మాళ్వార్ల దివ్యతాముఖమండల శ్రీసూక్తి గొప్పదా?

తాయా:- అయితే ఆరామానుజులు చెరసాలలో అవతరించిరి. వీరో?

నేను:. వీరూ అంతకంటె పెద్దచెరసాలలో అవతరించిరి. ఈప్రకృతిబంధము చెరసాలగాదుటమ్మా! జీమురు సాయించినారుగా-

తాయా:- ఆరామానుజులు అష్టమగర్భము గదా; వీరో?

నేను:-వీరూ ప్రపన్నకులములో అష్టగర్భులే.

1 శ్రీమతే విష్వక్సేనాయ నమః.

2 శ్రీమతే శఠకోపాయ నమః.

3 శ్రీమన్నాథమునయే నమః

4 శ్రీపుండరీకాక్షాయ నమః

## పరివార విభాగము

    

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ విశిష్టాద్వైత పరివారక సంఘము

## ఆశ్వయుజ మాస పండిత సభలు

★

ఈసభలు నెల్లూరు జిల్లాలోని 'మంగళంపాడు' అనే అగ్రహారమున స్వస్తిశ్రీ వికృతి నామ సం. రం. ఆశ్వయుజ శు. ౧. గురువారం 12-10-50 తేదీ లగాయతు తొమ్మిది దినములున్ను; "చతుర్వింశతి శ్రీసీతాకల్యాణ, శ్రీరామపట్టాభిషేక, శ్రీరామాయణపారాయణ సహిత శ్రీరామక్రతువుతో పాటుగ అత్యంత-మహా-వైభవముగా జరిగినవి.

ఇందు మంగళంపాడు, ఉచ్చూరు, తిరుపతి, అత్తమూరు, కోరుకొండ, చిత్తూరు, అల్లూరు, మదరాసు, కుంభకోణము, సూళ్ళూరుపేట, హైదరాబాదు, కాంచీపురము, మున్నగు వివిధప్రాంతములనుండియు విచ్చేసిన పండితులు పాల్గొనిరి.

ఆహ్వానసంఘ కార్యదర్శిగారగు శ్రీ ఉ. వే. శ్రీమాన్ నడాదూరి గోపాలకృష్ణమాచార్యులుగారు అనేక శ్రమలకోర్చి విచ్చేసిన స్వాములకు, ప్రేక్షకులకు వలయు అన్ని సౌకర్యములను స్వయముగ అతివైభవముగా జరిపించిరి.

ఈఉత్సవములలోనే శ్రీపిళ్ళైలోకాచార్యులవారు తిరునక్షత్రముకూడ వచ్చుటచే తన్నిర్వాహకులుకూడ ఆఉత్సవమును ఈఉత్సవముతో కలిపి జరిపించుటచే మొత్తము కార్యక్రమమంతయు బహుశోభాయమానముగను, అత్యంత విలక్షణముగను, అతి శ్లాఘనీయముగను జరుపబడినది.

మంగళంపాడు, ఉచ్చూరు భాగవత బృందము ఈకార్యక్రమ విషయమున జూపిన శ్రద్ధాభక్తులు, కార్యదీక్ష, సేవానిరతియు అత్యంతము కొనియాడదగినవై, ఆదర్శప్రాయములై యున్నవి.

ఈఉత్సవమునను, ఈసభలలోను పాల్గొన్నట్టియు శ్రీరామాయణమునుగూర్చి ఉపన్యసించినట్టియు భాగవతోత్తముల నామధేయములు-

1. శ్రీ ఉ. వే. శ్రీమాన్. శృంగారం వెంకట అప్పలాచార్యులుగారు అల్లూరు.
2. ,, టి. కె. వి. ఎన్. సుదర్శనాచార్యులుగారు న్యాయవిద్వాంసులు - సంస్కృతకాలేజి-తిరుపతి.
3. ,, టి. కె. దొరస్వామి అయ్యంగారు-[illegible] కాలేజీవిద్వాంసులు-తిరుపతి
4. ,, ఆర్. శ్రీనివాసరాఘవాచార్యులుగారు, ఎస్. వి. ఓరియంటలు రీసర్చి ఇన్స్టిట్యూట్ విద్వాంసులు-తిరుపతి,

5. శ్రీ ఉ. వే. శ్రీమాన్ కె. శ్రీనివాస రామానుజాచార్యులుగారు-మంగళంపాడు.
6. ,, ఉమ్మాచ్చరు అనంతశయనాచార్యులుగారు-ఉమ్మాచ్చరు.
7. ,, నడాదూరి వెంకటకృష్ణమాచార్యులుగారు-చెన్నూరు.
8. ,, కె. కం. గోపాలాచార్యులుగారు-కోరుకొండ.
9. ,, ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులుగారు-అర్తమూరు.
10. ,, నడాదూరి గోపాలకృష్ణమాచార్యులుగారు-మంగళంపాడు.

ఋత్విక-పారాయణాదికములలో పాల్గొన్నవారు.

11. ,, చిత్తూరి నరశింహాచార్యులుగారు-చిత్తూరు
12. ,, రంగాచార్యులుగారు-మంగళంపాడు.
13. ,, కృష్ణమాచార్యులుగారు-మంగళంపాడు.
14. ,, జి. శేషాచార్యులుగారు-తిరుపతి.
15. ,, నడాదూరి రామానుజాచార్యులుగారు-చెన్నూరు.
16. ,, ఇ. చినరామానుజాచార్యగారు-మంగళంపాడు.
17. ,, కె. తిరువేంగళాచార్యులుగారు-ఉమ్మాచ్చరు.
18. ,, వి. కె. నరశింహాచార్యులుగారు-ఉమ్మాచ్చరు.
19. ,, వి. నరశింహాచార్యులుగారు-ఉమ్మాచ్చరు.
20. ,, వి. వెంకట కృష్ణమాచార్యులుగారు-ఉమ్మాచ్చరు.
21. ,, వి. శ్రీనివాసాచార్యులుగారు-ఉమ్మాచ్చరు
22. ,, [illegible] అనంతాచార్యులుగారు-ఉమ్మాచ్చరు.
23. ,, వి. సి. గోపాలకృష్ణమాచార్యులుగారు-ఉమ్మాచ్చరు.
24. ,, యజమానం చినశ్రీనివాసాచార్యులుగారు-మంగళంపాడు.
25. ,, కె. వి. అప్పలాచార్యులుగారు-హైదరాబాదు.
26. ,, ఎం. వి. గోపాలాచార్యులుగారు-హైదరాబాదు.
27. ,, శింగరాచార్యులుగారు-మంగళంపాడు.
28. ,, యజమానం రంగాచార్యులుగారు-మంగళంపాడు.
29. ,, యజమానం శ్రీనివాసాచార్యులుగారు-మంగళంపాడు.
30. ,, కుంభకోణం ఆచార్యగారు.
31. ,, నాలాయిరం అధ్యాపకాచార్యులుగారు.

# శ్రీ యతిరాజ సేవా మహిళా సంఘం

## శుక్రవారోత్సవములు

అర్తమూరు

11-8-50 శ్రీమతి కోనాల మహాలక్ష్మిగారు
18 ,, నల్లిమిల్లి మాణిక్యంగారు
23 ,, చిర్ల మాణిక్యంగారు
25 ,, లంక మహాలక్ష్మిగారు
,, చిర్ల మంగయ్యమ్మగారు
1-9-50 శ్రీమతి సత్తి సుబ్బయ్యమ్మగారు
సత్తి సూరమ్మగారు
చిర్ల వీరమ్మగారు
8-9-50 శ్రీమతి పేపర్తి మంగయ్యమ్మగారు
,, సేపర్తి గంగరాజుగారు
,, మేడపాటి మంగరాజుగారు
15 ,, కర్రి మాణిక్యంగారు
22 ,, లంక వీరమ్మగారు
,, దాసరి సుబ్బమ్మగారు
29 ,, కర్రి బుల్లిఅమ్మాయిగారు
6-10-50 నల్లిమిల్లి వెంకయ్యమ్మగారు
మండబుల్లి వెంకయ్యగారు

మదరాసు

సెప్టెంబరు:

1. శ్రీమతి మద్దాల అమణమ్మగారు, సుదానిధి.
2. గొల్లపూడి కనకవల్లమ్మగారు ,,
3. తన్నా కుట్టెమ్మగారు, ,,
4. మట్టుపల్లి చంద్రమ్మగారు ,,

అక్టోబరు:

1. పొన్నూరు శ్రీరంగనాంచారమ్మగారు ,,
2. వల్ూరు అలివేలుతాయారమ్మగారు ,,
3. శారదాంబగారు ,,
4. శ్రీరామశెట్టి సీతమ్మగారు ,,

కార్యదర్శి.
పువ్వాడ మంగమ

సేవచేయు విధానము:—

ప్రతి శుక్రవారము సాయంత్రం గం 4 లగాయతు గం 7-0 వరకున్నూ—

1. తిరువారాధనము, 2. తిరుప్పల్లాండు—తిరు తిరుమడల్ గోష్ఠిసేవాకాలము, 3. తిరునెడ దాండగం ఉపన్యాసము, 4. శ్రీరామాను శ్రీలక్ష్మిఅష్టోత్తరస్తోత్రం నామావళి చెప్పుట, 5. చాత్తుమొఱ, 6. తిరునామ సంకీర్తనము.

## శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు

### సంభావన

కృష్ణాజిల్లాలోని ముదునూరు గ్రామస్థులు శ్రీమతి జాస్తి లక్ష్మీదేవమ్మగారు తమ తల్లిగారి తిరువధ్యయనోత్సవమున శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు రూ 5-0-0లు సంభావనను సమర్పించిరి వీరికి శ్రియఃపతి కరుణా కటాక్షములు కలుగుగాక.

### కానుకలు

మచిలీపట్టణము, జనాగపేట కాపురస్థులు వైశ్యశిఖామణులు శ్రీమాన్ కొత్త బాలకృష్ణయ్యగారి పుత్రత కుమారుడు నంబెరుమాళ్ళుగారియొక్క ఆచార్య సమాశ్రయణ సందర్భములో శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు రూ 5-0-0లు కానుకను సమర్పించిరి.

వీరికి శ్రియఃపతి ఆయురారోగ్య భాగ్యములను కటాక్షించుగాక.

### హెచ్చరిక

మదరాసులో డిశెంబరు 2 తేదినుండి వరుసగ 19 దినములు జరుపదలచిన శ్రీ గీతాసందేశ మహోత్సవమునకు విచ్చేయు భక్తులందరు (ఆహ్వానించబడిన పండితులు తప్ప)

తమ తమ భోజనముల యొక్క బసల యొక్క ఏర్పాటులను తామే చేసుకొనవలయును.

ఇట్లు.

శ్రీగీతాసందేశోత్సవ ఆహ్వానసంఘం



ఓం తత్ సత్

శ్రీ సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత

శ్రీ రామచంద్ర పరబ్రహ్మణేనమః

శ్రీ రుక్మిణీ సత్యభామాసమేత శ్రీ వేణుగోపాల పరబ్రహ్మణేనమః

# శ్రీరామక్రతుశ్రీమద్భాగవతసప్తాహసహిత
# శ్రీమహావిష్ణుకోటితులసీదళపూజామహోత్సవం
# రాజమహేంద్రవరము

---

## ఆహ్వానపత్రిక

శ్రీ ____________________

____________________

____________________

---

ప్రారంభము **6-4-51** ఆఖరు **21-4-51**

దయచేసి దీనిని మీ మిత్రులకు కనపరచుడు.

మీ రితరులకు పంపుటకు ఆహ్వాన పత్రికలు

కావలసిన 18/330 మెయిన్‌రోడ్డు

రాజమండ్రికి మీ చిరునామా

గల కవరు పంపండి.

హరే రామ హరే రామ రామ రామ హరే హరే
హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే॥
హరేర్నామ హరేర్నామ హరేర్నామైవ కేవలం।
కలౌ నాస్త్యేవ నాస్త్యేవ నాస్త్యేవ గతిరన్యథా॥
యస్య స్మరణ మాత్రేణ జన్మసంసార బంధనాత్।
విముచ్యతే నమస్తస్మై విష్ణవే ప్రభవిష్ణవే॥

మనకు స్వారాజ్యము వచ్చినది కాని, సురాజ్య మింకను సుస్థాపితము కాలేదు. ప్రభుత్వము లభించినది కాని ప్రజాశాంతి లభించలేదు. అధికారము లభించినది కాని అన్నవస్త్రములు లభించుటలేదు. ఇపుడు దేశములో నలుమూలలయందును అతివృష్టి, అనావృష్టి మున్నగు ఈతి బాధలు, వీనినిబట్టి అంతటను ఆహారకొరత, వస్త్రాదులకొరతయు అమితముగ వ్యాపించియున్నవి. ఎటుజూచినను ఎచ్చటకు వెళ్ళినను ఆర్తనాదములు, అనీతి, అధర్మము, అశాంతి, అవిశ్వాసము, అధికారవాంఛ, పరస్పరఈర్ష్య, మోసము, దురాశ, దొంగ మార్గములు గోచరించు చున్నవి.

భయప్రద నిమిత్తేషు తథాఽనావృష్టికాలేషు।
వర్ధనం సర్వలోకస్య శాంతిదం సర్వపుష్టిదం॥
వ్యాధి దుర్భిక్ష శాంత్యర్థముత్సవం [illegible] యోద్ధరేత్।
రాజరాష్ట్రాభి వృద్ధ్యర్థం రాజ్ఞాం చైవాఽభివృద్ధయే॥
సర్వదుఃఖార్తి శాంత్యర్థం విష్ణో రుత్సవ మాచరేత్॥

అను ఆగమ శాస్త్రప్రమాణముల ననుసరించి ఇట్టిస్థితిలో జగత్పతియు, లోకరక్షకుడును, ఆర్తత్రాణ పరాయణుడును, సర్వజ్ఞుడును, సర్వశక్తిమంతుడును, అపార కారుణ్య వాత్సల్య జలధియు, భక్తజన మందారుడును, అగు శ్రియఃపతియు అగు శ్రీమహావిష్ణువు ఉత్సవాచరణము మాత్రమే మన ముఖ్యకర్తవ్యమున్ను గతియు అయి యున్నది. ఇట్టిస్థితిలో —

ఆయన దివ్యకటాక్షవీక్షణము తప్ప మనకు మరి గతిలేదు
ఆయన దివ్యనామసంకీర్తనము తప్ప మనకు మరి సాధనము లేదు
ఆయన దివ్య అర్చన ధ్యానాదులు తప్ప మనకు మరి కర్తవ్యము లేదు
ఆయన దివ్య పూజావిధానము తప్ప మనకు మరి కృత్యము లేదు
ఆయన కైంకర్య నిరతి తప్ప మనకు మరి గమ్యము లేదు
ఆయన ఆజ్ఞా పరిపాలనము తప్ప మనకు మరి ముక్తి లేదు

దేవాన్ భావయతానేన తే దేవా భావయంతు వః।
పరస్పరం భావయంతః శ్రేయః పరమవాప్స్యథ॥
ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యంతే యజ్ఞభావితాః।
తైర్దత్తానప్రదాయైభ్యో యో భుంక్తే స్తేన ఏవ సః॥

ఈ జగత్తంతయు భగవదనుగ్రహ రూపమైనది. ఆయన ఆరాధనము మాత్రమే మన శ్రేయస్సునకు ఏకైక సాధనము. ఆయనను ఆరాధించనివారు పాపాత్ములు.

(శ్రీ) మహావిష్ణువు నారాధించుట ఎటులు? భక్తి పురస్సర తులసీదళ పూజల ద్వారా. (శ్రీ) మహావిష్ణు కటాక్షము పొందుట ఎటులు? శ్రీ సీతా కల్యాణ వివరణము ద్వారా. (శ్రీ) మహావిష్ణువు ప్రసాదము లభించుట ఎటులు? సవినయ భగవత్ప్రార్థనము ద్వారా.

—♦ తులసీ మహాత్మ్యము ♦—

సర్వేషామపి పుష్పాణాం తులసీప్రీతిదా హరేః।
మణికాంచన పుష్పాణి ముక్తావైదూర్యకాని చ।
తులసీదళ దానస్య కలాం నార్హంతి షోడశీం।
సుమంజరీదళైర్యుక్తైః కోమలైస్తులసీదళైః॥
యే కుర్వంతి హరేః పూజాం తే కృతార్థాః కలౌయుగే॥
సుమృష్టం పర్యుషితం వా శుష్కం వా తులసీదళం।
అర్చనే వాసుదేవస్య లక్షకోటిగుణం భవేత్।
సకృదభ్యర్చ్య గోవిందం తులస్యా చైవ మానవః
ముక్తిభాగీ నిరాతంకం కృష్ణస్యానుచరో భవేత్॥

ఆస్తికాగ్రేసరులారా! భగవద్భక్తులారా!

ప్రస్తుతపు మన ఈఅన్నవస్త్రాది కొరతదీరి, అవినీతి, అధర్మ, అశాంతత్వాదులు నశించి ప్రభుత్వము ప్రజలతో ఆనందముతో ధర్మముతో శాంతితో వర్తించుచు లోకకల్యాణము సిద్ధించుట కొరకున్ను ప్రజాసామాన్యమున ఆస్తికత, సత్యము, అహింస, శాంతి భక్తిభావన, సేవాసరణి, స్వధర్మ నిర్వహణము, త్యాగశీలత వృద్ధిపొందుట కొరకున్ను-

స్వస్తిశ్రీ ఖరనామసంవత్సర చైత్ర శు ౧ స్థిరవాసరము (అనగా ది 7-4-1951కి సరి) లగాయతు పదునగ పదునాలుగు దినములున్ను పరమపావనియగు (శ్రీ) గౌతమీనదీతీరమున రాజమహేంద్రవర పట్టణమున శ్రీ రామక్రతు - శ్రీ మద్భాగవత సప్తాహసహిత శ్రీమహావిష్ణు కోటితులసీదళ పూజామహోత్సవమును జరుపుటకు పెద్దలచే నిశ్చయింపబడినది.

| | |
|---|---|
| అంకురార్పణము. | ది 6-4-1951 సాయంకాలము. |
| ఉత్సవదీక్షా ప్రారంభము<br>శ్రీ రామక్రతుదీక్ష, శ్రీవిష్ణుకోటి<br>తులసీదళ పూజా ప్రారంభము | ది 7-4-1951 ఉదయం. |
| 21 (శ్రీ) సీతాకళ్యాణములు | ది 8-4-1951 ఉదయం. |
| (శ్రీ) పాదుకాపట్టాభిషేకములు | ది 9-4-1951 ఉదయం. |
| (శ్రీ) రామక్రతు సమాప్తి | ది 15-4-1951 రాత్రి |
| (శ్రీ) రామపట్టాభిషేకోత్సవము | ది 16-4-1951 మధ్యాహ్నము. |
| (శ్రీ) మద్భాగవత సప్తాహ దీక్షాప్రారంభము | ది 14-4-1951 ఉదయం. |
| (శ్రీ) మద్భాగవత సప్తాహ దీక్షాసమాప్తి | ది 20-4-1951 సాయంకాలము |
| (శ్రీ) కోటితులసీదళపూజా సమాప్తి | ది 20-4-1951 మధ్యాహ్నము |
| పూర్ణాహుతి | ది 20-4-1951 సాయంకాలము |
| అవభృదోత్సవము | ది 21-4-1951 ఉదయం |
| (శ్రీ) రుక్మిణీ కల్యాణము | ది 21-4-1951 మధ్యాహ్నము |

ఈఉత్సవదీక్షయగు ది 7-4-1951 తేదీ ఉదయము లగాయతు ఈఉత్సవముయొక్క దీక్షాంతమగు ది 20-4-1951 రాత్రివరకున్ను శ్రీ వేణుగోపాలస్వామివారి ధ్యానముతో - శ్రీ విష్ణుసహస్ర నామావళీపఠనముతో - మొత్తము కోటితులసీ దళములతో అర్చన ఆరాధనాదికములున్ను; ఈపదునాలుగు రోజులు అహోరాత్రములు అఖండ హరినామ సంకీర్తనమును; ఆగమోక్త పంచాగ్నిహోత్ర విధానానుసారము హోమమున్ను; శ్రీ మహావిష్ణుజప - హోమ-తర్పణ - పుష్పాంజలి-శాంత్యాదులున్ను; సుమారు 350 మంది ఋత్విగ్వరేణ్యులచే జరుపబడును.

ప్రతినిత్యము పెక్కురు పండిత ప్రకాండులచే వేదాంతోపన్యాసములు యివ్వబడును.

ప్రతినిత్యము పెక్కురు పండితులచే హరికథా కాలక్షేపములు-భజనలు-పురాణపఠనములు-జరుపబడును.

ఈఉత్సవమునిమిత్తమై పండరీపురమునుండి ప్రత్యేకముపండరిభజన సంఘము ఆహ్వానించబడుచున్నది.

ఈ మ హో త్స వ ము న కు

అధ్యక్షులవారు:-శ్రీ మహావిష్ణువు

అధినేతలు :-శ్రీ సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్ర మహాప్రభువు

నిర్వాహకులు :-శ్రీ రుక్మిణీ సత్యభామాసమేత శ్రీ వేణుగోపాలస్వామివారు.

నాయకులు :-శ్రీ భక్తాంజనేయ స్వామివారు

ఆశీర్వాదకులు:-శ్రీ భాగవతోత్తములు

అనుమోదకులు:-శ్రీ భక్తబృందము

అధ్వర్యులు:- శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘ కార్యదర్శులు

అనుమోదప్రోత్సాహకులు:-శ్రీ మాణిక్యం సుబ్బారాయుడు గారు రాజమహేంద్రవరం.

కార్యకర్తలు :-శ్రీ రాజమహేంద్రపురవాసులగు భక్తులు.

ఫలభోక్తలు:-శ్రీ భగవద్భక్తులు.

## —: నిత్య కార్యక్రమము :—

ది 6-4-1951 శుక్రవారము సాయంకాలమున శ్రీ వేణుగోపాలస్వామివారి అనుజ్ఞ తీసుకొని కోవిలనుండి ఊరేగింపుతో బయలుదేరి వచ్చి ఉత్సవమంటపము ప్రవేశము. భగవత్ప్రార్థన విష్వక్సేనారాధనము. మృత్సంగ్రహణము- అంకురార్పణము-వాస్తుపూజ- ధ్వజారోహణము.

ది 7-4-1951 శనివారము మొదలు ప్రతిదినము ఉదయము గం 5-0 తిరువారాధనము-తీర్థవినియోగాదికము. గం 6-0 నుండి 7-0 వరకు శ్రీవిష్ణు సహస్రనామస్తోత్రముతో [illegible]ఘ్యుత్సవము- 7-0 నుండి 8-0 వరకు శ్రీవిష్ణు సహస్రనామ సమష్టి పారాయణము- 8-0 నుండి 8-15 వరకు [illegible] ([illegible]) 8-15 నుండి 11-30 వరకు పూజామంటపమున శ్రీవిష్ణు సహస్రనామములతో కోటితులసీదళపూజ [illegible]మంటపమున తత్త్వన్యాసాది హోమములున్ను, పారాయణమంటపమున ఉభయవేదములు-శ్రీరామాయణ శ్రీమద్భాగవత విష్ణుపురాణాది పారాయణములున్ను, జపములున్ను; భజనమంటపమున హరినామ సంకీర్తనములున్ను, "హరే రామ హరే రామ" మహామంత్ర పఠనమున్ను, ఉపన్యాసమంటపమున ఉపన్యాసములు, పురాణపఠనాదులున్ను; 11-30 నుండి 12-0 వరకు శాంతిపాఠ ప్రవచనము.

మధ్యాహ్నము 2-0 నుండి 4-0 వరకు కాలక్షేపాదులున్ను 4-0 నుండి 6-0 వరకు ఉపన్యాసములున్ను, సాయంత్రము 6-0నుండి 7-30 వరకు శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్రసమష్టి పారాయణగానమున్ను శ్రీ లక్ష్మీఅష్టోత్తర శతనామార్చనయున్ను.

రాత్రి 7-30 నుండి 8-0 వరకు సమష్టిహరినామ సంకీర్తనమున్ను, 8-0 నుండి 11-0 వరకు హరికథా కాలక్షేపములున్ను, ప్రతి దినము 24 గంటలు అఖండ హరినామసంకీర్తనమున్ను జరుపబడును.

ఈమహోత్సవము లోక కల్యాణమునకై ప్రజాక్షేమమునకై చేయబడుచున్న మహాపవిత్ర పుణ్యకార్యమైయున్నది. ఇట్టి మహత్తర కార్యము దర్శించుటకుగాని, పాల్గొనుటకుగాని సామాన్యముగ లభించునట్టిదికాదు. కాన తామెల్లరు ధనరూపముగను, వస్తురూపముగను, తులసీదళముల సమర్పణరూపముగను, అన్నశాంతికవలయు సామగ్రి సమర్పణ రూపముగను, సేవారూపముగను, స్వహస్త పరహస్తముల ద్వారా సహాయముచేయుచు ఈఉత్సవము పాల్గొనగోరుచున్నారము.

రు 3000 లు సమర్పించినవారి గోత్రనామములతో ఒకరోజు పూర్తి ఉత్సవము జరుపబడును.

రు 1000 లు సమర్పించినవారి గోత్రనామములతో ఒకపూట పూర్తి ఉత్సవము జరుపబడును.

రు 500 లు సమర్పించినవారి గోత్రనామములతో ఒకనాటి పూజలు జరుపబడును.

రు 250 లు సమర్పించినవారి గోత్రనామములతో ఒకపూట పూజలు జరుపబడును.

రు 125 లు సమర్పించినవారి గోత్రనామములతో ఒక మహాపూజ జరుపబడును.

రు 58 లు సమర్పించినవారి గోత్రనామములతో ఒకపూజ జరుపబడును.

లోకస్సమస్తాసుఖినోభవంతు.

మంగళం మహత్ శ్రీ శ్రీ శ్రీ

ఇట్లు

రాజమండ్రి
24—2—51

శ్రీ. శ్రీ. శ్రీ. 1008 శ్రీమహావిష్ణువు
అధ్యక్షులు

తె. కం. గోపాలాచార్యులు, ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులు
శ్రీ విశిష్టాద్వైతప్రచారకసంఘ కార్యదర్శులు.

2. శ్రీ కాయజ్ఞానందస్వాములవారు, ఉపాధ్యక్షులు

3. ,, రాళ్ళబండి సుబ్బారావుగారు ,,

4. ,, సప్పా అప్పలస్వామిగారు ,,

5. ,, బుద్ధిలాల్. సి. షాగారు ,,

6. ,, పానాచంద్ గారు ,,

7. ,, కలిమిరెడ్డి అప్పలస్వామిగారు ,,

8. శ్రీ జి. వరదరావుగారు } కార్యదర్శులు

9. ,, సినిశెట్టి ఆదినారాయణగారు

10. ,, ఆకుమ్మరి సూర్యనారాయణగారు

11. ,, దత్తి సోమరాజుగారు

12. శ్రీ వాక అప్పలస్వామిగారు } కోశాధికారులు

13. ,, సప్పా సూర్యనారాయణగారు

కార్యనిర్వాహక సభ్యులు

14. శ్రీ ఆదిరెడ్డి అప్పలస్వామిగారు

15. ,, వాసిరెడ్డి రాములుగారు

16. ,, పచ్చినీలం మునికేశవరావుగారు

17. ,, కె. యన్. ప్రకాశరావుగారు

18. ,, దూపం వీరాస్వామిరెడ్డిగారు

19. ,, సీమకుర్తి సుబ్బారావుగారు

20. ,, పొడిపిరెడ్డి కృష్ణమూర్తిగారు

21. ,, కొల్లి అప్పలస్వామిగారు

22. ,, కొండపల్లి వీరవెంకయ్యగారు

23. ,, నాళం రాజారావుగారు

24. ,, పెండెం సత్యనారాయణగారు

25. ,, చలంచర్ల నారాయణమూర్తిగారు

26. ,, రంధి అప్పలస్వామిగారు

27. ,, బోర యరకయ్యగారు

28. ,, తాటికొండ శ్రీరాములుగారు

శ్రీమతే రామానుజాయనమః



భక్తి

# నివేదన

వేదాంత మాస పత్రిక

సంపుటి ౨ | వికృతి — పుష్య మాసం | సంచిక ౧౦

## కృష్ణార్జున సంవాదము

శ్రీ. ఉ. వే. శ్రీమాన్. తె. కం. గోపాలాచార్యులుగారు

### జీవ నిత్యత్వము

కృష్ణుడు:— అర్జునా! ఇదేమి? నీ వెంతో ధైర్యశాలివి. ప్రాజ్ఞుడ వని నేను భ్రమించితిని. అయ్యయ్యో! ఈ దుఃఖ మేమి? ఈ పిరికితన మేమి? ఇట్టి హృదయ దౌర్బల్యము నీవంటి వీరునకు తగునా? క్షత్రియునకు యజ్ఞోపవీతము వలె విడువతగని ధనుర్బాణముల విడిచి రథ మునపై చతికిలబడితివే! నీవుచింతించునది యెవరి నిమిత్తము? భీష్మాదులలో శరీరము ఆత్మయని రెండంశములు కలవు. అందు శరీరమును గూర్చి విచారింప పని లేదు. శరీరము పంచమహాభూత ములు. అహంకారము మహతత్త్వము, అవ్యక్తము అనబడు పదార్థములతో నిర్మింపబడును. అవి యచేతనములును ప్రతిక్షణమునకున్న మార్పుగలట్టి స్వభావములు కలవి గాన శరీరముకూడ నట్టిదే యగును. కావుననే దానికి శరీర మనియు దేహ మనియు పేరు లుంచబడినవి. (దిహ—ఉపచయే (పెరుగుట) అనెడు ధాతువు వలన 'దేహ' శబ్దమును్న శీర్యత— ఇతి శరీరం అనెడు వ్యుత్పత్తిని బట్టి శరీర శబ్దమును కలిగినవి.)

దాని కందుచే పుట్టుట గిట్టుట సహజము. దానినిగూర్చి దుఃఖించ దగదు.

ఇక ఆత్మాంశ మందువా! దానిని గూర్చి బొత్తిగ దుఃఖింపరాదు. దానికి పుట్టుట, నశించుట, అను వికారములు లేవు గాన పుట్టుక వలన నుండుటయు, గిట్టుట వలన లేకుండుటయు దానికుండజాలవు.

అర్జునుడు:— కృష్ణా! ఆత్మకు జనన మరణాదుల సకలలోక సాక్షికముగ కనిపించుచున్నవే!

అంతియగాక "ఏతేభ్యో భూతేభ్య స్సముత్థాయ తాన్యేవా నువినశ్యతి" ఈ భూతములనుండిపుట్టి యవి నశించుననెడు ప్రమాణమును బట్టి కూడ దేహముతో పాటిదిగనే గోచరించుచుండగ నది నిత్యమనియు, దానినిగూర్చి దుఃఖించరాదనియు చెప్పుట తగునా ?

♦ ఆత్మాణుత్వసమర్థనము ♦

కృష్ణుడు:- ఓహో ! పెద్దపనియే కల్పించితివి. ఆ విషయమును సమగ్రముగ వివరింతును, సావధానముగ వినుము.

ఆత్మ నిత్యమని యెఱుంగుటకు ముందు దాని పరిమాణమును గూర్చి విమర్శించవలసి యున్నది. అసలు పరిమాణము-విభుపరిమాణము, మధ్యమ పరిమాణము, అణుపరిమాణము అని మూడువిధములు. ఆత్మకీ త్రివిధపరిమాణములును వేరు వేరు దార్శనికు లంగీకరింతురు. తార్కికులు విభువందురు. జైనులు మధ్యమ పరిమాణ మందురు. త్రైవిద్యవృద్ధనిష్ణాతులు (విశిష్టాద్వైతులు) అణువందురు, అందుతార్కికుల విభువాదమును ముందుగ వినుము.

1. ఆత్మ అణుపరిమాణ మన్నచో నది ప్రత్యక్షమే కారాదు. మహత్పరిమాణ మున్నగాని వస్తువులు గోచరించనే గోచరించవు. అది లేకనే గదా పరమాణువులు గోచరించకపోవుట.

2. ఆత్మ అణువన్నచో ననేక శరీరములలో నొక్కసారి సుఖదుఃఖాదుల ననుభవించుట దుర్ఘటము. సౌబరి మొదలగు వారొకే కాలమున ననేకశరీరములలో సుఖదుఃఖముల ననుభవించి రని పురాణాదులవలన వినుచున్నాము. ఈ యణుజీవుడే యతివేగముతో క్రమముగ నా యా శరీరములకేగి క్రమముగనే యనుభవించుచున్నను ఆ వేగాతిశయమున మన మాక్రమమును గానలేక ఒక్కసారియే ఆ యనుభవము లుదయించుచున్నవని భ్రమించుచున్నారనుట దుస్సాహసము. యోగులకును మనవలె భ్రమ యున్నచో నిక వారి యతిశయ మేమి ?

3. అదియును గాక శరీరమును పడకుండ నీ యాత్మ ధరించు విధాన మేమందురు ? ప్రయత్నపూర్వకమైన యాత్మతో నా శరీరము నకుగల సంబంధమే యందురా ? అట్లగుచో సౌబరియొక్క అణువగు నాత్మ ఒకేసారి నూరు శరీరములతో ప్రయత్నపూర్వకముగా సంబంధించి యుండుట. నమ్మదగిన విషయమేనా? ఒక శరీరముతో నాత్మ సంబంధించి యుండునపుడు ఇతర శరీరములతో నా సంబంధ మేది?

4. మరియు ఆత్మ యణువగుచో నేదోయొక శరీరమందే యుండును గాని తక్కిన తొంబది తొమ్మిది శరీరములలో నుండుట యసంభవము గదా! అట్టితరి యాత్మలేని యా శరీరములకు నిద్రకొఱకు ప్రయత్నమే లేకుండవలెను. ఏల నందురా? ఆత్మ సుఖస్వరూపమైనది గాన సుషుప్తియందా యాత్మస్వరూప సుఖము ననుభవించుటకే నిద్రకై ప్రయత్నింతుము. ఆ శరీరములలో నాత్మయే లేనిచో నిక నాయాత్మస్వరూపాత్మకమైన సుఖానుభవ మెక్కడిది? ఈవిషయమునే

'స్వాపేసుఖత్వాభిజ్ఞానాత్ తద్విచ్ఛేదచరో పతః, తదగ్రమన్యత్యాగాచ్చ ప్రతిస్మృతిశ్చైరపి"

అనెడు విష్ణుచిత్తవచనమున నిద్రావస్థలో నాత్మసుఖస్వరూపానుభవ ముండును గాన లేపి దానిని చెడగొట్టిన వారిపై యపరిమిత కోప ముదయించును. ఆ యనుభవముకొఱ కన్ని ప్రియవస్తువులను కార్యములనువిడిచిపెట్టుచున్నాము అని కలదు.

దీని వలన నిద్రావస్థయం దాత్మసుఖస్వరూపానుభవము కలదనియే తెలియబడుచున్నది.

5. చైత్రుడను వాడొక విత్తనమును నాటుచున్నాడు. ఆ విత్తనమువలన పుట్టెడు ఫలము ననుభవించు యదృష్ట మా చైత్రున కున్నచో నా బీజ మంకురించును. కావున బీజమందలి యంకురత్వావస్థకు చైత్రుని యదృష్టము కారణ మగుచున్నది గదా! కార్యకారణములు రెండు నొక్కచోట నుండవలెనను నియమము కలదు. అంకురత్వావస్థ విత్తనమునం దున్నది. అదృష్టమో చైత్రాత్మయం దున్నది. అయినను చైత్రుని యాత్మ విభువు గాన దానికి విత్తనముతో సంబంధముండుటచే నా యదృష్ట మా యాత్మయందే యుండును గాన ఆత్మద్వారా యదృష్టము నకు బీజముతో సంబంధము కుదురుచున్నది. ఆత్మ యణువైనచో నిది యెట్లు కుదురును?

ఇట్లెన్నియో దోషము లుండుటచే నాత్మ యణువనరాదు.

ఈ దోషముల పరిహరించుటకై జైనులవలె నాత్మ మధ్యమపరిమాణ మందురా? అనగా శరీర మెంత కలదో యాత్మ యంత పరిమాణము కల దందురా? ఉల్లి తినినను రోగము కుదుర లేదన్నట్లు ఒక శరీరములో నొక్కసారిగా కలుగు సుఖదుఃఖానుభవము కుదిరినను పై దోషము లొక్కటియు పరిహరింపబడక పోవుటయే గాక మరికొన్ని యనర్థములు సంభవించును. చూడుము—

ఒక జీవో పాపమువలన యేనుగగా పుట్టె ననుకొనుము. అప్పు డా యాత్మ యెంత యుండును? ఆ యేనుగంత. సరియే. వాడా జన్మను విడిచి ప్రారబ్ధానుభవమునకై చీమగా పుట్టవలసి యున్నది. అప్పుడా యేనుగాత్మ యంతయు నా చీమ శరీరములో పట్టదుగదా! అప్పు డెట్లు? అం దొక భాగము మాత్ర మాక్రమించిన దన్నచో నపరిపూర్ణత రాదా! దాని కేమున్నది? ఆత్మకు సాగుటయు ముడుచుకొనుటయు కలదందుము. ఏనుగు శరీరము పెద్దదిగాన నందు బాగుగ సాగి యుండును. చీమ శరీరము పట్టదు గాన ముడుచుకొనిపోయి యందు ప్రవేశించును. దోష మే మున్న దందురా? అట్లగుచో నాత్మ, పుట్టక చావు, దానిచే ననిత్యత్వము మొదలగు దోషములు కలదై కుంభవంటిదే కావలసి వచ్చును.

మరియు జీవునకు మోక్షము లభించిన పిమ్మట యది నిత్యము గాన తిరిగి దానికి పుట్టుక యుండదు కదా! ఐనచో మోక్షావస్థలో నున్న యాతని పరిమాణము ఆఖరి పరిమాణమే యని చెప్పక తప్పదు. ఐనచో నది నిత్యమే యగును గాన నదియే ఆత్మకు స్వాభావిక పరిమాణ మగును. అట్లగుచో నంతకు పూర్వము మాత్రము తన స్వాభావిక పరిమాణ మెట్లు మారును?

ఇట్లు పెక్కు దోషము లున్నవి గాన ఆత్మ యణుపరిమాణ మని గాని మధ్యమపరిమాణ

మని గాని చెప్పక అది విభుపరిమాణమనియే చెప్పి తీరవలెను అందురు.

ఇక నీచిక్కులనెల్ల పరిహరించుచు త్రియ్యా న్తనిష్ణాత (విశిష్టాద్వైతు) లెట్లు నిర్వచింతురో విందువా?

**వా రాత్మ యణుపరిమాణ మందురు.** అందులకు 'ఏషోఽణు రాత్మా చేతసా వేదితవ్యో' బుద్ధేర్గుణే నాత్మగుణేన చైవ హ్యారాగ్రమాత్రో హ్యవరోఽపి దృష్టః,

ఈ జీవుడు యోగముచే పరిశుద్ధమగు మనస్సుచే మాత్రమే తెలుసుకొనదగినవాడు. ఈతని బుద్ధి విభువగుటకు తగినదే యైనను కర్మచే సంకుచితమైనది గాన మున్ను చెప్పాయబడిన మాణిక్యము వలె తన కాశ్రయమగు జీవునితో సమాన పరిమాణము కలిగియే యుండవలెను గాన జీవుని వలె నిదియు ముల్లుకట్టు సూది మొనవలె నణుపరిమాణము కలిగియే యుండును అనుశ్రుతియు.

'వాలాగ్రశతభాగస్య శతధా కల్పితస్య చ భాగో జీవ స్స విజ్ఞేయః'

'వెండ్రుక వెంట్రుక కొనను నూరు భాగములుగ విభజించి యందొకభాగమును తిరిగి నూరు భాగములుగ విభజించినచో నందొక భాగమంత పరిమాణమే జీవుని పరిమాణ మగునను శ్రుతియు ప్రమాణములుగ గనపరచబడినవి.

క్రియలు గల వేనియు విభువులు కాజాలవు. ఘటమును చూచుట లేదా! అట్లే జీవుడును క్రియ కలవాడు కావున విభు వెట్లగును? జీవునకు క్రియ లెచ్చటునవందురా? వినుము—

జీవునకు ఉత్క్రాంతి, గతి, ఆగతు లనెడు మూడు క్రియలు ప్రమాణ సిద్ధములై గాన్పించుచున్నవి.

ఎట్లన:—

"తేన ప్రద్యోతేన ఏష ఆత్మా నిష్క్రామతి చక్షుషో వా మూర్ధ్నో వా అన్యేభ్యో వా శరీర దేశేభ్యః'

అను శ్రుతిచే "పరమాత్మ గనపరచు కాంతి మూలగ గాని యీ జీవుడు కంటినుండియో, బ్రహ్మకపాలమునుండియో, ఇతరశరీరప్రదేశములనుండియో నుత్క్రమించును (లేచిపోవును)' అనియు

'యే వై కే చా స్మా ల్లోకా త్ప్రయన్తి చంద్రమస మేవ తే సర్వే గచ్ఛన్తి'

అను శ్రుతిచే కామ్యములగు పుణ్యకర్మల నాచరించి యీ లోకమును వీడిపోవు నాత్మలన్నియు చంద్రలోకమున కేగు ననియు,

"తస్మా ల్లోకా త్పునరైత్యస్మై లోకాయ కర్మణే"

అను శ్రుతిచే వారా పుణ్యము క్షీణించగనే యీ లోకమును వీడి తిరిగి కర్మఫలానుభవమునకై యీ లోకమున కేతెంతు రనియు ఉత్క్రాంతి గత్యాగతులు స్పష్టముగా తెలుపబడుచున్నవి గదా! విభుపరిమాణము కలిగియున్నచో యీ క్రియలు సంభవమా?

అర్జునుడు:— ఇంతవరకు బాగుగనే యున్నది. కాని అణువను పక్షమున నిదివరలో వారు చూపిన దోషములు పరిహరింపబడినగదా! యీ సిద్ధాన్తము సుస్థిర మగునది.

కృష్ణుడు:— అయ్యా! వీరాదోషముల నన్నిటిని

చక్కగ పరిహరించిరి. వినుము.

1. ప్రత్యక్షమగుటకు మహత్పరిమాణ ముండవలెననియు పరమాణువులు గోచరించకపోవుట అది లేకపోవుటచేతనే గాన ఆత్మయు నట్లే ప్రత్యక్షము కాకపోవలసివచ్చు ననికదా మొదటి యాక్షేపము.

ప్రత్యక్షమగుటకు మహత్పరిమాణము కారణము కానే కాదందుము. అయినచో పరమాణువు కాన్పించదేమి యనికదా యాక్షేపించవలెను. పరమాణువు కాన్పించుచునే యున్నది. పరమాణువనగా యెండ వేళ యింటిపెంకుల మధ్యరంధమునుండి యింటిలోని ప్రసరించు సూర్యకిరణములలో గాన్పించు సూక్ష్మరేణువులే కాని యంతకంటె సూక్ష్మతమమగు వేరొక వస్తువనుటకు ప్రమాణము లేదు. అట్టి పరమాణువు కాన్పించుచునే యున్నది గదా!

2. ఇక రెండవ యాక్షేపము, జీవు డణువగుచో సౌబరి యనేక శరీరములతో నొక్కసారి సుఖదుఃఖాదుల ననుభవించుట దుర్ఘటమని గదా? దాని కేమున్నది. ఆత్మ యణువైనను దానికి గల జ్ఞానము సంకోచవికాససామర్థ్యము కలది. అది దీపకాంతివలె ఆత్మయున్న స్థానము కంటె దూరముగ వ్యాపించగలిగి యుండును. యోగులు తమ యోగసామర్థ్యముచే దాని నెంత దూరమునకైనను వ్యాపింపచేయగలరు. అందుచే సౌబరియు దానిని తన శరీరముల నన్నింటిలోనికిని వ్యాపింపచేయగలిగి యుండెను. అందుచే నా శరీరము లన్నిటిలోను ఒకేసారి సుఖదుఃఖముల ననుభవించుచున్నాడు. అందులకై ఆయాత్మ శరీరము లన్నిటిలోనికిని పోవలసిన పని లేదు.

3. శరీరమును పడకుండగ నాపుటయు నీ ధర్మభూతజ్ఞానము వలననే. ఇదియే ప్రయత్నత్వావస్థను పొంది యన్నిశరీరములలో నుండి వాటిని పడకుండ కాపాడును.

4. ఇక నిద్రకై ప్రయత్నత్నము కుదుర దనెడు యాక్షేపమును సరియైనది కాదు ఏలనన–

ఆత్మస్వరూపసుఖానుభవము నాశించి కాదు నిద్రకై ప్రవర్తించుట. కింతు, జాగ్రదవస్థలోని శరీరాయాసముచే కలిగిన క్లేశము శమించుటకై మాత్రము నిద్రకై ప్రవర్తించరు. విష్ణుచిత్తులు చెప్పిన దానికి కూడా విరోధములేదు. ఆమాట సాక్షాత్తుగ ఆత్మగల శరీరమునుగూర్చి చెప్పబడినది,

5. ఇక చివర యాక్షేపము బీజమునుండి మొలకపుట్టుటనుగూర్చినది కదా! అదృష్టమనగా భగవత్సంకల్పమే. అయ్యది జీవాత్మద్వారమున గాక పరమాత్మద్వారమున పరమాత్మ విభువే గాన ఆయన సకలవస్తువులతో సంయోగించియే యుండుటచే నేదోషమును లేదు. కావున ఆత్మ యణుప్రమాణము అను సిద్ధాంతము నిరుపద్రవముగ చిరంజీవి యగును.

## — ఆత్మనిత్యత్వము —

అర్జునుడు:– కృష్ణా! నీ యుపపాదనవలన ఆత్మ అణుపరిమాణము కలదని చక్కగ తలకెక్కినది గాని ప్రారంభింపబడిన ఆత్మనిత్యత్వము మూలపడినది.

కృష్ణుడు:– ఇదిగో! ఈ ప్రయత్నమంతయు

అందునిమిత్తమే కదా! వినుము.

అవినాశితు తద్విద్ధి యేన సర్వ మిదం తతం
వినాశ మవ్యయస్యాస్య న కశ్చి త్కర్తు మర్హతి.

యే యాత్మతత్వ మీ ప్రపంచమునందలి ప్రతివస్తువునందును ఒక్కదానినైనను విడువక నువ్వులలో నూనెవలెను కట్టెలో నిప్పువలెను వ్యాపించియున్నదో ఆ తత్వము నశించు స్వభావముకలది కాదని యెఱుంగుము. ఈ లోకము లోని యేవస్తువుకూడ దానిని నశింపచేయజాలదు అని యీశ్లోకభావము. లోకమున నశింప చేయునట్టి శస్త్రము, నీరు, నిప్పు, గాలి మొదలగు పదార్థములు తమచే నశింప చేయబడు వస్తువులయందు వ్యాపించి వాటిని నశింపజేయు చున్నట్లు మనము నిత్యమును చూచుచునే యున్నాము. ఇందువలన నశింపజేయునవి సూక్ష్మముగాను, నశింపజేయబడునవి యంత కంటె స్థూలముగాను ఉండవలెనను విషయము పామరునకైనను తెలియనిదికాదు. సూక్ష్మమైనది స్థూలమైనదానియందే వ్యాపించి దానిని నశింపజేయునే గాని స్థూలము సూక్ష్మమునందు వ్యాపించి నశింపచేయజాలదు కదా! ఈయాత్మ తత్వము లోకములో నన్నింటికంటెను మిక్కిలి సూక్ష్మమైనది. అందులకు కారణ మదియే యన్నిటను వ్యాపించి యుండుటయే. ప్రపంచ మున నేవస్తువునందైనను 'ఇది యీ ద్రవ్యము కలదికాదు, యీ గుణము కలదికాదు, యీ క్రియకలదికాదు ఫలానాజీవుడుకలదికాదు' అని యిట్టి భేదముండునే కాని సామాన్యముగ ఆత్మయే కలదికాదని మాత్రమెన్నడు నుండదు. కావుననే "నిత్య స్సర్వగత స్థాణుః" యేన సర్వ మిదం తతం" మొదలగు ప్రమాణవాక్యములు సరసముగ సమన్వయించుచున్నవి. ఇట్లు ఆత్మతత్వ మన్నిటియందును వ్యాపించి యుండును. తక్కినవన్నియు దానిచే వ్యాపింపబడును గాన దానికంటెను స్థూలములగును. ఇట్లంతటను వ్యాపించియుండుటచే నిరతిశయ సూక్ష్మమును, అందువలన నశించుట కనర్హమును నైయుండు ఆత్మతత్వమును, దానిచే వ్యాపింపబడిన దగుట వలన దానికంటెను స్థూలముగానుండుడు తక్కిన యచేతన వస్తువులేవియు నశింపచేయజాలవు.

అర్జునుడు:- కృష్ణా! స్థూలము సూక్ష్మమును నశింపచేయజాలదంటివే! సుత్తి మొదలగునవి స్థూలముగా నుండినను కుండ మొదలైన వాటిని నశింపచేయుట లేదా?

కృష్ణుడు:- వాటిని గట్టిగా విసరి కుండపై కొట్టినప్పుడా వేగము వలన సూక్ష్మమైన గాలి పుట్టును. ఆ గాలి కుండకంటె సూక్ష్మమే గదా! దాని మూలమున ఆ కుండ నశించు చున్నది. అర్జునా! సుత్తిమీద కుండను బెట్టిన కుండ పగులునా? కావున నశింపజేయుటకు సంయోగము మాత్రమే చాలదు. గాలిని పుట్టించు వేగము కూడా నుండవలెను. వేగము మాత్రముండి ఆ కుండకు సుత్తి తగలనిచో నది పగులునా? కావున కుండతో సుత్తికి సంయోగ ముండవలెను. గ్రుద్దెవరకును వేగము కుండతో సంయోగము రెండు నుండినను లాభమేమి? కుండ పగులునా? కావున ఆ వస్తువునకు కాఠిన్యముకూడ నుండ

వలెను. ఆ సుత్తి వెనుకటి భాగముతో కొట్టినను కుండ యంత సులువుగ పగులదు. కావున కఠినమైన నొక వస్తువుయొక్క ఒక భాగముతో వడియైన సంయోగము కలిగిననే అది పగులును

అర్జునుడు:— ఇది బాగుగనే యున్నది గాని యిచ్చట కుండను బద్దలు కొట్టినది సుత్తికదా! గాలిచే నది పగిలిన దందు వేమి? వేగమువలన గాలి పుట్టుట యెట్లు?

కృష్ణుడు:— అయ్యో! ఇదియే యెఱుగవా? గట్టిగా ఉరిమినప్పుడు యింటిగోడ లదురుట చూడలేదా? ఇంటిలోని బిందెలు చెంబులు మొదలగు వస్తువులు కదలుట చూడలేదా? అవియట్లు కదలుటకు కారణ మూహింపుము. ఆశబ్ద వేగము వలన చిన్నగాలి పుట్టి అది యా వస్తువులలో జొచ్చుటచేతనే యవి యట్లు కదలుచున్నవి. ఇట్టి గాలియే సుత్తి వేగము వలన పుట్టి తాను కుండకన్నను సూక్ష్మమైనది గాన కుండలో ప్రవేశించి దానిని బ్రద్దలు కొట్టుచున్నదని యంగీకరించవలెను. తెలిసినదా?

అర్జునుడు:— కృష్ణా! అది తెలిసినది కాని కొన్నిచోట్ల యిట్టివేగము లేకపోయినను సుత్తిని విసరక దానితో గట్టిగ నొక్కినను కుండ పగులుచున్నదే! అది యెట్లు?

కృష్ణుడు:— అట్టిచో సుత్తి యవయవములచే నొత్తబడిన కుండ యవయవములు తమకంటె సూక్ష్మమైన కుండ యితరభాగమును జొచ్చును అందుచే కుండ పగులును;

ఇట్లు ఆత్మ యన్నిటిలోను వ్యాపించి యుండదగిన అణుపరిమాణము గల దగుటచే దానిలో ప్రవేశించి నశింపచేయు పదార్థ మొక్కటియు లేదు గాన ఆత్మ నిత్యమైనది. కావున దానిని గూర్చి విచారించుట యవివేకము లెమ్ము గాండీవమును చేబూని యుద్ధసన్నద్ధుడవు కమ్ము.



శ్రీమతే రామానుజాయనమః

# శ్రీ. ఉ. వే. శ్రీమాన్ తిరుమల నల్లాని చక్రవర్తుల

# శ్రీ వెంకటాచార్యులయ్యవార్లంగారు.

---

శ్రీ త్వష్ట్రాపార భూమాశ్రితజనల హరీరత్నకోదారనామా
భాస్వచ్చన్ద్రాగ్నిధామా ఘుమ ఘుమితలసద్వ్యాజ యస్తేసుదామా
శ్రీమానమ్భోజధామా ద్యఖిల సుర వర ప్రార్థితో తీతశీమా
భూమానఃపాతు భూమాపరిచిత చరణామ్భోరుహ హోరఙ్గధామా॥ ౧.

మృదుమధురగభీర వాగ్విలాసైః
శ్రుతిమధురై రఖిలాగమార్థ సారైః
సహృదయ హృదయాన్తరా ణ్యశేషా
ణ్యమృతమయాని వితన్వతీ సభేయమ్॥ ౨.

తర్కవ్యాకృతి తన్త్ర సాగరమహామన్థాన శైలాయిత
ప్రస్ఫూర్జత్పర మాద్యుతోజ్జ్వలతర ప్రేక్షా సముద్భాసితైః
శ్రీమద్వేదవతంస యుగ్మ పదవీ జఙ్ఘాల వాగ్వైఖరీ
నిర్ధూతేతరదుర్మతాన్ధత మసైః శ్రోత్రే విభూషాయితైః॥ ౩.

శ్రీమన్నాథమునీన్ద్ర యామునముని శ్రీభాష్యకారాదిమ
ప్రాచార్యవ్రత సమ్ప్రదాయ పదవీ సంరక్షణైక వ్రతైః
విద్వద్భిర్మహనీయకీర్తి విభవైస్సంవర్ధితేయంసభా
యోదార్కని శాకరంభువి సతామానన్ద సన్దాయినీ॥ ౪.

శ్రీమద్రఙ్గపతేః కృపాజలనిధే స్సాయన్తర ఙ్గచ్ఛటా
పాత్రైర్ధన్యదరి మమందరిమస్తుని తరామేతన భాయాంసతాన్।
దేశోయంనిరుపద్రవో స్త్వవిరతంనిఃశ్రేయసై స్సమ్భృతో
వర్షన్తాన్నిజ ధర్మలోలుప ధియస్సర్వే శుభానాంశ్రితైః॥ ౫.

తిరుమల నల్లాన్ వంశో
న్నాత్మ శ్రీ చక్రవర్త్యభిజనోయం
ఇతి విఖ్యాయతి సతా
మనుగ శ్రీ వేఙ్కటాహ్వ యోదాసః॥ ౬.

శ్రీమతే రామానుజాయనమః.

# అష్టశ్లోకి



## టీకా తాత్పర్య సహితము

తనియన్

శ్లో. శ్రీపరాశర భట్టార్య శ్శ్రీరంగేశ పురోహితః
శ్రీవత్సాంకసుత శ్శ్రీమాన్ శ్రేయసే మేఽస్తు భూయసే.

టీ. శ్రీరంగేశ - శ్రీరంగనాథునియొక్క
పురోహితః - పురోహితులును
శ్రీవత్సాంక - కూరత్తాళ్వారులకు
సుతః - కుమారులును
శ్రీమాన్ - కైంకర్యధురంధరులును అగు
శ్రీపరాశరభట్టార్యః - శ్రీపరాశరభట్టరనెడి ఆచార్యులు
మే - నాకు
భూయసే - అధికమైన
శ్రేయసే - మేలును కలిగించుటకు
అస్తు - అగుదురుగాక.

తా. శ్రీమద్రంగనాయకస్వామికి పురోహితులుగాను, శ్రీకూరేశులకు కుమారులుగాను, అర్థాత్మ సంప్రదాయ ప్రవర్తకులుగాను వేంచేసియుండు శ్రీ పరాశరభట్టరనెడి పూర్వాచార్యులు దాసునికి అధికమగు మేలును అనుగ్రహము చేయుదురు గాత.

అవ. రహస్యత్రయమునందు మొదటిదైన తిరుమంత్రమునందు సంగ్రహముగాఁ జెప్పఁబడియుండునట్టి ఉపాయోపేయములను ద్వయము విస్తరించి చెప్పబడియుండుటచేత; ఈ ద్వయమునందు చెప్పఁబడియుండు ఉపాయోపేయములను బాగుండుటకు ముఖ్యముగాఁ దెలియ వలసినవియగు ఉపాయాంతరత్యాగమును, సర్వపాప నివృత్తియును, చరమశ్లోకము వివరించుట చేతను; ఈ రెండు రహస్యములకును మూలభూతముగానుండు ఈ తిరుమంత్రముయొక్క అర్థమును కృపచేయుటకు యత్నించి తిరుమంత్రమునందు ప్రథమమున స్మరించు ప్రణవమునందణఁగియుండు అకార ఉకార మకారములయొక్క అర్థమును, ప్రథమమున ప్రసాదించుచున్నారు.

శ్లో. అకారార్థో విష్ణు
ర్జగదుదయ రక్షా ప్రళయకృత్ ।
మకారార్థో జీవ
స్తదుపకరణం వైష్ణవ మిదం ॥
ఉకారో ఽనన్యార్హం
నియమయతి సంబంధ మనయోః ।
త్రయీసార స్త్ర్యాత్మా
ప్రణవ ఇమ మర్థం సముదిశత్.

టీ. జగదుదయరక్షాప్రళయకృత్,
జగత్-లోకముయొక్క
ఉదయ-ఉత్పత్తియును
రక్షా-రక్షణమును
ప్రళయ-సంహారమును
కృత్-చేయునట్టి
విష్ణుః-సర్వవ్యాపియు భగవంతుడు అయిన శ్రీమన్నారాయణుడు
అకారార్థః-(ప్రణవమందలిగియుండు) అకారమునకు వాచ్యుడు
జీవః-బద్ధముక్త నిత్యులైన త్రివిధజీవులు
మకారార్థః-మకారమునకు వాచ్యులు.
వైష్ణవం-విష్ణువునుండి కలిగిన
ఇదం-ఈ త్రివిధజీవులును
ఉపకరణం,
తత్-ఆభగవంతునికి
ఉపకరణం—ఉపయోగింపదగినవస్తువుగా (ఉన్నవి)
ఉకారః-ప్రణవమందలిగియుండు ఉకారమైన
అనయోః-ఈపరమాత్మ జీవాత్మలయొక్క
సంబంధం-శేషశేషిభావరూపసంబంధమును
అనన్యార్హం-వేరొక్కరిని సంప్రాప్తముకానితెలుగున
నియమయతి-నియమించుచున్నది
త్రయీసారః,
త్రయీ-ఋగ్యజుస్సామములనెడి మూడు వేదములయొక్క
సారః-సారమగు
త్ర్యాత్మా,
త్రి-మూడక్షరములైన అకారఉకారమకారములచే
ఆత్మా-స్వరూపముగాగల
ప్రణవః-ఓంకారము
ఇమం—మీదచెప్పిన ఈ యర్థమును
సమదిశత్-చక్కగాచెప్పుచున్నది.

తా. లోకములయొక్క సృష్టిస్థితి సంహార కర్తయును, సర్వవ్యాపియునునైన భగవంతుడు ప్రణవమునందలిగియుండు అకారమునకు అర్థముగానున్నాడు. బద్ధముక్త నిత్యులైన త్రివిధ జీవులు మకారమునకు అర్థముగానున్నారు. భగవంతునివలనగలిగిన ఈజీవులు భగవంతునకు శేషభూతులను దానిని అకారమునకు మీద లోపించియుండు చతుర్థీవిభక్తి చెప్పుచున్నది. ప్రణవమందలిగియుండు ఉకారము జీవపరమాత్మలు ఒకరికొకరికి గలిగియుండు శేష శేషిత్వ రూపసంబంధమును, లక్ష్మీ, భాగవతులు, ఆచార్యులు అన వీరితక్క తక్కినవారికి తగదని నిరయించుచున్నది. ఇట్లు వేదత్రయసారమైన ప్రణవము ఈయర్థమును స్పష్టముగా జెప్పుచున్నది.

అవ. నమః పదమునుగురించి వ్యాఖ్యానము చేయుచున్నారు.

శ్లో. మంత్రే బ్రహ్మణి మధ్యమేన
నమసా పుంస స్స్వరూపం గతిః।
గమ్యం శిక్షిత మీక్షితేన
పురతః పశ్చాదపి స్థానతః,।
స్వాతంత్ర్యం నిజరక్షణం
సముచితా వృత్తిశ్చ నాన్యోచితా।
తస్యైవేతి హరే
ర్వివిచ్య కథితం స్వస్యాపి నార్హం తతః

టీ. మంత్రేబ్రహ్మణి.
మంత్రే-మంత్రములలో
బ్రహ్మణి—బ్రహ్మమునందగు అష్టాక్షరమునందె
మధ్యమేన-నడుమనుండునట్టి (నమః అనుపదము)
పురతః-ముందుండినట్టి (ప్రణవములోగూడ)
ఈక్షితేన-చేర్పబడియుండు
నమసా-నమః అనుపదముచేత
పుంసః-జీవునియొక్క
స్వరూపం-శేషత్వమగు స్వరూపము
శిక్షితం-శోధింపబడుచున్నది
స్థానతః-అదియుండు స్థానమునందు ఆవృత్తివలన లభ్యమైన అఖండనమస్సుతో జేర్పబడియుండు సఖండమైన నమః పదముచేత
గతిః-పొందదగినది (శోధింపబడుచున్నది).

పశ్చాత్-వెనుకనుండు నారాయణాయ అను పదము తోడ చేర్పఁబడియుండు సఖండమైన నమః పదముచేత
గమ్యం-పొందఁదగినదైన కైంకర్యము శోధింపఁబడు చున్నది.
తస్య-ఆయొక్క
హరేరేవ-సర్వశేషి యగు భగవంతునికే
స్వాతంత్ర్యం-స్వాధీనముగా నుండుటయును
నిజరక్షణం-తనను రక్షించుటయును
వృత్తిశ్చ-శేషభూతులైన ఈజీవులకుపగినట్టికైంకర్యమును
సముచితా-చక్కఁగాఁదగినది
అన్యోచితాన-ఇతరులకు దగినది కాదు.
ఇతి-ఇట్లు
వివిచ్య-విభజించి
కథితం-చెప్పఁబడినది
తతః-కావున
స్వస్యాపి-పరమాత్మకును తనకును
న, అర్హం-తగినదికాదు.

తా. మంత్రిశ్రేష్ఠమైనట్టి అష్టాక్షరియందలి మధ్యయందుండు నమఃపదమును దీనికి ముందుండు ప్రణవముతోడఁజేరిన మకారముతోను, వెనుకనుండు నారాయణాయ అనుపదముతోను, అచ్చటనే రెండు మాఱులు ఆవృత్తిచేసి చేర్పఁబడియుండు నమః అనుపదముతోను, ఇట్లు మూఁడుచోటులయందును అర్థముచేయుటచేత, ఈజీవునికిస్వరూప ఉపాయ పురుషార్థములను మూఁడును చక్కఁగా శోధింపఁబడినవైనవి. ఎట్లన, నమః అను సఖండమైన (రెండుపదములుగా విభజింపఁబడియుండు) నమశ్శబ్దమును ప్రణవముతోఁ గూడఁజేర్చి అర్థముచేయుటవలన ఈజీవుఁడు పరమాత్మకే శేషుఁడు అని తెలుపబడు చున్నది. ఇట్లుతనవాఁడుకాదని అర్థముచేయుటవలన ఈజీవునికి స్వాతంత్ర్యము నివర్తియై పరమాత్మకేవీఁడు శేషుఁడనెడి స్వరూపము చక్కఁగాగనఁబఱచఁబడుచున్నది. ఈ నమః పదమునే నమః నమః అని రెండుమాఱులు ఆవృత్తిచేసి అచ్చటనే అర్థముచేసినయెడల ఉపాయము (ప్రపత్తి) జీవునిదికాదని అర్థమగుటచేత పరమాత్మ చేయింపఁగా జీవుఁడు ఉపాయమును చేయుటవలన పరమాత్మవలె జీవునికి ఉపాయమునందు ప్రధానకర్తృత్వము లేదని ఉపాయస్వరూపము చక్కఁగాఁ దెలియపఱచఁబడినది. ఈ నమశ్శబ్దమును వెనుక నుండు నారాయణాయ అనుపదముతోఁజేరి అర్థముచేసినయెడల శ్రీమన్నారాయణునికేసకలవిధకైంకర్యములును చేయఁగలవాఁడను, నాకొఱకు చేయువాఁడనుగానని అర్థమగుటవలనను, ఆకైంకర్యమునందు తన ప్రయోజనము నివర్తియగుటచేతను, ప్రాప్యస్వరూపముచక్కఁగా కనఁబఱచబడినదగుచున్నది. దీనివలన స్వరూపము, ఉపాయము, పురుషార్థము అను మూఁడును స్పష్టముగాఁగనఁబఱచఁబడినవి. గనుక స్వామిగానుండుట, తనను రక్షించుట, శేషత్వరూపమైన భగవత్కైంకర్యము స్వీకరించుట ఇవి భగవంతునికే తగునుగాని తక్కినవారికి తగదనిసిద్ధించెను. ఈ జీవుఁడు పరమాత్మకుతక్క వేరెవ్వరికిని శేషుఁడు కాఁడు. వేరెవ్వరిని రక్షకునిగా పొందువాఁడును కాఁడు. వేరెవ్వరికిని అర్హుడుకాడు. అని ఆకారత్రయము సిద్ధించెను. ౨.

అవ. ఈశ్లోకముచేత నారాయణశబ్దార్థమును కృపచేయుచున్నారు.

శ్లో. అకారార్థాయైవ
స్వ మహ మథ మహ్యా న్న నివహా
నరాణా న్నిత్యానా
మయన మితి నారాయణ పదం
య మాహాస్మై కాలం
సకలమపి సర్వత్ర సకలా
స్వవస్థా స్వావిస్స్యు
ర్మమ సహజ కైంకర్య విధయః.

ప్ర. అహం నేను
అకారార్థాయైన-అకారమునకు అర్థమైన పరమాత్మకే
స్వం-శేషుఁడను,
అథ-మఱియును (నేను)
మహ్యం-నాకు
న-శేషుఁడనుకాను.

(1) నరాణాం-నరములని చెప్పఁబడెడి
నిత్యానాం- నిత్యములుగానుండు జ్ఞానము. ఆనందము, అమలత్వము-శక్తి-వాత్సల్యము-సౌశీల్యము- ఈ మొదలగు ధర్మగుణములయొక్కయు; దివ్యమంగళ విగ్రహముయొక్క గుణములగు కాంతి. సౌకుమార్యము (మృదుత్వము). మొదలగువానియొక్కయు; దివ్యభూషణముల యొక్కయు. దివ్యాయుధముల యొక్కయు. నిత్యసూరులయొక్కయు. భగవంతునియొక్క ఉపచార సాధనములైన ఛత్రచామరాదులయొక్కయు. ద్వారపాలకులు గణాధిపతులు. ముక్తులు. పరమాకాశము. మూలప్రకృతి. బద్ధాత్మలు. కాలము మహదాది వికారములు. అంశములు. అంశములమధ్యయందుండు పదార్థములు. అను నీ మొదలగువాని యొక్కయు.
నివహా (న్య)-సమూహమునకు
అయనం-ఆధారము

(2) నరాణాం-నరులని చెప్పఁబడెడి
నిత్యానాం-నిత్యులైన జీవులయొక్క
నివహా(న్య) - సంఘమునకు
అయనం-ప్రాప్యము(పొందదగినది) ప్రాపకము (ఉపాయము.

(3) నరాణాం, నిత్యానాం-నిత్యులైనజీవాత్మలయొక్క
నివహాః-సమూహమునకు
అయనం, ఇతి-ఆధారమని
యం-ఏభగవంతుని
నారాయణపదం-నారాయణ అనుపదము
అహ-చెప్పుచున్నదో
అస్మై-ఈభగవంతునికొఱకు నిమిత్తము
సకల-సమస్తమైన
కాలం-కాలములయందును
సర్వత్ర-సర్వదేశములయందును
సకలాసు-సమస్తమైన
అవస్థాసు-అవస్థలయందును
మమ-నాయొక్క
సహజకైంకర్యవిధయః-స్వభావముచే కలిగియుండు కైంకర్యములు
ఆవిస్స్యుః-కలుగునుగాక.

తా. ప్రణవముయొక్క అకారార్థమైన భగవంతునికి నేను శేషభూతుఁడను. నాకు నేను శేషుఁడనుకాను. (దీనివలన ప్రణవనమస్సుల యొక్క అర్థములను అనువాదము చేసినట్లు) నర అను శబ్దమునకు నిత్యపదార్థములని అర్థము. నారము అనగా వానియొక్క సమూహము. అయనమ్ అనగా ప్రాప్యము ప్రాపకము-ఆధారము అని మూడు అర్థములు దీనివలన నిత్యములని చెప్పఁబడు జ్ఞానానందాదులకు ఆధారమని సిద్ధించుచున్నది.

* జ్ఞానాదికాలమునకుఁగలవి వాని యొక్క స్థితి చేతనే నిత్యములుగా నున్నవి. మహదాది తత్త్వములు ప్రవాహముచేత నిత్యములు. స్థితి చేత నిత్యములేవియనగా, ఉత్పత్తి నాశములు గలవియే యైనను పూర్వమందున్న నామరూపములు చెడక తిరిగి అట్టివాటిని కలిగియుండునట్టివి.

మఱియు నరులు అని చెప్పఁబడు జీవుల సమూహమునకు ప్రాప్యుఁడనియును, ప్రాపకుడనియును వేతిలోక యర్థము. ఈయర్థముచేత భగవంతునికి పరత్వము సిద్ధించుచున్నది.

మఱియు నరులని చెప్పఁబడు జీవులసమూహమును ఆధారముగాఁగలవాడు పరమాత్మయని వేతిలోకయర్థము. దీనిచేత భగవంతుఁడు అందరిలోపల ప్రవేశించియున్నాఁడని స్ఫురించుటవలన భగవంతుడే సర్వాంతర్యామి యనియును సర్వస్ముల సాక్షియనియును చెప్పఁబడుచున్నది.

ఇట్టి భగవంతుని నారాయణశబ్దము చెప్పుచున్నదో, ఆభగవంతునిపొందు నిమిత్తము సర్వకాలములయందును, సర్వావస్థలయందును, సర్వదేశములయందును, నిలుచుట, కూర్చుండుట, పరుండుట, మొదలగు సర్వావస్థల యందును, నాకు స్వభావ సిద్ధములుగా నుండు సకల విధ కైంకర్యములును, వాని విరోధములైన అనాది కర్మముల నివర్తియు సిద్ధించునుగాక. కావున ఈ తిరుమంత్రమునందుండు ప్రణవముచేత ఈ జీవులకు విశేషత్వమును, నమశ్శబ్దముచేత పరమాత్మకు పరాధీనముగానుండుటయును, నారాయణశబ్దముచేత పరమాత్మకు కైంకర్యముచేయుటయును చెప్పఁబడినది.

వ. ఇట్లు మూఁడుశ్లోకములచేత తిరుమంత్రముయొక్క అర్థమును తెలియఁజేసి ప్రపన్నులకు తర్వాత నేదేని విషయాంతరములవలన దేహాత్మభ్రమము మొదలగునవి కలుగక యుండుటనిమిత్తము ఈ అర్థానుసంధానము అవశ్యముగాఁ జేయవలయునని ప్రతిపాదించుచున్నారు.

శ్లో. దేహాసక్తాత్మ బుద్ధి ర్యది భవతి పదం
సాధు విద్యా త్తృతీయం!
స్వాతంత్ర్యాంధో యది స్యాత్
ప్రథమ మితర శేషత్వ ధీ శ్చే ద్ద్వితీయమ్,
ఆత్మ త్రాణోన్ముఖ శ్చేత్
నమ ఇతి చ పదం బాంధవాభాస లోలః
శబ్దం నారాయణాఖ్యం
విషయచపలధీ శ్చే చ్చతుర్థీం ప్రపన్నః.౪.

టీ. ప్రపన్నః-ప్రపత్తిచేసినవారికి
దేహే-తమదేహమునందు
ఆసక్త-సంబంధించిన
ఆత్మ-ఆత్మయనెడి
బుద్ధిః-బుద్ధికలవాఁడుగా
భవతియది-అగుదురేని
తృతీయపదం-మూఁడవపదమైన (మకారము) యొక్క అర్థమును
సాధు-చక్కఁగా
విద్యాత్-తెలుసుకొనవలయును (అనుసంధించుకొనవలెను.)
స్వాతంత్ర్యాంధః.
స్వాతంత్ర్య-స్వతంత్రముగలవాఁడనెడి
అంధః-గ్రుడ్డివారుగా (మూర్ఖుఁలుగా)
భవతియది-అగుదురేని
ప్రథమం-ప్రణవమునందలి ప్రథమపదమైన అకారము యొక్క అర్థమును తెలియవలయును.
ఇతరశేషత్వధీశ్చేత్.
ఇతర-భగవంతుడు శ్రీదేవి భాగవతులు ఆచార్యులు వీరుగాక తక్కినవారికి
శేషత్వ-శేషభూతుఁడుగానుండుటయందు
ధీశ్చేత్-బుద్ధికలుగు నేని
ద్వితీయం-ప్రణవమునందలి ద్వితీయపదమైన ఉకారము (యొక్క అర్థమును తెలియవలయును.)
ఆత్మత్రాణోన్ముఖశ్చేత్.
ఆత్మ-తనయొక్క
త్రాణ-రక్షణమునందు
ఉన్ముఖశ్చేత్-ప్రయత్నముగలవారగుదురేని

మానవు బంధువులు నెడి అజ్ఞానము నివర్తియగును.

శాస్త్రవిహితముగను శాస్త్రగర్హితముగను నుండు దుర్విషయములయందు ప్రీతిగలవారుగ నుండుచేసి అప్పుడు నారాయణ పదముమీఁద నుండు చతుర్థీవిభక్త్యర్థమును అనుసంధింపవల యును. ఆచతుర్థీవిభక్తివలన శ్రీమన్నారాయణుని కొఱకే కైంకర్యము చేయగలవాఁడనేగాని, వేఱే విధముగా నేదియు చేయువాఁడనుకానని అర్థము స్ఫురించుటవలన, తనస్వరూపమునకు తగనివియును, అల్ప సుఖములను కలుగఁజేయు నవియును, అంత్యమున విరసము నొసంగునవి యును, అస్థిరములైనవియును, జుగుప్సాస్పదము లైనవియును నగు స్త్రీ మొదలగు విషయానుభ వములయందు ఆశకలుగఁజేయు అజ్ఞానము నివ ర్తియగును.

సకల వేదశాస్త్రార్థములని చెప్పఁబడుఅర్థపం చకమును ఈ తిరుమంత్రమునందు సంగ్రహము గాఁ చెప్పఁబడియున్నది. ఎట్లన:-

౧. పొందఁదగినట్టి పరమాత్మస్వరూపమును ౨.దానిని పొందునట్టి జీవస్వరూపమును, 3. దానిని పొందుటకు సాధనమైన భక్తి ప్రపత్త్యాది ఉపాయ స్వరూపమును, ౪. ఆ ఉపాయములవ లన పొందఁదగిన ఫలస్వరూపమును, ౫. దాని విరోధి స్వరూపమును, ఇట్లుగా అయిదు అర్థము లు చెప్పఁబడెను. వీనిలో,

౧ ప్రణవమువలన జీవస్వరూపమును, ౨ అఖండనమశ్శబ్దమువలన ఉపాయ స్వరూపమును, ౩ సఖండనమశ్శబ్దమువలన విరోధి స్వరూపము ను, ౪ నారాయణ పదమువలన పరమాత్మ స్వరూపమును, ౫ నారాయణ పదము మీఁద నుండు చతుర్థీవిభక్తివలన ఫలస్వరూపమును, ఇట్లు అయిదర్థములు ఈమంత్రమునందు చెప్పఁ బడియున్నవి.

అవ. ఇట్లు నాలుగు శ్లోకములచేత మూల మంత్రవ్యాఖ్యానముచేసి ప్రపత్త్యనుష్ఠానక్రమ మును ప్రకాశింపఁజేయునదైన ద్వయమనెడి మంత్రరత్నమును రెండు శ్లోకములచేత కృప చేయుచున్నారు.

శ్లో॥ నేతృత్వ న్నిత్య యోగం
    సముచిత గుణ జాతంతను ఖ్యాపనం చో
  పాయం కర్తవ్య భాగం
    త్వథ మిథున పరంప్రాప్య మేవం ప్రసిద్ధమ్,
  స్వామిత్వం ప్రార్థనాం చ
    ప్రబలతర విరోధి ప్రహాణం దశైతా
  మంతారం త్రాయతే చే
    త్యధిగత నిగమ ష్షట్పదోయంద్విఖండః.౫.

టీ. నేతృత్వం-పురుషకారముచే రక్షించుటయును.
నిత్యయోగం-నిత్యమైన సంబంధమును
సముచితగుణజాతం
సముచిత-మిక్కిలి తగినవియైన
గుణజాతం-కల్యాణగుణముల సమూహమును
తనుఖ్యాపనం
తను-దివ్యమంగళవిగ్రహముయొక్క
ఖ్యాపనంచ-ప్రకాశమును
ఉపాయం-సాధనమును
కర్తవ్యభాగం

ఆరుపదములతోడను రెండువాక్యములతోడను గూడినదియును కఠవల్ల్యాద్యుపనిషత్తులయందు ప్రఖ్యాతమైనదియు నగు ద్వయమనెడి యీమంత్రము రక్షించుచున్నది.

అవ. ఇట్లు మంత్రరత్నముయొక్క పదార్థములను కృపచేసి ఈ అర్థములను అనువాదము చేయువ్యాఖ్యానమును విశదీకరించుచున్నారు.

శ్లో॥ ఈశానాం జగతా మధీశ దయితాం
నిత్యానపాయాం శ్రియం
సంశ్రిత్యాశ్రయణోచితాఖిలగుణ
స్యాంఘ్రీ హరే రాశ్రయే,
ఇష్టోపాయతయా శ్రియా చ సహితా
యాత్మేశ్వరా యార్థయే
కర్తుం దాస్య మశేష మప్రతిహతం
నిత్యం త్వహం నిర్మమః, ౭

టీ. జగతాం-లోకములకు
ఈశానాం-నియమించునదియును
అధీశదయితాం.
అధీశ-సర్వేశ్వరుఁడైన భగవంతునకు
దయితాం-ప్రియభార్యయైనదియును
నిత్యానపాయాం.
నిత్య-ఎల్లప్పుడును
అనపాయాం-భగవంతునివిడువనిదియును అగు
శ్రియం-శ్రీమహాలక్ష్మిదేవిని
సంశ్రిత్య-శరణుజెంది
ఆశ్రయ ... ...గుణస్య.
ఆశ్రయణ-శరణముజెందుటకు
ఉచిత-తగినవియైన
అఖిల-సమస్తమునైన
గుణస్య-కల్యాణగుణములుగల
హరేః-ఆశ్రితుల అపరాధములను క్షమించుభగవంతుని
అంఘ్రీ-చరణములను
ఇష్టోపాయతయా.
ఇష్ట-అభీష్టఫలమునకు
ఉపాయతయా-సాధనముగా
ప్రపద్యే-పొందుచున్నాఁడను.
శ్రియాచ-శ్రీమహాలక్ష్మితోఁగూడ
సహితాయ-నిత్యముగాఁజేరియుండునట్టి
ఆత్మేశ్వరాయ.
ఆత్మ-జీవులకు
ఈశ్వరాయ-ఈశ్వరుఁడైన పరమాత్మునకు
అహమ్-నేను
నిర్మమః-అహంకారమమకారములు లేనివాఁడై
అశేషమ్-సమస్తమైన
అప్రతిహతం-అటంకములేని
నిత్యం-సర్వకాలమునుచేయునట్టి
దాస్యం-కైంకర్యమును
కర్తుం-చేయుటకు
అర్థయే-ప్రార్థించుచున్నాఁడను.

తా. లోకములకు ఈశ్వరిగను, సర్వేశ్వరుఁడైన భగవంతునకు ఇష్టమహిషిగను, భగవంతుని నెల్లప్పుడును ఎడబాయక యుండునట్టిదిగను నుండు శ్రీమహాలక్ష్మిని పురుషకారముగా శరణమొంది, తర్వాత ఆశ్రితులు శరణమొందుటకు యోగ్యమగు వాత్సల్య స్వామిత్వ సౌశీల్య సౌలభ్య జ్ఞానశక్తి పూర్తి ప్రాప్తి మొదలగు కల్యాణగుణములచే ప్రకాశించువాఁడును సర్వపాప నివారకుఁడును నగు భగవంతునియొక్క దివ్యచరణములను నీకువలయు మోక్షరూపఫలమునకు సాధనముగా, ఆశ్రయించుచున్నాఁడను. (ఇది ద్వయముయొక్క పూర్వఖండార్థము). ఇట్లు శరణాగతులకు పురుషకారమును జేయు శ్రీమహాలక్ష్మీదేవితోఁ గూడియుండునట్టియు సర్వాత్మలకును

ఈశ్వరుఁడైన శ్రీమన్నారాయణునకు దాసుఁడనై అహంకార మమకారములులేనివాఁడనై సర్వవిధకైంకర్యములను సర్వకాలములయందును సర్వావస్థలయందును చేయుటకు ప్రార్థించుచున్నాఁడను. (ఇది ఉత్తరఖండముయొక్క అర్థము).

అవ. ఇట్లు మన్త్రరహస్యమైన ద్వయమునకు వ్యాఖ్యానముచేసి ఇప్పుడు ఆవ్యయార్థమునకు వివరణముగను, భగవంతునిచే చేతనోజ్జీవనార్థము కృపచేసినదియును నగు చరమశ్లోకమునకు వ్యాఖ్యానముగా నీశ్లోకమును కృపచేయుచున్నారు.

శ్లో॥ మత్ప్రాప్త్యర్థతయా మయోక్త మఖిలం
సన్త్యజ్య ధర్మం పునః
మామేకం మదవాప్తయే శరణ మి
త్యార్తోవసాయం కురు
త్వా మేవం వ్యవసాయయుక్త మఖిల
జ్ఞానాది-పూర్ణో హ్యహం
మత్ప్రాప్తి-ప్రతిబన్ధకై ర్విరహితం
కుర్యాం శుచ మ్మాకృథాః,

టీ. మత్ప్రాప్త్యర్థతయా.
మత్-నాయొక్క
ప్రాప్తి-పొందుటను
అర్థతయా-ప్రయోజనముగాఁగలిగియుండుటచే
మయా-నాచేత
ఉక్తం-చెప్పఁబడియుండు
అఖిలం-సమస్తమైన
ధర్మం-కర్మయోగజ్ఞానయోగములతోఁగూడిన
భక్తియోగమును
సన్త్యజ్య-ఉపాయబుద్ధిని పూర్తిగావిడిచి
మాం-నన్ను
ఏకం ఒక్కనినిమాత్రమే.
ఆర్తః-దుఃఖపడెడినీవు
మదవాప్తయే-నన్నుపొందుటకై
శరణమితి-ఉపాయమని
అవసాయం-నిశ్చయమును
కురు-చేయుము
ఏవం-ఈప్రకారముగా
వ్యవసాయయుక్తం,
వ్యవసాయ-నిశ్చయముచేతఁ
యుక్తం-కూడియుండు
త్వాం-నిన్ను
అఖిలజ్ఞానాదిపూర్ణః,
అఖిల-సమస్తమైన
జ్ఞానాది-జ్ఞానమే ప్రధానముగాఁగలదివ్యగుణములవలన
పూర్ణః-నిండినవాఁడైన
అహం-నేను
మత్ప్రాప్తి ప్రతిబన్ధకైః,
మత్-నన్ను
ప్రాప్తి-పొందుటకు
ప్రతిబన్ధకైః-విరోధములైన అనాదిపుణ్యపాపరూపములగు సర్వకర్మలచేతను
విరహితం-విడువఁబడినవానినిగా
కుర్యాం-చేయగలను
శుచం-వ్యసనమును
మాకృథాః-పొందవలదు.

తా. నన్ను పొందుటకు సాధనములుగాఁ జెప్పఁబడియుండు కర్మయోగ జ్ఞానయోగ భక్తియోగములనెడి మోక్షసాధనములను అనుష్ఠించుటకు శక్తిలేదని నీవు వ్యసనపడవలదు. నీవు నన్నొకనినే ఉపాయముగా నిశ్చయించుకొనవలయును. ఇది చరమశ్లోక పూర్వార్థము,

ఇచ్చట కర్మయోగాదులను అనుష్ఠింపక నన్నొకనినే శరణుపొందిన చాలునని చెప్పినంత

మోక్షమున నిత్యనైమిత్తికాది ప్రపత్తిసాధనములనుకూడ వదలిపెట్టవచ్చునని యూహింపఁదగదు. ప్రతివారున్ను తమతమ వర్ణాశ్రమప్రయుక్త కర్మలనన్నింటిని భగవదాజ్ఞారూపముగ భగవదర్పణబుద్ధ్యా చేయవలయును. ఇట్టి విశ్వాసముతోఁ గూడిన నిన్ను జ్ఞానశక్త్యాది గుణములతోఁ గూడిన నేను, నన్ను పొందుటకు విరోధములైయుండు పుణ్యాపాపరూపములైన సర్వకర్మలయందుండి నివర్తింపచేసెదను. దుష్కరమై అపాయకరమైయుండు కర్మయోగాది సాధ్యోపాయములను చేయుటకు శక్తుఁడనుకాను కదాయని చింతింపవలదు.

ఇచ్చట భగవంతునిఁ బొందుటకు విరోధులైనవన్నియు పాపములని చెప్పఁబడుచున్నవి. అవి యేవనఁగా, అవిద్య, కర్మము, వాసన, అభిలాష, ప్రకృతిసంబంధము, దానిభేదమైన దేహాత్మాభిమానము, దానిని సంబంధించిన అహంకార మమకారములు అనునవి.

అవిద్యయనఁగా, జ్ఞానహీనము. ఇది అజ్ఞానము, అన్యథాజ్ఞానము, విపరీతజ్ఞానము, అని మూఁడువిధములు. వీనిలో అజ్ఞానమనఁగా, మూఢత్వము. అన్యథాజ్ఞానమనఁగా, ఒకటిని వేఱొకటిగాఁదెలియుట. విపరీతజ్ఞానమనఁగా, శత్రువును మిత్రునిగా భావించుట.

కర్మమనఁగా ఇదిపుణ్యమనియు పాపమనియు రెండువిధములు. పుణ్యకర్మము ఫలాపేక్షారహితమైనది. పాపకర్మము పరహింసాకరమైనది.

ఇచ్చట పుణ్యకర్మలును పాపకర్మలవలె మోక్ష విరోధములు. ఈరెండు కర్మములును పూర్వాఘములనియును ఉత్తరాఘములనియును ఒక్కొకటియును రెండువిధములు. పూర్వాఘములనఁగా, తాము ప్రపత్తిని అనుష్ఠించుటకు పూర్వము చేయఁబడు కర్మములు. ఉత్తరాఘములనఁగా, ప్రపత్తిని అనుష్ఠించిన అనంతరము చేయఁబడు కర్మములు.

వాసనయనఁగా, అనాదిగా తాము చేయుచు వచ్చిన కార్యములను, ఇప్పుడును తమయిష్టము లేకయే చేయుచుండునట్టి అభ్యాసము. అభిలాషయనఁగా, ఇంద్రాది మహాభోగములు కావలెనను కోరిక. ప్రకృతి సంబంధమనఁగా స్థూల సూక్ష్మమైన దేహసంబంధము. మఱియు పూర్వాఘములు సంచితమనఁగా, కర్మములయొక్క ఫలములను నిచ్చుటకు ప్రారంభించిన కర్మములు

ఈచెప్పఁబడిన ఉత్తరాఘములు బుద్ధిపూర్వకములనియును, అబుద్ధిపూర్వకము లనియును రెండువిధములు. బుద్ధిపూర్వోత్త రాఘములు ప్రాయశ్చిత్తముచే నివర్తియగుచున్నది. ప్రాయశ్చిత్తము చేయకపోయినను అనుభవమువలన నివర్తియగుచున్నది. భక్తియోగమనెడి ఉపాయాంతరమును అనుష్ఠించినవారికి పైన చెప్పిన కర్మములయందు ప్రారబ్ధ కర్మములును ప్రాయశ్చిత్తముచేయని ఉత్తరాఘములును అనుభవముచేతనే నివర్తియగుచున్నది. అబుద్ధిపూర్వోత్తరాఘములు తామనుష్ఠించిన ప్రపత్తిబలముచేత నివర్తియగుచున్నది.

యోగ జ్ఞానయోగ భక్తియోగములగు మోక్షోపాయములను అనుష్ఠించుటకు స్వాతంత్రమును లేదు. అయినను శాస్త్రములయందు చేతనులను ఉద్దేశించి యీ ఉపాయములను అనుష్ఠించునట్లు నీవు విధించి యుండుటచేత, ఈ యుపాయములను అనుష్ఠించుటకు దాసునికి నీవలన స్వాతంత్రి మొసంగఁబడినది. అట్లుండియును మిగుల అల్పజ్ఞానముతోడఁ గూడిన దాసుఁడు వీనిని అనుష్ఠింపక యుండవచ్చునన్ననో, మోక్షాపేక్షగల దాసునకు అవి సాధనములుగా నుండుటవలన వీనియందభిలాషయున్నది. అయినను అనుష్ఠించుటకు అశక్తుఁడనై యున్నాఁడను. ఈఉపాయములను అనుష్ఠించుటకు అశక్తులుగా నుండువారిని యుద్దేశించి సులభోపాయముగా శాస్త్రములయందు విధింపఁబడియుండు ఈప్రపత్తిని అనుష్ఠింపఁగుండఁగదా యనఁగా, దీనికి అంగముగా విధింపఁబడియుండు కర్మలయందు విశ్వాసము లభించుట మిగుల దుష్కరముగాన, ఈప్రపత్తిని అనుష్ఠింప నసమర్థుఁడనుగా నున్నాఁడను. ఇట్లు ఏయొక్క గతియునులేక దుఃఖాకుల మానసుండనైన దాసునకు అర్జునునకు సారథిగా నున్నప్పుడు ఉపదేశించిన నీయొక్క కడపటివాక్యమైన గీతాశాస్త్రమందలి చరమశ్లోకమునందు నన్ను నీవు శరణుపొందుము, నిన్ను నేను సకలవిధములైన పాపములనుండి రక్షించెదను, అని దేవరవారు కృపచేసినదానిని తలంచి, ఇందు మహావిశ్వాసముగలవాఁడనై ఈప్రపత్తిని అనుష్ఠించితిని. దీనివలన దేవరవారు దాసునిపాపములను నివర్తి చేయుదురని దృఢమైన నమ్మికతోఁ గూడిన వాఁడుగా నున్నాఁడను.

అష్టశ్లోకి ఆంధ్రటీకా తాత్పర్య సహితము

సంపూర్ణము.








# ప్రాచీన భారత సామాజిక జీవనము స్త్రీ కొసంగిన స్థానము



(కల్యాణి పత్రికానువాదము – అనువాదకురాలు: చి. సౌ. పుష్పరాణి మహాదామణి)

నేడు పాశ్చాత్యశిక్ష, పాశ్చాత్యవిద్యాప్రచారము మూలమున భారతదేశమునకూడ నారీధర్మ విభాగమున నాందోళనలు జరుగుచున్నవి. స్త్రీ సౌక్య— సరళతాపూర్ణమగు జ్ఞానము కోమలతతో కూడిన ధైర్యము, త్యాగమయమగు విషయభోగము, మొదలగు సుగుణపరిపూర్ణములగు ననేక చిత్రముల ప్రాచీనేతిహాసములయందు చూచినచో పూర్వకాలపు స్త్రీలకును అధునాతనాంగ్లవిద్యాప్రవీణులును, పాశ్చాత్యనాగరికత నలవరచుకొనవలెనని యాందోళన మందుచున్న నిప్పటి స్త్రీలకును కలతాత్పర్యము కానవగును. సాధారణముగ సేవచేయుటయే తన ధర్మముగ నెన్నుకొనుటచే నామె 'దేవియనియు' త్యాగ మొనరించిన దగుటచే 'సామ్రాజ్ఞి' యనియు, ప్రపంచమునంతను తన వాత్సల్య పరిపూర మొనర్చజాలియుండుటచే 'జగన్మాత' యనెడు సార్థకనామములు కలదియై స్త్రీ యనబడును. ఆమె ప్రపంచము నంతను తన నిస్స్వార్థసేవ త్యాగములచే నాహ్లాదపరచు శక్తి కలిగియుండును. సమాజమున నామె కుచ్చస్థాన మీయబడెను. కాని యధునాతనాంగ్లశిక్షాశిక్షితులగు స్త్రీలు విషయసేవనా లాలసులై విడాకుల చట్టమును గూర్చియు, వివాహనిరోధములగూర్చియు, ధనధాన్యములయందు స్త్రీలకుకూడ పురుషులతో సమానహక్కులు కావలయుననియు, పోరాడుచున్నారు. నేడును సమాజమున స్త్రీల కున్నత స్థానమున్నను యది విషయవాసనలచే మోహావృతమగు రూపమునకేగాని, పూజనీయురాలును స్వార్థముకన్నను ఉత్కృష్టమయినదగు సహాత్మ్య రూపమునకొసంగబడుటలేదు. నేటి కట్టును, కాలే

జీలు, వివిధములగు సంఘములు మొదలైనవే దుస్థితులకు కారణములు. యుగపరివర్తనముతో పాటు ఆచారవ్యవహారములయందు మార్పులు కలుగుట తప్పని సరియైనను యనాది సిద్ధములగు ధర్మములకు హాని కలిగింపరాదు. సంసారమున స్త్రీపురుషు లిరువురకును మహత్త్వమున్నది. వారిలో నొకరి కొకరు సహాయులగుచున్ననే వారి జీవితము సార్థకమగును. స్త్రీలు భగవన్నిర్మితమగు తమ స్థానము నతిక్రమించి పురుషుని స్థానము నాక్రమించవలెనన్న తప్పక ముప్పు వాటిల్లును. మన ప్రాచీన హిందూ సంస్కృతియందు గృహస్థాశ్రమ మొక యజ్ఞముగ పోల్చియున్నారు. దానివలన స్త్రీ యర్ధాంగినీ రూపమున పురుషునకు సహచారిణియై యుండును. రఘువంశమున నప్పటి కాలపు స్త్రీలను కాళిదాసెట్లు వర్ణించెనో గాంచుడు. నిర్జన వనప్రదేశమున ఋషిరాజగు వశిష్ఠుడు తన భార్యయగు యరుంధతీదేవితోగూడ సాయంకాలపు హోమక్రియలు జరుపుచున్నాడు. ఇవి స్త్రీలకు ధర్మశాస్త్రోక్తమున కెట్టి యుచితమగు నుదాహరణము అట్లే శ్రీరామచంద్రుడు పితృవాక్యపరిపాలనమున బద్ధకంకణుడై యుండ సహధర్మచారిణియగు సీతయు వనమున కాతని వెంబడించెను. ప్రాచీన భారతనారీమణులు తమ జీవితమును తపశ్చర్యచేతనే సార్థకమగునని తలంచుచుండిరే కాని విషయభోగమున వారిచిత్తము లగ్నమయ్యెడిది కాదు, పార్వతి తపశ్చర్యవలన పవిత్రమగు జీవితము లేశమైనను చేటి వాతావరణమున కానరాదా! సావిత్రి తన కను

కూలుడగు భర్తను లోకహితకరమగు రామకథ యడిగి తన కోర్కెను తీర్చుకొననేగాని విషయభోగముల కాంక్షించలేదు. అట్లు తన భర్తకు సహధర్మచారిణియై యుండినదానికి తగిన ఫలముగ కీర్తిమంతులగు కార్తికేయ గణపతులను పుత్రులనుగా పొందగలిగినది. పతిననుసరించి వర్తించుటయే నారీధర్మమున ముఖ్యోద్దేశము. పతిని పరమదైవముగ నెంచి సతి తన సర్వస్వము నాతని యధీనమొనర్చవలెను. ఎట్టి పరిస్థితులలోనైనను ఎట్టి యాపదలలోనైనను తాను స్వతంత్రురాలు కాగూడదు. ఇట్లామె భర్తకు పరాధీనురాలై యహంకారమును వీడియుండిన ప్రకృతియంతయు నామె యధీనమగును. ప్రపంచమునందలి సర్వశక్తులును యామె యధిక తేజమున నిస్తేజములై వ్యర్థములగును సృష్టియామె వచనానుసారము ప్రవర్తించును. కావుననే కుష్ఠురోగపీడితుడగు భర్తను సంరక్షించుటకు పతివ్రతాలలామయగు శాండిలి తన పాతివ్రత్య ప్రభావమున సూర్యుని నాపగించెను. యమధర్మరాజు బారినుండి సాధ్వీమణియగు సావిత్రి తన పతి జీవనముల వరదానముగ బడసెనన నిందాశ్చర్యమేమున్నది? ఆధునికులీ కథల నాలకించి యివి యన్నియు కృతయుగమున జరిగినవే కాని యీనాటి కలియుగమున వీటి నెవ్వరు నమ్ముదురని నుడివిన నుడువవచ్చును. అట్లు కానిచో నిప్పటికిని రాజపుత్రానుయొక్క యితిహాసము లింకను యంతరించలేదు కదా! వాటినైనన జూచిన నీరీ వాదనను వదలవచ్చును. పూడావతి వాకుయొక్క భాగ్యము సౌందర్యనిధి వ

కుసుమకోమలయగు సతీతిలకము తన భర్తకై యసువుల వీడిన కథ నేటికిని సువర్ణాక్షరముల ముద్రితమై ప్రకాశించుచున్నది. ఇట్లే భర్తతో సహగమన మాచరించిన స్త్రీల కథలును లెక్కకు మిక్కుటముగ నీ యితిహాసములలో కానగును. ఆ యితిహాసములు కాకున్నను శారద కస్తూరిబా మొదలగు నారీమణుల చరిత్రములు కూడ మనకు ప్రమాణములేక నా! ధర్మార్యారూపమున భర్తకు సహధర్మచారిణియై స్త్రీధర్మముల కాపాడునట్లు మాతృస్థానము నలంకరించి సంతానమును, సన్మార్గము నవలంబింపజేయుటయు స్త్రీల కవశ్యకర్తవ్యమే యగుచున్నది. కౌసల్య శ్రీరామచంద్రుడు దడవుల కేగుతరి వాత్సల్య కోమలతా పూర్ణమగు మనమున బాధపడుచున్నను రాముని పితృవాక్య పరిపాలనమున దృఢప్రతిజ్ఞ కలవాడ వగువని యుపదేశించెను. సుమిత్రయు తన తనయును శ్రీరాముననుసరించి వనవాసము చేయుట కనుజ్ఞ యొసగి సోదరున కగ్రజుని యందుండవలసిన భక్తి గౌరవమును వెల్లడించినది. లక్ష్మణుని కన్నను యూర్మిళా సుమిత్రల త్యాగమే యీ విషయమున ప్రశంసించ దగియున్నది. కుంతీదేవియు తన పుత్రుల రణరంగమున వెనుకంజవేయక తమ ప్రతిజ్ఞల నెరవేర్చుకుని శాశ్వతకీర్తిని బడయునట్లుపదేశ మొనర్చి తన వీరమాతృత్వమును చాటియున్నది. శివాజీయంత వీరపురుషు డగుటకు కారణము జిజాబాయి యొసంగిన యుపదేశమే కదా! నేటికాలమున నేస్త్రీయైనను ఇట్లాదర్శప్రాయముగ తన సంతానమును పోషించుచున్నదా? నేడు భారతదేశ మింతటి దారిద్ర్యము ననుభవించుచు నిక్కట్టుల లోనగుటకు ధనధాన్యలోపము కానేరదు. కాని మీద చెప్పినట్లు పవిత్రపత్నీత్వము నట్టిమాతృత్వ లోపమే సంసారమునంతయు సఫల పరుపజాలు అధ్యాత్మిక తత్వమీరోజులలో నేస్త్రీలయందును కానరాదు. మహారాణీ దుర్గావతీ లక్ష్మీబాయి నేటికిని యాదర్శప్రాయులై యున్నారు. వీరు గాక గార్గి వంటి విదుషీమణులును ఆజన్మ బ్రహ్మచారిణులై విద్యలనేర్పుటయందును నేర్చుకొనుటయందును బ్రహ్మానుభవము నందుచు తమ జీవితముల గడిపే యున్నారు. ప్రాచీన భారత నారీమణులలో సౌసుశీలత, సరళత దివ్యత్వములు వెల్లివిరియు చుండెడివి. వారికి మోక్షము కరతలామలక మగుచుండెడి దనుట నిర్వివాదాంశము. కాని నేటికాలపు నాగరికత యిట్టి స్త్రీస్వభావమును మాయామోహిత మొనర్చి తప్పుదారిని ప్రోత్సహించుచున్నది.

కావున సోదరీమణులారా! పాశ్చాత్యరీతుల ననుసరించి స్వధర్మపాలనమున నేమరపాటు చెందక దేశహితమును స్వహితమును కోరువారలై యట్టింటికిని పుట్టినింటికిని కీర్తి ప్రదాతలై పతి హృదయముల నలంకరించి దేశోద్ధరణ మొనర్చుచు శాశ్వతకీర్తిని బడయుదురు గాక యని సవినయముగ ప్రార్థించుచు నింతటితో విరమించుచున్నాను.




# శ్రీ భగవద్గీతా సందేశ మహోత్సవము

## మదరాసు

శ్రీవిశిష్టాద్వైత పరిచారకసంఘ మదరాసు శాఖామాజమాన్యమున మదరాసు నగరమున శ్రీఉప్పూటూరు ఆళ్వారుశెట్టివారి రామానుజ కూటమునందు ది 2-12-1951 తేదీ లగాయతు శ్రీభగవద్గీతా సందేశమహోత్సవము మహావైభవముగా 18 రోజులు జరుపబడినది. అందు అనేకమంది సుప్రసిద్ధ ఆచార్యపురుషులు, పండితోత్తములు, భాగవతశిఖామణులు, మదరాసు ప్రభుత్వ మంత్రిపుంగవులు, మదరాసు హైకోర్టు న్యాయమూర్తులు, అధ్యాపకులు, అనేకమంది పురప్రముఖులు, విదుషీమణులు పాల్గొనిరి.

ప్రతినిత్యము ఉదయమున భక్తులందరున్ను కలసి రోజునకొక్క అధ్యాయము చొప్పున భగవద్గీతను పారాయణ నొనర్చుచు తిరువీథ్యుత్సవములు జరిపిరి. ఆసమయమున ప్రతినిత్యముకూడ అనేకమందిభక్తశిఖామణులు ఈభాగవతగోష్ఠినంతను తమ యింటిలోనికి ఆహ్వానించుచు అందరికి చందన-కుసుమ-తాంబూలాదుల సమర్పించి గౌరవించుచుండిరి. పిమ్మట రామానుజకూటమున సమిష్టిగ పారాయణజేయుచుండిరి. పిదప అయిదు నిమిషములు శ్రీకృష్ణనామజపము - పిమ్మట 18 ఋత్విక్కులు గీతనంతను పూర్తిగ పారాయణ మొనర్చుచుండిరి. ఆదేసమయమున ఆనాటి అధ్యాయమునకు ఆంధ్రమునను, అరవమునను విశేషార్థములతో కాలక్షేపము జరుగుచుండెడిది.

మధ్యాహ్నము గం. 1-0 మొదలు గం. 2-0 వరకు స్త్రీలకై ప్రత్యేకము విదుషీమణులచే ఉపన్యాసములున్ను, గం. 2-0 మొదలు 5-30 వరకు ఆనాటి అధ్యాయముపై విశేషవిమర్శనాపూర్వక పండితోపన్యాసములున్ను గం. 5-30 లగాయతు రాత్రి గం. 8-30 వరకు భక్తవరులచే గీతపై సామాన్యోపన్యాసములున్ను జరుపబడినవి.

ఈ 18 రోజులున్ను ఖండఖండాంతరముల యందుకూడ ప్రచురించబడిన వివిధభాషలలో అనువదించబడిన శ్రీభగవద్గీతా గ్రంథముల ప్రదర్శనము జరుపబడెను.

ఈ ఉత్సవనివేదిక ముందు ప్రచురించబడగలదు.

---

## కట్నములు

### పాలకొల్లు.

“శ్రీయతిరాజసేవా మహిళాసమితి, వారు భక్తినివేదన సన్మానముగా 50 రూపాయలు సమర్పించిరి. వీరికి శ్రియఃపతి ఆయురారోగ్య ఐశ్వర్యములు కటాక్షించుగాక.

# విశిష్టాద్వైత ప్రచారక సంఘం

## ప్రచార వార్తలు

రామచంద్రపాలెం (తూ॥ గో॥ జిల్లా.)

సత్తి సత్యనారాయణరెడ్డి భార్య విశాలాక్షమ్మ
పలాల సూరమ్మ
పలాల కొండయ్య భార్య జగ్గమ్మ
పలాల ఆదెమ్మ

ఈగ్రామములో సాదాపు ప్రతి శుక్రవారం 20లేక30 మంది భక్తురాండ్రతోటి శుక్రవార పూజలు మహా వైభవముగా జరిపించబడెను.

పేకేరు ప. గోదావరి జిల్లా.

నల్లమిల్లి బుచ్చిరెడ్డి భార్య మాణిక్యం
పులగం రావమ్మ
పులగం సత్యనారాయణ
పులగం భద్రాద్రి
పులగం తిరుపతిరెడ్డి

ఈగ్రామంలో భక్తులతోటి ప్రతిశుక్రవారం పూజలు భజనలు మహావైభవముగా జరుప బడెను.

అర్తమూరు.

కోనాల సత్తిరెడ్డి భార్య వీరమ్మ
కోనాల వెంకన్నగారు
మండ అచ్యుతరామయ్యభార్య సూరమ్మ
12-1-51 పోతుశెట్టి మహాలక్ష్మి
పెద్దపండుగరోజు
పోతుల అప్పారావు భార్య సూర్యకాంతమ్మ
19-1-51 సత్తిబుల్లి స్వామి భార్య మంగమ్మ

## పతాక వార్తలు

అర్తమూరు.

నల్లమిల్లి వెంకటరెడ్డి భార్య కాంతమ్మ
18-1-51 సత్తిబుల్లి స్వామి భార్య మంగమ్మ

కళింగపట్నం

ఈ 20-12-1950 తేదిని మార్గశీర్ష శు ౧౧ బుధవారం దినమున శ్రీగీతామండలి (కళింగ పట్నం) శ్రీగీతాజయంత్యుత్సవమును జరిపినది.

కార్యక్రమము.

ఉదయం:-

శ్రీకోదండరామస్వామివారి సన్నిధిని- శ్రీగీతాకోశము-శ్రీకృష్ణపరమాత్మ శ్రీవ్యాస మహర్షుల మారాధనము-సమిష్టి పారాయణము, 18 అధ్యాయములు-గోష్ఠితీర్థ-ప్రసాద స్వీకృతి.

సాయంత్రం:-

5 గంటలకు- సంస్కృత పాఠశాలామందిర మున, కూర్మం-దేవస్థాన పండితులు- ఉ. వే. శ్రీమాన్ శ్రీభద్రిం వేంకటకూర్మాచార్యు లవారి యధ్యక్షతను సమావేశము జరుపబడి నది. గీతాప్రాశస్త్యమునుగూర్చి, గీతాపఠ నావశ్యకతనుగూర్చి చక్కని ఉపన్యాసము లొసంగబడినవి.

కార్యదర్శి-గీతామండలి,
వి. వే. రా. న. ఆచార్య.

రిజిష్టరు నెం. 5049.

**Book-Post**

# భక్తినివేదన

(వేదాంత మాసపత్రిక)

---

ఇందు వేదాంత విషయ రాజములున్ను;
భక్తి ప్రచార విషయమైన వార్తలున్ను;
వేదాంత సాంప్రదాయ విషయకమైన ప్రశ్నో
త్తరములున్ను ప్రచురించబడును.

---

చందాలు:

| | | |
|---|---|---|
| సాధారణ చందా | సం. రం 1కి | రు. 5-0-0 |
| సహాయ చందా | ,, | రు. 10-0-0 |

---

పోషకులు:

| | | |
|---|---|---|
| పోషకులు | సం. రం 1కి | రు. 25-0-0 |
| రాజపోషకులు | ,, | రు. 58-0-0 |
| మహారాజ పోషకులు | ,, | రు. 116-0-0 |

---

కార్యాలయము:

"భక్తి నివేదన" కార్యాలయము,
అర్తమూరు (వయా) ద్వారపూడి.
తూర్పు గోదావరి జిల్లా.

---

Edited printed & published by A. Ch. srimannarayanacharya, at Sriman press,
Artamuru, E. G. Dt.





భక్తి

# నివేదన

వికారి-పుష్యమాసము

సంపుటి ౨ సంచిక ౧౦



ఓం తత్ సత్

శ్రీ సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత

శ్రీ రామచంద్ర పరబ్రహ్మణేనమః

శ్రీ రుక్మిణీ సత్యభామాసమేత శ్రీ వేణుగోపాల పరబ్రహ్మణేనమః

# శ్రీరామక్రతు శ్రీమద్భాగవతసప్తాహసహిత

# శ్రీమహావిష్ణుకోటితులసీదళపూజామహోత్సవం

# రాజమహేంద్రవరము

---

## ఆహ్వానపత్రిక

శ్రీ ______________________________

______________________________

______________________________

---

ప్రారంభము **6-4-51** ఆఖరు **21-4-51**

దయచేసి దీనిని మీ మిత్రులకు కనపరచుడు.

మీరితరులకు పంపుటకు ఆహ్వానపత్రికలు

కావలసిన 18/330 మెయిన్‌రోడ్డు

రాజమండ్రికి మీ చిరునామా

గల కవరు పంపండి.

హరే రామ హరే రామ రామ రామ హరే హరే
హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే॥
హరేర్నామ హరేర్నామ హరేర్నామైవ కేవలం।
కలౌ నాస్త్యేవ నాస్త్యేవ నాస్త్యేవ గతిరన్యథా॥
యస్య స్మరణమాత్రేణ జన్మసంసార బంధనాత్।
విముచ్యతే నమస్తస్మై విష్ణవే ప్రభవిష్ణవే॥

మనకు స్వారాజ్యము లభించినది కాని, సురాజ్యమింకను సుస్థాపితము కాలేదు. ప్రభుత్వము లభించినది కాని ప్రజాశాంతి లభించలేదు. అధికారము లభించినది కాని అన్నవస్త్రములు లభించుటలేదు. ఇపుడు దేశములో పలుమూలలయందును అతివృష్టి, అనావృష్టి మున్నగు ఈతి బాధలు, వీనినిబట్టి అంతటను ఆహారకొరత, వస్త్రాదులకొరతయు అమితముగ వ్యాపించియున్నవి. ఎటుచూచినను ఎచ్చటకు వెళ్ళినను ఆర్తనాదములు, అవినీతి, అధర్మము, అశాంతి, అవిశ్వాసము, అధికారవాంఛ, పరస్పరఈర్ష్య, మోసము, దురాశ, హింస మాత్రమే గోచరించుచున్నవి.

భయప్రద నిమిత్తేషు తథాఽనావృష్టికాదిషు।
వర్షదం సర్వలోకస్య శాంతిదం సర్వపుష్టిదం॥
వ్యాధి దుర్భిక్ష శాంత్యర్థమనూత్సవం సమా యోద్ధరేత్।
రాజరాష్ట్రాభివృద్ధ్యర్థం రాజ్ఞాం చైవాఽభివృద్ధయే॥
సర్వదుఃఖార్తి శాంత్యర్థం విష్ణో రుత్సవ మాచరేత్॥

అను ఆగమ శాస్త్రప్రమాణముల ననుసరించి ఇట్టిస్థితిలో జగత్పతియు, లోకరక్షకుడును, ఆర్తత్రాణపరాయణుడును, సర్వజ్ఞుడును, సర్వశక్తిమంతుడును, అపార కారుణ్య వాత్సల్య ఖనియు, భక్తజనమందారుడును, అగు శ్రియఃపతియు అగు శ్రీమహావిష్ణువు ఉత్సవాచరణము మాత్రమే మన ముఖ్యకర్తవ్యమున్ను గతియు అయియున్నది. ఇట్టిస్థితిలో—

ఆస్తికాగ్రేసరులారా! భగవద్భక్తులారా!

ప్రస్తుతపు మా ఈ అన్నవస్త్రాది కొరతదీరి, అవినీతి, అధర్మ, అశాంత్యాదులు తొలగి ప్రభుత్వము ప్రజలతో ఆనందముతో ధర్మముతో శాంతితో వర్ధిల్లుచు లోకకల్యాణము సిద్ధించుట కొరకున్ను ప్రజాసామాన్యమున ఆస్తికత, సత్యము, అహింస, శాంతి భక్తిభావన, సేవాపరత, స్వధర్మ నిర్వహణము, త్యాగశీలత వృద్ధిపొందుట కొరకున్ను—

స్వస్తిశ్రీ ఖరనామసంవత్సర చైత్ర శు ౧ స్థిరవాసరము (అనగా ది 7-4-1951వ తేదీ. లగాయతు వరుసగ పదునాలుగు దినములున్ను పరమపావనమగు శ్రీ గోదావరీనదీతీరమున రాజమహేంద్రవర పట్టణమున శ్రీ రామక్రతు - శ్రీ మద్భాగవత సప్తాహసహిత శ్రీమహావిష్ణు కోటితులసీదళ పూజామహోత్సవమును జరుపుటకు పెద్దలచే నిశ్చయింపబడినది.

| | |
|---|---|
| అంకురార్పణము. | ది 6-4-1951 సాయంకాలము. |
| ఉత్సవదీక్షా ప్రారంభము<br>శ్రీ రామక్రతుదీక్ష, శ్రీవిష్ణుకోటి<br>తులసీదళ పూజా ప్రారంభము | ది 7-4-1951 ఉదయం. |
| 24 శ్రీ సీతాకళ్యాణములు | ది 8-4-1951 ఉదయం. |
| శ్రీ పాదుకాపట్టాభిషేకములు | ది 9-4-1951 ఉదయం. |
| శ్రీ రామక్రతు సమాప్తి | ది 15-4-1951 రాత్రి |
| శ్రీ రామపట్టాభిషేకోత్సవము | ది 16-4-1951 మధ్యాహ్నము. |
| శ్రీ మద్భాగవత సప్తాహ దీక్షాప్రారంభము | ది 14-4-1951 ఉదయం. |
| శ్రీ మద్భాగవత సప్తాహ దీక్షాసమాప్తి | ది 20-4-1951 సాయంకాలము |
| శ్రీ కోటితులసీదళపూజా సమాప్తి | ది 20-4-1951 మధ్యాహ్నము |
| పూర్ణాహుతి | ది 20-4-1951 సాయంకాలము |
| అవభృథోత్సవము | ది 21-4-1951 ఉదయం |
| శ్రీ రుక్మిణీ కల్యాణము | ది 21-4-1951 మధ్యాహ్నము |

ఈఉత్సవదీక్షయగు ది 7-4-1951 తేదీ ఉదయము లగాయతు ఈఉత్సవమునయొక్క దీక్షాంతమగు ది 20-4-1951 రాత్రివరకున్ను శ్రీ వేణుగోపాలస్వామివారి ధ్యానములో - శ్రీ విష్ణుసహస్ర నామావళీపఠనములో - మొత్తము కోటితులసీ దళములతో అర్చన ఆరాధనాదికములున్ను; ఈపదునాలుగు రోజులు అహోరాత్రములు అఖండ హరినామ సంకీర్తనమును; ఋగ్వేదోక్త పంచాగ్నిహోత్ర విధానానుసారము హోమములున్ను; శ్రీ మహావిష్ణుజప - హోమ-తర్పణ - పుష్పాంజలి-శాంత్యాదులున్ను; సుమారు 350 మంది ఋత్విగ్వరేణ్యులచే జరుపబడును.

ప్రతినిత్యము పెక్కురు పండిత ప్రకాండులచే వేదాంతోపన్యాసములు యివ్వబడును.

ప్రతినిత్యము పెక్కురు పండితులచే హరికథా కాలక్షేపములు-భజనలు-పురాణపఠనములు-జరుపబడును.

ఈఉత్సవమునిమిత్తమై పండరీపురమునుండి ప్రత్యేకముపండరీభజన సంఘము ఆహ్వానించబడుచున్నది.

ఈ మ హో త్స వ ము న కు

అధ్యక్షులవారు:-శ్రీ మహావిష్ణువు

అధినేతలు :-శ్రీ సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్ర మహాప్రభువు.

నిర్వాహకులు :-శ్రీ రుక్మిణీ సత్యభామాసమేత శ్రీ వేణుగోపాలస్వామివారు.

నాయకులు :-శ్రీ భక్తాంజనేయ స్వామివారు

ఆశీర్వాదకులు:-శ్రీ భాగవతోత్తములు

అనుమోదకులు:-శ్రీ భక్తబృందము

ఆధ్వర్యులు:- శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘ కార్యదర్శులు

అనుమోదప్రోత్సాహకులు:-శ్రీ మాణిక్యం సుబ్బారాయుడు గారు రాజమహేంద్రవరం.

కార్యకర్తలు :-శ్రీ రాజమహేంద్రపురవాసులు భక్తులు.

ఫలభాక్కులు:-శ్రీ భగవద్భక్తులు.

## —: నిత్య కార్యక్రమము :—

ది 6-4-1951 శుక్రవారము సాయంకాలమున శ్రీ వేణుగోపాల స్వామివారి అనుజ్ఞతీసుకొని కోవిలనుండి ఊరేగింపుగా బయలుదేరి వచ్చి ఉత్సవమండప ప్రవేశము భగవత్ప్రార్థన విష్వక్సేనారాధనము. మృత్సంగ్రహణము- అంకురార్పణము-వాస్తుపూజ- ధ్వజారోహణము.

ది 7-4-1951 శనివారము మొదలు ప్రతిదినము ఉదయము గం 5-0 తిరువారాధనము-తీర్థవినియోగాదికము. గం 6-0 నుండి7-0 వరకు శ్రీవిష్ణు సహస్రనామస్తోత్రముతో తిరువీధ్యుత్సవము- 7-0 నుండి 8-0 వరకు శ్రీవిష్ణు సహస్రనామ సమిష్టి పారాయణము- 8-0 నుండి 8-15 వరకు నామజపము (సమిష్టిగ) 8-15 నుండి 11-30 వరకు పూజామండపమున శ్రీవిష్ణు సహస్రనామములతో కోటితులసీదళపూజ హోమమంటపమున తత్తద్విశేషాది హోమములున్ను, పారాయణమంటపమున ఉభయవేదములు-శ్రీరామాయణ శ్రీమద్భాగవత విష్ణుపురాణాది పారాయణములును, జపములున్ను; భజనమంటపమునహరినామ సంకీర్తనములున్ను, "హరేరామ హరేరామ" మహామంత్ర పఠనమున్ను, ఉపన్యాసమంటపమున ఉపన్యాసములు, పురాణపఠనాదులున్ను,11-30 నుండి 12-0 వరకు శాంతిపాఠ ప్రవచనము.

మధ్యాహ్నము 2-0 నుండి 4-0 వరకు కాలక్షేపాదులున్ను 4-0 నుండి 6-0 వరకు ఉపన్యాసములున్ను, సాయంత్రము 6-0నుండి 7-30 వరకు శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్రసమిష్టి పారాయణగానమున్ను శ్రీ లక్ష్మీఅష్టోత్తర శతనామార్చనయున్ను.

రాత్రి 7-30 నుండి 8-0 వరకు సమిష్టిహరినామ సంకీర్తనమున్ను, 8-0 నుండి 11-0 వరకు హరికథాకాలక్షేపములున్ను, ప్రతి దినము 24 గంటలు అఖండ హరినామసంకీర్తనమున్ను జరుపబడును.

ఈమహోత్సవము లోక కల్యాణమునకై ప్రజాక్షేమమునకై చేయబడుచున్న మహాపవిత్ర పుణ్యకార్యమైయున్నది. ఇట్టి మహత్తర కార్యము దర్శించుటకుగాని, పాల్గొనుటకుగాని సామాన్యముగ లభించునట్టిదికాదు. కాన తామెల్లరు ధనరూపముగను, వస్తురూపముగను, తులసీదళముల సమర్పణరూపముగను, అన్నశాంతికినలయు సామగ్రి సమర్పణ రూపముగను, సేవారూపముగను, స్వహస్త పరహస్తముల ద్వారా సహాయముచేయుచు ఈఉత్సవమున పాల్గొనగోరుచున్నారము.

రు 3000 లు సమర్పించినవారి గోత్రనామములతో ఒకరోజు పూర్తి ఉత్సవము జరుపబడును.

రు 1000 లు సమర్పించినవారి గోత్రనామములతో ఒకపూట పూర్తి ఉత్సవము జరుపబడును.

రు 500 లు సమర్పించినవారి గోత్రనామములతో ఒకనాటి పూజలు జరుపబడును.

రు 250 లు సమర్పించినవారి గోత్రనామములతో ఒకపూట పూజలు జరుపబడును.

రు 125 లు సమర్పించినవారి గోత్రనామములతో ఒక మహా పూజ జరుపబడును.

రు 58 లు సమర్పించినవారి గోత్రనామములతో ఒకపూజ జరుపబడును.

లోకస్సమస్తాసుఖినోభవంతు.

మంగళం మహత్ శ్రీ శ్రీ శ్రీ

ఇట్లు

రాజమండ్రి
24—2—51

శ్రీ. శ్రీ. శ్రీ. 1008 శ్రీమహాష్ణువు
అధ్యక్షులు

తె. కం. గోపాలాచార్యులు, ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులు
శ్రీ విశిష్టాద్వైతప్రచారకసంఘ కార్యదర్శులు.

2. (శ్రీ) కాయజ్ఞానందస్వాములవారు, ఉపాధ్యక్షులు
3. ,, రాళ్ళబండి సుబ్బారావుగారు ,,
4. ,, సప్పా అప్పలస్వామిగారు ,,
5. ,, బుద్ధిలాల్. సి. షాగారు ,,
6. ,, పానాచంద్ గారు ,,
7. ,, కలిమిరెడ్డి అప్పలస్వామిగారు ,,

కార్యదర్శులు:

8. (శ్రీ) జి. వరదరావుగారు
9. ,, పినిశెట్టి ఆదినారాయణగారు
10. ,, ఆత్మూరి సూర్యనారాయణగారు
11. ,, దత్తి సోమరాజుగారు

కోశాధికారులు:

12. (శ్రీ) వాక అప్పలస్వామిగారు
13. ,, సప్పా సూర్యనారాయణగారు

కార్యనిర్వాహక సభ్యులు

14. (శ్రీ) ఆదిరెడ్డి అప్పలస్వామిగారు
15. ,, వాసిరెడ్డి రాములుగారు
16. ,, పచ్చినీలం మునికేశవరావుగారు
17. ,, కె. యస్. ప్రకాశరావుగారు
18. ,, దూసి వీరాస్వామిరెడ్డిగారు
19. ,, సీసకుర్తి సుబ్బారావుగారు
20. ,, పొడిపిరెడ్డి కృష్ణమూర్తిగారు
21. ,, కొల్లి అప్పలస్వామిగారు
22. ,, కొండపల్లి వీరవెంకయ్యగారు
23. ,, నాళం రాజారావుగారు
24. ,, పెండెం సత్యనారాయణగారు
25. ,, చలంచర్ల నారాయణమూర్తిగారు
26. ,, పంథి అప్పలస్వామిగారు
27. ,, బోర యరకయ్యగారు
28. ,, తాటికొండ శ్రీరాములుగారు

రైతుప్రెస్, రాజమండ్రి.

శ్రీమతే రామానుజాయనమః



# భక్తి నివేదన

వేదాంత మాస పత్రిక

| సంపుటి ౨ | వికృతి – పుష్య మాసం | సంచిక ౧౦ |
|---|---|---|

## కృష్ణార్జున సంవాదము

శ్రీ. ఉ. వే. శ్రీమాన్. తె. కం. గోపాలాచార్యులుగారు

### జీవ నిత్యత్వము

కృష్ణుడు:–అర్జునా! ఇదేమి? నీ వెంతో ధైర్యశాలివి. ప్రాజ్ఞుడ వని నేను భ్రమించితిని. అయ్యయ్యో! ఈ దుఃఖ మేమి? ఈ పిరికితన మేమి? ఇట్టి హృదయ దౌర్బల్యము నీవంటి వీరునకు తగునా? క్షత్రియునకు యజ్ఞోపవీతము వలె విడువతగని ధనుర్బాణముల విడిచి రథముపై చతికిలబడితివే! నీవుచింతించునది యెవరి నిమిత్తము? భీష్మాదులలో శరీరము ఆత్మయని రెండంశములు కలవు. అందు శరీరమును గూర్చి విచారింప పనిలేదు. శరీరము పంచమహాభూతములు. అహంకారము మహత్తత్త్వము, అవ్యక్తము అనబడు పదార్థములతో నిర్మింపబడును. అవి యచేతనములును ప్రతిక్షణమునకును మారునట్టి స్వభావములు కలవి గాన శరీరముకూడ నట్టిదే యగును. కావుననే దానికి శరీర మనియు దేహ మనియు పేరు లుంచబడినవి. (దిహ–ఉపచయే (పెరుగుట) అనెడు ధాతువు వలన 'దేహ' శబ్దమున్ను శీర్యత– ఇతి శరీరం అనెడు వ్యుత్పత్తిని బట్టి శరీర శబ్దమును కలిగినవి.)

దాని కందుచే పుట్టుట గిట్టుట సహజము. దానినిగూర్చి దుఃఖించ దగదు.

ఇక ఆత్మాంశ మందువా! దానిని గూర్చి బొత్తుగ దుఃఖింపరాదు. దానికి పుట్టుట, నశించుట, అను వికారములు లేవు గాన పుట్టుక వలన నుండుటయు, గిట్టుట వలన లేకుండుటయు దానికుండజాలవు.

అర్జునుడు:– కృష్ణా! ఆత్మకు జనన మరణాదులు సకలలోక సాక్షికముగ కనిపించుచున్నవే!

అంతియగాక "ఏతేభ్యో భూతేభ్య స్సముత్థాయ తాన్యేవా నువినశ్యతి" ఈ భూతములనుండిపుట్టి యవి నశించునవెడం ప్రమాణమును బట్టి కూడ దేహముతో పాటిదిగనే గోచరించుచుండగ నది నిత్యమనియు, దానినిగూర్చి దుఃఖించరాదనియు చెప్పుట తగునా ?

♦ ఆత్మాణుత్వసమర్థనము ♦

కృష్ణుడు:- ఓహో ! క్రొత్తపనియే కల్పించితివి. ఆ విషయమును సమగ్రముగ వివరింతును, సావధానముగ వినుము.

ఆత్మ నిత్యమని యెఱుంగుటకు ముందు దాని పరిమాణమును గూర్చి విమర్శించవలసి యున్నది. అసలు పరిమాణము-విభుపరిమాణము, మధ్యమ పరిమాణము, అణుపరిమాణము అని మూడువిధములు. ఆత్మ కీ త్రివిధపరిమాణములును వేరు వేరు దార్శనికు లంగీకరింతురు. తార్కికులు విభువందురు. జైనులు మధ్యమ పరిమాణ మందురు. త్రైయ్యన్త నిష్ణాతులు (విశిష్టాద్వైతులు) అణువందురు, అందు తార్కికుల విభువాదమును ముందుగ వినుము.

1. ఆత్మ అణుపరిమాణ మన్నచో నది ప్రత్యక్షమే కారాదు. మహత్పరిమాణ మున్నగాని వస్తువులు గోచరించనే గోచరించవు. అది లేకనే గదా పరమాణువులు గోచరించకపోవుట.

2. ఆత్మ అణువన్నచో ననేక శరీరములలో నొక్కసారి సుఖదుఃఖాదుల ననుభవించుట దుర్ఘటము. సౌబరి మొదలగు వారొకే కాలమున బహుశరీరములతో సుఖదుఃఖముల ననుభవించినట్లు పురాణాదులవలన వినుచున్నాము. ఈ యణుజీవుడే యతివేగముతో క్రమముగ నాయీ శరీరముల కేగి క్రమముగనే యనుభవించుచున్నను ఆ వేగాతిశయమున మన మా క్రమమును గానలేక ఒక్కసారియే ఆ యనుభవము లుదయించుచున్నవని భ్రమించుచున్నారనుట దుస్సాహసము. యోగులకును మనవలె భ్రమ యున్నచో నిక వారి యతిశయ మేమి ?

3. అదియును గాక శరీరమును పడకుండ నీ యాత్మ ధరించు విధాన మేమందురు ? ప్రయత్నపూర్వకమైన యాత్మతో నా శరీరమునకుగల సంబంధమే యందురా ? అట్లగుచో సౌబరియొక్క అణువగు నాత్మ ఒకేసారి నూరు శరీరములతో ప్రయత్నపూర్వకముగా సంబంధించి యుండుట, నమ్మదగిన విషయమేనా? ఒక శరీరముతో నట్లు సంబంధించి యుండునపుడు ఇతర శరీరములతో నా సంబంధ మేది?

4. మరియు ఆత్మ యణువగుచో నేదోయొక శరీరమందే యుండును గాని తక్కిన తొంబది తొమ్మిది శరీరములలో నుండుట యసంభవము గదా! అట్టితరి యాత్మలేని యా శరీరములకు నిద్రకొఱకు ప్రయత్నమే లేకుండవలెను, ఏల నందురా? ఆత్మ సుఖస్వరూపమైనది గాన సుషుప్తియందా యాత్మస్వరూప సుఖము ననుభవించుటకే నిద్రకై ప్రయత్నింతుము. ఆ శరీరములలో నాత్మయే లేనిచో నిక నాయాత్మస్వరూపాత్మకమైన సుఖానుభవ మెక్కడిది? ఈవిషయమునే

'స్వాపేన సుఖత్వాభిజ్ఞానాత్ తదిచ్ఛే దేచరో మతః, తదర్థమన్యత్యాగాచ్చ శ్రుతిస్మృతిశతైరపి"

అనెడు విష్ణుచిత్తవచనమున నిద్రావస్థలో నాత్మసుఖస్వరూపానుభవ ముండును గాన లేపి దానిని చెడగొట్టిన వారిపై యపరిమిత కోప ముదయించును. ఆ యనుభవముకొఱ కన్ని ప్రియవస్తువులను కార్యములనువిడిచిపెట్టుచున్నాము అని కలదు.

దీని వలన నిద్రావస్థయం దాత్మసుఖస్వరూపానుభవము కలదనియే తెలియబడుచున్నది.

5. చైత్రుడను వాడొక విత్తనమును నాటుచున్నాడు. ఆ విత్తనమువలన పుట్టెడు ఫలము ననుభవించు యదృష్ట మా చైత్రున కున్నచో నా బీజ మంకురించును. కావున బీజమందలి యంకురత్వావస్థకు చైత్రుని యదృష్టము కారణ మగుచున్నది గదా! కార్యకారణములు రెండు నొక్కచోట నుండవలెనను నియమము కలదు. అంకురత్వావస్థ విత్తనమం దున్నది. అదృష్టమో చైత్రాత్మయం దున్నది. అయినను చైత్రుని యాత్మ విభువు గాన దానికి విత్తనముతో సంబంధముండుటచే నా యదృష్ట మా యాత్మయందే యుండును గాన ఆత్మద్వారా యదృష్టమునకు బీజముతో సంబంధము కుదురుచున్నది. ఆత్మ యణువైనచో నిది యెట్లు కుదురును?

ఇట్లెన్నియో దోషము లుండుటచే నాత్మ యణువనరాదు.

ఈ దోషముల పరిహరించుటకై జైనులవలె నాత్మ మధ్యమపరిమాణ మందురా? అనగా శరీర మెంత కలదో యాత్మ యంత పరిమాణము కల దందురా? ఉల్లి తినినను రోగము కుదుర లేదన్నట్లు ఒక శరీరములో నొక్కసారిగా కలుగు సుఖదుఃఖానుభవము కుదిరినను పై దోషము లొక్కటియు పరిహరింపబడక పోవుటయే గాక మరికొన్ని యనర్థములు సంభవించును. చూడుము—

ఒక జీవుడో పాపమువలన యేనుగగా పుట్టెననుకొనుము. అప్పు డా యాత్మ యెంత యుండును? ఆ యేనుగంత. సరియే. వాడా జన్మను విడిచి ప్రారబ్ధానుభవమునకై చీమగా పుట్టవలసి యున్నది. అప్పుడా యేనుగాత్మ యంతయు నా చీమ శరీరములో పట్టదుగదా! అప్పు డెట్లు? అందొక భాగము మాత్ర మాక్రమించిన దన్నచో నపరిపూర్ణత రాదా! దాని కేమున్నది? ఆత్మకు సాగుటయు ముడుచుకొనుటయు కలదందుము. ఏనుగు శరీరము పెద్దదిగాన నందు బాగుగ సాగియుండును. చీమ శరీరము పట్టదు గాన ముడుచుకొనిపోయి యందు ప్రవేశించును. దోషమే మున్న దందురా? అట్లగుచో నాత్మ, పుట్టక చావు, దానిచే ననిత్యత్వము మొదలగు దోషములు కలదై కుండవనంటిదే కావలసి వచ్చును.

మరియు జీవునకు మోక్షము లభించిన పిమ్మట యది నిత్యము గాన తిరిగి దానికి పుట్టుక యుండదు కదా! ఐనచో మోక్షావస్థలో నున్న యాతని పరిమాణము ఆఖరి పరిమాణమే యని చెప్పక తప్పదు. ఐనచో నది నిత్యమే యగును గాన నదియే ఆత్మకు స్వాభావిక పరిమాణ మగును. అట్లగుచో నంతకు పూర్వము మాత్రము తన స్వాభావిక పరిమాణ మెట్లు మారును?

ఇట్లు పెక్కు దోషము లున్నవి గాన ఆత్మ యణుపరిమాణ మని గాని మధ్యమపరిమాణ

మని గాని చెప్పక అది విభుపరిమాణమనియే చెప్పి తీరవలెను అందురు.

ఇక నీచిక్కులనెల్ల పరిహరించుచు త్రయ్యంత నిష్ణాత (విశిష్టాద్వైతు) లెట్లు నిర్వచింతురో విందువా?

వా రాత్మ యణుపరిమాణ మందురు. అందులకు 'ఏషోఽణు రాత్మా చేతసా వేదితవ్యో బుద్ధేర్గుణే నాత్మగుణేన చైవ హ్యారాగ్రమాత్రో హ్యవరోఽపి దృష్టః,'

ఈ జీవుడు యోగముచే పరిశుద్ధమగు మనస్సుచే మాత్రమే తెలుసుకొనదగినవాడు. ఈతని బుద్ధి విభువగుటకు తగినదే యైనను కర్మచే సంకుచితమైనది గాన మన్నుచేపూయబడిన మాణిక్యము వలె తన కాశ్రయమగు జీవునితో సమాన పరిమాణము కలిగియే యుండవలెను గాన జీవుని వలె నిదియు ములుకట్టు సూదిమొనవలె నణు పరిమాణము కలిగినే యుండును అనుశ్రుతియు.

'వాలాగ్రశతభాగస్య శతధా కల్పితస్య చ భాగో జీవ స్స విజ్ఞేయః'

"వెండ్రుక కొనను నూరు భాగములుగ విభజించి యందొకభాగమును తిరిగి నూరు భాగములుగ విభజించినచో నందొక భాగమంత పరిమాణమే జీవుని పరిమాణ మగునను శ్రుతియు ప్రమాణములుగ గనపరచబడినవి.

క్రియలు గల వేనియు విభువులు కాజాలవు. ఘటమును చూచుటలేదా! అట్లే జీవుడును క్రియ కలవాడు కావున విభు వెట్లగును? జీవునకు క్రియ లెచ్చటువందురా? వినుము—

జీవునకు ఉత్క్రాంతి, గతి, ఆగతు' లనెడు మూడు క్రియలు ప్రమాణసిద్ధములై గాన్పించుచున్నవి.

ఎట్లనః—

"తేన ప్రద్యోతేన ఏష ఆత్మా నిష్క్రామతి చక్షుషో వా మూర్ధ్నో వా అన్యేభ్యో వా శరీర దేశేభ్యః'

అను శ్రుతిచే "పరమాత్మ గనపరచు కాంతి మూలగ గాని యీ జీవుడు కంటినుండియో, బ్రహ్మకపాలమునుండియో, ఇతరశరీరప్రదేశములనుండియో నుత్క్రమించును (లేచిపోవును)' అనియు

'యే వై కే చా స్మా ల్లోకా త్ప్రయన్తి చంద్రమస మేవ తే సర్వే గచ్ఛన్తి'

అను శ్రుతిచే కామ్యములగు పుణ్యకర్మల నాచరించి యీ లోకమును విడిపోవు నాత్మలన్నియు చంద్రలోకమున కేగు ననియు,

"తస్మాల్లోకా త్పునరైత్యస్మై లోకాయ కర్మణే"

అను శ్రుతిచే వారా పుణ్యము క్షీణించగనే యీ లోకమును వీడి తిరిగి కర్మఫలానుభవమునకై యీ లోకమున కేతెంతు రనియు ఉత్క్రాంతి గత్యాగతులు స్పష్టముగా తెలుపబడుచున్నవి గదా! విభుపరిమాణము కలిగి యున్నచో యీ క్రియలు సంభవమా?

అర్జునుడు:— ఇంతవరకు బాగుగనే యున్నది. కాని అణువను పక్షమున నిదివరలో వారు చూపిన దోషములు పరిహరింపబడినగదా! యీ సిద్ధాన్తము సుస్థిర మగునది.

కృష్ణుడు:— అయ్యా! వీరాదోషముల నన్నిటిని

చక్కగ పరిహరించిరి. వినుము.

1. ప్రత్యక్షమగుటకు మహత్పరిమాణ ముండ వలెననియు పరమాణువులు గోచరించకపోవుట అది లేకపోవుటచేతనే గాన ఆత్మయు నట్లే ప్రత్యక్షము కాకపోవలసివచ్చు ననికదా మొదటి యాక్షేపము.

ప్రత్యక్షమగుటకు మహత్పరిమాణము కారణము కానే కాదందుము. అయినచో పరమాణువు కాన్పించదేమి యనిగదా యాక్షేపించ వలెను. పరమాణువు కాన్పించుచునే యున్నది. పరమాణువనగా యెండ వేళ యింటిపెంకుల మధ్యరంధమునుండి యింటిలోని ప్రసరించు సూర్యకిరణములలో గాన్పించు సూక్ష్మరేణువులే కాని యంతకంటె సూక్ష్మతమమగు వేరొక వస్తువనుటకు ప్రమాణము లేదు. అట్టి పరమాణువు కాన్పించునునే యున్నది కదా!

2. ఇక రెండవ యాక్షేపము, జీవు డణువగుచో సౌబరి యనేక శరీరములతో నొక్కసారి సుఖదుఃఖముల ననుభవించుట దుర్ఘటమని కదా? దాని కేమున్నది. ఆత్మ యణువైనను దానికి గల జ్ఞానము సంకోచవికాసనామర్థ్యము కలది. అది దీపకాంతివలె ఆత్మయున్న స్థానము కంటె దూరముగ వ్యాపించగలిగి యుండును. యోగులు తమ యోగసామర్థ్యముచే దాని నెంత దూరమునకైనను వ్యాపింపచేయగలరు. అందుచే సౌబరియు దానిని తన శరీరముల నన్నింటిలోనికిని వ్యాపింపచేయగలిగి యుండెను. అందుచే నా శరీరము లన్నిటిలోను ఒకేసారి సుఖదుఃఖముల ననుభవించుచున్నాడు. అందులకై ఆ యాత్మ శరీరము లన్నిటిలోనికిని పోవలసిన పని లేదు.

3. శరీరమును పడకుండగ నాపుటయు నీ ధర్మభూతజ్ఞానము వలననే. ఇదియే ప్రయత్నా త్యావస్థను పొంది యన్నిశరీరములలో నుండి వాటిని పడకుండ కాపాడును.

4. ఇక నిద్రకై ప్రయ్నత్నము కుదుర దనెడు యాక్షేపమును సరియైనది కాదు ఏలనన-

ఆత్మస్వరూపసుఖానుభవము నాశించి కాదు నిద్రకై ప్రవర్తించుట. కింతు, జాగ్రదవస్థలోని శరీరాయాసముచే కలిగిన క్లేశము శమించుటకై మాత్రము నిద్రకై ప్రవర్తించరు. విష్ణుచిత్తులు చెప్పిన దానికి కూడా విరోధము లేదు. ఆమాట సాక్షాత్తుగ ఆత్మగల శరీరమునుగూర్చి చెప్పబడినది,

5. ఇక చివర యాక్షేపము బీజమునుండి మొలకపుట్టుటనుగూర్చినది కదా! అదృష్టమనగా భగవత్సంకల్పమే. అయ్యది జీవాత్మద్వారమున గాక పరమాత్మద్వారమున పరమాత్మ విభువే గాన ఆయన సకలవస్తువులతో సంయోగించియే యుండుటచే నేదోషమును లేదు. కావున ఆత్మ యణుప్రమాణము అను సిద్ధాంతము నిరుపద్రవముగ చిరంజీవి యగును.

— ఆత్మనిత్యత్వము —

అర్జునుడు:- కృష్ణా! నీ యుపపాదనవలన ఆత్మ అణుపరిమాణము కలదని చక్కగ తలకెక్కినది గాని ప్రారంభింపబడిన ఆత్మనిత్యత్వము మూల పడినది.

కృష్ణుడు:- ఇదిగో! ఈ ప్రయత్నమంతయు

అందునిమిత్తమే కదా! వినుము.

అవినాశితు తద్విద్ధి యేన సర్వ మిదం తతం
వినాశ మవ్యయస్యాస్య న కశ్చిత్ కర్తు మర్హతి.

ఏ యాత్మతత్వ మీ ప్రపంచమునందలి ప్రతివస్తువునందును ఒక్కదానినైనను విడువక నువ్వులలో నూనెవలెను కట్టెలో నిప్పువలెను వ్యాపించియున్నదో ఆ తత్వము నశించు స్వభావముకలది కాదని యెఱుంగుము. ఈ లోకములోని యేవస్తువుకూడ దానిని నశింపచేయజాలదు అని యీశ్లోకభావము. లోకమున నశింపచేయునట్టి శస్త్రము, నీరు, నిప్పు, గాలి మొదలగు పదార్థములు తమచే నశింప చేయబడు వస్తువులయందు వ్యాపించి వాటిని నశింపజేయుచున్నట్లు మనము నిత్యమును చూచుచునే యున్నాము. ఇందువలన నశింపజేయునవి సూక్ష్మముగాను, నశింపజేయబడునవి యంతకంటె స్థూలముగాను ఉండవలెనను విషయము పామరునకైనను తెలియనిదికాదు. సూక్ష్మమైనది స్థూలమైనదానియందే వ్యాపించి దానిని నశింపజేయునే గాని స్థూలము సూక్ష్మమునందు వ్యాపించి నశింపచేయజాలదు కదా! ఈయాత్మతత్వము లోకములో నన్నింటికంటెను మిక్కిలి సూక్ష్మమైనది. అందులకు కారణ మదియే యన్నిటిని వ్యాపించి యుండుటయే. ప్రపంచమున నేవస్తువునందైనను 'ఇది యీ ద్రవ్యము కలదికాదు, యీ గుణము కలదికాదు, యీ క్రియకలదికాదు ఫలానాజీవునకలదికాదు' అని యిట్టి భేదముండునే కాని సామాన్యముగ ఆత్మయే కలదికాదని మాత్రమెన్నడు నుండదు. కావుననే "నిత్య స్సర్వగత స్థాణుః" యేన సర్వ మిదం తతం" మొదలగు ప్రమాణవాక్యములు సరసముగ నన్వయించుచున్నవి. ఇట్లు ఆత్మతత్వ మన్నింటియందును వ్యాపించి యుండును. తక్కినవన్నియు దానిచే వ్యాపింపబడును గాన దానికంటెను స్థూలములగును. ఇట్లంతటను వ్యాపించియుండుటచే నిరతిశయ సూక్ష్మమును, అందువలన నశించుట కనర్హమును నైయుండు ఆత్మతత్వమును, దానిచే వ్యాపింపబడిన దగుట వలన దానికంటెను స్థూలముగానుండుడు తక్కిన యచేతన వస్తువు లేవియు నశింపచేయజాలవు.

అర్జునుడు:— కృష్ణా! స్థూలము సూక్ష్మమును నశింపచేయజాల దంటివే! సుత్తి మొదలగునవి స్థూలముగా నుండినను కుండ మొదలైన వాటిని నశింపచేయుట లేదా?

కృష్ణుడు:— వాటిని గట్టిగా విసరి కుండపై కొట్టినప్పుడా వేగము వలన సూక్ష్మమైన గాలి పుట్టును. ఆ గాలి కుండకంటె సూక్ష్మమే గదా! దాని మూలమున ఆ కుండ నశించు చున్నది. అర్జునా! సుత్తిమీద కుండను బెట్టిన కుండ పగులునా? కావున నశింపజేయుటకు సంయోగము మాత్రమే చాలదు. గాలిని పుట్టించు వేగము కూడా నుండవలెను. వేగము మాత్రముండి ఆ కుండకు సుత్తి తగలనిచో నది పగులునా? కావున కుండతో సుత్తికి సంయోగ ముండవలెను. గట్టిపరకకు వేగము కుండతో సంయోగము రెండు నుండినను లాభమేమి? కుండ పగులునా? కావున ఆ వస్తువునకు కాఠిన్యముకూడ నుండ

వలెను. ఆ సుత్తి వెనుకటి భాగముతో కొట్టి నను కుండ యంత సులువుగ పగులదు. కావున కఠినమైన నొక వస్తువుయొక్క ఒక భాగముతో వడియైన సంయోగము కలిగిననే అది పగులును

అర్జునుడు:- ఇది బాగుగనే యున్నది గాని యిచ్చట కుండను బద్దలు కొట్టినది సుత్తికదా! గాలిచే నది పగిలిన దందువేమి? వేగమువలన గాలి పుట్టుట యెట్లు?

కృష్ణుడు:- అయ్యో! ఇదియే యెఱుగవా? గట్టిగా ఉరిమినప్పుడు యింటిగోడ లదురుట చూడలేదా? ఇంటిలోని బిందెలు చెంబులు మొదలగు వస్తువులు కదలుట చూడలేదా? అవియట్లు కదలుటకు కారణ మూహింపుము. ఆశీఘ్ర వేగము వలన చిన్నగాలి పుట్టి అది యా వస్తువులలో జొచ్చుటచేతనే యవి యట్లు కదలు చున్నవి. ఇట్టి గాలియే సుత్తి వేగము వలన పుట్టి తాను కుండకన్నను సూక్ష్మమైనది గాన కుండలో ప్రవేశించి దానిని బ్రద్దలు కొట్టుచున్నదని యంగీకరించవలెను. తెలిసినదా?

అర్జునుడు:- కృష్ణా! అది తెలిసినది కాని కొన్నిచోట్ల యిట్టివేగము లేకపోయినను సుత్తిని విసరక దానితో గట్టిగ నొక్కినను కుండ పగులుచున్నదే! అది యెట్లు?

కృష్ణుడు:- అట్టిచో సుత్తి యవయవములచే నొత్తబడిన కుండ యవయవములు తమకంటె సూక్ష్మమైన కుండ యితరభాగమును జొచ్చును అందుచే కుండ పగులును;

ఇట్లు ఆత్మ యన్నిటిలోను వ్యాపించి యుండదగిన అణుపరిమాణము గలదగుటచే దానిలో ప్రవేశించి నశింపచేయు పదార్థ మొక్కటియు లేదు గాన ఆత్మ నిత్యమైనది. కావున దానిని గూర్చి విచారించుట యవివేకములెమ్ము గాండివమును చేబూని యుద్ధసన్నద్ధుడవు కమ్ము.



శ్రీమతే రామానుజాయనమః

## శ్రీ. ఉ. వే. శ్రీమాన్ తిరుమల నల్లాని చక్రవర్తుల

## శ్రీవెంకటాచార్యులయ్యవార్లంగారు.

---

శ్రీత్యస్తాపార భూమాశ్రితజనల హారీరక్షణోదారనామా
భాస్వచ్ఛన్ద్రాగ్రిమధామా ఘుమఘుమితలసద్ద్వైజ యస్తీసుదామా
శ్రీమానమ్భోజధామా ద్యఖిల సుర వర ప్రార్థితో తీతశీమా
భూమానఃపాతు భూమాపరిచిత చరణామ్భోరుహో రఙ్గధామా॥ ౧.

మృదుమధురగభీర వాగ్విలాసైః
శ్రుతిమధురై రఖిలాగమార్థ సారైః
సహృదయ హృదయాన్తరాణ్యశేషా
ణ్యమృతమయాని వితన్వతీ సభేయమ్॥ ౨.

తర్కవ్యాకృతి తన్త్ర సాగరమహామన్థాన శైలాయిత
ప్రస్ఫూర్జత్ప్రర మాద్భుతోజ్జ్వలతర ప్రేక్షా సముద్భాసితైః
శ్రీమద్వేదవతంస యుక్తపదవీ జన్మాల వాగ్వైఖరీ
నిర్ధూతేతరదుర్మతాన్ధతమసైః శ్రీశైః విభూషాయితైః॥ 3.

శ్రీమన్నాథమునీన్ద్ర యామునముని శ్రీభాష్యకారాదిమ
ప్రాచార్యద్రుత సమ్ప్రదాయ పదవీ సంరక్షణైక వ్రతైః
విద్వద్భిర్మహనీయకీర్తి విభవైస్సంవర్ధతేయంసభా
శ్రీయాదార్కని శాకరంభువి సతామానన్ద సన్దాయినీ॥ ౪

శ్రీమద్రిజపతేః కృపాజలనిధి స్సాయన్తర జ్జచ్ఛటా
పాత్రైర్భద్రి మముద్రిమస్తుని తరామేతన భాయాంసతాన్।
దేశోయంనిరుపద్రవోస్త్వ విరతంనిశ్శేషకత్సవైస్సమ్పూర్ణో
నధర్మాన్నిజ ధర్మలోలుప ధియస్సర్వే శుభానాంశ్రితాః॥ ౫.

తిరుమల నల్లాన్ వంశో
ద్భవస్య శ్రీ చక్రవర్త్యభిజనోయం
ఇతి విజ్ఞాయతి సతా
మనుగ శ్రీ వేఙ్కటాహ్వో యోదాసః॥ ౬.

శ్రీమతే రామానుజాయ నమః

# అష్టశ్లోకీ



## టీకా తాత్పర్య సహితము

తనియన్

శ్లో. శ్రీపరాశర భట్టార్య శ్శ్రీరంగేశ పురోహితః
శ్రీవత్సాంకసుత శ్శ్రీమాన్ శ్రేయసే మేఽస్తు భూయసే.

టీ. శ్రీరంగేశ - శ్రీరంగనాథునియొక్క
పురోహితః - పురోహితుడును
శ్రీవత్సాంక - కూరత్తాళ్వారులకు
సుతః - కుమారుడును
శ్రీమాన్ - కైంకర్యధురంధరుడును అగు
శ్రీపరాశరభట్టార్యః - శ్రీపరాశరభట్టరనెడి ఆచార్యుడు
మే - నాకు
భూయసే - అధికమైన
శ్రేయసే - మేలును కలిగించుటకు
అస్తు - అగుచుండుగాక.

తా. శ్రీమద్రంగనాయకస్వామికి పురోహితులుగాను, శ్రీకూరేశులకు కుమారులుగాను, అర్థశాస్త్ర సంప్రదాయ ప్రవర్తకులుగాను వేంచేసి యుండు శ్రీ పరాశరభట్టరను పూర్వాచార్యులు దాసునికి అధికమగు మేలును అనుగ్రహము చేయుదురు గాక.

అవ. రహస్యత్రయమునందు మొదటిదైన తిరుమంత్రమునందు సంగ్రహముగా జెప్పబడి యుండునట్టి ఉపాయోపేయములను ద్వయము విస్తరించి చెప్పబడియుండుటచేత; ఈ ద్వయము నందు చెప్పబడియుండు ఉపాయోపేయములను పొందుటకు ముఖ్యముగా దెలియవలసినవియగు ఉపాయాంతరత్యాగమును, సర్వపాప నివృత్తియును, చరమశ్లోకము వివరించుట చేతను; ఈ రెండు రహస్యములకును మూలభూతముగానుండు ఈ తిరుమంత్రముయొక్క అర్థమును కృపచేయుటకు యత్నించి తిరుమంత్రమునందు ప్రథమమున స్మరించు ప్రణవమునందడంగియుండు అకార ఉకార మకారములయొక్క అర్థమును, ప్రథమమున ప్రసాదించుచున్నారు.

శ్లో. అకారార్థో విష్ణు
ర్జగదుదయ రక్షా ప్రళయకృత్।
మకారార్థో జీవ
స్తదుపకరణం వైష్ణవమిదం॥
ఉకారోఽనన్యార్హం
నియమయతి సంబంధ మనయోః।
త్రయీసార స్త్ర్యాత్మా
ప్రణవ ఇమ మర్థం సమదిశత్.

టీ. జగదుదయరక్షప్రళయకృత్,

జగత్-లోకముయొక్క
ఉదయ-ఉత్పత్తియును
రక్ష-రక్షణమును
ప్రళయ-సంహారమును
కృత్-చేయునట్టి
విష్ణుః-సర్వవ్యాపియౌభగవంతుడైన శ్రీమన్నారాయణుడు
అకారార్థః-(ప్రణవమందణగియుండు)అకారమునకు వాచ్యుడు
జీవః-బద్ధముక్త నిత్యులైన త్రివిధజీవులు
మకారార్థః-మకారమునకు వాచ్యులు.
వైష్ణవం-విష్ణువునుండి కలిగిన
ఇదం-ఈ త్రివిధజీవులును
తదుపకరణం,
తత్-ఆభగవంతునికి
ఉపకరణం-ఉపయోగింపదగినవస్తువుగా (ఉన్నవి)
ఉకారః-ప్రణవమందణగియుండు ఉకారమైన
అనయోః-ఈపరమాత్మ-జీవాత్మలయొక్క
సంబంధం-శేషశేషిభావరూపసంబంధమును
అనన్యార్హం-వేఱొక్కరిని సంప్రాప్తముకానితెఱంగున
నియమయతి-నియమించుచున్నది
త్రయీసారః,
త్రయీ-ఋగ్యజుస్సామములనెడి మూడు వేదములయొక్క
సారః-సారమగు
త్ర్యాత్మా,
త్రి-మూడక్షరములైన అకారఉకారమకారములే
ఆత్మా-స్వరూపముగాగల
ప్రణవః-ఓంకారము
ఇమం-మీద జెప్పిన ఈ యర్థమును
సమదిశత్-చక్కగా జెప్పుచున్నది.

తా. లోకములయొక్క సృష్టిస్థితి సంహారకర్తయును, సర్వవ్యాపియునునైన భగవంతుడు ప్రణవంబునందణగియుండు అకారమునకు అర్థముగానున్నాడు. బద్ధముక్త నిత్యులైన త్రివిధజీవులు మకారమునకు అర్థముగానున్నారు. భగవంతునివలనగలిగిన ఈజీవులు భగవంతునకు శేషభూతులను దానిని అకారమునకు మీద లోపించియుండు చతుర్థీవిభక్తి చెప్పుచున్నది. ప్రణవమందణగియుండు ఉకారము జీవపరమాత్మలు ఒకరికొకరికి గలిగియుండు శేష శేషిత్వరూపసంబంధమును, లక్ష్మి, భాగవతులు, ఆచార్యులు అన వీరితక్క తక్కినవారికి తగదని నిరయించుచున్నది. ఇట్లు వేదత్రయసారమైన ప్రణవము ఈయర్థమును స్పష్టముగా జెప్పుచున్నది.

అవ. నమః పదమునుగుఱించి వ్యాఖ్యానము చేయుచున్నారు.

శ్లో. మంత్రబ్రహ్మణి మధ్యమేన
నమసా పుంసస్స్వరూపం గతిః।
గమ్యం శిక్షిత మీక్షితేన
పురతః పశ్చాదపి స్థానతః,।
స్వాతంత్ర్యం నిజరక్షణం
సముచితా వృత్తిశ్చ నాన్యోచితా।
తస్యైవేతి హరే
ర్వివిచ్య కథితం స్వస్యాపి నార్హం తతః

టీ. మంత్రబ్రహ్మణి.

మంత్ర-మంత్రములలో
బ్రహ్మణి-బ్రహ్మమనందగు అష్టాక్షరమునందె
మధ్యమేన-నడుమనుండునట్టి (నమః అనుపదము)
పురతః-ముందుండునట్టి (ప్రణవముతోగూడ)
ఈక్షితేన-చేర్పబడియుండు
నమసా-నమః అనుపదముచేత
పుంసః-జీవునియొక్క
స్వరూపం-శేషత్వమగు స్వరూపము
శిక్షితం-శోధింపబడుచున్నది
స్థానతః-ఆదియందు స్థానమునందు ఆవృత్తివలన
లభ్యమైన అఖండనమస్సుతో జేర్పబడి
యుండు సఖండమైన నమః పదముచేత
గతిః-పొందదగినది (శోధింపబడుచున్నది).

పశ్చాత్-వెనుకనుండు "నారాయణాయ అను పదము తోడ చేర్పఁబడియుండు సఖండమైన నమః పదముచేత
గమ్యం-పొందఁదగినదైన కైంకర్యము శోధింపఁబడుచున్నది.
తస్య-ఆయొక్క
హరేరేవ-సర్వశేషియగు భగవంతునికే
స్వాతంత్ర్యం-స్వాధీనముగా నుండుటయును
నిజరక్షణం-తననురక్షించుటయును
వృత్తిశ్చ-శేషభూతులైన ఈజీవులకుదగినట్టికైంకర్యమును
సముచితా- చక్కఁగాఁదగినది
అన్యోచితాన-ఇతరులకు దగినది కాదు.
ఇతి-ఇట్లు
వివిచ్య-విభజించి
కథితం- చెప్పఁబడినది
తతః-కావున
స్వస్యాపి-పరమాత్మకును తనకును
న, అర్హం-తగినదికాదు.

తా. మంత్రశ్రేష్ఠమైనట్టి అష్టాక్షరియందలి మధ్యయందుండు నమఃపదమును దీనికి ముందుండు ప్రణవముతోఁడఁజేరిన మకారముతోను, వెనుకనుండు నారాయణాయ అనుపదముతోను, అచ్చటనే రెండు మాఱులు ఆవృత్తిచేసి చేర్పఁబడియుండు నమః అనుపదముతోను, ఇట్లు మూఁడు రీతులయందును అర్థముచేయుటచేత, ఈజీవునికి స్వరూప ఉపాయ పురుషార్థములను మూఁడును చక్కఁగా శోధింపఁబడినవైనవి. ఎట్లన, నమః అను సఖండమైన (రెండుపదములుగా విభజింపఁబడియుండు) నమశ్శబ్దమును ప్రణవముతోఁకూడచేర్చి అర్థముచేయుటవలన ఈజీవుడు పరమాత్మకే శేషుఁడు అని తెలుపఁబడుచున్నది. ఇట్లుతనవాఁడుకాదని అర్థముచేయుటవలన ఈజీవునికి స్వతంత్రము నివర్తియై పరమాత్మకేవీఁడు శేషుఁడనెడి స్వరూపము చక్కఁగాగనఁబఱచఁబడుచున్నది. ఈ నమః పదమునే నమః నమః అని రెండుమాఱులు ఆవృత్తిచేసి అచ్చటనే అర్థముచేసినయెడల ఉపాయము (ప్రపత్తి) జీవునిదికాదని అర్థమగుటచేత పరమాత్మ చేయింపఁగా జీవుఁడు ఉపాయమును చేయుటవలన పరమాత్మవలె జీవునికి ఉపాయమునందు ప్రధానకర్తృత్వములేదని ఉపాయస్వరూపము చక్కఁగాఁదెలియపఱచఁబడినది. ఈ నమశ్శబ్దమును వెనుకనుండు నారాయణాయ అనుపదముతోఁజేరి అర్థముచేసినయెడల శ్రీమన్నారాయణునికేసకలవిధకైంకర్యములును చేయఁగలవాఁడను, నాకొఱకు చేయువాఁడనుగానని అర్థమగుటవలనను, ఆకైంకర్యమునందు తన ప్రయోజనము నివర్తియగుటచేతను, ప్రాప్యస్వరూపముచక్కఁగా కనఁబఱచబడినదగుచున్నది. దీనివలన స్వరూపము, ఉపాయము, పురుషార్థము అను మూఁడును స్పష్టముగాఁగనఁబఱచఁబడినవి. గనుక స్వామిగానుండుట, తననురక్షించుట, శేషత్వరూపమైన భగవత్కైంకర్యము, స్వీకరించుట ఇవి భగవంతునికే తగునుగాని తక్కినవారికి తగదనిసిద్ధించెను. ఈ జీవుఁడు పరమాత్మకుతక్క వేరెవ్వరికిని శేషుఁడు కాఁడు. వేరెవ్వరిని రక్షకునిగా పొందువాఁడును కాడు. వేరెవ్వరికిని అర్హుడుకాడు. అని ఆకారత్రయము సిద్ధించెను. ౨.

అవ. ఈశ్లోకముచేత నారాయణశబ్దార్థమును కృపచేయుచున్నారు.

మఱియు నరులు అని చెప్పఁబడు జీవుల సమూహమునకు ప్రాప్యుఁడనియును, ప్రాపకుఁడనియును నేకాక యర్థము. ఈయర్థముచేత భగవంతునికి పరత్వము సిద్ధించుచున్నది.

మఱియు నరులని చెప్పఁబడు జీవులసమూహమునకు ఆధారముగాఁగలవాఁడు పరమాత్మయని నేకాకయర్థము. దీనిచేత భగవంతుఁడు అందరిలోపల ప్రవేశించియున్నాఁడని స్ఫురించుటవలన భగవంతుఁడే సర్వాంతర్యామి యనియును సర్వస్థుల సాక్షియును చెప్పఁబడుచున్నది.

[illegible] నారాయణశబ్దము చెప్పుచున్నదో, ఆభగవంతునిపొందు నిమిత్తము సర్వకాలములయందును, సర్వావస్థలయందును, సర్వదేశములయందును, నిలుచుట, కూర్చుండుట, పరుండుట, మొదలగు సర్వావస్థల యందును, నాకు స్వభావ సిద్ధములుగా నుండు సకల విధ కైంకర్యములును, వాని విరోధములైన అనాది కర్మముల నివర్త్తియు సిద్ధించునుగాక. కావున ఈ తిరుమంత్రమునందుండు ప్రణవముచేత ఈ జీవులకు విశేషత్వమును, నమశ్శబ్దముచేత పరమాత్మకు పరాధీనముగానుండుటయును, నారాయణశబ్దముచేత పరమాత్మకు కైంకర్యముచేయుటయును చెప్పఁబడినది.

వ. ఇట్లు మూఁడుశ్లోకములచేత తిరుమంత్రముయొక్క అర్థమును తెలియఁజేసి ప్రపన్నులకు తర్వాత నేదేని విషయాంతరములవలన దేహాత్మభ్రమము మొదలగునవి కలుగక యుండునిమిత్తము ఈ అర్థానుసంధానము అవశ్యముగాఁ జేయవలయునని ప్రతిపాదించుచున్నారు.

శ్లో. దేహాసక్తాత్మ బుద్ధి ర్యది భవతి పదం
సాధు విద్యా త్తృతీయం!
స్వాతంత్ర్యాంధో యది స్యాత్
ప్రథమ మితర శేషత్వ ధీ శ్చే ద్ద్వితీయమ్,
ఆత్మ త్రాణోన్ముఖ శ్చేత్
నమ ఇతి చ పదం బాంధవాభాస లోలః
శబ్దం నారాయణాఖ్యం
విషయచపలధీ శ్చే చ్చతుర్థం ప్రపన్నః.౮.

టీ. ప్రపన్నః-ప్రపత్తిచేసినవారికి
దేహే-తమదేహమునందు
ఆసక్త-సంబంధించిన
ఆత్మ-ఆత్మయనెడి
బుద్ధిః-బుద్ధికలవారుగా
భవతియది-అగుదురేని
తృతీయపదం-మూఁడవపదమైన (మకారము) యొక్క అర్థమును
సాధు-చక్కఁగా
విద్యాత్-తెలుసుకొనవలయును (అనుసంధించుకొనవలెను.)
స్వాతంత్ర్యాంధః,
స్వాతంత్ర్య-స్వతంత్రముగలవాఁడనెడి
అంధః-గ్రుడ్డివారుగా (మూర్ఖులుగా)
భవతియది-అగుదురేని
ప్రథమం-ప్రణవమునందలి ప్రథమపదమైన అకారము యొక్క అర్థమును తెలియవలయును.
ఇతరశేషత్వధీశ్చేత్,
ఇతర-భగవంతుడు శ్రీదేవి భాగవతులు ఆచార్యులు వీరుగాక తక్కినవారికి
శేషత్వ-శేషభూతుఁడుగానుండుటయందు
ధీశ్చేత్-బుద్ధికలుగునేని
ద్వితీయం-ప్రణవమునందలి ద్వితీయపదమైన ఉకారము (యొక్క అర్థమును తెలియవలయును.)
ఆత్మత్రాణోన్ముఖశ్చేత్,
ఆత్మ-తనయొక్క
త్రాణ-రక్షణమునందు
ఉన్ముఖశ్చేత్-ప్రయత్నముగలవారగుదురేని

నమ ఇతి పదం-నమః అనెడి పదముయొక్క అర్థమును, తెలియవలయును
బాంధవాభాసలోలశ్చేత్
బాంధవాభాస–బంధువులుగా తోఁచునట్టివారియందు
లోలశ్చేత్-ఆశగలవారగుదురేని
శబ్దం నారాయణాఖ్యం.
నారాయణ-నారాయణ అనెడి
ఆఖ్యం-అభిధానముగల
పదం-పదముయొక్క అర్థమును తెలియవలయును.
విషయచపలధీశ్చేత్:
విషయ-శబ్దాదివిషయములయందు
చపల-ఆశగల
ధీశ్చేత్-బుద్ధిగలవారగుదురేని
చతుర్థీం-నారాయణపదముమీఁదనుండు చతుర్థీవిభక్త్యర్థమును (ఆయపదముయొక్క అర్థమును) తెలియవలయును.

తా. భగవంతుని ప్రపత్తి చేసిన ప్రపన్నులు బుద్ధిభ్రంశముచేత దేహమే ఆత్మయనెడి బుద్ధి మొదలగు దోషములు గలిగినవారైరేని అప్పుడు ప్రణవముయొక్క తృతీయపదమైన మకారార్థమును అనుసంధింపవలయును. ఆమకారమువలన జడముగాను అచేతనముగాను నుండు దేహమునకంటె వేఱైనట్టియు, జ్ఞానానంద స్వరూపమైనట్టియు, అణుస్వరూపమైనట్టియు, ఆత్మవస్తువు చెప్పఁబడుటవలన అజ్ఞానము నివర్తియగును.

తాను స్వతంత్రుఁడనని భగవచ్ఛేషత్వరూపమైన తనస్వరూపమును మఱచిపోయిరేని అప్పుడు ప్రణవముయొక్క ప్రథమపదమైన అకారార్థమును అనుసంధింప వలయును. దానిమీఁద లోపించియుండు చతుర్థీ విభక్తితోఁగూడిన అకారముచేత సర్వకారణమైనట్టియు సర్వరక్షకమైనట్టియు సర్వసంహారకారకమైనట్టియు లక్ష్మీపతియైనట్టియు సర్వశేషియైనట్టియు పరమాత్మవస్తువుచెప్పఁబడుచున్నది. ఆయర్థమును అనుసంధించుటవలన భగవంతుఁడు సర్వస్వతంత్రుఁడనియును ఈ శేషుఁడు ఆభగవంతునికి పరాధీనుఁడనియును జ్ఞానముగలుగుటవలన తాను స్వతంత్రుఁడనెడి అజ్ఞానము నివర్తియగును.

పెరుమాళ్ళు, పిరాట్టి, భాగవతులు, ఆచార్యులతక్క, తక్కినవారికి తాను శేషుఁడుకావచ్చుననెడి అజ్ఞానముతోడఁగూడినవారైయుందురేని అప్పుడు ప్రణవముయొక్క ద్వితీయపదమైన ఉకారార్థమును అనుసంధింపవలయును. ఆ ఉకారమువలన ఈ జీవపరమాత్మలలో ఒకరికొకరికి గలిగియుండు శేషశేషిత్వరూపసంబంధము వేఱొకరికిని తగదనిచెప్పఁబడుటచేత, తాను పరులకు శేషుఁడు కానగుదుననెడి అజ్ఞానము నివర్తియగును.

తనను రక్షించుకొనుటకు స్వతంత్రుఁడై ప్రయత్నము చేయునప్పుడు నమఃపదార్థమును అనుసంధింపవలయును. సఖండనమస్సుతోఁగూడిన ఆనమశ్శబ్దమువలన ఉపాయము భగవంతుఁడనెడియర్థము స్ఫురించుటవలన ఉపాయమునకు తాను స్వతంత్రకర్తయనెడి అజ్ఞానము నివర్తియగును.

పుత్ర, మిత్ర, కళత్రాదులయందు ఆశగలవారుగా నుందురేని అప్పుడు నారాయణపదార్థమును అనుసంధింపవలయును. ఆనారాయణ పదమువలన సకలవివిధ బంధువులును శ్రీమన్నారాయణుఁడే యనెడి అర్థము స్ఫురించుటచేత, పరులు

మానకు బంధువులనెడి అజ్ఞానము నివర్తియగును.

శాస్త్రవిహితముగను శాస్త్రగర్హితముగను నుండు దుర్విషయములయందు ప్రేమగలవారుగ నుండుటచేసి అప్పుడు నారాయణ పదముమీఁద నుండు చతుర్థీవిభక్త్యర్థమును అనుసంధింపవలయును. ఆచతుర్థీవిభక్తివలన శ్రీమన్నారాయణుని కొఱకే కైంకర్యము చేయగలవాఁడనేగాని, వేఱే విధముగా నేదియు చేయువాఁడనుకానసెడి అర్థము స్ఫురించుటవలన, తనస్వరూపమునకు తగనివియును, అల్ప సుఖములను కలుగఁజేయునవియును, అంత్యమున విరసము నొసంగునవియును, అస్థిరములైనవియును, జుగుప్సాస్పదములైనవియును నగు స్త్రీ మొదలగు విషయానుభవములయందు ఆశనుకలుగఁజేయు అజ్ఞానము నివర్తియగును.

సకల వేదశాస్త్రార్థములని చెప్పఁబడుఅర్థపంచకమును ఈ తిరుమంత్రమునందు సంగ్రహముగాఁ చెప్పఁబడియున్నది. ఎట్లన:-

౧. పొందఁదగినట్టి పరమాత్మస్వరూపమును ౨.దానిని పొందనట్టి జీవస్వరూపమును, 3. దానిని పొందుటకు సాధనమైన భక్తి ప్రపత్త్యాది ఉపాయ స్వరూపమును, ౪. ఆ ఉపాయములవలన పొందఁదగిన ఫలస్వరూపమును, ౫. దాని విరోధి స్వరూపమును, ఇట్లుగా అయిదు అర్థములు చెప్పఁబడెను. వీనిలో,

౧ ప్రణవమువలన జీవస్వరూపమును, ౨ అఖండనమశ్శబ్దమువలన ఉపాయ స్వరూపమును, ౩ సఖండనమశ్శబ్దమువలన విరోధి స్వరూపమును, ౪ నారాయణ పదమువలన పరమాత్మ స్వరూపమును, ౫ నారాయణ పదము మీఁద నుండు చతుర్థీవిభక్తివలన ఫలస్వరూపమును, ఇట్లు అయిదర్థములు ఈమంత్రమునందు చెప్పఁబడియున్నవి.

అవ. ఇట్లు నాలుగు శ్లోకములచేత మూల మంత్ర వ్యాఖ్యానముచేసి ప్రపత్త్యనుష్ఠానక్రమమును ప్రకాశింపఁజేయునదైన ద్వయమనెడి మంత్రరత్నమును రెండు శ్లోకములచేత కృప చేయుచున్నారు.

శ్లో॥ నేతృత్వం నిత్యయోగం
  సముచిత గుణ జాతంతను ఖ్యాపనం చో
పాయం కర్తవ్య భాగం
  త్వథ మిథున పరంప్రాప్య మేవం ప్రసిద్ధమ్,
స్వామిత్వం ప్రార్థనాం చ
  ప్రబలతర విరోధి ప్రహాణం దశైతా
మంతారం త్రాయతే చే
  త్యధిగత నిగమ ష్షట్పదోయం ద్విఖండః.౫.

టీ. నేతృత్వం-పురుషకారముచే రక్షించుటయును,
నిత్యయోగం-నిత్యమైన సంబంధమును
సముచితగుణజాతం
సముచిత-మిక్కిలి తగినవియైన
గుణజాతం-కల్యాణగుణముల సమూహమును
తనుఖ్యాపనం
తను-దివ్యమంగళవిగ్రహముయొక్క
ఖ్యాపనంచ-ప్రకాశమును
ఉపాయం-సాధనమును
కర్తవ్యభాగం

ఆరుపదములతోడను రెండువాక్యములతోడను గూడినదియును కఠవల్ల్యాద్యుపనిషత్తులయందు ప్రఖ్యాతమైనదియు నగు ద్వయమనెడి యీమంత్రము రక్షించుచున్నది.

అవ. ఇట్లు మంత్రరత్నముయొక్క పదార్థములను కృపచేసి ఈ అర్థములను అనువాదము చేయువాక్యార్థమును విశదీకరించుచున్నారు.

శ్లో॥ ఈశానాం జగతా మధీశ_ దయితాం
నిత్యా_నపాయాం శ్రియం
సంశ్రిత్యా శ్రయణో చితా ఖిల_గుణ
స్యాంఘ్రీ హరే రాశ్రయే,
ఇష్టో పాయతయా శ్రియా చ సహితా
యాత్మేశ్వరా యార్థయే
కర్తుం దాస్య మశేష మప్రతిహతం
నిత్యం త్వహ న్నిర్మమః, ౬.

టీ. జగతాం-లోకములకు
ఈశానాం-నియమించునదియును
అధీశదయితాం,
అధీశ-సర్వేశ్వరుడైన భగవంతునకు
దయితాం-ప్రియభార్యయైనదియును
నిత్యానపాయాం,
నిత్య-ఎల్లప్పుడును
అనపాయాం-భగవంతునివిడనాయనిదియును అగు
శ్రియం-శ్రీమహాలక్ష్మీదేవిని
సంశ్రిత్య-శరణుబొంది
ఆశ్రయ ...గుణస్య,
ఆశ్రయణ-శరణుబొందుటకు
ఉచిత-తగినదియైన
అఖిల-సమస్తమైన
గుణస్య-కల్యాణగుణములుగల
హరేః-ఆశ్రితుల అపరాధములను క్షమించుభగవంతుని యొక్క

అంఘ్రీ-చరణములను
ఇష్టోపాయతయా,
ఇష్ట-అభీష్టఫలమునకు
ఉపాయతయా-సాధనముగా
ప్రపద్యే-పొందుచున్నాడను.
శ్రియాచ-శ్రీమహాలక్ష్మితోడగూడ
సహితాయ-నిత్యముగా జేరియుండునట్టి
ఆత్మేశ్వరాయ,
ఆత్మ-జీవులకు
ఈశ్వరాయ-ఈశ్వరుడైన పరమాత్మునకు
అహమ్-నేను
నిర్మమ-అహంకారమమకారములు లేనివాడై
అశేషమ్_సమస్తమైన
అప్రతిహతం-అటంకములేని
నిత్యం-సర్వకాలమునుచేయునట్టి
దాస్యం-కైంకర్యమును
కర్తుం-చేయుటకు
అర్థయే-ప్రార్థించుచున్నాడను.

తా. లోకములకు ఈశ్వరిగను, సర్వేశ్వరుడైన భగవంతునకు ఇష్టమహిషిగను, భగవంతునితో నెల్లప్పుడును ఎడబాయక యుండునట్టిదిగను నుండు శ్రీమహాలక్ష్మిని పురుషకారముగా శరణమొంది, తర్వాత ఆశ్రితులు శరణమొందుటకు యోగ్యమగు వాత్సల్య స్వామిత్వ సౌశీల్య సౌలభ్య జ్ఞానశక్తి పూర్తి ప్రాప్తి మొదలగు కల్యాణగుణములచే ప్రకాశించువాడును సర్వపాప నివారకుడును నగు భగవంతునియొక్క దివ్యచరణములను నీకునలయు మోక్షరూపఫలమునకు సాధనముగా, ఆశ్రయించు చున్నాడను. (ఇది ద్వయముయొక్క పూర్వఖండార్థము). ఇట్లు శరణాగతులకు పురుషకారమును జేయు శ్రీమహాలక్ష్మీదేవితో గూడియుండునట్టియు సర్వాత్మలకును

ఈశ్వరుఁడైన శ్రీమన్నారాయణునకు దాసుఁడనై అహంకార మమకారములు లేనివాఁడనై సర్వవిధకైంకర్యములను సర్వకాలములయందును సర్వావస్థలయందును చేయుటకు ప్రార్థించుచున్నాఁడను. (ఇది ఉత్తరఖండమునొక్క అర్థము).

అవ. ఇట్లు ముమ్మారహస్యమైన ద్వయమునకు వ్యాఖ్యానముచేసి ఇప్పుడు అన్వయార్థమునకు వివరణమును, భగవంతుఁడు చేతనోజ్జీవనార్థము కృపచేసినదియును నగు చరమశ్లోకమునకు వ్యాఖ్యానముగా నీశ్లోకమును కృపచేయుచున్నారు.

శ్లో॥ మత్ప్రాప్త్యర్థతయా మయోక్త మఖిలం
సన్త్యజ్య ధర్మం పునః
మామేకం మదవాప్తయే శరణ మి
త్యార్తోవసాయం కురు
త్వా మేవం వ్యవసాయయుక్త మఖిల
జ్ఞానాది-పూర్ణో హ్యహం
మత్ప్రాప్తి-ప్రతిబంధకై ర్విరహితం
కుర్యాం శుచ మ్మాకృథాః,

టీ. మత్ప్రాప్త్యర్థతయా.
మత్-నాయొక్క
ప్రాప్తి-పొందుటను
అర్థతయా-ప్రయోజనముగాఁగలిగియుండుటచే
మయా-నాచేత
ఉక్తం-చెప్పఁబడియుండు
అఖిలం-సమస్తమైన
ధర్మం-కర్మయోగజ్ఞానయోగములతోఁగూడిన
భక్తియోగమును
సన్త్యజ్య-ఉపాయబుద్ధిని పూర్తిగావిడిచి
మాం-నన్ను
ఏకం ఒక్కనినిమాత్రమే
ఆర్తః-దుఃఖపడెడినీవు
మదవాప్తయే-నన్ను పొందుటకు
శరణమితి-ఉపాయమని
అవసాయం-నిశ్చయమును
కురు-చేయుము
ఏవం-ఈప్రకారముగా
వ్యవసాయయుక్తం.
వ్యవసాయ-నిశ్చయముతోఁగూడిన
యుక్తం-కూడియుండు
త్వాం-నిన్ను
అఖిలజ్ఞానాదిపూర్ణః.
అఖిల-సమస్తమైన
జ్ఞానాది-జ్ఞానమే ప్రధానముగాఁగలదివ్యగుణములవలన
పూర్ణః-నిండినవాఁడైన
అహం-నేను
మత్ప్రాప్తి ప్రతిబంధకైః.
మత్-నన్ను
ప్రాప్తి-పొందుటకు
ప్రతిబంధకైః-విరోధములైన అనాదిపుణ్యపాపరూపము
లగు సర్వకర్మలచేతను
విరహితం-విడువఁబడినవాఁనినిగా
కుర్యాం-చేయగలను
శుచం-వ్యసనమును
మాకృథాః-పొందవలదు.

తా. నన్ను పొందుటకు సాధనములుగాఁ జెప్పఁబడియుండు కర్మయోగ జ్ఞానయోగ భక్తియోగములనెడి మోక్షసాధనములను అనుష్ఠించుటకు శక్తిలేదని నీవు వ్యసనపడవలదు. నీవు నన్నొకనినే ఉపాయముగా నిశ్చయించుకొనవలయును. ఇది చరమశ్లోక పూర్వార్థము,

ఇచ్చట కర్మయోగాదులను అనుష్ఠింపక నన్నొకనినే శరణుపొందిన చాలునని చెప్పినంత

మాత్రమున నిత్యనైమిత్తికాది ప్రపత్తిసాధనములనుకూడ వదలిపెట్టవచ్చునని యూహింపరాదు. ప్రతివారున్ను తమతమ వర్ణాశ్రమ ప్రయుక్త కర్మలనన్నింటిని భగవదాజ్ఞారూపముగ భగవదర్పణబుద్ధ్యా చేయవలయును. ఇట్టి నిశ్చయముతోడ గూడిన నిన్ను జ్ఞానశక్త్యాది గుణములతోడ గూడిన నేను, నన్ను పొందుటకు విరోధములైయుండు పుణ్యపాపరూపములైన సర్వకర్మలయందుండి నివర్తింపచేసెదను. దుష్కరమై అపాయకరమైయుండు కర్మయోగాది సాధ్యోపాయములను చేయుటకు శక్తుడనుకాను కదాయని చింతింపవలదు.

ఇచ్చట భగవంతుని పొందుటకు విరోధములైనవన్నియు పాపములని చెప్పబడుచున్నవి. అవి యేవనగా, అవిద్య, కర్మము, వాసన, అభిలాష, ప్రకృతిసంబంధము, దానిభేదమైన దేహాత్మాభిమానము, దానిని సంబంధించిన అహంకార మమకారములు అనునవి.

అవిద్యయనగా, జ్ఞానహీనము. ఇది అజ్ఞానము, అన్యథాజ్ఞానము, విపరీతజ్ఞానము, అని మూడువిధములు. వీనిలో అజ్ఞానమనగా, మూఢత్వము. అన్యథాజ్ఞానమనగా, ఒకటిని వేఱొకటిగా దెలియుట. విపరీతజ్ఞానమనగా, శత్రువును మిత్రునిగా భావించుట.

కర్మమనగా ఇదిపుణ్యమనియు పాపమనియు రెండువిధములు. పుణ్యకర్మము ఫలాపేక్షారహితమైనది. పాపకర్మము పరహింసాకరమైనది.

ఇచ్చట పుణ్యకర్మలును పాపకర్మలవలె మోక్షవిరోధములు. ఈరెండు కర్మములును పూర్వాఘములనియును ఉత్తరాఘములనియును ఒక్కొకటియును రెండువిధములు. పూర్వాఘములనగా, తాము ప్రపత్తిని అనుష్టించుటకు పూర్వముచేయబడు కర్మములు. ఉత్తరాఘములనగా, ప్రపత్తిని అనుష్టించిన అనంతరము చేయబడు కర్మములు.

వాసనయనగా, అనాదిగా తాము చేయుచు వచ్చిన కార్యములను, ఇప్పుడును తమయిష్టము లేకయే చేయుచుండునట్టి అభ్యాసము. అభిలాషయనగా, ఇంద్రాది మహాభోగములు కావలెనను కోరిక. ప్రకృతి సంబంధమనగా స్థూల సూక్ష్మమైన దేహసంబంధము. మఱియు పూర్వాఘములు సంచితమనగా, కర్మములయొక్క ఫలములను నిచ్చుటకు ప్రారంభించిన కర్మములు

ఈచెప్పబడిన ఉత్తరాఘములు బుద్ధిపూర్వకములనియును, అబుద్ధిపూర్వకము లనియును రెండువిధములు. బుద్ధిపూర్వోత్తరాఘములు ప్రాయశ్చిత్తముచే నివర్తియగుచున్నది. ప్రాయశ్చిత్తము చేయకపోయినను అనుభవమువలన నివర్తియగుచున్నది. భక్తియోగమనెడి ఉపాయాంతరమును అనుష్టించినవారికి పైన చెప్పిన కర్మములయందు ప్రారబ్ధకర్మములును ప్రాయశ్చిత్తముచేయని ఉత్తరాఘములును అనుభవముచేతనే నివర్తియగుచున్నది. అబుద్ధిపూర్వోత్తరాఘములు తామనుష్టించిన ప్రపత్తిబలముచేత నివర్తియగుచున్నది.

దృప్తప్రపన్నులకు అభ్యుపగత ప్రారబ్ధకర్మములును, ప్రాయశ్చిత్తములేని బుద్ధిపూర్వోత్తరాఘములును అనుభవింపఁగా నివర్తియగుచున్నది. సంచితకర్మములును, అనభ్యుపగత ప్రారబ్ధకర్మములును, ప్రపత్తివలన నివర్తియగుచున్నది. అబుద్ధిపూర్వోత్తరాఘములు వారిని చెందవు.

ఆర్తప్రపన్నులకు ఈకర్మము లన్నియును వారనుష్ఠించిన ప్రపత్తివలన నివర్తియగును. ఆర్తప్రపన్నులకు ప్రపత్తిని యనుష్ఠించినతోడనే మోక్షము సిద్ధించుటచేత వీరికి ఉత్తరాఘము లేదు. ఇచ్చట మోక్షవిషయమును, తద్విరోధములైన సకలపాప నివర్తులను చెప్పవలసి యుండఁగా, పాపనివర్తనములనుమాత్రము చెప్పఁబడిన దానికిం గారణమేమనఁగా, మోక్షవిరోధములైన పాపములునివర్తించినవెంటనే తనంతనే సిద్ధింపఁబోవునది మోక్షమేకావున, మోక్షవిషయమును గూర్చి ప్రస్తావన చేయలేదు.

అవ. పైశ్లోకమువలన తమకుఁ గల్గియుండు శోకమునకు కారణమును, అది నివర్తియగు విధమును తెలియఁబఱచి, తమకు ఆత్మరక్షణము నందు భయములేదని యనుసంధించుచున్నారు.

శ్లో॥ నిశ్చిత్య త్వదధీనతాం మయి సదా
కర్మాద్యుపాయాన్ హరే
కర్తుం త్యక్తు మపి ప్రపత్తు మనలం
సీదామి దుఃఖాకులః
ఏతత్ జ్ఞానముపేయుషో మమ పునః
సర్వాపరాధ క్షయం
కర్తాసీతి దృఢోస్మి తే తు చరమం
వాక్యం స్మరన్ సారథేః.

టీ. హరే-ఆశ్రితదోషములను బోఁగొట్టు భగవంతుఁడా!
మయి-నాయందు
సదా-సర్వకాలమును
త్వదధీనతాం,
త్వత్-నీయొక్క
అధీనతాం-అధీనముగానుండుటను
నిశ్చిత్య-నిశ్చయించి
కర్మాద్యుపాయాన్,
కర్మ-కర్మయోగము
ఆది-మొదలుగాఁగల
ఉపాయాన్-ఉపాయములను
కర్తుం-చేయుటకును
త్యక్తుం-విడుచుటకును
ప్రపత్తుమపి-ప్రపత్తిచేయుటకును
అనలం-అశక్తుఁడైననేను
దుఃఖాకులః,
దుఃఖ-వ్యసనముచేత
ఆకులః-కలఁతనొందినవాఁడనై
సీదామి-దుఃఖించుచున్నాను.
సారథేః-పాండవులకు సారథిగానున్న
తే-నీయొక్క
చరమం-కడపటిదైన
వాక్యం-వాక్యమును
స్మరన్-స్మరించుచున్నట్టి
ఏతత్-ఈ
జ్ఞానం-ప్రపత్తిరూపజ్ఞానమును
ఉపేయుషః-పొందియుండునట్టి
మే-నాయొక్క
సర్వాపరాధక్షయం.
సర్వ సమస్తమైన
అపరాధ-అపరాధములయొక్క
క్షయం-నాశమును
కర్తాసి-చేయుదువుగాక
ఇతి-అని
దృఢోస్మి-దృఢమనస్కుఁడనైయున్నాను.

తా. ఆశ్రితపాపహరుఁడగు భగవంతుఁడా! నేనెల్లప్పుడును నీకు పరాధీనుండ గానవలెను కర్మ

యోగ జ్ఞానయోగ భక్తియోగములగు మోక్షోపాయములను అనుష్ఠించుటకు స్వాతంత్ర్యము లేదు. అయినను శాస్త్రములయందు చేతనులను ఉద్దేశించి యీ ఉపాయములను అనుష్ఠించునట్లు నీవు విధించి యుండుటచేత, ఈ యుపాయములను అనుష్ఠించుటకు దాసునికి నీవలన స్వాతంత్ర్య మొసంగఁబడినది. అట్లుండియును మిగుల అల్పజ్ఞానముతోఁ గూడిన దాసుఁడు వీనిని అనుష్ఠింపక యుండవచ్చునన్నచో, మోక్షాపేక్షగల దాసునకు అవి సాధనములుగా నుండుటవలన వీనియందభిలాషయున్నది. అయినను అనుష్ఠించుటకు అశక్తుఁడనై యున్నాఁడను. ఈఉపాయములను అనుష్ఠించుటకు అశక్తులుగా నుండువారిని యుద్దేశించి సులభోపాయముగా శాస్త్రములయందు విధింపఁబడియుండు ఈప్రపత్తిని అనుష్ఠింపనగుఁగదా యనఁగా, దీనికి అంగముగా లిఖింపఁబడియుండు కర్మలయందు విశ్వాసము లభించుట మిగుల దుష్కరముగాన, ఈప్రపత్తిని అనుష్ఠింప నసమర్థుఁడనుగా నున్నాఁడను. ఇట్లు ఏ యొక్క గతియును లేక దుఃఖాకుల మానసుండనైన దాసునకు అర్జునునకు సారథిగా నున్నప్పుడు ఉపదేశించిన నీయొక్క కడపటివాక్యమైన గీతాశాస్త్రమందలి చరమశ్లోకమునందు నన్ను నీవు శరణుపొందుము, నిన్ను నేను సకలవిధములైన పాపములనుండి రక్షించెదను, అని దేవరవారు కృపచేసినదానిని తలంచి, ఇందు మహా విశ్వాసముగలవాఁడనై ఈప్రపత్తిని అనుష్ఠించితిని. దీనివలన దేవరవారు దాసునిపాపములను నివర్తి చేయుదురని దృఢమైన నమ్మికతోఁ గూడిన వాఁడుగా నున్నాఁడను.

అష్టశ్లోకి ఆంధ్రటీకాతాత్పర్య సహితము








# ప్రాచీన భారత సామాజిక జీవనము స్త్రీలకొసంగిన స్థానము



(కల్యాణి పత్రికానువాదము - అనువాదకురాలు: చి. సౌ. పుష్పరాణి [illegible])

నేడు పాశ్చాత్యశిక్ష, పాశ్చాత్యవిద్యాప్రచారము మూలమున భారతదేశమునకూడ నారీధర్మవిభాగమున నాందోళనలు జరుగుచున్నవి. స్త్రీ సౌశీల్య, సరళతాపూర్ణమగు జ్ఞానము కోమల [illegible]కూడిన ధైర్యము, త్యాగమయమగు విషయభోగము, మొదలగు సుగుణపరిపూర్ణములగు ననేక చిత్రముల ప్రాచీనేతిహాసములయందు చూచినచో పూర్వకాలపు స్త్రీలకును అధునాతనాంగ్లవిద్యాప్రవీణులును, పాశ్చాత్యనాగరికత నలవరచుకొనవలెనని యాందోళన మందుచున్న నిప్పటి స్త్రీలకును గలతాత్పర్యము కానవగును. సాధారణముగ సేవచేయుటయే స్త్రీ తన ధర్మముగ నెన్నుకొనుటచే నామె 'దేవియనియు' త్యాగమొనరించిన దగుటచే 'సామ్రాజ్ఞి' యనియు, ప్రపంచమునందును తన వాత్సల్య పరిపూర సౌందర్యజాలి యుండుటచే 'జగన్మాత' యనెడు సార్థకనామములు కలదియై స్త్రీ యనబడును. ఆమె ప్రపంచము నంతను తన నిస్స్వార్థసేవ త్యాగములచే నాహ్లాదపరచు శక్తి కలిగియుండును. సమాజమున నామె కుచ్ఛస్థాన మీయబడెను. కాని యధునాతనాంగ్లశిక్షాశిక్షితులగు స్త్రీలు విషయసేవనా లాలసులై విడాకుల చట్టమును గూర్చియు, వివాహనిరోధములగూర్చియు, ధనధాన్యములయందు స్త్రీలకుకూడ పురుషులతో సమానహక్కులు కావలయుననియు, పోరాడుచున్నారు. నేడును సమాజమున స్త్రీల కున్నత స్థానమున్నను యది విషయవాసనలచే మూఢావృతమగు రూపముననేగాని, పూజనీయురాలును స్వర్గముకన్నను ఉత్కృష్టయు నగు మాతృరూపము నొసంగబడుటలేదు. [illegible] కాలే

ష్టీలు, వివిధములగు సంఘములు మొదలైనవే యుత్పన్నస్థితులకు కారణములు. యుగపరివర్తనముతో బాటు ఆచారవ్యవహారములయందు మార్పుకలుగుట తప్పని సరియైనను యనాదిసిద్ధములగు ధర్మములకు హాని కలిగింపరాదు. సంసారమున స్త్రీపురుషు లిరువురకును మహత్త్వమున్నది. వారిలో నొకరి కొకరు సహాయులగుచున్ననే వారి జీవితము సార్థకమగును. స్త్రీలు భగవన్నిర్మితమగు తమ స్థానము నతిక్రమించి పురుషుని స్థానము నధిష్ఠించవలెనన్న తప్పక ముప్పు వాటిల్లును. మన ప్రాచీన హిందూ సంస్కృతియందు గృహస్థజీవన మొక యజ్ఞముగ జెప్పియున్నారు. దానివలన స్త్రీ యర్థాంగినీ రూపమున పురుషునకు సహచారిణియై యుండును. రఘువంశమున నప్పటి కాలపు స్త్రీలను కాళిదాసెట్లు వర్ణించెనో గాంచుడు. నిర్జన వనప్రదేశమున ఋషిరాజగు వసిష్ఠుడు తన భార్యయగు యరుంధతీదేవితోగూడ సాయంకాలపు సంధ్యాక్రియల జరుపుచున్నాడు. ఇది స్త్రీలకు ధర్మజ్ఞానమున కెట్టి యుత్తమమగు నుదాహరణము. అట్లే శ్రీరామచంద్రుడు పితృవాక్యపరిపాలనమున బద్ధకంకణుడై యుండ సహధర్మచారిణి యగు సీతయు వనమున కాతని వెంబడించెను. ప్రాచీన భారతనారీమణులు తమ జీవితమును తపశ్చర్యచేతనే సార్థకమగునని తలంచుచుండిరే కాని విషయభోగమున. వారిచిత్తము లగ్నమయ్యెడిది కాదు, పార్వతివలె తపశ్చర్యవలన పవిత్రమగు జీవితము లేశమైనను నేటి వాతావరణమున కానరాదుగదా! పార్వతి తన తనుతులుడగు భర్తను లోకహితకరమగు రామకథ యడిగి తన కోర్కెను తీర్చుకొననేగాని విషయభోగముల కాంక్షించలేదు. అట్లు తన భర్తకు సహధర్మచారిణియై యుండిదానికి తగిన ఫలముగ కీర్తిమంతులగు కార్తికేయ గణపతులను పుత్రులనుగా పొందగలిగినది. పతిననుసరించి వర్తించుటయే నారీధర్మమున ముఖ్యోద్దేశము. పతిని పరమదైవముగ నెంచి సతి తన సర్వస్వము నాతని యధీనమొనర్పవలెను. ఎట్టి పరిస్థితులలో నైనను ఎట్టి యాపదలలోనైనను తాను స్వతంత్రురాలు కాగూడదు. ఇట్లామె భర్తకు పరాధీనురాలై యహంకారమును వీడియుండిన ప్రకృతియంతయు నామె యధీనమగును. ప్రపంచమునందలి సర్వశక్తులును యామె యధిక తేజమున నిస్తేజములై వ్యర్థములగును. సృష్టియామె వచనానుసారము ప్రవర్తించును. కావుననే కుష్ఠురోగపీడితుడగు భర్తను సంరక్షించుటకు పతివ్రతాలలామయగు శాండిలి తన పాతివ్రత్యప్రభావమున సూర్యుని నడ్డగించెను. యమధర్మరాజు బారినుండి సాధ్వీమణియగు సావిత్రి తన పతి జీవనముల వరదానముగ బడసెనన నిందాశ్చర్యమేమున్నది? ఆధునికులీ కథల నాలకించి యివి యన్నియు కృతయుగమున జరిగినవే కాని యీనాటి కలియుగమున వీటి నెవ్వరు నమ్ముదురని నుడివిన నుడువవచ్చును. అట్లు కానిచో నిప్పటికిని రాజపుతానాయొక్క యితిహాసము లింకను యంతరించలేదు కదా! వాటినైనను జూచిన సరీ వాదనను వదలవచ్చును. మాండావత సతదారయొక్క భార్యయు సౌందర్యనిధియు

కుసుమకోమలయునగు సతీతిలకము తన భర్తకై యసువుల వీడిన కథ నేటికిని సువర్ణాక్షరముల ముద్రితమై ప్రకాశించుచున్నది. ఇట్లే భర్తతో సహగమన మాచరించిన స్త్రీల కథలును లెక్కకు మిక్కుటముగ నీ యితిహాసములలో కానవగును. ఆ యితిహాసములు కాకున్నను శారద కస్తూరిబా మొదలగు నారీమణుల చరిత్రములు కూడ మనకు ప్రమాణములు లేకదా! భార్యారూపమున భర్తకు సహధర్మచారిణియై స్త్రీధర్మముల కాపాడునట్లు మాతృస్థానము నలంకరించి సంతానమును, సన్మార్గము నవలంబింపజేయుటయు స్త్రీల కవశ్యకర్తవ్యమే యగుచున్నది. కౌసల్య శ్రీరామచంద్రుడు డడవుల కేగుతరి వాత్సల్య కోమలతా పూర్ణమగు మనమున బాధపడు చున్నను రాముని పితృవాక్య పరిపాలనమున దృఢప్రతిజ్ఞ కలవాడ వగునని యుపదేశించెను. సుమిత్రయు తన తనయును శ్రీరామునను సరించి వనవాసము చేయుట కనుజ్ఞ యొసగి సోదరున కగ్రజుని యందుండవలసిన భక్తి గౌరవమును వెల్లడించినది. లక్ష్మణుని కన్నను యూర్మిళా సుమిత్రల త్యాగమే యీ విషయమున ప్రశంసించ దగియున్నది. కుంతీదేవియు తన పుత్రుల రణరంగమున వెనుకంజవేయక తమ ప్రతిజ్ఞల నెరవేర్చుకుని శాశ్వతకీర్తిని బడయు నట్లుపదేశ మొనర్చి తన వీరమాతృత్వమును చాటియున్నది. శివాజీయంత వీరపురుషు డగుటకు కారణము జిజాబాయి యొసంగిన యుపదేశమే కదా! నేటికాలమున నే స్త్రీయైనను ఇట్టా దర్శప్రాయముగ తన సంతానమును పోషించుచున్నదా? నేడు భారతదేశ మింతటి దారిద్ర్యము ననుభవించుచు నిక్కట్టుల లోనగుటకు ధన ధాన్యలోపము కానేరదు. కాని మీద చెప్పినట్లు పవిత్రపత్నీత్వము నట్టిమాతృత్వ లోపమే. సంసారమునంతయు సఫల పరుపజాలు అధ్యాత్మిక తత్వమీరోజులలో నే స్త్రీలయందును కానరాదు. మహారాణీ దుర్గావతీ లక్ష్మీబాయి నేటికిని యాదర్శప్రాయులై యున్నారు. వీరు గాక గార్గివంటి విదుషీమణులును ఆజన్మ బ్రహ్మచారిణులై విద్యలనేర్పుటయందును నేర్చుకొనుట యందును బ్రహ్మానుభవము నందుచు తమ జీవితముల గడిపే యున్నారు. ప్రాచీన భారత నారీమణులలో సాహసశీలత, సరళత దివ్యత్వములు వెల్లివిరియు చుండెడివి. వారికి మోక్షము కరతలామలక మగుచుండెడి దనుట నిర్వివాదాంశము. కాని నేటికాలపు నాగరికత యట్టి స్త్రీస్వభావమును మాయామోహిత మొనర్చి తప్పుదారిని ప్రోత్సహించుచున్నది.

కావున సోదరీమణులారా! పాశ్చాత్యరీతుల ననుసరించి స్వధర్మపాలనమున నేమరపాటు చెందక దేశహితమును స్వహితమును కోరువారలై యత్తింటికిని పుట్టినింటికిని కీర్తి ప్రదాతలై పతి హృదయముల నూరికొని దేశోద్ధరణ యొనర్చుచు శాశ్వత కీర్తిని బడయుదురు గాక యని సవినయముగ ప్రార్థించుచు నింతటితో విరమించుచున్నాను.



★ పరిచార విభాగము.

# శ్రీ భగవద్గీతా సందేశ మహోత్సవము

## మదరాసు

శ్రీవిశిష్టాద్వైత పరిచారకసంఘ మదరాసు శాఖాయాజమాన్యమున్న మదరాసు నగరమున శ్రీఉప్పుటూరు ఆళ్వారుశెట్టివార రామానుజ కూటమున ది 2-12-1951 తేదీ లగాయతు శ్రీభగవద్గీతా సందేశమహోత్సవము మహావైభవముగా 18 రోజులు జరుపబడినది. అందు అనేకమంది సుప్రసిద్ధ ఆచార్యపురుషులు, పండితోత్తములు, భాగవతశిఖామణులు, మదరాసు ప్రభుత్వ మంత్రిపుంగవులు, మదరాసు హైకోర్టు న్యాయమూర్తులు, అధ్యాపకులు, అనేకమంది పురప్రముఖులు, విదుషీమణులు పాల్గొనిరి.

ప్రతినిత్యము ఉదయమున భక్తులందరున్ను కలసి రోజునకొక్క అధ్యాయము చొప్పున భగవద్గీతను పారాయణ నొనర్చుచు తిరువీధ్యుత్సవములు జరిపిరి. ఆసమయమున ప్రతినిత్యముకూడ అనేకమందిభక్తశిఖామణులు ఈభాగవతగోష్ఠినంతను తమ యింటిలోనికి ఆహ్వానించుచు అందరికి చందన-కుసుమ- తాంబూలాదులు సమర్పించి గౌరవించుచుండిరి. పిమ్మట రామానుజకూటమున సమిష్టిగ పారాయణజేయుచుండిరి. పిమ్మట అయిదు నిమిషములు శ్రీకృష్ణనామజపము - పిమ్మట 18 ఋత్విక్కులు గీతనంతను పూర్తిగ పారాయణ మొనర్చుచుండిరి. ఆదేసమయమున ఆనాటి అధ్యాయమునకు ఆంధ్రమునను, అరవమ్మునను విశేషార్థములతో కాలక్షేపము జరుగుచుండెడిది.

మధ్యాహ్నము గం. 1-0 మొదలు గం. 2-0 వరకు స్త్రీలకై ప్రత్యేకము విదుషీమణులచే ఉపన్యాసములున్ను, గం. 2-0 మొదలు 5-30 వరకు ఆనాటి అధ్యాయముపై విశేషవిమర్శనాపూర్వక పండితోపన్యాసములున్ను గం. 5-30 లగాయతు రాత్రి గం. 8-30 వరకు భక్తవరులచే గీతపై సామాన్యోపన్యాసములున్ను జరుపబడినవి.

ఈ 18 రోజులున్ను ఖండఖండాంతరములయందుకూడ ప్రచురించబడిన వివిధభాషలలో అనువదించబడిన శ్రీభగవద్గీతా గ్రంథముల ప్రదర్శనము జరుపబడెను.

ఈ ఉత్సవనివేదిక ముందు ప్రచురించబడగలదు.

---

## దప్నములు

### పాలకొల్లు.

"శ్రీయతిరాజసేవా మహిళాసమితి, వారు భక్తినివేదన సన్మానముగా 50 రూపాయలు సమర్పించిరి. వీరికి శ్రియఃపతి ఆయురారోగ్య ఐశ్వర్యములు కటాక్షించుగాక.

# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ

## సత్ప్రచార పూజలు

రావులపాలెం (తూ॥ గో॥ జిల్లా.)

సత్తి సత్యనారాయణరెడ్డి భార్య వీరానాక్షమ్మ
పడాల సూరమ్మ
పడాల కొండయ్య భార్య జగ్గమ్మ
పడాల ఆదెమ్మ

ఈగ్రామంలో నాదాపు ప్రతి శుక్రవారం 20లేక30 మంది భక్తురాండ్రతోటి శుక్రవార పూజలు మహా వైభవముగా జరిపించబడెను.

పేకేరు ప. గోదావరి జిల్లా.

నల్లమిల్లి బుచ్చిరెడ్డి భార్య మాణిక్యం
పులగం రావమ్మ
పులగం సత్యనారాయణ
పులగం భద్రాద్రి
పులగం తిరుపతిరెడ్డి

ఈగ్రామంలో భక్తులతోటి ప్రతిశుక్రవారం పూజలు భజనలు మహావైభవముగా జరుపబడెను.

అర్తమూరు.

కోనాల సత్తిరెడ్డి భార్య వీరమ్మ
కోనాల వెంకన్నగారు
మండ అమృతరామయ్యభార్య సూరమ్మ
12-1-51 పోతుశెట్టి మహాలక్ష్మి
పెద్దపండుగరోజు
పోతుల అప్పారావు భార్య సూర్యకాంతమ్మ
19-1-51 సత్తిబుల్లి స్వామి భార్య మంగమ్మ

## ఏకాదశీ పూజలు

అర్తమూరు.

నల్లమిల్లి వెంకటరెడ్డిభార్య కాంతమ్మ
18-1-51 సత్తిబుల్లి స్వామి భార్య మంగమ్మ

కళింగపట్నం

ఔ 20-12-1950 తేదీని మార్గశీర్ష శు ౧౧ బుధవారం దినమున శ్రీగీతామండలి (కళింగపట్నం) శ్రీగీతాజయంత్యుత్సవమును జరిపినది.

కార్యక్రమము.

ఉదయం:-

శ్రీకోదండరామస్వామివారి సన్నిధిని- శ్రీగీతాకోశము-శ్రీకృష్ణపరమాత్మ శ్రీవ్యాస మహర్షుల మారాధనము-సమిష్టి పారాయణము, 18 అధ్యాయములు-గోష్ఠితీర్థ-ప్రసాద స్వీకృతి.

సాయంత్రం:-

5 గంటలకు- సంస్కృత పాఠశాలా ప్రాంగణమందిరమున, కూర్మం-దేవస్థాన పండితులు- ఉ. వే. శ్రీమాన్ శ్రీభద్రిం వేంకటకూర్మాచార్యులవారి యధ్యక్షతను సమావేశము జరుపబడినది. గీతాప్రాశస్త్యమునుగూర్చి, గీతాపఠనావశ్యకతనుగూర్చి చక్కని ఉపన్యాసము లొసంగబడినవి.

కార్యదర్శి-గీతామండలి,
పి. వే. రా. న. ఆచార్య.

రిజిష్టరు నెం. 5049.

Book-Post

శ్రీ వైష్ణవ వేదాంత మాసపత్రిక అర్తమూరు, (వయా) ద్వారపూడి తూర్పుగోదావరి జిల్లా.

# భక్తినివేదన

(వేదాంత మాసపత్రిక)

ఇందు వేదాంత విషయ రాజములున్ను; భక్తి ప్రచార విషయమైన వార్తలున్ను; వేదాంత సాంప్రదాయ విషయకమైన ప్రశ్నోత్తరములున్ను ప్రచురించబడును.

చందాలు:

సాధారణ చందా సం. రం 1కి రు. 5-0-0
సహాయ చందా ,, రు. 10-0-0

పోషకులు:

పోషకులు సం. రం 1కి రు. 25-0-0
రాజపోషకులు ,, రు. 58-0-0
మహారాజ పోషకులు ,, రు. 116-0-0

కార్యాలయము:

"భక్తి నివేదన" కార్యాలయము,
అర్తమూరు (వయా) ద్వారపూడి.
తూర్పు గోదావరి జిల్లా.

Edited printed & published by A. Ch. srimannarayanacharya, at Sriman press, Artamuru, E. G. Dt.

శ్రీమతే రామానుజాయనమః




భక్తి

# నివేదన

వేదాంత మాస పత్రిక

| | | |
|---|---|---|
| సంపుటి ౨ | వికృతి – మాఘ మాసం | సంచిక ౧౧ |


## ఆచార్యనిర్ణయము


శ్రీ. ఉ. వే. శ్రీమాన్, అ. తి. కాం. వెంకట తాతాచార్యులుగారు, కాంచీపురము.


శ్రియః పతియగు సర్వేశ్వరుడు లోకోజ్జీవనార్థముగ ఆచార్యరూపముగ నవతరించి అస్మదాదుల నుజ్జీవింప చేయుచున్నాడు. తానున్నూ అవతరించినప్పుడెల్ల ఆచార్యులను వరించుకొని వారివల్లనుంచి విద్యాభ్యాసాదులను పొందినట్లు గ్రంథములయందు కానబడుచున్నది. ఈవిషయమై ఆస్తికులకు వివాదముండదని తలచెద.

అయితే ఆచార్యులు జ్ఞానానుష్ఠానపూర్ణులై యుండవలయునని గ్రంథములయందు కానబడుచున్నది. అట్టి ఆచార్యులు దివిటీపెట్టి వెతకినను దొరకరు. అట్టిది పూర్వాచార్యులతోనే సరి. వారివద్ద గ్రహించవలయుననిన ఉపసత్తి లేనిదే శిష్యులకు విశేషార్థములు సాయించువారు కారు. మరియు ఈశిష్యుల ఆదరణాదులను పరీక్షించియే సాయించువారు. ఇప్పటివారివలె రు1-0-0 టిక్కెట్లు రు2-0-0 టిక్కెట్లు పెట్టి అధికార్యనధికారుల వివక్షలేక చెప్పినట్లు కనుపించదు. ఇట్టి పరిస్థితిలో ప్రాచీనాచార్యులు జ్ఞానవంతులు కారని కొందరు కులక్రమాగతాచార్యులను పరిత్యజించుచున్నారు. పై బాహ్యవేషము విద్యనుమాత్రమే బహుశిష్యత్వముగ నెంచి వారి ఆంతరంగిక వృత్తులను నేమియు గమనించక వీరిని ఆశ్రయించుచున్నారు. పూర్వాచార్యులు కేవల బాహ్య

వేషములు లేనివారని చూచి అంతః వారియొక్కస్థితులు ఎట్టివి అని గమనించక విపరీతపత్తిగలుగ చేసికొనుట చాలా అయుక్తము. ప్రాక్తనకర్మమువలన విద్యలభించవచ్చును. అనుష్ఠానముమాత్రము అట్టివారికి దుర్లభము. జ్ఞానానుష్ఠానములన్నచో ఉపర్యుపరి అనవస్థ. ఒకరికన్న ఒకరు కనుపించు చూవుందురు. పైవారిని చూచినప్పుడెల్ల పూర్వులను వదలవలసివచ్చును. గొప్ప ఉపన్యాసము లను చేయువారలను చూచినచో అతను విభవులై, హరిణీఖురమాత్రావయవములయందు మోహము కలవారై యున్నారే కాని అనన్యభోగ్యత్వాకారము ఎచ్చటను కనుపించదు. ఎవరిని చూచినను సోదరిపూరణ జాయాభూషణైక తత్పరఫలక వేదాంత వేషధారులుగనే కనిపించుచు న్నారు. దోషారోపణమున్నచో అాదరియందును యేనో ఆరోపించవచ్చును. కులక్రమాగతా చార్యులు మహాపాతకాది దోషములు కలవారైనను తప్పు వారిని త్యజించుట మిక్కిలి పాతకము, నరకావహమని పూర్వాచార్యులే వచించియున్నారు.

శ్రీవచనభూషణ॥

పాంచరాత్రే పరమపురుష సంహితాయాం॥

గాథ—సూ. త్రిశంకులైప్పాలె కర్మచండాళనాయ్ మార్వి

లిట్టె యజ్ఞోపవీతండానే వారాయ్‌విడుం॥

ఈ వాక్యవ్యాఖ్యావసరమున ఎంబార్‌జీయర్ అరుంబదమున కులక్రమాగతాచార్యులను విడిచి ఆచార్యాంతరము నాశ్రయించుటచే ఇహపరములకు భ్రష్టుడై ఛండాళత్వమునుపొంది సాక్షా త్స్వర్గమునకు భూలోకమునకు నరకమునకు గాక అధోశిరస్కుడై త్రిశంకుస్వర్గమును పొంది స్వాభీష్టస్వర్గచ్యుతుడైన త్రిశంకువువలె పురుషార్థమును లభించదని తాత్పర్యము.

శ్లో. ఆచార్యో ద్వివిధః ప్రోక్తస్సర్వశాస్త్రార్థ వేదిభిః।
కులక్రమాగతః పూర్వః ప్రత్యాశాఖ్యస్తథా పరః॥

అర్థము: కులక్రమాగతాచార్యులనిన్ని - ప్రత్యగాచార్యులనిన్ని రెండు ప్రకారములుగ నున్నారు.

శ్లో. ధర్మద్వారా కర్మయస్మిన్ జాతిస్తత్కుల ముచ్యతే।

కులమనగ- అలిప్తవాయధర్మాణాం, అని వర్ణాశ్రమధర్మములకు హానిరాకుండా భగవన్ము ఖోల్లాసకరమైన కర్మ స్థిరముగ ఏజాతియందున్ననో అది కులశబ్దార్థము.

శ్లో. తత్ప్రవాహముఖ్యస్యాపి పదవిశ్లేషణాం క్రమః।

పూర్వోక్తధర్మములు పూర్వోక్తపరంపరగ అవిచ్ఛిన్నముగ వచ్చుట క్రమశబ్దార్థము.

శ్లో. ఆగతస్తత్త్వబోధాయ విభు రాచార్యమూర్తిమాన్॥

పూర్వోక్తధర్మముగలవారు సంసారులకు తత్త్వబోధార్థముగ ఆచార్యరూపియై శ్రియఃపతి అవతరించి వచ్చిన ప్రకారము ఆగతశబ్దార్థము ఈ మూడువాక్యములకు చేర్చి అర్థమును చెప్పుచున్నారు.

శ్లో. కులక్రమాగతాచార్యం తమాచార్యవిదో విదుః॥

అట్టివారిని కులక్రమాగతాచార్యులని పెద్దలు చెప్పుదురు.

ప్రత్యగాచార్యుల శబ్దార్థమును సాధించుచున్నారు:

శ్లో. పుంసః పరగతిజ్ఞానే జిజ్ఞాసా జాయతే యది।
తేనాన్వర్థదేశికాభావాత్ య స్సమిత్పాణి రాశ్రయేత్॥
తేనాస మస్య దయయా దీక్షాసంస్కారపూర్వకం।
మన్త్రవ్యాఖ్యాకృదాచార్యః ప్రత్యగాఖ్యస్స ఉచ్యతే॥

ఇంతవరకు తనకులమం దాచార్యులులేక అవైష్ణవవంశుడై యుండి ఇప్పట్లో అర్థపంచక జ్ఞానముద్వారా ఉజ్జీవింపనిచ్చయించి జాయమాన భగవత్కటాక్షపాత్రుడై నవీనముగ సమిత్పాణియై సదాచార్యుల నాశ్రయించి వైష్ణవేష్టిని చేయించుకొని సమాశ్రయణాదులను లభించుకొని మన్త్రమన్త్రార్థములు లభించుటకు హేతువైన ఆచార్యులు ప్రత్యగాచార్యులనంబడుదురు. అనగా ఇదివరకు ఆచార్యులు ఆకులమునందు లేక క్రొత్తగ నాచార్యవరణము చేసికొని ఏర్పరచుకొను ఆచార్యులు ప్రత్యగాచార్యులని చెప్పబడుదురు. వీరుభయులలోను కులక్రమాగతాచార్యులు ముఖ్యులు. ఇందులకు ప్రమాణము.

శ్లో॥ కులాచార్యస్య భజనం యే వా సుకృతినో జనాః।
కుర్వన్తి సతతం భక్త్యా తే వన్ద్యా స్సర్వదేవతైః।
సర్వక్రతుశతం కృత్వా యత్ఫలం సమవాప్నుయాత్।
తత్ఫలం సమవాప్నోతి కులాచార్యస్య పూజనాత్।
సార్ధత్రికోటితీర్థేషు స్నాత్వా యత్ఫల మాప్నుయాత్।
తత్ఫలం సమవాప్నోతి కులాచార్యస్య పూజనాత్।
సన్తుష్టే తు కులాచార్యే శ్రద్ధయా యస్య భక్తితః।
తేన తుష్టం జగత్సర్వం తుష్టా స్స్యు స్సర్వదేవతాః॥

పుణ్యవంతులైన యేజనులు కులాచార్యులను భజించుచున్నారో వారు సర్వదేవతల చేతను భజింపబడుదురు. నూరుయజ్ఞముచేసి ఏఫలమును పొందుదురో షోడశమహాదానాదుల వలన నే ఫలమును పొందుదురో మూడున్నర కోటితీర్థములయందు తీర్థమాడిన ఏఫలమును పొందుదురో, ఆఫలములన్నియూ కులాచార్య పూజవలననే పొందగలరనియూ, ఎవరియొక్క శ్రద్ధాభక్తులచే కులాచార్యులు సంతోషింతురో వారియెడల సర్వజగత్తు సర్వదేవతలును సంతోషించెదరు. అని కులాచార్య భజనను మిక్కిలి ప్రశంసించిరి.

శ్లో॥ దైవా ద్దేశాన్తరగతే లుప్తే వా కులదేశికే ।
తదీయ పుత్రభ్రాత్రాదే గుపదేశోపి గృహ్యతాం॥

ఆచార్యులు శిష్యులకజ్ఞాన దశయందు సమాశ్రయణాదులను చేసి శిష్యులు తెలుసు కొనుటకు వీలులేని దేశమునకు వెళ్ళిననూ లేక పరమపదించిననూ పూర్వాచార్యుల యొక్క పుత్ర భ్రాత్రాదుల సన్నిధియందు ఆశ్రయించి పుట్టి ప్రతిపత్తినిచేసి గ్రన్థాదులను అధి కరింపవలయును. భ్రాత్రాదేః అని అది శబ్దముచే జ్ఞాతులు తత్సంబన్ధులు తదీయగోత్ర కులాదుల గలవారు అన్నియూ వివక్షితములు. ఇట్లు స్పష్టముగ ప్రతిపాదించుటచే జాత్యన్తరుల నాశ్రయించకూడదనియును స్పష్టమగుచున్నది. అట్టివారెవ్వరునూ లేనిచో ఇతరత్రా ఆశ్రయించవలయునని వ్యాఖ్యానకర్తలు సాయించియున్నారు.

శ్లో॥ తత్పుత్రాదేరభావే తు శిష్యశ్చేత్ తత్త్వలోలుపః ।
తత్తుల్యభావం సర్వజ్ఞం ఆచార్యాన్తర మాశ్రయేత ॥

అని పుత్రాదులెవ్వరూ లేనిచో ఇతరత్రా ఆశ్రయించవచ్చునని సాయించిరి. దైవాదీన మున పునః పూర్వాచార్యులుగాని వారి పుత్రాదులుగాని వారిజ్ఞాతులు వర్గైరాదులుగాని తిరిగి వేంచేసినచో ఎట్లు వర్తించవలిసినదని చెప్పుచున్నారు.

శ్లో॥ దైవాధీనా త్కులాచార్యే తత్పుత్రాదౌ తథాగతే।
ఉపదేశో గృహీతవ్యః పునః కులగురో ర్మనుః

పూర్వాచార్యాదులు వేంచేయగనే యిప్పుడాశ్రయించిన ఆచార్యులనువదలి వారివల్ల లభించిన విశేషార్థములను త్యజించి సిరివద్ద తిరిగి సమాశ్రయణాదులను లభించి తిరిగి మన్త్ర మన్త్రార్థములను లభించవలయునని అభిప్రాయము.—

మరియు

శ్లో॥ పునస్సంస్కారసంశుద్ధాః స్వర్ణవత్ గతకల్మషాః ।
వంశపూతా వివర్ధంతే రాజన్తే శిష్యకోటయః ॥

తిరిగి ప్రాచీనాచార్యులనాశ్రయించి పంచసంస్కారాదులనులభించి స్వర్ణమువలె పరిశుద్ధులై పవిత్రమైన వంశముగలవారై శిష్యులు ప్రకాశించుచుందురని తాత్పర్యము.

ఆచార్యులు అనుష్ఠానపరులనగ శాస్త్రవిరుద్ధాను ష్ఠానములేక యున్నంతమాత్రము చాలును. శాస్త్రజ్ఞానము విశేషముగ లేకున్ననూ చాలును. జ్ఞానము మాత్రము రావణాదులకువలె యున్నంతమాత్రముచే ప్రయోజనములేదు. పరోపదేశే పాండిత్యమనునట్లు నిష్ప్రయోజనము గనుక విశేషజ్ఞానము లేకున్ననూ వారి యాజ్ఞచే ఇతరులవలన అర్థవిశేషములను గ్రహింపవచ్చును.

శ్లో॥ కులాచార్యా నిదేశేన తత్ర వై దేశికాన్తరం ॥
తత్తుల్యభక్తిర్భజనే స వై నరకభాజనం ॥

కులాచార్యులయొక్క యాజ్ఞవలన ఇతరులవలన విశేషార్థమును గ్రహించవచ్చును. ఆజ్ఞ లేనిదే యితరుల భజించుట నరకకారణమగును.

శ్లో॥ అన్యత్ర శృణు యాజ్ఞేయం అనుజ్ఞాప్యైవ జీవతి॥

ఆచార్యాజ్ఞచేతనే ఇతరులవల్ల గ్రహించవచ్చును. అనిభావము. ఆచార్యాజ్ఞలేనిది ఇతరత్ర గ్రహించకూడదనియును తాత్పర్యము ఉదయవర్లును పెరియనంబిగారి యాజ్ఞవలన ఇతరాచార్యుల వలన సకలార్థములను గ్రహించినట్లు కనుపించుచున్నందున స్వాచార్యులకు విశేషజ్ఞానము లేకపోయి నను ఇతరులవల్ల వారాజ్ఞచే గ్రహించి యుజ్జీవించవచ్చును. ఆచార్యులను అవమానించే ఇతరత్ర ఆచార్యప్రపత్తిని చేసినచో నరకభాక్కు కాగలడని స్పష్టముగ చెప్పుచున్నది.

శ్లో॥ నారాయణోఽపి వికృతిం యాతి గురోః ప్రచ్యుతస్య ।
దుర్బుద్ధేః కమలం జలాదపేతం శోషయతి రవి ర్న పోషయతి॥

వాత్సల్య స్వామిత్వ సౌశీల్యాది గుణోపేతుడైన నారాయణుడునూ స్వాచార్య తిరస్కార ము చేసిన దుర్బుద్ధిగల మనుజుని విషయమై వికృతిని పొందును. అనగ క్షిపామ్యజస్ర మశుభా నాసురీ ష్వేవ యోనిషు నతక్షమామి యను వాక్యములకు పాత్రుడుగ చేయునని తాత్పర్యము ఎన్నిన జలమునుంచి వేరుచేయబడిన కమలమును కమలాప్తుడు (సూర్యుడు) వికసింపచేయక ఎట్లు ఎండపెట్టునో అట్లు అని తాత్పర్యము.

శ్లో॥ నాన్యై రుపాయై ర్వివిధై ర్మంత్రౌషధపురస్సరైః ।
కులక్రమాగ తాచార్య తిరస్కార జపాతకాత్ ।
ముచ్యతే మలజోమూఢో సర్వదుర్గతిభాజనం ॥

ఎన్ని పుణ్యకార్యములను చేసిననూ మంత్రౌషధపురస్సరములైన ఉపాయములెన్ని చేసిననూ కులక్రమాగతాచార్యతిరస్కారమువలన పుట్టిన పాపమున-విడువబడదు. సర్వదుర్గతులను పొందగలడు.

తస్మా త్సర్వాత్మనా బ్రహ్మన్ కులాచార్యం ప్రపూజయేత్॥
కరణేనా మనసా వాచా నిర్దోష శ్శుద్ధి మాప్నుయాత్ ॥
గురుదారసుతాదౌ తు గురువ ద్వృత్తి మాచరేత్ ॥

సర్వప్రకారములచేతను కులాచార్యులను పూజించినయెడల మనోవాక్కాయ కర్మముల చేతను శుద్దిని పొందగలడు.

గురుదార-సుతాదులను గురువునువలెనే పూజించవలయును. ఆచార్యులకు తమకుమారుల నాశ్రయించక ఇతరుల నాశ్రయించినచో వీనియందు అనుగ్రహ మెట్లు కలుగును. ఆచార్యునిగ్రహపాత్రుడుకావలయునే గాని అనుగ్రహమునకు కారణభూతుడు ఎన్నడును కానేరడు.

ఆచార్యులుగాని వారిపుత్రాదులుగాని పతితశబ్దవాచ్యులై నిందిత కర్మాచరణము గలవారై యుండినచో

జ్ఞానహీనం గురుం ప్రాప్య కుతో మోక్ష మవాప్నుయాత్ భిన్నాం నావం సమాశ్రిత్య కుతః పారం న గచ్ఛతి॥ అనిన్నా

ధ. సూ. న పతిత మాచార్యం జ్ఞాతిం వా దర్శనాగ్నో గచ్ఛేత్.

ఇత్యాదివచనముల ఆచార్యత్యాగబోధకముగ కనుపించిననూ ఇవి కేవల మహాపాతకాది దోషులైనవారి విషయము. అప్పటికి వారి పుత్రభ్రాతృలు జ్ఞాతులు మొదలగు వారి నాశ్రయణ నిషేధపరములు కావు.

ఆచార్యాపచార తద్భక్తాపచారంగళాల్ వస్స చండాళత్వ్రమై ।
అస్స ఆచార్యభక్తరీగళుడైయ శాపత్తాలె సర్వలోకలోచన ।
గోచరమాక ప్పెత్తు తిశంకుస్లై ప్పాలె యెన్నపడి...... ...

అని పాటించియున్నారు. ఈవాక్యము స్పష్టార్థము.

కందాడై వారి శిష్యులు ఎట్టివారైనను వారిని తప్ప ఇతరుల నాశ్రయించరు.

శ్లో॥ గురుం హుంకృత్య ధీకృత్య రౌరవం నరకం వ్రజేత్॥

ఆచార్యులను హుం అనినను ధీక్ అనినను రౌరవనరకమును పొందును అని యున్నందున్ను ఎన్నడు ఆచార్యులను తిరస్కరించకూడదు. ప్రకృతమున శిష్యులను ఆచార్యులు తమ చందాను వృత్తులగనుంచేనే వాలాసాత్వికులు, లేనిచో వారు అయోగ్యులు, గనుక చేసే అకృత్యములను శ్లోకస్థ కృత్యములుగ స్తుతించుచున్న ఆచార్యులే కావలయును ఈకాలమున ఆస్తిక నాస్తికత్వమే తప్ప సంప్రాప్తికత ఎచ్చటను కానరాదు. ఆచార్యదోషమునే యెంచువారు ఎట్టి జ్ఞానవంతులో యనునది స్పష్టముగ తెలుసుకొనవచ్చును. తాను జ్ఞానవంతుడనుకొని గదా ఇట్టి నిందను చేయుటయూ స్వీకరించుటయూ వీనికి ఏర్పడును. ఇది జ్ఞానకార్యమగునా? విజ్ఞులు యోచించండి.

ధనములు గుర్రములు పల్లకీలు వస్త్రాలు మోక్షసాధనములు కావు ఆడంబరములు లోక భ్రామకములు, విద్యకన్న అనుష్ఠానమే శిష్యుల సుజీవనము గాని లోకభ్రామక వేషములు ఎన్నడు రక్షకము కానేరదు. గనుక యెన్నడు వేషమును చూచి భ్రమించక పూర్వాచార్యుల కుటుంబస్థులనే ఆశ్రయించుట భగవన్ముఖోల్లాసకరమగును.

ఆచార్యపురుషులమనిన్నీ మమ్ములనే ఆశ్రయించిన మోక్షమనిద్దమనిన్నీ (స్వయం తరితుమక్షమః కిమపరాన్ సౌ తారయేత్) యనునట్లు తనకుదిక్కు లేదు గాని ఇతరులకు తాను దిక్కగుట ఎట్లు గలుగును. తాను జ్ఞానాధికుడైతే ఇతర శిష్యుల కెట్లు సమాశ్రయణమును చేయును. తాను అధికుడననుకొనుట జ్ఞానాధిక లక్షణమా? గుణదోషములను ఎంచబోయిన సర్వత్ర సమానము గనే ఉండును గాని వేరు విధముగనుండదు. ఆచార్యులగువారలు క్రొత్తగ నాశ్రయించుటకువస్తే మీరు యెవరి శిష్యులని విచారించకయె వచ్చినంతమాత్రముచేత, తన కాధిక్యము గలిగినదని సంతోషముచే సమాశ్రయణమును చేసి తనకు శిష్యునిగ చేసుకొనుట ఎంత యోగ్యత యనునది యుండువలననే స్పష్టమగుచున్నది. ఇందువలన యేర్పడిన విషయమేమనగ

కొందరు కులక్రమాగతాచార్యులను జ్ఞానాధికులు కాకపోవుటచే వారినివదలి ఇతరుల నాశ్రయించుచున్నారనిన్ని కులక్రమాచార్యులకు వేషభాషలు లేవనిన్ని అందువలన వారిని త్యజించుటయు క్తమనిన్ని జ్ఞానహీనులు నాశ్రయించకూడదనునది శాస్త్రములయందు బోధించుచున్నవనిన్ని అందువలన త్యజించవచ్చుననెడివాదమును పూర్వపక్షవిధముగ ప్రతిపాదించి సిద్ధాంతమున అట్లు ఆశ్రయించుట శాస్త్రవిహితముకాదను సంగతిని వచనములచే ప్రతిపాదించి, అట్లు ఆశ్రయించుట నరకావహమనిన్ని ఆచార్యవంశమును నతిక్రమించినను వారి జ్ఞాతులనే ఆశ్రయించవలయుననిన్ని ఆచార్యులున్నట్లుగాని వారి వంశ్యులున్నట్లుగాని బాగుగ తెలియక ఇతరుల నాశ్ర

యించి వారివలన గ్రంథాదుల నధికరించియున్నను దైవాధీనమున పూర్వాచార్యులుగాని వారి వంశ్యులుగాని వారిజ్ఞాత్యాదులుగాని తిరిగి వచ్చిన యెడల ముందర నాశ్రయించినవారిని వారివలన గ్రహించవలసిన గ్రంథములను త్యజించి కులక్రమాగతాచార్యులవారినే తిరిగి నాశ్రయించి ఉజ్జీవించవలయుననిన్ని వారు విశేషజ్ఞానాధిక్యులు కానిచో, వారి ఆజ్ఞచే ఇతరత్రా ఆశ్రయించి గ్రంథాదులను మాత్రము నధికరించవచ్చుననిన్ని అట్లు ఆజ్ఞా వశమున ఉండనిచో, చ్యుతుడై చండాలత్వమును పొంది అధోముఖుడైన త్రిశంఖువుం బోలె ఇతో భ్రష్టః తతో భ్రష్టః యనునట్లు అగుననిన్ని కులక్రమాగతాచార్యులు పతితులైనచో వారిని త్యజించి వారిపుత్రాదులు ఆశ్రయించవలయుననిన్ని వారున్నూ అట్లు భ్రష్టులైనచో వారిజ్ఞాతుల నాశ్రయించవచ్చుననిన్ని వారెవరూ లేనిచో ఇతరత్రా ఆశ్రయించవలయుననిన్ని పెద్దలు ప్రతిపాదించి యున్నారు.

## శ్రీ వైష్ణవుడు

బాహ్యవిషయముల నన్నింటిని వాసనతో సహా విడుచుటయు, సర్వేశ్వరునే గతియనితలచి ఆశ్రయించుటయు, ఫలముసిద్ధించక తప్పదు అని నమ్మియుండుటయు, ఫలసిద్ధికై త్వరపడుటయు, ఈ శరీరముతో యున్నంతకాలము సర్వేశ్వరుడు ఆనందముతో అర్చారూపమున వేంచేసియున్న దివ్యదేశములయందు ఆసక్తికలవాడై భగవంతునియొక్క గుణానుభవమునందున్ను కైంకర్యముల యందున్ను పొద్దుబుచ్చుకొనుటయు ఈవిధముగ యుండునట్టి శ్రీవైష్ణవులయొక్క ఆధిక్యతను తెలిసికొని సంతోషపడుచుండుటయు, తిరుమంత్రమునందున్ను ద్వయమంత్రమునందును, నియమముగలవాడై యుండుటయు, ఆచార్యులపట్ల ప్రేమను అధికముగ కలిగియుండుటయు, ఆచార్యుల పట్లను సర్వేశ్వరుని పట్లను కృతజ్ఞుడై యుండుటయును, జ్ఞానమును విరక్తిని శాంతిని కలవాడై యుండునట్టి పరమసాత్వికునితో సహవాసము జేయుటయు వైష్ణవాధికారికి అవశ్యము అపేక్షితములై యున్నవి.

# వాల్మీకి

శ్రీమాన్ పండితకేసరి పరకాలా సూర్యనారాయణ శర్మగారు, పెనుగొండ ప. గో. జిల్లా.

శ్రీమద్రామాయణ గ్రంథకర్తయగు శ్రీవాల్మీకి మహర్షియొక్క చరిత్రనుగూర్చి అనేక గ్రంథములయందు అనేక విధములుగ యున్నది. అందు ఒక రామాయణమున ఇటులనున్నది.

---

చతుర్ముఖ బ్రహ్మ ఒకనాడు దేవేంద్రునిచే ఆహ్వానించబడి ఆయనసభకు వెళ్ళెను. అపుడు దేవేంద్రుడు వినోదార్థమై రంభ, ఊర్వశి, మేనక మున్నగువారిచే నాట్యము చేయించెను, అపుడు వారలయొక్క హావ-భావ-రూప-సౌందర్యాదుల తిలకించుటచే బ్రహ్మగారికి వీర్య స్ఖలన మాయెను, ఇందులకు బ్రహ్మ సిగ్గుపడి ఆమర్మము సభికులకు తెలియకుండగ యుండవలెనని క్రిందపడిన తనవీర్యమును యిసుకచే కప్పివేసెను. ఆ యిసుకనుండి 60.001 మంది (అరువదివేల ఒక్కరు) జన్మించిరి. ఇందు అరువదివేల మందియు వాలఖిల్యులను పేర పిలువబడిరి. వీరందరు వెంటనే తపమాచరించుటకై అడవికి వెళ్ళిపోయిరి. మిగిలిన వకడు బ్రహ్మగారిని దర్శించి "తండ్రీ నాగతి యేమి సెలవిచ్చెదరు ? నన్ను యిట్లు సృజించి వైచితిరే" అని సభలో అడిగెను. అపుడు బ్రహ్మగారు తనమర్మమును బైటపెట్టినాడని అతనిపై కోపించి 'నీవు భూలోకమ్మున నిషాదుడవై చరించుచు. శూద్ర స్త్రీని పెండ్లాడి. సంతానవంతుడవై భ్రష్టత్వమును పొందుమా' యని శపించెను.

ఇందులకాయన మిక్కిలి పశ్చాత్తాపుడై బ్రహ్మను శాపవిముక్తికై వేడుకొనెను. అందుపై బ్రహ్మదేవుడు ఆయనపై దయగలవాడై కొన్ని వేల సంవత్సరముల యనంతరము మహర్షుల యుపదేశముచే నీకు శాపవిముక్తి కాగలదు. అపుడు నీవు తరించగలవ'ని సెలవిచ్చెను.

ఆ ప్రకారము ఆయన నిషాదుడై శూద్ర స్త్రీని వివాహమాడి ఆకుటుంబ పోషణకొరకు అరణ్యమధ్యమున దోవకొట్టి దోచుకొనుచుండెను. ఒకనాడు మహర్షులు ఆమార్గమునవచ్చిరి. వారిని యీయన అడ్డగించెను. వారు యీయనను యీదౌర్త్యమునుండి మరలించగలచి "ఓయీ నీవు మావంటి ఋషుల కౌపీన-కమండలములనుకూడ దోచుకొని పోవుచుంటివే దీని వలన మహాపాపము కలుగునని నీకు తెలియునా?

ఈయన: ఆహా! తెలియును. పాపమో, పుణ్యమో కుటుంబపోషణకును చేసుకొనవలసియున్నది.

మహర్షులు: నీవల్ల పోషింపబడుచున్న నీభార్యా బిడ్డలు నీవు సంపాదించిన ధనమును మాత్రమే తీసుకొందురా లేక నీవు ఆర్జించిన పాపమునుకూడ పంచుకొందురా ?

ఈయన: ధనమును తీసుకొనువారు అందులకై చేసిన పాపమునుకూడ ఏల పంచుకొనరు ?

మహర్షులు: ఒకపర్యాయము నీవు యింటికివెళ్ళి వారి నీవిషయమును అడిగిరమ్ము. నీవు వచ్చువరకు మేమిచ్చటనే యుందుము. మేము ఎచ్చటకును పోము.

ఈయన: సరే అని తనయింటికి వెళ్ళి మహర్షులు అడిగిన ప్రశ్నను తన భార్యనడిగెను.

అందులకామె "మమ్ములను పోషించు భారము నీది. నీవు ధనమును పాపపు పనులను జేసి సంపాదించుచుంటివో, లేక పుణ్య కార్యములు జేసి సంపాదించుచుంటివో మాకేమి తెలుసును. మరియు నీవు మాపోషణకు వలయు ధనమును పుణ్యకార్యముల ద్వారానే ఏల సంపాదించకూడదు. నిన్ను మేము పాపపుపనుల జేయుమంటిమా? నీ దబ్బులో మాత్రమే తప్ప మాకు నీ పాపములలో ఏమియు సంబంధము లేదు. నీకర్మను నీవు మాత్రమే అనుభవించ వలసినదే గాని మాకే మాత్రము అందు పాలువలదు" అనిరి. ఈమాటలు వినిన తోడనే ఈయనకు మిక్కిలి విచారము కలిగెను. ఈభార్యా బిడ్డలు పెట్టితే తినేవారేగాని తనకుపకరించువారు కారని తెలుసుకొని వీరిల కొరకై నేనేల ఇట్టుల పాపకృత్యముల నాచరించుచు అధఃపతితులము కావలయును. ఆమహర్షులను ఆశ్రయించి తరింతుముగాక' అని జ్ఞానవైరాగ్యములు గలవాడై మహర్షులవద్దకు పరుగెత్తుకొని వెళ్ళి వారి పాదములపై పడి తాను తరించు మార్గమును తెలుప ప్రార్థించెను.

ఆమహర్షులు ఈయనయందు కరుణగలవారై నారదుని ద్వారా తారకమంత్రము నుపదేశించిరి.

ఆక్షణమునుండి అచ్చటనే ఆయన తదేక నిష్ఠాగరిష్ఠుడై తనపై పుట్టలు పోయుచున్నను లక్ష్యపెట్టకుండగ ఘోరతప మాచరించి భగవద్భాగవత కటాక్షమునకు పాత్రులగుటచే ఈయనకు వాల్మీకియను దివ్య తిరునామము కలిగెను.

పిమ్మట ఒకనాడు నారదమహర్షి తిరిగి ఈ వాల్మీకి వద్దకువచ్చి శ్రీరామకథను ఉపదేశించి శ్రీరామాయణ కర్తనుగా తయారు చేసెను.



# శ్రీకృష్ణలీలలు

శ్రీకృష్ణుడు ధర్మసంస్థాపనార్థము తానవతరించినట్లు భగవద్గీతయందు బోధించియున్నాడు, సర్వధర్మములకు ఆదిస్థానమను నీ పరమ దయానిధి భూలోకమున జేసిన కార్యములు ధర్మాభివృద్ధికె దగినవిగనుండునుగాని ఇతరముగనుండుట సాధ్యము కాదుగదా. శ్రీకృష్ణలీల లన్నియును గొప్ప అంతరార్థము గలిగియున్నవి ఈ లీలలు జరిపినప్పుడు శ్రీకృష్ణునకు మొమ్మిదేండ్లకు తక్కువ వయస్సుగల బాలుడుగ నున్నట్లు భాగవతమున జెప్పబడియున్నది గదా! శ్రీకృష్ణుడు మనుష్యమాత్రుడని యెంచినను ఇంతటి వయస్సున నింద్యిత కార్యములు చేయుటసాధ్యముకాదు. దేవుడనిపించిన చెడుకార్యములే చేయడుకాన ఇతర మతస్థుల దూషణసరికాదు. నవనీతచోరుడు (వెన్నదొంగ యనగనేమి? పెరుగును జిలుకగ జిలుకగ వెన్నపుట్టును. వెన్నయనగ పరిశుద్ధ మనస్సు. భక్తిజ్ఞానానుష్టానములు చేయగ చేయగ మనస్సు స్థిమితమునకు వచ్చి పరిశుద్ధమగును. ఇట్టిభక్తుని పరిశుద్ధమనస్సు అనెడి వెన్నను స్వామి దొంగిలించును. అనగా దానిని తనయందు చేర్చుకొని దానియందు తన తేజస్సు నుంచును. గనుకనే శ్రీకృష్ణునికి గోపికా మనోహారుడనిపేరు. ఇట్లు వెన్నదొంగయనగ భక్తుల మనస్సు సదా తనయందు లయింపజేయు పరమ దయానిధియని యర్థము. గోపికా వస్త్రాపహరణము. భక్తుడు సంసారసాగరమున మునుగుచు దేలుచు మోక్షము బొందయత్నించి భగవంతుని పాదారవిందము చేరుటకును ఆత్మ సాక్షాత్కారము బొందుటకును బ్రయత్నపడును ఇట్టి స్థితిని బొందవలయునన్న ప్రపంచవిషయములను వదలవలయును. దేహాభిమానములు, అహంకారాదులను, వదలి సర్వసంగరహితుడై ఈశ్వరుని యందు మనస్సు నిలిపి లయింపజేయ వలయును. ఇట్లు చేసిన భక్తుడు ఈశ్వరానుగ్రహమును (ఆత్మతేజస్సు) బొందునని ఈకథ బోధించుచున్నది.

గోపికలు స్నానముచేసెడి సరస్సు యనగా సంసార చక్రము నగ్నత (గుడ్డలు లేకయుండుట) సర్వసంగరాహిత్యమును దెలుపుచున్నది. పొన్న చెట్టుపైనుండు శ్రీకృష్ణుడు గోపికలను వస్త్రములు విడిచి తనవద్దకు రమ్మని చెప్పుట యనగ మోక్షస్వరూపుడగు స్వామి తన భక్తులు తనను జేరవలెనన్నచో సర్వసంగములను వదలి తన యందే మనస్సులయింప జేయవలయునని యర్థము

క్రీస్తువుల గ్రంథములందుగూడ భక్తుడునగ్నతగా (బిత్తలగా) దేవునిదగ్గరకు బోవలయుననియు, జీవుడు దేవుని పెండ్లి చేసుకొనవలయునని వ్రాయబడియున్నది. ఇదియును అదే అర్థమును బోధించుచున్నది. గోపికలు పరమభక్తులు అంతర్ముఖులు శ్రీకృష్ణుని తమ హృదయకమలమందు నిల్పి సదా ధ్యానముచేయువారు నారదుడుఒకదినము ద్వారకకుబోగా ప్రతిరాచస్త్రీ యింటియందును శ్రీకృష్ణస్వామినిజూచి మిగులఆశ్చర్యముజెందెను అనగా నారదుడు దివ్యదృష్టితో ప్రతిస్త్రీయొక్క మనస్సును పరీక్షచేయగా ప్రతిస్త్రీయును శ్రీకృష్ణునియందు మనస్సు లయింపజేసి యుండెను. భక్తుడు భార్యగను దేవుడుభర్తగను భావించి పతివ్రత తనపురుషునియందువలె భక్తుడు తన దేహమును మనస్సును స్వామికినర్పింపవలయును గోపికలు శ్రీకృష్ణునితో క్రీడించుట ఇదియే.

# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘం

## మాఘమాస పండిత పరిషత్సభలు

......

### పాలకొల్లు.

పశ్చిమగోదావరి జిల్లా, పాలకొల్లు గ్రామమున శ్రీ అష్టభుజ లక్ష్మీనారాయణస్వామివారి సన్నిధియందు స్వస్తిశ్రీ వికృతినామ సం।రం। పుష్య బ ౧3 ఆదివారము 4-2-1951 తేదీ నుండి మూడు దినములున్ను మదరాసు వాస్తవ్యులైనట్టి రామాయణ రత్నాకర, ఉపన్యాస భూషణ, మహావిద్వాన్ కండ్యూరి రామానుజాచార్యులువారి అధ్యక్షత క్రింద శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ మాఘమాస పండిత పరిషత్సభలు అతి వైభవముగా జరిగినవి. ఆహ్వానసంఘము వారు అతి చక్కని ఏర్పాటులను చేసినారు.

విచ్చేసిన ఉపన్యసించిన పండితుల తిరునామములు.

శ్రీ. ఉ. వే. శ్రీమాన్ రామాయణ రత్నాకర, ఉపన్యాసభూషణ, మహావిద్వాన్
,, ,, కండ్యూరి రామానుజాచార్యులుగారు మదరాసు
,, ,, నడాదూరి గోపాలకృష్ణమాచార్యులుగారు మంగళంపాడు
,, ,, గుదిమెళ్ళ వెంకటనరసింహాచార్యులుగారు కోరుకొండ
,, ,, ఈయుణ్ణి శేషసింగరాచార్యులుగారు అంతర్వేదిపాలెం
,, ,, ఈయుణ్ణి రాఘవాచార్యులుగారు నరసాపురము
,, ,, తిరుమలపురిఘళ్ళ ధర్మాచార్యులుగారు సకిద
,, ,, ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులుగారు అర్తమూరు
,, ,, శాంతలూరి వెంకటాచార్యులుగారు పాలకొల్లు
,, ,, ముడుంబై చిన వెంకటాచార్యులుగారు [illegible]
,, ,, చూపురాణి వెంకటాచార్యులుగారు
,, ,, కొట్టుముక్కల రామానుజాచార్యులుగారు పూరి

,, ,, ,, కృష్ణమాచార్యులుగారు ఆచంట
,, ,, గోవర్ధనం వెంకటశేషబట్టరాచార్యులుగారు
,, ,, కవివర కలవగుంట శేషాచార్యులుగారు తణుకు

వి దు షీ మ ణు లు

శ్రీమతి నందురి ఆనందమ్మగారు ఏలూరు
,, ముకుంబై రామానుజమ్మగారు రాజమహేంద్రవరము
,, మరంగంటి రంగనాయకమ్మగారు కోరుకొండ
,, కందూర్యారి లక్ష్మీనరసమ్మగారు
,, గొట్టుముక్కల వెంకటలక్ష్మీరంగనాయకమ్మగారు తంగుడుపల్లి

ఆఖరునాటి రాత్రి చి॥ సౌ॥ గో. గోపాలరత్నము అను సం 10 రం బాలిక శ్రీకృష్ణ లీలను అత్యద్భుతముగ హరికథా కాలక్షేపము జేసినది.

నిరుటి సంవత్సరపు జమ–ఖర్చుల వివరములు:

(విరోధి సంవత్సరము)

జమలు.

| | |
|---|---|
| భక్తులవల్ల వసూలైన మొత్తము | 857— 4—3 |
| సర్వజిత్తు సం॥రం॥ శ్రీమార్గ ధర్మాచార్యులుగారివద్ద యున్ననిల్వ | 50— 0—0 |
| పాలకొల్లు కార్యదర్శి శ్రీ రేపాక రంగయ్యగారివద్దయున్న నిల్వ | 314— 6—0 |
| నిల్వసొమ్ముమీద వసూలైన వడ్డీ | 22— 9—6 |
| లేటు సలాది చినరామలింగయ్యగారివద్ద యుంచినది | 126— 5—9 |
| | 1370— 9—6 |

ఖర్చులు.

| | |
|---|---|
| 358— 2—0 | పండితులకు ఖర్చులు వగైరాలకు. |
| 59—15—3 | సాదర్లు |
| 379—12—0 | తదీయారాధనఖర్చు |
| 797—13—3 | |

1370_ 9_6
797_13_3
573_12_3

ఇందులో పాలకొల్లు శాఖ కార్యదర్శిగారగు 'వేపా' రంగయ్యగారివద్దయున్న నిల్వ రు. 446—6—6

లేఖ సుంకాది రామలింగయ్యగారి ఖాతాను నిల్వయున్నది రు. 126—5—9

మొత్తము నిల్వ రు. 572—12—3

శ్రీ రామ సేవ.

# శ్రీ వాసుదాస స్వామివారి జన్మదినోత్సవములు.

## శ్రీ కోదండరామ సేవక సమాజము 23 వ వార్షిక సభలు

దాసకుటి-అంగలకుదురు.

(1951_ఫిబ్రవరి 7,8,9)

స్వస్తిశ్రీ విక్రృతినామ సంవత్సర మాఘ శు॥ ౨, ౩, ౪ బుధ, గురు, శుక్రవారములలో శ్రీ వాసుదాస స్వామివారి జన్మదినోత్సవములు, శ్రీ కోదండరామ సేవక సమాజ సభలు మిక్కిలి వైభవముగా జరిగెను.

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ సభలు

స్వస్తిశ్రీ వికృతి సం॥ మాఘ శు ౪,౫,౬లకు సరియయిన 1951 ఫిబ్రవరి 9,10,11 తేదీ లందు దాసకుటిలో అత్యంత వైభవముగ జరిగెను. మహత్త్వపూర్ణములయిన యుపన్యాసములు సాంప్రదాయానుసారముగా ననుభవజ్ఞులగు విద్వాంసులచే నొసంగఁబడెను.

దాసకుటి
అంగలకుదురు.
5_1_51

ఇట్లు,
సమాజపక్షమున విన్నవించు. భవచ్చరణధూళి.
దాస శేషుఁడు.

## సంభావన

శ్రీ ఉ. వే. శ్రీమాన్ కొడమగుళ్ళ తాండవ కృష్ణమాచార్యులు గారు తమ మామగారి తిరు వధ్యయన మహోత్సవమున శ్రీవిశిష్టాద్వైత పరిచారక సంఘమునకు రూ 1-0-0 సంభావనను సమర్పించిరి. వీరిని శ్రియఃపతి కటాక్షించుగాక.

శ్రీ. ఉ. వే. శ్రీమాన్ తె. కం. వరదా స్వామి; గోపాలాచార్యులు వార్లు తమతల్లి గారగు సీతమ్మగారిపరమపద మహోత్సవమున శ్రీవిశిష్టా ద్వైత పరిచారక సంఘమునకు రూ 5-0-0 సంభావనను సమర్పించిరి. వీరిని శ్రియఃపతి కటాక్షించుగాక.

## కట్నములు

మదరాసు వాస్తవ్యులగు శ్రీమాన్ కొత్తూరి జాలయ్య శ్రేష్ఠిగారి కుమారుడు శ్రీమాన్ కొత్తూరి రంగనాథం శ్రేష్ఠిగారికి

(17, వరదముత్తప్పన్ వీధి)

శ్రీమాన్ నామజయరామ శ్రేష్ఠి గారి కుమార్తె శ్రీమతి లక్ష్మీకాంతమ్మను యిచ్చి మదరాసులో జరిపించిన వివాహ మహోత్స వమున వరుని తల్లిగారగు శ్రీమతి కొత్తూరి కృష్ణవేణమ్మ గారు శ్రీవిశిష్టాద్వైత పరిచారక సంఘమునకు రూ 5-0-0 కట్నమును సమర్పిం చిరి. ఈనూతన వధూవరులకు శ్రియఃపతి ఆయు రారోగ్య్యైశ్వర్యాభివృద్ధుల కృపచేయుగాక.

ఇ ట్లు,

శ్రీ యతిరాజ సేవా మహిళా సంఘము

## శుక్రవారోత్సవములు

### బరంపురం

శ్రీమతి తి. పి. తిరువెంగళ తాయారమ్మగారు
,, ర్యాలి శ్రీరంగనాయకమ్మగారు
,, ,, జగ్గమ్మగారు
,, గా. జగ్గమ్మగారు
,, గా. సింహాద్రిలక్ష్మీనరసమ్మగారు
,, కొ. లక్ష్మీనరసమ్మగారు.
,, న్యా. సీతారామమ్మగారు

ఈస్త్రీభక్తశిఖామణులు ఉపన్యాసములు తిరు నామములు మంగళహారతులు సంకీర్తనలు జరిపి సంఘమునకు కట్నముగా రు 2-0-0లు సమ ర్పించిరి.



# మంగళశాసన పద్యములు

కవిత: కలవగుంట శేషాచార్యులుగారు

తణుకుతాలూకా, పాలకోలను.

సీ॥ శ్రీకరంబగుచునుఁ జెన్నారుచున్నట్టి
క్షీరపురంబున స్థిరతనుండి
వైష్ణవభక్తులై వర్తిల్లుచుండెడి
భక్తబృందములతివాంఛతోడ
శ్రీవిశిష్టాద్వైత సిద్ధాంత మార్గముల్
బాగుగాఁ దెలియంగఁ బ్రజలకెల్ల
బహుదూరమునుండి పండితవర్యుల
రప్పించి వారిచే రమ్యముగను

తే॥ గీ॥ వేదవేద్యుని బొందెడి విధముఁ దెలుపు
నట్టి వేదాంత సభలను ననువుగా
జరుగునట్టులఁ జేయించి చలముమీర
పేరుగాంచిరి మిక్కిలి వీక తోడ.



శ్రీమతే రామానుజాయనమః

# శ్రీవిశిష్టాద్వైత ప్రచారక ద్వాదశవార్షిక విరాట్ సమావేశము

రాజమహేంద్రవరము తూ. గోదావరిజిల్లా.

## ఆహ్వానపత్రిక

స్వస్తిశ్రీ ఖరనామ సంవత్సర చైత్ర శు ౫ బుధవారమగు 11—4—51 తేదీని శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ కార్యకారిణి సమితి సమావేశమున్ను; ఆ నాడే పండిత పరిషత్తు సమావేశమున్ను;

ది. 12—4—1951 గురువారము; 13—4—51 శుక్రవారము; ఈ రెండు దినములు ఈ సంఘ విషయ నిర్ణయ సమితి సమావేశములున్ను;

ది. 14—4—51 శనివారము; 15—4—51 ఆదివారము; ఈ రెండు దినములు శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ ద్వాదశ వార్షిక విరాట్ సమావేశమున్ను శ్రీ ఉ. వే. శ్రీమాన్ పరాశర సుదర్శన భట్టరు అయ్యవార్లంగారి అధ్యక్షతక్రింద తూ. గో. జిల్లాలోని రాజమహేంద్రవరమున జరుపుటకు నిర్ణయించబడినది.

కాన ఈ సంఘముయొక్క కార్యకారిణి సమితి సభ్యులు పండితపరిషత్సభ్యులు, సంఘముయొక్క అన్ని తరగతులకు చెందిన సభ్యులు, అభిమానులు, సానుభూతిపరులు అందరు తప్పక విచ్చేసి వీటిని సక్రమముగను, జయప్రదముగను జరిపించ ప్రార్థించుచున్నారము.

ఇట్లు,

ప్రస్తుత కార్యాలయము:

అత్రమూరు.

(వయా) ద్వారపూడి, తూ. గో. జిల్లా.

తె. కం. గోపాలాచార్యులు,
ప్రధానకార్యదర్శి.

అ. చి. శ్రీమన్నారాయణాచార్యులు,
సహాయకార్యదర్శి.

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము.

---

షరా:— తీర్మానములు పంపదలచినవారు ది. 31—3—51 తేదీలోపుగ కార్యదర్శికి అందునటుల పంపగోరుచున్నారము.



శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ యతిరాజ సేవా మహిళా మండలి

(శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ స్త్రీశాఖ)

## వార్షిక సభ

## ఆహ్వాన పత్రిక

స్వస్తి శ్రీ, ఖరనామ సంవత్సర చైత్ర శుద్ధ 3 సోమవారము ది 9-4-51 తేది లగాయితు వరుసగ అయిదు దినములు తూర్పు గోదావరి జిల్లాలోని రాజమహేంద్రవరమున శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ స్త్రీశాఖయగు శ్రీయతిరాజసేవా మహిళా మండలి యొక్క వార్షిక సభ జరుగుటకు ఏర్పాట్లు చేయబడినది. కాన మండలి సభ్యురాండ్రు అభిమానురాండ్రు సానుభూతిపరులు అందరు సకుటుంబముగా విచ్చేసి యందు పాల్గొని దీనిని జయప్రదముగ నడిపించ గోరుచున్నాము.

ఇట్లు
ఆహ్వాన సంఘము.

అధ్యక్షురాలు
ముడుంబై రంగనాయకమ్మ

ఉపాధ్యక్షురాలు
గాడి శ్రీ రామమ్మ
నల్లాన్ చక్రవర్తుల తాయారమ్మ
పోడూరి సాధా నానాబాయమ్మ
బూ. వెంకటరమణమ్మ

కార్యదర్శులు
ముడుంబై రామానుజమ్మ

కోశాధికారిణి
ముడుంబై వెంకటసత్యవతమ్మ

ప్రస్తుతకార్యాలయము
మెయిన్ రోడ్
19/288.
రాజమహేంద్రవరము
తూర్పు గోదావరి జిల్లా

---

మరా:- తీర్మానాదులను ది 31-3-51 తేదీలోపుగ కార్యదర్శినికి పంప గోరుచున్నారము.

రిజిష్టరు నెం. 5049.

Book-Post

# భక్తినివేదన

(వేదాంత మాసపత్రిక)

ఇందు వేదాంత విషయ రాజములున్ను; భక్తిప్రచార విషయమైన వార్తలున్ను; వేదాంత సాంప్రదాయ విషయకమైన ప్రశ్నోత్తరములున్ను ప్రకటించబడును.

చందాలు:

| | | |
|---|---|---|
| సాధారణ చందా | సం. ఒం 1కి | రు. 5-0-0 |
| సహాయ చందా | ,, | రు. 10-0-0 |

పోషకులు:

| | | |
|---|---|---|
| పోషకులు | సం. ఒం 1కి | రు. 25-0-0 |
| రాజపోషకులు | ,, | రు. 58-0-0 |
| మహారాజపోషకులు | ,, | రు. 116-0-0 |




కార్యాలయము:

"భక్తినివేదన" కార్యాలయము,

ఆర్తమూరు (పోస్టు) ద్వారా,

తూర్పుగోదావరి జిల్లా.

Edited printed & published by A. Ch. srimannarayanacharya, at Sriman press, Artamuru, E. G. Dt.

శ్రీమతే రామానుజాయనమః



భక్తి

# నివేదన

వేదాంత మాస పత్రిక


| సంపుటి ౩ | వికృతి — మాఘ మాసం | సంచిక ౧౧ |
|---|---|---|


## ఆచార్య నిర్ణయము


శ్రీ. ఉ. వే. శ్రీమాన్, అ. తి. కాం. వెంకట తాతాచార్యులుగారు, కాంచీపురము.


శ్రియః పతియగు సర్వేశ్వరుడు లోకోజ్జీవనార్థముగ ఆచార్యరూపముగ నవతరించి అస్మదాదుల నుజ్జీవింప చేయుచున్నాడు. తానున్నూ అవతరించినప్పుడెల్ల ఆచార్యులను వరించుకొని వారివల్లనుంచి విద్యాభ్యాసాదులను పొందినట్లు గ్రంథములయందు కానబడుచున్నది. ఈవిషయమై ఆస్తికులకు వివాదముండదని తలంచెద.

అయితే ఆచార్యులు జ్ఞానానుష్ఠానపూర్ణులై యుండవలయునని గ్రంథములయందు కానబడుచున్నది. అట్టి ఆచార్యులు దివిటీపెట్టి వెతకినను దొరకరు. అట్టిది పూర్వాచార్యులతోనే సరి. వారివద్ద గ్రహించవలయుననిన ఉపసత్తి లేనిదే శిష్యులకు విశేషార్థములు సాయించువారు కారు. మరియు ఈశిష్యుల ఆదరణాదులను పరీక్షించియే సాయించువారు. ఇప్పటివారివలె రు1-0-0 టిక్కెట్లు రు2-0-0 టిక్కెట్లు పెట్టి అధికార్యనధికారుల వివక్ష లేక చెప్పినట్లు కనుపించదు. ఇట్టి పరిస్థితిలో ప్రాచీనాచార్యులు జ్ఞానవంతులు కారని కొందరు కులక్రమాగతాచార్యులను పరిత్యజించుచున్నారు. పై బాహ్యవేషము విద్వనుమాత్రమే బహుశిష్టత్వముగనెంచి వారి అంతరంగిక వృత్తులను నేమియు గమనించక [illegible] పూర్వాచార్యులు కేవల బాహ్య

వేషములు లేనివారని చూచి అంతః వారియొక్కస్థితులు ఎట్టివి అని గమనించక విప్రతిపత్తిగలుగ చేసికొనుట చాలా అయుక్తము. ప్రాక్తనకర్మమువలన విద్యలభించవచ్చును. అనుష్ఠానముమాత్రము అట్టివారికి దుర్లభము. జ్ఞానానుష్ఠానములన్నచో ఉపర్యుపరి అవస్థ. ఒకరికన్న ఒకరు కనుపించు చూవుందురు. పైవారిని చూచినప్పుడెల్ల పూర్వులను వదలవలసివచ్చును. గొప్ప ఉపన్యాసము లను చేయువారలను చూచినచో అతను విభవులై, హారిణీఖురమాత్రావయుపములయందు మోహము కలవారై యున్నారే కాని అనన్యభోగ్యతాకారము ఎచ్చటను కనుపించదు. ఎవరిని చూచినను స్వోదరిపూరిణ జాయాభూషణైక తత్పరఫలక వేదాంత వేషధారులగనే కనిపించుచు న్నారు. దోషారోపణయన్నచో అందరియందును మేనో ఆరోపించవచ్చును. కులక్రమాగతా చార్యులు మహాపాతకాది దోషములు కలవారైనా తప్పు వారిని త్యజించుట మిక్కిలి పాతకము, నరకావహమని పూర్వాచార్యులే వచించియున్నారు.

శ్రీవచనభూషణా॥

సాంచరా తె పరమపురుష సంహిం తాయూం॥

గా—సూ. తిరిశంకులైప్పొలె కర్మచండాళనాయ్ మార్వి

లిట్ట యజ్ఞోపవీతందానే వారాయ్‌విడుం॥

ఈ వాక్యవ్యాఖ్యావసరమున ఎంబార్ జీయర్ అరుంబదమున కులక్రమాగతాచార్యులను విడిచి ఆచార్యాంతరము నాశ్రయించుటచే ఇహపరములకు భ్రష్టుడై ఛండాళత్వమునుపొంది సాహో త్స్వర్గమునకు భూలోకమునకు నరకమునకు గాక అధోశిరస్కుడై త్రిశంకుస్వర్గమును నొంది స్వాభీష్టస్వర్గచ్యుతుడైన త్రిశంకువువలె పురుషార్థమును లభించదని తాత్పర్యము.

శ్లో. ఆచార్యో ద్వివిధః ప్రోక్తస్సర్వశాస్త్రార్థ వేదిభిః।
కులక్రమాగతః పూర్వః ప్రత్యాశాఖ్య స్తథా పరః॥

అర్థము: కులక్రమాగతాచార్యులనిన్నీ – ప్రత్యగాచార్యులనిన్నీ రెండుప్రకారములుగ నున్నారు.

శ్లో. ధర్మద్వారా కర్మయస్మిన్ జాతి స్తత్కుల ముచ్యతే।

కులమనగ– అలిప్తవాయధర్మాణాం, అని వర్ణాశ్రమధర్మములకు హానికాకుండా భగవన్ముఖోల్లాసకరమైన కర్మ స్థిరముగ ఏజాతియందున్నదో అది కులశబ్దార్థము.

శ్లో. తత్ప్రవాహముఖ్యస్యాపి పదవిశ్లేషణా క్రమః।

పూర్వోక్తధర్మములు పూర్వోక్తపరంపరగ అవిచ్ఛిన్నముగ వచ్చుట క్రమశబ్దార్థము.

శ్లో. ఆగతస్తత్త్వబోధాయ విభు రాచార్యమూర్తిమాన్॥

పూర్వోక్తధర్మముగలవారు సంసారులకు తత్త్వబోధార్థముగ ఆచార్యరూపియై శ్రియఃపతి అవతరించి వచ్చిన ప్రకారము ఆగతశబ్దార్థము ఈ మూడువాక్యములకు చేర్చి అర్థమును చెప్పుచున్నారు.

శ్లో. కులక్రమాగతాచార్యం త మాచార్యవిదో విదుః॥

అట్టివారిని కులక్రమాగతాచార్యులని పెద్దలు చెప్పుదురు.

ప్రత్యగాచార్యుల శబ్దార్థమును సాధించుచున్నారు:

శ్లో. పుంసః పరగతిజ్ఞానే జిజ్ఞాసా జాయతే యది!
తత్పూర్వదేశికాభావాత్ య స్సమిత్పాణి రాశ్రయేత్॥
తేనాసు మస్య దయయా దీక్షాసంస్కారపూర్వకం।
మన్త్రవ్యాఖ్యాకృదాచార్యః ప్రత్యగాఖ్యస్స ఉచ్యతే॥

ఇంతవరకు తనకులమం దాచార్యులులేక అవైష్ణవవంశుడై యుండి ఇప్పట్లో అర్థపంచక జ్ఞానముద్వారా ఉజ్జీవింపనిచ్ఛయించి జాయమాన భగవత్కటాక్షపాత్రుడై నవీనముగ సమిత్పాణియై సదాచార్యుల నాశ్రయించి వైష్ణవేష్టిని చేయించుకొని సమాశ్రయణాదులను లభించుకొని మన్త్రమన్త్రార్థములు లభించుటకు హేతువైన ఆచార్యులు ప్రత్యగాచార్యులనంబడుదురు. అనగా ఇదివరకు ఆచార్యులు ఆకులమునందు లేక క్రొత్తగ నాచార్యవరణము చేసికొని ఏర్పరచుకొను ఆచార్యులు ప్రత్యగాచార్యులని చెప్పబడుదురు. వీరుభయులలోను కులక్రమాగతాచార్యులు ముఖ్యులు. ఇందులకు ప్రమాణము.

శ్లో॥ కులాచార్యస్య భజనం యే వా సుకృతినో జనాః।
కుర్వన్తి సతతం భక్త్యా తే వన్ద్యా స్సర్వదేవతైః।
సర్వక్రతుశతం కృత్వా యత్ఫలం సమవాప్నుయాత్।
తత్ఫలం సమవాప్నోతి కులాచార్యస్య పూజనాత్।
సార్ధత్రికోటితీర్థేషు స్నాత్వా యత్ఫల మాప్నుయాత్।
తత్ఫలం సమవాప్నోతి కులాచార్యస్య పూజనాత్।
సన్తుష్టో హి కులాచార్యే శ్రద్ధయా యస్య భక్తితః।
తేన తుష్టం జగత్సర్వం తుష్టా స్స్యు స్సర్వదేవతాః॥

పుణ్యవంతులైన యేజనులు కులాచార్యులను భజించుచున్నారో వారు సర్వదేవతల చేతను భజింపబడుదురు. నూరుయజ్ఞముచేసి ఏఫలమును పొందుదురో షోడశమహాదానాదుల వలన నే ఫలమును పొందుదురో మూడున్నర కోటితీర్థములయందు తీర్థమాడిన ఏఫలమును పొందుదురో, ఆఫలములన్నియూ కులాచార్య పూజవలననే పొందగలరనియూ, ఎవరియొక్క శ్రద్ధాభక్తులచే కులాచార్యులు సంతోషింతురో వారియెడల సర్వజగత్తు సర్వదేవతలును సంతోషించెదరు. అని కులాచార్య భజనను మిక్కిలి ప్రశంసించిరి.

శ్లో॥ దైవా ప్రోషాన్తరగతే లుప్తే వా స్వదేశికే ।
తదీయ పుత్రభ్రాత్రాదే రుపదేశోపి గృహ్యతాం॥

ఆచార్యులు శిష్యులకజ్ఞాన దశయందు సమాశ్రయణాదులను చేసి శిష్యులు తెలుసు కొనుటకు వీలులేని దేశమునకు వెళ్ళినను లేక పరమపదించినను పూర్వాచార్యుల యొక్క పుత్ర భ్రాత్రాదుల సన్నిధియందు ఆశ్రయించి పుట్టి ప్రతిపత్తినిచేసి గ్రన్థాదులను అధికరింపవలయును. భ్రాత్రాదేః అని అది శబ్దముచే జ్ఞాతులు తత్సంబన్ధులు తదీయగోత్ర కులాదులు గలవారు అన్నియూ వివక్షితములు. ఇట్లు స్పష్టముగ ప్రతిపాదించుటచే జాత్యన్తరుల నాశ్రయించకూడదనియును స్పష్టమగుచున్నది. అట్టివారెవ్వరునూ లేనిచో ఇతరత్రా ఆశ్రయించవలయునని వ్యాఖ్యానకర్తలు సాయించియున్నారు.

శ్లో॥ తత్పుత్రాదేరభావే తు శిష్యశ్చేత్ తత్ప్రలోలుపః ।
తత్కాల్యభావం సర్వజ్ఞం ఆచార్యాన్తర మాశ్రయేత్ ॥

అని పుత్రాదులెవ్వరూ లేనిచో ఇతరత్రా ఆశ్రయించవచ్చునని సాయించిరి. దైవాదీన మున పునః పూర్వాచార్యులుగాని వారి పుత్రాదులుగాని వారిజ్ఞాతులు వగైరాదులుగాని తరిగి వేంచేసినచో ఎట్లు వర్తించవలిసినదిని చెప్పుమన్నారు.

శ్లో॥ దైవాధీనాత్కులాచార్యే తత్పుత్రాదౌ తథాగతే।
ఉపదేశో గృహీతవ్యః పునః కులగురోర్మనుః

పూర్వాచార్యాదులు వేంచేయగనే యిప్పుడాశ్రయించిన ఆచార్యులనువదలి వారివల్ల లభించిన విశేషార్థములను త్యజించి సిరివద్ద తిరిగి సమాశ్రయణాదులను లభించి తిరిగి మన్త్ర మన్త్రార్థములను లభించవలయునని అభిప్రాయము—

మరియు

శ్లో॥ పునస్సంస్కారసంశుద్ధాః స్వర్ణవద్గతకల్మషాః ।
వంశపూతా వివర్ధంతే రాజన్తే శిష్యకోటయః ॥

తిరిగి ప్రాచీనాచార్యులనాశ్రయించి పంచసంస్కారాదులనులభించి స్వర్ణమువలె పరిశుద్ధులై పవిత్రమైన వంశముగఅవారై శిష్యులు ప్రకాశించుచుందురని తాత్పర్యము.

ఆచార్యులు అనుష్ఠానపరులనగ శాస్త్రవిరుద్ధానుష్ఠానములేక యున్నంతమాత్రము చాలును. శాస్త్రజ్ఞానము విశేషముగ లేకున్ననూ చాలును. జ్ఞానము మాత్రము రావణాదులకువలె యున్నంతమాత్రముచే ప్రయోజనములేదు. పరోపదేశే పాండిత్యమనునట్లు నిష్ప్రయోజనము గన్క. విశేషజ్ఞానములేకున్ననూ వారి యాజ్ఞచే ఇతరులవలన అర్థవిశేషములను గ్రహింపవచ్చును.

శ్లో॥ కులాచార్యా నిదేశేన తత్ర వై దేశికాన్తరం ॥
తత్తుల్యభక్త్యాభజన స వై నరకభాజనం ॥

కులాచార్యులయొక్క యాజ్ఞవలన ఇతరులవలన విశేషార్థమును గ్రహించవచ్చును. ఆజ్ఞలేనిదే యితరుల భజించుట నరకకారణమగును.

శ్లో॥ అన్యత్ర శృణు యా జ్ఞేయం అనుజ్ఞాప్యైవ జీవతి॥

ఆచార్యాజ్ఞచేతనే ఇతరులవల్ల గ్రహించవచ్చును. అనిభావము. ఆచార్యాజ్ఞలేనిది ఇతరత్ర గ్రహించకూడదనియును తాత్పర్యము ఉదయవర్లును పెరియనంబిగారి యాజ్ఞవలన ఇతరాచార్యుల వలన సకలార్థములను గ్రహించినట్లు కనుపించుచున్నందున స్వాచార్యులకు విశేషజ్ఞానము లేకపోయినను ఇతరులవల్ల వారాజ్ఞచే గ్రహించి యుజ్జీవించవచ్చును. ఆచార్యులను అవమానించే ఇతరత్ర ఆచార్యప్రపత్తిని చేసినచో నరకభాక్కు కాగలడని స్పష్టముగ ఏర్పడుచున్నది.

శ్లో॥ నారాయణోఽపి వికృతిం యాతి గురోః ప్రచ్యుతస్య ।
దుర్బుద్ధేః కమలం జలాదపేతం శోషయతి రవి ర్న పోషయతి॥

వాత్సల్య స్వామిత్వ సౌశీల్యాది గుణోపేతుడైన నారాయణుడున్నూ స్వాచార్య తిరస్కారము చేసిన దుర్బుద్ధిగల మనుజుని విషయమై వికృతిని పొందును. అనగ క్షిపామ్యజస్ర మశుభా న్నాసురీ ష్వేవ యోనిషు నక్షమామి యను వాక్యములకు పాత్రుడుగ చేయునని తాత్పర్యము ఎల్లలిన జలమునుంచి వెలికివేయబడిన కమలమును కమలాప్తుడు (సూర్యుడు) వికసింపచేయక ఎట్లు ఎండవెట్టునో అట్లు అని తాత్పర్యము.

శ్లో॥ నాన్యై రుపాయై ర్వివిధై ర్మంత్రౌషధపురస్సరైః ।
కులక్రమాగతాచార్య తిరస్కార జపాతకాత్ ।
ముచ్యతే మాలజో మూఢో సర్వదుర్గతిభాజనం ॥

ఎన్ని పుణ్యకార్యములను చేసినను మంత్రౌషధపురస్సరములైన ఉపాయములెన్ని చేసినను కులక్రమాగతాచార్యతిరస్కారమువలన పుట్టిన పాపమున-విడువబడడు. సర్వదుర్గతులను పొందగలడు.

తస్మాత్సర్వాత్మనా బ్రహ్మన్ కులాచార్యం ప్రపూజయేత్ ॥
త్రికరణైః మనసా వాచా నిర్దోషః శుద్ధి మాప్నుయాత్ ॥
గురుదారసుతాదౌ తు గురువ ద్వృత్తి మాచరేత్ ॥

సర్వప్రకారములచేతను కులాచార్యులను పూజించినయెడల మనోవాక్కాయ కర్మముల చేతను శుద్ధిని పొందగలడు.

గురుదార-సుతాదులను గురువునువలెనే పూజించవలయును. ఆచార్యులకు తమకుమారుల నాశ్రయించక ఇతరుల నాశ్రయించినచో వీనియందు అనుగ్రహ మెట్లు కలుగును. ఆచార్యునిగ్రహ పాత్రుడుకావలయునే గాని అనుగ్రహమునకు కారణభూతుడు ఎన్నడును కానేరడు.

ఆచార్యులుగాని వారిపుత్రాదులుగాని పతితశబ్దవాచ్యులై నిందిత కర్మాచరణము గలవారై యుండినచో

జ్ఞానహీనం గురుం ప్రాప్య కుతో మోక్ష మవాప్నుయాత్ ఛిన్నం నావం సమాశ్రిత్య స్తబ్ధః పారం న గచ్ఛతి॥ అనిన్ని

ధ. సూ. న పతిత మాచార్యం జ్ఞాతిం వా దర్శనార్థో గచ్ఛేత్.

ఇత్యాదివచనముల ఆచార్యత్యాగబోధకముగ కనుపించినను ఇవి కేవల మహాపాతకాది దోషులైనవారి విషయము. అప్పటికిని వారి పుత్రభ్రాత్రాదులు జ్ఞాతులు మొదలగు వారి నాశ్రయణ నిషేధపరములు కావు.

ఆచార్యాపచార తద్భక్తాపచారంగళ్ వందు చండాళత్వత్తై ।
అడైన్దు ఆచార్యభక్తిరిగళుక్కాయ శాపత్తాలే సర్వలోకలోచన ।
గోచరమాక ప్పెత్త త్రిశంకువై ప్పోలె యెన్నపడి... ... ...

అని పఠించియున్నారు. ఈవాక్యము స్పష్టార్థము.

కందాడైవారి శిష్యులు ఎట్టివారైనను వారిని తప్ప ఇతరుల నాశ్రయించరు.

శ్లో॥ గురుం హుంకృత్య ధిక్కృత్య రౌరవం నరకం వ్రజేత్॥

ఆచార్యులను హుం అనినను ధిక్ అనినను రౌరవనరకమును పొందును అని యున్నందున్నూ ఎన్నడు ఆచార్యులను తిరస్కరించకూడదు. ప్రకృతమున శిష్యులకు ఆచార్యులు తమ చందాను వృత్తులగనుంటేనే చాలాసాత్వికులు, లేనిచో వారు అయోగ్యులు, వీరు చేసే అకృత్యములకు తోడ్పడి కృత్యములుగ స్తుతించుచున్న ఆచార్యులే కావలయును ఈ కాలమున ఆస్తిక నాస్తికత్వమేతప్ప సాత్త్వికత ఎచ్చటను కానరాదు. ఆచార్యదోషమునే యెంచువారు ఎట్టి జ్ఞానవంతులో యనునది స్పష్టముగ తెలుసుకొనవచ్చును. తాను జ్ఞానవంతుడనుకొని గదా ఇట్టి నిందను చేయుటయూ త్యజించుటయూ వీనికి విరుద్ధమును. ఇది జ్ఞానకార్యమగునా? విజ్ఞులు యోచించండి.

వేషము కులము గురుత్వములు పల్లకీలు వస్త్రాలు మోక్షసాధనములు కావు ఆడంబరములు లోక భ్రామకములు. విద్యకన్న అనుష్ఠానమే శిష్యుల కుజ్జీవనము గాని లోకభ్రామకవేషములు ఎన్నడు రక్షకము కానేరదు. గనుక యెన్నడు వేషమును చూచి భ్రమించక పూర్వాచార్యుల కుటుంబస్థులనే ఆశ్రయించుట భగవన్ముఖోల్లాసకరమగును.

ఆచార్యపురుషులమనిన్నీ మమ్ములనే ఆశ్రయించిన మోక్షమనిద్ధమనిన్నీ (స్వయం తరితు మక్షమః కిమపరా నసౌ తారయేత్) యనునట్లు తనకుదిక్కు లేదు గాని ఇతరులకు తాను దిక్కగుట ఎట్లు గలుగును. తాను జ్ఞానాధికుడైతే ఇతర శిష్యుల కెట్లు సమాశ్రయణమును చేయును. నేను అధికుడననుకొనుట జ్ఞానాధిక లక్షణమా? గుణదోషములను ఎంచబోయిన సర్వత్రసమానము గనే ఉండును గాని వేరు విధముగనుండదు. ఆచార్యులగువారలు క్రొత్తగ నాశ్రయించుటకువస్తే మీరు యెవరిశిష్యులని విచారించక యె వచ్చినంతమాత్రముచేత, తన కాధిక్యము గలిగినదని సంతోషముచే సమాశ్రయణమును చేసి తనకు శిష్యునిగ చేసుకొనుట ఎంతయోగ్యత యనునది యిందువలననే స్పష్టమగుచున్నది. ఇందువలన యేర్పడిన విషయమేమనగ

కొందరు కులక్రమాగతాచార్యులను జ్ఞానాధికులు కాకపోవుటచే వారినివదలి ఇతరుల నాశ్రయించుచున్నారనిన్ని కులక్రమాచార్యులకు వేషభాషలు లేవనిన్ని అందువలన వారిని త్యజించుటయు యుక్తమనిన్ని జ్ఞానహీనులు నాశ్రయించకూడదనునది శాస్త్రములయందు బోధించుచున్న దనిన్ని అందువలన త్యజించవచ్చుననెడివాదమును పూర్వపక్షవిధముగ ప్రతిపాదించి సిద్ధాంతముగ అట్లు ఆశ్రయించుట శాస్త్రవిహితముకాదను సంగతిని వచనములచే ప్రతిపాదించి, అట్లు ఆశ్రయించుట నరకావహమనిన్ని ఆచార్యవంశము నంతరించిననూ వారి జ్ఞాత్యాదులనే ఆశ్రయించవలయుననిన్ని ఆచార్యులున్నట్లుగాని వారి వంశ్యులున్నట్లుగాని బొత్తిగ తెలియక ఇతరుల నాశ్రి

యించి వారివలన గ్రన్థాదుల నధికరించియున్నను దైవాధీనమున పూర్వాచార్యులుగాని వారి వంశ్యులుగాని వారిజ్ఞాత్యాదులుగాని తిరిగి వచ్చిన యెడల ముందర నాశ్రయించినవారిని వారివలన గ్రహించవలసిన గ్రంథములను త్యజించి కులక్రమాగతాచార్యులవారినే తిరిగి నాశ్రయించి ఉజ్జీవించవలయుననిన్ని వారు విశేషజ్ఞానాధిక్యులు కానిచో, వారాజ్ఞచే ఇతరత్రాశ్రయించి గ్రంథాదులను మాత్రము నధికరించవచ్చుననిన్ని అట్లు ఆజ్ఞా వశమున ఉండనిచో, చ్యుతుడై చండాలత్వమునుపొంది అధోముఖుడైన త్రిశంఖువుంబోలె ఇతోభ్రష్టః తతో భ్రష్టః యనునట్లు అగును అనిన్ని కులక్రమగతాచార్యులు పతితులైనచో వారిని త్యజించి వారపుత్రాదుల నాశ్రయించవలయుననిన్ని వారున్నూ అట్లు భ్రష్టులైనచో వారిజ్ఞాతుల నాశ్రయించ వచ్చుననిన్ని వారెవరూ లేనిచో ఇతరత్ర ఆశ్రయించవలయుననిన్ని పెద్దలు ప్రతిపాదించి యున్నారు.

# శ్రీ వైష్ణవుడు

బాహ్యవిషయముల నన్నింటిని వాసనతో సహా విడుచుటయు, సర్వేశ్వరునే రక్షకునిగ ఆశ్రయించుటయు, ఫలముసిద్ధించక తప్పదు అని నమ్మియుండుటయు, ఫలసిద్ధికై త్వరపడుటయు, ఈ శరీరముతో యున్నంతకాలము సర్వేశ్వరుడు ఆనందముతో అర్చారూపిగ వేంచేసియున్న దివ్యదేశములయందు ఆసక్తికలవాడై భగవంతునియొక్క గుణానుభవమునందును-కైంకర్యముల యందును పొద్దుబుచ్చుకొనుటయు ఈవిధముగ యుండునట్టి శ్రీవైష్ణవులయొక్క అధిక్యతను తెలిసికొని సంతోషపడుచుండుటయు, తిరుమంత్రమునందును-ద్వయమంత్రమునందును, నియమముగలవాడై యుండుటయు, ఆచార్యులపట్ల ప్రేమను అధికముగ కలిగియుండుటయు, ఆచార్యులపట్లను-సర్వేశ్వరుని పట్లను కృతజ్ఞుడై యుండుటయును, జ్ఞానమును-విరక్తిని-శాంతిని కలవాడై యుండునట్టి పరమసాత్వికునితో సహవాసము చేయుటయు వైష్ణవాధికారికి అవశ్యము అపేక్షితములై యున్నవి.

# వాల్మీకి

శ్రీమాన్ పండితకేసరి పరకాలా సూర్యనారాయణ శర్మగారు, పెనుగొండ ప. గో. జిల్లా.

శ్రీమద్రామాయణ గ్రంథకర్తయగు శ్రీవాల్మీకి మహర్షియొక్క చరిత్రనుగూర్చి అనేక గ్రంథముల యందు అనేక విధములుగ యున్నది. అందు ఒక రామాయణమున ఇటులనున్నది.

---

చతుర్ముఖ బ్రహ్మ ఒకనాడు దేవేంద్రునిచే ఆహ్వానించబడి ఆయనసభకు వెళ్ళెను. అపుడు దేవేంద్రుడు వినోదార్థమై రంభ, ఊర్వశి, మేనక మున్నగువారిచే నాట్యము చేయించెను, అపుడు వారలయొక్క హావ-భావ-రూప-సౌందర్యాదుల తిలకించుటచే బ్రహ్మగారికి వీర్యస్ఖలన మాయెను, ఇందులకు బ్రహ్మ సిగ్గుపడి ఆమర్మము సభికులకు తెలియకుండగ యుండవలెనని క్రిందపడిన తనవీర్యమును యిసుకచే కప్పివేసెను. ఆ యిసుకనుండి 60,001 మంది (అరువదివేల ఒక్కరు) జన్మించిరి. ఇందు అరువదివేల మందియు వాలఖిల్యులను పేర పిలువబడిరి. వీరందరు వెంటనే తపమాచరించుటకై అడవికి వెళ్ళిపోయిరి. మిగిలిన వకడు బ్రహ్మగారిని దర్శించి "తండ్రీ నాగతి యేమి సెలవిచ్చెదరు? నన్ను యిట్లు సృజించి వైచితిరే" అని సభలో అడిగెను. అపుడు బ్రహ్మగారు తనమర్మమును బైటపెట్టినాడని అతనిపై కోపించి 'నీవు భూలోకమున నిషాదుడవై చరించుచు, వృషల స్త్రీని పెండ్లాడి, సంతానవంతుడవై భ్రష్టత్వము పొందుమా' యని శపించెను.

ఇందులకాయన మిక్కిలి పశ్చాత్తాపుడై బ్రహ్మను శాపవిముక్తికై వేడుకొనెను. అందుపై బ్రహ్మదేవుడు ఆయనపై దయగలవాడై కొన్ని వేల సంవత్సరముల యనంతరము మహర్షుల యుపదేశముచే నీకు శాపవిముక్తి కాగలదు. అపుడు నీవు తరించగలవ'ని సెలవిచ్చెను.

ఆ ప్రకారము ఆయన నిషాదుడై వృషల స్త్రీని వివాహమాడి ఆకుటుంబ పోషణకొరకు అరణ్యమధ్యమున దోవకొట్టి దోచుకొనుచుండెను. ఒకనాడు మహర్షులు ఆమార్గమునవచ్చిరి. వారిని యీయన అడ్డగించెను. వారు యీయనను యీదౌష్ట్యమునుండి మరలించదలచి "ఓయీ నీవు మావంటి ఋషుల కౌపీనకమండలములనుకూడ దోచుకొని పోవుచుంటివే దీని వలన మహాపాపము కలుగునని నీకు తెలియునా?

ఈయన: ఆహా! తెలియును. పాపమో, పుణ్యమో కుటుంబపోషణము చేసుకొనవలసియున్నది.

**మహర్షులు:** నీవల్ల పోషింపబడుచున్న నీభార్యా బిడ్డలు నీవు సంపాదించిన ధనమును మాత్రమే తీసుకొందురా లేక నీవు ఆర్జించిన పాపముకూడ పంచుకొందురా ?

**ఈయన:** ధనమును తీసుకొనువారు అందులకై చేసిన పాపమునుకూడ ఏల పంచుకొనరు ?

**మహర్షులు;** ఒకపర్యాయము నీవు యింటికివెళ్ళి వారి నీవిషయమును అడిగిరమ్ము. నీవు నీవు వచ్చువరకు మేమిచ్చటనే యుందుము. మేము ఎచ్చటకును పోము.

**ఈయన:** సరే అని తనయింటికి వెళ్ళి మహర్షులు అడిగిన ప్రశ్నను తన భార్యనడిగెను.

అందులకామె "మమ్ములను పోషించు భారము నీది. నీవు ధనమును పాపపు పనులను జేసి సంపాదించుచుంటివో, లేక పుణ్య కార్యములు జేసి సంపాదించుచుంటివో మాకేమి తెలుసును. మరియు నీవు మాపోషణకు వలయు ధనమును పుణ్యకార్యముల ద్వారానే ఏల సంపాదించకూడదు. నిన్ను మేము పాపపుపనుల చేయుమంటిమా? నీవబ్బునో మాత్రమే తప్ప మాకు నీపాపములతో ఏమియు సంబంధము లేదు. నీకర్మను నీవు మాత్రమే అనుభవించ వలసినదే గాని మాకే మాత్రము అందు పాలువలదు" అనిరి. ఈమాటలు వినిన తోడనే ఈయనకు మిక్కిలి విచారము కలిగెను. ఈభార్యా బిడ్డలు పెట్టితే తినేవారేగాని తనకుపకరించువారు కారని తెలుసుకొని వీరలకొరకై నుచమేల పాపకృత్యములు నాచరించుచు అధఃపతితులము కావలయును. ఆమహర్షులను ఆశ్రయించి తరింతుముగాక' అని జ్ఞానవైరాగ్యములు గలవాడై మహర్షులవద్దకు పరుగెత్తుకొని వెళ్ళి వారి పాదములపై పడి తాను తరించు మార్గమును తెలుప ప్రార్థించెను.

ఆమహర్షులు ఈయనయందు కరుణగలవారై నారదుని ద్వారా తారకమంత్రము నుపదేశించిరి.

ఆక్షణమునుండి అచ్చటనే ఆయన తదేక నిష్ఠాగరిష్ఠుడై తనపై పుట్టలు పోయుచున్నను లక్ష్యపెట్టకుండగ ఘోరతప మాచరించి భగవద్భాగవత కటాక్షమునకు పాత్రులగుటచే ఈయనకు వాల్మీకియను దివ్య తిరునామము కలిగెను.

పిమ్మట ఒకనాడు నారదమహర్షి తిరిగి ఈ వాల్మీకి వద్దకువచ్చి శ్రీరామకథను ఉపదేశించి శ్రీరామాయణ కర్తగాగా తయారుచేసెను.



# శ్రీ కృష్ణ లీలలు

శ్రీకృష్ణుడు ధర్మసంస్థాపనార్థము తానవతరించినట్లు భగవద్గీతయందు బోధించియున్నాడు, సర్వధర్మములకు ఆదిస్థానమను నీ పరమ దయానిధి భూలోకమున జేసిన కార్యములు ధర్మాభివృద్ధికే తగినవిగనుండునుగాని ఇతరముగనుండుట సాధ్యము కాదుగదా. శ్రీకృష్ణలీల లన్నియును గొప్ప అంతరార్థము గలిగియున్నవి ఈ లీలలు జరిగినపుడు శ్రీకృష్ణుని యొక్క దేహమునకు తక్కువ వయస్సుగల బాలునిగా నున్నట్లు భాగవతమున చెప్పబడియున్నది గదా శ్రీకృష్ణుడు మనుష్యమాత్రుడని యెంచినను అంతటి వయస్సున నిందిత కార్యములు చేయుటసాధ్యముకాదు. దేవుడనిపించిన చెడు కార్యములే చేయడుకాన ఇతర మతస్థుల దూషణసరికాదు. నవనీతచోరుడు (వెన్నదొంగ యనగనేమి? పెరుగును చిలుకగ చిలుకగ వెన్నపుట్టును. వెన్న యనగ పరిశుద్ధ మనస్సు. భక్తిజ్ఞానానుష్ఠానములు చేయగ చేయగ మనస్సు స్థిమితమునకు వచ్చి పరిశుద్ధమగును. ఇట్టి భక్తుని పరిశుద్ధమనస్సు అనెడి వెన్నను స్వామి దొంగిలించును. అనగా దానిని తనయందు చేర్చుకొని జ్ఞానియందు తన తేజస్సునుంచును. గనుకనే శ్రీకృష్ణునికి గోపికా మనోహరుడనిపేరు. ఇట్లు వెన్నదొంగయనగ భక్తుల మనస్సు సదా తనయందు లయింపజేయు పరమదయానిధియని యర్థము. గోపికా వస్త్రాపహరణము. భక్తుడు సంసారసాగరమున మునుగుచు తేలుచు మోక్షము పొందయత్నించి భగవంతుని పాదారవిందము చేరుటకును ఆత్మ సాక్షాత్కారము పొందుటకును ప్రయత్నపడును ఇట్టి స్థితి పొందవలయునన్న ప్రపంచవిషయములను విడవలయును. దేహాభిమానములు, అహంకారాదులను, వదలి సర్వసంగరహితుడై ఈశ్వరుని యందు మనస్సు నిలిపి లయింపజేయ వలయును. ఇట్లు చేసిన భక్తుడు ఈశ్వరానుగ్రహమును (ఆత్మతేజస్సు) పొందునని ఈకథ బోధించుచున్నది.

గోపికలు స్నానముచేసెడి సరస్సు యనగా సంసార చక్రము నగ్నత (గుడ్డలు లేకయుండుట) సర్వసంగరాహిత్యమును తెలుపుచున్నది. పొన్న చెట్టునందు శ్రీకృష్ణుడు గోపికలను వస్త్రములు విడిచి తనసన్నిధికి రమ్మని చెప్పుట యనగ మోక్షస్వరూపుడగు స్వామి తన భక్తులు తనను చేరవలెనన్నచో సర్వసంగములను వదలి తన యందేమనస్సులయింప జేయవలయుననియర్థము

క్రైస్తవుల గ్రంథములందుగూడ భక్తుడునగ్నతగా (బిత్తలగా) దేవునిదగ్గరకు పోవలయుననియు, జీవుడు దేవుని పెండ్లి చేసుకొనవలయునని వ్రాయబడియున్నది. ఇదియును అదే అర్థమును బోధించుచున్నది. గోపికలు పరమభక్తులు అంతర్ముఖులు శ్రీకృష్ణుని తమ హృదయకమలమునందునిల్పి సదా ధ్యానముచేయువారు నారదుడుఒకదినము ద్వారకకుపోగా ప్రతిరాచస్త్రీ యింటియందును శ్రీకృష్ణస్వామినిజూచి మిగులఆశ్చర్యమునొందెను అనగా నారదుడు దివ్యదృష్టితో ప్రతిస్త్రీయొక్క మనస్సును పరీక్షచేయగా ప్రతిస్త్రీయును శ్రీకృష్ణునియందే మనస్సు లయింపజేసి యుండెను. భక్తుడు భార్యగను దేవుడుభర్తగను భావించి పతివ్రత తనపురుషునియందువలె భక్తుడు తన దేహమును మనస్సును [illegible] వలయు. గోపికలు శ్రీకృష్ణునితో క్రీడించుట ఇదియే.

# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము

## మాఘమాస పండిత పరిషత్సభలు

### పాలకొల్లు.

పశ్చిమగోదావరి జిల్లా పాలకొల్లు గ్రామమందున శ్రీ అష్టభుజ లక్ష్మీనారాయణస్వామివారి సన్నిధియందు స్వస్తిశ్రీ వికృతినామ సం॥రం. పుష్య బ ౧౩ ఆదివారము 4-2-1951 తేదీ నుండి మూడు దినములున్ను మదరాసు వాస్తవ్యులైనట్టి రామాయణ రత్నాకర, ఉపన్యాస భూషణ, మహావిద్వాన్ కండ్యూరి రామానుజాచార్యులవారి అధ్యక్షత క్రింద శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ మాఘమాస పండిత పరిషత్సభలు అతి వైభవముగా జరిగినవి. ఆహ్వానసంఘమువారు అతి చక్కని ఏర్పాటులను చేసినారు.

విచ్చేసిన ఉపన్యసించిన పండితుల తిరునామములు.

శ్రీ. ఉ. వే. శ్రీమాన్ రామాయణ రత్నాకర, ఉపన్యాసభూషణ, మహావిద్వాన్
,, ,, కండ్యూరి రామానుజాచార్యులుగారు మదరాసు
,, ,, నడాదూరి గోపాలకృష్ణమాచార్యులుగారు మంగళంపాడు
,, ,, గుదిమెళ్ళ వెంకటనరసింహాచార్యులుగారు కోరుకొండ
,, ,, ఈయుణ్ణి శేషసింగరాచార్యులుగారు అంతర్వేదిపాలెం
,, ,, ఈయుణ్ణి రాఘవాచార్యులుగారు నరసాపురము
,, ,, తిరుమలపురిఘట్ల ధర్మాచార్యులుగారు పశిద
,, ,, ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులుగారు అత్తిమూరు
,, ,, శాంతపూరి వెంకటాచార్యులుగారు పాలకొల్లు
,, ,, ముడుంబై చిన వెంకటాచార్యులుగారు ([illegible])
,, ,, నూపురాణి వెంకటాచార్యులుగారు
,, ,, కొట్టముక్కల రామానుజాచార్యులుగారు పూరి

,, ,, ,, కృష్ణమాచార్యులుగారు ఆచంట
,, ,, గోవర్ధనం వెంకటశేషభట్టరాచార్యులుగారు
,, ,, సవివర కలవగుంట శేషాచార్యులుగారు తణుకు

విదుషీమణులు

శ్రీమతి నండూరి ఆనందమ్మగారు ఏలూరు
,, ముడుంబై రామానుజమ్మగారు రాజమహేంద్రవరము
,, మరింగంటి రంగనాయకమ్మగారు కోరుకొండ
,, కండ్యూరి లక్ష్మీనరసమ్మగారు
,, గొట్టుముక్కల వెంకటలక్ష్మీరంగనాయకమ్మగారు తంగుడుపల్లి

ఆఖరునాటి రాత్రి చి॥ సౌ॥ గో. గోపాలరత్నము అను సం 10 రం బాలిక శ్రీకృష్ణ లీలను అత్యద్భుతముగ హరికథా కాలక్షేపము జేసినది.

నిరుటి సంవత్సరపు జమా-ఖర్చుల వివరములు:

(విరోధి సంవత్సరము)

జమలు.

| | |
|---|---|
| భక్తులవల్ల వసూలైన మొత్తము | 857—4—3 |
| సర్వజిత్తు సం॥రం॥ శ్రీమాన్ ధర్మాచార్యులుగారివద్ద యున్ననిల్వ | 50—0—0 |
| పాలకొల్లు కార్యదర్శి శ్రీ రేపాక రంగయ్యగారివద్దయున్న నిల్వ | 314—6—0 |
| నిల్వసొమ్ముమీద వసూలైన వడ్డీ | 22—9—6 |
| లేటు సలాది చినరామలింగయ్యగారివద్ద యుంచినది | 126—5—9 |
| | 1370—9—6 |

ఖర్చులు.

| | |
|---|---|
| 358—2—0 | పండితులకు ఖర్చులు వగైరాలను. |
| 59—15—3 | సాదర్లు |
| 379—12—0 | తదీయారాధనఖర్చు |
| 797—13—3 | |

1370_ 9_6
797_13_3
573_12_3

ఇందులో పెంటకోట్లు శాఖ కార్యదర్శిగారగు రేపాక రంగయ్యగారివద్దయున్న నిల్వ రు. 446_6_6
శేటు సంగాడి రామలింగయ్యగారి ఖాతాను నిల్వయున్నది రు. 126_5_9
మొత్తము నిల్వ రు. 572_12_3

---

శ్రీ రామ సేవ.

## శ్రీ వాసుదాస స్వామివారి జన్మదినోత్సవములు.

### శ్రీ కోదండరామ సేవక సమాజము 23 వ వార్షిక సభలు

దాసకుటి-అంగలకుదురు.

(1951_ఫిబ్రవరి 7,8,9)

స్వస్తిశ్రీ వికృతినామ సంవత్సర మాఘ శు॥ ౨, 3, ౪ బుధ, గురు, శుక్రవారములలో శ్రీ వాసుదాస స్వామివారి జన్మదినోత్సవములు, శ్రీ కోదండరామ సేవక సమాజ సభలు మిక్కిలి వైభవముగా జరిగెను.

శ్రీమతే రామానుజాయ నమః

## శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ సభలు

స్వస్తిశ్రీ వికృతి సం॥ మాఘ శు ౪,౫,౬లకు సరియయిన 1951 ఫిబ్రవరి 9,10,11 తేదీ లందు దాసకుటిలో అత్యంత వైభవముగ జరిగెను. మహత్త్వపూర్ణములయిన యుపన్యాసములు సాంప్రదాయాను సారముగా ననుభవజ్ఞులగు విద్వాంసులచే నొసంగఁబడెను.

దాసకుటి
అంగలకుదురు.
5_1_51

ఇట్లు.
సమాజపక్షమున విన్నవించు, భవచ్చరణధూళి.
దాస శేషుఁడు.



## సంభావన

శ్రీ ఉ. వే. శ్రీమాన్ కొడమగుళ్ళ తాండవ కృష్ణమాచార్యులు గారు తమ మామగారి తిరు వధ్యయన మహోత్సవమున శ్రీవిశిష్టాద్వైత పరిచారక సంఘమునకు రూ 1_0_0 సంభావనను సమర్పించిరి. వీరిని శ్రియఃపతి కటాక్షించుగాక.

శ్రీ. ఉ. వే. శ్రీమాన్ తె. కం. వరద స్వామి; గోపాలాచార్యులు వార్లు తమతల్లి గారగు సీతమ్మగారిపరమపద మహోత్సవమున శ్రీవిశిష్టా ద్వైత పరిచారక సంఘమునకు రూ 5_0_0 సంభావనను సమర్పించిరి. వీరిని శ్రియఃపతి కటాక్షించుగాక.

---

## కట్నములు

మదరాసు వాస్తవ్యులగు శ్రీమాన్ కొత్తూరి జాలయ్య శ్రేష్ఠిగారి కుమారుడు శ్రీమాన్ కొత్తూరి రంగనాథం శ్రేష్ఠిగార్కి

(17, వరదముత్తప్పన్ వీధి)

శ్రీమాన్ నామజయరామ శ్రేష్ఠి గారి కుమార్తె శ్రీమతి లక్ష్మీకాంతమ్మను యిచ్చి మదరాసులో జరిపించిన వివాహ మహోత్స వమున. వరుని తల్లిగారగు శ్రీమతి కొత్తూరి కృష్ణవేణమ్మ గారు శ్రీవిశిష్టాద్వైత పరిచారక సంఘమునకు రూ 5_0_0 కట్నమును సమర్పిం చిరి. ఈనూతన వధూవరులకు శ్రియఃపతి ఆయు రారోగ్యైశ్వర్యాభివృద్ధుల కృపచేయుగాక,

ఇట్లు,

యతిరాజ సేవా మహిళా సంఘము

---

## శుక్రవారోత్సవములు

### బరంపురం

శ్రీమతి తి. పె. తిరువెంగళ తాయారమ్మగారు
,, ర్యాలి శ్రీరంగనాయకమ్మగారు
,, ,, జగ్గమ్మగారు
,, గా. జగ్గమ్మగారు
,, గా. సింహాద్రిలక్ష్మీనరసమ్మగారు
,, కొ. లక్ష్మీనరసమ్మగారు.
,, న్యా. సీతారామమ్మగారు

ఈస్త్రీభక్తశిఖామణులు ఉపన్యాసములు తిరు నామములు మంగళహారతులు సంకీర్తనలు జరిపి సంఘమునకు కట్నముగా రు 2_0_0లు సమ ర్పించిరి.



# మంగళశాసన పద్యములు

[illegible] కలవగుంట శేషాచార్యులుగారు

[illegible]

సీ॥ శ్రీకరంబగుచునుఁ జెన్నారుచున్నట్టి
క్షీరపురంబున స్థిరతనుండి
వైష్ణవభక్తులెల్ల వర్తిల్లుచుండెడి
భక్తబృందములతివాంఛతోడ
శ్రీవిశిష్టాద్వైత సిద్ధాంత మార్గముల్
బాగుగాఁ దెలియంగఁ బ్రజలకెల్ల
బహుదూరమునుండి పండితవర్యుల
రప్పించి వారిచే రమ్యముగను

తే॥ గీ॥ వేదవేద్యుని బొందెడి విధముఁ దెలుపు
నట్టి వేదాంత సభలను ననువుగా
జరుగునట్టులఁ జేయించి చలమువీఁగ
పేరుగాంచిరి మిక్కిలి వీకతోఁడ.

భక్తి "నివేదన" అనుబంధము, రిజిష్టరు నెం. 5049.



శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ యతిరాజ సేవా మహిళా మండలి

(శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ స్త్రీ శాఖ)

## వార్షిక సభ

## ఆహ్వాన పత్రిక

స్వస్తిశ్రీ, ఖరనామ సంవత్సర చైత్ర శుద్ధ 3 సోమవారము ది 9-4-51 తేదీ లగాయితు వరుసగ అయిదు దినములు తూర్పు గోదావరి జిల్లాలోని రాజమహేంద్రవరమున శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ స్త్రీ శాఖయగు శ్రీయతిరాజసేవా మహిళా మండలి యొక్క వార్షిక సభ జరుగుటకు ఏర్పాట్లు చేయనైనది. కాన యీ మండలి సభ్యురాండ్రను అభిమానురాండ్రను సానుభూతిపరులు అందరను సంతోషముతో విచ్చేసి యిందు పాల్గొని దీనిని జయప్రదముగ నడిపించ గోరుచున్నాము.

ఇట్లు
ఆహ్వాన సంఘము.

ప్రస్తుతకార్యాలయము
మెయిన్ రోడ్
19/288.
రాజమహేంద్రవరము
తూర్పు గోదావరి జిల్లా

అధ్యక్షురాలు
ముడుంబై సింగరాచార్యుకమ్మ

ఉపాధ్యక్షురాలు
గాడిసీమ రామమ్మ
నల్లాన్ చక్రవర్తుల తాయారమ్మ
పోడరి నాధా గానాబాయమ్మ
బూ. వెంకటరమణమ్మ

కార్యదర్శినులు
ముడుంబై రామానుజమ్మ

కోశాధికారిణి
ముడుంబై వెంకటసత్యవతమ్మ

---

షరా:- తీర్మానాదులను ది 31-3-51 తేదీలోపుగ కార్యదర్శినికి పంప గోరుచున్నారము.

భక్తి "నివేదన" అనుబంధము రిజిష్టరు నెం. 5049.



శ్రీమతే రామానుజాయనమః

# శ్రీవిశిష్టాద్వైత పరిచారక ద్వాదశవార్షిక విరాట్ సమావేశము

రాజమహేంద్రవరము తూ. గోదావరిజిల్లా.

## ఆహ్వాన పత్రిక

స్వస్తిశ్రీ ఖరనామ సంవత్సర చైత్ర శు ౫ బుధవారము ది 11—4—51 తేదీని శ్రీ విశిష్టాద్వైత పరిచారక సంఘ కార్యకారిణి సమితి సమావేశమున్ను; ఆ నాడే పండిత పరిషత్తు సమావేశమున్ను;

ది. 12 4—1951 గురువారము; 13—4—51 శుక్రవారము; ఈ రెండు దినములు ఈ సంఘ విషయ నిర్ణయ సమితి సమావేశములున్ను;

ది. 14—4—51 శనివారము; 15—4—51 ఆదివారము; ఈ రెండు దినములు శ్రీవిశిష్టాద్వైత పరిచారక సంఘ ద్వాదశ వార్షిక విరాట్ సమావేశమున్ను శ్రీ ఉ. వే. శ్రీమాన్ పరాశర సుదర్శన భట్టరు అయ్యవార్లంగారి అధ్యక్షత క్రింద తూ. గో. జిల్లాలోని రాజమహేంద్రవరమున జరుపుటకు నిర్ణయించబడినది.

కాన ఈ సంఘముయొక్క కార్యకారిణి సమితి సభ్యులు పండితపరిషత్సభ్యులు, సంఘముయొక్క అన్ని తరగతులకు చెందిన సభ్యులు, అభిమానులు, సానుభూతిపరులు అందరు తప్పక విచ్చేసి వీటిని సక్రమముగను, జయప్రదముగను జరిపింప ప్రార్థించుచున్నారము.

ఇట్లు,

ప్రస్తుత కార్యాలయము:

అత్తిమూరు.

(వయా) ద్వారపూడి, తూ. గో. జిల్లా.

తి. వం. గోపాలాచార్యులు,
ప్రధానకార్యదర్శి.

ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులు,
సహాయకార్యదర్శి.

శ్రీ విశిష్టాద్వైత పరిచారక సంఘము.

మరొ:— తీర్మానములు పంపదలచినవారు ది. 31—3—51 తేదీలోపుగ కార్యదర్శికి అందునటుల పంపగోరుచున్నారము.

శ్రీమతే రామానుజాయ నమః



భక్తి

# నివేదన

వేదాంత మాస పత్రిక

| సంపుటి ౨ | వికృతి — ఫాల్గుణమాసం | సంచిక ౧౨ |
|---|---|---|

## సవినయ భక్తినివేదన

ప్రియపాఠక మహాశయులారా!

శ్రియఃపతి కటాక్షముచే భక్తి "నివేదన" పత్రికకు ఈమాసముతో రెండు సంవత్సరములు పూర్తియైనవి. మేము ఏఆశయముతో పత్రికను ప్రారంభించితిమో మీరందరు ఏఆశయమునకు సానుభూతితో దీనికి సహాయపడిరో ఆ ఆశయమును ఎంతమాత్రము మేము పూర్తిచేయలేకపోతిమి. ఈరెండు సంవత్సరములలోను ఎన్నో తప్పటడుగులులను వేసితిమి. ఎన్నో మోటుమాటలను వాడియుండవచ్చును. అయినను వీనిలోకొన్ని మంచి అడుగులు ఉండును. వీనిలో కొని ముద్దుమాటలూ పలికి యుండవచ్చును.

అచ్చుకూట సౌకర్యములు లేకుండుట ప్రూపులదిద్దువారు లేకుండుట కాగితము కొరవడుట ధరలు పెరుగుట ఇత్యాది బాలారిష్టములు ఎన్నో మమ్ముల నెదుర్కొన్నవి. అన్నింటికిన్ని ప్రధానము చందాదారులందరి వద్దనుండియు తగు ఆర్థిక సహాయము లేకుండుటయే. సహాయము చేసిన కొద్దిమంది సానుభూతిపరుల ప్రోత్సాహముచేతను ఏదోవిధముగ ఈసంవత్సరమును కూడ గడుపగలిగితిమి.

ఇక మూడవవత్సరము ప్రారంభము కానున్నది. ఆర్థికసహాయమున్నగాని పత్రిక సర్వాంగ సుందరముగ యుండజాలదు. సర్వాంగసుందరముగ యున్నగాని సర్వులను ఆకర్షించజాలదు. నిజమే, గాని ఇది ఆధ్యాత్మిక వేదాంత పత్రిక. దీనిని అభిలషించు వారే నూటికొకరిద్దరుందురు. దానిలోను అనేక అవాంతభేదములచే మరింత బీటలువారియుండు నేటిసంఘమున ఇక

యిట్టివానియందు సానుభూతి గలవారు[ వేళ్ళపై లెఖించబడతగినంతమందియే గదా యుందురు. ఇందును ఇది బాల్యావస్థలో నున్నది. మరియు నిస్సహాయస్థితిలోనున్నది అనుభవము తక్కువ. యిట్టిస్థితిలో ఈకొద్దిమందైనను ముందుగ తగు ఆర్థికసహాయ రూపముగ చేయూతనిచ్చిన గాని ఇది వృద్ధిలోనికి రాజాలదు. ఇది సక్రమాభి వృద్ధిని చెందుచున్నగాని సంఘసేవ చేయజాలదు. ఇప్పటికే ఎంతో నష్టమునకు గురికావలసి వచ్చినది.

గాన సహృదయ హృదయములు క్షమాస్వరూలుయగు తామెల్ల దీని గత ప్రస్తుత స్థితులకు కలియక దీనిని స్వపరహాస్యముల ద్వారా అభివృద్ధిలోనికి తీసుకొనివచ్చి సేవ చేయించు కొందురుగాకయని సవినయ భక్తితో నివేదించుచున్నారము.

ఈసంవత్సరము శ్రీవిష్ణుభక్తులందరు తెలుసుకొనవలశినట్టియు ఆచరించ వలశినట్టియు విశేషము లన్నింటితోను "క్యాలండరు-పంచాంగము" నొకదానిని ప్రచురించు చున్నాము. దానిని త్వరలోనే అందజేయగలము,

రాబోవు సంవత్సరమున శ్రీరామాయణములోని ప్రధానఘట్టములలోని విశేషార్థములు; [శ్రీవిశిష్టాద్వైత సిద్ధాంతవివరములు మన పెద్దలను శ్రీరికతో ఆళ్వారాచార్యులయొక్క చారిత్రిక విశేషములు-భక్తులయనుష్టానమునకు సంబంధించినప్రశ్నోత్తరములు ప్రచారవివరములు ఇంకా అనేకవిశేషాంశములను ఈపత్రికద్వారా ప్రచురించినభిలషించుచున్నారము చందాదారులందరు తమచందాలను సకాలములోపంపియుఒక్కొక్క చందాదారు కనీసము మరో యిద్దరు చందాదారులనైనను చేర్పించియు ఈపద్యమును నిర్విఘ్నముగను, వైభవోపేతముగను నడిపించ ప్రార్థించుచు న్నారము.

ఇట్లు,

సంపాదకవర్గము, "భక్తినివేదన"



# గాయత్రీమంత్రము — శ్రీరామాయణము

"శ్రీ మ న్నా రా య ణ"

"న గాయత్ర్యాః పరం మంత్రః"

జగత్తంతయు పరమాత్మ స్వరూపము జగత్తునందుగల శబ్దము లన్నియు పరమాత్మ వాచకములు. అట్టి పరమాత్మయొక్క స్వరూప-రూప-గుణ-విభవముల ప్రతిపాదించు ధ్వనులన్నియు కూడ మంత్రము లనబడును.

"మంతారం త్రాయత ఇతి మంత్రః" (తనను మననము చేయువానిని రక్షించునది మంత్ర మనబడును. రక్షకములగు యిట్టి మంత్రము లన్నింటిలోను పరమోత్కృష్టమైన మంత్రరాజము గాయత్రి మంత్రము. లక్ష్యములలో సాధనములలో అనుష్ఠానములలో ఎట్టి భేదాభిప్రాయము లున్ననూ బ్రహ్మచారి మొదలు పరివ్రాజకుని పర్యంతము ప్రతినిత్యము పఠింపబడు నట్టిదియు, ద్విజసామాన్యమున కంతకు సమానాకారమైనదియు గాయత్రిమంత్రము. ద్విజత్వము దీని యాధీన మయ్యేకదా యున్నది. దీనియుపదేశమాత్రము చేతనేసర్వకర్మలకుప్రాయశ్చిత్తము చేయబడినదగు చున్నది. దీని యుపదేశమాత్రము చేతనే సర్వపుణ్యకర్మాచరణము కలుగుచున్నది. దీని యుపదేశ మాత్రము చేతనే సర్వఫలములు లభించుచున్నవి. అస్త్రముల కన్నింటికిన్ని బ్రహ్మమైన బ్రహ్మాస్త్రమునకున్ను తత్తుల్యమైన బ్రహ్మ శిరోనామాస్త్రమునకున్ను తత్సహచరితమైన వాయవ్యాస్త్రమునకున్ను కూడ ఈ మంత్రమే ప్రాణము.

అర్థగ్రహణమునలన గాని రసానందానుభవము కలుగదు. రసానుభవ మున్నగాని అనుష్ఠాన ఫలము సిద్ధించదు. అందునిమిత్తమై గాయత్రీ ప్రతిపాదకుడైన ఆ శ్రియఃపతియే నారద-బ్రహ్మ వాల్మీకుల ద్వారా ఆ గాయత్రీ మంత్రరాజమునకు శ్రీరామాయణ రూప వ్యాఖ్యానము ననుగ్రహించెను.

మరియు గాయత్రిమంత్రము వేదమంత్రము. ఇది, ఉపదేశింపబడుటకు బ్రాహ్మణుడై యుండవలెను. అందును పురుషుడై యుండవలెను. అందును సద్గురునిచే యోగ్యమగు దేశకాలముల యందు మాత్రమే ఉపదేశింపబడుట కర్హుడగును. మిగత బ్రాహ్మణేతరులకు గాని, స్త్రీలకుగాని ఉపనయనము లేని పురుషులకుగాని దీని ఉపదేశము నందన్వయము లేదు.

మరియు గాయత్రీమంత్రోపదేశము నాటినుండి శరీరపాత పర్యంతము ప్రతినిత్యము ముప్పొద్దుల దీనిని తప్పక యథాశక్తిని జపించుచుండవలయును ఏపూట జపించుట మానునో ఆవెంటనే ప్రత్యవాయము కలుగును. దానికి ప్రాయశ్చిత్తము చేసుకొననచో తన బ్రాహ్మణత్వమే భ్రష్టత చెందును.

ఇందులకై ఆగాయత్రీ స్వరూపుడైన శ్రీమన్నారాయణుడే ఆగాయత్రీ మంత్రమునే చాతుర్వర్ణస్థులు-స్త్రీలు-పురుషులు-బాలురు-వృద్ధులు వారు వీరు యననేల మానవసామాన్యమంతయు కూడ తరించుటకై శ్రీరామాయణరూపమున దానిని అనుగ్రహించెను.

గాయత్రి మంత్రమందు తత్ప్రతిపాద్యుడైన సర్వేశ్వరునియొక్క కల్యాణగుణములు ఆయన యొక్క-స్వరూప-రూప-గుణ-విభూతులు వివరముగా విశదముగా తెలుపబడలేదు. తద్బీజములు మాత్రమే యందుగలవు. అది అనుసంధానయోగ్యముమాత్రమే. అందుచే దానియొక్క అంకురిత కోరకిత-పల్లవిత-పుష్పిత-ఫలితరూపమైన శ్రీరామాయణమును భగవంతుడు మన కనుగ్రహించెను.

వ్యాఖ్యానమున మూలమందలి విషయములన్నియు విశదముగ వివరింప బడినప్పుడే కదా మూల-వ్యాఖ్యానన్యాయము సమన్వయమగును. గాయత్రీమంత్రమునకు సంబంధించిన విషయము లన్నియు శ్రీరామాయణమునందు విశదమగను వివరముగను కలవా?

పూర్తిగా కలవు-

అందు కొన్ని సంగ్రహముగా సూత్రరూపమున ఈక్రింద తెలుపబడగలవు.

| గా య త్రీ మ ం త్ర ము | శ్రీ రా మా య ణ ము |
|---|---|
| 1. దీనికి అధిష్ఠాత శ్రీమన్నారాయణుడు. | 1. దీనియందలి అవతారకందము శ్రీమన్నారాయణుడు. |
| 2. దీనికి ప్రతిపాద్యుడు సూర్యమండల మధ్యవర్తియైన నారాయణమూర్తి.<br><br>(ధ్యేయస్సదా సవితృమండల మధ్యవర్తి నారాయణ స్సరసిజాసన సన్నివిష్టః...” | 2. దీనిచే ప్రతిపాద్యుడు సూర్యవంశ మండల మధ్యయందవతారమూర్తియైన శ్రీరామచంద్రమూర్తి.<br>“ఇక్ష్వాకువంశప్రభవో రామో నామ జనైః శ్రుతః”<br>“రఘువర చరితం మునిప్రణీతం”<br>“వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే” |
| 3. దీనికి ప్రతిపాదకము వేదము-<br>“గాయత్రీ వేదమాతా” | 3. ఇది వేదస్వరూపము<br>“వేదః ప్రాచేతసా దాసీత్ సాక్షాత్ రామాయణాత్మనా॥ |

4. ఇది స్త్రీ లింగాంతము.

4. ఇది స్త్రీచారిత్రము.
"సీతాయాః చరితం మహత్"

5. ఇది మహామంత్రము, ఆదిమంత్రము

5. ఇది మహాకావ్యము, ఆదికావ్యము

6. ఇది ఛందోబద్ధము.

6. ఇదియు ఛందోబద్ధము.

7. దీనికి విశ్వామిత్రుడు ప్రవర్తకఋషి
(అస్య శ్రీగాయత్రీ మహామంత్రస్య విశ్వామిత్ర ఋషిః)

7. దీనికి, విశ్వామిత్రుడు సర్వాస్త్రప్రదానము ద్వారా, శ్రీసీతారామ కల్యాణ సంధానము ద్వారా ప్రవర్తకఋషి.

8. దీనికి సూర్యుడు అదిదేవత
(సవితా దేవతా)

8. దీనికి సూర్యుడు ఆదిపురుషుడు

9. దీనికి అగ్ని ముఖము.

9. దీనియందును అగ్నిముఖముగనే (పాయస ప్రదానము ద్వారా) శ్రీరాముని యవతారము.

10. దీనికి బ్రహ్మ శిరస్సు.

10. దీనికి శిరస్సు (ఆలోచనచెప్పి శక్తిసామర్థ్యములు కలుగజేసినది) బ్రహ్మయే
"మచ్ఛందాదేవ తే బ్రహ్మన్ ।
ప్రవృత్తేయం సరస్వతీ॥

11. దీనికి విష్ణువు హృదయము.

11. దీనికి విష్ణువుయొక్క శ్రీరామావతారరూప లీలయే హృదయము

12. దీనికి రుద్రుడు శిఖ.

12. దీనికి 'పౌలస్త్యవధ' అని కూడ పేరు.రుద్రదేవతాత్మక కృత పౌలస్త్యసంహార కార్యముతో ఇది ఉపసంహరించ బడుటచే దీనికిన్ని రుద్రుడే శిఖ.

13. దీనికి పృధివి యోని.

13. ౧. దీనికి భూపుత్రిక యైనసీతయేకారణము.
"సీతాయాః చరితం మహత్"

౨. శ్రీవైకుంఠనికేతనుడైన శ్రీమన్నారాయణుడు వచ్చి అవతరించి తన లీలను అనుభవించుటకు ఆకరము ఈ పృథివియేగాన శ్రీరామాయణమునకు పృథివియే యోని.

౩. శ్రీరామాయణ ప్రవృత్తికి ప్రచారమునకు పృథివియే యోని (స్థానము)

14. దీనికి సాంఖ్యాయనుడు గోత్రప్రవర్తకుడు.

౧. సాంఖ్యం అయనం యస్య సః సాంఖ్యాయనః (సాంఖ్యం—జ్ఞానము) జ్ఞానరూపం పరంబ్రహ్మ — పరమాత్మ జ్ఞానస్వరూపుడు లేక జ్ఞాన గుణకుడు.

౨. సాంఖ్యం—పంచవింశతి తత్వములు. వానికి ఆధారభూతుడు.

౩. సంఖ్య ఏవ సాంఖ్యం — నవాదిసంఖ్య తదేవ అయనం యస్యసః— సాంఖ్యాయనః— నిత్యములైన నవాదిసంఖ్యలకు ఆధారభూతుడు — అనగా నిత్యుడు. అట్టి నారాయణుడే దీనికి గోత్ర ప్రవర్తకుడు.

14. దీనికి జ్ఞానస్వరూపుడున్ను జ్ఞానగుణకుడును జగదాధారభూతుడున్ను అగు శ్రీరామచంద్రుడే గోత్ర ప్రవర్తకుడు.

"బుద్ధిమాన్ మతిమాన్ వాగ్మీ శ్రీమాన్ ... ..."

"యశస్వీ జ్ఞాన సంపన్నః ... ..."

"ధాతా రిపునిషూదనః"

"రక్షితా జీవలోకస్య ధర్మస్య పరిరక్షితా ......"

"సదైక ప్రియదర్శనః"

"స చ సర్వగుణోపేతః ... ..."

15. దీనికి ఇరువది నాలుగక్షరములున్నవి. ఒక్కొక్క అక్షరమునకు ఒక్కొక్క విశేషార్థము, ప్రయోజనము మున్నగునవికలవు

15. దీనికి ఇరువదినాలుగు వేల శ్లోకములున్నవి. గాయత్రిలోని ఒక్కొక్క అక్షరము యొక్క విశేషార్థ—ప్రయోజనాదులను ఈ వేయేసి శ్లోకములు విశదపరచుచున్నవి.

(వీటివివరములు మరొక వ్యాసమున తెలుపబడగలవు.)

ఇంతకు పైనయున్న అధిక శ్లోకములు గాయత్రియొక్క నాలుగవ పాదమునకు సూచకములు.

16. దీనికి మూడు పదములున్నవి. (అనగా నిలుపవలసిన స్థానములు మూడున్నవి.)

16. శ్రీరామాయణమున శ్రీరాముల చరిత్రలు మూడు పర్యాయములు ప్రధానముగా గురుతుగా తెలుపబడినవి.

౧. నారదరామాయణము.

౨. బ్రహ్మరామాయణము.

౩. వాల్మీకి రామాయణము.

గాయత్రియొక్క నాలుగవ పదసూచకము కుశలవ రామాయణము లేక హనుమంతునిచే తెలుపబడిన రామాయణముగాని చెప్పుకొనవచ్చును.

17. దీనికి ఆరు కుక్షులున్నవి.

17. శ్రీసీతా-లక్ష్మణ-భరత-శతృఘ్న-హనుమత్సమేత శ్రీరామచంద్ర పరబ్రహ్మలను అరుగురు దీని కుక్షిస్థానీయులు.

18. దీనికి అయిదు శిరస్సులున్నవి.

18. గాయత్రిలోని ఒక్కొక్క శిరస్సు నందలి అర్థమును ఒక్కొక్కవందసర్గలు చొప్పున వివరించునట్లు మొత్తము అయిదు నూర్ల సర్గలు దీనికి గలవు.
(వీనికంటె అధికముగానున్న సర్గలు గాయత్రి యొక్క నాలుగవ పాదమందలి యర్థమును వివరించునవి)

19. భూః, భువః, సువః, అని మూడు వ్యాహృతులు కలిసి గాయత్రి శిరస్సు లనబడును. ఇదిగాయత్రి మంత్రమునకు ముందుకలదు. దీని సంస్మరణచే పాపములన్నియు తొలగి పోవును.

శ్రీరామాయణముకూడ మూడు కార్యముల ముందు గలదై యున్నది.
ఈవ్యాహృతులతో శస్త్రసంధానముచేయు
19. టచే అదియుకూడ ఈవ్యాహృతులువలెనే పాపాత్ములను నశింపజేయును.
"భూ రిత్యగ్నౌ ప్రతితిష్ఠతి"
భూః అనువ్యాహృతి అగ్ని దేవతాకమైనది.

ఇది ఆగ్నేయాస్త్ర సంబంధమైనది. ఈ అస్త్రముచేతనే శ్రీరామచంద్రుడు సుబాహువును నశింపజేసెను. (మారీచుని మానవాస్త్రముతో కొట్టుట లెక్కలోనిదికాదు. అది అస్త్రప్రయోగ ప్రారంభమునకు నాందివంటిది.)

"భువ ఇతి వాయౌ"

భువః అను వ్యాహృతి వాయుదేవతాకమైనది. శ్రీరామచంద్రుడు ఈఅస్త్రము చేతనే సకలరాక్షసుల సంహరించెను.

"శేషాన్ వాయవ్య మాదాయ
జఘాన రజనీచరాన్"

"సువ ఇతి ఆదిత్యే"

అని సువః అను వ్యాహృతి అదితిదేవతాకమైనది. శ్రీరామచంద్రుడు అగస్త్య ప్రోక్తమైన సూర్యదేవతాకమైన ఆదిత్య కవచగ్రహణము చేతనే రావణునితలలు మొలవకుండునట్లు కొట్టి సంహరించెను.

ఇట్టి ఈ చరిత సంస్మరణముచే భగవత్ప్రాప్తికి విరోధములైన పాపములుతొలగి పోవును.

20. ఇది వ్యాహృతి సప్తక పూర్వకమైనది.

20. ఇదియు సప్తకాండలస్మరణ పూర్వకమైనది

21. ఇది సామాన్యమానవుని తనయుపదేశముచే ద్విజునిగ జేయును.

21. ఇదియు సామాన్యమానవుని తన యుపదేశముచే అజునిగ జేయును.

ఇటులనే శ్రీరామాయణము గాయత్రీ మంత్రముతో అన్ని విషయములలోను సామ్యము గలదై తద్వివరణాత్మకమైనదై యున్నది. ఈవిషయము ఈవ్యాసమున దిఙ్మాత్రముగ మాత్రమే సూచింపబడినది,

# ★ ప్రాతః పరార్థపార సంస్మరణము

## “శ్రీమన్నారాయణ”

| —♦ శ్లోకములు ♦— | —♦ అర్థములు ♦— |
|---|---|

1. సత్సంగాత్ భవ-నిస్పృహో గురు-ముఖాత్
శ్రీశం ప్రపద్యాత్మవాన్ ।
ప్రారబ్ధం పరిభుజ్య కర్మశకలం
ప్రక్షీణ-కర్మాంతరః ।
న్యాసాదేవ నిరంకుశేశ్వర-దయా
నిర్లూన-మాయాన్వయో ।
హార్దానుగ్రహ-లబ్ధ-మధ్య-ధమని
ద్వారాత్ బహిర్నిర్గతః ॥

శ్రీవిష్ణుభక్తులైన సత్పురుషుల సహవాసము వలన ఈ జీవుడు సంసారమున విరక్తిని చెందినవాడై గురువుద్వారా, శ్రియః పతిని శరణునిజొచ్చి ఆత్మ సాక్షాత్కార సంపన్నుడై, ప్రారబ్ధరూపమైన కర్మశేషమును పూర్తిగా అనుభవించి సంచిత-ఆగామి రూపమైన ఇతరకర్మల నాశనముచే పూర్తిగా నశింపజేయబడిన ప్రకృతి సంబంధము కలవాడై, హృదయ గుహాయందున్న పరమాత్మునియొక్క అనుగ్రహముచే పొందబడిన మూర్ధన్యనాడీద్వారము ద్వారా శరీరములో నుండి బయటికివచ్చును.

2. ముక్తోర్చిర్దిన-పూర్వపక్ష-షడుదఙ్
మాసాబ్ద-వాతాంశుమత్ ।
గ్లౌ-విద్యుత్-వరుణేంద్ర-ధాతృ-మహితః
సీమాంత-సింధ్వాప్లుతః ।
శ్రీవైకుంఠ ముపేత్య నిత్య మజడం
తస్మిన్ పరబ్రహ్మణః ।
సాయుజం సమవాప్య నంపతి సమం
తేనైవ ధన్యః పుమాన్ ॥

ప్రకృతి విముక్తుడైన ఈ జీవుడు అగ్ని-పగలు-శుక్ల పక్షము-ఉత్తరాయణము-సంవత్సరము అను వీనియొక్క అభిమాని దేవతలచేతను, వాయువు-సూర్యుడు చంద్రుడు-విద్యుత్తు-వరుణుడు-ఇంద్రుడుబ్రహ్మఅనువీరలచేతనువరుసగ వారివారి లోకములయందు పూజింపబడినవాడై, ప్రకృతి సరిహద్దు అయిన విరజానదియందు స్నాతుడై: నిత్యమున్ను స్వయం ప్రకాశమానమున్ను అగు ఆ వైకుంఠమునుపొంది అందలి పరబ్రహ్మయొక్క. సాయుజ్యమును చక్కగా చెంది, ధన్యుడై ఆ శ్రీమన్నారాయణునితో సమముగా ఆనందమును అనుభవించును.

3. ప్రాతర్నిత్యానుసంధేయం ।
పరమార్థం ముముక్షుభిః ।
శ్లోకద్వయేన సంక్షిప్తం ।
సువ్యక్తం వరదోఽబ్రవీత్ ॥

మోక్షమును గోరువారిచే ప్రతినిత్యము ఉదయముననే అనుసంధించుకొనవలసిన పరమార్థము రెండు శ్లోకముల ద్వారా ఇటుల సంక్షేపముగ చెప్పబడినది, దీనిని శ్రుతప్రకాశికను సాధించిన వరదార్యులు సాధించిరి.

సూచన :— ముముక్షువులైన ప్రతివారు ప్రతినిత్యము బ్రాహ్మముహూర్తముననే మేల్కాంచి కూర్చుని నమస్కరించుచు, మనస్సున శ్రియః పతిని ధ్యానించుచు, ఈ రెండు శ్లోకములను తప్పక చదువుకొనవలయును. దీనినే గతిచింతన మందురు.

ఈవిషయమును, సాక్షాత్తు భగవంతుడున్ను, ఋషులున్ను, శ్రుతులున్ను, మనువు మున్నగు స్మృతికర్తలున్ను, ఆళ్వారాచార్యులున్ను విధించియున్నారు.

ఈసంస్మరణము మోక్షమార్గగమనమునకు అత్యంతము అవసరము. అనుసరణీయము.

శ్రీమతే రామానుజాయనమః

# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ నిజాషాఢమాస పండిత పరిషత్సభ

# ఆహ్వాన సంఘాధ్యక్షోపన్యాసము

## స్టోనుహౌసుపేట, నెల్లూరు.

ఆహ్వాన సంఘాధ్యక్షులు:— ఉటుకూరి వెంకట సుబ్బయ్యగారు,

చదివినవారు:— రావుసాహెబ్ చుండూరు సుబ్బయ్యగారు.

భక్తశిఖామణులారా! ఆచార్యవర్యులారా!

వివిధ ప్రాంతములనుండి యీ మహా సభకు భక్తాగ్రగణ్యులను ఆహ్వానింపగల అత్యుత్తమ పదవికి నన్ను నియమించునట్లు మా సింహపురి సోదరులను, భగవంతుడు ఏలపురికొల్పెనో, నాకు తెలియకున్నది. దాసానుదాసుడనై భగవత్ భాగవత ఆజ్ఞను నాశక్తికొలది నిర్వహింప ప్రయత్నించెద.

దేశమునందు భగవత్ భక్తి నానాటికి క్షీణించుచున్న యీ కాలమున శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘమువారు మాసమాసము ఒక్కొక్క ప్రాంతమునందు సభలు జరిపి మన సిద్ధాంతమును జన సామాన్యమునకు బోధించి వారిని భగవదనుగ్రహమునకు పాత్రులగునట్లుచేయుట అత్యంత శ్లాఘనీయమగు కార్యము. ఈనాడు సింహపురమున యీ మహాసభ జరుగునట్లు తటస్థించుట మన పూర్వపుణ్యఫలమని చెప్పగలను. శ్రీమతసిద్ధాంతముమేల విషయము నేమాత్రమును గ్రహించి యెరుగని నేను వేదాంత విచారమున ఆరితేరిన యీసభ్యుల ఎదుట వక్కాణింప సాహసించుచున్నందులకు క్షమింపవలయును.

ద్వైతాద్వైత విశిష్టాద్వైతములు మూడును, వైదిక మతములందు మిక్కిలిగా ప్రచారమును గాంచినవి. యీమూడు సిద్ధాంతములను ఆనాడులే కాని ఆచార్యత్రయము సృష్టించినవి కావు. ఋషి ప్రోక్తములగు సూత్రములను బట్టియు, వైదికగ్రంథములపై ఆధారపడియు త్రిమతాచార్యులు విమర్శనము గావించి వైదిక ప్రజలకు విపులమగునట్లు బోధప్రచారము గావించిరి. ఈమూడు మతములను, మోక్షమార్గమును మూడువిధములుగా బోధించుచున్నవి. యీ మార్గముల తారతమ్యములను సూక్ష్మముగా వివరింప ప్రయత్నించెద.

ఎప్పుడైనను సరియే యదార్థమగు విషయము ఒకేవిధమైయుండునుగాని భిన్న భిన్న విధముగ యుండదు అయినను దేశ-కాల-పాత్రల ననుసరించి ఆవక్కయదార్థమే వివిధతరగతులుగ ప్రతిపాదించబడుచుండును.

ఇప్పటి ఈ కాలమున మనము ఏమార్గమున

లంభించిన లక్ష్యమును చేరగలమో నిర్ణయించు కొనవలసియున్నది.

అద్వైతము కేవలము జ్ఞానమార్గము ఇందు జీవపరమాత్మలకు భేదములేదు. ఘటమునందలి ఆకాశమును ఘటాకాశమందురు. ఘటము పగిలిన వెంటనే ఘటాకాశము వేరుగా కనుపించదు మహాకాశములో కలసిపోవును. అట్లే అజ్ఞానముచే నావరింపబడియున్న పరమాత్మయే జీవాత్మ యనబడుచున్నాడు. అజ్ఞానముపోయిన తక్షణము జీవాత్మ వేరుగా కనుపించదు. సర్వత్రవ్యాపించి యున్న సర్వాత్మయందు కలసిపోవును, ఇదియే అద్వైత సిద్ధాంతము నందు మోక్షము. అజ్ఞాన నివృత్తియేమోక్షము. అట్టినివృత్తిని పొందుటకు పరమాత్మ నిశ్చయస్థితిని అనగా జ్ఞానానందాకారమును జీవుడు తెలిసికొనవలెను. పిమ్మట తానువేరు, భగవంతుడువేరు అను భ్రమతొలగి తానే పరమాత్మ, పరమాత్మయే తాను అను అభేదఅజ్ఞానరూపమగు మోక్షమును పొందగలడని వారిమతము. ఈ ప్రపంచమంతయు మిథ్య అనియును అజ్ఞానముచే యీసర్వము స్వాప్నికి పదార్థములువలెను, ఎండమావుల యందలి నీటి వలెను కనబడుచున్న దనియును అభిన్నమగు ఆత్మయొక్కటియే సత్యమనియును వారి నమ్మకము.

ద్వైత మతము, పైసిద్ధాంతమును వొప్పుకొనదు. సర్వజగన్నియామకుడగు పరమాత్మ యెక్కడ మనమెక్కడ అని వారందురు. వారి సిద్ధాంతము ప్రకారము జీవుడు నిరంతర వ్రత, నిష్టాద్యాచరణలవలన బంధమోక్షము గావించుకొని భగవత్సాన్నిధ్యమును పొందవలయును. పరమాత్మతో జీవాత్మకు సాయుజ్యము యెన్నటికిని పొసగదు సాన్నిధ్యమే మోక్షమగుచున్నది శ్రీవైకుంఠమున శ్రీమన్నారాయణ పాదారవింద దర్శనానందమునసుభవించుచు తత్ సాన్నిధ్య జనిత జ్ఞానానందము ననుభవించుటయే వారి పరమాశయము. వారికి జగత్తు మిథ్యకాదు. సత్యము. జీవాత్మ పరమాత్మ వేరువేరు తత్వములు. ఇదియే ద్వైతమత సంగ్రహము.

పై రెండు మతములయందును గల క్లిష్ట పరిస్థితులను తొలిగించి జీవపరమాత్మలకు గల సంబంధమును అత్యుత్తమ రీతిని బోధించి యెట్టి సందేహములు లేనివిధమున విపులముగ తెలియజేయు సిద్ధాంతము విశిష్టాద్వైతము. బోధాయనాదులు విమర్శించి వివరముగను ఆచారణ యోగ్యముగను స్వరూపాను కూలముగను వ్రాసిన మహాగ్రంథముల సహాయముతో అనాదిగా వచ్చుచున్న మన యీ సిద్ధాంతమును అసమాన ప్రజ్ఞతో సహస్ర శిరస్సులు మరుగు చేసుకొని ఆదిశేషువేమనుష్యరూపమును ధరించి అవతరించిన శ్రీమద్రామానుజాచార్యుల వారు అఖిలభారత దేశమును సంచరించి, అఖండదిగ్విజయముచేసి ప్రచారమొనర్చిరి. భక్తి మార్గావలంబమగు సిద్ధాంతమే విశిష్టాద్వైతము. భగవంతుని యనుగ్రహము పొందుటకు నేనే భగవంతుడననుట తగునా? నేనే భగవంతుడనైనచో నేను చేయు పూజా పునస్కారము లెవరికి?నాకు అవిద్య యెట్లు పట్టినది? భగవంతునకు అవిద్య

పట్టునా? ఇట్టి సందేహములకు అవకాశముగలుగ నీయక, మనమతము రాజమార్గమగు భక్తిమార్గ మును బోధించుచున్నది.

విశిష్టాద్వైతము ప్రేమసోపాన నిర్మితము. పరమ పురుషుని మనమునూ, మనలను పరమ పురుషుడును నవవిధసంబంధములతో ననుభవింతుము. మొదటి మెట్టునుండి చివరవరకు ఆనం దానుభవమగు ప్రేమమయ జ్ఞానమే. అసమాన సుఖదాయకమగునిరంతర ప్రీతిపూర్వక ధ్యానమే తైలధారవలె భక్తుని హృదయమునుండి శ్రీమన్నారాయణ పాదారవిందాభి ముఖముగా సదా ప్రవహించు ప్రేమప్రవాహమే. ఆపరమపురుషుని పేరు వినినంత మాత్రమున నిశ్చయమగు భక్తులకు హర్షాశ్రువులు దొరలకమానవు. భగవంతుడు తప్ప ఇతర విషయము లుండేదియు వాని మనస్సున జొరజాలదు. క్రమముగా అహంకారము అదృశ్యము అగును. ఇట్టి పరమభక్తి వృద్ధికానుకాను కేవలము స్వప్రియత్వాభిలాష మనగుపడిపోయి సర్వమనోరథములు రూపుమాసి సంపూర్ణశరణాగతి లభ్యపడును. దానినే ప్రపత్తియందురు.

ఆత్మపరమాత్మ సంబంధవిషయమున యితర మతములకు, మనకుగల భేదముల వివరించెద.

అద్వైతులు పరమాత్మయే జీవాత్మ, పరమాత్మను అజ్ఞానము పట్టుటవలన జీవాత్మ నను కొనుచున్నాడు. అజ్ఞానముపోయిన వెంటనే తానే పరమాత్మయని తెలుసుకొనుచున్నాడు, అని చెప్పెదరుకదా! ద్వైతులు అట్లుగాక పరమాత్మ ను జీవాత్మ స్పర్శించుటకుకూడ అర్హుడుకాడు, వారిరువురికిని యెట్టిపోలికయు లేదు అని వాదింతురు కదా! మనము చెప్పునది అట్లుకాదు. పరమాత్మ సర్వాంతర్యామి, అనగా అన్నిటికి ఆత్మ అయియున్నాడు. అంతర్యామియగు ఆయనయొక్క ఆధారములేక ప్రపంచమునందు యేవస్తువును లేదు. అనగా ప్రకృతికంతటికిన్ని ఆయనయేఆత్మ ఇదిగాక జీవులందరికిని కూడ ఆయనయే ఆత్మ. కనుక జీవ ప్రకృతులకు రెంటికిని ఆయనఆత్మగా నున్నాడు. జీవ ప్రకృతులు రెండును ఆయనకు శరీరములు. ఇట్టి శరీర శరీరి సంబంధమును యితర మతస్థులు అభేదముగా తలంచి పొరబడుచున్నారు. తత్త్వములు యథార్థమున మూడే అవి అపృథక్సిద్ధములగుటచే అభేదము లగుటచే అభేదము లనుకొనుచున్నారు. బంధమోక్షము నకు జీవుడు స్వప్రయత్న మాశింపక పరమ పురుషునకు సంపూర్ణశరణాగతి నొసగుటయే యేకైకమార్గము మన మతమిది.

భగవద్ధ్యానము విషయమున పర, వ్యూహ, విభవ అంతర్యామి అర్చావతారములని ఐదు విధములు, కేవలము శ్రీమహాలక్ష్మీ సమేతులై ప్రపంచ సంబంధములేక నిత్యాత్మలతోడను ముక్తాత్మలతోడను, అపారానంత భోగముల తోడను ఆనందించు శ్రీవైకుంఠనాథుడే పర స్వరూపము. జగత్పరిపాలనా కార్యమును నిర్వహించుచు లక్ష్మీసమేతుడై క్షీరసాగర శయనుండగా నుండుట వ్యూహ స్వరూపము. రామ కృష్ణాద్యవతారముల నెత్తి దుష్టశిక్షణ శిష్ట

రక్షణ యుగయుగమునను చేయుట విభవ స్వరూపము. ప్రకృతికిని జీవునకు ఆత్మయై చేతనాచేతనములయందు అంతర్యామియై యుండుట అంతర్యామి స్వరూపము. సర్వజనులచే పూజింపబడుటకు, సేవింపబడుటకు సులభుడై దర్శన మీయదగిన విగ్రహ స్వరూపుడై యుండుట అర్చా స్వరూపము. ధ్యానమునకు అంతర్యామి స్వరూపమున్ను, అర్చన–ఆరాధన–ధ్యానములకు అర్చా స్వరూపమున్ను కరుణామయుడగు శ్రియఃపతిచే కటాక్షించబడినవి. ఇటు సర్వేశ్వరుని మనము తెలుసుకొని, ఆశ్రయించి, భక్తిగలవారలమై శరణజేసి తరించి ఆనందింతుము గాక. ఇందులకు వలయు జ్ఞాన–శక్తులను భగవంతుడు మనకనుగ్రహించుగాక.

ఇట్లు: భాగవత విధేయుడు,

కాటుకూరి వెంకటసుబ్బయ్య.



| | |
|---|---|
| చోళదేశములు— | 40 |
| పాండ్యదేశములు— | 18 |
| పర్వతప్రాంతములు— | 13 |
| మధ్యదేశములు.... | 2 |
| | 73 |

శ్రీమతే రామానుజాయ నమః



# శ్రీవైష్ణవులకు అతిముఖ్యమైయుండు 108 దివ్యదేశయాత్రాస్థలములు

| | |
|---|---|
| ప్రాతోపరు— | 73 |
| తొండదేశములు— | 22 |
| ఉత్తరదేశములు— | 12 |
| పరమపదము— | 1 |
| మొత్తము | 108 |





| | | |
|---|---|---|
| 1 | శ్రీరంగము | శ్రీరంగము |
| 2 | ఉత్తైయూరు | శ్రీరంగంనుండి 3 మైళ్లు. |
| 3 | తంజమామణికోయిల్ | 3 మై. తంజావూరు |
| 4 | అన్బిల్ | 8 మై. బూదలూరుస్టేషన్ |
| 5 | ఉత్తమర్ సన్నిధి | శ్రీరంగంనుండి 8 మై. |
| 6 | తిరువెళ్ళరై | శ్రీరంగంనుండి 10 మై. |
| 7 | పుళ్ళంపూతంగుడి | కుంభకోణంలో |
| 8 | తిరుప్పేర్ నగర్ (అప్పక్కుడత్తాన్) | అన్బిల్ నుండి 6 మై. |
| 9 | తిరువాదనూరు | కుంభకోణంనుండి 10 ,, |
| 10 | తేర ందూరు | కుత్తాళంస్టేషన్ 5 ,, |
| 11 | శిఱుపులియూరు | కొల్లిమాక్కుడిస్టేషన్ 9 ,, |
| 12 | తిరుచ్చేఱై (సారక్షేత్రం) | కుంభకోణంనుండి 7 ,, |
| 13 | తలైచ్చెంగనాణ్మదియం | ఆకూరుస్టేషన్ 3 ,, |
| 14 | తిరుక్కుడన్దై | కుంభకోణం ,, |
| 15 | తిరుక్కండియూరు | తంజావూరు నుండి 5 ,, |
| 16 | ఉప్పిలి యప్పన్ సన్నిధి | కుంభకోణంనుండి 4½ ,, |
| 17 | తిరుకణ్ణపురం | నన్నిలమ్ స్టేషన్ 4 ,, |
| 18 | తిరువాలితిరునగరి | శియ్యాళిస్టేషన్ 6 ,, |
| 19 | నాగపట్నం | నాగపట్నం ½ ,, |
| 20 | తిరునఱైయూర్ (నాచ్చ్యార్ కోవిల్) | కుంభకోణంనుండి 6 ,, |
| 21 | నందిపురవిణ్ణగరం (నాదన్ కోవిల్) | కుంభకోణంనుండి 6 ,, |
| 22 | తిరువిందళూరు | మాయవరం 3 ,, |
| 23 | చిత్రకూటము | చిదంబరమ్ 1 ,, |
| 24 | తిరుక్కాళిచ్చీరామ విణ్ణగరమ్ | తిరివాలినుండి |
| 25 | కూడలూరు | ఆడుదురస్టేషన్ 4 ,, |
| 26 | తిరుక్కణ్ణంగుడి | కీవళూరుస్టేషన్ 1 ,, |
| 27 | తిరుక్కణ్ణమంగై | తిరువాలూరుస్టేషన్ 4 ,, |
| 28 | కపిస్థలం | కుంభకోణం నుండి 13 ,, |
| 29 | తిరువెళ్ళియంగుడి | తిరువిడమరుదూర్ నుండి 5 ,, |
| 30 | తిరుమణిమాడకోయిల్ | (శియ్యాళి) తిరువాలి నుండి |
| 31 | వైకుంఠ విణ్ణగరమ్ | ,, ,, |
| 32 | తిరువరిమేయ విణ్ణగరమ్ | ,, ,, |

33 తిరుత్తేవనార్తొగై ,, ,,
34 పురుషోత్తములసన్నిధి ,, ,,
35 తిరుచ్చెంబొన్ శెయ్ కోయిల్ ,, ,,
36 తిరుత్తెత్తియంబలము ,, ,,
37 తిరుమణి కూడము ,, ,,
38 తిరుక్కావళంబాడి ,, ,,
39 తిరువెళ్ళక్కుళము ,, ,,
40 పార్థన్ పళ్ళి (40 చోళదివ్యదేశములు) ,, ,,
41 తిరుమాలిరుంశోలై మధుర నుండి 12 మై.
42 తిరుక్కోట్టియూరు శ్రీరంగం నుండి బస్సులో 18 ,,
43 తిరుమెయ్యము శ్రీరంగం నుండి
44 తిరుప్పుల్లాణి రామనాథపురం నుండి 6 ,,
45 తిరుత్తణ్గాల్ శ్రీవిల్లిపుత్తూరు నుండి
46 తిరుమోగూర్ ఆనైమలై మధుర నుండి 7 ,,
47 తిరుకూడల్ మధుర నుండి ½ ,,
48 శ్రీవిల్లిపుత్తూరు మధుర నుండి
49 తిరుక్కురుగూర్ (ఆళ్వార్ తిరునగరి) ఆళ్వార్ తిరునగిరి
50 తొలైవిల్లి మంగలం (రెట్టతిరుపతి) ఆళ్వార్ తిరునగరినుండి
51 వానమామల (శిరీవరమంగై) తిరునెల్వేలి నుండి 20 మై.
52 తిరుప్పుళింగుడి ఆళ్వార్ తిరునగిరి నుండి
53 తెన్ తిరుప్పేరై ,, ,,
54 శ్రీవైకుంఠము ,,
55 వరగుణమంగై తిరునగరినుండి
56 తిరుక్కుళన్దై (పెరుంకుళం) ,,
57 తిరుక్కుఱుంగుడి వానమామలైనుండి 8 మైళ్ళు.

58 తిరుక్కోభూరు (పాండ్యదేశతిరుపతులు 18) తిరునగరి
59 తిరువనంతపురం తివేరుంట్రిము
60 తిరువణ్ పరిశారం పురేంద్రపురంనుండి 5 మై.
61 తిరుక్కాట్కరై ఎడపల్లి స్టేషన్ 2 మై.
62 తిరుమూడిక్కళం అంగమాలిస్టేషన్ 8 మై.
63 తిరుప్పులియూరు (కుట్టనాడు) చెంగనూరినుండి 5 మై.
64 తిరుచెంగున్నూరు తిరువల్లవార్ నుండి 6 ,,
65 తిరునావాయ్ ఎడక్కుళం మై. ½
66 తిరువల్లవార్ (స్త్రీలు వెళ్ళకూడదు) తిరుక్కడిత్తానసనుండి 6 ,,
67 తిరువణ్ వణ్ణూరు తిరుచ్చెంగన్నూరినుండి 4 ,,
68 తిరువాట్టాఱు తిరువణ్ పరిశారం నుండి
69 విత్తువక్కోడు పట్టామ్బిస్టేషను 5 ,,
70 తిరుక్కడిత్తానం తిరువళ్ళవార్ నుండి 3 ,,
71 తిరువారణ్విళై (మలైయాళము13) తిరుచ్చెంగనూరింపిపడవలో 6 ,,
72 తిరువహీంద్రపురం N. T. కడలూరుతిరుప్పాపులియూర్
73 తిరుక్కోవలూరు (మధ్యదేశతిరుపతులు2) } విళుపురంమారిరైలుఎక్కవలయును
74 కాంచీపురము కాంచీపురము
75 అష్టభుజం ,,
76 తిరుత్తణ్గా (విళక్కొళి) ,,
77 వేళుక్కై ,,
78 పాడగము (పాణ్డవదూతలు) ,,
79 నీరగము (ఉలగళంద పెరుమాళ్ళ సన్నధిలో) ,,
80 నిలాత్తింగళ్ తుండం {(ఏకాంబరేశ్వరునిగుడిలో మొదటిప్రాకారములో) ,,

| | | |
|---|---|---|
| 81 ఊరగమ్ (ఉలకళన్దం)ఉలగళంద పెరుమాళ్ళసన్నిధి 4 సన్నధులు | | ,, |
| 82 తిరువెః.కా (యథోక్తకారిసన్నది) | | ,, |
| 83 కారగమ్ (ఉలగళంద పెరుమాళ్ళసన్నధిలో) | | ,, |
| 84 కార్వానం ,, | | ,, |
| 85 కళ్వార్ (కంచుకామాక్షమ్మగుడిలో) | | ,, |
| 86 పవళవణ్ణర్ | | ,, |
| 87 పరమేశ్వరవిణ్ణగరము (వైకుంఠనాదులు) | | ,, |
| 88 తిరుపుట్కుళి | కంచినుండి 6 | ,, |
| 89 తిన్ననూ్నరు | తిన్ననూ్నరుస్టేషన్ 1 | ,, |
| 90 తిరువళ్లూరు | తిరువళ్లూరుస్టేషన్ 2 | ,, |
| 91 తిరునీర్మలై | పలావరంస్టేషన్ 2 | ,, |
| 92 తిరువిడవెన్దై | పాపాక్ చాతకినుండిపడవలో | |
| 93 తిరుక్కడల్మల్లై (మహాబలిపురం) | చెంగల్పట్టునుండి 18 | ,, |
| 94 తిరువల్లి క్కేణి | మదరాసు | |

| | | |
|---|---|---|
| 95 కడిక్తై (శోళసింహపురం) | { తొండదేశతిరుపతులు 22 | |
| | (అరకోణంస్టేషన్నుండి 18 | ,, |
| 96 తిరుప్పతి (తిరువేంగడమ్) | రేణిగుంటమారి రైలుఎక్కవలయును | |
| 97 అహోబలం (శింగవేల్ కున్రమ్) | కడపనుండి బస్సు 60 | ,, |
| 98 అయోధ్య | అయోధ్యస్టేషన్ | |
| 99 నైమిశారణ్యము | నైమిశారణ్యంస్టేషన్ | |
| 100 సాల్గ్రామము | నేపాళనుండి | |
| 101 బదరికాశ్రమము | హరిద్వారంనుండి 183 | ,, |
| 102 దేవప్రయాగ | బదరికిపోవుమార్గమున | |
| 103 తిరుప్పిరిది (నందప్రయాగ) | ,, | |
| 104 ఛేటిద్వారక | గోమతిద్వారకనుండి పడవలో పోవచ్చును | |
| 105 ఉత్తరమథుర (గోవర్ధనం) | బృందావనంనుండి 6 | ,, |
| 106 తిరువాయ్ప్పాడి (గోకులం) | ,, | |
| 107 తిరుప్పాఱ్కడల్ (ఉత్తరదేశములు 12) | (బహులు) మేలుకోట | |
| 108 పరమపదము | (బహులు) శ్రీపెరుంబూదూరు | |





## నారీ విభాగము

శ్రీమతే రామానుజాయనమః

# శ్రీ యతిరాజసేవా మహిళా మండలి బందరు

## శుక్రవారోత్సవములు



(18-8-1950 వ సంవత్సరము) వికృతినామ సం॥ర శ్రావణశుద్ధ పంచమీ శుక్రవారమున బందరు గొడుగుపేట వెంకటేశ్వరాలయములో శుక్రవారోత్సవములు ప్రారంభించబడినవి.

25-8-50 శ్రీమతి కార్యదర్శి సీతమ్మగారింట్లో
1-9-50 అధ్యక్షురాలు శ్రీపతి శీతమ్మగారింట్లో
8-9-50 బలభద్ర సూరమ్మగారింట్లో
15-9-50 ,, ,,
22-9-50 జగ్గయ్యపేట మరంగంటి నప్పెన్నమ్మగారింట్లో
29-9-50 దోరెడ్ల లక్ష్మీకాంతమ్మగారింట్లో
6-10-50 కంతేటి తాయారమ్మగారింట్లో
13-10-50 పొట్లూరి రామారావుగారింట్లో
20-10-50 పల్లపోతు రామారావుగారింట్లో
27-10-50 రాజుపేట గోపాలస్వామికోవెల
3-11-50 కోట రంగడుగారింట్లో
10-11-50 దోరెడ్ల జగన్నాథంగారింట్లో
17-11-50 శీలంశెట్టి నర్మదమ్మగారింట్లో
24-11-50 గొడుగుపేట వెంకటేశ్వరాలయంలో
1-12-50 కంతేటి గంగాధరుడుగారింట్లో
8-12-50 అధ్యక్షురాలు శ్రీపతి శీతమ్మగారింట్లో
15-12-50 మరంగంటి భిరాట్టెమ్మగారింట్లో
22-12-50 వేముల శీతారత్నమ్మగారింటిలో
29-12-50 గొడుగుపేట వెంకటేశ్వరాలయంలో
5-1-51 అధ్యక్షురాలు శ్రీపతి శీతమ్మగారింటిలో
12-1-51 కొప్పర్తి యతిరాజమ్మగారింటిలో
19-1-51 రుస్తుంబాదా బొబ్బిలి గోపాలస్వామి కోవెలలో
26-1-51 గొడుగుపేట వెంకటేశ్వరాలయంలో
2-2-51 వంకాయల వరదరాజులగారింటిలో
9-2-51 అన్నవరపు లక్ష్మమ్మగారింటిలో
16-2-51 వంకాయలహనుమంతరావుగారింటిలో

ఈ శ్రేంది యతిరాజ సేవా మహిళా మండలిలో సభ్యురాండ్రు

సంవత్సరం చందా యిచ్చినవారు :–

శ్రీమతి గుడవర్తి తాయారమ్మగారు
,, అన్నవరపు లక్ష్మమ్మగారు
,, గజ్జల శేషారత్నమ్మగారు
,, కోటి రంగడుగారు
,, పువ్వాడ శేషారత్నమ్మగారు
,, పువ్వాడ అన్నపూర్ణమ్మగారు
,, శీలం శెట్టి నర్మదమ్మగారు
,, దోరెడ్ల లక్ష్మీకాంతమ్మగారు
,, వంకాయల రాజమ్మగారు
,, వేముల శీతారత్నమ్మగారు
,, బలభద్ర సూరమ్మగారు
,, మరంగంటి భిరామ్మమ్మగారు
,, మరంగంటి శీతమ్మగారు
,, వంకాయల హనుమంతరావుగారి భార్యా శ్రీపతి శీతమ్మగారు

వీరిలో శ్రీమతి శ్రీపతి శీతమ్మగారిని అధ్యక్షురాలుగాను, శ్రీమతి మరంగంటి శీతమ్మగారిని కార్యదర్శినిగాను ఎన్నుకోవడమైనది.

---

బందరు శ్రీయతిరాజ సేవా మహిళామండలివారు శుక్రవారోత్సవముల యందు జరిపిన కార్యక్రమము:–

**మధ్యాహ్నము గం 3 నుండి ప్రారంభము**

గం 3 మొ. గం 3–30ని. వరకూ తిరువారాధనము శ్రీకృష్ణ–లక్ష్మీ–రామానుజ అష్టోత్తర శతనామములపూజ, శ్రీమాన్ మరంగంటి నరశింహాచార్యులవారిచే జరుపబడును.

గం 3–30ని నుండి గం 4 వరకూ శేవాకాలం తిరుప్పల్లాండు తిరుప్పావు ఉపదేశ రత్నమాల తిరువాయిమొడి మొదలగునవి అవకాశము ననుసరించి శేవాకాలం గం 4 మొ 5 వరకూ ఉపన్యాసములు అవకాశమున్నచో అప్పుడప్పుడు పురుషులు ఉపన్యసించుటయు కూడకలదు. ఇదివరలో ఉపన్యసించిన వార్ల తిరునామములు.

శ్రీ వచన భూషణం నరశింహాచార్యులు గారు
వేదాల వరదాచార్యులుగారు

ఇల్లైవిల్లి కోమాండూరి వెంకటరామానుజాచార్యులవారు తాము రచియించిన కులశేఖరాళ్వార్ల చరిత్ర చెప్పిరి. స్వరూపధారణ భక్తి విశిష్టాద్వైత విశిష్టత మొదలగు వాటిని గురించి పైవారు వుపన్యశించిరి.

స్త్రీల వుపన్యాసములు

శ్రీమతి నల్లందిఘుళ్ళ లక్ష్మీనరసమ్మగారు
,, శీతమ్మగారు
,, శేషమ్మగారు
,, కంతేటి తాయారమ్మగారు
,, మరంగంటి శీతమ్మగారు

తదుపరి చి॥ సౌ॥ యం. విద్యుల్లత
,, యం. కాంచనం

భగవద్గీత సంభాషణము – తిరునామములు భజయతిరాజం మంగళాశాసనం జరుగును.

మాశుక్రవారం సభలలో స్త్రీల విజ్ఞానాభి వృద్ధికై ఉ. వే. ప్ర. శ్రీమాన్ బెల్లంకొండ రాఘవాచార్యస్వామివారు సుమారు సా 6 గం మొ గం 8 వరకూ వుపన్యశించి స్త్రీలకు తేలికగా భక్తిమార్గములు చూపి తరింపజేయు చున్నారు. వారికి మాసంఘము తరఫున అనేక దాసోహములు సమర్పించుచున్నాము.

17_2_51 శనివారం సా 4 గం_6గం వరకూ బాపట్ల వాస్తవ్యులు ఉ. వే. ప్ర శ్రీమాన్ కొమాండూరి ఇళ్లైవెల్లి శ్రీనివాస రామానుజాచార్యస్వామివారు సృష్టిమాయా తరుణోపాయం గురించి వుపన్యశించిరి.

మార్గళిమాసం నెల రోజులు ఉ. వే. ప్ర. శ్రీమాన్ వచన భూషణం నరశింహాచార్యుల వారు తిరుప్పావు కాలక్షేపము చెప్పిరి. వారికి మాసంఘమువారు రజితపాత్ర నొసంగిరి, మా సంఘమువారు భక్తినివేదనకు 3 రూ. కానుక యిచ్చినారు. మా సభలు యింకాయింకా వృద్ధి అగునని ఆశించుచున్నాను.

కార్యదర్శి.

యం. శీతమ్మ. గొడుగుపేట, బందరు.

## అర్తమూరు

| | |
|---|---|
| కోనాల వీరన్న భార్య మంగమ్మ | 0_5_6 |
| పెడపర్తి బాపన్నశాస్త్రిగారిభార్య వెంకమ్మ | 0_5_6 |
| కర్రి వీరెడ్డిభార్య వెంకమ్మ | 1_1_6 |
| కర్రి అబ్బాయిభార్య అమ్మాయి | 0_0_9 |
| కర్రి వీరెడ్డిభార్య సత్తెమ్మ | 0_6_3 |
| కర్రి భద్రయ్యభార్య వెంకమ్మ | 0_6_0 |
| పడాల శ్రీరాములుభార్య గంగమ్మ (శివరాత్రిపూజ) | 0_6_3 |

## ఏకాదశ పూజలు

| | |
|---|---|
| పెడపర్తి బాపన్నశాస్త్రిగారిభార్య వెంకమ్మ | 0_5_6 |
| కర్రి కొండయ్యభార్య బుల్లిఅమ్మాయి | 0_6_3 |

ఈభక్తులచేతను శుక్రవారపూజలు జరుపబడినవి.





# ప్రచార విభాగము

## మ ద రా సు

గత నెలలో ఇచ్చట వరదాముత్తి యప్పన్ వీధిలోని సుధానిధియందు ఇదివరలో వలెనే శుక్రవారోత్సవములు శ్రీయతిరాజసేవామహిళామండలి నిర్వాహకులురాలగు శ్రీమతి పువ్వాడ మంగమ్మ గారిచే జరుపబడెను.

ఆమెకు ఈమధ్య కొద్దిగ అనారోగ్యముగా యుండుటచే రెండు వారములు శ్రీయతిరాజసేవా మహిళామండలి యొక్క కార్యదర్శిణియగు శ్రీమతి మట్టపల్లి చంద్రమ్మ గారిచే జరపబడెను. పిమ్మట ఒక శుక్రవారోత్సవము శ్రీమాన్ పిఠాపురం యువరాజా దంపతులు వారిచే ఆహ్వానించబడి తేనాంపేటలోని వారి స్వంత భవనమున అత్యంత వైభవముగ జరుపబడెను.

శ్రీమాన్ శ్రీయతిరాజదాస వైదిక ప్రార్థనలు సలిపిరి. శ్రీమాన్ ఉయ్యూరు రాజావారు అష్టపదులను గానముచేసిరి. ఉపన్యాసభూషణ శ్రీ. ఉ. వే. శ్రీమాన్ తిరుమల కంచియ్యరి రామానుజాచార్యులు వారి చేతను, శ్రీ ఉ. వే. శ్రీమాన్ ఆ. ది. శ్రీమన్నారాయణాచార్యులవారి చేతను శ్రీభగవద్గీత యందలి పదునెనిమిదవ అధ్యాయము ఉపన్యసించబడెను.

శ్రీ శ్రీ శ్రీ పిఠాపురం మహారాజా వారిచే 745 శ్లోకములతో ప్రచురింపబడిన భగవద్గీతా గ్రంథమందలి అధిక శ్లోకములు ప్రక్షిప్తములను విషయము చక్కగ సవిమర్శముగ ప్రస్తావించబడెను. శ్రీయువరాజా దంపతుల సత్కారములతోను మంగళములతోను ఉత్సవము పూర్తిచేయబడెను.

అటుపిమ్మట శుక్రవారమున శ్రీమాన్ శ్రీఉయ్యూరు రాజాదంపతులు తేనాంపేటలోని తమ శరత్కాల భవనమున ఉత్సవమును అతి వైభవముగ జరిపించిరి.

శ్రీమాన్ శ్రీఉయ్యూరు రాజావారు శ్రీలక్ష్మీ అష్టోత్తర శతనామ స్తోత్రమును రాగతాళములతో అత్యంత మనోహరముగ గానము చేసి.

కవిరత్నశ్రీమాన్ గుదిమెళ్ళరామానుజాచార్యులుగారు తాము రచించిన శబరి_మాండవి కావ్యములను పఠించిరి.

శ్రీఉయ్యూరు రాజాదంపతుల సత్కారముతోను మంగళముతోను ఉత్సవము పూర్తిచేయబడెను.

శ్రీమాన్ శ్రీఉయ్యూరురాజావారి భవనమునందే మరివకసమావేశము జరిగెను. అందుశ్రీరాజావారు తాము రచించి చార్చిన మహాభారత అష్టపదులను గానము గురించేసిరి. మధ్యమధ్య వివిధభారత గ్రంథములనుండియు తాము విమర్శించి గ్రహించిన అపూర్వవిషయములతో సహా మహాభారతగాధ నంతను క్లుప్తముగను అత్యంత విమర్శనాత్మకముగను, మృధుమధురమగు శైలిలో హృద్యంగముగను శ్రీఉయ్యూరు రాజావారే ఉపన్యసించిరి.

మరియు తాము స్వయముగ తయారు చేయించిన మహాభారత చిత్రములను మ్యాజిక లాంతరను ద్వారా ప్రదర్శింప జేసిరి. ఈచిత్రముల రచనలోని వీరికళానైపుణ్యము, వాస్తవికతత్వ విజ్ఞానము, దేశకాలాను గుణవిషయ విమర్శనము, సులలిత మృధుమధుర పదగుంభనా విశిష్ట కవితా సామర్థ్యము అత్యంతము శ్లాఘనీయములు.

శ్రియఃపతి వీరియందు తన పరిపూర్ణ కటాక్ష ప్రసరణము గావించి వీరిని శ్రీవైష్ణవ శ్రీనిష్ఠా గరిష్ఠులగు నటుల జేయుగాక.

---

స్వస్తిశ్రీ ఖరనామసంవత్సర చైత్ర శు ౧ మొదలు వరుసగా 14 రోజులు తూర్పుగోదావరిజిల్లాలోని రాజమహేంద్రవరము పట్టణమున శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ చైత్రమాస పండితపరిషత్సభలు జరుగును.

ది 11_4_1951 తేదీ నుండి శ్రీవిశిష్టాద్వైత ప్రచారకసంఘ వార్షిక విరాట్ సమావేశము శ్రీ ఉ. వే. శ్రీమాన్ పరాశర సుదర్శన భట్టరు అయ్యావార్లంగారి అధ్యక్షతను రాజమహేంద్రవరముననే జరుగును.

ది 9_4_51 తేదినుండి శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ స్త్రీశాఖయగు శ్రీయతిరాజసేవా మహిళామండలియొక్క వార్షికసభలు జరుగును

దీనినే ఆహ్వానముగ అంగీకరించి సభ్యులు, సభ్యురాండ్రు అందరు వీనిలో పాల్గొన గోరుచున్నారము.

ఇట్లు,

శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘము.

శ్రీరస్తు.

# పత్రికాభిమానులకు సవినయమనవి

శ్రీ ఖరసంవత్సరమునకు ఈపత్రికానుబంధముగ పంచాంగమును గంటల పంచాంగ సహితక్యాలండరును కలిపి ప్రచురించుచున్నాము. దీనిలో శ్రీవిశిష్టాద్వైత మతస్థులు తెలుసుకొనవలశిన వివరములుండును. 14'' × 20'' సైజులో తిరువరంగం-పొన్నడితో సహా నలుగురు ప్రముఖ-ముఖ్యశిష్యులకు కాలక్షేపము సాయించుచున్న భగవద్రామానుజులవారి త్రివర్ణ చిత్రమునకు ఇది అంటించబడియుండును. నెల కొక్కొక్క పేజీ

ముందువైపున గంటలలో తిధి, వార, నక్షత్ర, వర్జములు, ఉత్సవములు, తిరునక్షత్రములు, ఏకాదశులు, సంక్రమణములు, దర్శపౌర్ణమాసములు, ప్రభుత్వశెలవులు తెలుపుచు ఇంగ్లీషు తారీఖులు తెలుపు క్యాలండరున్ను,

దానివెనకవైపున ఘడియలు-విఘడియలలో అన్నివివరములు గల పంచాంగమున్ను నెల కొక్కొక్క కాగితము చొ॥న యుండునటుల పెద్దసైజులో ఇది యుండును. దీని ఆఖరున ప్రత్యేకమొక పుటలో పంచాంగం పేరికకు సంబంధించిన ముఖ్యవివరము లుండును.

శ్రీఖరసంవత్సరమునకు ఈపత్రిక చందాదారులుగా చేరిన వారందరికిన్ని ఇది ఉచితముగ పంపబడగలదు.

దీనిని విడిగా కోరినవారు రు 1-4-0 ను ముందుగ మనియార్డరు ద్వారా పంపినచో బుక్కు-పోస్టుగా పంపగలము.

వలయువారు ముందుగనే తెలుప గోరుచున్నారము.

అర్తమూరు
(వయా) ద్వారపూడి.
తూ గో. జిల్లా.

ఇట్లు,
సంపాదకుడు,
భక్త "నివేదన" పత్రిక